# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 35 | 1978 - జనవరి : పింగళ - పుష్యము | సంచిక 1

## విషయసూచిక



## శ్రీ రామకృష్ణ ప్రభ

సంవత్సర చందా : రూ. **7-00.** జీవిత చందా : రూ. **100-00.**

విడి ప్రతి : **70** పైసలు.

శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు

మద్రాసు 600 004.

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

(శ్రీ చిరంతనానందస్వామి ప్రణీతము)

ఇందు శ్రీ స్వాములవారి జీవితమున నింతకు పూర్వము గ్రంథస్థములు గాని ముఖ్య సంఘటన లెన్నియో శ్రీవారి సోదర శిష్యులవలన విని వ్రాయబడినవి. ఇది శ్రీ స్వాములవారి సంపూర్ణ చరిత్ర!

నిర్దుష్టమైన భాష, అందమైన అచ్చు, ఆకర్షకమైన రూపము.

432 పుటలు వెల: రూ. 4-00

(పదవ కూర్పు)

## శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర

రచయిత :

శ్రీ చిరంతనానందస్వామివారు

శ్రీ రామకృష్ణభగవానుని సతీమణియు ఆదర్శమాతయు, యోగినియునగు మహనీయురాలి దివ్య చరిత్ర. ప్రతి స్త్రీయును పురుషుడును చదువవలసిన గ్రంథము తియ్యని తెలుగు. పాలవంటి శైలి.

ఆఱవకూర్పు.

పుటలు: 246 వెల: రూ. 4-00

## బాలల వివేకానందుడు

బెంగాలీ మూలము :

శ్రీ నిరామయానందస్వామి

అనువాదకులు :

శ్రీ కరణం రంగనాథరావు

జగద్విఖ్యాతుడైన వివేకానందస్వామి జీవిత చరిత్ర బాలబాలికలకు సులభముగా అర్థమగునట్లు రచింపబడినది. స్వామివారి బాల్యవిశేషములు శ్రీ రామకృష్ణుల సాంగత్యము పాశ్చాత్యదేశములకు పయనము మాతృదేశమున వారి కార్యక్రమము మనోహరముగ సంగ్రహింపబడినది.

పుటలు: 80+viii వెల: రూ. 2-00

(రెండవ ముద్రణము)

## శ్రీ రామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి

శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీ రామకృష్ణ దేవుని దివ్యోపదేశ వాక్యము లాధారముగాగొని, వానిని విరివి పఱచి, మనోహర కథారూపముగను, సంభాషణారూపముగను అమర్చబడినది.

128 పుటలు వెల: రూ. 3-75



ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 35 | 1978 – జనవరి : : పింగళ – పుష్యము | సంచిక 1

## ప్రార్థన

రాధా పునాతు జగదచ్యుత దత్తచిత్తా
మంథానమాకలయతీ దధిరిక్త పాత్రే
తస్యాః స్తనస్తబక చంచలలోలదృష్టి
ర్దేవోఽపి దోహనధియా వృషభం నిరుంధన్.

అచ్యుతునకు పూర్తిగా అర్పించిన చిత్తముగల రాధ పరధ్యానముతో పెరుగులేని వట్టికుండలో కవ్వమునుంచి చిలుకుచున్నది. రాధ సౌందర్యమునందే లగ్నమైపోయిన చిత్తముగల గోపాలుడున్ను పరధ్యానముతో పాలుపిండుటకు ఎద్దును దాయగట్టుచున్నాడు. ఈ దివ్యప్రేమికు లిరువురు జగములను పావనము చేయుదురుగాక!

—శ్రీ కృష్ణకర్ణామృతము.

# వివేకానందవాణి

ప్రతిజీవియందును దివ్యత్వము గర్భితముగా ఉన్నది. బాహ్యాంతరప్రకృతి నంతయు నిరోధించి, యంతర్గతమగు నీ దివ్యత్వమును వ్యక్తము చేయుటయే జీవిత పరమప్రయోజనము. ఇందులకై కర్మ, ఉపాసన, యోగ, జ్ఞాన మార్గములలో ఒక్కటిగాని, కొన్నిటినిగాని, అన్నిటినిగాని యవలంబించి ముక్తుడ వగుము. మతమున కంతయు—ధర్మమున కంతయు— ఇదియే సారాంశము. వాదములు, సిద్ధాంతములు, కర్మకలాపములు, గ్రంథములు, దేవాలయములు, విధులు—ఇవన్నియు కేవలము అప్రధాన వివరములు.

సమస్త మానవకోటియొక్కయు పరమావధి, సమస్త మతధర్మ పరమప్రయోజనము - పరమ గమ్యము - ఒక్కటియే: భగవంతునితో, లేదా, ప్రతి మానవునియొక్కయు యథార్థస్వభావముతో, మరల ఐక్యమునొందుటయే. గమ్యమేకమైయున్నను, వివిధ మానవప్రకృతుల ననుసరించి సాధనమార్గములు వేర్వేరై యుండవచ్చును.

వానిని మనము నాలుగింటిక్రింద వర్గీకరించుచున్నాము.

(1) కర్మయోగము: మానవుడు తన దైవత్వమును కర్మముల మూలమునను కర్తవ్యాచరణ మూలమునను అనుభూతమొనర్చుకొను మార్గము.

(2) భక్తియోగము: సగుణబ్రహ్మము నెడ - సాకారుడగు భగవానునియెడ - భక్తిచే, ప్రేమచే, దైవత్వమును సాక్షాత్కరించుకొను విధానము.

(3) రాజయోగము: మనస్సంయమ మూలమున ఆత్మానుభూతి.

(4) జ్ఞానయోగము: జ్ఞానమూలమున మానవుడు తన బ్రహ్మత్వమునను భూతమొనర్చుకొను విధానము.

ప్రసంగములు కాని, వాదములు కాని, సిద్ధాంతములు కాని, - అవి యెంత మనోజ్ఞమైన వగు గాక - మతము కానేరవు: మతమనగా - ధర్మమనగా - సాక్షాత్కారము. వినుటయు, అంగీకరించుటయుగాదు,-మతమనగా సంస్థితి, ఆత్మ పరివర్తనము, జీవాత్మయంతయు తానేద (పరమసత్యమని) నమ్మునో తత్స్వరూపముగా మాఱిపోవుట. ఇదియే మతము, ఇదియే ధర్మము.

ధ్యానమనగా నేమి? ఒకపాత్రనుండి మఱియొక పాత్రలోనికి ఎడతెగని ధారగా పోయబడిన చమురువలె (ధ్యేయమునుగూర్చి) చేయబడు నిరంతరమైన స్మరణమే ధ్యానము. (భగవంతునిగూర్చి) ఇట్టి నిరంతరస్మరణ లభించినంతనే భవబంధము లన్నియు పటాపంచ లగును.

ఇట్లు నిరంతర స్మరణమునుగూర్చి స్మృతులచే నిది మోక్షోపాయముగా చెప్పబడియున్నది. మఱియును ఈ స్మరణము తత్త్వదర్శనముతో సమ(రూప)మైనది. ఎట్లన, "భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః, క్షీయన్తే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" దూరస్థమయ్యును సన్నిహితమగు పరతత్త్వమును దర్శించినంతనే, అజ్ఞానపాశములు విచ్ఛిన్నములగును; సమస్త సంశయములును నమసిపోవును! అశేషకర్మ క్షయమగును-అనునదియే యిందలి తాత్పర్యము.

సన్నిహితుడగు వానిని దర్శింపవచ్చును, కాని దూరస్థుడగు వానిని కేవలము స్మరింపనగును. ఎట్లైనను, సన్నిహితుడగు వానిని

మాత్రమేకాక, దూరస్థుడగువానిని గూడ దర్శింపవలెను. "ఆత్మావా అరే ద్రష్టవ్యః" అని శ్రుతి చెప్పినపుడు పైని జెప్పిన స్మరణము దర్శనముతో తుల్యమైనదని సూచితమగు చున్నది. ఈ స్మరణ మభివృద్ధి నొందినపుడు దర్శనముతో సమరూపము నొందును.

ఆధ్యాత్మిక జీవనమునకు ధ్యానము జీవగఱ్ఱ. ధ్యానమున మన భౌతిక పరిస్థితులను, పరిమితులను, అన్నిటిని తొలగించుకొని మన దైవత్వము ననుభూతి మొనర్చుకొందుము. ధ్యానమున మనము ఏ బాహ్యసాహాయ్యముపైనను ఆధారపడము. ధ్యానావస్థయే మహోత్తమ స్థితి. ధ్యానాయత్త చిత్తులమై, సాక్షిభూతులమై విషయములను అవలోకించుట వలననే మనము నిజమైన సుఖమును ఆనందమును పొందుదుము.

జంతువు ఇంద్రియసుఖములందును, మానవుడు ధీవైభవమునందును, దివ్యపురుషుడు ఆత్మ ధ్యానమునందును రమించుచున్నారు. ధ్యానావస్థితచిత్తుడగువానికే ప్రపంచము నిజముగా రమణీయమై భాసించును. కోరికలను విడిచి సంగరహితుడై యుండువానికి ప్రకృతియందలి వివిధ పరిణామము లన్నియు దివ్యసుందర దృశ్యములై గోచరించును.

యోగివి కాగోరెదవా, స్వతంత్రుడవై ఒంటరిగానుండి, [illegible] విముక్తుడవై యుండునట్టి పరిస్థితులలో నుండ వలయును. సుఖజీవనమును ఆశించుచు తోడనే ఆత్మసాక్షాత్కారమును పొందగోరువాడు నది దాటగోరుచు, దూలమనుకొని మొసలిని బట్టుకొనిన మూఢునివంటివాడు.

ఆత్మదర్శనమే మన కర్తవ్యము. ఆదర్శ సిద్ధికై జీవించుము, మఱి దేనికిని మనసులో నెడమీయకుము. నాశరహితమగు మనయాత్మ పరిపూర్ణతను బడయుటకై మన శక్తిసామర్థ్యముల నన్నిటిని వినియోగింతుముగాక!

ప్రయత్నింపవలయును, తీవ్ర ప్రయత్నము చేయవలయును, ప్రయత్నముగూడియే వికాసము గలుగును. ఈ ప్రయత్నమున మనము పొరపాట్లు చేయుదుము, కాని యవియే మనకు తెలియని [illegible]లై యుండవచ్చును.

మీలో ఎవ్వరైనను ఆత్మసాక్షాత్కారము నందగోరెదరేని, [illegible] నైనను, ఎంత పూనికతో చేయుదురో, అంత - అంతకంటెను విశేషమైన - పూనికతో [illegible] ఆరంభింప వలయును. వ్యాపారమునందు లోకులెంతటి శ్రద్ధాభక్తులు చూపుచుందురో! దానిని నిర్వహించుపట్ల ఎంతటి పడిగాపులు పడియుందురో! అది యెంతటి కఠోరమైన, కష్టతరమైన, అధికారిణియో! తండ్రి చనిపోనిండు. తల్లి చనిపోనిండు, భార్య చనిపోనిండు, బిడ్డ చనిపోనిండు,- వ్యాపారము మాత్రము ఆగదే! దుఃఖావేశమున గుండె పగిలిపోవుచున్నను, జరుపవలసిన ప్రతి ఘడియయు [illegible] యున్నను మన వ్యాపారస్థలమునకు మనము వెళ్లక తీరదు!

ధ్యానతత్త్వము కరతలామలకము గావలయునన్న, ఏ వ్యాపారమునకంటెను విశేష శ్రద్ధాభక్తులను చూపవలసియున్నది. అనేకులు వ్యాపారమున జయమందవచ్చును; ధ్యానమునన్, ఏ కొలదిమంది [illegible] ఏలన, దీనిని అభ్యసించువాని ప్రత్యేక మనః ప్రకృతిపై ఇది విశేషముగా ఆధారపడి యున్నది. వ్యాపారములోవలె దీనిలో ఎల్లరును భాగ్యోపేతులు కాజాలకపోవచ్చును; కాని ప్రతివ్యక్తియు కొంత లాభమును పొంద వచ్చును..

కావున ఈ ధ్యానయోగశాస్త్ర పరిశీలనమున ప్రతి మానవుడును ఇందలి వాస్తవత్వమును, దీనిని పూర్తిగా అనుభూత మొనర్చుకొనిన మహనీయులు కలరను సంగతిని నమ్ముటకు వలయు అనుభవలేశమునైనను పొందగలడు. ఇది స్వతఃప్రమాణముపై, స్వానుభవ వికాసములపై, నిలిచియుండుటచే, ఏ యితర శాస్త్రములనైనను ఎదిర్చి నిలువగలదు.

ప్రత్యక్షమగు నింద్రియసంజనిత జ్ఞానమును, తార్కిక జ్ఞానమునుగూడ మానవుడు అతిక్రమింపగలడని యోగులు చెప్పుదురు. బుద్ధి సంజనిత జ్ఞానమును అతిక్రమించు శక్తి సామర్థ్యములు నిజముగా ప్రతిజీవియందును గలవు. ధ్యానాభ్యాసమువలన అవి ప్రబుద్ధమైనంతనే [illegible] వధిని దాటి, అతీంద్రియ విషయములను ప్రత్యక్షముగా అవలోకించును.

ధ్యానము మహోత్తమ విషయము. ఆధ్యాత్మిక జీవనమునకు అత్యంతసన్నిహిత మేమి? — ధ్యానాయత్తచిత్తము. సమస్త భౌతిక విషయములనుండియు, జడపరిస్థితులనుండియు విడివడి యాత్మచింతన మొనర్చుచుండుట — ఈ దివ్యాత్మ సంస్పర్శనము - దైనందిన జీవితమున మనము ఐహిక చింతాక్రాంతులము కాని సుముహూర్తము — ఇది యొక్కటియే.

ఆత్మస్పర్శ యత్యంత మలిన ప్రదేశములను సైతము దివ్యతేజోదీపిత మొనర్పగలదు, అత్యంత హేయవస్తువును సైతము దివ్యగంధ సంభరిత మొనరింపగలదు, దురాత్ములను దివ్యులను గావింపగలదు. సమస్తద్వేషమున

# శ్రీ రామకృష్ణ కథామృతము

**(రెండవ భాగము)**

**అనువాదము:** ప్రవ్రాజిక శ్యామాప్రాణ

శ్రీ రామకృష్ణులు: (మాస్టరుతో) తోతాపురివద్ద వేదాంతము వింటిని. 'బ్రహ్మసత్యము, జగత్తుమిథ్య'. ఇంద్రజాలకుడు గారడీచేసి మామిడిమొక్కను సృష్టించును, క్షణములో దానిని వృక్షముగ చేసి పండ్లుకూడ పండించును. కాని ఇదంతయు మిథ్యయే. ఇంద్రజాలకుడే సత్యము.

మాస్టరు: జీవితము ఒకదీర్ఘ నిద్రవంటిది. ఈ దీర్ఘ నిద్రవలన ప్రపంచమును యథాతథముగ చూచుటలేదని తెలిసికొంటిని. ఏ మనస్సుద్వారా ఆకాశమునే సరిగా అర్థము చేసికొన జాలకున్నామో — ఆ మనస్సుతోనే ఈ జగమునుకూడ చూచుచున్నాముకదా! అట్టితరి జగత్తును సరిగా చూడగల్గుదుమా?

శ్రీ రామకృష్ణులు: సరిగా చూడకపోవుటయేగాదు, మరియొకవిధముగ చూచుట సంభవించుచున్నది. ఆకాశము చాల దూరములో, నేలను అంటినట్లుగా మానవునికి అగపడును. అట్టిచో మానవుడు ఏ విధముగా సరిగా చూడగల్గును. సన్నిపాతరోగికి వికారము పుట్టినట్లు — అని పల్కి పరమహంస మధురస్వరముతో పాడ దొడంగిరి.

'ఏకి వికారీశంకరీ; కృపాచరణతరీ, పేలేధన్వంతరి'

(ఓం శంకరీ! ఇదేమి వికారపురోగము. నీ కృపయే ఈ రోగమును నయము చేయగలదు.)

పరమహంస మరల అదే విషయము గూర్చి ప్రసంగించ మొదలిడిరి.

చూడు! నిజముగ ఇది వికారపు రోగమే సుమా! ప్రాపంచిక విషయలోలురు ఎట్లు దెబ్బలాడుదురో చూచితివా? అనవసరముగ తగవులాడుదురు. వారి జగడములకు తల తోక యుండదు. ఏమి కేకలువేయుదురు! ఎట్లు తిట్టుకొందురు! ఎట్లు శపించుకొందురు!

మణి: కిశోర్‌తో ఇట్లంటిని 'సర్వానర్థములకు మూలమైనది ఈ దేహమే. జ్ఞానులు చెప్పునట్లు ఈ దేహమనెడి తొడుగును వదిలివేసిననే శాంతి.'

శ్రీ రామకృష్ణులు: ఈ విధముగ తలంచుటెందులకు? కొందరీ ప్రపంచము వట్టి భూటకమైనదనియు, మరికొందరీ ప్రపంచము ఆనంద నిలయమనియు చెప్పుదురు. దేహముతో ఏమి సంబంధము కలదు? దేహము ఉండనీ పోనీ, ఈ ప్రపంచమునే ఆనందనిలయముగ చేసికొనవచ్చును.

మణి: మీ రేమన్నను సరే. అష్టబంధనాలు ఉండనే ఉన్నాయికదా!

శ్రీ రామకృష్ణులు: ఉంటే ఉండనిమ్ము. వానికృప కల్గినచో ఆ బంధనములన్నియు రెప్పపాటులో తెగిపోవును. వేయి సంవత్సరములుగా చీకటికొట్టుగా ఉండిన గదిలో దీపము వెలిగించగనే ఆ గది వెలుతురుతో నిండిపోవునుగదా. గారడీవానిపని నీవు చూడలేదా? పెక్కు చిక్కుముడులు వేసిన దారపుకొన - ఒకవైపున కట్టి రెండవకొన పట్టుకొని ఒకటి రెండుసార్లు గిరగిర త్రిప్పును. ముడులన్నియు వీడిపోవును. ఇతరులు ఎంత ప్రయత్నించినను ఆ ముడులు విప్పజాలరు. గురువు కృప యున్నచో రెప్పపాటులో ముడులన్నియు వీడిపోవును.

అది సరేగాని కేశవుడిట్లు మారుటకు కారణమేమో చెప్పగలవా? అతడిచ్చటికి తరచు వచ్చెడివాడు. నే నొకనా డతనితో 'నీవిట్లు సాధువులకు నమస్కరింపరాదు' అని చెప్పితిని. సాధువులకు నమస్కరించు విధము ఇక్కడనే నేర్చుకొనెను.

హాజరాది, లెక్కలు కట్టేబుద్ధి - ఎంతసేపటికిని అతడు లెక్కించుకొనుచుండును. సర్వదా భాగములు పంచుచుండును. ఇంతభాగము జగత్తు. ఇంతభాగము ఈశ్వరునకు. ఇంత భాగము మిగిలియున్నది అని లెక్కలు వేయుచుండును. వాని ఆ లెక్కలు వింటుంటే నాకు తలనొప్పి మొదలుపెట్టును. నాకు తెలిసిన దొక్కటే - అదేమిటనగా - నా కేమియూ తెలియదని మాత్రమే నాకు తెలిసిన విషయము. ఒకపరి దేవుడు మంచివాడనియు, మరొకపరి దేవుడు చెడ్డవాడనియు తలంతును. వానినిగూర్చి నా కేమి తెలియును?

మణి: అవునండీ! వానిని ఎవరైనా ఎరుగగలరా? ప్రతిఒక్కడు భగవంతుని తెలిసికొనగలననియే తలంచును. మీరు చెప్పినట్లుగ ఒక చిన్నచీమ చక్కెరపర్వతము కడకుపోయి, ఒక కణమును తిని, కడుపు నిండిపోగా, రెండవ కణమును నోట కరచుకొని తన నివాసమునకుపోవుచు 'తిరిగివచ్చి ఈ పర్వతమునంతయు, తీసికొనివెళ్ళెదను' అని తలంచును.

శ్రీ రామకృష్ణులు: వానిని ఎవరు తెలిసికొనగలరు? తెలిసికొనుటకు ప్రయత్నముకూడ చేయను. నేను కేవలము అమ్మా! అని పిలుతును. అమ్మ ఏమయినా చేయనీ, నాది పిల్లికూన స్వభావము. పిల్లికూన మ్యావ్ మ్యావ్ అని అరచును. తల్లి దానిని ఎక్కడంటే అక్కడికి మార్చుచుండును. ఒక్కొక్కసారి వంటింట్లో, ఒక్కొక్కసారి యజమాని

మంచముపైనను. పసిబాలునకు కావలసినది అమ్మయే. అమ్మకు ఎంత ఐశ్వర్యము కలదో వానికి తెలియదు. అంతేగాక తెలిసికొన గోరడు. వానికి తెలుసుగా — మా అమ్మ ఉన్నది - నా కింకేమిచింత. ఇంటి పనిమనిషి బిడ్డకుకూడ అమ్మ ఉన్నది - నా కేమి భయము అను భావముండును. అందుచే ఇంటి యజమాని బిడ్డలతో జగడము వచ్చినచో అతడు 'మా అమ్మతో చెప్పెదను! మా అమ్మ ఉన్నది' అనును. నాదికూడ ఆ భావమే సుమా!

## అధ్యాయము – 10

క్రీ. శ. 1883 నవంబరు 28 వ తేది కలకత్తాలోని కేశవ చంద్రసేనుని ఇంటియందు భక్తులతో సమావేశము.

శ్రీ రామకృష్ణులు: ఉపాధి జ్ఞానమున్నంత వరకు సత్యము నానారూపములుగా కనపడును. అదెట్లన కేశవుడు, ప్రసన్నుడు, అమృతుడు మొదలగువారు వేర్వేరుగ కనపడినట్లు. పూర్ణజ్ఞానము కలిగినచో జగమంతయు ఒకే చైతన్య శక్తిలో ఓతప్రోతమైయున్నట్లు కనపడును. ఆ చైతన్యశక్తిద్వారానే ఈ ప్రాణికోట్లు, జగములు, చతుర్వింశతి తత్వములు అన్నియు జనించుచున్నవి. మరల ఆ శక్తి లోపలనే ఇవన్నియు లీనమై పోవుచుండుట యును పూర్ణజ్ఞాని కాంచును.

భగవంతుడు సర్వము తానేయైనవాడు, అట్లయ్యును అతడు ఒక్కొక్క చోట ఎక్కువ శక్తితోను, వేరొకచోట తక్కువ శక్తితోను ప్రకాశించుచుండును.

విద్యాసాగరుడు నన్నిట్లు ప్రశ్నించెను. 'దేవుడు కొందరికి ఎక్కువశక్తి, కొందరికి తక్కువశక్తి ప్రసాదించెనా?'

నేనిట్లు బదులు చెప్పితిని: 'అట్లు కానిచో ఒకవ్యక్తి ఏబదిమందిని ఎట్లు ఓడించగలుగుచున్నాడు? ఇంతేల, మే మింతమంది నిన్ను చూడవచ్చితిమేల?'

శ్రేష్ఠమైన కార్యమేదైనను కానిమ్ము. అదంతయు దివ్యశక్తి ఆవిర్భావమనియే గ్రహింపవలెను

ఈ ఆద్యశక్తియు పరబ్రహ్మమును అభిన్నములు. ఒకదానినుండి రెండవదానిని వేరు చేయజాలము. అదెట్లన మణిని వదలి దాని కాంతిని, కాంతినివదలి మణిని వేర్వేరుగ భావింపజాలనట్లు

హాజరా నన్నిట్లు మందలించెను: 'నీవు సదా ఈ బాలుర గూర్చియే చింతించుచున్నచో, భగవత్ స్మరణ ఎప్పుడు చేయుదువు? (అందరు నవ్వుదురు.)

అది విని నేను ఆందోళన చెందితిని. దిక్కుతోచక తల్లికి విన్నవించుకొంటిని. 'అమ్మా! ఈ బాలురగూర్చి నీవింతగ భావింపనేల యని హాజరా పల్కుచున్నాడే, నేనేమి చేయను?' భోలానాథుడు రాగా వానికికూడ ఈ విషయము తెలిపితిని.

పాపము! హాజరా తప్పేమియులేదు... ప్రారంభదశలో సాధకుడు 'నేతి నేతి' అని విమర్శించుచు భగవంతునివైపు మనస్సు మరల్పవలెను. సిద్ధిఁదిన వెనుక ఇట్లు విమర్శింప నవసరముండదు.

నిష్క్రియుడై యున్నచో పరబ్రహ్మము లేక పరమపురుషుడను పేరుతోను, సృష్టిస్థితి ప్రళయములు కలిగించునపుడు ఆదిశక్తి లేక ప్రకృతి యను పేరుతోను వ్యవహరింపబడును.

ఎవనికి పురుషజ్ఞానముకలదో వానికి స్త్రీ జ్ఞానముకూడ కలదు. ఎవ్వనికి తండ్రి జ్ఞానము కలదో వానికి తల్లి జ్ఞానముకూడ కలదు. ఎవ్వనికి చీకటి జ్ఞానముకలదో వానికి వెలుతురు జ్ఞానముకూడ కలదు. ఎవ్వనికి సుఖజ్ఞానముకలదో వానికి దుఃఖజ్ఞానముకూడ కలదు. —సశేషం.

# విశ్వములో సారభూతవస్తువులు నాలుగే.

## స్వామిదేవానందచిన్నస్వామి

ఈ ప్రపంచములో కానబడు పదార్థము లన్నియు సారభూతములైనవని మానవుడు అజ్ఞానవశముచేత భావించుచు, వాటిని సంపాదించి, అనుభవించుటకు కడు ప్రయత్నములు చేయుచుండును. తీవ్ర ప్రయత్న మొనర్చి సంపాదించిన సాంసారిక పదార్థముల నన్నింటిని కొంత అనుభవించిన తర్వాత లోతుగా విచారించి చూచినచో, అవి నిస్సారములని మనకు బోధపడును. ఐతే అజ్ఞుడైన ఈ మానవుడు సాంసారిక పదార్థముల ననుభవించుచు, అందులో విలీనుడై, కించిత్తైనను విచారణ సలుపక, బురదలోపడిన గొంగడి పురుగువలె మడియుచున్నాడు. ఇట్టి మానవులను చూచి మన ఋషీశ్వరులు ఎంతో కరుణగలవారై, మానవాళి శ్రేయస్సుకొఱకై సంసారములో నున్న సారభూతవస్తువులు నాలుగే యనియు, తక్కినవన్నియు నిస్సారములనియును ఈ క్రింది విధముగా తెలిపియున్నారు.

అసారే ఖలు సంసారే, సారమేతచ్చతుష్టయమ్,
కాశ్యాంవాసః సతాంసంగః, గంగాంభః శంభుసేవనమ్.

తా॥ అసారమైన ఈ ఘోర సంసారములో (1) కాశీనివాసము (2) సత్సంగము (3) గంగాజలము (4) భగవత్పూజన – ఈ నాలుగే సారభూతములై యున్నవి.

మనమిపుడాసారభూతములగు వస్తువులు నాల్గింటిని కొంత విచారింతముగాక!

(1) కాశీనివాసము :—పరమ పునీతమైన మన భారతఖండములో నున్న పుణ్యక్షేత్రము లన్నింటిలో కాశీక్షేత్రము విశిష్టమైనదిగా పరిగణింపబడినది. ఎందుచేతననగా :—అది శివునియొక్క నివాసస్థానము. కాశీలో ఏమూల చూచినను, ఎచ్చట త్రవ్వినను శివలింగములు కానబడునని ప్రతీతి. మఱియు శివుడు రాత్రింబగళ్ళు కాశీపట్టణమంతయు తిరుగుచు రక్షించుచుండుననియు, కాశీలో ఎవరు మరణించినను వారి చెవిలో రామతారకోపదేశము చేసి, వారికి ముక్తి నొసంగుచుండుననియు, పశుపక్ష్యాదుల చెవులలోకూడా రామతారకోపదేశముచేసి ముక్తి నొసంగుచుండుననియు ప్రతీతి యున్నది. ఇందుకు మహానుభావుల అనుభవములు, శాస్త్రాధారములుకూడా కలవు. ఆ పవిత్రస్థలములో దేహావసానమును పొందీ, ఈశ్వరానుగ్రహమును బడయుటకొఱకై సాధకులు, భక్తులు, విరక్తులు, వృద్ధులు, ఉద్యోగమునుండి విరమణ పొందినవారు దేశములోని నలుమూలలనుండి వచ్చి, నివాస మేర్పఱచుకొని, జీవితములను గడుపుచుందురు. ఇదియొక జ్ఞానపీఠము. జగద్గురు శ్రీ ఆది శంకరాచార్యుల వారు, శ్రీ త్రైలింగస్వామి మొదలగు మహానుభావులెందరో ఇచ్చట ఈశ్వర సాక్షాత్కారమును బడసిరి. వేలాది పండితులు, జ్ఞానులు, మహాపురుషులు ఈ పుణ్యస్థలమునం దుద్భవించి మన భారతీయ సంస్కృతిని కాపాడుచు, ప్రచార మొనర్చుచు, రక్షించుచున్నారనుటలో ఇసుమంతయు అతిశయోక్తి లేదు. అందువలన విశ్వమునందిది సారభూతమైనది.

(2) సతాంసంగః :—అనగా సత్పురుషులు, సాధుపుంగవులు, ఉత్తమచరిత్ర గలవారి యొక్క సహవాసము. సత్పురుషుల సహవాసమువలన బాహ్యాభ్యంతరములు పవిత్రము లగును. సత్పురుషుల సహవాసమువలన లభింపనిదీ విశ్వమునం దేమున్నది!

"సత్యసూక్తి ఘటించు ధీజడిమ మాన్పు
గౌరవ మొసంగు జనులకు కలుషమడచు,
కీర్తి ప్రకటించు చిత్త విస్ఫూర్తిజేయు
సాధుసంగంబు సకలార్థ సాధనంబు."

యని భర్తృహరి నుడివిరి. ఒకప్పుడు వసిష్ఠ మహర్షి సత్సంగము గొప్పదనియు, విశ్వామిత్రుడు తపస్సు గొప్పదనియు వాదించుకొని, దీనికి బుజువేమిటో తెలిసికొనుటకై ఆదిశేషుని వద్దకు వెళ్ళిరి. విశ్వామిత్రుడు ఆదిశేషునితో జరిగిన వృత్తాంతమంతయు చెప్పి, సత్సంగ తపస్సులలో ఏది గొప్పదో తెలుపుమని అడిగెను. అపుడా ఆదిశేషుడు నేను భూమిని మోయుచుండుటచేత మీ ప్రశ్నకు సమాధానము చెప్పుట సాధ్యపడదనియు, ఎవరైతే నా ఈ భారమును కొంత తగ్గింతురో అపుడు సమాధాన మొసంగుదుననియు చెప్పగా, విశ్వామిత్రమహర్షి తన తపోశక్తి నంతటిని ధారపోసి ఆదిశేషుని భూభారమును తగ్గించుటకు ప్రయత్నించెను. కాని తన తపశ్శక్తి నంతటిని ధారపోసినప్పటికిని ఆదిశేషునియొక్క భూభారము తగ్గలేదు. అపుడు వసిష్ఠమహర్షి తాను చేసిన అరఘడియ సత్సంగఫలితమును ధారపోసి ఆదిశేషునియొక్క భూభారమును తగ్గించి, తపస్సుకంటె సత్సంగ ఫలితమే మహత్తరమైనదని బుజువొనర్చెను. అప్పుడు విశ్వామిత్రమహర్షి మారు మాటాడక వెడలిపోయెను.

సత్సంగములో అత్యద్భుతశక్తి కలదు. సత్సంగముద్వారా అనేక సంశయములు నివారింపబడి, మానసికప్రసన్నత, చిత్తశుద్ధి, వైరాగ్యము, ఆధ్యాత్మిక పథమునందనురక్తి మొదలగునవి ఏర్పడును. అందుచేతనే శంకరాచార్యులవారు మొదలగు ఆచార్యులు, శ్రీ గురునానక్, శ్రీ శివానంద సరస్వతీ స్వాములవారు, శ్రీ మహర్షి మలయాళీ స్వాములవారు మొదలగు మహాపురుషులందఱు సత్సంగమహిమను కొనియాడుచు, వాటిని జరిపించెడివారు. ఆధ్యాత్మిక మార్గమునందు పయనించుచున్న సాధకుల కందఱికి సత్సంగ మత్యంతావశ్యకమై యున్నది. ప్రపంచములో ఇదియే సారభూతమైనది. తక్కినదంతయు నిస్సారమైనదే.

(3) గంగాంభః :—అనగా గంగాజలము. గంగానదిని తలంచుకొన్నంత మాత్రముననే సర్వపాపములు నశించిపోవునని విష్ణుపురాణములో తెలుపబడినది. ఈ పునీతమైన గంగాజలము విష్ణుభగవానుని చరణకమలమునందుద్భవించి, బ్రహ్మదేవునియొక్క కమండలములోనికి ప్రవేశించి, అచ్చటినుండి శివునియొక్క జటాజూటమందు నివసించి, భగీరథునియొక్క కఠోరమైన తపశ్శక్తిద్వారా భూతలమునకు దిగివచ్చెను. సృష్టి స్థితిలయకారకులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరుల చరణములనుండి, కమండలమునుండి, జటాజూటమునుండి వచ్చిన గంగ కేవలము భగవత్స్వరూపమే కాక మరేమి? భగవత్స్వరూపమైనప్పుడు అది పవిత్రవంతమైనదనుటలో ఇసుమంతయు సంశయము లేదు కదా! "స్రోతసామస్మిజాహ్నవీ" యని భగవానుడు భగవద్గీతలోని విభూతి యోగములో వ్రాసెను. శ్రీ రామకృష్ణ పరమహంసులవారు గంగాజలము, బృందావనమృత్తిక, పూరీ జగన్నాథ మహాప్రసాదము – ఈ మూడున్నూ కేవల భగవత్స్వరూపములేయని సెలవిచ్చిరి. జగద్గురు శంకరాచార్యులవారు "గంగాజలలవకణికా పీతా" యని గంగాజల మహిమను ఎంతయో శ్లాఘించిరి. అందుచేతనే ప్రతి

## విశ్వములో సారభూతవస్తువులు నాలుగే!

దినము వేలాది భక్తులు కాశీ, హరిద్వారం, ఋషీకేశం మొదలగు పుణ్యక్షేత్రములందు గంగానదిని దర్శించి, అందులో గ్రుంకు లిడి, తీర్థపాన మొనర్చి తమ జీవితములు ధన్యమైనట్లు భావించుచు, ఆనందము నొందు చుందురు. నిస్సారమైన ఈ సంసారములో పరమ పునీతమైన భగవద్విభూతియైన గంగా జలమే సారభూతమై యున్నది.

(4) శంభుసేవనమ్ :-అనగా ఈశ్వరపూజ, లేక భగవత్స్మరణ మనబడును. పై మూడింటి కంటెను ఇది మహత్తరమైన సారముతో నిండి యున్నది. పై మూడింటిని ఆచరించుట, ఈ నాలుగవదానిని పొందుటకొఱకే యగును. ఈశ్వరుడు దయామయుడు, కరుణాసముద్రుడు భక్తి, భుక్తి, ముక్తుల నొసంగువాడు. ఏ పరమేశ్వరుడైతే మనలను సృష్టించి, పోషించుచు, రక్షించుచున్నాడో; మన మాతనిని స్మరించినను, స్మరించకపోయినను, మన మాత నికి ఏమైనా అర్పించినను, అర్పించక పోయి నను, మన మా భగవంతుని లెక్క చేయక పోయినను మనము మాతృగర్భములో పడినది మొదలు – అహర్నిశములు మనలను దృష్టియం దుంచుకొని, ఎపుడెపుడు మనకేమేమి అవ సరమో వాటినన్నింటి నొసంగుచు, ఎట్టి భేద భావను లేకగా కాపాడుచున్న ఈశ్వరుని సేవింపనిచో మా [illegible]నము? దుర్గతి కదా! ''నిర్బల బ[illegible] [illegible]న్ కే దన రామ్.'' దుర్బలులకు బల మాతడే. ధనులకు ధనమూ శ్రీరామచంద్రుడు దుర్బలులకు, నిర్ధనులకే [illegible] బలమ అతడే ధనమంతు లకేకాక బలము, ధనము, సమస్తమూ పరమేశ్వరుడే నైయున్నాడు. ఆ పరమేశ్వరుడు లేనివస్తువు, కానివస్తువు ఈ ప్రపంచములో మఱేదియున్నది? నిత్యమైన, సత్యమైన, శాశ్వతమైన, సారభూతమైన ఆ పరమేశ్వరుని సేవకంటె మిన్నయైనది; ఈ అనిత్యమైన, అసత్యమైన, అశాశ్వతమైన, [illegible]సారమైన సంసారమునందు మఱేమి కలదు? వ్యర్థ ప్రయాస తప్ప మఱేమియు లేదు.

అధ్యాత్మికమార్గములో పయనించుచున్న ఓ సోదర సోదరీమణులారా! ఈ యసారమైన ఘోర సంసారములోనున్న నిస్సారమైన వస్తు వులను విచారణద్వారా తెలుసు[illegible]. త్యజించి, సారములకు సారభూతమైన ఆ పరమేశ్వరుని సేవించి, భజించి, ధ్యానించి, జీవితమును సారభూత మొనర్చుకొందుముగాక!

---

వినరా! మానవుడా
మోక్షప్రాప్తి కిదే చక్కని పూబాటరా ॥వినరా॥
రామకృష్ణుని దివ్య సందేశం
వేద వేదాంత పురాణాల ఫలసారం
దివ్యానుభూతుల ప్రసూనాల హారం
మానవాళికిదే వారిచ్చిన వరం
పంపుకోవాలి తరతరం యీ దివ్యవరం
ఈ యుగాన కావాలిది ప్రతి నరునకు మార్గం ॥వినరా॥
'నరుడా'....కర్తవ్యము విడనాడకురా
భగవానుని నీమది నిలుపుముర
తలిదండ్రుల సేవలు సలుపుమురా
ఆలుబిడ్డలపై అనురాగము చూపుమురా
వారే నీవారని ఎన్నడు తలపకురా
సదా సర్వేశుని సన్నుతి సేయుమురా
కలియుగాన యోగానికి తావు తక్కువరా
భక్తితో, అనురక్తితో యీశుని భజనలు సల్పుమురా
ఆ నామమే పాపపక్షుల పారద్రోలునురా
నిస్వార్థముగా పరమాత్ముని పూజలు సేయుమురా
మానవుడే ఒక యంత్రమురా!
మాధవుడే నడిపించునురా
ముక్తికిమార్గము అదియేరా!
యీ సత్యము నెన్నడు మరువకురా ॥వినరా॥

—ఏదెం మస్తాన్ రెడ్డి.

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:

ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము:

పి. గణపతిశాస్త్రి

అమ్మ: నాయనా! నీ ఇష్టదేవతము, ఆ పరమేశ్వరి స్వరూపులుకూడా ఆయనే! అందరు దేవతామూర్తులు వారి నామధేయాలు, వారి మంత్రాలు, అన్నీ ఆ ఠాకూరే! ఆయనలో అందరు దేవతామూర్తులను ఆరాధించ వచ్చును. వారు పురుష మూర్తులయినా మహిళా మూర్తులయినా ఇబ్బంది ఏమీలేదు! వారిని ఏ విధంగా సంబోధించినా ఏ మాత్రము దోషంలేదు.''

ఆపైన సురేశబాబు అందుకుని ''నేను తిన్నగా ధ్యానించలేక పోతున్నానమ్మా!'' అన్నాడు. దానిమీద అమ్మ అతని నిలాగ ఓదార్చింది.

దానికి నీ వేమి ఆందోళనపడ నక్కరలేదు. ఠాకూరు రూపచిత్రంవైపు నిశ్చలంగా చూస్తూ కూర్చోగలిగితే చాలు. కాశీపూర్‌లో జబ్బు పడిన తరవాత ఠాకూరు మంచమెక్కారు. ఆయన నెల్లప్పుడు కనిపెట్టి బాలశిష్యులందరు వరసగా వంతులు వేసుకున్నారు. ఆ సమయంలో గోపాల్ ఠాకూరుకు పరిచర్య చేస్తూ, ధ్యానంకోసం మధ్యలో ఆయన్ని విడిచి వేరొక చోటికి వెళ్లాడు. చాలా సేపటిదాకా అతడు ఆ ధ్యానంలోనే ఉండిపోయాడు.

అదే సమయంలో గిరీశబాబు అక్కడికి వచ్చి ఆ సంగతి విని గోపాల్‌ని పిలిపించి అన్నాడు.

''ఏమిటీ? గోపాల్ ఇప్పుడు ఎవరిని గురించి ధ్యానిస్తున్నాడో ఆయన ఇక్కడ జబ్బులో తీసుకుంటున్నారు! అయినా అతగాడు ధ్యానం చెయ్యడానికి వేరొకచోటికి వెళ్లిపోయాడా?''

ఆపైన ఠాకూరు గోపాల్‌తో తన పాదాలొత్తవలిసిందని ఆదేశించారు.

''నా పాదాలకేవో బాధగా ఉన్నదని నిన్నడగడంలేదు. నీవు చాలా పుణ్యకార్యాలు చేసి ఆ సుకృతం కూడబెట్టుకున్నందువల్లనే ఇలాగడుగుతున్నాను. అంతే!''

''నీ దృష్టి ఠాకూరు చిత్రంమీద నిశ్చలంగా నిలిపిఉంచావంటే అది చాలును!''

ఆపైన దుర్గాబాబు ఇలా గడిగాడు.

''అమ్మా, ఆహారం విషయంలో ఎలాంటి నియమాలు అవలంబించాలో, ఎల్లప్పుడు నా అంతట నేను నిశ్చయించుకోలేక పోతున్నానమ్మా!''

అమ్మ: ఆహారం విషయంలో ఠాకూరు ఒకేఒక విషయంమీద ఎక్కువగా శ్రద్ధ వహిస్తూండేవారు. శ్రాద్ధాలలో మిగిలిన ఆహార మెన్నడు ఆయన స్వీకరించేవారు కాదు. అందువల్ల భగవానునిమీది భక్తికి అంతరాయం కలుగుతుందని ఆయన అంటూండేవారు. అయితే మానసికంగా నీ ఆహారం భగవానునికి నివేదించినపిమ్మట ఏ ఆహారం తీసుకోవాలనుకున్నా తీసుకోవచ్చును.'' దానిమీద దుర్గాబాబు మళ్లీ అడిగారు.

దుర్గాబాబు: అమ్మా, తరుచుగా నేను ఆస్పత్రిలో పని చేస్తున్నప్పుడు నాకు దాహం వేస్తూంటుంది. అప్పుడు ఎవరు తీసుకువచ్చిన మంచినీళ్లయినా సరే, పుచ్చుకోవలిసిన అవసరం కలుగుతూంటుంది. దానివల్ల ఏమయినా ఇబ్బంది కలుగుతుందా?

అమ్మ : ఆ పరిస్థితుల్లో అంతకన్న ఇంకెవరు మాత్రం చెయ్యగలిగినది ఏమి ఉంది? ఏదయినా వ్యవహారం నిర్వహిస్తున్నప్పుడు అటువంటిపనులు చెయ్యక తప్పదు. మంచినీరు తాగుతున్నప్పుడు ఠాకూరును గుర్తుంచుకో! అప్పుడు అవి ఎవరికిచ్చిన నీళ్ళయినా ఇబ్బంది లేదు. పనిపాటులలో మునిగి ఉన్నవారి కిటువంటి పట్టింపులు పెట్టుకుంటే కుదరదు.

సురేశ్ బాబు : అదేగాక అమ్మా, కుటుంబంలో అనేక విధాలయిన వ్యక్తులతో, కలిసి, మెలిసి, నివసించవలసి ఉంటుంది. వారిలో కొంతమంది వంటకాగానే భోజనం చేస్తారు. స్వామికి నివేదనం జరిగినా జరక్కపోయినా సరే, తొందరగా భోజనం ముగించుకుంటారు. అటువంటి సమయంలో ఇక మిగిలిన ఆహారం స్వామికి నివేదించడానికి నాకెంతో బాధగా ఉంటుంది.

అమ్మ : ఇలాంటి ఇబ్బందులు మాకుకూడా ఎదురు పడుతూనే ఉంటాయి. ఇక్కడ ఎవరి కయినా జబ్బుచేస్తే వారికి ప్రత్యేకించి ముందుగా భోజనం పెట్టవలసిఉంటుంది. నీ దగ్గిరికి ఆహారం వచ్చినప్పుడు అది ఎటువంటిదయినా అది భగవానుడు అనుగ్రహించినదనుకుని భుజిస్తే నీకు ఎటువంటి దోషము లేదు.

సురేశ్ బాబు : సరేనమ్మా! అయితే కలలలో ఏమయినా యథార్థమున్నదా?

అమ్మ : అవును! భగవానుని గురించి వచ్చిన కలలు యథార్థమయినవే. భగవానుని గురించి వచ్చిన కలల సంగతులు తనవద్దకూడా చెప్పవద్దని ఠాకూరు నిషేధిస్తూండేవారు.

సురేశ్ : అమ్మా, ఠాకూరు ఎలాగుండేవారో మాకెవ్వరికి తెలియదు. మేమెన్నడు ఆయన్ని చూడలేదు. మరి మా సమస్తము నీవే తల్లీ!

అమ్మ : దీనికి నీవేమి ఆందోళన పడవద్దు బాబూ! ఠాకూరు ఇహపరాల విషయంలో నిన్నెల్లప్పుడు ఆదుకుంటూనే ఉంటారు.

వరదామామ కలకత్తా వెడుతున్నారు భోజనాలయ్యాక వారందరు, ఆయనతో కలిసి కలకత్తా వెళ్ళిపోయారు మరి కొంతసేపటికి వారందరు గ్రామానికి ఉత్తరంగా ఉన్న మైదానాలదాకా వెళ్లారు. అమ్మ కొంతదూరం దాకా వారి ననుసరించింది. ఆపైన కనుచూపు అనినంతవరకు వారివైపే చూస్తూ అలాగే నిలుచుండిపోయింది.

సురేశబాబు బల్లారతన్‌గంజ్‌లో ఒక స్కూలుకి హెడ్మాస్టరుగా ఉండేవారు. అక్కడ ఉన్న కసాయివాళ్లు ఇంకా బ్రతికిఉండగానే ఆవుల చర్మాలు ఒలిచే వార్త ఆయన చెవిని పడింది. అది విని సురేశబాబు చాలా బాధ పడ్డారు. ఒకనాడు ఆ స్కూలుకి ఎదురుగానే ఆ దారుణచర్య జరిగింది.

హిందూ ముస్లిము విద్యార్థులు, ఉపాధ్యాయులు సురేశబాబు అంతా ఆ దారుణచర్య గర్హిస్తూ తమ నిరసన వెల్లడించారు. దాని మీద కసాయివారిని దండించారు. దానివల్ల పరిస్థితి మరింతగా విషమించింది. కసాయివారు సురేశబాబుమీద అఘాయిత్యం తలపెట్టారు. ఆ సమయంలో ఆ స్కూలునుంచి ఇద్దరు ముగ్గురు విద్యార్థులు అమ్మదగ్గిరికి వచ్చి ఆమె ఆశీర్వచనా లర్థించారు. సురేశబాబు అమ్మపేర ఒక లేఖకూడా వ్రాశారు. ఆ విద్యార్థులుకూడా కసాయివారి అఘాయిత్యాలన్ని కళ్లకి కట్టినట్టు వర్ణించారు.

అమ్మ అది విని చాలా అసహ్యించు కున్నది. సురేశ్‌బాబును ఉద్దేశించి ప్రసంగిస్తూ, అతిదుకాకపోతే ఆ అమాయిక జీవాల నెవ్వరు సంరక్షిస్తారు?'' అన్నది. ఆమె సలహామీద సురేశబాబును ప్రోత్సహిస్తూ ఒక లేఖ వ్రాసి పంపించారు. అటువంటి క్రూరకృత్యాల నివారణకు శాయశక్తులా ప్రయత్నించవలిసిందని సురేశబాబును ఆదేశించడంకూడా జరిగింది. సురేశబాబు వ్రాసిన రెండవ లేఖకు ఈ విధంగా సమాధానం వ్రాయవలిసిందని అమ్మ మాతో అన్నారు.

భగవంతు డున్నాడన్నమాట యథార్థ మయితే, ఈ దారుణానికి తగిన ప్రతిచర్య జరిగితీరుతుంది.''

ఆపైన ఆ దారుణం ఫలితంగా కోర్టులో ఒక దావా పడింది. అయితే దాని ఫలితం అనుకున్నంత ప్రోత్సాహకరంగా ఉండక పోయినా, క్రమ క్రమంగా ఆ దారుణం చాలా వరకు ఆపివేశారు. అటువంటి పనులు బాహాటంగా జరగడం పూర్తిగా నిలిచిపోయింది.

జయరాంబాటి 11, జూన్, 1913.

అమ్మగది కెదురుగా వరాండాలో నేను వేరొకరు. మధ్యాహ్నభోజనం చేస్తున్నాము మేము అమ్మతో ప్రసంగిస్తూండగా ఆమె ఇలాగన్నారు.

అమ్మ: ఠాకూరు అవతరణంలో సత్యయుగం తిరిగి ప్రారంభమయింది. ఆయనతో బాటు పరిణతులయిన మహాపురుషు లనేకులు పుడమిమీద అవతరించారు. మన నరేంద్ర [స్వామి వివేకానంద] సప్తర్షులందరిలోను మహోత్తముడయిన మహర్షి. నరేంద్రుడు నూరులకొలది ఋషులలో ఒకడని ఠాకూరు చెప్పిఉండవచ్చును. కాని సప్తర్షులలో ఒక్కడని మాత్రమే ఆయన అన్నారు.

అధ్యాత్మికంగా మహోన్నతులయిన వారెందరో అవతారపురుషులు ఠాకూరుతో అవని దిగివచ్చారు. అలాంటివారింకా ఎంతమంది ఉన్నారో నీవూహించగలవా? ఎవడైనా పుల్లని మామిడిపళ్లు ఎన్ని అయినా సంపాదించవచ్చును. కాని తియ్యతియ్యని మామిడిపళ్లు మాత్రం చాలా అరుదుగా లభిస్తాయి. సాధారణ మానవు లనేకులు ఈ భూమిమీద పుడుతూంటారు చనిపోతూంటారు. ఆ భగవానుని కృత్యం నిర్వర్తించడానికి మహనీయు లనేకులు ఆయనతోబాటు ఈ నేలమీద అవతరిస్తూంటారు.

నేను: ఠాకూరు అవతారంతో భూమిమీద సత్యయుగం తిరిగి ప్రారంభమయిందని వివేకానందస్వామి కూడా అన్నారు.

అమ్మ: అవును నిజమే.

జయరాంబాటి 12 జూన్, 1913.

అమ్మగది కెదురుగాఉన్న వరాండాలో మేమంతా మధ్యాహ్నం భోజనం చేస్తున్నాము. ఆమె రాధుని ఒకమూల కూర్చోబెట్టి అన్నం తినిపిస్తూంది. అమ్మ రాధుతో ఇలా గన్నారు.

''రామ్మా! రా! ఈ మూలికల పులుసు కొంచెం తీసుకో! ఠాకూరు ఇది తీసుకుంటూ ఉండేవారు. ఆయన కిది అంటే ఎంత ఇష్టమో చెప్పలేను. మూలికలన్నా, అత్తిపళ్లన్నా, ఆకుపచ్చని అరటిపళ్లన్నా, ఆయన కెంతో ఇష్టం. ఆయన కంతగా జీర్ణశక్తి ఉండేదికాదు. రా అమ్మా! రా! ఈపాలు కాసినీ తాగు మరి. ''నా కింక అక్కరలేదు: వద్దమ్మా! వద్దు!'' అన్నది రాధు.

అమ్మ: రామ్మా, రా! ఇంకా కొంచెం తీసుకో!

''ఠాకూరుకు జబ్బు చేసినప్పుడు కుమారు

లీకి చెందిన గంగాప్రసాద్ సేనుని వైద్యం చెయ్యడానికి పిలిపించారు. తమ వైద్యం సాగుతున్నంతకాలము మంచినీరు తాగరాదని ఆ వైద్యుడు ఒక నియమం పెట్టాడు. "మంచినీరు పుచ్చుకోకుండా నేనుండగలనంటావా, బాబూ?" అని ఠాకూరు ఆపైన కనపడిన వారినందరిని అడుగడం మొదలుపెట్టారు.

"మరేం భయంలేదు. తప్పకుండా మీరుండగలరు" అని అందరు సమాధానం చెప్పారు. "అయితే మంచినీళ్లు తాగకుండా ఉండగలనంటావా?" అని ఆయన మళ్లీ నన్ను కూడా అడిగారు. "తప్పకుండా మీరుండగలరు." అని నేను గట్టిగా భరవసా ఇచ్చాను. అయినా ఆయన అంతమాత్రాన సమాధానపడలేదు.

"నీవు నాకిస్తున్న దానిమ్మగింజలలో నీరంతా పూర్తిగా తొలగించివెయ్యాలి. నీపని చెయ్యగలవా మరి!" అంటూ అడిగారు.

"ఆ కాళీమాత ఎలాగ సంకల్పిస్తే అలాగ చెయ్యడానికి మేమంతా శాయశక్తులా ప్రయత్నిస్తాము." అన్నాను నేను.

ఎలాగయితేనేం చిట్టచివరి కాయన బాగా ధైర్యం తెచ్చుకుని నీరేమాత్రము లోపలికి తీసుకోకుండా ఆపై దానికి సంబంధించిన మందులన్ని తీసుకున్నారు.

"ఠాకూరుకు నేను ప్రతిరోజు 6 లేక 8 పౌనులదాకా పాలు ఇచ్చేదాన్ని. ఒక్కొక్కప్పుడు పది పౌనుల పాలుకూడా ఇచ్చేదాన్ని. తన ఆవును తోలుకునివచ్చి, మాకు పాలు అందించేమనిషి మాకివ్వవలిసిన పాలకంటె కొంచెం ఎక్కువగానే పాలు ఇచ్చేవాడు.

"కాళీజనని కుద్దేశించిన పాలు వాళ్లు ఇంటికి తీసుకునివెళ్లి తమకు తోచినవారి కిచ్చివేస్తారు. ఇక్కడ ఇంకా కొంచెం పాలు ఎక్కువగా ఇస్తే అవి ఠాకూరయినా తీసుకుంటారు." అని మా పాలమనిషి అంటూండేవాడు. నిజానికి చాలా భక్తి ప్రపత్తులున్న వ్యక్తి అతగాడు. సందేశ్, రసగుల్లా మొదలయిన తియ్యని తినుబండారాలు అతనికి నేనిస్తూండేవాన్ని. ఆ రోజుల్లో భక్తులవి చాలా ఎక్కువగా మాకు పంపిస్తూండేవారు. నేను పాలు బాగా కాచి కాచి రెండు మూడు పౌనులదాకా తగ్గించేదాన్ని. "ఎన్నిపాలు?" అని అడుగుతూండడం ఠాకూరుకొక పరిపాటి. "అబ్బే! ఇంచుమించుగా రెండు పౌనుల పాలకన్న ఎక్కువ లేవు" అని నేను అంటూండేవాన్ని. "అలాంటప్పుడు గోలాప్ అవి ఇంకా ఎక్కువ పాలని ఎందుకంటూంది?" అని మళ్లీ ప్రశ్న. "ఆమెకు తెలియదు. మన కొలతపాత్రలు ఆమెకెలాగ తెలుస్తాయి? మన పాత్రలలో పాలెన్ని ఉంటాయో ఆ గోలాప్‌కి ఎలాగ తెలుస్తుంది?" అని నేను అంటూండేదాన్ని.

అయినా ఠాకూరు గోలాప్‌ని మళ్లీ అడిగిన మీదట ఆమె అన్నది. "ఒక గిన్నెడు పాలు ఇక్కడివి, మరో గిన్నెడు పాలు దేవాలయం నించి వచ్చినవి."

అది విని ఆయన నిలువునా నిర్ఘాంతపడ్డారు. "ఏమిటి? ఆ పాలన్నినా? వెళ్లి ఆమె నొకసారి పిలు! ఆమెనడుగు!" అని ఆజ్ఞాపించారు. నేను అక్కడికి రాగానే నన్ను అడిగారు.

"ఆ గిన్నెలో ఎన్ని పాలు పడతాయి? ఎన్ని చటకాలు? ఎన్ని పావాలు? దానిమీద నేను "ఎన్ని చటకాలో, ఎన్ని పావాలో ఎలాగ చెప్పగలను? మీకు అవసరమైనవన్ని మీ కివ్వాలి ఎన్ని చటకాలయితే, నేమి? ఎన్ని పావాలయితే నేమి? ఆ కొలతలమాట, తూకాలమాట ఎవరు పట్టించుకోగలరు?"

—సశేషం,

# ప్రహ్లాద కథాతత్త్వ విచారము

ధూళిపాళ శ్రీరామమూర్తి.

ఈ శరీరములు జన్మాంతర కర్మచేత వచ్చినవి. ఈ కర్మకు కారణము లింగశరీరము. అనగా సూక్ష్మదేహము. అట్టి కర్మవలన ఈ శరీరము లొకప్పుడు పుట్టును. మరొకప్పుడు నశించును. ఈ సూత్రము ఒక్క మానవ దేహములకే గాదు. సర్వ దేహములకును వర్తించును.

ఆత్మ దేహమునం దున్నప్పటికి దేహ ధర్మములైన జన్మమరణములతో దానికి సంబంధము లేదు. అది వ్యతిరేక ధర్మములు గలది. అనగా అజరామరమైనది. మరి నేను చిక్కితిని బలిసితిని యను వ్యవహారమును బట్టి ఆత్మ, శరీరములు సమానధర్మములే యనియు శరీరధర్మముకంటె ఆత్మధర్మము విలక్షణము కాదనియు తెలియుచున్నదిగదా యందు రేమో చూడండి.

ఈ శరీరమును అవివేకమువలన ఆత్మ యను కొనుచున్నారు. న్యాయమునకు ఇది యాత్మ కంటె భిన్నమైనది. ఎందువలననన ఇది భౌతిక మైన పదార్థము. కంటికి కన్పించుచున్నది. ఇది గృహము వంటిది. చూచువాడు వేరు. చూడ బడునది వేరు అని యంగీకరింప తప్పదుగదా. రెండు నత్యంతము భిన్నధర్మములు గలవి. చూచువానిని ద్రష్టయనియు చూడబడుదానిని దృశ్యమనియు యందురు.

ద్రష్ట అభౌతిక పదార్థము. ఎంత యవివేకి కైనను తాను వేరు, తన గృహము వేరు నను జ్ఞానముండును. నా గృహమనుటలో నేను వేరు, గృహము వేరు నను జ్ఞానమున్నది గదా. అట్లే నా శరీరమనుటలోను. దృశ్యధర్మములు భౌతిక ధర్మములునైన జన్మమరణములు ద్రష్టయు, అభౌతికమునైన యాత్మయం దెట్లుపట్టును.

నీటియందు బుడగ, మట్టియందు కుండ, బంగారమునం దాభరణము పుట్టి నశించుచున్నవి. బుడగకు కారణము జలపరమాణువులు. ఘటమునకు కారణము పృథివీ పరమాణువులు. ఆభరణమునకు కారణము తేజోపరమాణువులు (బంగారము తేజోద్రవ్యము) ఆయా పరమాణువులయొక్క వికారమే ఆయా పదార్థములు. అట్లే ఈశరీరము ఈ త్రివిధ పరమాణువుల వికారము. వీని పరిణామము వలన నేర్పడినది. (ఇచ్చట పృథివ్యాపస్తేజస్సు లను మాత్రమే చెప్పినను వానితోబాటు వాయ్వాకాశములనుగూడా గ్రహింపవలెను.)

వికారము నిత్యముగాదు. నశించు స్వభావముగలది. మరి యాత్మ యిట్టిదిగాదు. కట్టెల యందు అగ్నియు (అన్నికట్టెలయం దగ్నియుండును. ఒండొంటిరాపిడివలన వ్యక్తమగును) దేహమునందు వాయువును వేరుగా నున్నట్లే శరీరము నందాత్మ వేరుగానున్నది. సర్వపదార్థములయందు ఆకాశము వ్యాపించియున్నది. కాని దానికి దేనితోను సంగము లేదు. అట్లే పురుషుడు సర్వదేహేంద్రియములయందున్నను వానికంటె వేరుగనే యున్నాడు. ఆ దేహేంద్రియాదుల ధర్మము వానికంటదు.

ఓయీ మూఢులారా! ఎందు కేడ్చెదరు. మీ భర్తయైన సుయజ్ఞుకొరకేడ్తురా! అత నిక్కడే యున్నాడుగదా. కాదు బాబు. ఇంతకాలము మేము చెప్పెడిది విని బదులు చెప్పెడివాడు. ఆ వినువాడు బదులు చెప్పెడివాడు ఇప్పుడు లేడని యేడ్చుచున్నామందురా. వాడు మీ కొకప్పుడు కన్పించినాడు కనుకనా ఇప్పుడు కన్పించలేదని యేడ్చుటకు. ముఖ నాశికాసంచారియైన ప్రాణమేకదా ఆ విన్న

వాడు చెప్పినవాడన్నచో. అది పొరపాటు. ఆ ప్రాణము సర్వేంద్రియములను ఆడింపజేయు నట్టిదేగాని యంతమాత్రమున నది శ్రోతయు, వక్తయుగాదు. అది చేతన పదార్థముగాదు. అనగా తెలివిగలదిగాదు. మాట్లాడుట వినుట చేతన కార్యములు. కాబట్టి యింద్రియముల ద్వారమున వ్యవహరించినవాడు ఈ ప్రాణ శరీరములకంటె వేరు. ఇవి యచేతనములు వాడు చేతనుడు.

మరి యట్లైనచో నేను కృశుడను, (సన్నని వాడను) స్థూలుడను, గ్రుడ్డివాడను, చెవిటివాడ నని యిట్టి దేహధర్మములను తనవిగా నెట్లు చెప్పుకొనుచున్నాడన్నచో నతడీ శరీరేంద్రియ ముల నభిమానించి వానిధర్మము నజ్ఞానము వలన తనయం దారోపించుకొనుచున్నాడు.

వానికి మరి మోక్షమెట్లన్నచో వివేకబల మున మోక్షము గలుగును. తాను వేరు, శరీ రేంద్రియములు వేరు అని నిశ్చయజ్ఞానము గలిగి నప్పుడు వానికి వీనితోడి సంపర్కముండదు. అదేమయ్యా యట్లందువు వివేకము కల్గినంత మాత్రమున యాహారాదికమును విసర్జించు ఆ శారీరిక కర్మలయందు ప్రవర్తనము మాను నాయన్నచో ఈ శరీరమునకు లోపల మరియొక శరీరమున్నది. ఇది స్థూలము. అది సూక్ష్మము. దానిపేరు లింగశరీరము. (పంచజ్ఞానేంద్రియ ములు, పంచకర్మేంద్రియములు, పంచప్రాణ ములు బుద్ధ్యహంకారములు మొత్తము పదు నేడంగములు కలవు). దీనియందు ఆత్మకేకత్వ భ్రాంతి యున్నంతవరకు అనగా దీనియం దభి మానమున్నంతవరకు కర్మబంధహేతువగును. ఈ యభిమానమువలననే దేహధర్మములు తన యందారోపించుకొనుట. దానివలన క్లేశములు అనగా సంసారము కలుగుట. ఆ లింగాభిమా నము పోయినప్పుడా శారీరికకర్మ బంధహే తువుగాదు.

ఈ దేహధర్మారోపణము, ఈ సంసారము యినియంతయు మాయామోహము. పరమార్థ ముగాదు. అదేమయ్యా! అట్లందువు. సుఖ దుఃఖములు వాని సాధనములు సత్యముగా గన్పించుచుండగా పలువురవి సత్యములని ఘో షించుచుండగా నీవు వానిని మాయామయము లందువేమి యన్నచో ఈ సుఖదుఃఖములు తత్సా ధనములు త్రిగుణములచేత నేర్పడ్డవి. వీనిని పరమార్థములు (సత్యములు) గా చూచుట, చెప్పుట ఎరుగమిచే వ్యర్థమైన యభినివేశము. గదిలో కూర్చుండి కండ్లు మూసికొని యొకా నొకడు విమానమెక్కి స్వర్గమునకుబోయి నంద నవనములో రంభాద్యప్సరసలతో విహరించు చున్నట్లు భావించును. ఒకానొకడు నిద్రించి స్వప్నమునందు బహుపదార్థములను దర్శించు ను. అవియంతయు సత్యమైనదా? అట్లే యీ జాగ్రదవస్థలో ఈ యింద్రియ జ్ఞానముకూడ యసత్యమె పరమార్థముగాదు.

మరి నిత్యమైన యాత్మనుగురించిగాని అని త్యమైన దేహమును గురించిగాని నిత్యానిత్య వస్తువివేకము కలవాడు శోకింపడు. ఏడ్చినంత మాత్రమున వస్తుస్వభావము మారునా? మీకొక కథ చెప్పెదను వినుడు.

వేటగాడొకడు అడవికిబోయి వలపన్ని లోపల కందముక్కలు పెట్టెను. ఒక కులింగ పక్షి మిథునమచ్చట తిరుగుచుండెను. ఆడ పక్షి యా ముక్కలను చూచి యాకృష్టమై పోయి వలయందు చిక్కుకొనెను. ఆ యాపద పాలైన దానిచూచి మగపక్షి బాగుగా దుఃఖి తుడై మిక్కిలి కరుణముగా నిట్లు విలపించెను. అయ్యో! దేవునకు దయలేకపోయెనే. నాతో విడిపోయి ఈ దీనురాలు యేమి చేయగలదు.

దేవుడు నన్నుకూడా చంపడేమి. నేను బ్రతికి యేమి లాభము. భార్యలేక దీనముగా దుఃఖముగా బ్రతుకు లాగవలయునుగదా. పిల్లలకు రెక్కలు పుట్టలేదు. తల్లి లేదాయె. వారి నెటు పోషింపగలను. ఆ పిలలు దౌర్భాగ్యులు. తల్లికోసము గూటిలోనుండి ఎదురుచూచెదరు. అని యా కళింగపక్షి భార్యావియోగముచే నేడ్చుచుండగా, వేటగాడు దానినిగూడా బాణముతో గొట్టెను.

అట్లే మీరును మీ మరణమెరుంగక యవివేకముతో నేడ్చుచున్నారు. నూరుసంవత్సరము లేడ్చినను మీ భర్త తిరిగిరాడు. బాలుడు చెప్పిన యీ మాటలు విని సుయజ్ఞుని బంధువులందరు మిక్కిలి విస్మయము బొంది, సంసారమంతయు అనిత్యమనియు మిథ్యాభూతమనియు తలచిరి. యము డిట్లు చెప్పి యంతర్ధానమై పోయెను. జ్ఞాతులు, సుయజ్ఞునకు ఊర్ధ్వక్రియ లొనరించి వెడలిపోయిరి.

కాబట్టి మీరుకూడా ఇతరులను గురించి గాని, తమ్ముగురించిగాని దుఃఖించవలసినది లేదు. తానెవ్వడు, పరుడెవ్వడు, తనవాడెవడు, పరకీయుడెవడు. ఇదంతయు స్వపర భేదభావన. వట్టి యభినివేశము. హిరణ్యకశిపుని, యుపదేశమును విని దితి ఈ పుత్రశోకము వెంటనే మరచిపోయి తత్వమునందు బుద్ధి నిలిపెను.

-సశేషం.

# చిత్తశాంతి II

ప్రభాకర్

సోపాధికము నిరపాధికము అని శాంతి రెండు విధములు. సాధారణముగా మనము ప్రసంగించు శాంతి సోపాధికము. నిరపాధిక శాంతి అందఱిబుద్ధి కందునట్టికాదు. కోటి కొక్కడుకూడ నిరుపాధికశాంతిని గూర్చి తలపడు. నిత్యజీవితములో మనము కోరునది సోపాధికశాంతి. ఐనను నిరుపాధికశాంతిని లక్షింపనిదే స్థిరమైన సోపాధిక శాంతియైనను లభింపదు.

సోపాధికశాంతి మూలరహస్య మేమంటే మనోనిగ్రహం. మనస్సుపైని మనం సవారి చేయవలెనేకాని మనమీద మనస్సు సవారి చేయగూడదు. మనోవృత్తులు అదుపులోనికి వచ్చి విక్షేపాలు తొలగితే అప్పుడు సోపాధిక శాంతి కలుగుతుందని హిందువుల మన స్తత్వ శాస్త్రనిర్ణయం. భగవద్గీతలో శ్రీకృష్ణునితో అర్జును డీలా గన్నాడు—

చఞ్చలం హి మనః కృష్ణ
ప్రమాథి బలవ ద్దృఢమ్
తస్యాహం నిగ్రహం మన్యే
వాయోరివ సుదుష్కరమ్.

"ఓ కృష్ణా, మనస్సు చంచలమైంది, క్షోభ పెట్టుతుంది, అణిగేదికాదు, దృఢమైంది. దాన్ని అదుపులో ఉంచుకోవడం గాలిని అదుపులో ఉంచుకోవడంవలె అసాధ్యమని నా తలంపు" ఇందుకు శ్రీకృష్ణుని జవాబు.

అసంశయం మహాబాహో
మనో దుర్నిగ్రహం చలమ్
అభ్యాసేన తు కౌన్తేయ
వైరాగ్యేణ చ గృహ్యతే.

"ఓ మహాబాహూ, కుంతీతనయా, మనస్సు చంచలమనడానికీ, దాన్ని నిగ్రహించడం దుష్కరం అనడానికి సందేహంలేదు. ఐనా

అభ్యాస వైరాగ్యాలచేత మనస్సు స్వాధీనం లోకి వస్తుంటుంది.''

మనశ్శాంతిసిద్ధికి ఈ యభ్యాస వైరాగ్యాలు తప్పితే వేఱుమార్గం లేదు. అభ్యాసం అంటే గురూపదేశానుసారం మనస్సున లక్ష్యంగా ఏర్పఱచుకొన్న ధ్యేయవిషయంలోని లోతులకు బుద్ధిని ఇంక నింకను ప్రవేశింపజేయుచుండడం. వైరాగ్యం అంటే, ఇహలోక పరలోక భోగ విషయాల అశాశ్వతత్వం మొదలయిన దోషాలను గుర్తించడం మూలాన ఆ విషయాలలో ఆశ అంతరించడం.

ఈ సాధనలను అలవఱచుకోకపోతే సోపాధికమైన మనశ్శాంతి సైతం కలుగదు, ఇక నిరుపాధిక మనశ్శాంతి దుర్లభత చెప్పవలెనా? మతొక దృక్పథంలో చూస్తే శాంతిని చెడగొట్టి కలవరపాటును గలిగించేవి మనోమాలిన్యాలే. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములే ఆ మాలిన్యాలు. మనశ్శాంతి కావాలంటే మనోమాలిన్యాలను తొలగించుకోవాలి, వానిని దులుపుకోవడం సుకరంకాదు. అందుకే శ్రీ కృష్ణుడు అభ్యాసం ఆవశ్యకం అన్నాడు. ఈ మాలిన్యాలకు బలము చేకూర్చి మనస్సున కంటించేది జీవిత సుఖానుభవతృష్ణ. కావున వైరాగ్యం ఆవశ్యకం.

ఈ మనోమాలిన్యాలను తొలగించుకునేందుకు యోగసూత్రములలో పతంజలి తెల్పిన సాధనాప్రకారములు – ''మైత్రీ కరుణాముదితో పేక్షాణాం సుఖదుఃఖ పుణ్యాపుణ్యావిషయాణాం భావనా తశ్చిత్త ప్రసాదనమ్.(1—33.)

(1) సుఖితులపట్ల మైత్రి: ఇతరుల సుఖమును గని ఆనందించడం అలవడితే మనస్సు మెత్తవడుతుంది, అందు అసూయాద్యులకు మను గడ ఉండదు. విశ్వశ్రేయమందు నిరవధికాభిలాషను అలవఱచుకోవడమే చిత్తశాంతికి కీలకమని సుత్తనిపాతమనే బౌద్ధమతగ్రంథం విధిస్తున్నది. ''సర్వేజనా స్సుఖినోభవన్తు, నిర్భరచిత్తాభవన్తు'' అని మాటిమాటికి హృదయపూర్వకంగా మనం ప్రార్థించాలి. అవిస్మరణీయములు సదా అనుసంధానార్హములునగు 'సుత్తనిపాత' వాక్యాలు ఇవిగో – ''తన బిడ్డను తన యేకైకసంతతిని తల్లి ఏలాగు ప్రాణానికైనా తెగించి పర్యవేక్షిస్తుందో, అటే ప్రతియొక్కడును సర్వభూతములపట్ల నిరవధిక సుహృద్భావమును అలవఱచుకోవాలి. ద్వేష శాత్రవ నిరోధంలేని సుహృద్భావాన్ని శ్రేయః పరతను అతడు యావద్విశ్వము పట్లను ఊర్ధ్వాధోదిశలందును అష్టదిశలందును అలవఱచుకోవాలి. నడుస్తున్నప్పుడున్నా నిలుచున్నప్పుడున్నా కూర్చున్నప్పుడున్నా పడున్నప్పుడున్నా మేలుకొని ఉన్నంతసేపును అతడీలాటి చిత్తానికి తన్ను అంకితం చేసుకోవాలి. ఘుమఘుమలాడే సుగంధద్రవ్యాన్ని సీనాలోనుండి ఖాళీ చేసినతర్వాతకూడ ఎంతోసేపు సీసాలో దాని సువాసన అంటిఉంటుంది. అదేవిధంగా ప్రాతఃకాలంలో మన మనస్సును ఉదారాశయాలపై ఉంచితే, దినమంతా మనం చేసే పనులున్నా ఆలోచనలున్నా ఆ ఉదారాశయాల శుభ ప్రభావంచేత ప్రసర్పితాలై ఉంటాయి.''

పైని ఉదాహృతాలైన సూక్తులను వల్లించడం సులభమేకాని యథార్థమైన విశ్వశ్రేయః పరత ఆకస్మికంగా కుదిరేదికాదు. అందుకు అభ్యాసం కావాలి. చాలమట్టుకు మనం క్షుద్రజీవులంగా ఉండడంలోనే తనివి చెందుతాం. మన హృదయాలు సంకుచితాలు, వికాస ప్రతికూలాలు. మన అక్కఱలను ఎవరు

తీర్చుతారో వారికి మాత్రం మనం మేలు కోరుతూండగలం. ఎవరు మనకు తోడ్పడరో, వారిపట్ల మనం ఉదాసీనులంగా ఉంటాం. ఎవరు మన శత్రువులని నమ్మినామో వారి వినాశాన్ని మనం కోరుతుంటాం. ఒకరి వినాశం మనం కోరినామంటే మనమే వినాశోన్ముఖులు అయినామన్నమాట! కాబట్టి మనకు మేలు కలుగవలెనంటే విశ్వమున కంతటికి మనం మేలునే కోరవలె. విశ్వశ్రేయః పరత్వాన్ని మనం మెట్టు మెట్టుగానే అలవఱచుకోవాలి. పతంజలి సూచించినట్లు అన్యుల సుఖమును చూచి సంతోషించడం మనం తొలుత అలవఱచుకోవాలి. అది మొదటిమెట్టు.

(2) దుఃఖితులపట్ల మనం సకరుణులంగా ఉండాలి. కష్టపడుతున్నవారికి సాహాయ్యం చేయడమే కారుణ్యం తాల్చే క్రియారూపం! మాధవసేవ అనెడి అధ్యవసాయంతో చేయబడే మానవసేవకంటె పావనమైనది మఱొక్కటి లేదు. సంకోచం అశాంతిప్రదం, వికాసం ప్రశాంతిప్రదం. మానవసేవ మనస్సుకు వికాసాన్ని చేకూర్చుతుంది. విశ్వాత్మతోడి మన ఐక్యం గుర్తింపబడే కొలదీ, సంకోచం సమసి వికాసం సిద్ధిస్తుంది. మనశ్శాంతి కుదురుతుంది. ఇది రెండో మెట్టు.

(3) సుజనులకంట బడ్డప్పుడు మనకు ఆనందం కలుగవలె. కలిగితేనే, వారి సుగుణాలను అలవఱచుకొను ప్రవీణతయు మనకు కలుగుతుంది. దేవుడు సౌజన్య సింధువు. కాబట్టి సౌజన్యపరత భగవత్పరతగా వర్ధిల్లుతుంది. ఇది మూడో మెట్టు.

(4) దుర్జనులజోలికి పోక మనం ఉదాసీనులంగా ఉండాలి. ఇనుమును బంగారుగా మార్చినట్లు దుర్జనులను సజ్జనులనుగా పరిణమింపజేయడం ఉదాత్తమైన పనే, కాని అది సామాన్యులకు సాధ్యంకాదు. కాబట్టి దుర్జనులపట్ల ఉదాసీనతను అలవఱచుకోవడమే మనం చేయగలపని. అది మన మనస్సులకు కలవరపాటు తొలగించి శాంతి కలిగిస్తుంది.

దుర్జనసంసర్గం పరిహారణీయమే దుర్జనులను ద్వేషించడం అంతకంటె పరిహారణీయం. ప్రతిదినం మనం ఈలాగు ప్రార్థించడం మంచిది—

దుష్టులెల్లరు మాఱుత శిష్టులుగను ;
శిష్టులకు లభియించుత చిత్తశాంతి ;
శాంతులో, బంధముక్తిని గాంతురుగాత ;
ఇతరులకు బంధముక్తి దామిత్తురుగాత!

మనకై ప్రార్థించుకొన్నట్లే వారికైయు ప్రార్థించడం మంచిది.

చిత్తశాంతికి పతంజలి చెప్పిన నాల్గు పద్ధతులను అభ్యసించేటప్పుడు చెడ్డతలంపులు మనసున చొరకుండవు. వాటిని అరికట్టే మార్గాన్ని కూడా పతంజలి ఉపదేశించియున్నాడు. 'వితర్క బాధనే ప్రతిపక్షభావనమ్' (II-33) చెడ్డతలంపును వెలికినెట్టుటకు మంచితలంపును కలిగించుకోవడమే ఆ ఉపాయం. మనస్సులో కోపతరంగం తలయెత్తిందనుకోండి. అప్పుడు దాన్ని అణచేందుకు ప్రేమతరంగాన్ని త్రోపుకోవలె. కామతరంగం తలయెత్తినప్పుడు దాన్ని అణచుకునేందుకు, క్రీస్తు బుద్ధ శ్రీరామకృష్ణుల వంటి విశుద్ధ మహాపురుషులను గూర్చిన భావతరంగాలను లేపుకోవలె. చెడ్డ తలంపు తలయెత్తినక్షణంలోనే దాన్ని అణచే ప్రయత్నం చేయాలి. అంకురదశ దాటి చెడ్డ తలంపు ప్రవృద్ధదశ అందుకుంటే దాన్ని అణచడం దుశ్శకం. ఇల్లు పూర్తిగా నిప్పంటుకున్న తర్వాత జలయంత్రాన్ని రప్పించి ఏంలాభం? కాబట్టి సదా మెలకువగలిగి ఉండవలె. అశాం

రికరములైన మనోదోషాలు పైపైని ఉండేవి కావు. వాటి వేరులు లోతుకు పాతుకుపోయుంటాయి. దృఢమైన అధ్యవసాయం ఉంటేనే వాటిని తొలగించుకోవడం సాధ్యమవుతుంది. శాక్యుల సేనానాయకుడగు సింహునితో బుద్ధుడు చెప్పినట్లు "యుద్ధవిజేతయగు సేనాపతి అధికుడే, కాని, ఓ సింహా, తన్ను తన అదుపులోనికి తెచ్చుకొన్న విజేత అధికతరుడు."

మనోమాలిన్యాలు అసంఖ్యాకములుగా ఉన్నాయి. ఒక్కొక్కదానినిగా వాటిని కడిగివేసికొని శాంతిని అధిగమింతామనుకుంటే అందుకు మనజీవితకాలం చాలదు. మనోమాలిన్యాలు ఎన్నైనా కానీ, వాటికన్నిటికీ ఏది మూలకారణమో దాన్ని తొలగిస్తే అవన్నీ తొలగిపోతాయి. "అస్మిత" అనేదే సకల మనోమాలిన్యాలకూ మూలకారణం. దర్శనసాధనమే ద్రష్ట అని భ్రమించడమే అస్మిత అని పతంజలి వివరించాడు. ఆ భ్రమ మానసిక అశాంతికి కారణం. ద్రష్టయేజీవుడు, జ్ఞానేంద్రియాలు దర్శనసాధనాలు. ఆత్మ వేఱు, మనఃప్రభృతీంద్రియాలు వేఱు. తెర వేఱు, తెరపై చూపబడు చలనచిత్రం వేఱు. వేఱు కాకపోతే, చలనచిత్రంలో ఇల్లు తగులబడ్డప్పుడు తెరకూడ తగులబడవలసిందేకదా. మనస్సే ఆత్మ అను భ్రాంతి మనకు అత్యంతదృఢంగా ఉన్నందువల్ల మనస్సు ఉడికినప్పుడంతా మనంకూడా ఉడికిపోతుంటాము. కాని ఆలాగు జరుగవలసింది కాదు. మనస్సు వేఱు ఆత్మ వేఱు. ఆత్మను వికృతి నొందింపగల దేదియూ లేదు అను దృఢాధ్యవసాయం కుదిరితే యథార్థమైన నిస్సంగత్వం సిద్ధిస్తుంది.

మనస్సువేఱని తెలుసుకోవడంతో ఆగకూడదు, దాన్ని అదుపులోనికి తెచ్చుకోవాలి, అదుపులో ఉంచుకోవాలి. ఎట్లు? (శ్రీ బ్రహ్మానందస్వాములు ఈలాగు వ్రాశారు- "ధ్యానాభ్యాసం చేస్తేనే కాని మనస్సు స్వాధీనపడదు, మనస్సు స్వాధీనపడితేనేకాని ధ్యానాభ్యాసం కుదురదు. మనస్సు స్వాధీనపడిన పిమ్మటనే ధ్యానింతామనుకునేవానికి ఆధ్యాత్మిక జీవితంలోనికి ప్రవేశం లభించనే లభించదు. కాబట్టి మనస్సంయమనమూ ధ్యానమూ ఏకకాలంలో సాగిపోతూ ఉండవలె" కాబట్టి చిత్తశాంతి కోరువారు ధ్యానాభ్యాసం చేయాలి. అంతకుముందు నిశ్చలంగా కూర్చొని మనస్సుపోవు పోకలపై కనుపెట్టి ఉండవలె. చెడ్డతలంపు ఏదైనా తలయెత్తితే దాన్ని నిరాకరించాలి. మంచితలంపు తలయెత్తినప్పుడు దాన్ని ఆదరించాలి. మనోమాలిన్యాలు తొలగేకొద్దీ శాంతి నెలకొంటుంది. మనోనిగ్రహమే మనశ్శాంతి మర్మం. ఈ యభ్యాసవిధానం సుకరంకాదు, కాని సాగితే, అమోఘ ఫలప్రదం.

ఇంతకంటె సరళతరవిధానం లేదా అంటే ఉంది. కాని మనం పాటుపడితే ఫలం ఇచ్చే విధానం ఏదీఉండదు. సంపదకంటె ప్రీతికంటె కీర్తికంటె ఆనందంకంటె విలువగలది చిత్తశాంతి. దానికి తగినవెల యిస్తేనే దానిని పొందవచ్చు. సరళ సులభవిధానం లేకపోలేదు.

ఈ సరళతరవిధానంలో తొలిమెట్టు 'జీవితంలో కొన్ని అనివార్యాలు ఉన్నా' యని గుర్తించడం. కొన్ని దెబ్బలకు మనం తలయొగ్గక తప్పదు. అనివార్యా లేవి అంటే ఇవిగో—
(1) మనకు యౌవనం కొంతకాలమే ఉంటుంది. తర్వాత వార్ధక్యం వచ్చిపడుతుంది. (2) ఎప్పుడోఒకప్పుడు ఏదో ఒక వ్యాధి మనకు వస్తూనే ఉంటుంది. తప్పించుకోలేము (3) ఒకనాటికి చావున్నూ సంభవించితీరుతుంది.

తప్పించుకోలేము (5) ప్రాణప్రియులుగ ఉన్న వారితో వియోగం మనకు కలుగుతుంది తప్పించుకోలేము. (5) మనకర్మలు మంచివో చెడ్డవో వాని ఫలితం మనం అనుభవించి తీరవలె, తప్పించుకోలేము.

ఈ యనివార్యము లైదింటిని గుర్తించుకొన్నతర్వాత ఐదు విధులను ఐదు నిషేధాలను పాటించాలి. పాటిస్తే చిత్తశాంతిని సమీపిసాం.

ఐదు విధులు–1. న్యాయ్యమూ నీతిబద్ధమూ ఐన జీవితాన్ని గడపాలి. 2. కుటుంబముపట్ల అధికారులపట్ల సంఘముపట్ల దేశముపట్ల సర్వ మానవాళిపట్ల మనకుగల సకల బాధ్యతలని శక్తివంచనలేక ప్రీతితో తీర్చుకోవాలి, మన కర్తవ్యాలను నిర్వర్తించుకోవాలి. 3. మన జీవితాన్ని ఒక సముదాత్త లక్ష్యానికి అంకితం చేసుకోవాలి. ఆ లక్ష్యం మన మనస్సులకు విశ్రమస్థానంగా ఉంటుంది. ఇటూ అటూ చెదరడం ఉండదు. 4. పైపై కెట్లు కనిపించినా, సౌజన్యం అన్ని ప్రాణులయందు అంతర్గతంగా ఉన్నదన్న విశ్వాసంతో ఆత్మ విశ్వాసంతో సహనం వహించాలి. ఒరుల తప్పులను కోట్లకొలదిగా మన్నించాలి. 5. మనశక్తిని కరగదీసే రిత్త ఆలోచనలనో పగటి కలలనో పూర్తిగా మానుకోవాలి.

ఐదు నిషేధాలు. 1. మనకు కష్టాలు వచ్చినప్పుడు అవి అన్యాయ్యంగా వచ్చిపడ్డట్లు భావించకూడదు. మన యిష్టాలు కొనసాగుతున్నప్పుడు 'సమస్తము బాగుంది' అనిన్నీ అనుకోకూడదు. 2. భగవంతుని కరుణచేతనే మనకు కలుగుతున్న కష్టాలను ఏవో భగవద్విరుద్ధశక్తులు మనపై వర్షిస్తున్నట్లు భావించరాదు. 3. పిలవని పేరంటంగా ఇతరుల విషయాలలో మనం తల దూర్చరాదు. వారి నడవడులలో గుణదోషాలను త్వరపడి నిర్ణయించరాదు. 4. శక్తియుక్తులు కలవారమని గర్వించకూడదు, శక్తియుక్తులు లేనివారమని అధైర్యపడనూ కూడదు. 5. ఎంతసేపటికీ మనం మనలోని లోటుపాట్లను గుర్తించుకొంటూండాలి, ఇతరులలో తప్పు లెన్నరాదు. మాతృశ్రీ శారదాదేవి వాక్రుచ్చినట్లు అందఱిని స్వజనంగా భావించడం అలవఱచుకోవలసిన మనం, ఎవరినిగాని పరాయివారని అనుకోకూడదు.

ఇన్ని మెలకువలు ఇన్ని అభ్యాసాలు తమకు సాధ్యపడవను కొనువారికి ఇక చిత్తశాంతికి దారి లేనేలేదా అంటే, ఒక్కదారి ఉంది— ఏమంటే దేవుని ప్రేమించడం, దేవునే నమ్ముకోవడం. ఈ నమ్మకం కుదిరినవారికి నిబ్బరము, మనశ్శాంతియూ సిద్ధిస్తాయి. అంతేకాదు. వేఱుమార్గాలలో సాధించుకునే, సోపాధిక చిత్తశాంతికంటె భగవత్పరతచే సిద్ధించు నిరుపాధిక చిత్తశాంతి వరిష్ఠమైనది. దేవునందప్పటమైన ప్రేమ కుదిరినవానికి దేవుడేమి చేసినా మన మేలుకే చేస్తాడని, మనకు అయన సంరక్షణ సదా కొంగుబంగారమే అని నిబ్బరం కలుగుతుంది. అప్రకంప్యచిత్తశాంతి సిద్ధిస్తుంది. దీనినే శ్రీ వేదాంతదేశికులవారు 'న్యస్యత్వత్పాదపద్మే వరద నిజభరం నిర్భరో నిర్భయోఽస్మి' అన్నారు.

# మేలైన జీవితం

చిర్రావూరు వెంకట్రావు

మానవులంతా ఉన్నతస్థితిలో ఉండాలని కోరుకొంటారు. అయితే ఉన్నతస్థానానికి చేరిన వారు చేరుతున్నవారు కొద్దిమంది మాత్రమే ఉన్నారు. దీనికి కారణం ఏమిటి?

గొప్పగా ఉండాలని అనుకోవటమే కాని అందుకు కావలసిన మార్గాలు సాధనాలు అనుసరించటంకాని ఆలోచించటంకాని చేయలేక పోతున్నారు.

ధనం, విద్య, కులం, ఉద్యోగం, అందం మొదలైనవి ఎంత గొప్పగావున్నా అట్టివారిని గొప్పవారిగా పెద్దలు అంగీకరించరు. గొప్పగా ఉండటానికి ఒకేఒక మార్గం ఉంది. దానిని మానవులు మనసులో ఉంచుకోవాలి. మనసు ఉన్నతంగా ఉన్నవారే గొప్పవారని చెప్పబడతారు.

పది అడుగుల లోతుగల నీళ్లు ఉన్న కొలనులో తామరతీగె పది అడుగుల పొడుగే ఉంటుంది. ఇంకా పొడుగు కావాలని బలవంతంగా లాగితే తెగిపోతుంది. వానకురిసి కొలను నిండితే తనంతట తానే పొడుగు పెరుగుతుంది. అదేవిధంగా మనసు ఉన్నతమైనకొద్దీ మానవుడు గొప్పవాడవుతాడు.

మనసు ఏ విధంగా ఉన్నతమవుతుందో ఆలోచిద్దాం. ప్రతివారు తమను తామే పరిశీలించుకునే అలవాటు చేసుకోవాలి. ఆ అలవాటు చాలామందికి లేదు. జేబులో ఉన్న డబ్బునంచి, ఇంటిలో సామాను, పెట్టెలోని నగలు, సరిగా ఉన్నవో లేవో చూసుకుంటారు గాని తమనుతాము పరిశీలించుకోవటం లేదు. భర్త భార్యను, భార్య భర్తను, యజమాని సేవకుని పరిశోధించుకుంటారే గాని తమను తాము శోధించి చూచుకోరు.

మనలో ఆశ ఉన్నదా? ప్రేమ ఉన్నదా? కృప ఉన్నదా? అని సదా పరిశోధించుకోవాలి. మనను మనం పరిశోధించుకోవటం వల్ల ఆశాపాశాలు తొలగి కృపాగుణం మిగులుతుంది.

మొదట ఇంట్లోఉన్న చెత్త చెదారం ఊడ్చి, కడిగి, ముగ్గుబెట్టి, దీపం వెలిగించినప్పుడే ఇంటికి అలంకారం వస్తుంది. అదే విధంగా మనలో ఉన్న కామక్రోధాలనే చెత్తను ఊడ్చి, మంచి తలంపులనే నీటితో కడిగి, ప్రేమ అనే ముగ్గుబెట్టి, కృప అనే దీపం వెలిగించాలి.

ఉచ్వాస నిశ్వాసాలు గలవాడు నడిచేవాడు, ప్రాణంతో జీవించేవాడన్ని చెప్పరాదు. ప్రేమతో నిండిన హృదయం గలవాడే నిజంగా ప్రాణంతో జీవించేవాడని చెప్పబడతాడు. ప్రేమ లేనివాడు అస్తిపంజరంపైన తోలు కప్పిన బొమ్మలాంటివాడని చెప్పవచ్చు.

మనలో ఆశఅనే గుణం ఉంది. ఆశ గల గలవాడు స్వార్థంతో నిండిఉంటాడు. తానే బాగుపడాలి. ఇతర్లు చెడిపోవాలి, తనకంటె హెచ్చుగాగాని సమానంగాగాని మరొకరు ఉండకూడదు అనే భావాలతో కూడి ఉంటాడు. ఇటువంటివారిని ఆశ గలవారని అంటారు.

తనకు సంబంధించిన భార్యాబిడ్డలమీద స్నేహితులమీద చూపించు ఇష్టమే ప్రేమగా కొందరు భావిస్తారు. అది తప్పు. భార్యాబిడ్డల మీద చూపించు అనురాగం ఆశ అవుతుంది గాని ప్రేమకాదు.

ఆశ ఉన్నచోట కోపముంటుంది. కోపంవల్ల వివేకం తగ్గిపోతుంది. అనేకములైన గొప్ప

ములుచేరి గొలుసుగా తయారైనట్లు రకరకా లైన ఆశలుచేరి గొలుసువలె మానవుని బంధి స్తూవున్నాయి. ఆశాపాశలను కోసివెయ్యాలని జ్ఞానులు ఆదేశిస్తున్నారు. ఒకేతడవ ఆశా పాశాలను కోసివేయటం చాలకష్టం. గొలుసులో ఒక్కొక్క గొళ్లెమును విడదీసినట్లు క్రమంగా ఒక్కొక్క ఆశను విడిచివేయాలి. ధనాశనువీడి భగవంతుడు ప్రసాదించిన ధనాన్ని కష్టాలపాలైన దీనులకు దానం చెయ్యాలి.

కొంతమంది పత్రికలలో తమను గురించి విశేషంగా పొగడుతూ వ్రాసిన భాగాలను కత్తిరించి భద్రపరిచి అనేకమందికి చూపించి ఆనందిస్తుంటారు. ఎందువల్ల? అది కీర్తిమీద గల ఆశ అని ఊహించవచ్చును. దీనినిగూడ త్రెంచివేయాలి. గట్టి ప్రయత్నంచేసి ఆశాపాశాలను కోసివేసి హృదయంలో ప్రేమను పెంచుకోవాలి.

ఆశచేత కష్టాలు కలుగుతున్నాయి. ఆశను తీసివేస్తే కష్టాలు తీరిపోతున్నాయి. ఫలితాన్ని కోరి తోటి మానవులకు సహాయంచేయటం ఆశ, ఫలితం కోరకుండ ఇతరులకు సహాయం చేయటం ప్రేమ అవుతుంది. భగవంతుని గూడ స్వార్థరహితంగా ప్రేమించాలి. భగవంతునివద్ద ముక్తినిగూడ కోరుకోరాదు.

ప్రేమగలవారే నిజమైన మానవులు. ఆశ గలవారు మానవరూపులు మాత్రమే. వారిలో మానవత్వం ఉండదు. ప్రేమ వృద్ధిపొంది వరదగా ప్రవహించాలి. తరువాత కాయ పండుగా మారినట్లు ప్రేమ కృపగా మారాలి. ప్రేమలోనే కృప ఉంది. ప్రేమకు కృపకు ఉన్న తేడా ఏమిటి? ప్రేమ తనతో సంబంధం గలవారిని స్వార్థరహితంగా ప్రేమిస్తుంది. కృప తనకు సంబంధం లేనివారినిగూడ కరుణిస్తుంది. ఏడుస్తున్న బిడ్డకు తల్లి పాలిస్తుంది. అది ప్రేమ. వీధిలో ఏడుస్తున్న బిడ్డ నెత్తుకొని పాలు పడ్డు ఇవ్వటం కృప. తనకు సంబంధం గలవారికి ప్రతిఫలం ఆశించకుండ చేసిన సహాయం ప్రేమ అని చెప్పబడుతుంది. వీధిలో కూడు గుడ్డ లేకుండ తపించేవానికి, వాడు కోరకముందే కూడు గుడ్డ ఇవ్వటమే తన విధిగా భావించి ఉపకారంచేయడం కృప అని చెప్పబడుతుంది. కృపగలవారు దైవస్వరూపులుగా నిల్చి లోకకల్యాణం చేస్తుంటారు.

ఇతరులమీద కృప చూపించేవారు భగవంతుని దర్శిస్తారు. వారికి లోకమంతా దైవస్వరూపంగా కనుపిస్తుంది. వీడొక బీదవాడు, వీడికి సహాయంచేయటం తన విధి అని తలచి చేసే సహాయంకంటె, ఆ బీదవాని హృదయంలో భగవంతుడున్నాడు ఆ బీదవాని శరీరమే దేవాలయం వానికి సహాయంచేసే దేవుడ్ని ఆరాధించినట్లే అను తలంపుతో చేసిన సహాయం కోటిరెట్లు పుణ్యాన్ని ఇస్తుంది. మనం ఉపకారం చేశామన్న తలంపే ఉండదు. వాడు తక్కువవాడు మనం గొప్పవాళ్లం అన్న భావనకు తావే ఉండదు. భగవంతుని సేవించామన్న భావమే నిలుస్తుంది.

కృపాస్వభావం లేనివారు లోకంలో అనేక కష్టాలకు లోనౌతారు. మరణంతో మన జీవితం ముగిసిపోతుందని అనుకోకూడదు. రైలు బండి దిగగానే మన ప్రయాణం ముగిసిపోతుందా? ఆవిధంగానే జీవుడు స్థూలదేహం విడిచి సూక్ష్మదేహంతో వేరొక దేహంలో ప్రవేశించి తాను చేసిన పాపపుణ్యఫలితంగా కష్టసుఖాలు అనుభవిస్తాడు.

# మురళీనాదం నేటికి వినిపిస్తూనేఉంది

(దిలీప్‌కుమార్‌రాయ్ లేఖా రచనకు అనువాదం)

కామఋషి సత్యనారాయణవర్మ

ఈ వ్యాసంలోని ప్రధానవ్యక్తి ఇందిరాదేవి, ప్రపంచ ప్రఖ్యాత రచయిత – కళాకారుడు – సంగీతసాధకుడు అయిన దిలీప్‌కుమార్‌రాయి రాలు. ఈమె కృపారామ్ జౌహర్ అనే కోటీశ్వరుని కుమార్తె. నాగరిక ప్రపంచంలో గృహస్తజీవనం గడిపి ఉన్నతస్థాయి నందుకొన్నది. అనంతరం గృహస్తజీవనం విడిచి సాధు సంకీర్తలలో పాల్గొని దిలీప్‌కుమార్‌రాయిని గురువుగా స్వీకరించింది. 1949 లో ఈ గురుశిష్య బాంధవ్యానికి శ్రీ అరవిందో ఆశీస్సులు లభించాయి. సాధనలో ఆమెకు కొన్ని దృశ్యాలు గోచరం కావట మారంభించింది. 1950 ఆగష్టు 19 న ముస్సోరీలో మేవాడురాణి మీరా దర్శనం లభించిం దీమెకు. సవికల్ప సమాధిస్థితినుండి విన్న పాటలు మరల తన బృదానికి వినిపించి వ్రాయించేది. 1. స్తుతాంజలి 2. ప్రేమాంజలి 3. సుధాంజలి 4. దీపాంజలి – అనే పేర్లతో 610 పాటలు 5 భాగాలుగా దిలీప్‌కుమార్ రాయి అనువాదాలతో ప్రకటింపబడ్డాయి. శ్రీ అరవిందులు ఇట్టివి అసంభవం కాదు – ఆమె (మీరా) ఇందిరద్వారా మన లోకంలో శ్రీకృష్ణునితో అనుబంధించిఉంది – Occult Plane లో ఇటువంటి సంఘటనలు జరుగుతుంటాయని – మీరా చైతన్యం – ఇందిర భావసమాధిలో కలసినప్పుడు జరిగిందని వ్యాఖ్యానించారు. దిలీప్‌కుమార్‌రాయి ఆయన ప్రియశిష్యురాలు ఇందిర పూనాలో హరేకృష్ణమందిరం నిర్మించి నేటికి సంకీర్తనలతో ప్రబోధలు చేస్తున్నారు.

'The flute calls still' అనే శ్రీ దిలీప్‌కుమార్ రాయిగారి గ్రంథంలో ఒక ఘట్టంయొక్క అనువాదమే ఈ వ్యాసం – గ్రంథకర్తలకు కృతజ్ఞతతో – అనువాదకుడు.

ప్రియమైన డేవిడ్ !

నిన్న సాయంకాలం మా హరేకృష్ణ మందిరంలో ఇందిర తనభావ సమాధిలో చెప్పిన సందేశం మీకు అందజేస్తున్నాను. ముందుగా మీకు ఒక విషయం వివరించాలి. నా జన్మదినం సమీపిస్తున్నకొలది ఈశ్వరాను గ్రహలీల ఈమెద్వారా ఇతోధికంగా ప్రకటన మౌతూంటుంది. ఒకప్పుడు నూతనగేయాలు చెప్పి వ్రాయించడం – ఒకప్పుడు మైమరచిన నృత్యం – మరొకప్పు డేవో దృశ్యాలు – గుడ్ ఫ్రైడేనాడు సిలువను మోస్తున్న క్రీస్తు – ఆయన పునరుత్థానము ఆమెకు దృగ్గోచరమైంది. ఇటువంటి దృశ్యాలు చాల ముఖ్యమైనవిగా భావిస్తాను. ఎందుకంటె అవి ప్రదర్శించే అద్భుతంకంటె, వీటివలన ఉపశమనం పొందే అనేకమంది భక్తులకొరకు దైవలీలలు ఈ విధంగా ప్రకటనమౌతాయని దృఢంగా నమ్ముతాను గనుక. ఇందిర, కృష్ణుడు నాతో నాట్యం చేసేడని చెప్పింది. ప్రభువామెను

స్పృశించినపుడల్లా ఆమె శరీరం సుగంధంతో పరిమళిస్తూంటుంది. చేతులు, పాదాలు, శరీరం అంతా కస్తురివాసనలు గుబాళిస్తాయి. ఆమెను తాకినవారికి కూడా పరిమళాలు వెదజల్లబడుతున్నాయి. ఇలాగు మందిరంలో అనేకసార్లు భక్తుల ఎదుట జరిగింది.

ఇందిరనోట పలికించిన ఈ అందమైన పాట మేము అనువాదం చేస్తున్నాము. ఆ సమయంలో పెద్ద వయస్సులోనున్న ఒక పంజాబీ స్త్రీ వచ్చింది. ఆమె కుమారుడు విమాన ప్రమాదంలో మరణించాడు. అప్పుడు మేమందరం జైల్లాం వెళ్లి ఆమెను ఓదార్చి వచ్చాము, ఆమె భర్త కోరికపై. ఆమె దుఃఖం నేటికి ఉపశమించలేదు. ఇందిర ఆమె ఓదార్పునకై ఒక పాట పాడమని కోరింది. మా మందిరంలోనే అందరం కలిసి సంకీర్తనం చేసేము. మా సంకీర్తన జరుగుతూండగానే ఇందిర భావసమాధిలో లీనమైంది. మా పాట పూర్తికాగానే అలవాటుగా చేస్తున్న శ్రీకాంత్‌కు మారుగా ఆమె తటాలున లేచి ప్రభువు విగ్రహం దగ్గరగావెళ్లి హారతి ఇచ్చింది. ఆమె ఇటువంటి చర్యలు ఏదో విలాసార్థం చేయదని నాకు తెలుసు గనుక ఆశ్చర్యపడలేదు. ఒక అజ్ఞాతహస్తం ఆమెను స్పృశించినపుడల్లా ఆమె అనుకోని పనికి పూనుకుంటుంది. బాహ్యస్మృతి రహితమైనస్థితిలో ఆమె హారతి పూర్తి అయ్యేవరకు వేచిఉన్నాను. హారతి పూర్తికాగానే రమ్మని పిలిచి నా దగ్గరగా ఉన్న వేదికపై కూర్చుండ నియమించి 'ఏం జరిగిందమ్మా' అని ప్రశ్నించాను.

... కన్నీటిపొంగులతో, అర్ధ భావోన్మత్తతో నాకు జవాబు చెప్పజాలక నన్ను తేరిపార జూచింది. పుత్రవియోగంతో బాధపడుతున్న ఆ స్త్రీతోపాటుగా హరేకృష్ణ మందిర భక్త బృందంఅంతా ఆసీనులైఉన్నారు. అంతా నిశ్శబ్దంగా ఉన్నది. హటాత్తుగా తేరుకొని ఇందిర నా దగ్గరకు వచ్చింది - నాకేసి తేరిపార జూచింది. మధ్య మధ్య ఆగుతూ ఒక రకమైన యాసతో ఇలా మాట్లాడింది.

"దాదా! మీకు తెలుసా? ప్రభువును అడిగేను. నిజమే, ఆయనఎదుట నిలువబడి ఆ ప్రభువునే అడిగేను - ఈ ప్రపంచంలో ఇన్ని బాధలు, కష్టాలు ఎందుకుండాలి అని - దీనికి మీరేమీ ఉపశాంతి చేయలేరా? అన్నాను. కన్నీటిలో • మందహాసరేఖలు గోచరిస్తూండగా క్షణం ఊరుకొని మళ్లా అందుకుంది - "పుస్తకాలలో మాటలతోటి, వాటి వ్యాఖ్యానాలతోటి ఆశ్చర్యకరమైన - యుక్తియుక్తమైన జవాబు నాకు వద్దు - ఎందుకంటె ఇతరులు బాధపడుతున్నపుడు వారిని చూస్తే నా గుండెలలో పోటుతో బాధ పడతాను. మన అజ్ఞానంచేత, మన దోషాలవల్ల మనకు బాధలు కలుగుతాయని మన పెద్దలు, పండితులు చెపుతుంటారు. కాని భగవాన్! నీవు మా అందరను కనిపెట్టిఉండగా మేము అజ్ఞానంలో ఎందుకు మునిగిఉండాలి? దుష్కార్యాలలో నిమగ్నమయ్యే బాధ ఎందుకు నీవు కల్పించాలి? తనబిడ్డలు గొప్ప ఆపదలో పడుతున్నప్పుడు వారిమీద ప్రేమగల ఏ తల్లి అయినా వారిని నివారించి సరిదిద్దకుండా ఉదాసీనంగా ఉండగలదా? హఠాత్తుగా నేత్రాలు అశ్రుబిందువులతో నిండుకొనిఉండగా ఇంకా అంటూంది -" ప్రభువును ఇలా ఇడిగేను - నిప్పును జాగ్రత్తగా అంటించకపోతే నీ వళ్లు కాలిపోతుందని ప్రేమగల తల్లి బిడ్డలకు బోధించదా? ఈ విధంగా ప్రభువును అడిగేను

దాదా అని - దీపకాంతిలో ఆమె నేత్రాలు ప్రకాశిస్తుండగా అంది.

"నాకు చాలా ఆసక్తిగా ఉందమ్మా! చెప్పు - ప్రభువు నీకు ఏమని జవాబిచ్చారు?

ఆమె నేత్రాలు నన్నూ మైమరపించాయి. ఆమె ఇలా అన్నది.

"ప్రభువిలా జవాబిచ్చారు - ప్రేమతో నన్నాశ్రయించినవారిని ఎలా ఆదరిస్తానో, నా బిడ్డలమని ఎవరు నన్ను భావిస్తారో వారిని నేను అనుసరించి ఉంటాను. అని -

ప్రభువు జవాబు నాకు తృప్తికరంగా లేదు. సందిగ్ధంగా ఉంది. ఎందుకంటె, బాధోపశమనానికి మార్గ మున్నదని తెలుస్తె తప్ప బాధ బాధగానే అనుభవించాల్సి వస్తుంది. భగవాన్ బుద్ధదేవుడు సంపూర్ణ దుఃఖనివృత్తిని ప్రధాన కర్తవ్యంగా అన్వేషించాడుగదా!

ఇందిర నెమ్మదిగా తలపంకించి "బుద్ధభగవానుడు ఆ దుఃఖనివృత్తి కోరిఉండవచ్చు. అందరు సాధుపుంగవులు ప్రవక్తలు దాని నెంత మాత్రం కోరలేదు. గురునానక్, శ్రీ చైతన్య మీరా, తులసీదాస్, దాదూ, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ రమణమహర్షి ఇంకా ఎందరో భక్తులు ప్రేమ, శరణాగతినే కోరేరు" అంది.

మరల నేను - వారందరూ బాధలు నివారణ కావాలని కోరలేదా? అన్నాను.

ఆమె ఇలా అంది - నిజమేనా దాదా! నాకాశ్చర్యంగా ఉంది - రాత్రింబగళ్లు ఈ గుండె ఉబ్బసంతో, కీళ్ళనొప్పులతో, నిద్ర లేకుండా బాధపడుతూ, మధ్య మధ్య రక్తవమనంతో, తీవ్రమైన గుండెపోటుతో బాధ పడుతున్నాను నేను. ఓ ప్రభూ! నాకీ బాధ నివారణ చేయమని ఏల ప్రార్థింపలేకపోయాను? నా కొరకు గాని ఇతరుల కొరకుగాని అలా ప్రార్థించాలని ఉండదు. ఎంత బాధలోనైనా సరే నేను కోరేది ఒక్కటే - ఓ ప్రభూ! ఎన్నో ఇతర బాధలతోపాటుగా దీనిని భరింప జేస్తున్నావు గనుక నాకట్టి భరించేశక్తి ననుగ్రహించమంటాను. అంతే దాదా! బాధలు పడుతున్న స్నేహితులు కొందరువచ్చి ఎప్పుడైనా నా సహాయం అర్థించగా వారికొరకు ప్రార్థింప ప్రయత్నించాను.

బాధలోనున్న నా తండ్రి కెప్టెన్ కృపారామ్‌కొరకు ప్రార్థనలో ఒకనాడు కూర్చున్నాను - కాని నేను ప్రార్థనలో కూర్చున్న వెంటనే నాకు నవ్వు వచ్చింది - "నీ వెంత తెలివిమాలినదానివమ్మా! ఆయన కుమార్తెవైన నీ కంటె వేయిరెట్లుగా భగవాన్ మీ తండ్రిని ప్రేమించి ఆయన బాధను అనుభవింపజేయటంలేదా! బాధాగ్నిలో తప్తం కావడానికే ఆయన బాధల ననుగ్రహిస్తారు. భగవంతుడు మన పద్ధతుల ననుసరించడు. అని నేను గ్రహించాను దాదా! ఆయన బాధలనిచ్చినప్పుడు వాటిని భరించే శక్తినికూడా ఇస్తాడు. ఆ బాధాగ్ని ద్వారా మనో మాలిన్యం క్షాళనం కావాలని ఆయన అలా చేస్తాడు.

సందేహంతో నేనిలా అన్నాను - "శ్రీ కృష్ణానుగ్రహం పొందినదానివి గనుక నీవా శక్తి కలిగిఉన్నావు - లోకులందరు నీ వలె బాధలను అంత సహనంతో అనుభవించ గలరా? ఈ క్రూరమైన భౌతిక బాధాగ్ని జ్వాలలో వారు నిజంగా క్షాళనం పొందగలుగుతున్నారా? లేకపోతే అంతకంటె దుఃఖకరమైన విషయం ఉంటుందా? అన్నాను.

ఆమె ఇలా జవాబిచ్చింది - "ఈ ప్రపంచంలో ఈ బాధలేమీ లేకపోతే వారంతా

సుఖంగా ఉండగలరని మీరు భావిస్తున్నారా? ఏమైనప్పటికి బాధలు కష్టాలు, యాతనలు, త్యాగం, గుణపాఠాలు లేనిదే జీవిత పరిణామం ఉండదు. [illegible] తంలో కష్టాల నివారణకు ప్రాయశ్చిత్తం [illegible] ప్రబోధించుటలో నేనెంత [illegible] తెనుసు - అధికారం [illegible]

గురు మహారాజ [illegible] స్తున్న ఒక గురువు బిడ్డనని మాత్రం [illegible] తెలుసు - నను చేయ గల ప్రార్థన [illegible] టి - కళ్యాణస్వరూపుడైన [illegible] కలాలు [illegible] లు న ఆ రూప [illegible] మాటను [illegible] లమైన స్ఫూర్తిగా మారాలి - ఆయన సంకల్పానికి సంపూర్ణ [illegible] లొంగి వర్తించునట్లు నన్ను చేయమనిమాత్రం ప్రార్థించగలను. అంతే.

ప్రభువు సంకేతం బోధపడింది, కాని నిస్సహాయస్థితిలో బిడ్డ తల్లిపై ఆధారపడినట్లు, సర్వ సమర్పణ నీవంటి పుణ్యాత్ములకే కొందరికోగాని లభ్యం కాదుగా! సహాయాలను, సందేశాలను మీవంటివారంపై ఆధారపడిన తక్కిన సామాన్య ప్రజా బాహుళ్యంమాట ఏమిటన్నాను.

మార్మిక మందహాసం ఆమె పెదవులపై చిందు లాడుతూండగా నన్నభినందించింది. ముక్తకంఠంతో ఇలా అంది - నేను అడిగేను దాదా! ప్రభువును అడిగేను - "మీ వంటివారి ద్వారా సహాయం అందిస్తున్నా నన్నారు - అంతే. తరువాత మళ్లీ ప్రశ్నించలేదు. ఇది భగవానుని మాటలుగా ఇందిర చెప్పిన విషయం - నా కుమార్తెగా నా శిష్యురాలిగా ఒకానొక దివ్యపరిణామం చెందిన పవిత్రాత్మ చిరస్మరణీయమైన స్మృతులను ఒక ముగుము వుగా వివరించాను. శ్రీ రమణమహర్షి ఒకా నొక పాశ్చాత్యునకు చెప్పిన మాటలతో ఇది ముగిస్తాను.

"ఈ ప్రపంచనాటక సూత్రధారి ఎవరో [illegible] నీ తెలివైన రోగ నిదానంతో ప్రపంచ బాధలకు చికిత్స చేసి అన్నిటిని [illegible] లో ఉంచగలనని నీవు అనుకుంటున్నావు. నేర్పుగా లోపల పోతానంటావు - వ్యక్తిగత సమస్యల పరిష్కారం చేసికో జాలనివాడవు ప్రపంచసమస్యల పరిష్కరిస్తా నంటావు - నీ ఆత్మ అంటె తెలియనివాడవు మానవజాతిగురించి మాట్లాడతావు. ప్రపంచం, పరిమితశక్తిగల మనస్సుతో పరిశోధింప నలవి కానంత గొప్పది. నీ శక్తికి అతీతంగా ఉన్న దానిని పరిశీలించి బోయేముందు నీ వెవ్వరవో తెలుసుకో. ఈ సందర్భంలో నేనొకటి చెపు తాను. నీవు అంటె ఎవరవో, ఏమిటో ముందుగా తెలుసుకుంటె ప్రపంచమంటే ఏమిటో ఇపుడు నీకు తెలిసినదానికంటె ఎక్కువ గ్రహించగలవు - నిస్సహాయంగాఉన్న నీ ఆత్మను నీవుద్ధరించుకో లేనివాడవు ఇతరులకు సహాయం చేయగలనన్న పేరాస ఎందుకు? నీవే నేనైతే నా వ్యక్తిగత సమస్యలను ముందు పరిష్కరించుకొంటాను. ఎందుకంటె అప్పుడు మనం క్లిష్ట ప్రపంచ సమస్యలను పరిష్కరించ గల గుప్త ఔషధంతో మానవాళికి సహాయం చేయగల మంచి అవకాశాలు ఎక్కువగా ఉంటాయి గనుక. ఈ మహర్షి మాటలలో ఆత్మదర్శనం - ఆత్మజ్ఞానం అనేవి ఈ నాడు అత్యావసరంగా గ్రహించదగిన విషయాలు. జీవితం-ప్రపంచ సమస్యలు, బాధలు-మానవ లక్ష్యం - వీటి మర్మం అంతా దానిలోనే ఉంది.

# కోరికల్ని చంపేయాలా?

## పూర్ణానంద్

'మన కష్టాలన్నిటికీ కోరికలే కారణం. కోరికలే లేకపోతే కష్టాలే వుండవు. ఏ కోరికా లేని నిశ్చలస్థితే నిర్వాణముంటేను' అని గౌతమ బుద్ధుని బోధ. 'ప్రతిఫలాపేక్ష లేకుండా కర్మలు చెయ్యి. అదే దారి మోక్షానికి' అని శ్రీకృష్ణుని బోధ. 'ఆరు శత్రువులనుబట్టి హతము చేయమని మన భక్తి కీర్తనలబోధ. ఎటు చెవియొగ్గినా 'కోరికలు చంపేయి. అవి నీ దారికి అడ్డు' అనే వినబడుతోంది ముక్తి పథికుడికి.

కోరికల్ని చంపేయాలా? ఇది సంభవమా? శైశవంలో తొట్టిలో పడుకుని రంగురంగుల గాజుబుడ్లు తాకడానికి చేతులాడించే తొలి ముహూర్తంనించీ కోరికే ముందుకి నడిపిస్తోంది మన్నందర్నీ. కోరికవల్లనే 'రేపు'కి విలువ ఏర్పడుతోంది మన జీవితాల్లో. కోరికే లేకపోతే భవిష్యత్తును గురించిన ఆలోచనే పుట్టదు. ఏ కోరికా లేనివాడికి బ్రతుకుకూడా బరువే అవుతుంది. ఏదో ఆశ ముందుకి లాగుతూంటేనే మానవుడు శైశవంనుంచి వృద్ధాప్యంవరకూ నడిచిపోతాడు.

కోరికలు చచ్చిపోడమంటూ ఉండదంటాడు ఫ్రాయిడ్. కోరికలు మనకి జాగ్రదవస్థలో కలుగుతాయి. తీర్చుకోగలిగినవారు ఆ కోరికల్ని సవ్యంగా తీర్చుకుంటారు. ధనాభావం వల్లనైతేనేం, శక్తిలేకపోవడం వల్లనైతేనేం కోరికలు తీర్చుకోలేనివారు పెక్కురుంటారు. వీరిలో కొందరు సమాధానపడిపోయి కోరికలు వదిలేసుకుంటారు. అంటే వారికోరికలు చచ్చిపోతాయనికాదు. వారి కోరికలకంటె మన స్సమాధానం బలమైనదై 'అవి నీకు అందవు. ఎందుకీ వ్యర్థమనోరథము?' అని బోధ పరుస్తుంది. 'అది దొరకదు. దానివంటిదే ఇది. దీనితో తృప్తిపడు' అని మరొకటి—ఈ వ్యక్తికి దొరికేదాన్ని - చూపిస్తుంది. అసలుకోరిక ఈ రెండో ఉపలబ్ధివల్ల సంతోషపడుతుంది. ఒక బాలుడు 'డాక్టరుగారికి మోటారుకారున్నది. నాకూ కావాలి' అని పేచీ రాగాలు పెట్టాడు. వెంటనే వాని తండ్రి షాపుకి వెళ్ళి 'కీ' యిస్తే పరిగెత్తే మోటారుకొని తెచ్చినాడు. సరి బాలుడు ఏమనుకున్నాడో, కారులో ఊరేగినాడు డాక్టరుగారివలెనే. కోరికలు ఈరీతిగా తీర్చుకుంటారు కొందరు.

మరికొందరు తమకి అందనివస్తువుని పాడుచేసి తృప్తిపడుతారు. బాలుడు ఒకరి ఆట వస్తువును విరిచి, చింపి, ముద్దలుచేయడము ఈ రకంలోకి వస్తుంది. ఆ వస్తువే లేనప్పుడు ఆ కోరిక సన్నగిల్లుతుంది. ఇది రాక్షసతృప్తి.

కొందరు కలల్లో తమకోరికలు తీర్చుకుంటారు. జాగ్రదవస్థలో తీరక నిలిచివున్న కోరికలు కలల్లో కనిపిస్తాయి. [illegible]ల్లో బంగారు కొండలూ, జేబులో రూపాయల దొంతరలూ కలల్లో చాలామందికి కనబడతాయి. ఇది ఒకవిధమైన తృప్తి. స్వప్నంగా జరిగినట్టే వుంటాయి కనక కోరిన అనుభవానికి చెందిన గగుర్పాటూ, కంపమూ, భయమూ, [illegible]దులు తప్పకుండా వుంటాయి.

సంఘమూ, లేకుంటే కలమూ, ఆశ్రమమూ, ఇతర కట్టుబాట్లూ - మానవులు కల్పించుకున్నవి - అడ్డు వచ్చినప్పుడు, కోరికల నెత్తిమీద బలమైన పాదం పడుతుంది. మనస్సులోని పాతాళానికి చేరుకుంటాయి కోరికలు. ఫ్రాయిడ్ వివరణ ఇక్కడే అద్భుతంగా వుంటుంది. మన

స్సుకి జాగ్రత, ఉపజాగ్రత, అజాగ్రత అని మూడంతస్థు లున్నాయంటాడు ఫ్రాయిడ్. మొదటి రెండు అంతస్థులూ పైన వివరించాము. మూడోది అజాగ్రదంతస్థు. మనం తొక్కేసిన బలమైన కోరికలు ఈ అంతస్థులో చేరుకుంటూ యిట. ఇవి జాగ్రదవస్థలోకి విక్రమించ కుండా సంఘ నియమాలు (ఉదాహరణకి సంఘ నియమాలందామా) తొక్కిపెట్టి వీటిమీద మర్యాదవర్తనమనే దూది కప్పిపెట్టు, నటన అనే నాపరాళ్లు పేర్చి చప్టాచేస్తాయను కొండి ఒక 'విరాగి' కి. ఈ కోరిక, తానున్న పాతాళంలో చచ్చిపోదు అంటాడు 'ఫ్రాయిడ్'. రగులుకుని రగులుకొని, ఆ మర్యాదాదూదిని భస్మీపటలంచేసి, ఆ వ్యక్తి కాలికింద సొరంగం చేస్తుందట. తిరిగి అనుకూలపరిస్థితులువస్తే ఆ కోరిక విజృంభించి నాపరాళ్ళచప్టా కూలిపోయి ఈ మనిషి 'అధఃపాతాళానికి పడిపోతాడు అంటాడు ఫ్రాయిడ్. సౌభరిముని కథే దీనికి మంచి తార్కాణము.

అనుకూలపరిస్థితులే రానక్కరలేదు. మనస్సు బలహీనమైనా చాలు. కృత్రిమంగా తొక్కిపెట్టిన కోరికలు మనస్సుని స్వాధీనంచేసుకుని సాంఘిక ప్రతిబంధకాలకి జడిసి నోరు మూసుకుని ఊరుకున్న మనస్సుమీద ఎక్కి తొక్కితే, ఆ మనస్సు విరిగి శకలాలై పోతుంది.

ఫ్రాయిడ్ వ్రాతలు ఊహా కవిత్వంకాదు. ఎన్నో విపరీత ప్రవర్తనాలు, చిత్తవృత్తులూ, పరిశీలించి, వాటి కారణాల్ని ఆ వ్యక్తుల భూత కాలపు అనుభవాలూ, కోరికలూబట్టి నిర్ణయించాడు అతను. మన అనుభవాల్నీ, మనమెరిగిన విపరీత వ్యక్తుల అనుభవాల్నీపట్టి చూసుకుంటే ఫ్రాయిడ్ వివరణతో సరిపోతాయి. అంటే మొత్తానికి తేలే సంగతి: కోరికలు చంపలేము' అని.

'అయితే మోక్షమార్గము మాటో? ముక్తి పథికుల తోవలో కోరికలు రాళ్లుకాదా?' అంటే అవును. అయితే గత్యంతరములేదా? గత్యంతరము ఒకటే కనపడుతోంది. 'ఏమిటది?' 'కోరికలు అన్నింటినీ సమాధాన మార్గంగా, లేదా వీలయితే అనుభవమార్గంగా తీర్చుకుంటూ చెల్లబెట్టి, బలమైన కోరికని మిగల్చండి. అప్పుడు ఈకోరికని తరమండి. అదే తీసుకుపోతుంది ముక్తికి. ఈ కోరిక ఏదైనా సరే. అదే రాచబాట ముక్తికి. కోరికల్ని ఎవరూ చంపలేరు. ఏదోలాగ సమాధాన పరచాలి. అలాచేసుకుంటూవస్తే చివ్వరికి బలమైన కోరిక మిగుల్తుంది. వెనకతీయ్యొద్దు. తరమండి ఈ కోరికనే. జంకవద్దు దేనికీ. మీరు నడిచే దారి రాచబాటే అవుతుంది. మీ పాదాలక్రింద భూదేవి పద్మాలమరుస్తుంది.

మనోరథం సాధించడంలో కోరికలుచేసే అల్లరికి ఇంతకంటే చక్కని ఉదాహరణం దొరకదు. కోరికలు చావవు. కాని సమాధాన పడగలవు. కనక తరమండి ఒక బలమైన కోరికని, 'నీ కోరిక ఏమిటి' అని పురాణాల్లోని బ్రహ్మదేవుడొచ్చి అడిగితే ఏంచెప్తారో ఆ కోరికని వెంటాడండి. ఈ ఎంచుకోడంలో మిమ్మల్ని మీరు వంచించుకుంటే నానాపాట్లూ పడతారు. మీరు తరిమేది నిజమైన కోరికే అయితే, దారిలో ముళ్లు గుచ్చుకున్నా రాలిపోతాయి వాటంతటవి. లోకులు విసిరే రాళ్లు మీకు నొవ్వవు. వారి నిందా వాక్యాలు మీ చెవిని పడవు. స్వర్గధామం అడుగులు వేసుకుంటూ మీ దగ్గిరకి వస్తుంది చివ్వరికి.

# గ్రంథ పరిచయము

## భగవత్సన్నిధికి వేయి మెట్లు

గ్రంథకర్త బులుసు వేంకటేశ్వర్లు,
పేజీలు: 38, వెల: రు. 10.00.
ప్రతులకు: బులుసు వెంకటేశ్వర్లు,
2/8.10.22, కమలాదేవి వీధి
గాంధీనగరం, కాకినాడ—4.

శ్రీ వెంకటేశ్వర్లుగారు తెలుగు సాహిత్యమందును వేదాంతమందును గొప్ప పాండిత్యముగలవారు. ఆధ్యాత్మికసాధనలో ఆరితేరిన మహాపురుషుల జీవితచరిత్రలు, వేదాంత రచనలు ఎన్నో ఆంధ్రులకు అందించియున్నారు. వీరిని గ్రంథకర్తగాను, వేదాంతోపన్యాసకులుగాను ఆంధ్రదేశము గుర్తించి ఘనముగా సన్మానించియున్నది. వీరి "భగవత్సన్నిధికి వేయి మెట్లు" అను గ్రంథమును పఠించిన పాఠకులు మానవత్వములో దైవత్వమును గాంతురనుటకు సందియము లేదు. నాస్తికవాదము ప్రబలముగానున్న ఈ కాలమున ధైర్య స్థైర్యములతో ఈ మహా గ్రంథమును రచించి ప్రకటించుట వారికిగల ఆర్య సంప్రదాయాభిమానము వెల్లడి చేయుచున్నది. మృదు మధురశైలిలో, మానవులు జనన మరణ పరంపరలనుండి తప్పించుకొని భగవంతుని జేరు అనేక సులభోపాయములను అందించియున్నారు. ఆ బాలగోపాలం ఈ గ్రంథమును చదివి మేలును పొందగలరని ఆశించుచున్నాము.

## తెలుగువారెవ్వరు (పరిశోధకవ్యాసము)

రచయిత: వేదము వెంకటరాయశాస్త్రి,
పేజీలు: 56, వెల: రు. 2-50,
ప్రతులకు:
వేదం వెంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,
4-మల్లికేశ్వరస్వామి గుడి సందు, లింగిచెట్టివీధి,
మదరాస్ - 1.

ఆంధ్రులే తెలుగువారు. తెలుగువారే ఆంధ్రులు అనుటలో సందేహము లేదు. కాని ఆంధ్రులు, తెలుగువారు అను రెండు పేర్లెందుకు? తెలుగుభాషయా? తెనుగుభాషయా? అను విషయములు బాగుగా పరిశోధించి, శాసనములు, చరిత్రలు, చరిత్రకారులు వ్రాసిన గ్రంథములు, కావ్యములు, మొదలగువాని ఆధారములతో ఈ గ్రంథకర్త చక్కగా నిరూపించినారు. తెలుగువారిని గురించి తెలుసుకొనుటకు ఈ గ్రంథము చాలా ఉపయోగపడును. ప్రతి ఆంధ్రుడు చదువతగిన గ్రంథము.

## వివేకవర్ధని

రచయిత:
చీమలకొండ ఉమా రామలింగమూర్తి,
పేజీలు: 230, మూల్యము: రూ. 4,
ప్రతులకు: న్యూ స్టూడెంటు బుక్ సెంటర్,
ఏలూరురోడు, విజయవాడ 2.

గ్రంథకర్త ఈ గ్రంథమందు ఆధ్యాత్మిక విషయాలను హేతువాదంతో నిరూపించుటలో కృతకృత్యులైనారని చెప్పవచ్చును. తాను చెప్పదలుచుకున్న విషయములను విపులముగా సులభశైలిలో 33 వ్యాసములుగా వ్రాసియున్నారు. మానవులు వారివారి వృత్తిధర్మాలను ఆచరించు విధానం చక్కగా గ్రంథకర్త నిరూపించారు. హేతువాదంమీద అభిమానం జూపుచున్న నేటియువకులకు గ్రంథకర్త దేవుడు, మతం, మానవునికర్తవ్యం, జీవనమార్గాలను ఇందు చక్కగాచర్చించారు. ఈ గ్రంథం చదివినవారికి దైవచింతన, ఆధ్యాత్మికదృష్టి, నైతిక విలువలయొక్క గొప్పతనం చక్కగా అర్థమవుతుంది. పిల్లలు పెద్దలు చదువుటకు వీలుగా చక్కని భాషలో వ్రాయబడినది. ఈలాంటి రచనలు విరివిగా ఆంధ్రదేశానికి గ్రంథకర్తగారు అందించగలరని నమ్ముచున్నాము. —చిర్రావూరు వెంకటరావు.

# నవయుగ పురుషా!

భువనగిరి లక్ష్మీకాంతమ్మ

శ్రీ రమ్యంబగు జగమునకు, కారుణ్యామృతముగురిసి - కాపాడుటకై
శ్రీరామకృష్ణ సంజ్ఞను, నారాయణ! పుట్టితివె - నవయుగపురుషా!

చాటర్జివంశఘన వన - వాటి ఖుదీరాముడనెడి - నరభూజమునన్
మేటిసుమమ నీ నామము - నాటెడుమది రామకృష్ణ - నవయుగపురుషా!

వందిత బుధయును పూర్ణిమ - చందురు మోమునందమలరు - చంద్రామణికిన్
సుందర మనోహరాకృతి - నందనుడై పుట్టినావు - నవయుగపురుషా!

ధనియెంత ధన్యజీవియొ ; జననసమయమునను నీదు - చక్కట నిలిచెన్
గనె నీ సుందరతనువున్ - తనివి, ననగ రామకృష్ణ - నవయుగపురుషా!

ఆటలలో పాటలలో - నాటకముల చిత్రలేఖ - నంబులలోనన్
సాటిగలరె ; నీకు జగన్నాటక సూత్రకుడవీవు - నవయుగపురుషా!

అర్భకుడవయ్యు పండిత, దుర్భరమగు శాస్త్రచర్చ - ద్రుంపగ సభలో
నిర్భయముగ దెల్పితి సం, దర్భముగల వాక్యమొకటి - నవయుగపురుషా!

నల్లనగు నాకసంబున - తెల్లనికొంగలును బారు - తీరిచిపోవన్
ఉల్లము విద్యావస్థన్ - దల్లడిలెను బాల్యముననె - నవయుగపురుషా!

శ్రీరామణీయకము, రాణీరాస్మణి సృష్టి దక్షిణేశ్వరమును నీ
కారాధ్యమైన దచ్చట - నారాయణిసేవ యబ్బె - నవయుగపురుషా!

"అమ్మా," యని పసిబిడ్డవి - ధమ్మన పిలిచియును జీవితము నామెకు
సర్వమ్మర్పణజేసితి నీ - నమ్మకమది యేమి; దేవ - నవయుగపురుషా!

అమ్మ యనుమతింపక నీ - సమ్మతి నెరిగింప పెట్టి సమయమ్ముల -
కీల్ - బొమ్మవె యమ్మకరమ్మున - నమ్మకమది యేమి; దేవ - నవయుగపురుషా!

"ఇమ్మహి వెలసిన సర్వము - తమ్ముల కాధారభూత, తల్లియ" యని,
నిత్యమ్ముపదేశింతువు నీ - నమ్మకమది యేమి, దేవ - నవయుగపురుషా!

'మాతయ' సృష్టిస్థితిలయ - హేతువు బంధములబాపి - యిరవునజేర్పన్
నేతయ' యని నమ్మితి తన్మాతను శ్రీ రామకృష్ణ - నవయుగపురుషా!

'దేవిని దర్శింపనిచో - జీవితమది యేల', ననుచు - చెచ్చెరనీవా
దేవి కరవాలమును గొని - నావు శరీరమ్ము విడువ - నవయుగపురుషా!

అంతట తేజఃపుంజము - లంతంతన నాక్రమింప - నవశుడవై, యా
శాంతి తరంగములందు ననంతాకృతి కాంచినావు - నవయుగపురుషా!

## నవయుగ పురుషా!

రాతిరి పగలనక, సదా – ప్రీతిగ పన్నెండు వత్సరంబుల కృషిలో,
చైతన్యాకృతిని జగ – న్మాతను దర్శించినావు – నవయుగపురుషా!

సాధనలన్నియు సత్యము లే దేవుని కనుంగొనుచు – లీలాచరణన్,
సాధనఁజూపితివి జగ – న్నాథుండ వీ వగుట కాదె – నవయుగపురుషా!

చేరి నిను మాతసోదరు – లారోగ్యముఁగురిచి మిగుల – నాందోళపడన్
శారద యను కన్యకనుం – దారగ్రహియించినావు – నవయుగపురుషా!

శారద సుగుణవివేక వి – శారద నీ సేవఁగోరి – సరగున రా, సం
సారమున ద్రోయకంచును – నారాయణిఁ గోరినావు – నవయుగపురుషా!

నాథుడవని శారద ని న్నాదరమున చేరి నంత నె "గనె", మ
న్నాథుడు నిజముగ జగతీ – నాథుడ యని నిశ్చయించె – నవయుగపురుషా!

త్యాగము కాంతాకనక – త్యాగము సుఖమనగ, నీ సుదర్శన సుఖమే!
రాగమున సామరస్యము – నాగవిమర్శించినావు – నవయుగపురుషా!

సమరసభావమ్మున లో – కము నంగల మతము లీను – గనుటకుఁతగు, మా
ర్గములని చాటితి దేవా – నమస్కృతులు రామకృష్ణ; నవయుగపురుషా!

బోధనలో స్త్రీ పురుష వి – భేద మొకింతయును లేక – ప్రీతిగలుగ
ను ద్బోధించితి సర్వజగ, న్నాథుడవీవగుట కాదె – నవయుగపురుషా!

ఇందును పశ్చిమఖండము – లందును, నీ పేర మఠములమరిచినదయా
సింధుడు ఘనుడు వివేకా – నందుడు నీ శిష్యవరుడు – నవయుగపురుషా!

నిను గనుటకు నీదగు బోధన వినుటకు – సేవ జేసి – తరియించుటకున్
జనులా కాలముఁగో నెం – తనో, పుణ్యముఁచేసికొనిరి – నవయుగపురుషా!

అవసానదశను నీదగు – నవతారముఁగూర్చి శిష్యు – లనుమానింపన్
ప్రవిమలవాక్కున దెల్పితి – నవయుగ యవతారమనుచు – నవయుగపురుషా

వచ్చినపని పూర్తియు కావచ్చెను – మిగిలినది శిష్యవరులునుచేయన్
వచ్చునని శిథిలదేహము – నచ్చక విడచితివ దేవ – నవయుగపురుషా!

ఏదీ నీ మృదుగానము – ఏదీ వేదాంతబోధ – హితవాక్యము, లా
నాదము సర్వజగదంతర్నాదమ్మున లీనమయ్యె – నవయుగపురుషా!

శ్రీ రామకృష్ణ లీలాసార సముద్రమున రత్న – చయమొక కొన్నిం
ఛేరి సమర్చితి దీనిన్ – హారముగ ధరింపుమయ్య – నవయుగ పురుషా!



# బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## శ్రీ శారదాదేవి రామకృష్ణుని చేసిన పరీక్ష

శ్రీ శారదాదేవికూడా సామాన్యమైన వ్యక్తి కాదు. శ్రీ రామకృష్ణుడే ఆమెను సరస్వతి అవతారం అని చెప్పినాడుగదా! తనభర్త పిచ్చివాడుకాదని ఆమె యెప్పుడో తెలుసుకున్నది. ఆమె మనస్సుకూడా యెంతో పవిత్రమైనది. ఆయనమార్గంలో తాను సహాయం చెయ్యటానికే వచ్చాననికూడా ఆయనకు చెప్పింది. ఎప్పుడూ ఆయనదగ్గరే యుండాలని ఆయనసేవ చేయాలని ఆమె కోరింది. అంతేకాని మామూలు సుఖాలు ఆమె యెన్నడూ కోరలేదు. ఆయన తనకు తల్లి అని, గురువని, కాళికాదేవి అని ఆమెభావించి అలాగే నడచుకునేది.

శ్రీ రామకృష్ణునకు, శారదాదేవి నిజంగా కాళీమాతయే! అంత గౌరవంతోనే ఆమెను చూచాడు. కష్టం కలిగించే ఒక్కమాటకూడా ఎన్నడూ అనలేదు.

శారదాదేవి తాను వచ్చిన కొత్తలో ఆయన గదిలోనే పరుండేదిగదా! ఒకరోజు ఆమె శ్రీ రామకృష్ణదేవునకు కాళ్లు నొక్కుచూ వున్నది. తనమీద తనభర్తకు ఎలాంటి అభిప్రాయమున్నదో తెలుసుకోవాలననే ఆలోచన ఆమె కప్పుడు కలిగింది. నెమ్మదిగాను, సూటిగాను యిలా అడిగింది. "నన్ను మీ రెలా చూస్తున్నారు? నన్నుగూర్చి మీ రేమనుకుంటున్నారు." శ్రీ రామకృష్ణులు ఆమె యిలా అడుగుతుందని అనుకోలేదు. వెంటనే సమాధానం చెప్పారు. "నాకు శరీరాన్ని యిచ్చిన యే కన్నతల్లి యిప్పుడు నహబత్తులో యున్నదో, ఏ కాళీమాత ప్రతిరోజూ నేను చేసేపూజలు అందుకుంటున్నదో, ఆమెయే యిప్పుడు యిక్కడ నా కాళ్లు వత్తుచున్నది. అంతకంటె వేరుగా నిన్నెప్పుడు తలచలేదు." ఆమాట విని శారదాదేవి చెప్పలేని ఆనందాన్ని పొందింది. తనకు అట్టి మహనీయుడు దొరకటం తన భాగ్యమని లోలోన మురిసిపోయింది.

"నన్ను ఎవరని తలచుచున్నారు మీరు?"<br>
అనుచు శారద ప్రశ్నింప నతడు పలికె<br>
"నన్ను యేతల్లి కనినదో, నాదు అర్చ<br>
నముల నేకాళిమాత తా నందుకొనునో<br>
ఆమెయే నాదు పాదము లంటెనిపుడు."

సంపాదకులు : శ్రీ చిద్భవానందస్వామి.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600 021) న ముద్రింపబడి.

శ్రీ చిద్భవానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600 004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ కథామృతము

నేడే కొనండి! (ప్రథమ భాగము) పదేపదే చదవండి!

శ్రీ "మ.—" చే వంగభాషలో విరచితమైన మూలగ్రంథమునుండి అనూదితము. నవభారత నిర్మాతయగు శ్రీ వివేకానందస్వామికి శ్రీరామకృష్ణ పరమహంస గురుదేవుడు. ఆ పరమహంసదేవుని దివ్య వచనామృతమును శ్రీ "మ.—" అనంద తన్మయతతో తాను వినినది వినినట్లుగ ఐదు భాగములుగ గ్రంథస్థ మొనర్చెను. అందు ప్రథమ భాగమిది.

ఆ అవతారమూర్తియొక్క వచనములు ఈ పుటలయందు మనస్సును పూర్తిగ ఆకట్టుకొనునట్లుగ అనువదింపబడినవి. వీనిలో పరిష్కరింపబడని తత్త్వవిషయిక సమస్యలేదు. తొలగింపబడని ఆధ్యాత్మిక సంశయము లేదు. వివరింపబడని ఆత్మవికాసక విషయములేదు. ఆసక్తికరము. ఆధ్యాత్మికులకు ఒక వరప్రసాదము.

వెల : సాదా : రూ. 8-00

పుటలు : 240+VIII ప్రథమ ముద్రణము కాలికో : రూ. 12-00

* * *

# శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర

రచయిత : శ్రీ చిరంతనానందస్వామి

వంగభాషలోని మూలప్రమాణ గ్రంథముల ననుసరించి రచింపబడినది. ఇందు శ్రీ రామకృష్ణుని జీవితాంశములు మృదుమధురమగు తేటతెనుగున సమగ్రముగ వివరింపబడినవి. ఢిల్లీ సాహిత్య అకాడెమీ వారిచే ఉత్తమోత్తమ గ్రంథముగ నిర్ణయింపబడినవి.

శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర ఆద్యంతము ఆత్మవైభవమే. దివ్యవైభవమే. ఇదియొక దెస కావ్యము. ఇంకొకదెస చరిత్రము వెరసి తత్త్వ సంహిత. లేక దివ్య కావ్యము. ఈ శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర శారదాకంఠమున ఓంకారఘంట। రోమాంచముల పంట.

—శ్రీ వేలూరి శివరామశాస్త్రి.

....విమర్శక చక్రవర్తి....కీ. శే. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి శ్లాఘామోదములనందిన మీ పూర్వ గ్రంథముల నిది రచనావైదగ్ధ్యమున....మించియున్నది. విషయౌదాత్త్యము రచనౌదాత్త్యముగా పరిణమించుట స్వాభావికమే కదా సిద్ధహస్తుల చేతులతో।

—శ్రీ కందుకూరి మల్లికార్జునం.

It is bound to communicate to the reader the beauty and power of Sri Ramakrishna's life.

—Sri S. Radhakrishnan.

Classic...authentic...It will be a very valuable addition to the Telugu literature.

—The Hindu.

పుటలు : 478+XXX వెల : రూ. 10-00

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూర్, మద్రాసు-600 004.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 35 1978 - ఫిబ్రవరి : పింగళ - మాఘము సంచిక 2

## విషయ సూచిక



## శ్రీ రామకృష్ణప్రభ

సంవత్సర చందా : రూ. **7-00.** జీవిత చందా : రూ. **100-00.**

విడి ప్రతి : **70** పైసలు.

శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు

మద్రాసు 600 004.

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

(శ్రీ చిరంతనానందస్వామి ప్రణీతము)

ఇందు శ్రీ స్వాములవారి జీవితమున నింతకుపూర్వము గ్రంథస్థములు గాని ముఖ్య సంఘటన లెన్నియో శ్రీవారి సోదర శిష్యులవలన విని వ్రాయబడినవి. ఇది శ్రీ స్వాములవారి సంపూర్ణ చరిత్ర!

నిర్దుష్టమైన భాష, అందమైన అచ్చు, ఆకర్షకమైన రూపము.

432 పుటలు వెల : రూ 4-00

(పదవ కూర్పు)

## శారదాదేవి జీవిత చరిత్ర

రచయిత :

శ్రీ చిరంతనానందస్వామివారు

శ్రీ రామకృష్ణభగవానుని సతీమణియు ఆదర్శమాతయు, యోగినియునగు మహానీయురాలి దివ్యచరిత్ర. ప్రతి స్త్రీయును పురుషుడును చదువవలసిన గ్రంథము.

ఆఱవకూర్పు.

పుటలు : 246 వెల : రూ. 4-00

## బాలల వివేకానందుడు

బెంగాలీ మూలము :

శ్రీ నిరామయానందస్వామి

అనువాదకులు :

శ్రీ కరణం రంగనాథరావు

జగద్విఖ్యాతుడైన వివేకానందస్వామి జీవిత చరిత్ర బాలబాలికలకు సులభముగా అర్థమగునట్లు రచింపబడినది. స్వామివారి బాల్యవిశేషములు శ్రీ రామకృష్ణుల సాంగత్యము పాశ్చాత్యదేశములకు పయనము మాతృదేశమున వారి కార్యక్రమము మనోహరముగ సంగ్రహింపబడినది.

పుటలు : 80+viii వెల : రూ. 2-00

(రెండవ ముద్రణము)

## శ్రీ రామకృష్ణోపనిషత్తు

తమిళ రచయిత :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి

శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీ రామకృష్ణ దేవుని దివ్యోపదేశ వాక్యము లాధారముగాగొని, వానిని విరివి పఱచి, మనోహర కథా రూపముగను, సంభాషణరూపముగను అమర్చబడినది.

128 పుటలు వెల : రూ. 3-75



ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 35 1978 - ఫిబ్రవరి : : పింగళ - మాఘము సంచిక 2

## ప్రార్థన

పరమేశ పుణ్య సుబ్రహ్మణ్య భక్తవత్సల మహాదేవ విశ్వప్రకాశ
కరణ హృషీకేశ వరద నారాయణ రాజీవనయన హిరణ్యనాభ
యఖిలలోకనమస్కృతాంఘ్రిసరోరుహ యజ్ఞాంగ యచ్యుత యమృతరూప
నీకు మ్రొక్కెద గరుణింపవే యతసీకుసుమవర్ణ పీతాంబరము ధరించి
యున్న నిన్ను నెవ్వరుల్లంబులందు దలంతు రట్టివారలకు భయంబు
కలుగదెందు నేమి కార్యంబులందెప్డు వినుతమంగళాయతనమవగుట.

—శాంతిపర్వము.

# వివేకానందవాణి

ఒకడు మన కెగ్గుచేసినయెడల వెంటనే ప్రతీకారము జేయ నెంతుము. ప్రతీకారము మనోనిగ్రహాసామర్థ్యము కొఱవడియున్నదని వెల్లడించును. దుర్వృత్తి నవలంబించినంతనే మనోబలమును గోల్పోవుచున్నాము. ఒకనిని ద్వేషించుటచేగాని, వాని హాని చేయుటచే గాని ప్రతీకారము చేసినప్పుడెల్ల మనస్సునకెంతయో యనర్థము వాటిల్లుచున్నది. దుష్ప్రవృత్తినికాని, ద్వేషప్రేరితమగు కార్యమునుగాని, ప్రతీకారము చేయవలయునన మఱెట్టి సంకల్పమునుగాని నిగ్రహించినప్పుడెల్ల మనకది ప్రయోజనకరమగుచున్నది. మనోనిగ్రహము వలన నపారమగు శక్తి లభించును. నిగ్రహమువలన మన కెన్నడును నష్టము కలుగదు. ద్వేషమునుగాని, క్రోధమునుగాని నిగ్రహించినపుడెల్ల మహోపయుక్తమగు సత్త్వశక్తిని జేకూర్చుకొనుచున్నాము. ఇట్టి సత్త్వశక్తినుండియే యుత్తమమానసికశక్తులు వెలువడుచున్నవి.

*   *   *   *

మనోనిగ్రహ మెంత కష్టసాధ్యమో కదా! మతిచెడిన కోతికిని మనస్సునకును మంచిపోలికగలదు. కోతు లన్నిటివలెనే సహజముగా జంచలమైన యొక కోతి యుండెను. స్వాభావికమగు నిట్టి చాంచల్యము దానికి చాలదో యనునట్టు లెవ్వరో దానిని కల్లు త్రావించిరి. అందుచే దానికి చాంచల్యము హెచ్చెను. ఈ స్థితిలో దానినొక తేలుకుట్టెను. మనలను దేలు కుట్టినప్పు డాదినమంతయు గంతులు వేయుచుందుముకదా! పాప మా దురవస్థ యిక చెప్పవలయునా? ఈ గ్రహచారము చాలక దాని నొక దయ్యము పట్టెను. ఇక దాని చాంచల్యస్థితినిగూర్చి మీరే యూహించుకొనుడు! మన మనస్సా కోతివంటిది క్షణమైనను నిలుకడ యనునదిలేక సదా పరుగెత్తుచుండుట దీనిస్వభావము. ఇక నిది విషయ వాంఛయను మధ్యపానము చేసినంతనే దీని సంక్షోభము మఱింత వృద్ధియగుచున్నది. అనంతర మసూయయను తేలు కుట్టుచున్నది. తుదకహంభావమను పిశాచ మావేశించి యందఱికంటెను దానే ప్రముఖుడు నని మనుష్యుని గర్వింపజేయుచున్నది. ఇట్టి మనస్సును నిగ్రహించు టెంతటి కష్టసాధ్యమో తలంపుడు.

*   *   *   *

కొంతసే పొక చోట కూర్చుండి మనస్సును యథేచ్ఛముగా పరుగెత్తనిచ్చుటయే మనోనిగ్రహమునకు ప్రథమోపాయము. అట్లు కూర్చుండియున్నంతసేపును మనస్సటునిటు గంతులువేయుచు, నిలుకడ లేనికోతివలె ఎగిరిపడుచుండును. ఈ మనోమర్కటమును శక్తి కొలదియు నెగురనిచ్చి మీరు నిరీక్షించుచుండుడు. 'జ్ఞానమే శక్తి' యను వచనము యథార్థము. మనోవ్యాపారము తెలియకుండునంతవఱకు మనస్సును నిగ్రహింపజాలరు. స్వేచ్ఛగా దానిని సంచరింపనిండు. వికృతాలోచన లనేకములు కలుగును. అట్టి తలంపులు కలిగినందులకు మీ కాశ్చర్యమగును. కాని క్రమముగా ఆనాటి కానాడు చాంచల్యము క్షీణించి మనఃప్రసన్నత కలుగుచుండును. మున్ముందు కొన్ని నెలలవఱకును మనోవృత్తు లపరిమితముగా నున్నట్లు కాన్పించును. అనంతర మవి క్రమముగా క్షీణించిపోవుచుండును. తుదకు మనస్సు సంపూర్ణముగా వశమగును. కాని ప్రతిదినమును పూనికతో మనము సాధన చేయవలయును. ఓరిమి వహింపవలయును.

# విద్య

## స్వామి నిర్వికల్పానంద

ప్రస్తుతం మనదేశంలో, విద్యావిధానం ఏ రీతిగా ఉండాలి అనేవిషయం చాలమంది దృష్టిని ఆకర్షిస్తోంది. ఒక్కొక్క రొక్కొక్క రీతిగా విధానాన్నీ దాన్ని అమల్లో పెట్టే టందుకు ప్రణాలికను సూచిస్తున్నారు.

మన విశ్వవిద్యాలయాలు ఒకేరీతిగా కంఠో పాఠంపట్టి దాన్ని చిలకపలుకలాగా అప్ప గించే రీతినే ఆమోదించి తృప్తి పడుతున్నా యి. ఈ విద్య కేవలం మస్తిష్కానికి సంబం ధించిందే. హృదయాన్ని సంస్కరించే సుగుణం గాని, పారిశ్రామికంగా అభివృద్ధిని కూర్చ గల మహత్తరగుణంగాని అంతగా లేవనే చెప్పాలి.

పుట్టిన ప్రతివాడికీ ముందర కావల్సింది తింటానికి తిండి, కట్టటానికి గుడ్డ, అందువల్ల వ్యావహారికంగాచూస్తే అన్నవస్త్రాల్ని సమృ ద్ధిగా సంపాదింపగలిగే సత్తా ఇయ్యగలిగిన విద్య మనకు ప్రధానంగా కావాలి అని ఎవరి కైనా తోచకమానదు.

మనిషి అన్నవాడు కేవలం ఆహార నిద్రా దుల్తోనే సంతృప్తిపడి వుండలేడు. సంతృప్తిపడి వుండటం న్యాయంకూడాకాదు. ఈ ఆహార నిద్రాదులు పశువులకుకూడా సామాన్యాలే. మనుష్యజీవితం ఇంతటితోనే ముగిస్తే పశువుకీ మనుష్యుడికీ భేదం ఉండదు. ఇది ఉభయత్ర వున్న ప్రవృత్తే. దీన్ని సంస్కరించి కామ క్రోధాదులైన పశుప్రవృత్తుల్ని జయించి దయాదాక్షిణ్యాది సద్గుణాల్ని అభివృద్ధి పరచు కుంటానికి తగిన శక్తినిగూడా విద్య ప్రసా దింపగలిగి వుండాలి. లేకపోతే విద్య కేవలం నామమాత్రమే అవుతుంది.

కనుక, విద్య అన్నవస్త్రాల్ని సంపాదించే మార్గాన్ని సూచించేదేకాకుండా, హృద యాన్ని సంస్కరించి సద్గుణమయంగా చేసేది అయివుండాలి.

ఈ ద్వితీయాంశాన్నే కనుక దృష్టిలో ఉంచుకోకపోతే, ఒకవ్యక్తి మనస్సులోవుండే పశుత్వమే సంఘాన్నంతా వ్యాపించి ప్రపంచ కల్లోలాన్ని అంతర్యుద్ధాల్ని, దేశదేశాల్తో యుద్ధాల్ని, ప్రపంచ యుద్ధాల్ని సంఘటింప జేస్తుంది.

ఒకవ్యక్తికి సాధ్యమైంది సంఘానికీ దేశానికీ కూడా సాధ్యమవుతుంది. అది సమష్టిమీద ప్రపంచానికి అంతటకీకూడా సాధ్యమవుతుంది.

ప్రపంచంలోవున్న విశ్వ విద్యాలయాలన్నీ ఇంచుమించుగా ఒకేత్రాటిమీద నడుస్తు న్నాయి. ఏవీకూడా అంతగా హృదయ సంస్కారాన్ని ఇవ్వగలిగిన విద్యను బోధించ టంలేదు. కనుక, ప్రపంచ వాసులందరూ సమష్టిగా సమావేశమై, దానికి సమర్థమైన విద్యా ప్రణాలికను నిర్ణయించాల్సి వుంటుంది.

మొత్తంమీద పుస్తకాలు బట్టీ పట్టి తన తిండే తాను సంపాదించుకోలేని పండిత మూర్ఖులూ మనకు అక్కర్లేదు, విశ్వవిద్యా లయాల డాక్టరు డిగ్రీలు తగుల్చుకొని నర మేధంచేసే నరపశువులూ మనకు అక్కర్లేదు.

పారిశ్రామిక విద్యాపాటవం, హృదయ సంస్కారం, ధీనైర్మల్యం——ఈ మూడింటినీ ఇయ్యగలిగిన విద్య మనకు కావాలి. అప్పుడు మనిషి శారీరకంగానూ, మానసికంగానూ,

పాటవాన్ని సంపాదించి, హృదయాన్ని ఉల్లాస మయంగా చేసుకోగలుగుతాడు.

ఇంతవరకు మన శాస్త్రకారులు నిర్దేశించిన అపరవిద్య ఎల్ల.

ఇది దాటితే పరవిద్యయొక్క రాజ్యంలో ప్రవేశిస్తాం. ఇక్కడ శోకమోహాదులకు తావు లేదు. దీన్నిగురించే ప్రహ్లాదుడు 'హరిజెప్పు చదువు చదువు' అనిన్నీ 'చదువుల మర్మము' అనిన్నీ అన్నాడు. ఉపనిషత్తులు దీన్నే 'యయా తదక్షర మధిగమ్యతే' అని అభివర్ణిస్తున్నాయి.

కేవలం ఉపనిషత్తులేకాదు, ప్రపంచంలో వున్న మతగ్రంథాలన్నీకూడా ఈ విద్యను ప్రశంసిస్తున్నాయి.

మతాలన్నీ పేరుకు వేరైనా, అంతర్గతమైన సూత్రం ఒకటే. సూక్ష్మంగా ఈ మతాలన్నీ 'మోక్షం' అనబడే అధ్యాత్మిక స్థితిని సూచి స్తున్నాయి.

వ్యక్తి ఎన్నివిధాల ప్రయత్నంచేసినా, జీవితంలో ఆనందాన్నీ, శాంతినీ, తృప్తినీ పొందటానికే. జీవితాన్నే ఒక విశ్వవిద్యాలయంగా భావిస్తే, ఆహారనిద్రా మైథునాదులకు సంబంధించిన శారీరక తృప్తి అధమతరగతి అనిన్నీ, ధీహృదయ సంస్కార సంతృప్తులకు ప్రయత్నించేది మధ్యమతరగతి అనిన్నీ, మోక్షం అనబడే ఆధ్యాత్మికస్థితి ఉత్తమ తరగతి అనిన్నీ విభజించి చెప్పవచ్చు.

గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసాశ్రమాలు మూడున్నూ క్రమంగా యౌవన, మధ్యమ, వార్ధక్యదశల్లో సామాన్యంగా మానవుడికి కలిగే ఈ దశాపరిణామాన్నే సూచిస్తున్నాయి.

అపరవిద్య అర్థకామతృప్తినీ, పరవిద్య మోక్షానందాన్నీ ఇచ్చి, మానవజీవితానికి సంపూర్ణతను సమకూరుస్తున్నాయి.

అయితే, అపరవిద్యను గడించటమంత తేలికకాదు, పరవిద్యను సముపార్జించటం. మొదటిది కొంత గ్రంథాలోకనంవల్లనూ, కొంత స్వప్రయత్నంవల్లనూ లభిస్తుంది. పరవిద్య కేవలం గుర్వనుగ్రహంవల్ల లభింపవలసిందే. గురు శుశ్రూషచేసి తదనుగ్రహం పడసిన ధన్యాత్ములకే ఇది సాధ్యమవుతుంది

అంటే, అపరవిద్యకు బోధకుడు అసలు అక్కర్లేదని కాదు. దానికే ప్రయోజన మైనప్పుడు, దీనికే ఎంత ప్రయోజన ముంటుందో ఊహించుకోవచ్చు. ఇక్కడ గురుశబ్దానికి అర్థం సిద్ధగురువని.

ఇల్లాంటి సిద్ధగురుని సాన్నిధ్యంలో పరవిద్యను సముపార్జించుకొంటానికి నోచుకొన్న వాళ్ళు ధన్యులు!

సత్పురుషుని లక్షణమేమిటని ట్సూచాంగ్ అడుగగా కన్‌ఫ్యూషియస్ ఇలా జవాబిచ్చాడు: మార్దవము, ఔదార్యము, నిష్కాపట్యము, ఉత్సాహము, దయ—ఈ ఐదింటిని ఎల్లప్పుడు ఆచరణలో పెట్టగలవాడే సత్పురుషుడు. మార్దవముండుటవలన అతడు అవమానములనుండి తప్పును. ఔదార్యముండుటవలన ఇతరులను ఆకట్టుకొనును. నిష్కాపట్యముండుటవలన అందరివిశ్వాసమునకు పాత్రుడగును. ఉత్సాహ ముండుట వలన చేపట్టినకార్యములను సాధించుకొనును. దయాగుణముండుటవలన ఇతరులను శాసించగల శక్తిని కలిగియుండును.

# శ్రీ రామకృష్ణ కథామృతము

(రెండవ భాగము)

అనువాదము: ప్రవ్రాజిక శ్యామాప్రాణ

శ్రీ రామకృష్ణులు (కేశవునితో) బ్రహ్మ సమాజమువారు భగవన్మహిమలనే ఎక్కువ వర్ణింతురేల?

'ఓ ఈశ్వరా! నీవు చంద్రుని సృష్టించితివి. సూర్యుని సృష్టించితివి, నక్షత్రముల సృష్టించితివని ఇట్లంతగ పొగడనేల? చాలమంది తోటనుచూచి దాని ప్రశంసతోనే మురిసి పోవుదురు. తోట యజమానిని ఎందరు చూడ గోరుదురు? తోట గొప్పదా? లేక తోట యజమానియా? తోట గొప్పది కాదు. యజమానుడే గొప్పవాడుసుమా. కల్లు త్రాగి మత్తెక్కినపిదప గిడ్డంగిలో ఎంత కల్లున్నదో తెలిసికొననేల? ఒక్క సీసాతోనే పని ముగియునుకదా.'

నేను నరేంద్రుని ఒక్కమారైననూ మీ తండ్రి పేరేమి? మీ కెన్నిళ్ళు వాకిళ్ళు అని ప్రశ్నింపలేదు. అసలు విషయమేమిటి? తెలియునా? సాధారణ మానవులకు ఐశ్వర్యములపై మోజెక్కువ; అందుచే భగవంతుడు కూడ ఐశ్వర్యముల నభిషించుననని వారు తలంతురు. భగవదైశ్వర్యముల పొగడుచు వర్ణించినచో అతడు సంతుష్టుడగునని వారి తలంపు. ఒకసారి శంభుమల్లిక్ నాతో ఇట్ల నెను – 'నా సిరిసంపదనెల్ల భగవంతుని పాద పద్మములకడ సమర్పించుకొని మరణింప గల్గు నట్లుగ నన్నాశీర్వదింపుము.' అంత నే నిట్లు బదులు పల్కితిని – 'భగవంతునికి నీ వేమి సమర్పించగలవు? ఈ సిరిసంపదలు నీ వద్ద గొప్పవి కావచ్చు కాని భగవంతునికడ ఇవన్నియు దుమ్ముధూళికి సమానముసుమా.'

రాధాకృష్ణాలయములో దొంగతనము జరిగెను. మధురబాబుతో నేనునూ ఆలయమునకు పోతిని. అంత మధురుడు 'ఓ దేవుడా! ఛీ! ఇదేమి! నీ యోగ్యత ఇంతేనా? నీ వంటి మీదనుండి దొంగలు నగలన్నీ వలచుకొని పోయిరి. నీ వేమియు చేయజాలక పోతివికదా!' అనెను. నేను వెంటనే మధురు నిట్లు మందలించితిని. 'ఏమోయీ! నీ విట్లు పలుచున్నావేల? సిగ్గుచేటు! నీవు వేటిని నగలు నగలు అని గొప్పగ చెప్పుకొనుచున్నావో, అవన్నీ భగవంతునికవి మట్టిపెళ్ళలకు సమానము. సర్వైశ్వర్య ప్రదాయినియగు శ్రీ మహాలక్ష్మీ దేవి భగవంతుని శక్తియై యొప్పుచున్నది. అట్టితరి నీ నగలు దొంగలబారిన కాపలా కాచుట భగవంతుని పనియా! ఛీ! మరెన్నటికినీ ఈ విధముగ పలుకకు. భగవంతుడు ఐశ్వర్యమునకు వశుడగునా? అతడు భక్తికి వశుడగును. భగవంతుడేమి కోరును? భక్తి ప్రేమ వివేక వైరాగ్యాదులనే అతడు కోరునుసుమా!

ఎవని భావ మెట్టిదో భగవంతుని అతడట్లే గాంచును. తమోగుణభక్తుడు శక్తి (దేవి) మాంసము తినుచున్నట్లు గాంచును. అందుచే అతడు దేవికి పశుబలి ఇచ్చును. రజోగుణ భక్తుడు మహా వైభవముతో పూజయు, పంచభక్ష్య పరమాన్నాదులతో నైవేద్యము సమర్పించును. సత్వగుణభక్తుని పూజలో ఎట్టి ఆడంబరములుండవు. అతడు పూజ చేయుచున్నట్లు ఇతరులకు తెలియనే తెలియదు. పువ్వులు దొరకనిచో ఏదో మారేడుపత్రి

గంగాజలముతో పూజచేసి బెల్లంముక్క నైవేద్యముతో సరిపెట్టుకొనును. ఎప్పుడైనా సాధ్యపడినచో పరమాన్నము వండి నివేదించును.

అటుపై త్రిగుణాతీత భక్తుడును కలడు. అట్టి భక్తునిది బాలునివంటి స్వభావము. కేవలము భగవన్నామ స్మరణయే వాని పూజ.

(కేశవునితో నవ్వుచూ) నీకీ జబ్బు చేయుటకు కారణము కలదు. ఆధ్యాత్మిక సాధనల మూలమున కలుగు భావోద్రేకపు దెబ్బలచే నీ శరీరారోగ్యము పాడైనది. భావావేశము కలిగినపుడు కొంచెమైనను తెలియనే తెలియదు. చాల రోజులైన పిదపయే శరీరము దెబ్బతినును. ఉదాహరణమునకు నా కండ్లార చూచిన ఒక విషయము చెప్పెదను. గంగ మీదుగ నట్టేటిలో ఒక పెద్ద స్టీమరు ఎప్పుడు పోయెనో చడీ చప్పుడు లేకుండ వెడలిపోయెను. అందుచే ఎవ్వరునూ అంత లక్ష్యపెట్టి చూడలేదు. కాని బాబోయి! అది చాలదూరము పోయినపిదప పెద్ద పెద్ద అలలు లేచి దబాదిబాయని ఒడ్డును కొట్టుకొన మొదలిడెను. ఆ అలల దెబ్బలకు గట్టు కొంత తెగి నీళ్ళలో పడెను. చిన్న పూరిగుడిసెలో ఏనుగు దూరినచో గుడిసె తారుమారై తలక్రిందులగును. అట్లే భావహస్తి (భగవత్ప్రేమయనెడి ఏనుగు) శరీరములో దూరినచో శరీరమును తారుమారుచేసి పాడుచేయును.

అసలు ఏమి జరుగునో తెలియునా ఇంటిలో నిప్పంటుకొన్నచో ఇంట్లో వస్తువులు కొన్ని కాలిపోయిన పిదపయే అల్లరులు వినిపించును. జ్ఞానాగ్ని విషయముకూడ ఇట్లే. అది మొదట కామక్రోధాది శత్రువుల నాశనముచేసి అహంకారమును అణచిన పిదపయే పాంచభౌతిక శరీరముపై కలత ప్రారంభమగును. అంతయు ముగిసినదని నీవు తలంపవచ్చు. కాని వ్యాధి శేషమున్నచో అతడు (భగవంతుడు) వదలడుసుమా! ఆసుపత్రిలో చేర్చినచో నీ ఇష్టప్రకారము తిరిగి రాజాలవు. రోగము పూర్తిగా నయము కానంతవరకు డాక్టరుగారు రోగికి శెలవు ఇవ్వరు. నీవు పేరు వ్రాయించి ఆసుపత్రిలో చేర్చితివేల?'' (అందరూ నవ్వుదురు.)

నాకొకసారి చాల జబ్బుచేసెను. అప్పుడు హృదయుడిట్లు పలికెడివాడు – 'నా జన్మలో ఏ నాడును ఇట్టి భావావేశమునుగాని, ఇట్టి వ్యాధినిగాని చూడలేదు.' నిజమే! నా బాధ ఎట్లు వర్ణింపను? తలలో ఒక్కపెట్టున లక్షలాది చీమలు కుట్టినట్లుగ బాధ. అట్లయ్యు అహర్నిశలు భగవత్ప్రసంగమే నడుచుచుండెను. నన్ను చూచుటకో నటోగర్ నుండి రామయ్యవైద్యుని పిలుచుకొనివచ్చిరి. అప్పుడు నేను కూర్చొని ఆత్మవిచారము చేయుచుంటిని. నన్ను చూచి నివ్వెరబోయి 'ఇదెక్కడి పిచ్చి, బాబోయి! వంట్లో ఎముకలు మాత్రమే మిగిలియున్నవి. అట్లయ్యు ఈయన ఇంతసేపు కూర్చొని ఆధ్యాత్మ విమర్శల చేయుచున్నాడే!' అనెను.

అంతయు అమ్మ ఇచ్ఛయే.

'సకలే ఈ తుమార్ ఇచ్ఛా
ఇచ్ఛామయీ తారా తుమీ
తొమార్ కర్మా తుమి కొరోమా
లోకే బోలే కొరి ఆమి.'

(అమ్మా! సర్వమూ నీ ఇచ్ఛప్రకారమే నడుచుచున్నది. నీవు ఇచ్ఛామయివి! తరింపజేయగల్గినదీ నీవే. యదార్థముగ పనులెల్ల నీవే చేయుదువు. కాని లోకులు తామే చేయుచున్నామని తలంతురు.)

## శ్రీరామకృష్ణ కథామృతము

మంచు కురియుట ఆరంభింపగనే, తోట మాలి మంచిజాతి పన్నీరుమొక్కను నాలుగు వైపుల త్రవ్వి గుంటలుచేసి వ్రేళ్ళు పెకలించి పెట్టును. కొన్నిరోజులు మంచు కురిసినపిదప మరల ఆ మొక్కను నాటును. ఆ చెట్టుకు మరల పుష్టికలిగి ఇగుళ్ళుపెట్టి సకాలమున దండిగ పువ్వులు పూయును. అందులకే కాబోలు నీ వ్రేళ్ళను పెళ్ళగించుటకూడ (శ్రీ రామకృష్ణులు, కేశవుడు నవ్వుదురు.)

ఉమానాథుడు: కేశవుని ఆశీర్వదింపుడని వాని తల్లి వేడుచున్నది.

శ్రీ రామకృష్ణులు: (గంభీరస్వరముతో) ఇది నా చేతనగునా ఏమి! భగవంతుడే ఆశీర్వదింపగలడు. తోమార్ కర్మ తుమి కొరోమా లోకే బోలే ఆమి కరి.

భగవంతుడు రెండుసార్లు నవ్వును సుమా ఒకమారు ఎప్పుడనగ - అన్నదమ్ములు భూమిని పంచుకొను సందర్భమున. 'ఈ వైపు స్థలము నాది, ఆ వైపు నీది' అనునపుడు. 'జగమంతయు నాది. అట్లయ్యు గోరంతభూమిని కొలుచుకొనుచు ఈ వైపు నాది, ఆ వైపు నీది అనుచున్నారే' - అని తలచి భగవంతుడు నవ్వును.

దేవుడు ఇంకొక సందర్భములో కూడ నవ్వును. అదెప్పుడన - బిడ్డకు జబ్బుచేసి ప్రమాదస్థితిలో యుండగ, ఏడ్చుచున్న ఆ బిడ్డ తల్లిని చూచి వైద్యుడు 'భయమేమీ లేదమ్మా! నేను నయము చేసెదను' - అని పలుకునపుడు. 'భగవంతుడు చంపదలచినచో రక్షించుట ఎవ్వరికి సాధ్యమని వైద్యు డెరుగడు కాబోలు' - అని తలంచి భగవంతుడు నవ్వును.

మీరు వేదాంతమును గ్రహించినప్పుడు-ఓహో! మహాద్భుతాలు చూస్తారు. మీరు దేవుని దర్శిస్తారు. దేవుని త్రాగుతారు. దేవుని ఆఘ్రాణిస్తారు. దేవుని స్పర్శిస్తారు. దేవుడు మీలో వసిస్తాడు. దైవసాక్షాత్కారం పొందినప్పుడు, మీకే విషయం గోచరమవుతుంది. మీరు స్వీకరించే ఆహారం దేవుడుగా మారిపోతుంది. ప్రతి వస్తువులోనుంచి దేవుని నేత్రాలు తొంగిచూస్తుంటాయి. వేదాంతి కన్నులు, ప్రతివస్తువును పరమాత్మగా చేస్తాయి. ప్రతివస్తువు ప్రియుని రూపమే. ప్రతి దిక్కునుంచి, ప్రతి మూలనుంచి, మనవైపు పరమేశ్వరుడు రెప్పవాల్చక చూడడం మనం కనుగొంటాము. విశ్వమంతా వైకుంఠంగా మారుతుంది.

-స్వామి రామతీర్థ.

జన్మసిద్ధమైన జ్ఞానసంపదగల అదృష్టవంతులు మొదటి తరగతికి చెందినవారు. ప్రయత్నపూర్వకముగ దానిని సాధించి సంపాదించినవారు రెండవ తరగతికి చెందినవారు. తమకుగల పరిమితులను (Limitations) చూచి నిరుత్సాహపడక, జ్ఞానసంపాదనా ప్రయత్నమును చేయుచుండువారు మూడవ తరగతికి చెందినవారు. తగిన సామర్థ్యముండియు, జ్ఞానార్జనకు ఏ ప్రయత్నమును చేయని సోమరులు అధమ తరగతికి చెందినవారు.

—కన్‌ఫ్యూషియస్.

# ప్రహ్లాద కథాతత్త్వ విచారము

హిరణ్యకశిపుడిట్లు తల్లికి తత్త్వ ముపదేశించి మందరద్రోణికి (లోయ) బోయి చేతులు పైకెత్తి బ్రొటనవేలిపై నిలువబడి యాకసము వంక జూచుచు పరమదారుణమైన తపస్సు చేయ మొదలెట్టెను. తా నజేయుడు, అజరామరుడు, అప్రతిద్వంద్వుడు, ఏకరాట్టు కావలయునని యతని కోరిక. అతడు జటామండలము నుండి కాంతులు చిమ్మ ప్రళయకాల సూర్యునివలె భాసించెను. వీడు తపస్సు చేయుచున్నాడుగదా. ఇపుడు వీడివలన భయము లేదని దిక్పాలురైన దేవతలు తమ తమ స్థానములు జేరుకొనిరి. హిరణ్యకశిపుడు సహస్ర వర్షములు తపస్సు చేసెను. వాని తలనుండి సన్న సన్నగా పొగలుసాగి యగ్ని జ్వాలలై యడ్డముగా, నిలువుగా వ్యాపించి లోకము లన్నింటిని తగులబెట్టెను. నదీపర్వత సముద్రములతో భూమి కంపించెను. తారకలు రాలెను. దిక్కులు ప్రజ్వలించెను. అతని తపోగ్నిచే తప్తులై దేవతలు స్వర్గమునువీడి బ్రహ్మలోకమునకు బోయి బ్రహ్మతో మొరబెట్టుకొనిరి. బ్రహ్మ భృగుదక్షాది ప్రజాపతులతో కలసి హిరణ్యకశిపుని యాశ్రమమునకు వచ్చి వానిని చూచెను. వాని శరీరమునందలి మాంసశోణితములను పిపీలికలు భక్షించినవి. వానిపైన పుట్టలు బెట్టినవి. ఆ పుట్టలపైన గడ్డివెదుళ్ళు పెరిగి యల్లుకొన్నవి. ఆ స్థితిలో నతడు తపస్సు చేయుచుండెను. మబ్బులు క్రమ్మిన సూర్యునివలె వెలుగుచున్న వానిని చూచి బ్రహ్మదేవుడు, 'నాయనా లెమ్ము. నీ తపస్సు సిద్ధించినది. నీకు వరమిచ్చుటకు వచ్చితిని. కావలసినది కోరుకొమ్ము. నీ యద్భుతమైన ధైర్యమును కనుగొన్నాను. అడవి ఈగలు నీ శరీరములో అస్థులను మాత్రమే మిగిల్చినవి. ఇట్టి తపము పూర్వ ఋషులు చేయలేదు. ఇప్పటివారు చేయరు. నూరు దివ్య సంవత్సరములు నీరుకూడా త్రాగకుండ ప్రాణములు నిల్పుకొంటివి. ఇంత దృఢసంకల్పముతో నడిపిన తపోనిష్ఠచే నన్ను జయించితివి. కావున నీవేది కోరినను యిచ్చెదను. నీవు మర్త్యుడవు. నేనమర్త్యుడను. నీకు నా దర్శనము వ్యర్థము కారాదు. కాబట్టి వరము కోరుకో' అని తన కమండలు జలము నతని శరీరమునందు ప్రోక్షించినాడు. అంతట హిరణ్యకశిపుడు దానిచే బలాన్వితుడై సర్వావయవసంపన్నుడై వజ్రదేహుడై యువకుడై యా వల్మీకమునుండి లేచెను. కాచిన బంగారమువంటి కాంతితో నత డగ్నిహోత్రునివలె వెలుగుచు ఆకసమందు సాక్షాత్కరించిన బ్రహ్మదేవుని చూచి సాష్టాంగ నమస్కారము చేసి హర్షాశ్రువులు కార్చుచు, శరీరము పులకింప బ్రహ్మదేవుని గద్గదకంఠముతో స్తుతించినాడు.

'ప్రభూ! నీవు స్వయంజ్యోతివి. ప్రళయకాలమున యీ భూమిని కటికచీకటి కప్పగా నీ ప్రకాశముచే దానిని వెలిగించితివి. నీవే రజస్సత్త్వ గుణములతోకూడి వేరు వేరు రూపములతో సృష్టిస్థితి ప్రళయములను జేయుచుంటివి. అన్నింటికంటె గొప్పవాడవు నీవె. పరమేశ్వరుడవు నీవె. అన్నింటికి మూలమవు. బీజమవు నీవె. నీవే విజ్ఞానమూర్తివి. నీవే ప్రాణేంద్రియ మనోబుద్ధులుగా పరిణమించి వ్యక్తిత్వము బొందుచున్నావు. జంగమస్థావర రూపమైన నీ సర్వ ప్రపంచమునకు నీవే నియంతవు. ఆత్మరూపమున ప్రజలయందు వ్యాపించి ప్రజాపతి వైతివి. వారి మనస్సులకు, వారి తెలివికి, వారి యింద్రియములకు నీవె పతివి. ఈ యాకాశాది మహా భూతములకు వాని గుణములైన శబ్దాది విషయములకు

వాని వాసనలకు నీవె పతివి. నీవె సృష్టికర్తవు. అగ్నిష్టోమ, అత్యగ్నిష్టోమ, ఉక్థ్య, షోడశి, వాజపేయ, అప్తోర్యామ, అతిరాత్రములను సప్త తంతువులను (యజ్ఞములను) విస్తరింప జేయు చుంటివి. ఎట్లన చతుర్హోత్రృక కర్మవిషయ మును (నలుగురు హోతలుగా కల్గిన యజ్ఞ కర్మ) చెప్పు వేదత్రయము నీ శరీరముగదా. ఆత్మవంతులకు ఆత్మభూతుడవై అంతరాత్మ రూపమున అంతర్యామివైన నీవు సర్వజ్ఞుడవు. అనాదివి. అంతములేనివాడివి. నీవె కాలమవు. జనులయొక్క ఆయువును క్షణక్షణమును క్షీణింపజేయువాడవు. నిర్వికారుడవు. జ్ఞాన రూపుడవు. పరమేశ్వరుడవు. అపరిచిన్నుడవు. జన్మశూన్యుడవు. నీకంటె వేరేదియు లేదు. వేదోపవేదాది విద్యలన్నియు వాని యంగము లన్నియు నీ శరీరములే. నీ వన్నింటికంటె విశాలమైనవాడవు కావున బ్రహ్మవైతివి. హిరణ్యరూపము గల్గిన ఈ బ్రహ్మాండమంతయు నీ గర్భమున నున్నది. త్రిగుణాత్మకమైన ప్రధానముపైన నీ వున్నావు. ఈ వ్యక్త బ్రహ్మాండమంతయు నీ స్థూలశరీరము. అవ్యక్త మైన యాత్మస్వరూపుడవై, నీ స్వరూపమును పీడకుండయే ఇంద్రియ ప్రాణమనో విషయ ముల ననుభవింతువు. నీవు పురాణుడవు. పూర్ణుడవు. అనంతుడవు. మనోవాక్కులకు గోచరింపని నీ రూపముచే ఈ విశ్వమంతయు వ్యాప్తమైనది. నీవు మాయాశక్తులతో గూడి భగవంతుడవై యుంటివి. అట్టి నీకు నమస్కా రము.' హిరణ్యకశిపుడిట్లు బ్రహ్మను స్తుతించి, 'ప్రభూ! నాకు నీవు వరమీయ దలచుకొన్నచో నిట్టి వరమిమ్ము.'

'నీవు సృష్టించిన ప్రాణులచే నాకు మృత్యువు కలుగరాదు. (గృహము) లోపల గాని (గృహము) బయటగాని పగలుగాని రాత్రిగాని మృత్యువు గలుగరాదు. మరి వేరాయుధములచేతగాని మృత్యువు గలుగ రాదు. భూమిపైనగాని ఆకాశముపైనగాని, నరులచేతగాని, మృగములచేతగాని, ప్రాణ హీనములచేగాని, ప్రాణ వంతములచేగాని, సురాసుర మహోరగములచేగాని మృత్యువు గలుగరాదు. ఈ సర్వ ప్రాణికోటికి నేను ఏకాధిపతిని కావలెను. నీ కున్నట్టే నాకును సర్వలోకపాలుర మహిమ లుండవలెను. తపోయోగప్రభావవంతులైనవారికి వలెనే యనశ్వర్యములైన యణిమా ద్యైశ్వర్యము లన్నియు నాకు కలుగవలెను.' అనినాడు. బ్రహ్మదేవు డిది విని 'నాయనా పురుష దుర్ల భములైన వరముల నడిగితివి. ఐనప్పటికి నివి యన్నియు నీకిచ్చుచున్నా'నని యనుగ్రహించి వెడలిపోయెను.

ఇచట మనము విచారించవలసినది హిరణ్య కశిపుని ప్రవర్తనము. హిరణ్యకశిపుడు తత్త్వ మెరుగని వాడుగాడు. అతడు తల్లికంత బోధ చేసెను. తత్పూర్వ మేమి చేసెను? తర్వాత నేమి చేసెను? తత్పూర్వము తన సైన్యాధి పతులనందరిని వర్ణాశ్రమ ధర్మములను పాడు చేయుడనెను. యజ్ఞయాగాది క్రతువులను తాపసుల యాశ్రమములను జనపదములను తగులబెట్టు డనియెను. తరువాత బ్రహ్మను గురించి తపస్సుచేసి యిట్టి కోరిక కోరెను. పూర్వోత్తరములం దిట్టి ప్రవర్తన యా తల్లికి జేసిన బోధతోగాని తాను చేసిన బ్రహ్మస్తుతి యందలి తాత్త్వికతతోగాని సంవదించు చున్న వాయని మనము పరిశీలింపవలెను. సుయజ్ఞో పాఖ్యానము నుదాహరించి నీవు తల్లికి చెప్పిన దేమి? శరీర మనిత్యము. ఆత్మనిత్యము. శరీ రాభిమానమువలన సంసారము. శరీరమునకు జననమరణములు తప్పవు. దానియం దభి

మానము దుఃఖహేతువు సంసారహేతువు ననిగదా. మరి యిప్పుడీ కోరికతో నీ తప స్సేమి? ఈ శరీరము నిత్యముగా నుండవలెను. దీనికి మరణము గలుగరాదు- ఇది కోరిక. ఈ కోరిక అట్టి తత్వజ్ఞానము కలవాని కెట్లు పొసగును, శరీరము పుట్టినది కావున చచ్చునని నీవే చెప్పితివి. నీ శరీరము పుట్టినది కావున చావకుండ నుండదుగదా. అది యసంభవముగదా. అసంభవము సంభవ మెట్లగును? దానికి పరమేశ్వరుడు మాత్ర మేమి చేయును? మరియు ఈ శరీరాభిమానము దుఖః హేతువంటివిగదా. అట్టి యభిమానము లేనిచో నిట్టి కోరిక యుండదుగదా. మరి యీ కోరిక యెందుకు కోరినట్లు. కావున హిరణ్యకశిపుని తత్త్వజ్ఞానమంతయు పరోపదేశమునకేగాని తన కుపయోగింపదు. తలుపులకొట్టులో ధనమున్నది. తాళపుచెవి పోయినది. ఏమి లాభము. అవసరమైనప్పుడుపయోగించదు. అక్కరలేనప్పు డతి తెలివి. దీనికి కారణమేమి? పూర్వము చెప్పినట్లు విష్ణు పార్శ్వచరుడై యుండగా వాని మనసునందు బీజప్రాయముగానున్న రజస్తమోగుణము లిపు డంకురించి వృక్షములైనవి. వివేకసూర్యుడుపైన వెలిగినను వానికాంతి ఈ వృక్షచ్ఛాయలను తోసివేయలేదు.

తల్లి కట్లు తత్వోపదేశము చేసినను హిరణ్యకశిపుని మనస్సున మృత్యుభయమున్నది. తన తమ్ముని చంపినట్లే విష్ణువు తన్నుకూడా ఎప్పుడో ఏదో రూపమున చంపవచ్చు ననుకొన్నాడు. కాబట్టి మృత్యువెన్ని విధముల వచ్చుటకు వీలున్నదో అతడు పరిశోధన కొనసాగించుచుండెను. ఆ మృత్యువు వచ్చుమార్గము లెన్నియో లెక్క గట్టి ఎన్ని మార్గములైనను మూసివేయుదమనుకొన్నాడు. కాదయ్యా ఇంత పరిశోధన ఎందుకు? ఇంత గోల ఎందుకు? అసలు నాకే విధముగను మృత్యువు రాకూడదని యడుగరాదా. నాకు మృత్యు వుండరాదని యడుగరాదా యన్నచో నదియే చమత్కారము. హిరణ్యకశిపుడు వాని పరిశోధనా పాటవము కూడ చూపితమనుకొన్నాడు కానియనుకొనుటలో నట్టికోరికయే కాక వాని యహంకారము గూడ నున్నది. అహంకార మెప్పుడును అపరిపూర్ణమే కావున యెంత జాగరూకముగా పరిశోధించి లెక్క గట్టినను యొకటి మిగిలిపోయియే యుండును. ఎక్కడో ఒకచోట ఒక సూదిమొనయంత బెజ్జముండును. అది వీనికి కన్పించదు. వానికి కన్పించును. అందు కని వీ డడిగెను. ఆయన యిచ్చెను. తెలియక వీ డడిగినను తెలిసి యాయన యిచ్చినను, ఆ మృత్యువెట్లు రావలయునో హిరణ్యకశిపుని మాటలలోనే యున్నది. ఇదంతయు ఎందుచేత? వానియందు శాపవశమున కలిగిన పైత్యలక్షణముచేత. అసుర సంపత్తిచేత. సత్త్వగుణము దైవసంపత్తును, రజస్తమస్సులాసుర సంపత్తును కల్గించునవి. పూర్వజన్మమునందు వానిలో బీజప్రాయముగానున్న రజస్తమస్సులు వానియం దాసుర భావముగా వికసించినది. వాని కాత్మ నిత్యమని శరీరమనిత్యమని తెలిసినను సర్వాత్ముడైన విష్ణుని చంపవలెనని యనిత్యమైన తన శరీరమును నిత్యము చేసికొనవలెనని యభినివేశము. ఇది వానికి మూలభూతమైన భావము. దానిని ముట్టుకొననంతవరకు వాడు వివేకియే. కావున తత్వజ్ఞాన ముపకరింపవలెనన్న ఆత్మవిమర్శనముండవలెను. తనలోని దోషములను తొలగించుకొనుటకు ప్రయత్నము చేయవలెను.

(శేషం.

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:
**ఎట్ ది హోలీమదర్స్ ఫీట్**

అనువాదము:
**పి. గణపతిశాస్త్రి**

దానిమీద ఠాకూరు "అయితే నేను ఆ పాలన్నీ హరాయించుకోగలనా? అలాగయితే నాకు జబ్బుచేసి తీరుతుంది!" అన్నారు. ఆయన అన్నట్టుగానే ఆనాడే జబ్బుపడ్డారాయన. ఆవేళ సాయంత్రం ఏమీ తినలేదాయన. ఠాకూరుకోసం వండినఅన్నం అంతా అలాగే ఉండిపోయింది. నేను కొంచెం సగ్గుజావ తయారుచేశాను. ఆపైన గోలాప్‌మా నాతో "అమ్మా! నాతో కొంచెం ముందుగా చెప్పి ఉండవలసింది! లేకపోతే ఆయన పరిస్థితి నాకెలాగ తెలుస్తుంది? ఇప్పుడాయన అన్నం తినకుండా పస్తుండిపోయారు." అన్నది. ఆ మాటల నేనందుకుని "ఆయనచేత కాస్త అన్నం తినిపించడానికి ఇలాంటి చిన్నచిన్న అబద్ధాలు చెప్పినంతమాత్రాన తప్పేమి లేదు. బతిమాలుతూ, బామాలుతూ ఆయనచేత నేనలాగే అన్నం తినిపిస్తున్నాను." అన్నాను.

నేను: అయితే అంతా మనస్సే అని తేలిపోతూంది.

అమ్మ: అవును నాయనా! ఆయ నా పాలకొలతల సంగతి చెప్పిఉండకపోతే పూర్వంలాగే ఆహారం తీసుకుంటూ ఉండేవారు.

విభూతిబాబు నేను సాయంకాలం కాగానే భోజనానికి కూర్చున్నాము. "రాధూ ఉన్మాదం తగ్గడానికి ఎవరయినా సత్పురుషులు రక్ష రేకు ఇస్తే బాగుండిపోను." అని నేను అతనితో అన్నాను. నెప్పులు, బాధలు తగ్గడానికి అనేకులకు కలలలో తగిన మందులసంగతి తెలుస్తూంది. కాని దురదృష్టవశాత్తు రాధూకి అటువంటి అదృష్టం కలగలేదు."

అమ్మ: అవును బాబూ, ఎవ్వరికి రాధూ మీద జాలి కలగడంలేదు; నాకొకప్పుడు చాలా జబ్బు చేసింది. నా ఒళ్ళంతా వాచింది- ముక్కులోనుండి, చెవులలోనుండి అదేపనిగా నీరు కారింది. ఆ సమయంలో సింహవాహినీ దేవాలయం ప్రాంగణంలో ప్రాయోపం చెయ్యవలసిందని నా సహోదరుడు ఉమేశ్ ప్రోత్సహించాడు.

'ఆ దేవాలయం ప్రాంగణందాకా కూడా నన్ను వెంటబెట్టుకుని వెళ్ళి గట్టి ప్రోద్బలం కలిగించినవాడుకూడ అతడే. నా నేత్రాలముందు పున్నమ చంద్రుడుకూడా బహుళ పాడ్యమినాటి జాబిల్లిలాగే కనిపించాడు. ఆ సమయంలో నా కంటి కేమి ఆనలేను. కళ్ళనీళ్ళు అదేపనిగా ప్రవహించడం ప్రారంభించాయి. అందుచేత చూపు పూర్తిగా లోపించింది.

నేను వెళ్ళి ఆ సింహవాహినీమాత దేవాలయం ముందు ప్రాయోపవేశం ప్రారంభించాను. పరిస్థితులిలాగుండగా నాకు గ్రహణికూడా తోడయింది. అయినా నేను అలాగే పడుకుని ఉన్నాను.

ఆ తరవాత పన్నెండు, పదమూడేళ్లున్న ఒక అమ్మాయి మా అమ్మదగ్గిరికి బయలుదేరింది, ఆ పిల్ల అచ్చంగా మా ఊరి కమ్మరి కూతురులా కనిపించింది. 'ఆ అమ్మాయి మా అమ్మను చూస్తూనే ఇలాగ తొందరపెట్టింది.

"వెళ్ళవమ్మా! త్వరగా వెళ్ళి మీ అమ్మాయి నిక్కడికి తీసుకునిరా! అంత జబ్బుగాఉన్న మనిషిని అక్కడ మీ రెలాగ విడిచిపెట్టగలిగారు? వెంటనే వెళ్లి ఇక్కడికి తీసుకునిరండి! ఇదిగో, ఈ మందు వాడండి! ఇందువల్ల ఆమె జబ్బు తప్పకుండా నయమవుతుంది!"

ఆ తరవాత ఆమె నా దగ్గిరికి వచ్చి "అమ్మా! గుమ్మడిపూల రసంలో కొంచెం ఉప్పుకలిపి ఆ రసం చుక్కలు కొన్ని నీ కళ్ళలో వేసుకో! త్వరలోనే నీకు నింపాదిగా ఉంటుంది." అని చెప్పింది. అదే విధమయిన మందు మా అమ్మ చేతికికూడా ఇచ్చి దాని వివరాలన్ని చెప్పింది.

నేను అలాగే ఆ గుమ్మడిపూల చుక్కలు కొన్ని నా కళ్ళలో వేసుకున్నాను. వెంటనే నా రుగ్మత తగ్గింది. ఒక్కరోజులోనే కళ్ళజబ్బు పూర్తిగా తగ్గిపోయింది. నా వాపు లన్ని పూర్తిగా తగ్గిపోయాయి. నా రోగం పూర్తిగా తగ్గింది. నా జబ్బు అంత త్వరగా తగ్గడానికి కారణమేమని అడిగిన ప్రతివారి తోను నాకు అమ్మవారొక మందు ఇచ్చిందని చెప్పాను" అప్పటినించి ఆ సింహవాహినీ మాత మహిమ ఆ ప్రాంతంలో అంతట బాగా వ్యాపించింది.

"మా అమ్మకుకూడా సింహవాహినీ దేవత ఇంకొకప్పుడు కలలో కవిపించింది. మా పల్లెలో అప్పుడు కాళీ పూజచేస్తున్నారు. దానికి ప్రతి ఏడాది మేము కొంత బియ్యం ఇస్తూండే వాళ్ళము. అయితే ఆ ఏడాది నబముఖర్జీ మా దగ్గిరనుంచి ఆ బియ్యం చందా వసూలు చెయ్యలేదు. మా మీద కక్షకట్టి అత డాపని చేశాడు."

"మా అమ్మ ధాన్యం దంచి ఆ బియ్యం సిద్ధం చేసింది. అయినా నబముఖర్జీ ఆ బియ్యం తీసుకోడానికి మా ఇంటికి రాలేదు."

"నేనీ బియ్యం కాళికాదేవికోసం సిద్ధం చేశాను. అయినా వాళ్ళది తీసుకుపోవడాని కంగీకరించడం లేదు." అంటూ మా అమ్మ రా తెల్లవార్లు రాగాలు పెడుతూనే ఉంది. "అయ్యో! ఇప్పుడా బియ్యం ఎవరు తీసుకుంటారు? కాళికాదేవికోసం సిద్ధంచేసిన బియ్యం ఎవరు స్వీకరిస్తారు?" ఈ విధంగా ఆమె ఎంతయినా ఆరాటపడింది.

ఆనాటి రాత్రి అమ్మ కలలో జగద్ధాత్రీదేవి కనిపించింది. ఆ దేవత ఎఱ్ఱని నెమ్మేని ఛాయతో గుమ్మందగ్గిర కూర్చున్నది. ఆమె అమ్మను తట్టి నిద్రనుండి మేలుకొలిపి అన్నది.

"ఎందు కలాగ రాగాలు పెడతావు! కాళికాదేవి బియ్యం నేను స్వీకరిస్తాను."

ఆ పైన అమ్మ "ఎవరమ్మా నీవు!" అని అడిగింది. దానిమీద జగద్ధాత్రి నే నీ ప్రపంచానికంతటికి కన్నతల్లిని. జగద్ధాత్రి రూపంలో నీవుచేసిన పూజ స్వీకరిస్తాను." అని సమాధానం చెప్పింది.

మరునాడు అమ్మ నాతో "శారదా! ఎఱ్ఱగాఉన్న ఆ దేవత ఎవరమ్మా. బాసింపట్టు వేసుకుని కూర్చున్న ఆ జగద్ధాత్రీదేవికి నేను పూజ చేస్తానమ్మా!" అని చెప్పింది. ఎటువంటి పరిస్థితిలోనయినా జగద్ధాత్రీపూజ అమ్మకొక వెఱ్ఱిధోరణిలా తయారయింది.

దానికోసమామె 13 మణుగుల ధాన్యం స్వీకరించాలని నిశ్చయించుకున్నది. అప్పుడు రాత్రిం బగళ్లు ఒకటే వాన, ఒక్కనాడు కూడా తెరపి ఇయ్యలేదు. "అమ్మా! ధాన్యం కూడా గా ఆరడంలేదు. మరి ఇంకెలాగ నీకు పూజచెయ్యగలనమ్మా! జగద్ధాత్రీ!" అంటూ అమ్మ ఆక్రోశించింది.

చిట్టచివరికి ఆ జగద్ధాత్రి దయవల్ల ఎండ కాసింది. మిగిలిన ప్రదేశాలలో అంతట వాన కురుస్తున్నా, ధాన్యం ఎండబెట్టినచోట మాత్రం ఎండ కాసింది. కఱ్ఱలుకాల్చి జగద్ధాత్రి ప్రతిమకు వేడి తగిలేటట్టుచేసి, ఆ ప్రతిమ ఎండబెట్టారు. ఆ పైన ఆయా రంగులు పూశారు...ఆ ప్రకారంగా మొత్తం పూజ

అంతా పరిసమాప్తమయింది. ఆ పల్లెలోని వారినందరిని పూజామహోత్సవానికి ఆహ్వానించారు. ఆ ధాన్యం దంచగా వచ్చినబియ్యంతో అన్ని ఖర్చులూ సర్దుబాటయ్యాయి.

ఇక జగద్ధాత్రీ ప్రతిమను జలనిమజ్జనం చేసే తరుణం వచ్చింది. ఆ సమయంలో అమ్మ ఆ ప్రతిమ దగ్గిరికి వెళ్ళి ఎంతో ఆప్యాయంగా "అమ్మా! జాగాయీ, ముందుసంవత్సరం కూడా నీవు తప్పకుండా రావాలమ్మా! నీ పూజకోసం ఈ ఏడాది అంతా ప్రయత్నం చేస్తూనే ఉంటానమ్మా!" అంటూ చెవిలో చెప్పింది.

ఆ మరుసటి సంవత్సరం అమ్మ నా దగ్గిరికి వచ్చి "అమ్మా! శారదా! మేమంతా జగద్ధాత్రి పూజ చేస్తున్నాము. నీవుకూడా కొంత సాయం చెయ్యాలి." అన్నది.

నేను దానిమీద "అమ్మా! ఒకసారి ఆ పూజ చేశాంగదా! మళ్ళీ ఆ బరువంతా నెత్తిమీద వేసుకోవడం ఎందుకు? అవసరం లేదు! ఆ బాదరబందీ అంతా నేను పడలేనమ్మా!" అంటూ సమాధానం చెప్పాను. ఆ రాత్రి నాకు ముగ్గురు దేవీమూర్తులు కలలో కనిపించారు. అది తలుచుకుంటూనైనా ఒళ్లు వణుకుతుంది.

నేను : ఎవరమ్మా, ఆ దేవీమూర్తులు?

అమ్మ : జగద్ధాత్రి, జయ విజయ అన్న ఆమె సమాచారిణు లిద్దరూను.

ఆ తరవాత ఆ దేవత నాకేసి తిరిగి "అయితే మేమింక వెళ్ళిపోవలసిందేనా?" అని ప్రశ్నించింది. "మీా రెవరు?" అని అడిగాను నేను. "నేను జగద్ధాత్రిని" అని సమాధానం చెప్పింది ఆ దేవత.

నేను : వద్దు! వద్దు! మీారు వెళ్ళవద్దు! ఎక్కడికి వెళ్ళిపోతారు మీారు? దయచేసి మీారిక్కడే ఉండిపొండి. వెళ్ళిపోవలిసిందని నేను అన లేదు.

అప్పటినించి నేనిక్కడ జగద్ధాత్రీ పూజకు ప్ర ఏడాది వస్తున్నాను. ఆ సమయంలో పాత్రసామానులు శుభ్రంగా తోమి సిద్ధం చెయ్యాలి. ఆ రోజుల్లో పాత్రలు సిద్ధం చెయ్యడానికి మా ఇంట్లో ఎవ్వరు ముందుకు వచ్చేవారు కాదు అందుచేత ప్రత్యేకించి పాత్రలు పరిశుభ్రం చెయ్యడానికే నేను వచ్చేదాన్ని. ఆ తరవాత జోగీన్ కష్టంతో పాత్రసామానులు తయారుచేయించాడు. "అమ్మా! నీ కింక పాత్రలుతోమి సిద్ధం చెయ్యవలసిన అవసరం లేదు." అని అన్నాడు. పూజాదికం కోసం అతడు భూమికూడా దానం చేశాడు! ఆహా! ఆ రోజుల్లో మా అమ్మ సాక్షాత్తు లక్ష్మిలాగే పూజకు కావలసిన సంబారాలన్ని సంవత్సరం పొడుగునా జాగ్రత్త చేస్తూండేది."

నాకు కొద్దిగా గ్రహణి ప్రారంభమయింది. అమ్మ కీ విషయం తెలియగానే "వారణాసిలో కూడా అతనికి గ్రహణం వచ్చింది. అతనికి అప్పుడప్పుడు ఇదేవిధంగా గ్రహణం వస్తూంటుంది." అన్నది.

నేను : మా కుటుంబంలో అందరికి ఈ రుగ్మత కనిపిస్తూంటుంది అమ్మా! నా తండ్రి మొదలయినవారు ఎంతోమంది ఈ రోగంతో మరణించారు. విభూతి నా ప్రసంగం విని "అదేమిటి అలాగ మాట్లాడతావు? ఎప్పుడో అప్పుడు తండ్రి మొదలయినవారు ఏ రోగంతో మరణిసే మాత్రం మునిగిపోయిందేమిటి?"

అమ్మ : అవును అలాంటి పోలికలు తీసుకురాకూడదు. ఎప్పుడు ఎవరు ఏవిధంగా చని

పోయినా మునిగిపోయిందేమిటి? తండ్రి ఎవరు? తల్లి ఎవరు? అంతా ఆ భగవానుడే!

జయరాంబాటి, 14 జూలై, 1913: మాతృదేవి గదిముందున్న వరండాలో నేను, బాబూ ముకుందసాహా మా మధ్యాహ్న భోజనాలు కానిస్తున్నాము. ఆమె తన సహోదరుని భాగం వరండా తూర్పుమూలలో కూర్చున్నారు. అంతలోనే నీళ్లు కారుతున్న చీరతో నళిని అక్కడికి వచ్చింది. కాకి తనమీద మూత్రవిసర్జన చెయ్యడంవల్ల తిరిగి స్నానం చెయ్యవలిసి వచ్చిందని చెప్పింది.

అమ్మ: నేను బాగా పెద్దదాన్ని అవుతున్నాను గాని ఇంతవరకు కాకి మూత్రవిసర్జనం చెయ్యడం మాటే ఎన్నడు వినలేదు! అంతటి అపవిత్రమయిన మనస్సుండడానికి పూర్వజన్మలో చాలా పాపకృత్యాలు చేసి ఉండాలి.''

దానిమీద నే నన్నాను.

నేను: మహా పురుషమహరాజ్ [స్వామి శివానంద] కుక్కల నెంతో ఆప్యాయంగా లాలించి, ఆపైన-భోజనం అయినతరవాత చేతులు కడుక్కున్నట్టు- తమచేతి వేళ్లమీద కొంచెం నీరు చిలకరించి, పూజ కుపక్రమించడం కళ్లారా చూసాను.

అమ్మ: అవును! అటువంటివారి ధోరణే వేరు! అతి పవిత్రములయిన మనస్సు లున్న వారు వారు! అంటే వారి మనస్సులు తపోనిధుల మనస్సు లన్నమాట! గంగాతీరంలో నివసించేవారు. కేవలము అసురుల వంటివారే! లేకపోతే వారక్కడ నివసించడమన్నది ఎన్నటికినీ సంభవించనేరదు! గంగలో ప్రతిదినము స్నానం చేస్తూంటే ఏనాటి పాపాలామరు నాటికే పూర్తిగా నశించిపోతాయి.

దానిమీద నళిని అందుకుంది.

నళిని: ఉద్బోధన కార్యాలయంలో ఒక నాడు, గోలాప్ అక్కయ్య పాయఖానాలు తుడిచి పరిశుభ్రం చేసింది. వెంటనే బట్టలు మార్చుకుని ఠాకూరు పూజకోసం పళ్లు ఒలిచి సిద్ధంచెయ్యడం మొదలుపెట్టింది. "గోలాప్ అక్కయ్యా! ఏమిటే పని? వెంటనే వెళ్లి గంగలో స్నానంచేసిరా!'' అని హెచ్చరించాను నేను. దానిమీద గోలాప్ అక్కయ్య "నీవే వెళ్లి గంగలో స్నానంచేసిరా!'' అని ప్రతి సమాధానం చెప్పింది.

అమ్మ: గోలాప్ మనస్సు చాలా ఉదాత్తమయినది. పవిత్రమయినది. కనకనే ఇది పవిత్రమయినదని, ఇది పవిత్రమయినది కాదని ఇలాంటి శషభిష లేవీ లేవామెకు! ఇది గోలాప్ చిట్టచివరి జన్మ. నళినీ, నీకలాంటి పునీతమయిన మనస్సు ఏర్పడాలంటే నీవింకొక శరీరంతో జన్మించాలి...చిర కాలాభ్యాసంవల్ల మనస్సు పునీత మవుతుంది. దైవభక్తి పెంపొందితేగాని మనస్సు నిర్మలం కానేరదు. భగవానుని సాక్షాత్కార భాగ్యం లభించినపిమ్మట ఏమి జరుగుతుంది? రెండు కొమ్ములుగాని మొలచుకువస్తాయా? కాదు! అలాంటిదేదీ జరగదు! అయితే మనస్సు మాత్రం మిక్కిలి పునీతమవుతుంది! ఆ పవిత్రమయిన మనస్సులోనే విజ్ఞానజ్యోతి ఉదయిస్తుంది.

నేను: కేవలము భగవానునిమీదనే ప్రశాంతహృదయంతో ఆధారపడి, ప్రత్యేకించి తమంతట తామై ప్రయత్నించనివారికి భగవసాక్షాత్కార మెలాగ కలుగుతుంది?

—సశేషం.

# మానవజన్మ పరిణామముతో భగవదవతారముల సారూప్యము

తాడిమేటి కోదండపాణి

బ్రహ్మాండసృష్టి ఏ విధముగా జరిగెనను ప్రశ్నకు యిదమిత్థమను సమాధానము లేదు. పిపీలికాది బ్రహ్మపర్యంతము ... పరిణామ క్రమములో కైవల్య ... మానవజన్మ కడసారి మెట్టుగా విజ్ఞులు విశదీకరించిరి. శ్రీ భగవత్పాదులు శంకరాచార్యులు యీ విషయములో తెలవిచ్చిన అంశము :—

**జంతూనాం నరజన్మ దుర్లభమతః పుంస్త్వం తతోవిప్రతా**
**తస్మాద్వైదిక ధర్మమార్గ పరతా విద్వత్వమస్మాత్ పరమ్**
**ఆత్మానాత్మ వివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితిః**
**ముక్తిర్నోశత జన్మ కోటి సుకృతైః పుణ్యైర్వినా లభ్యతే॥**

ఎట్లన :

1. మత్స్యావతార స్థితిలో :—

జీవి జలచరమగు మత్స్యమువలే మాతృగర్భమందు ఉపాదిని సంతరించుకుని (మాయా) ద్రవములో వృద్ధిచెందును. ఇచట మత్స్యమువలె ఉచ్ఛ్వాస నిశ్వాస క్రియా రహితుడై తిరుగాడును.

2. కూర్మావతార స్థితిలో :—

ప్రసవాత్పూర్వము కూర్మమువలె అవయవములను పెంపొందించుకుని తన గర్భములో వాటిని ముడుచుకొని ఉచ్ఛ్వాస నిశ్వాసలు కలిగి బాహ్య ప్రపంచ దర్శనముకై నిరీక్షించుచు అవస్థ చెందుచుండును.

3. వరాహావతార స్థితిలో :—

మాతృగర్భపు (మాయా) జలమునుండి బయల్వెడలును. మృగప్రాయుడై యుక్తాయుక్త విచక్షణా రహితుడై కరచరణములను నాల్గు పాదములుగా జంతువువలె పారాడుస్థితి.

4. నరసింహావతార స్థితిలో :—

పసితనం గడచినదశ. స్వబుద్ధి నుపయోగించుటకు ప్రయత్నము చేయుచు సగజంతు లక్షణములు కల్గియు మానవ చైతన్యమును సంతరించుకొను స్థితికి జీవుడు చేరును. (నడక నేర్చిన బాల్యావస్థ).

5. వామనావతార స్థితిలో :—

బాల్యావస్థ గడచిన అనంతరం విద్యార్థిదశ. వటువు బ్రహ్మచర్యము నెరపుచు విద్యా సముపార్జనయే ధ్యేయముగా సంపూర్ణ మానవ లక్షణములతో విరాజిల్లుదశ. (విద్యార్థి స్వరూపమును యీ అవతారము సూచించును)

6. పరశురామావతార స్థితిలో :—

విద్యార్థి దశానంతరము, గృహస్థాశ్రమ స్వీకరణ పూర్వము మానవుని స్థితిని ఈ అవతారము సూచించును. పట్టుదల కలిగి రాజసిక ప్రవృత్తిలో సంచరించుదశ.

7. శ్రీ రామావతార స్థితిలో :—

సంపూర్ణమైన మానవదశ. గృహస్థాశ్రమ స్వీకారము. శ్రీ రామావతారమందలి విషయములన్నియు సాకల్యంగా గ్రహించి ఆదర్శముగా మనస్సు నిలిపి, తన విధుల నిర్వహణలో ఎన్ని కష్టములు వచ్చినను చలించక దృఢచిత్తముతో నిష్కామ కర్మానుష్టాన నిరతుడయి మానవత్వ సిద్ధి పొందవలెను. (ఇదియే మనమీ అవతారమునుండి నేర్చుకొనవలసినది.)

8. శ్రీ కృష్ణావతార స్థితిలో :—

మానవాతీత స్థితి. (వానప్రస్థము) ప్రాపంచిక విషయములతో సంబంధము కలిగియు శ్రీ కృష్ణుని లీలా విశేషములను మనసా గ్రహించి, తనపై ఆధారపడియుండు తన సంతతికి, బంధుమిత్రులకు, తదితర ఆశ్రితులకు

ఉపయుక్తుడగుచు సలహా సంప్రదింపులలో పాల్గొనుచు అవసర సహాయములు చేయుచు నిర్లిప్తుడై తామర కునందలి నీటి బొట్టువలె అంటీ అంటక జీవయాత్ర గడుపవలసిన స్థితి. యిందుల యవతారమే ఆదర్శము.

9. బుద్ధావతార స్థితిలో:

వయసు మీరి వృద్ధాప్యము వచ్చును. అస్థిరమైన లౌకిక బంధములను తొలగించుకొని కైవల్యపథముకై కృషిసల్పుటకు సర్వసంగ పరిత్యాగము గావించి, అనగా కోరికలన్నిటిని వదలి నిశ్చలమనస్సుతో సాధన చేయుచు పరమాత్మ సాక్షాత్కారముకై జన్మసార్థక మొనరించుకోవలెను.

మానవజన్మ ఎత్తిన ప్రతిజీవియు తన అర్హతకు అనుగుణముగా యీ అవతారములను అర్థము చేసికొని శ్రీ రామ, కృష్ణ, బుద్ధావతారములను ఆదర్శముగా గ్రహించి జీవయాత్ర సాగించిన శ్రీ కైవల్య పదంబు చేరుట సందేహమా?

"నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో నవిద్యతే
స్వల్ప మప్యస్యధర్మస్య త్రాయతే మహతో భయాత్"

అని శ్రీ భగవానుడు శెలవీయ లేదా?

# స్వా మి: త్రి గు ణా తీ తా నం ద

## డి. వి. బ్ర హ్మా జి

సన్యాసాశ్రమ స్వీకారానికి ముందు స్వామి త్రిగుణాతీతానంద పేరు శారదాప్రసన్న మిత్ర. ఈయన 1865 సం॥ జనవరి నెల 30 వ తేదీన కలకత్తాలోని 24 పరగణాలకు చెందిన ఒక సంపన్న కాయస్థకుటుంబంలో జన్మించారు. దుర్గామాత కరుణవలన జన్మించిన వరప్రసాదమని భావించి తల్లిదండ్రులు వీరికి శారదాప్రసన్న అని పేరుపెట్టారు. బాల్యంలో చదువుకునే రోజులలో స్వామి గొప్ప ప్రతిభావిశేషాలు కనబరిచారు. ఈయనకు తన పిన్నవయస్సులోనే వందలకొద్ది మంత్రాలు, ప్రార్థనాశ్లోకాలు కంఠతావచ్చు. చిన్ననాటినుంచికూడా శారదాప్రసన్న ప్రవర్తన సర్వజనాకర్షణీయంగా ఉండేది. సహజంగానే స్వామిలో ఉన్న ఆముష్మిక చింతనకు తండ్రిగారు ప్రోద్బలం కలిగించారు.

తన 14 ఏట శారదాప్రసన్న, శ్యామపురంలోని స్కూలులో చేరారు. శ్రీ రామకృష్ణకథామృతాన్ని వంగభాషలో రచించిన మాస్టర్ ఎమ్ అనబడే మహేంద్రనాథగుప్తా ఆ స్కూలుకు ప్రధానాధ్యాపకుడు. స్కూలు చదువు పూర్తిఅయి ఎంట్రన్సు పరీక్షకు హాజరవుతున్న రోజులలో స్వామి జీవితాన్ని మలుపుత్రిప్పిన సంఘటన ఒకటి జరిగింది. పరీక్ష రెండవ రోజున శారదాప్రసన్న అజాగ్రత్త వలన బంగారువాచి పోగొట్టుకున్నారు. దానితో మనస్సు వికలమయిపోయి మిగిలిన పరీక్షలు సరిగా వ్రాయలేకపోయారు. ఉత్తమోత్తమ శ్రేణిలో ప్రప్రథముడుగా ఉత్తీర్ణుడవుతాడని, ఎన్నో బహుమతులు ఉపకారవేతనాలు అందుకుంటాడని అందరూ ఆశించిన స్వామి, రెండవ తరగతిలో గట్టెక్కారు. అందువల్ల స్వామికి విచారం రెండింతలై మరింతగా కృంగిపోయారు. శారదాప్రసన్నను అమితంగా ప్రేమించే మహేంద్రనాథగుప్తా ఇదంతా చూచి, దుఃఖోపశమనం కలగచేయ

టంకోసం, తనవెంట శ్రీరామకృష్ణులవద్దకు కొనిపోయారు. గురుదేవుల సందర్శనమాత్రం చేతనే శారదాప్రసన్న మనోవ్యథ అంతా ఎగిరిపోయింది. పరమహంస అపూర్వాకర్షణ చేత ప్రభావితులయిన స్వామి తనకు వీలు చిక్కినపుడల్లా దక్షిణేశ్వరం వెళ్లివస్తుండే వారు. ఈ విధంగా చేతిగడియారం పోగొట్టు కోవడం అనే చిన్న సంఘటన కారణంగా శారదా ప్రసన్నకు రామకృష్ణుని పరిచయం లభించడం కేవలం భగవానుని లీలయేకదా ?

సంపన్నకుటుంబంనుంచి వచ్చినందున స్వామికి చిన్నచిన్న పనులు చేయడం అలవాటు లేదు. అట్లాంటి పనులన్నీ సేవకులు మాత్రమే చేయాలని ఆయన భావించేవారు. ఈ మనః ప్రవృత్తిని గురుదేవులు గ్రహించి ఎట్లా సరి దిద్దారో చూద్దాం. ఒక వేసవిరోజున శారదా ప్రసన్న తన మిత్రులతో కలసి శ్రీరామ కృష్ణునివద్ద చేరారు. అపుడు గురుదేవులు స్వామిని నీళ్లు తెచ్చి తనకాళ్లు కడగవలసిం దిగా అడిగారు. అట్లాంటి పనులు సేవకులే చెయ్యాలని స్వామి అభిప్రాయం. దానికి తోడు చుట్టూ తననెరిగినవాళ్ళంతా ఉన్నారు. శారదాప్రసన్న ముఖం కందగడ్డలాగా అయి పోయింది. ఏమి చేయడానికి తోచక నిల బడ్డారు. పరమహంస ఇదిచూచి నీళ్లు తెచ్చి కాళ్లు కడగమని మళ్ళీ ఆదేశించారు. స్వామికి మరి తప్పనిసరి అయింది. ఈ సంఘనతో స్వామిలో ఉన్న రాజసదర్పం అదృశ్యమయి దానిస్థానంలో సేవాభావం అంకురించింది. నిజమయిన గురువుల బోధనలు ఇలాగే గదా ఉంటాయి.

తర్వాత శారదాప్రసన్న కళాశాలలో చేరి చదువు కొనసాగించారు. మొదట్లో చాలా శ్రద్ధగా చదువుమీదే దృష్టినిల్పడంవల్ల గొప్ప ప్రతిభావంతుడని పేరు తెచ్చుకున్నారు. కాని, తరువాత, తరచుగా దక్షిణేశ్వరం వెళ్లి వస్తూండడంతో ఐహిక విషయాలమీద విముఖత్వంకలిగి విద్యార్జనను అశ్రద్ధ చేయ జొచ్చారు.

ఇదిచూచిన తల్లితండ్రులు స్వామిని సరి యైనదారిలో పెట్టాలంటే వివాహం చెయ్యటం ఒక్కటేమార్గమని భావించి, స్వామికి తెలియ కుండా వివాహ ప్రయత్నాలు మొదలెట్టారు. కాని, ఎట్లాగో ఈసంగతిని పసిగట్టిన స్వామి ఇంట్లోంచి పారిపోయి పూరి వెళ్ళిపోయారు. ఎంతో శ్రమపడి స్వామిజాడ తెలుసుకొని, వారి తల్లితండ్రులు పూరి వెళ్లి, స్వామిని తిరిగి ఇంటికి తీసుకువచ్చారు. అప్పటికి కళా శాలలో సంవత్సరాంత పరీక్షలు ఇంక నెల మాత్రమే ఉన్నాయి. అంతవరకూ స్వామి సరిగా పుస్తకం పట్టిఎరుగరు. అయినా సరే అపార మేధాసంపత్తిగల శారదాప్రసన్న ఆ నెలరోజులు చదివి మంచి మార్కులతో పరీ క్షలో ఉత్తీర్ణులయ్యారు.

స్వామిని సంసారంనయిపు మార్చాలని బంధువులు ప్రయత్నాలు చేస్తున్నకొలదీ, ఆయనలో సన్యాసికావాలన్న కోర్కె ప్రబలం కాసాగింది. చివరకు శారదాప్రసన్న సన్న్యాసాన్ని స్వీకరించి త్రిగుణాతీతానందస్వామియై బారానగర్ మఠంలో చేరిపోయారు. పుణ్య క్షేత్ర సందర్శనం అంటే స్వామికి ఎంతో ఇష్టం. సన్న్యాసి అయిన పిమ్మట స్వామి మధుర, అజ్మీరు, బృందావనం, జైపూరు కథియవారు, కైలాసం, మానససరోవరం మున్నగు [illegible]టినో దర్శించి వచ్చారు. మానససరోవర యాత్ర ఎంతో కష్టముతో కూడుకొన్నది. ఈ యాత్రా సమయంలో స్వామి అనేకసార్లు ఆశ్చర్యకరం

గా ఆపదలనుండి బయటపడటం జరిగింది. యాత్ర పూర్తిఅయినపిమ్మట కొన్నాళ్లు స్వామి కలకత్తాలో ఒక భక్తుని ఇంట ఉండి తీవ్ర మయిన గ్రంథపఠనంలో నిమగ్నులయ్యారు. ఇదే కాలంలో స్వామి ఓర్పును తెలియజెప్పే ఒక సంఘటన జరిగింది. స్వామికి వ్రణము అంకురించి, శస్త్రచికిత్స తప్పనిసరి అయింది. క్లోరోఫారంలాంటి మత్తుమందు ఏదీకూడా తీసుకోకుండానే, స్వామి శస్త్రచికిత్స చేయించు కొన్నారు. అరగంటదాకా కొనసాగిన ఆ శస్త్రచికిత్సలో, స్వామికి బాగా లోతయిన కుట్లే పడ్డాయి. అయినా, స్వామిముఖంలో ఈషణ్మాత్రము బాధయినా గోచరించలేదు. అంతటి స్థితప్రజ్ఞుడు స్వామి.

1897 సం॥ లో దినాజ్‌పూర్ జిల్లాలో క్షామం ఏర్పడగా, స్వామి అచటకు వెళ్ళి, కరువునివారణ కార్యక్రమాన్ని చేపట్టి, చక్కగా నిర్వహించారు. ఆ రోజులలో, స్వామి, కేవలం భిక్షుద్వారా లభించిన ఆహారాన్నిమాత్రమే తాను స్వీకరించేవారు. అన్నార్తులయిన దీనులకు ఆహారం అందజేయ టంలో రాత్రింబవళ్లు నిర్విరామంగా కృషి చేశారు. మన స్వామికి ఆహారం విషయంలో గల సంయమనం, ఆశ్చర్యకరమయినది. రోజుల తరబడి ఏ విధమయిన ఆహారమూ లేకుండా కేవలం ఒక్కపండుతో మాత్రమే ఉండగలరు. అదే స్వామి, ఒకోసారి మంచితిండి పుష్టిగల బలిష్ఠులు నలుగురు తినగల్గిన తిండిని తిని సునాయాసంగా జీర్ణించుకోగలిగేవారు. యాత్రాసమయంలో ఒకసారి, స్వామి ఒక చిన్నహోటలులో భోజనానికి వెళ్లారు. స్వామి తినే తిండిచూసి ఆ హోటలు యజమాని గుండె చెదిరి "స్వామీ మీ రింతవరకు తిన్నదానికి నాకు పైసా అయినా ఇవ్వనక్కర లేదు. కాని, ఈ తినటం మాత్రం ఇంక ఆపి నన్ను కనిక రించండి." అని బ్రతిమాలాడు. ఈ సంఘట నను స్వామి తర్వాతరోజులలో అప్పుడప్పుడు చెప్పి వినోదించేవారు,

శ్రీ రామకృష్ణుని ప్రవచనాలను వ్యాప్తి లోకి తేవడానికి, వేదాంతసారాన్ని అందరికి అందించడానికి, వివేకానందస్వామి వంగభాష లో "ఉద్బోధన" అనే మాసపత్రికను స్థాపిం చారు. ఈ పత్రికకు సంపాదకుడు, మేనేజరు - సర్వస్వమూ తానే అయి, దీని పురోభివృద్ధికి స్వామి తన సర్వశక్తులు ధారవోశారు. ఈ కృషిలో స్వామి తన శరీరారోగ్య స్థితినిగాని, అన్నపానాలగురించిగాని ఏమీ పట్టించుకొనే వారేకారు. ఆయన జీవిత సర్వస్వమూ "ఉద్బోధన"యే అయింది. ఇంత తల మున్కలుగా కార్యభారంలో, నిమగ్నమయ్యి న్నీ, స్వామి అనారోగ్యంతో బాధపడేవారికి సేవచెయ్యడంలో ఎంతో శ్రద్ధచూపేవారు. ఒకసారి ఉద్బోధన పత్రికలో పనిచేసే ఉద్యోగి ఒకరికి కలరా సోకింది. అది తెలియగానే స్వామి అతని చికిత్సకు తగు ఏర్పాట్లుగావించి, తానే స్వయంగా అతని చికిత్సను పర్యవేక్షిం చారు. జీతంతీసుకు పనిచేస్తున్న ఒక చిన్న ఉద్యోగి యెడల, యజమాని చూపించిన ఈ ఆదరానికి ఆ వ్యక్తికి కల్గిన ఆశ్చర్యానికి అవధిలేదు.

ఆతర్వాత, వివేకానందస్వామి ఆజ్ఞమేరకు స్వామి 1903 లో అమెరికాలోని శాన్ ఫ్రాన్సిస్కో పట్టణం చేరారు. స్వామి ఆధ్వ ర్యంలో అక్కడ వేదాంత సంఘానికి ఒక మందిరము, నిర్మింపబడింది. అమెరికాలో ఉన్నంతకాలం, సంవత్సరానికి ఒకసారి, స్వామి కాలిఫోర్నియా వెళ్లేవారు. శిష్యులతో

సహా, అక్కడ తురీయానందస్వామి నిర్మించిన శాంతి ఆశ్రమంలో ఉండేవారు. ఆ ఆశ్రమంలో తానున్నన్నాళ్లూ మంచి క్రమశిక్షణతో వేదాంత పాఠాలు బోధించేవారు. కొన్ని పూర్ణిమారాత్రులలో శాంతి ఆశ్రమ ప్రాంతంలో త్రిగుణాతీతానందస్వామి ''ధునియజ్ఞం'' నిర్వహించేవారు. ఆరుబయలు స్థలంలో కింద కూర్చొని, ఒకచోట నిప్పుచేసి దాని చుట్టూచేరి ఆధ్యాత్మిక సాధనలుచేస్తూ ఆ రాత్రంతా గడిపేవారు. దీనినే ''ధునియజ్ఞం అంటారు. శిష్యులకు బోధించడంలో స్వామి ఎంతో శ్రద్ధ కనబరచేవారు. సమయ నియమాన్ని అమలుపరచడంలో స్వామి ఆయనకు ఆయనే సాటి. తన శిష్యులకు సాత్త్వికమయిన ఆహారాన్ని సమకూర్చాలనే ఉద్దేశంతో, స్వామి తానే స్వయంగా ఆహారాన్ని వండి పెట్టేవారు.

శాన్ ఫ్రాన్సిస్కో వచ్చిన 2 వ సం॥ స్వామికి కీళ్ళవాతం వ్యాధి అంకురించింది. ఇతర శారీరక బాధలుకూడా శరీరంలో చోటుచేసుకున్నాయి. శీతోష్ణస్థితిలో మార్పు, తీవ్రమయిన సాధనా కార్యక్రమం, ఊపిరి సలుపని కార్యభారం ఇవన్ని కలసి స్వామి ఆరోగ్యాన్ని ఎంతగానో కృంగదీశాయి. స్వామి శరీరాన్ని వ్యాధులు ఎంతగా ఆశ్రయించాయి అంటే: ''ఈ నా శరీరం కేవలం నా ఆత్మ సంకల్ప బలం వలన మాత్రమే నిలచిఉంది; ఆ సంకల్పం వదలుకొన్ననాడు నా శరీరం దాని బరువుకి అదే ముక్కలుముక్కలుగా శిథిలం అయి పడిపోతుంది'' అనేవారు స్వామి. అయితే, ఇంత అస్వస్థగా ఉన్నాకూడా స్వామి దిన చర్యలో మార్పు ఉండేదికాదు. ఉదయమే 4 గం॥ లకే లేవటం, ఉపన్యాసాలు ఇవ్వటం, వేదాంతబోధనా తరగతులు తీసుకోవడం అన్నీ యథాప్రకారం నిర్వర్తించేవారు.

1914 సం॥ డిశెంబరు నెలలో 28 న త్రిగుణాతీతానందస్వామి శాన్ ఫ్రాన్సిస్కోలోని హిందూదేవాలయంలో అర్చన గావిస్తుండగా, మతిస్థిమితంలేని స్వామి పాతశిష్యుడొకడు, వేదికపైకి బాంబు విసిరాడు. ఆ బాంబు తాకిడికి స్వామికి తీవ్రమయినగాయాలు తగిలాయి: విసిరిన వ్యక్తి అక్కడికక్కడే మరణించాడు. అంత బాధలోనుకూడా స్వామి ఆ విసిరిన వ్యక్తిగురించి ఆవేదన చెందారంటే ఆయన మానసికౌన్నత్యం మనకు విశదం అవుతుంది. చివరకు త్రిగుణాతీతానందస్వామి 1915 సం॥ జనవరి నెల 10 న మహాసమాధి చెందారు.

తన కెవ్వరూ నిద్రాభంగం చెయ్యకుండావుండాలని ఒకడు గదితలుపు బిడాయించుకొని పడుకుంటాడు. నిద్రలో కళ్లు మూసుకుంటాడు కనుక బయటవస్తువు లేవీ కనిపించవు. కాని, కలలో ఒక విశాలప్రపంచాన్ని, అందులో జనాన్ని తనునుకూడ చూస్తాడు. అదంతా ఎక్కడిది? తన మెదడులో విస్తరిల్లినదే కద! చిన్న మెదడులో అంత విశాలప్రపంచం ఎలా పట్టింది? ఈ జగత్తు కేవలం మనోభావమనీ, మనోభావ పరంపరయనీ తరచుగా చెప్పబడే దానిని ఈ దృష్టాంతం విశదీకరిస్తుంది.

-రమణమహర్షి.

# అష్టావక్ర విజయము

## సదాశివం

ఒక గురుదగర శిష్యులున్నారంటే వారిలో కొందరు చదువులో చురుకైన వారుగాను మరికొందరు మందబుద్ధులుగాను ఉండడం సహజం. ఉద్దాలకుని శిష్యుడైన కహోడుడు ఈ రెండవ తరగతికి చెందినవాడు. అయినా అతనికిగల ఒక అరుదైన సుగుణం వలన గురువుకు అతడంటే చాల ఇష్టం. కహోడుడు ఎప్పుడూ గురువును నీడలాగ అనుసరిస్తూ చెప్పినపని చేస్తూ ఉండేవాడు. అదే అతని ప్రత్యేకత.

ఇట్లా చాలాకాలం గడిచింది. కహోడుడు ఇంకా అధ్యయనం చేస్తూనే ఉన్నాడుగాని అభివృద్ధి ఏమీ కనపడలేదు. చదువులో అట్లా వెనకబడిన కహోడుని తోటి శిష్యులు అప్పుడప్పుడూ 'బృహస్పతీ' అని ఎగతాళిగా పిలుస్తూండేవారు.

ఉద్దాలకునికి అది తెలిసింది. ప్రియతమ శిష్యులమీద గురువులకు తమ బిడ్డలమీద కన్నకూడ ప్రీతి ఎక్కువ కాబట్టి కహోడిని మీద ఆ సమయంలో ఉద్దాలకునికి అపారమైన కరుణ ఉద్భవించింది. తపఃప్రభావం బాగా ఉన్నవాడు కాబట్టి వెంటనే ఇట్లా సంకల్పించాడు. 'నా ప్రియతమ శిష్యుడైన కహోడునికి ఈ క్షణంలోనే అన్నివిద్యలు సంక్రమించును గాక!' అతడు సంకల్పించినట్లే కహోడుడు ఆ క్షణంలోనే గొప్ప పండితుడైపోయాడు. చదువులు పూర్తిఅయిన తరువాత శిష్యులకు గురువు అనుమతి ఇచ్చి పంపివేయడం సంప్రదాయం. దీన్నే 'సమావర్తనం' అంటారు. కాని ఉద్దాలకుడు కహోడుని ఆ విధంగా పంపివేయుటకు ఇష్టపడలేదు. అంటే శిష్యుని వేఱుబాటును సహించలేనంత ఆసక్తి పెరిగిందన్నమాట గురువుకు శిష్యునిమీద! తన కుమార్తె యైన సుజాతను అతనికిచ్చి వివాహం చేసి తన దగ్గరనే ఉంచుకున్నాడు.

కొంతకాలానికి సుజాత గర్భవతి అయింది. ఒకనాడు, కహోడుడు శిష్యులకు పాఠం చెప్పుచుండగా ఆవిడ అక్కడ ఉండుట తటస్థించింది. అప్పుడొక అద్భుతమైన సంఘటన జరిగింది. ఆ గర్భస్థశిశువు సామాన్యుడుకాదు. వామదేవుని కోవకు చెందినవాడు. కాని వామదేవునివలె 'అహం మనురభవగ్ం సూర్యశ్చ' అని పలికిఉంటే ఏ తంటా లేక పోయి యుండేది. కాని ఆ గర్భస్థశిశువు కహోడుని ఆక్షేపించుచు ఇట్లన్నాడు. 'తండ్రీ! నీవు రాత్రింబగళ్ళు ఎడతెరపిలేకుండ అధ్యయనం చేయుచునే ఉన్నావు గాని నీ ఉచ్చారణలో ఇంకన్ను మెఱుగు కనపడలేదు.' శిష్యులందఱు ఆశ్చర్యంతో తలలెత్తి అటు ఇటు దిక్కులు చూశారు – 'ఎవరా ఈ మాటలన్నది?' – అనే ఔత్సుక్యంతో. ఆ మాటలు ఎక్కడనుంచి వచ్చింది అన్నది సుజాతకు తెలుసు, కహోడునకు తెలుసు. శిష్యుల ముందఱ తనకు తలవంపులు తెచ్చేవిధంగా ఆక్షేపించిన ఆ గర్భస్థ శిశువును కహోడుడు కోపంతో ఇట్లా శపించాడు. 'కుక్షిలోనుండి బైట పడకముందతే ఇట్లా మాట్లాడుచున్నావు గనుక నీవు ఎనిమిది వక్రములతో బుట్టుము'

పదవమాసం జరుగుచుండగా ఒకనాడు ఏకాంతంలో సుజాత భర్తతో ఇట్లనింది. 'ప్రసవకాలం సమీపిస్తున్నది. ఇంటిలో ధన ధాన్యములేవీ లేవు. ఈ ఇక్కట్టును ఎట్లా గట్టెక్కుట? మీరేదైనా ఆలోచించి ప్రయత్నంచేయండి.'

కహోడుడు ఆలోచించాడు. 'జనకుని ద్వాదశవార్షిక సత్రం జరుగుచున్నదిగదా! అక్కడికివెళ్ళి ప్రయత్నించితే ఏదైనా సమకూరదా?' అనుకొని బయలుదేరాడు. ఆ రోజుల్లో జనకుని ఆస్థానంవైపు వెళ్ళడానికే భయపడేవాళ్ళు పండితులు! అక్కడ బంది అనే వాదనిపుణుడొకడు చోటుచేసికొన్నాడు. ఆస్థానంలో ప్రవేశించే వాళ్ళనందరిని సవాలు చేసేవాడు వాదానికి రమ్మని. వాదానికి సిద్ధమై ముందుకు వచ్చినవాళ్ళను కొంతసేపటిలో చిత్తుగా ఓడించి తరువాత వాళ్ళను నీటిలో ముంచివేసేవాడు. గురువు అనుగ్రహం తనకున్నది గదా అనే ధైర్యంతో కహోడుడు జనకుని ఆస్థానం ప్రవేశించాడు. బందితో వాదానికిదిగి చిత్తుగా ఓడిపోయాడు. అతనినికూడ బంది నీటిలో ముంచివేశాడు.

ఉద్దాలకునికి ఇది తెలిసింది. సుజాతను పిలిచి 'అమ్మా, జరిగిందేదో జరిగింది. కాని నీకు పుట్టబోయెడి బిడ్డకు ఎప్పుడూ ఈ విషయం చెప్పకుండ రహస్యంగా ఉంచు! అన్నాడు.

తరువాత కొన్నాళ్ళకు ఎనిమిది వక్రములు గల పిల్లవాడు పుట్టాడు. అష్టావక్రుడని అతనికి నామకరణం చేశారు. అతను ఉద్దాలకుని దగ్గరనే పెరిగి పెద్దవాడవుతుండినాడు. తండ్రి చెప్పినట్లే సుజాత అతనికి కహోడుని సంగతి చెప్పలేదు. రహస్యంగానే ఉంచింది. అష్టావక్రుడేమో ఉద్దాలకునే తండ్రిగా భావిస్తూండినాడు. తన ఈడువాడైన ఉద్దాలకుని కొడుకు శ్వేతకేతువును తనకు సోదరుడు అనుకుంటూ అతనితోబాటు బాల్యక్రీడలలో మునిగియుండినాడు.

ఇట్లా పన్నిండేండ్లు గడిచింది. ఒకరోజు అష్టావక్రుడు ఉద్దాలకుని ఒడిలో కూర్చొనియుండగా శ్వేతకేతువు అక్కడికి వచ్చాడు. 'మా నాన్న ఒడిలో నీ వెందుకు కూర్చున్నావు? పోయి మీ నాన్న ఒడిలో కూర్చో' అని అతడ్ని అక్కడనుంచి లాగి క్రిందకుతోసి తానక్కడెక్కి కూర్చున్నాడు.

అష్టావక్రుడు ఏడుపు ఆపుకోక 'ఓ' అని ఏడుస్తూ తల్లిదగ్గరకుపోయి 'అమ్మా! మా నాన్న ఎక్కడ?' అని వెక్కిళ్ళుపెట్టుతూ అడగాడు. కొడుకు ఏడుస్తుండడం చూచి సుజాత కూడ గట్టిగా ఏడవడం మొదలుపెట్టింది. తరువాత అతడిని దగ్గరకు తీసుకొని, ధారగా కారుచున్న కన్నీళ్ళను తుడుస్తూ జరిగిన సంగతంతా చెప్పింది. కహోడుడు జనకుని ఆస్థానానికి పోవడం, బందిచేతిలో ఓడిపోవడం, నీటిలో ముంచబడడం - అంతా విన్నాడు అష్టావక్రుడు.

వినినవెంటనే ఒక నిశ్చయానికి వచ్చాడు. శ్వేతకేతువు దగ్గరికివెళ్ళి 'ఓ శ్వేతకేతూ! జనకుడు ద్వాదశవార్షిక సత్రం చేస్తున్నాడు గదా! అది చాల అద్భుతంగా ఉందని చూచిన వాళ్ళందరు చెప్పుచున్నారు. అది పూర్తిఅయ్యే కాలంకూడ సమీపించిందంటున్నారు. మనం ఇప్పుడక్కడికి తప్పకుండా వెళ్ళవలెను. అక్కడ బ్రాహ్మణుల వాదోపవాదాలను విని ఆనందించవచ్చును. మంచి మంచి విందు భోజనములను ఆస్వాదించవచ్చును. ఆ యజ్ఞశాలయందలి వేదఘోషలు శ్రవణానందమును కలిగించుటేగాక పరమ మంగళకరముగను ఉండును. ఏది ఎట్లుండనీ. మనము అక్కడికి వెళ్ళినచో మన ప్రవచనశక్తికి ఉద్దీపన కలిగించుకొనినవారమగుదుము' - అని చెప్పి అతనిని వెంటబెట్టుకొని జనకుని యజ్ఞవాటమునకు బయలుదేరినాడు.

వారిద్దరు యజ్ఞవాటికను సమీపించునప్పుడు ఆ మార్గమున జనకుడున్ను వచ్చుచుండెను. 'రాజుగారు వచ్చుచున్నారు. మార్గ

మునకు అడ్డు తొలగుడు' – అని రాజసేవకులు బెత్తములను ఝుళిపించుచు బాలుర నుద్దేశించి అఱచారు. అప్పుడు అష్టావక్రుడు చలించక రాజువైపుచూచి ఇట్లన్నాడు :

'అంధస్యపంథా బధిరస్యపంథా
స్త్రియః పంథా వైవధికస్య పంథాః
రాజ్ఞఃపంథా బ్రాహ్మణేనాసమేత్య
సమేత్యతు బ్రాహ్మణస్యైవ పంథాః'

గ్రుడ్డివారు చెవిటివారు – ఇత్యాది వికలాంగులకు దారి ఇవ్వవలసిన దే. స్త్రీలకు దారి ఇవ్వవలసినదే. బరువును మోసికొని వచ్చుచున్నవారికిని దారి ఇవ్వవలసినదే. రాజునకును దారి ఇవ్వవలసినదే. కాని బ్రహ్మవేత్త ఎదురైనపుడు అడ్డు తొలగి దారి ఇవ్వవలసినది రాజుగాని బ్రహ్మవేత్తగాదు.

ఈ మాటలకు జనకుడు పరమాశ్చర్యమును పొంది 'కుమారా! ఇదిగో నీకు దారి ఇచ్చుచున్నాను. ఇష్టమున్న వైపునకు నీవు వెళ్ళవచ్చును. బ్రహ్మవేత్తలను ఇంద్రాది దేవతలు కూడ నిత్యము నమస్కరించుచున్నారని నేనును ఎఱుగుదును' – అన్నాడు.

తరువాత బాలురిద్దరు యజ్ఞవాటికద్వారం చేరుకున్నారు. అక్కడ ద్వారమునకు అడ్డుగా నిలబడియున్న ద్వారపాలకుని చూచి అష్టావక్రుడిట్లన్నాడు. 'ఓ ఇంద్రద్యుమ్నా! ఈ యజ్ఞం చూడాలనే కుతూహలం ఎక్కువగా వృద్ధి చెందినందువలన మే మిక్కడకు వచ్చాము. అతిథులమైన మమ్మిాక్షణంలో లోపలకు ప్రవేశపెట్టు. అడ్డగించి ఆలస్యంచేసి మాకు కోపమనే దారుణవ్యాధిని కలిగించవద్దు.

ద్వారపాలకుడు : మేము బంది ఆజ్ఞకు లోబడి ఆయన చెప్పినట్లు చేయువారంగాని నీవంటి బాలురకు భయపడువారం కాము. వృద్ధులైన విద్వాంసులకే ఇక్కడ ప్రవేశార్హత. నీబోటి బాలురకుకాదు.

అష్టావక్రుడు : మేమును వృద్ధులమే. మా బ్రహ్మచర్యవ్రతం వలనను, మా నేర్చిన వేద ప్రభావం వలనను ఇక్కడ ప్రవేశించుటకు మేము అరులం. ఓ ద్వారపాలకా! గురుశుశ్రూషాపరులం, జితేంద్రియులం, ఉపనిషత్ విజ్ఞాన పరినిష్ఠితులం అగు మమ్ము బాలురని తక్కువగా భావించకు.

ద్వారపాలకుడు : అబ్బాయీ! ఇక్కడ నుండి క్షేమంగా తిరిగి వెళ్ళిపో. పోయి, ఇంటి దగ్గర ఓం ఓం అని జపం చేసికో. బాలుడను సంగతి మఱచిపోయినట్లున్నావు. ఊరక ప్రగల్భాలు పలుకుచున్నావిక్కడ. నీ వెన్నిమాటలు నేర్పుగా చెప్పినా ప్రవేశం దుర్లభం అను సంగతి గుర్తించుకో.

అష్టావక్రుడు : ఒక శాల్మలవృక్షం చాల పొడుగు లావు కలిగి పెద్దదిగా కనపడుచున్నా ఫలపుష్ప హీనమైయున్నది. మఱొక శాల్మల వృక్షం చిన్నదిగా కనపడుచున్నా ఫలపుష్పములతో శోభించుచున్నది. ఈ రెంటిలో ఏది గొప్ప?

ద్వారపాలకుడు : డొంకతిరుగుడు మాటలు చెప్ప నేర్చినందువలన, బాలుడవైన నీవు జ్ఞానివై పోగలవా ఏమి? జ్ఞానము అల్పకాలంలో పొందగిన ఆటవస్తువు కాదబ్బాయీ! సంవత్సరాలు సంవత్సరాలుగా పరిశ్రమ చేసి చేసి జనులు వృద్ధులగునాటికే జ్ఞానవంతులగుట లోకంలో చూచుచున్నాము. కాబట్టి నీబోటి బాలురు జ్ఞానవంతులగుట కలలోని మాట. వృద్ధులైన విద్వాంసులకే ఇక్కడ ప్రవేశం.

అష్టావక్రుడు ; తల నెఱసినవాడు పెద్దవాడనుకొనుట పొరపాటు. జ్ఞానం కలవాడే

పెద్దవాడని దేవతల అభిప్రాయం. వయస్సును బట్టి, తల నెఱియుటనుబట్టి, ధనధాన్య సంపత్తినిబట్టి, బంధుమిత్రుల ప్రాబల్యాన్ని బట్టి, పూర్వ ఋషులు వ్యక్తులకు పెద్దదనాన్ని అంటగట్టలేదు. ఎవడు వేదాలను చక్కగా అధ్యయనం చేశాడో వానినే వారు పెద్దగా భావించారు. ముందు నన్ను లోనికి ప్రవేశ పెట్టు. తరువాత నీవే చూడగలవు, హెచ్చు తగ్గులు.

ద్వారపాలకుడు : పదేండ్ల పసిబాలుడవు నీవు. మహామహులైన పండితులున్న సభలో నిన్నెట్లు ప్రవేశపెట్టగలను? అయినా ఇప్పుడు నిన్ను లోనికి పోనిచ్చెదను. అక్కడ నీ ప్రయత్నం నీవు చేసికొనుము.

అట్లాయజ్ఞశాలలోనికి ప్రవేశం సంపాదించుకొని అష్టావక్రుడు లోపలికి అడుగు పెట్టీ పెట్టగనే ఇట్లన్నాడు. 'భో భో జనకమహారాజా! నీవు మీ వంశీయులందరిలోను వరిష్ఠుడవు. మిక్కిలి గౌరవింపదగినవాడవు. సర్వము నీ యందు సమృద్ధి వహించియున్నది. యజ్ఞయాగాదులు గొప్పగా చేసినవారలలో యయాతికి తరువాత నీకు మించినవాడు మఱొకడు పుట్టలేదు. ఇప్పుడు బందియనునాతడు నీ ఆశ్రయమును పొంది ఇక్కడకు వచ్చు విద్వాంసుల నందఱను వాదములో ఓడగొట్టుచు నీట ముంచుచున్నాడని విని యున్నాము. అందుకే ఇక్కడికి వచ్చినాము. వాని వాద ప్రతాపము మా ముందఱ, నక్షత్ర ప్రకాశములు సూర్యప్రకాశము ముందఱ నశించునట్లు, నశింపోగలదు. ఎక్కడున్నాడా బంది? చూపించుడు.'

జనకుడు : బందియొక్క వాక్యబలం తెలియకుండ అతనితో వాదించాలని ఉబలాట పడుచున్నావు. వాద నిపుణులైన గొప్ప గొప్ప పండితుల నెందఱినో బంది సునాయాసముగా జయించియున్నాడు. ఆ సంగతి నీకు తెలియదా?

అష్టావక్రుడు : మా వంటివారితో ఇంత వరకు అతడు వాదించియుండలేదు. అందుకే అందరు అతనిని సింహం సింహం అని పెద్ద చేసినారు. అతడును భయము సంకోచము అనునది కొంచముకూడ లేకుండ విఱ్ఱవీగుచున్నాడు. నేడు వాదములో మమ్మెదుర్కొని ఆ బంది, ఇరుసువిరిగిన బండివలె, పడిపోగలడు.

బాలుని ఆ ఆత్మవిశ్వాసం చూచి జనకుడు లోలోన చాల సంతోషించాడు. అయినా బాలుని శక్తి సామర్థ్యాలను పరీక్షించకుండ బందితో వాదానికి అనుమతించరాదని తలచి అష్టావక్రుని కొన్ని ప్రశ్న లడిగాడు.

జనకుడు : ఆరు నాభులు, పన్నిండు అక్షములు, ఇరువదినాలుగు పర్వములు, మూడు వందల అరువది ఆకులను ఎఱిగినవాడే వేదార్థమును ఎఱిగినవాడు, కవి, అని చెప్పబడును. అది ఏమిటో నీ వెఱుగుదువా?

అష్టావక్రుడు : ఆరు ఋతువులను నాభులు, పన్నిండు మాసములను అక్షములు, ఇరువది నాలుగు పక్షములను పర్వములు, మూడు వందల అరువది దినములను ఆకులుగల 'కాల చక్రము' నిన్ను రక్షించుగాక!

జనకుడు :

వడవే ఇవ సంయుక్తే శ్యేనపాతే దివౌకసాం
కస్తయోర్గర్భమాధత్తే గర్భంసుషువతుశ్చకం.

అష్టావక్రుడు :

మాస్మ తే తే గృహే రాజన్ శాత్రవాణామపి ధ్రువం
వాతసారథిరాధత్తే గర్భం సుషువతుశ్చ తం.

జనకుడు : నిదురపోవునప్పుడు కన్నులు మూయనిదేది? జన్మించియు కదలనిదేది? హృదయము లేనిదేది? వేగముచే వర్ధిల్లునదేది?

అష్టావక్రుడు : నిదురపోవునప్పుడు కన్నులు మూయనిది చేప. పుట్టియు కదలనిది అండము. హృదయములేనిది ఱాయి. వేగముచే వర్ధిల్లునది నది.

జనకుడు : కుమారా! నీవు కేవలము మనుష్యబాలుడవు కావు. దేవసమానుడవు. నీతో సమముగా వాక్యప్రలాపము చేయువారెవరును ఉండరని నేను నమ్ముచున్నాను. కాబట్టి నీకు వాదమునకు అనుమతి ఇచ్చుచున్నాను. ఇదుగో చూడుము. ఇక్కడే బంది ఉన్నాడు.

బంది : ఓయీ బాలుడా! నిదురించున్న పులిని తట్టి లేపుచున్నావెందుకు? నాగుబాము తలను కాలితో రాచుటకు ప్రయత్నించుచున్నావెందుకు? పర్వతమును పిడికిలితో పొడుచుటకు పూనుకొనుచున్నావెందుకు?

అష్టావక్రుడు : బందీ! వట్టి మాటలతో కాలక్షేపమెందుకు? ఇక వాదమునకు దిగుదము. నేను చెప్పు వాక్యమునకు నీవు బదులు చెప్పెదవా? లేక నీవు చెప్పు వాక్యమునకు నేను బదులు చెప్పనా?

బంది :

ఏక ఏవాగ్నిర్బహుధా సమిధ్యతే
ఏకః సూర్యః సర్వమిదం ప్రభాసతే
ఏకో వీరో దేవరాజో నిహంతా
యమః పితౄణామీశ్వరశ్చైక ఏవ.

బహుప్రకారముగా వెలుగుచున్నది ఒక అగ్నియే. ఈ సమస్త జగత్తునకు ప్రకాశమునిచ్చుచున్నది ఒక సూర్యుడే. శత్రుసంహారము చేయు వీరుడు దేవరాజు ఇంద్రుడు ఒక్కడే. పితృ దేవతలకు అధిపతి యముడొక్కడే.

అష్టావక్రుడు :

ద్వా వింద్రాగ్నీ చరతో వై సఖాయౌ
ద్వౌ దేవర్షీ నారదః పర్వతశ్చ
ద్వావశ్వినౌ ద్వే చ రథస్య చక్రే
భార్యాపతీ ద్వౌ విహితౌ విధాత్రా.

ఇంద్రాగ్నులు ఇరువురు సఖులై సంచరించుచున్నారు. దేవఋషులైన పర్వత నారదులు ఇరువురును అట్లే పరస్పరము స్నేహము కలిగి సంచరించుచున్నారు. అశ్వినులును ఇరువురే. రథముయొక్క చక్రములును రెండే. భార్యాభర్తలును ఇరువురే అని విధాత నియమించియున్నాడు.

బంది :

త్రిః సూయతే కర్మణా వై ప్రజేయం
త్రయో యుక్తా వాజపేయం వహంతి
అధ్వర్యవస్త్రిసవనాని తన్వతే
త్రయో లోకాస్త్రీణి జ్యోతీంషి చాహుః.

దేవ, మనుష్య, పశుజన్మలు – అను మూడు జన్మలను ఈ ప్రజలు తమ తమ కర్మానుసారము పొందుచుందురు. ఋక్, సామ, యజుర్వేదములు మూడును కలసి వాజపేయము మొదలగు యజ్ఞకర్మలను నిర్వహించుచుండును. అధ్వర్యులనువారు ప్రాతస్సవనము, మధ్యాహ్న సవనము, సాయం సవనము – అను మూడు యజ్ఞములను ప్రతి దినము అనుష్ఠించుచుందురు. స్వర్గలోకము, మర్త్యలోకము, నరకలోకము – అను మూడు లోకములు జీవులకు కర్మానుసారము ప్రాప్తించుచుండును. సూర్యచంద్రాగ్నులను, మునులు మూడు జ్యోతులుగా వర్ణించుచుందురు.

అష్టావక్రుడు :

చతుష్టయం బ్రాహ్మణానాం నికేతం
చత్వారో యుక్తా యజ్ఞమిమం వహంతి
దిశశ్చతస్రశ్చతురశ్చ వర్ణా
శ్చతుష్పదా గౌరపి శశ్వదుక్తా.

బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసమని బ్రాహ్మణులకు ఆశ్రమములు

నాలుగు. ఈ లోకములోని యజ్ఞముల భారమును బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను వర్ణములు నాలుగు కలిసి మోయుచున్నవి. తూర్పు, పశ్చిమము, ఉత్తరము, దక్షిణమని దిశలు నాలుగు. హ్రస్వ, దీర్ఘ, ప్లుత, హల్ అని వర్ణములు నాలుగు. పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ అని వాణికి పాదములు నాలుగు.

బంది :

పంచాగ్నయః పంచపదా చ పంక్తి
ర్యజ్ఞాః పంచైవాప్యథ పంచేంద్రియాణి
దృష్టా వేదే పంచచూడాశ్చ పంచ
లోకే ఖ్యాతం పంచనదం చ పుణ్యం.

గార్హపత్య, దక్షిణాగ్ని, ఆవహనీయ, సభ్య, ఆవసథ్య-అని అగ్నులు ఐదు. పంక్తి ఛందస్సుకు పాదములు ఐదు. దేవయజ్ఞ, పితృయజ్ఞ, ఋషియజ్ఞ, భూతయజ్ఞ, మనుష్యయజ్ఞములని యజ్ఞములు ఐదు. త్వక్, శ్రోత్ర, నేత్ర, రసన, నాసిక – అని జ్ఞానేంద్రియముల సంఖ్య ఐదు. ఐదు జడలుగల ఐదుగురు అప్సరసల వర్ణన వేదములందు గలదు. విపాశ, ఇరావతి, వితస్త, చంద్రభాగ, శతద్రు అను ఐదు నదులు ప్రవహించుచున్న పుణ్య దేశమునకు పంచనదమని లోకములో ప్రసిద్ధి.

అష్టావక్రుడు :

షడాధానే దక్షిణామాహురేకే
షడేవేమే ఋతవః కాలచక్రం
షడింద్రియాణ్యుత షట్ కృత్తికాశ్చ
షట్ సాద్యస్కాః సర్వవేదేషు దృష్టాః.

కొందఱు విద్వాంసుల మతానుసారము, అగ్నిస్థాపన సమయమునందు ఆఱు గోవులను దక్షిణగా నివ్వవలెను. కాలచక్రము ఆఱు ఋతువుల రూపములో పరిభ్రమించుచున్నది. మనస్సుతోబాటు లెక్కించిన, జ్ఞానేంద్రియముల సంఖ్య ఆఱు, కృత్తికల సంఖ్య ఆఱు. సకల వేదములందు సాద్యస్కమను పేరుగల యజ్ఞములు ఆఱు మాత్రమే కనపడుచున్నవి.

బంది :

సప్తగ్రామ్యాః స ... న్యాః
... ఛందాంసి క్రతుమేకం వహంతి
సప్తర్షయః సప్త చాప్యర్హణాని
సప్తతంత్రీ ప్రథితా చైవ వీణా.

గోవులు, దున్నలు, గొఱ్ఱెలు, మేకలు, గుఱ్ఱములు, కుక్కలు, గాడిదలని గ్రామ్య పశువుల సంఖ్య ఏడు. సింహములు, పులులు, తోడేళ్ళు, ఏనుగులు, కోతులు, భల్లూకములు, మృగములని వన్య పశువుల సంఖ్య ఏడు. గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతీ, పంక్తి, త్రిష్టుప్, జగతి అను ఏడు ఛందస్సులు ఒక్కొక్కటి ఒక్కొక్క యజ్ఞమునకు వినియోగ పడును. గౌతమ, భరద్వాజ, విశ్వామిత్ర, జమదగ్ని, వసిష్ట, కశ్యప, అత్రి అని ఋషులు ఏడుగురు. గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్య, ఆచమన, తాంబూలమని పూజోపచారములు ఏడు. వీణకుగల తంత్రులు ఏడు.

అష్టావక్రుడు :

అష్టౌ శాణాః శతమానం వహంతి
తథాష్టపాదః శరభః సింహఘాతీ
అష్టౌ వసూన్ శుశ్రుమ దేవతాసు
యూపాశ్చాష్టా స్త్రిర్విహితః సర్వయజ్ఞః.

త్రాసునకు దారములు ఎనిమిది. సింహమును చంపగల శరభమునకు పాదములు ఎనిమిది. అగ్ని, పృథివి, వాయువు, అంతరిక్షము, ఆదిత్యుడు, దివి, నక్షత్రములు, చంద్రుడు అనునవి ఎనిమిది వసువులు. యజ్ఞమునకు ఎనిమిది కోణములందు యూపము లుండవలెనని నియమము.

బంది :

నవైవోక్తాః సామిధేన్యః పితౄణాం
తథా ప్రాహుర్నవయోగం విసర్గం

నవాక్షరా బృహతీ సంప్రదిష్టా
నవయోగో గణనామేతి శశ్వత్.

యజ్ఞములో, అగ్నిని ఉద్దీపింపజేయుటకు సమిధలను వేయునప్పుడు కొన్ని మంత్రములు చెప్పవలసియుండును. వాటికి సామిధేనీ మంత్రములని పేరు. వాటి సంఖ్య తొమ్మిది. ప్రకృతి, పురుష, మహత్, అహంకార, పంచతన్మాత్రలు - ఈ తొమ్మిదింటి సమ్మేళనమే సృష్టియని విజ్ఞుల అభిప్రాయము. బృహతీఛందస్సు పాదములోని అక్షరముల సంఖ్య తొమ్మిది.

అష్టావక్రుడు :

దిశో దశోక్తాః పురుషస్య లోకే
సహస్రమాహుర్దశపూర్ణం శతాని
దశైవమాసాన్బిభ్రతి గర్భవత్యః
దశైరకా దశదశా దశార్హా

ఆగ్నేయము, నైరుతి, వాయువ్యము, ఈశాన్యము, ఉత్తరము, పశ్చిమము, దక్షిణము, తూర్పు, పైదిక్కు, క్రిందిదిక్కు అని మొత్తము దిశలు ఈ లోకములో పది గలవు. ఒక వెయ్యియందు, నూర్లు పది గలవు. స్త్రీలు గర్భమును పదిమాసములు ధరింతురు. రోగి, దరిద్రుడు, శోకార్తుడు, రాజదండితుడు, శఠుడు, ఖలుడు, వృత్తిని కోల్పోయినవాడు, ఉన్మత్తుడు, ఈర్ష్యాపరాయణుడు, కాముకుడు - ఈ పదిమంది నిందాలాపములు చేయు స్వభావము కలవారు. గర్భవాస, జన్మ, బాల్య, కౌమార, పౌగండ, కైశోర, యౌవన, ప్రౌఢ, వార్ధక్య, మృత్యువు - ఇవి మనుష్యునియొక్క పది అవస్థలు. ఉపాధ్యాయుడు, తండ్రి, అన్న, రాజు, మేనమామ, మామ, మాతామహుడు, పితామహుడు, తండ్రియొక్క సోదరుడు, వయస్సులో పెద్దయైన బంధువు - ఈ పదిమంది పూజనీయ పురుషులు,

బంది :

ఏకాదశైకాదశినః పశూనా
మేకాదశైవాత్ర భవంతి యూపాః
ఏకాదశ ప్రాణభృతాం వికారా
ఏకాదశోక్తా దివి దేవేషు రుద్రాః.

మాట్లాడుట, గ్రహించుట, విసర్జించుట, మైథునజనితసుఖమును పొందుట, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను తెలిసికొనుట, మననముచేయుట అను పదునొకండు విషయములు జీవునకు గలవు. ఈ పదునొకండు విషయములను ప్రకాశింపజేయుటకు పదునొకండు ఇంద్రియములును (పంచ కర్మేంద్రియములు, పంచ జ్ఞానేంద్రియములు, మనస్సు) జీవునకు గలవు. యజ్ఞయాగాదులకు యూపములు పదునొకండు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సర, హర్ష, శోక, రాగ, ద్వేష, అహంకారములనునవి ప్రాణులకు గల పదునొకండు వికారములు. మృగవ్యాధ, సర్ప, నిరృతి, అజైకపాద, అహిర్బుధ్న్య, పినాకి, దహన, ఈశ్వర, కపాల, స్థాణు, భవ - అనువారు పదునొకండు రుద్రులు.

అష్టావక్రుడు :

సంవత్సరం ద్వాదశమాసమాహు
జగత్యాః పాదో ద్వాదశైవాక్షరాణి
ద్వాదశాహః ప్రాకృతో యజ్ఞ ఉక్తో
ద్వాదశాదిత్యాన్కథయంతీహ విప్రాః.

సంవత్సరమునకు మాసములు పన్నెండు. జగతీ ఛందస్సు పాదమునకు అక్షరములు పన్నెండు. ప్రాకృతయజ్ఞమునకు కాలపరిమితి పన్నెండు దినములు. ధాతా, మిత్ర, అర్యమా, ఇంద్ర, వరుణ, అంశ, భగ, వివస్వాన్, పూషా, సవితా, త్వష్టా, విష్ణు - అని పన్నెండు ఆదిత్యులను జ్ఞానులు వర్ణింతురు.

బంది :

త్రయోదశీ తిథిరుక్తా ప్రశస్తా
త్రయోదశ ద్వీపవతీ మహీచ

తిథులలో ఉత్తమమని పదమూడవ తిథి ప్రశస్తికెక్కినది. పృథివి పదుమూడు ద్వీపములు కలిగియున్నది.

ఈ సగం శ్లోకం మాత్రమే బంది చెప్పగలిగాడు. ఆ తరువాత చెప్పలేక తల వంచుకున్నాడు. వెంటనే అష్టావక్రుడు ఆసగాన్ని ఇట్లు పూరించాడు.

త్రయోదశాహాని ససార కేశీ
త్రయోదశాదీన్యతిచ్ఛందాంసి చాహుః

కేశియను దానవుడు విష్ణువుతో యుద్ధము పదుమూడు దినములు చేసెను. (ఈ విషయము నృశింస పురాణములో ఇట్లు చెప్పబడియున్నది: 'యుయుధే విష్ణునా సార్థం త్రయోదశదినాన్యసౌ') వేదములలోని అతిచ్ఛందస్సు పాదమునకు అక్షరములు పదుమూడు.

బంది ఓడినాడని తెలిసినవెంటనే సభలో గగ్గోలు పుట్టింది. అష్టావక్రుని విజయానికి తమ హర్షాన్ని ప్రకటిస్తూ సభాసదులందరూ చాలసేపు కరతాళధ్వనులు చేశారు. తరువాత అందరు ముకుళిత హస్తాలతో అష్టావక్రుని ముందటికివచ్చి నిలబడి అతనిని అమితంగా పూజించారు. జనకమహారాజుకూడ మహా వినయంతో బాలుని సమీపించి పాదాభివందనంచేసి ఇట్లన్నాడు.

'ఇంతసేపు నీ దివ్యమైన వాగమృతమును శ్రోత్రపుటముల ద్వారమున గ్రోలు భాగ్యము నాకు లభించెను గదా! వేయి వాదములలో జయమును పొందిన ఈ బంది నేడు నీ చేత ఓడిపోయినాడు. ఇతనిని నీ స్వాధీనము చేయుచున్నాను. నీకు తోచినవిధముగా ఇతనిని శిక్షింపవచ్చును.'

అష్టావక్రుడు : నీట ముంచుటయే వీనికి తగిన శిక్ష.

బంది : అష్టావక్రా! అది నాకు శిక్ష కాదు, వరము. నేను వరుణదేవుని కుమారుడను. ఇన్నాళ్ళకు మా తండ్రిని చూడబోవుటకు నీవు హేతుభూతుడవైతివి. నీవు చేసిన ఈ మేలును ఎన్నటికిని మరువజాలను. ఈ జనకుడు యజ్ఞమును ప్రారంభించినప్పుడే మా తండ్రిగారును ద్వాదశవార్షిక సత్రమును అక్కడ వరుణలోకములో ప్రారంభించిరి. ఆ యజ్ఞ నిర్వహణమునకు వేదవిదులైన బ్రాహ్మణులు కావలసివచ్చినది. అందు నిమిత్తము నేనీ జనకుని ఆస్థానమున చోటు చేసికొని ఇక్కడకువచ్చు విద్వాంసుల నందఱును వాదమునకు పిలిచి పరాజితులనుచేసి నీటముంచు నెపమున మా తండ్రిదగ్గరకు పంపుచుంటిని. ఆ యజ్ఞముకూడ ఈ వరకు పూర్తి అయి యుండవచ్చును. అచిరకాలములో మీరా నీటముంపబడిన బ్రాహ్మణులనందరును చూడగలరు. అష్టావక్రా! ఇంకొక ముహూర్తకాలము వేచియుండుము. నీ తండ్రి దర్శన భాగ్యము నీకు లభించగలదు.'

ఈ విధంగా అందరికి ఆనందం కలిగించే ప్రసంగంచేసి బంది నీటిలో ప్రవేశించాడు. కొంతసేపయిన తరువాత వాదపరాజితులై నీట ముంపబడిన ఆ విద్వాంసుల నందరను వెంటబెట్టుకొని నీటినుండి లేచి జనకమహారాజున్నచోటికివచ్చి వారినందరిని ఆయనకు సమర్పించాడు. అప్పుడు కహోడుడు జనకుని చూచి, 'బలహీనునికి బలవంతుడగు పుత్రుడు, మూర్ఖునకు పండితుడగు పుత్రుడు, అవిద్వాంసునకు విద్వాంసుడగు పుత్రుడు పుట్టుట లోకములో సంభవించుచుండును. నేను చేయలేని కార్యమును నా పుత్రుడు అష్టావక్రుడు సాధించి

నాడు. పుత్రులను పొందుట ఇందులకేకదా లోకులు – తాము సాధించలేని పనులు పుత్రులద్వారా సాధింపజేసికొనుటకు–' అని చెప్పి శ్వేతకేతు, అష్టావక్రులను వెంట బెట్టుకొని తన గృహమునకు మరలినాడు. బందిఃయును వరుణలోకమునకు మరలుచు రాజును ఈ విధంగా ఆశీర్వదించాడు. 'యుద్ధ భూములందు నీ శత్రువుల శిరస్సులను, యమ ధర్మరాజే స్వయముగా తన వాడిగొడ్డలిచే తెగనఱుకుచుండును గాక! నీకు మంగళము ప్రాప్తించునుగాక!

శితేన తే పరశునా స్వయమేవాంతకోనృప
శిరాంస్యపాహరత్వాజౌ రిపూణాం
భద్రమస్తుతే.

(సంస్కృత మహాభారతము ఆరణ్యపర్వమునుండి)

# ప్రశాంత జీవితం

## అ. లె. నటరాజన్

అలగ్జాండరుకు, ప్రపంచంలోగల రాజులందరినీ జయించి సార్వభౌమపదవి పొందాలనే కోరిక కలిగింది. వెంటనే చతురంగబలంతో దండయాత్రకు బయలుదేరాడు. దేశదేశాలు జయించుకుంటు భారతదేశంలో ప్రవేశించాడు. భారతదేశంలో గల చిన్నచిన్న రాజ్యాలు కొన్ని స్వాధీనం చేసుకుంటు ప్రయాణం సాగించాడు. ఆ ప్రయాణంలో ఒక చిన్న గ్రామాన్ని చూశాడు.

ఆ గ్రామస్థులంతా చాలా బీదవారు. సామాన్యంగా జీవనం చేస్తూ వుండేవారు. అక్కడివారెవ్వరికి ఆడంబరంగాని అట్టహాసంగాని లేదు. భుజించేందుకు రుచికరమైన ఆహారంగూడ వారికి లేదు. కాపురమున్న ఇండ్లకు సమీపంలోనే మరణించినవారిని సమాధి చేసేవారు. వారు నివసించే గుడిశెలను వీధులను పరిశుభ్రంగా ఉంచుకునేవారు.

అలెగ్జాండరు వారి స్థితిగతులు చూచి అబ్బురపాటు పొందాడు. ఆ గ్రామ పెద్దను తనవద్దకు రావలసినదిగా ఒక సేవకునిమూలంగా కబురుచేశాడు.

ఆ గ్రామపెద్ద అలెగ్జాండరు ఆజ్ఞలను లక్ష్యం చెయ్యకుండ, "తమకు అతనినిచూసే అవసరమేమీ లేద"ని చెప్పి, వచ్చిన సేవకుని తిరిగి పొమ్మన్నాడు.

సేవకుడు తెచ్చినవార్త విని అలెగ్జాండరు తానే ఆ గ్రామపెద్ద వద్దకు వెళ్ళాడు. అతనితో "మీ జీవితం ఏదో ఒకమాదిరిగా ఉందే? మీవద్ద వెండి బంగారం రత్నాలు ఏమీ లేవే? జీవించటానికి తగిన వసతులు మీవద్ద కనిపించవే? తృప్తిగా జీవిస్తున్నారా?" అని అడిగాడు.

అందుకా గ్రామపెద్ద "ఈ లోకంలో సుఖాలను పూర్తిగా అనుభవించి తృప్తిపడటం ఎవరికీ సాధ్యంకాదు" అని బదులు చెప్పాడు

అలగ్జాండరు వానినిచూచి "మీ రెందుకు సమాధులను ఇండ్ల సమీపంలోనే ఉంచుకున్నారు?" అని తిరిగి ప్రశ్నించాడు.

గ్రామపెద్ద "మా కంటిచూపు ఎప్పుడు సమాధులమీద పడుతుండాలి. అందువల్ల మనిషి చస్తాడు అనే సంగతి మనసులో స్థిరంగా ఉంటుంది. పరలోకం ఉంటుందనే

నమ్మకం సదా జ్ఞాపకం ఉంటుంది. అందువల్ల ఈ లోక సుఖాలమీద ఉండే ఆశ తగ్గిపోతుంది. అంతా భగవంతుని లీలగా భావించి దైవభక్తులుగా ఉండటానికి దోహదమవుతుంది.'' అని బదులు చెప్పాడు.

ఆ మాటలు విన్న అలగ్జాండరు ''మీరెందుకు రుచికరమైన మాంసాహారము భుజింపరు?'' అని అడిగాడు.

గ్రామపెద్ద అలగ్జాండరును చూచి ''ఇతర జంతువులను హింసించి తిని మా కడుపులను శ్మశానంగా చేసుకోవాలనే కోరిక మాకు లేదు. ఆ రుచి గొంతువరకేగాని ఆ పైన ఉండదు'' అని అన్నాడు.

తర్వాత ఒక కపాలమును అలగ్జాండరుకు చూపించి ''ఇది ఎవరిదో మీకు తెలుసునా?'' అని అడుగగా అలగ్జాండరు తనకు తెలియదన్నాడు.

''ఈ కపాలము రాజాధిరాజుగా ప్రసిద్ధి వహించిన ఒక మహారాజుది. ఆ మహారాజు మిక్కిలి క్రూరాత్ముడు. తన రాజ్యంలో వున్న ప్రజలను బాధించి పన్నులు వసూలు చేశాడు. ఆసక్తితో భోగాలు చాల అనుభవించాడు. ఏ మొక్క ధర్మాన్ని న్యాయాన్ని అనుసరించకుండ చంచలబుద్ధితో తనకు తోచిందే ధర్మంగా భావించేవాడు. ధనాశతోను రాజ్యకాంక్షతోను ఇతర రాజ్యాలను స్వాధీనం చేసుకోవటమే తన కర్తవ్యంగా తలచి ఆ విధంగా ప్రవర్తించాడు.'' అని చెప్పాడు ఆ గ్రామ పెత్తందారు.

తర్వాత ఇంకొక కపాలము చూపించి ''ఇదిమెవరిదో తెలుసునా?'' అని అడుగగా అలగ్జాండరు తనకు తెలియదన్నాడు.

''ఇదొక మహారాజు కపాలము. న్యాయంగాను ధర్మంగాను రాజ్యపాలన చేశాడు. ప్రజలను సేవకులను ప్రేమించి వారి మన్ననలకు పాత్రమైనాడు. భగవంతునిమీద నమ్మకం కలిగిఉండినాడు'' అని చెప్పి అలగ్జాండరు తలపై తన చేతినుంచి ''ఈ తలపుర్రెపైన చెప్పినవారిలో ఎవరికోవకు చేరుతుందో తెలుసుకోవాలి'' అని అన్నాడు గ్రామపెద్ద.

ఆ మాటలువిన్న అలగ్జాండరు గ్రామ పెత్తందారును ఆలింగనం చేసుకొని వెక్కి వెక్కి ఏడ్చాడు. తరువాత అతన్ని చూచి ''నీవిష్టపడితే నాతో రా, నిన్ను ప్రధానిగా చేస్తాను, మనిద్దరం కలసి ప్రపంచాన్నంతా పరిపాలిద్దాం'' అని చెప్పాడు.

అందుకు గ్రామపెద్ద మంత్రిపదవి నాకొద్దు. అధికారం చెయ్యాలనే వాంఛ నాకు లేద''ని బదులు చెప్పాడు.

మంత్రిపదవి వద్దంటానికి కారణం చెప్పమన్నాడు అలగ్జాండరు.

''నీవు జయించిన ప్రపంచం, నీవనుభవించే భోగాలు ప్రజలకు నిన్ను విరోధిగా చేశాయి. శాంతం, తృప్తి, దైవభక్తి మావద్ద యున్నందున ప్రజలకు మాయందు అనురాగం కలదు. అదొక్కటే మాకు చాలు. మాకు పదవీవద్దు, విరోధమువద్దు, డబ్బువద్దు'' అని గ్రామపెద్ద చెప్పాడు.

అలెగ్జాండరు గ్రామపెద్దను మరల ఆలింగనం చేసుకొని ''మీ జీవితంలో తృప్తి, శాంతం, ఉన్నాయి. ఆ భాగ్యం నాకు లేదు'' అని చెప్పి వెళ్లిపోయినాడు.

(రామకృష్ణవిజయమను తమిళ మాసపత్రిక సౌజన్యముతో)

## గ్ర  పరిచయము

**గీతావ్యాసములు (ప్రథమ సంపుటము)**
**మూలము : శ్రీ అరవిందులు**
**అనువాదము : శ్రీ చెలసాని నాగేశ్వరరావు**
**పేజీలు : 296, వెల : 10-00**

ప్రాప్తిస్థానము :—
1. శ్రీ అరవిందసొసైటి, బోస్‌రోడ్డు, తెనాలి : 522201.
2. తెలుగుశాఖ, శ్రీ అరవిందాశ్రమము, పుదుచ్చేరి: 605002

గీతను సమగ్రముగా అధ్యయనముచేసి, కృత్స్నదృష్టితో గీతపై వ్యాఖ్యానము వ్రాసిన వారిలో శ్రీ అరవిందులగ్రగణ్యులని చెప్ప వచ్చును. శ్రీ అరవిందులకు అలిపూరు కారాగృహములో శ్రీ కృష్ణ సాక్షాత్కారము కలిగి, ఆ భగవానుడే శ్రీ అరవిందుల హస్తములలో గీత నునిచి, జ్ఞానోపలబ్ధిని కలుగ జేసిరి. కారాగారములో శ్రీ అరవిందులు 'సర్వము వాసుదేవమయము'గా నుపలబ్ధి పొందినపిమ్మట, శ్రీ వివేకానందస్వామివారు శ్రీవారికి దర్శనమిచ్చి, పదునైదు దినములు మనోభూమిక కూర్ధ్వమున నుండు స్తరములను గురించియు, ముఖ్యముగా స్వతఃస్ఫురణ భూమికను గురించి, (Intutive plane) ప్రబోధించిరి. పిమ్మట శ్రీ అరవిందులు పది సంవత్సరములు పుదుచ్చేరిలో ఏకాంతముగ సల్పిన తపఃఫలితముగ, అధిమానస, అతీతమానస భూమికలు (Overmental and Supramental Truth - Consciousness planes) వీనియొక్క ఆరోహావరోహణములు మొదలగు విషయముల గురించి, తెలిసికోగల్గిరి. ఈ కాలములో అనగా 1914 నుండి 1921 వరకు శ్రీ అరవిందుల వాఙ్మయము వెల్లివెరసినది. శ్రీవారి గీతావ్యాసములు యీ సమయమున వెలువడినవే. శ్రీ అరవిందులు గీతను గురించి వారి "యోగ సమన్వయము" అను బృహద్గ్రంథములో యిట్లు చెప్పిరి. "మానవునికిని, మానవజాతికిని ప్రపంచములో, యింతవరకు అందచేయబడిన దివ్యకర్మలను గురించిన మహోన్నత తత్త్వదర్శనము గీతలో కనబడును. కర్మయోగమును గురించి సర్వకాలముల కనువర్తించు గతివిధానములను మహాభారత కథలో అనుభవవేద్యముగను, సాటి లేని పాండిత్య సమేతముగను, వివరింపబడినవి. వేద ఋషులు నుడివినట్లు, పరమోత్తమ జ్ఞానము, జ్ఞానదశ కర్హులై అందులో నున్నవారికి బోధపడును. అంతర్జ్యోతిలో నివసించు జీవునికి మానసికబోధయు, వాగ్రూపక వివరణములు ఉపకరించవు. గీత, అధిమానస భూమిక పొలిమేరలవరకు పోయి, వాని కావలనున్న అతీత మానసవెలుగు, దీప్తులలోనికి ప్రవేశించదు. అయినప్పటికిని, అంతరాత్మతో నిష్క్రియ ఐక్యతనేగాక, సక్రియ గతిరూపత (Dynamic) ఐక్యతారహస్యమును, దివ్యగురువునకు నిర్విశేష సంపూర్ణ ఆత్మసమర్పణమును గురించిన ముఖ్య రహస్యములు గీత, మహోన్నతముగా మన కందించును. ఈ శరణాగతియే అతీత మానస పరివర్తనమునకు తప్పనిసరి మార్గమై గతిరూపక ఐక్యత (Dynamic identity)ను, సాధ్యపరచును." శ్రీ అరవిందులు పూర్ణ యోగులు. కాబట్టి వారి గీతా వాఖ్యానములకు విశిష్టతకలదు.

ఈ గీతావ్యాసముల ననువదించినవారు శ్రీ చెలసాని నాగేశ్వరరావుగారు. వీరు శ్రీ అరవిందుల చేతనలో నిమగ్నులై, మూలము చక్కగా అర్థము చేసికొని అనువాదము సాగించినారు. ఇందుకు నిదర్శనము, ఈ పుస్తకములో వీరు వ్రాసిన "ప్రస్తావన"యే. దీనిని పాఠకులు తప్పక చదివి తీరవలెను. ప్రతి అధ్యాయమునకు ఒక శీర్షిక, మూలములోనే యున్నది. అనువాదకులు అధ్యాయముల

లోని భాగములను అనగా ప్యారాలను చక్కగా చదివి, ప్రతి ప్యారాకు ఒక ఉప శీర్షిక నిచ్చినారు. ఈ ఉపశీర్షికలు చదువ గానే, అధ్యాయముయొక్క విషయమంతయు చక్కగా గోచరించును. ఇది మిక్కిలి శ్రమతో కూడినపని. చదువరుల కిది యెంతో సాయపడును. 'కర్మయోగసారము'ను కడపటి అధ్యాయము, ఈ వ్యాసముల ప్రథమభాగము యొక్క విషయములను క్లుప్తపరచును.

ఈ వ్యాసానువాద మొక యోగసాధనా రూపము దాల్చి దివ్య పరిమళముతో శోభిల్లు చున్నది. ఇది సులభముగను, విశదముగను, సరళముగను, భావ మనోరంజకముగ నున్నది. ఇది పదే పదే చదివి మననము చేసికొన వలసిన రచన. దీనిని సర్వులు పఠించి, సంపూర్ణమానవత్వము సంపాదించుకొని, అతీత మానవు లగుదురుగాక!

టి. కోదండరామరావు.

## జన్మరాహిత్య ప్రబోధిని

గ్రంథకర్త: పందిరి శ్రీశైలము
(Endowments Executive Officer)
పేజీలు: 126, వెల: 5-00,

ప్రతులకు: శ్రీ పందిరి ముసలయ్యగారి వృద్ధాశ్రమము, గుండ్లపాడు, పల్నాడుతాలూకా, గుంటూరుజిల్లా.

ఈ గ్రంథకర్త భారత సంప్రదాయ రహస్యములను తెలుసుకొనుటయందు దీక్షగలవారు. ఆకస్మిక దుఃఖావేశముచే ఆధ్యాత్మిక తత్వ రహస్యమును తెలుసుకొని ఈ గ్రంథమును రచియించినారు. ఇందు జన్మ, పునర్జన్మ, కర్మ మార్గము, యోగమార్గము, భక్తిమార్గము, దైవము, మోక్షముల గురించి విపులముగా వివరించియున్నారు. గ్రంథము చివర గురు పూజావిధానము, మంత్రపుష్పమునకు అర్థము, దేవతాస్తోత్రములు పొందుపరుపబడినవి. భక్తి సాధనలద్వారా ఈశ్వరానుగ్రహము, దాని వలన జ్ఞానము, జ్ఞానమువలన జన్మరాహిత్యము కలుగునని ఈ గ్రంథములో ప్రతిపాదింప బడినది.

-చిర్రావూరు వెంకటరావు.

## శ్రీ మదాంధ్రాభ్యుదయము (పద్యకావ్యము)

గ్రంథకర్త: విద్వాన్ భూతపురి సుబ్రహ్మణ్యశర్మ,
పేజీలు: 333, మూల్యము: రూ. 10, ప్రతులకు:
విద్వాన్ భూతపురి సుబ్రహ్మణ్యశర్మ,
ఉన్నతపాఠశాల - ముద్దనూరు, కడపజిల్లా.

అష్టాశ్వాస పరిమితమైన ఈ గ్రంథము, గొప్ప ప్రబంధము. ఇది విజయనగర చరిత్ర యందలి ప్రథమభాగము మాత్రమే. రస వచ్చరిత కావ్యమనవచ్చును. ముస్లిముల దండయాత్రలను సూచించు అంశములు - వివిధ చారిత్రాంశము లిందు గుది గ్రుచ్చబడినవి. కవిత, రసవత్తరము. దీర్ఘ సమాసములున్నను, రసభంగముగానీక, లక్షణాలంకార శాస్త్రము లకు ఏ విధంగా భంగమురానీక, కవి చాక చక్యమును ప్రదర్శించిరి.

కవిగారిశైలి ఆడంబర రహితము. సుల భము - శక్తివంతమునై యున్నది. భాషాప్ర యోగమున వారు చూపించిన శ్రద్ధ నిజముగా శ్లాఘింపదగినది. గ్రంథమంతయు, ధారాశుద్ధి తో నెసలారినదనుటయందాక్షేపణ లేదు. వీరికావ్యమును, తమ యిష్టదైవమునకు అంకిత మొసగుట, పసిడికి తావి యబ్బియట్లైనది. శ్రీ గడియారం, పుట్టపర్తి, దివాకర్లవారు ప్రస్తుతించిన, ఈ కావ్యము బహుళప్రచారము నందగలదని ఆశింతము.

—విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి.

# బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## తండ్రి మరణము, కష్టములు :

శ్రీ రామకృష్ణునిదగ్గర భక్తివిషయాలతో ఆనందంగా సంవత్సరానికిపైగా గడిపి శారదాదేవి పుట్టింటికి వచ్చింది. అప్పుడు ఆమెకు యిరవయ్యవయేడు. ఇంటికి వచ్చిన ఆరు నెలల్లో వీరి కుటుంబానికి పెద్దకష్టం వచ్చింది. తనను యెంతో ప్రేమతో పెంచిన తండ్రి రామ చంద్రుడు చనిపోయాడు. అసలే బీదకుటుంబం కావటంవల్ల యింకా కష్టాలపాలైంది. తల్లి శ్యామసుందరీదేవి ధైర్యంతో పక్కవాళ్లింట్లో వడ్లుకూడా దంపింది. శారదాదేవి, తల్లికి తమ్ము లకు యెంతో అండగాయుండి పనులు చేసింది. వాళ్లకు కొంత ధైర్యము వచ్చినతర్వాత మళ్ళీ దక్షిణేశ్వరం వెళ్ళింది.

ఈసారి దక్షిణేశ్వరం వచ్చినప్పటినుండి ఆమె ఆరోగ్యం దెబ్బతిన్నది. సంవత్సరానికి పైగా ఆమెకు నెత్తురు విరేచనాలు పట్టుకున్నవి. ఎన్నిమందులు వాడినా తగ్గలేదు. ఒక్క రవ్వ ఓపిక వచ్చినతర్వాత జయరాంబాటికి వచ్చింది. కాని అక్కడకూడా గుణం కన్పించ లేదు. కేవలం ఆమె ఒక ఎముకలగూడు అయిపోయింది. నాలుగు అడుగులు వేశేశక్తికూడా పోయింది. మందులు, మంత్రాలు ఏమీ పనిచేయలేదు. ఇక ప్రాణంమీద ఆశలుపోయి నిరాశ యేర్పడింది.

ఈ సమయంలో ఆమెకు ఒక ఆలోచన తట్టింది. జయరాంబాటిలో వీళ్ళయింటికి దగ్గరగా ఒక చిన్నగుడి వుంది. అది కాళికాలయం. అమ్మవారికి సింహం వాహనం. అందు చేత సింహవాహిని అంటారు. తన తమ్ముని సహాయంతో శారదాదేవి ఆ గుడి చేరింది. 'తగ్గినా సరే, తగ్గకపోయినాసరే' అని దేవికి ఎదురుగా పడుకొని లేవలేదు.

కొన్నిరోజులైనతర్వాత ఒకచిత్రం జరిగింది. అమ్మవారు కలలోకనపడి 'అమ్మాయీ! శారదా! ఈ మందు కంట్లో వేసుకో' అని చెప్పింది. శారదాదేవికి ఆశ్చర్యం కలిగింది. ఆ మందు వేసుకోగానే చాలా శక్తి కలిగింది. అదేసమయంలో సింహవాహిని శ్యామసుందరీ దేవికి కనిపించి ఇలా చెప్పింది. 'అమ్మా, ఈ మందు శారదకు వెయ్యి. రక్తవిరేచనాలు తగ్గుతాయి. అలా చేసేటప్పటికి త్వరలోనే శారదాదేవికి విరేచనాలు తగ్గి, ఆరోగ్యం, బలం చేకూరినయి. శారదాదేవికి కలిగిన అనుభవంవల్ల అప్పటినుండి యిప్పటివరకు సింహవాహిని చాలా మహత్తుగల దేవత అని వాడుకైపోయింది.

కంటికి మందు వేసిన వంటిజబ్బు  
తగ్గునని సింహవాహిని తనకు తెలుప  
మాని ప్రాయోపవేశంబు మందుగొనియె  
శారదకు గ్రహణి తగ్గె నాశ్చర్యముగను.

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి.

శ్రీ ఎస్. బాలసుందరం గారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600 021) న ముద్రింపబడి.

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600 004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

| గ్రంథము | వెల | గ్రంథము | వెల |
|---|---|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము | 8-00 | హిందూ మతము | 4-00 |
| శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర | 10-00 | వివేక సూర్యోదయము | 4-00 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 8-00 | అనుష్ఠాన వేదాంతము | [illegible] |
| శ్రీ రామకృష్ణోపనిషత్తు | 3-75 | ప్రాచ్యము - పాశ్చాత్యము | 1-25 |
| శ్రీ రామకృష్ణపరమహంస నీతికథారత్నములు | 2-50 | కులము, సంస్కృతి, సామ్యవాదము | 3-00 |
| గురూపదేశములు | 2-00 | భారతదేశము | 2-00 |
| నా గురుదేవుడు | 1-25 | భారతీయ మహిళ | 2-00 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1-50 | నా జీవితము, జీవిత కార్యము | 1-25 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహము | 0-75 | శ్రీ రామకృష్ణ సేవాసంఘ : తదాదర్శములు | 0-50 |
| ఆరాత్రికము మరియు | | చికాగో నగరోపన్యాసములు | 1-00 |
| శ్రీ రామనామ సంకీర్తనము | 0-50 | శ్రీ వివేకానంద శంఖారావము | [illegible] |
| శ్రీ రామకృష్ణుడు, వివేకానందస్వామి | 0-25 | నవీన భారత దేశము | [illegible] |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4-00 | సర్వం విష్ణుమయం జగత్ | [illegible] |
| శ్రీ శారదాదేవి | 2-50 | శ్రీ వివేకానంద సింహగర్జనలు | [illegible] |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | 0-80 | బ్రహ్మానంద బోధనలు | 4-75 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4-00 | తాపత్రయ చికిత్స | 0-60 |
| బాలల వివేకానందుడు | 2-00 | ముక్తిమార్గము | 0-30 |
| శ్రీ, వివేకానంద సంపూర్ణగ్రంథావళి | | పారమార్థిక సంభాషణలు | 6-50 |
| 9 సంపుటముల పూర్తిసెట్టు (సాదా) | 45-00 | నారద భక్తిసూత్రములు | [illegible] |
| ,, ,, (క్యాలికో) | 58-50 | శ్రీ మద్భాగవతము—మూడవ సంపుటము | [illegible] |
| విడి సంపుటములు ఒక్కొక్కటి (సాదా) | 4-00 | దేవీమాహాత్మ్యము | 4-00 |
| ,, ,, (క్యాలికో) | 5-50 | శ్రీ మద్భగవద్గీత | [illegible] |
| స్వామి శిష్య సంవాదములు | 16-50 | పారాయణగీత తాత్పర్యసహితము | [illegible] |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 5-00 | ,, మూలము | 2-00 |
| ,, (రెండవ భాగము) | 5-50 | కఠోపనిషత్తు | 2-00 |
| భారత యువజనులారా! | 3-00 | గిరీశచంద్ర | [illegible] |
| ప్రబోధ రత్నాకరము | 3-75 | భక్తిమార్గము | [illegible] |
| రాజయోగము | 6-25 | శ్రీ కృష్ణవాణి | [illegible] |
| కర్మయోగము | 4-00 | బుద్ధవాణి | 0-50 |
| భక్తియోగము | 4-00 | క్రైస్తు సూక్తిమాల | 0-80 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 2-25 | మహమ్మదు సూక్తి మంజరి | 0-80 |
| ,, (రెండవ భాగము) | 3-00 | | |

ఇవియేకాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును,

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైలచిత్రములు మున్నగునవెన్నియో మా యొద్ద లభింప గలవు.

అడ్రెసు: మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600 004

సంవత్సర చందా రూ. 7 జీవిత చందా రూ. 100 విడి సంచిక 70 పై.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 35 1978 - ఏప్రిల్ : కాళయుక్తి - చైత్రము సంచిక 4

## విషయసూచిక



శ్రీ రామకృష్ణప్రభ

సంవత్సర చందా : రూ. 7-00. జీవిత చందా : రూ. 100-00.

విడి ప్రతి : 70 పైసలు.

శ్రీ రామకృష్ణమఠము

మైలాపూరు

మద్రాసు 600 004.

# స్వామి శిష్య సంవాదములు

అనువాదకులు: శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

ద్వితీయ ముద్రణము:

వెల: రూ. 10-50

క్యాలికో వెల: రూ. 13-00 పుటలు: 424+6

నవభారత భాగ్యవిధాతయగు శ్రీమద్వివేకానందస్వామి శిష్యులతో కావించిన ప్రసంగము లివి: (1) శరశ్చంద్ర చక్రవర్తి, (2) ప్రియనాథ సింహా, (3) సురేంద్రనాథసేను, (4) సురేంద్రనాథగుప్త అను నలుగురు శిష్యుల డైరీలనుండి సేకరింపబడినవి. 'టాక్స్ విత్ స్వామి వివేకానంద' అను పేర ప్రకటింపబడియున్న ఆంగ్ల గ్రంథమున కిది ఆంధ్రానువాదము. ఉపనిషద్బోధనలకు సుబోధ వ్యాఖ్యానరూపములైన యీ సంవాదములు పారమార్థిక సాధకులకును, జిజ్ఞాసువులకును మాత్రమే కాక దేశభక్తులకును, సంఘ సంస్కరణాభిలాషులకును, స్త్రీ సముద్ధరణోద్యమ పరాయణులకును, లలితకళాసక్తులకును, ఇంతేల, సర్వవిధ మనఃప్రవృత్తులు కలవారికిని అత్యంతోపయుక్తములుగా నుండుననుటకు సందేహము లేదు. అనువాదశైలి హృద్యము అనవద్యము.



ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 35 1978 – ఏప్రిల్ : : కాళయుక్తి – చైత్రము సంచిక 4

## ప్రార్థన

న వై యాచే రాజ్యం న చ కనకమాణిక్యవిభవం
న యాచేఽహం రమ్యాం సకలజనకామ్యాం వరవధూం
సదా కాలే కాలే ప్రమథపతినా గీతచరితో
జగన్నాథస్వామీ నయనపథగామీ భవతు మే

ప్రమథపతిచే సదా స్తుతింపబడుచున్న ఓ జగన్నాథస్వామీ! నేను నిన్ను పదవులు కావాలనీ, సంపదలు కావాలనీ, స్త్రీలను ఆకర్షించే విశిష్టవ్యక్తిత్వం కావాలనీ కోరడం లేదు. నాకు కావలసింది నిన్ను చూడగలిగే భాగ్యం ఒక్కటే.

—జగన్నాథాష్టకం.

ప్రాక్పశ్చిమ సంగీతములు

పాశ్చాత్య సంగీతము మిక్కిలి శ్రేష్టమైనది. అంత పరిపూర్ణ రాగ మేళనము (perfection of hormony) మనకు ఇంకను అలవడలేదు. కాని మన అశిక్షితకర్ణములకు అది శ్రావ్యముగా ఉండదు. అందుచే మనము దానిని ఒల్లక ఆ గాయకులు నక్కలవలె కూయుచున్నారని తలతుము. మొదట నేనును అట్లే తలచితిని గాని దానిని జాగ్రత్తగా ఆలకించి సూక్ష్మదృష్టితో పరిశీలించినప్పుడు, క్రమక్రమముగా గ్రహించి, అందలి గుణోత్తరకు ఆశ్చర్యపారవశ్యము నందితిని.

ప్రతికళ విషయము ఇట్టిదే! ఉత్కృష్టకళా ప్రావీణ్యముతో చిత్రింపబడిన పటమును తటాలున చూచినప్పుడు దాని సౌందర్యము ఎచట ఉన్నదో మనము గ్రహింపజాలము. ఇదియుగాక మన దృష్టి కొంతవరకు శిక్షితమై ఉన్నగాని, ఆ కళయందు గల చిత్రణసూక్ష్మములను సమ్మేళనకౌశలములను (Subtle Touches and Blendings) తన్మూలమగు ప్రతిభను (Inner Genius) మనము గ్రహింపనేరము.

మనకేదైన యథార్థ సంగీత మిప్పుడు నిలిచియున్న నది 'కీర్తన' 'ధ్రుపద' ములందు మాత్రమే. తక్కిన దానియందంతయు మహమ్మదీయ సంగీతవైఖరిని అనుసరించునట్లు స్వర భేదము కల్పింపబడెను. హ్రస్వసుకుమార రూపములగు 'టపా' పాటలను అనునాసికోచ్చారణతో పాడుటయు, ఉన్నట్టుండి ఒక స్వరమునుండి మఱొక స్వరమునకు విద్యుద్వేగముతో (మెఱపు మెఱయునంత త్వరితముగా) దుముకుచుండుటయు, సంగీతమునందు ప్రశంసార్హ విషయములా? కానేకాదు. ప్రతిస్వరమునకు, ప్రతి శ్రుతిస్థానమునందును, సంపూర్ణవికాసము కల్పింపకపోయినచో, సంగీతశాస్త్రము భ్రష్టమగును. చిత్రకళయందు, ప్రకృతిని, అనుకరించిన రచన ఎంత మనోజ్ఞముగానైన నుండును. అట్లు అనుకరించుటకు ఎట్టి యాక్షేపమును లేదు. అది గుణప్రదమే. అట్లే సంగీతమునకూడ శాస్త్రానుసారివై నిలిచి, యెంత నైపుణ్యమునైన ప్రదర్శింపవచ్చును. ఆ పాట చెవికి ఇంపుగానే ఉండును. మహమ్మదీయులు మన దేశమునకు వచ్చిన పిదపనే మన వివిధ రాగరాగిణులను కైకొనిరి. కాని టపాగాన కళపై వారు తమకు సహజమగు నొక ప్రత్యేకముద్రనుంచి సంగీతములో గల శాస్త్రీయత నంతయు నశింపజేసిరి.

టపాపాటలందు ఇష్టములేని వారు ఎవరైన కలరా? అని అడిగెదవా? ఇలకోడి (ఝిల్లి) కిచకిచలుకూడ కొందఱికి ఎంతో ఇంపుగానుండును! తమ సంగీతముతో సాటివచ్చు సంగీత మెచటను లేదని సాంతాలులుకూడ తలంతురు! ఒకస్వరము పిదప ఇంకొక స్వరము అంత శీఘ్రముగా వచ్చుటచేత గానంలోని సొంపు నశించుటేగాక, విషమమగునని నీకు తెలిసినట్టులేదు. సప్తస్వర సమ్మేళన విధాన వైవిధ్యము (మార్పుకూర్పుల భేదము) చేతనేగదా వివిధ రాగరాగిణులు ఏర్పడునది! టపాగానమునందు ఒక్కొక్క రాగమే అస్పష్టోచ్చారణరూపముగా దిగవిడువబడి, నూత్నస్వరము కల్పింపబడును. అంతేకాక కంఠమును కంపనస్వరభేదముచే అత్యున్నత స్థాయికి ఎత్తినచో, అసలు రాగము ఎట్లు తనరూపమును నిలుపుకోగలదు? మఱియు కేవల

సభారంజనార్థమై హ్రస్వకోమల స్వరములను అంత యధికముగా ఉపయోగించినచో, సంగీత మాధుర్యము అంతయు అంతరించిపోవునుగదా. ఈ టపాపాటలు వ్యాప్తిలోనికి వచ్చిన పిమ్మట, గేయములోని భావము వ్యక్తమగునట్లు పాడుటే మన దేశములో అదృశ్యమైపోయినది. ఇటీవల నాటక ప్రదర్శనశాలలు గుణోత్తరత నొందుకొలది, అది మరల కొంచెకొంచెము తలయెత్తు చున్నది. కాని రాగరాగిణులకు ఆదరము చూపుట క్రమక్రమముగా క్షీణించిపోవుచున్నది.

కావున ధ్రుపదగానమున పరిపూర్ణ కౌశలమును ఆర్జించిన వారికి టపాపాటలు వినుట కష్టముగా నుండును. మనసంగీతములో గల ఆరోహణావరోహణక్రమము మిక్కిలి చక్కనిది. ఈ విశిష్టతను ఫ్రెంచివారు మొదట కనుగొని తమ సంగీతమునందు దానిని అవసరమగు మార్పులతో ప్రవేశపెట్టుకొన యత్నించిరి. వారు అది సాధించిన పిదప యూరపు ఖండమువారు అంద ఱును అందు పరిపూర్ణ పాండిత్యమును పొందినారు.

మన సంగీతము వీర రసప్రధానమైనదిగా కానిపింప కుండుటకు కారణము కలదు. వీర స్వరములలో సామరస్యము అత్యంత ముఖ్యము. మనకు శోచనీయమగు శ్రుతిమేళన లోపము కలదు. అందుచే మన సంగీతములో వీరరసము అంతగా కానిపింపదు. మన సంగీతకళ బాగు గను, సుస్థిరముగను, అభివృద్ధి నొందుచుండెను. కాని మహమ్మదీయులు వచ్చి దానిని చేకొ నిరి. వారిచేత చిక్కిన పిదప సంగీతవృక్షము ఇక ఎదుగజాలకపోయెను. పాశ్చాత్యుల సంగీతము మిక్కిలి ఉత్తమరూపము నందియున్నది. వారి సంగీతమందు వీరకరుణరసములు రెండును కలవు. అదియే సరియైనస్థితి. స్వరైక్యము కల్పించి, తదనురూపమగు వాద్యశ్రుతితో దానిని మేళవించితిమేని, ఏ రాగమునైనను వీరరస ప్రదీపకముగా చేయవచ్చును. ఈ మాట కొన్ని రాగిణుల విషయమునగూడ వర్తించును.

---

# భగవద్గీత — విశ్వసందేశము

## స్వామి రంగనాథానంద

ఆల్డస్ హక్స్‌లేగారన్నట్లు గీత సార్వకాలిక వేదాంత గ్రంథము. ఉపనిషత్తులలో వివరింప బడిన సనాతనవేదాంతమున కిది అనుబంధము. వేదాంతమందలి ప్రధాన సూత్రములను క్రోడీ కరించి వానిని సామాన్యప్రజల అవగాహనకు అందిస్తుంది. అందుచేతనే గీత ప్రజాబాహు ళ్యంలో బాగా వ్యాప్తి పొందిన గ్రంథ మై విరాజిల్లుచున్నది. గీతలను చదువుతుంటె కేవలం ఉపనిషత్ వేదాంతమును మాత్రమే చదువుటలేదు. దానితోపాటుగా వేదాంతము యొక్క నైతిక సంబంధాలనుకూడ తెలుసుకుం టాము. మనకు నైతికశ్రద్ధకు ఉపదేశం కావాలి. అది గీతలలో లభిస్తుంది. నిత్యజీవితంతో సం బంధంలేని వేదాంతం ఎంత ఉన్నత సత్యా లను బోధించినప్పటికి అది మనకు నిరుపయోగ మౌతుంది. కాబట్టి వేదాంతంలోగల నిగూఢ మైన నైతిక భావాలు గీతలలో విపులీకరింప బడినవి. నైతిక ఆచరణ సూత్రాలేగాక అందులో భగవద్భక్తికూడా ఉంది. గీతలలో కల భక్తి మతసిద్ధాంతాలలోగల మహోన్నత భావాలను వివరిస్తుంది.

ఈ కారణాలన్నింటిచేత గీత మన జీవితా

లలో ఒక ప్రాముఖ్యత వహిస్తుంది. అది దిన దిన ప్రవర్ధమానమౌతుంది. "భారత దేశంలో బ్రిటిష్ సామ్రాజ్యం అంతరించిపోయిన పిమ్మట చిరకాలం – అది సంపాదించి పెట్టిన సిరి సంపదలు అధికారం స్మృతిపథంలో నశించి పోయిన పిదపకూడా భారతీయవేదాంత తత్వరచయితలు శాశ్వతంగా నిలచి ఉంటారు" అని గీత ఆంగ్లానువాదకర్త చార్లెస్ విల్కిన్సు అనువాదమునకు ఉపోద్ఘాతం వ్రాసిన ప్రథమ రాజప్రతినిధి వారన్ హేస్టింగ్సు అన్నాడు. ఈ మాటలు వ్రాసినప్పటినుండి ప్రాక్పశ్చిమ దేశ స్త్రీపురుషుల హృదయాలలో గీత నిరంతర విశ్రుతమైన సామ్రాజ్యాన్ని స్థాపించుకొన్నది.

గీతను చదువుట ప్రారంభించుటకు ముందు ఉపోద్ఘాతంగా రెండుమాటలు చెప్పవలసిన అవసరముంది. మీలో చాల మందికి గీత గురించి, హిందూమత గ్రంథాలలో దీని గల స్థానంగురించి కొంత తెలిసి ఉంటుంది. హిందూ అనే పదం మరొక మంచిమాట దొరకక వాడుతున్నాను. ఏలననగా వేదాంత గ్రంథాలు, చాలవఱకు హిందు, బౌద్ధ, క్రైస్తవ, ముసల్మాను మతాలు ఏర్పడక ముందే వెలసినవి. కనుక ఆనాటికి ఈ విభేదాలు లేవు. ఈ విషయం ముఖ్యంగా గుర్తించుకోవలసిన అవసరముంది. ఒక తరగతి ప్రజలనుండి వేరొక తరగతి ప్రజలకు విచక్షణ చూపుటకే ఈనాడు 'హిందూ' శబ్దం వాడుతున్నాము. ఋషులు వారి ఉన్నతభావాలను, ఏ ఒక్క మతానికి చెందినవారినుద్దేశించిగాక, ఒకజాతి, తెగలతో సంబంధములేక జ్ఞానప్రబోధము కావలసిన ప్రజలకందరకు అందించారు. ఈ భావం మనస్సులో ఉంచుకొని, పూర్వగ్రంథాలను, అందలి ప్రబోధలను మనం బోధపరచుకోవాలి. ఈ జాతికి మరొకజాతికిచెందిన వారికిగాక మానవులందరకు కావలసిన మతాన్ని వారు ప్రబోధించారు. నీతినియమాలు, మతం, వేదాంతం సకల మానవ శ్రేయస్సుకొరకు ప్రచారం చేసేరుగాని వానిలో ఒక తెగకే పరిమితం చేయలేదు. మన ప్రాచీన గ్రంథాలలో ఈ విశ్వజనీనదృష్టి ప్రస్ఫుటంగా అన్నింటా గోచరిస్తుంది. అందుకే గొప్ప న్యాయశాస్త్రం అందించిన మనువు కేవలం హిందువుల సంక్షేమమేగాక యావత్ మానవుల సంక్షేమం దృష్టిలో ఉంచుకొనియే తన గ్రంథాన్ని రచించాడు. తన సంతతికి చెందిన మానవులకు సంబంధించిన నైతిక సూత్రాలు గనుకనే అవి మానవ ధర్మశాస్త్రం అనిపించుకుంది. మానవుడు తన క్షేమం, ఆనందం కావాలని కోరుకుంటె అతడు కొన్ని లక్ష్యాలు, కొన్ని మార్గాలు అనుసరించాలి. అది విశ్వజనీనంగా ఉండాలి. ఈ మనుధర్మశాస్త్రంలో అవే వ్రాయబడి ఉన్నాయి. అలాగే వేదాలు, ఉపనిషత్తులలోను, గీతలోనూ గల సందేశం ఒక తెగకు మాత్రమే చెందినదిగాదు. విభిన్న జాతులు, తెగలు ఈ సిద్ధాంతాలను వారి లాభంకొఱకు ఉపయోగించుకొనవచ్చును. అంతమాత్రాన అవి తరిగిపోవు. ఏలనగా అవి మానవ స్వభావంతో సంబంధించి ఉంటాయి గనుక.

కాబట్టి గీత చదువుకునేటప్పుడు అందలి ప్రబోధలు సకల మానవాళినుద్దేశించి చెప్పబడినవని మనకు స్పష్టంగా తెలుస్తుంది. ఆత్మయొక్క ఉన్నత స్వరూపాన్ని బోధపరచుకొనుటకై శ్రమిస్తున్న స్త్రీ పురుషుల కొరకు గీత చెప్పబడినదని గ్రహించగలము. మతంలోను, వేదాంతంలోను, ఇదే వివరింపబడింది. గీతకు సహజమైన సంవాదరూపంలో ముఖ్యాంశమే నొక్కి చెప్పబడింది. కృష్ణార్జున సంవాద

మిది. మన పురాణాలలో అర్జునుడు మానవ రూపంలో ఉన్న నరుడని భగవంతుడైన నారాయణుడే కృష్ణుడని భావింపబడింది. ఇచ్చట శ్రీకృష్ణుడు ఏదో ఒక ప్రత్యేకమైన తెగకుగాక తన శిష్యుడైన అర్జునునిద్వారా మానవులకే గీత నుపదేశించాడు. గీతలో భగవానుడు మానవునకు ఎదుట ముఖాముఖిగా ఉన్నాడు. నరుని ఎదుట నారాయణుడున్నాడు. ఈ మహోన్నత సన్నివేశంలోగల ముఖ్యాంశమిదే.

మన దేశంలో కొన్ని శతాబ్దాలనుండి హిందువుల మనస్సు, ఆలోచనాపరిధి సంకుచితమై పోయింది. విశ్వవిశాలమైన గీతాసందేశంకూడ సంకుచితమైనభావనలకే పరిమితమై పోయినట్లు ఊహించారు. వైష్ణవమో మరొకటో ఏదోఒక సంప్రదాయానికే కృష్ణునికూడ బంధించారు. కృష్ణుడు విశ్వప్రబోధకుడు. శైవ వైష్ణవ లేక మరొక విభేదమును ఆయన పరిగణించలేదు. ఈనాడు అన్నిమతాలకు, తెగలకు అతీతమై ప్రతిఒక్కరికి ఒకే ఆవేశం, ఉత్సాహం కలిగించే నాదంగల విశ్వజనీనత మనకు కావాలి. కాబట్టి విశ్వమానవుడైన శ్రీకృష్ణునిచే స్వయంగా వేదాంతమునకు సులభ వ్యాఖ్యానరూపమైన విధంగా గీత ప్రబోధింపబడినట్లు భావించాలి. విశ్వమునకంతటికి సంబంధించిన ప్రబోధలు విశ్వమానవుడైన వానిచే తనే బోధింపబడవలెను. అవి విశ్వమానవ భావనగల ముముక్షువులకేగాని, ఇతరుల అవగాహనకు అందవు. ఒకే సంప్రదాయానికి బద్ధులై గీతను చదువువారికి అందలి ప్రబోధలు సంకుచితంగానే బోధపడతాయి. వారి భావ ప్రతిధ్వనులే అందు గోచరిస్తాయి.

ఆదిశంకరులు వ్రాసిన భగవద్గీతా వ్యాఖ్యానమునకు ఉపోద్ఘాతంలో భగవద్గీతా సంవాదంలో గల స్వభావాన్ని ఆయన వివరించారు. గీత ఎట్లు ప్రబోధింపబడినదన్న అంశం మీద అనేక అభిప్రాయాలున్నాయి. ఈ శ్లోకాలన్నీ కృష్ణార్జునులమధ్య జరిగిన సంభాషణమే నని పూర్వసంప్రదాయపరాయణుల అభిప్రాయం. యుద్ధరంగంలో, సుదీర్ఘ కాలంలో జరుగవలసి ప్రశ్నలు, జవాబులు, సంభాషణ రూపంలో అందును ఛందోబద్ధమైన శ్లోకాలలో జరిగిందంటె, అంతకంటె అస్వాభావికమైన దేదీ ఉండదు. ఈ అభిప్రాయాన్ని హేతువాదు లంగీకరింపరు. శ్రీ శంకరాచార్యుల వ్యాఖ్యానంలో "అర్జునుడు తన కేర్పడిన క్లిష్ట పరిస్థితిలో మనోవైకల్యానికి లోనయ్యాడు. శ్రీకృష్ణుడు ఆయనకు దృఢమైన సలహా ఇచ్చాడు. ఆ సలహా వ్యాసునిచేత 700 శ్లోకాలుగా విపులీకరింపబడినది." ఇది శ్రీ శంకరుల వారి అభిప్రాయం. యుక్తియుక్తంగా తోస్తుంది.

కొన్ని పరిసరాలయొక్క, పరిస్థితులయొక్క ఒత్తిడిలో గొప్ప ప్రబోధలు, గొప్ప భావాలు ఉద్భవిస్తాయి. ప్రపంచంలో ఏ భాగంలో ఏ విశిష్ట సిద్ధాంతం ఆవిష్కరమైనప్పటికి ఇదే యదార్థ కారణమౌతుంది. ఈనాడు ప్రపంచమందలి అన్నిప్రాంతాల స్త్రీ పురుషులను కదిలిస్తున్న, 19వ శతాబ్దినాటి మార్క్సిస్టు సిద్ధాంతం దీనికొక ఉదాహరణగా గ్రహించవచ్చును. సంఘం అటువంటి ఆశయానికి, సిద్ధాంతానికి ఎదురుచూస్తున్న సమయంలోనే అది ఉద్భవించింది. పూర్వకాల పరిస్థితులవల్ల పేరుకుపోయిన పరిస్థితికిది ఒక పరిణామం. స్వేచ్ఛ, సమానత్వం, సోదరభావం అనేది ఫ్రెంచి విప్లవకాలంలోని యుద్ధనినాదం. 18వ శతాబ్ది మధ్యకాలంలోని సాంఘిక పరిస్థితుల ఒత్తిడిలో ఫ్రాన్సుదేశంలో ఇది జన్మించింది. అదేవిధంగా మహాభారత కాలంలో ఏర్పడిన

అవసరమైన పరిస్థితులు చూస్తే గీతలలోని భావాలు ప్రచారం చేయుటకు తగిన బలమైన కారణాలున్నట్లు బోధపడుతుంది. అంతకు ముందు కాలంలో వైదికసాహిత్యంలో కర్మ కాండతో మిళితమైన మతం ఉన్నది. అలాగే వేదాంతపరమైన మతప్రబోధలుగల ఉపనిష త్తులు వచ్చాయి. ఈ రెండు పరస్పరం పోటీతో వచ్చాయి. వేదాలు ఇహలోకంలోను, మరణా నంతర స్వర్గంలోను, సుఖాన్ని వాగ్దానం చేసే యి. అందువల్ల ప్రాపంచిక సుఖజీవనం, మర ణాంతరం స్వర్గసౌఖ్యం కావాలని ఆశించిన వ్యక్తి నాటికి తెలిసిన వివిధ దేవతలకు యజ్ఞాలు చేసి సంపాదించ వచ్చుననుకున్నాడు. కొంత కాలానికి ఈ స్వర్గ వేదాంతంమీద ఉపనిషత్తులు తిరుగుబాటు తెచ్చేయి. కఠోపనిషత్తులో నచి కేతుడు మొదటి వరంద్వారా ప్రాపంచిక సుఖా లను కోరుకున్నాడు. రెండవవరంలో స్వర్గం పొందు సాధనం కోరేడు కాని ఈ రెండింటితో అతడు తృప్తిపొందలేదు. అందువలననే నచి కేతుడు మూడవవరం ఉన్నత ఆధ్యాత్మిక తత్వము, నైతికనిష్ఠకు సంబంధించిన జీవిత సమస్యలపై అడిగేడు. ఈ సమస్యాపరిష్కార మునకు, జీవచైతన్యమునకు పూర్వమందుగల నిత్యసత్యం గురించి పరిశోధన ఒక్కటే మార్గం. ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడిన ప్రత్యేకకృషి ఇదే. ఈ విధంగా ప్రప్రథమంగా ఉపనిషత్తులలో ప్రశ్నప్రాముఖ్యత వహించింది. దీనితోబాటుగానే ప్రాపంచిక జీవనం పరలోక జీవనం, వీటిమధ్యగల విభేదాలు బాగాపెరి గేయి. అందువల్ల వీటి సమన్వయంయొక్క అవసరం ఏర్పడింది. ఈ సమన్వయమే గీతలలో ప్రయత్నింపబడినది. వేదాలలో కర్మకాండ, యజ్ఞాలు, మరణానంతరం స్వర్గంలో ఒకస్థానం సంపాదించుటకూ మార్గం బోధించారు. ఉప నిషత్తులలో దీనిపై ఒక వ్యతిరేకభావన ఏర్ప డింది. దీనిలో కర్మాలకు, యజ్ఞాలకు సంబం ధంలేదు. ధ్యానసాధనవల్ల నిత్యసత్యాన్ని తెలుసుకోవటమే దీని ఆశయం. కర్మకు స్థానంలేదు. కాని గీతలో జ్ఞానమార్గానికి, కర్మ మార్గానికి శ్రీకృష్ణుని సమన్వయం గోచరిస్తుంది. ఈవ్యతిరేక సిద్ధాంతాల సమన్వయం కుదరనిదే ఏ జీవితం పరిపూర్ణత చెందదు. జ్ఞానంతో సంబంధంలేకుండా కర్మ చేస్తానంటె ఫలిం చదు. కర్మతో సంబంధంలేని జ్ఞానం పరి పూర్ణంకాదు. అప్పటి కాలపరిస్థితుల ననుస రించి వాటికొక సమన్వయసిద్ధాంతం అవసర మైంది. అదే శ్రీకృష్ణుడు భగవద్గీతలో మన కందించాడు. గీత ప్రతి అధ్యాయంలో, గీత యొక్క ముందుకాలానికి సంబంధించి అమ లులోనున్న పదాలు - భావాలు గోచరమా తాయి. శ్రీకృష్ణుడు ఆపదాలనే స్వీకరించాడు. కాని వాటికి తన స్వంతఅర్థం - వ్యాఖ్యానం చేసి ఒకవిధమైన నిర్మాణాత్మకమైన వేదాంత తత్వాన్ని, కర్మను, జ్ఞానాన్ని అనుసంధాన పరచేది అందించాడు.

స్నేహితునిగా తత్వదర్శకునిగా, మానవ మార్గదర్శిగా శ్రీ కృష్ణుడు ఉన్నత అధ్యాత్మిక సందేశాన్ని, ఇంతవరకు నిలచియున్నటువంటి, ఇంకను భవిష్యత్తులో మానవులకు ఆచరణ యోగ్యమైన నైతిక విలువల సందేశాన్ని భగవద్గీతలో అందించాడు.



# శ్రీ రామకృష్ణ కథామృతము

## (రెండవ భాగము)

అనువాదము: ప్రవ్రాజిక శ్యామాప్రాణ

సాయంకాలమాయెను. శ్రీ రామకృష్ణులు తమగదిలో చిన్నమంచముపై కూర్చొని జగజ్జననిని ధ్యానించుచుండిరి. దేవాలయములో సంధ్యా హారతులు మొదలుపెట్టిరి.

కొంతసేపైన తరువాత శ్రీ రామకృష్ణులు మాస్టరును భక్తమాలిక చదివి వినిపింపమని కోరిరి. అంత మాస్టరు భక్తమాలిక అను కావ్యములోగల జయమల్లుడను రాజుకథను చదువనారంభించెను.

జయమల్లుడను పేరుతో ఒకానొక రాజుండెను. అతడు చాల భక్తిపరాయణుడు, సత్ప్రవర్తనుడు. వారి కులదైవమగు శ్రీకృష్ణునిపై వానికి అచంచలమైన భక్తి విశ్వాసములుండెను. రాజు వేకువనే లేచి శ్యామసుందర మూర్తిని కడు భక్తితో పూజించెడివాడు. యథావిధి పూజ ముగిసిన తర్వాతనే అతడు ఆలయమునుండి వచ్చెడివాడు. రాజ్యముపోనీ, కోశముపోనీ, ప్రపంచము తలక్రిందులుగానీ, అతడు మాత్రము స్థిరముగ తన పూజాదికముల ముగించును. ఈ విషయ మొక శత్రురాజు చెవినబడగ, అతడు రాజ్యాకాంక్షతో పెద్దసేనను తరలించుకొని వేకువజామున నే జయమల్లుని రాజధానిని ముట్టడించెను. రాజుగారు భగవదారాధనలో నుండిరి. మంత్రి సేనాపతులు ఏమిచేయగలరు? కింకర్తవ్యతా విమూఢులై కొంతసేపటికి తెప్పరిల్లి రాజమాతకు వృత్తాంతమును తెల్పిరి. రాజమాత వెంటనే శ్యామసుందర మందిరము ప్రవేశించి భగవధ్యానపరాయణుడైయున్న రాజు చేయి పట్టుకొని భోరున ఏడ్చుచు, 'బిడ్డా! త్వరగా లేచిరమ్ము. శత్రుబలము దుర్గమును చుట్టుముట్టెను' అని పల్కెను. అంత జయమల్లుడు మెల్లగా కన్నులువిచ్చి శాంతచిత్తముతో, 'అమ్మా! నీవిట్లు విలపింపనేల? నాకు రాజ్యము ప్రసాదించినది శ్యామసుందర మూర్తియే. నా రాజ్యము అతడే పోగొట్టదలచినచో అడ్డుకొనుటకు నేనెవరు? అతడు నన్ను రక్షింపదలచినచో ఎవరు మాత్రము నాకు హాని చేయగలరు? కావున ప్రయత్నములతో పనిలేదు. నా పూజ ముగింపనిమ్ము. నానిష్ఠకు భంగము కలిగించకు,' అని తల్లిని ఊరడించి పంపెను. ఇంతలో శ్యామసుందరుడే అశ్వశాల నుండి రాజుగారి గుఱ్ఱము తీసుకొని అస్త్రశస్త్రములను అమర్చుకొని శత్రుసేనలపై బడి ఒక్కడే పోరుసల్పి ఆ సైన్యమునంతయు హతముచేసి తిరిగివచ్చి గుఱ్ఱమును ఆలయ ద్వారముకడ కట్టివేసెను. జయమల్లుడు పూజ ముగించుకొని బయటకువచ్చి అలసటచే రొప్పుచున్న తన గుఱ్ఱమును అక్కడచూచి ఆశ్చర్యముతో 'నా గుఱ్ఱముపై స్వారిచేసి ఇక్కడ కట్టివేసినదెవరు' అని ప్రశ్నించెను. మాకేమీ తెలియదని ఉద్యోగులందరు పలికిరి. అంత రాజు తన సైన్యమును నడిపించుకొని యుద్ధభూమికి పోయి చూడగా అచ్చట శత్రురాజు తప్ప మిగిలిన యోధులందరు హతులై పడియుండిరి. జయమల్లుని చూచినవెంటనే శత్రురాజు ఒక్కపరుగున అతని వద్దకువచ్చి పాదములపైబడి నమస్కరించి లేచి చేతులు జోడించి వినయముగా ఇట్లు పలికెను. 'ప్రభూ! నావంటి మూర్ఖుడెవడీలోకములో నుండగలడు! మీ కోటను ముట్టడించుటకు సాహసించితినే! ఆ మీ ఒక్కసైనికుడే చాలు త్రిలోకములను జయించుటకు. ఆ అపురూప లావణ్యుడగు ఆ

నల్లని సిపాయిని మరల మరల చూడవలెనను అభిలాష మిక్కుటముగానున్నది. అతడు నా సైన్యమును హరించుటేగాక నా చిత్తమును కూడ హరించివేసినాడు.'

కథముగిసిన పిదప శ్రీ రామకృష్ణులు మాస్టరుతో మాటాడ దొడంగిరి.

శ్రీ రామకృష్ణులు : దీనిని నీవు నమ్మెదవా? భగవంతుడు స్వయముగా గుఱ్ఱమెక్కిపోయి శత్రుసైన్యమును సంహరించుట ఒప్పుకొనెదవా ?

మాస్టరు : ఇది సంభవమే. కాని యథార్థముగ సిపాయి వేషములో వానిని ఆ రాజు చూచెను అనునది నాకు అర్థమగుటలేదు. అతడు సిపాయి అయితే అయియుండవచ్చు కాని వాళ్ళు ఆయనను చూడగలిగిరా ? అని సందేహము.

శ్రీ రామకృష్ణులు : ఈ పుస్తకములో భక్తుల జీవితములు చాల చక్కగ వ్రాసియున్నారు. కాని ఇందులో సంకుచితబుద్ధి గలదు. ఒకే మతమును గొప్పగ పొగుడుదురు. ఇతర మతములను నిందింతురు. అది సరేగాని మీరందరు తరచు ఇచ్చటికి వచ్చుచుందురే! దీని అర్థమేమి ? సాధారణముగా లోకులు ఎప్పుడో ఒకసారి సాధువును దర్శించుకొని పోవుదురుగాని మాటిమాటికి మీరు ఇచ్చటికి వచ్చుచున్నారేల? మణి మారుపలుకలేదు. శ్రీ రామకృష్ణులు తామే ఈ ప్రశ్నకు బదులు చెప్పదొడగిరి.

శ్రీ రామకృష్ణులు : అంతరంగులు కానిచో వచ్చెదరా ? అంతరంగులు అనగా ఆత్మీయులైన తండ్రి, తల్లి, అన్న, చెల్లి మున్నగు స్వంత ఇంటివంటివారు.

నేను అంతయు ఒకసారి చెప్పివేయను. అట్లనచో మీరు ఇచ్చటికిరారు. శుకమహర్షి బ్రహ్మజ్ఞానోపార్జనకై జనకమహారాజు గారి కడ కరిగెను. జనకుడు ముందుగ తనకు దక్షిణ ఇమ్మని కోరెను. 'ముందు మీరు ఉపదేశము చేసినకదా దక్షిణ ఇచ్చుట!' అని శుకుడు పలికెను. జనకుడు నవ్వుచు 'నాయనా! బ్రహ్మజ్ఞానము కలిగిన తరువాత నీకు గురుశిష్యులనెడి భేదభావముండనేరదు. అందుచేత ముందుగానే గురుదక్షిణ కోరుచున్నాను' అనెను.

అది శుక్లపక్షము. చంద్రోదయమైనది. మణి కాళికాలయములోని పూదోట దారిలో పచార్లు చేయుచుండెను. ఆ దారికొక్కవైపున శ్రీ రామకృష్ణులగది, నౌబత్తు, పొగడచెట్లు, పంచవటియు గలవు. మరొక వైపున భాగీరథి కలకల శబ్దముతో కదలిపోవుచుండెను. మణి మనస్సులో ఈ భావతరంగములు లేచుచుండెను. భగవంతుని సాక్షాత్కారము సాధ్యమా ? కాని శ్రీ రామకృష్ణదేవులు సాధ్యమే అని చెప్పుచుందురుకదా! కొంచెము సాధనచేయ ప్రారంభించినచో ఎవరో ఒకరు వచ్చి దారి చూపింతురనికూడ తెలిపిరికదా! అనగా మనము సాధన చేయవలెనన్నమాట. కాని నాకు వివాహమైనది. బిడ్డలుకూడ కలిగిరి. ఇకమీదటకూడ వానిని పొందుటకు వీలగునా ? ఎందుకు వీలుకాదు. తప్పక వాని దర్శనము కలుగును. లేకున్నచో శ్రీ రామకృష్ణదేవులెందుకు అట్లు ప్రోత్సహించెదరు ? ఆయన కృపవలన తప్పక దర్శనము కలుగగలదు. ఇదిగో! నాముందర ఈ జగముకలదే! సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, జీవులు, చతుర్వింశతి తత్వములతో నిండియున్న ఈ బ్రహ్మాండమెట్లు సృష్టింపబడినది? దీని సృష్టికర్త ఎవరు ? సృష్టికర్తతో నాకు గల సంబంధమేమి ? ఈ విషయములు తెలిసికొనలేక పోయినచో జీవితము వ్యర్థమేగదా! భగవాన్

శ్రీరామకృష్ణులు మహానుభావులు. ఇట్టి మహానుభావుని నేనింతవరకు నా జీవితములో చూచి యుండలేదు. వీరు తప్పక భగవంతుని చూచి యుందురు. లేకున్న రాత్రింబగళ్ళు 'అమ్మా!' అని సంబోధించుచు ఎవరితో మాట్లాడుచుందురు? భగవంతునిపై ఇట్లు ప్రేమ కలుగుట ఎట్లు? భగవత్ ప్రేమావేశములో వారు మైమరచి పోవుచుందురు. బాహ్యేంద్రియ జ్ఞానమే యుండదు. మాటి మాటికి సమాధిస్థితి నందుచుందురు. ఒకప్పుడు జడునివలె ఊరక యుందురు. మఱొకప్పుడు ప్రేమోన్మాదముతో నవ్వుదురు, ఏడ్చుదురు, నృత్యము చేయుదురు, పాడుదురుగదా!

క్రీ శ, 1883 డిసంబరు 14వ తేది. శుక్రవారము ఉదయము 9 గంటలు. శ్రీ రామకృష్ణులు వరండాలో ఆగ్నేయమూలన నిల్చి యుండిరి. ప్రక్కన రామ్‌లాల్ ఉండెను. లాటూ, రాఖాల్ ఇటుఅటు తిరుగు చుండిరి. మణి వచ్చి వారి పాదములకు మ్రొక్కెను.

శ్రీ రామకృష్ణులు: ఓ! వచ్చితివా. నేడు మంచిరోజు.

రామకృష్ణుల సాన్నిధ్యములో కొన్నిరోజు లుండి సాధనలు చేయవలెనను సంకల్పముతో మణి అక్కడకు వచ్చెను. 'ఆలయపు అన్న సత్రము పేదలకు సాధువులకు ఉద్దేశింపబడి నందువలన అక్కడ భోజనము చేయవద్దు. వంట మనిషిని తీసుకొనివచ్చి వంట చేయించు కొనుము' అని శ్రీ రామకృష్ణులు చెప్పియుండు టచే మాస్టరు వంటమనిషిని కూడ తీసుకొని వచ్చెను. శ్రీ రామకృష్ణులు మాస్టరుకు వండు కొను స్థలము చూపించిరి.

తరువాత శ్రీ రామకృష్ణులు తమగదిలోకి వచ్చి కూర్చొనిరి. రామ్‌లాల్ ఆధ్యాత్మ రామాయణము చదువుచుండెను. మణికూడ కూర్చొని వినుచుండెను.

'జానకిని పరిణయమాడిన తరువాత శ్రీ రాముడు అయోధ్యకు మరలుచుండెను. దారిలో పరశురాము డెదురయ్యెను. శివధనుస్సును విరిచివేసెనని రామునిపై అతడు అమితముగా ఆగ్రహించెను. పరశురాముడు క్రోధ పరవశుడై కయ్యమునకు కాలుద్రువ్వుచుండెను. శ్రీ రాముడు మందహాసముతో బాణమును సంధించి 'ఈ బాణమును ఎచ్చట ప్రయోగింతును'అని పరశురాముని ప్రశ్నించెను. పరశురాముని గర్వము అణగెను. అతడు రాముని పరబ్రహ్మమని గు రించి స్తుతించెను.'

పరశురాముని స్తుతి విని శ్రీ రామకృష్ణులు భావావేశులై మధురకంఠముతో 'రామా! రామా!' అనుచుండిరి.

తరువాత శ్రీ రామకృష్ణుని కోరికపై రామ్‌లాల్ గుహునికథ చదువ నారంభించెను. 'పితృవాక్య పరిపాలనకై రాముడు అడవికి వచ్చుచున్నాడనివిని గుహుడుని శ్చేష్టుడయ్యెను. అతడు రామునికి ఆత్మసమర్పణ చేసికొనెను. రాముడు వానిని మిత్రమా అని సంబోధించి గట్టిగా కౌగలించుకొనెను. పదునాలుగు సంవత్సరముల తరువాత తిరిగివచ్చెదనని రాముడు గుహునకు వాగ్దానముచేసెను. పదునాలుగు సంవత్సరములు గడిచినను రాముడు తిరిగి రానందున ఓపికపట్టలేక అసువులను త్యజింప బోయెను. ఇంతలో హనుమంతుడు వచ్చి శ్రీ రాముని రాకను తెలిపెను. సీతారాములు పుష్పక విమానమునుండి దిగిరి. గుహుడు ఆనందపరవశుడై శ్రీరాముని స్తుతించెను.'

—సశేషం.

# సూతసంహిత

## ఏలూరిపాటి అనంతరామయ్య

### మనవి:

1. ఈ అనువాదానికి ఆధారమైన మూల ప్రతి 1916 లో ముద్రించి, మదరాసు ట్రిప్లికేన్ శారదా మందిరంనుంచి, శ్రీయుతులు ఎస్. రామచంద్రశాస్త్రి, కె. కుప్పుస్వామి శాస్త్రిగారలు, విజయనగర మాధవాచార్య విద్యారణ్యుల తాత్పర్యదీపికతోసహా ప్రచురించిన నాగరలిపి ప్రతి.

2. అనువక్త ఆనందాశ్రమగ్రంథమాలవారు ప్రచురించిన ప్రతికోరకూ, పట్టమట్ట సోమనాథకవి అనువాదం కోరకూ, ఇతరులెవరైనా హిందీ ఆంగ్లాంధ్రాలలోనికి అనువదించి ఉంటే వాటికోరకూ ప్రయత్నిస్తున్నాడు. అట్టివేవైనా దొరికితే మూలాన్ని అర్థం చేసుకోనటంలో వాటిసహాయం స్వీకరిస్తాడు అంతవరకూ తాత్పర్య దీపికయే మార్గదర్శిని. ఏమైనా, అన్వయం చేసుకోనటంలో ఇతని స్వతంత్రత ఇతనిదే. కనుక, ఏవైనా పొరపాట్లు వస్తే పూర్తిజవాబుదారీ ఇతనిదే.

3. మూలంలో ఉన్న ఒక్క పదాన్నికూడా విడువడు. అక్కడ లేనిది ఒక్క పదంకూడా తెచ్చి పెట్టడు, ఉన్నదున్నట్లు అనువదిస్తాడు. కథాసరిత్సాగరకారుడు చెప్పినట్లు మూలం ఎలా ఉంటే ఇది అలా ఉంటుంది. కొంచెమూ అతిక్రమణం ఉండదు.

4. ఎక్కడయినా మూలంలో ఉన్న పదాల అనువాదాలకు అధికంగా చేర్చవలసివస్తే అది కుండలీకృతం ( ) కాగలదు. అలా కుండలీకృతాలయిన మాటలు మూలకర్తవి కావనీ, అనువక్తవనీ గ్రహించాలి. ఇలా పదాలను చేర్చటానికీ, కుండలీకరించటానికీ వేరు వేరు కారణాలు ఉన్నవి. వాటిలో కొన్ని ఇవి: ౧. ప్రత్యేక ప్రదేశంలో మూలకర్త ప్రయోగించిన పదాన్నే తెలుగులోనూ ప్రయోగించవలసివస్తే దానిని అతడు ఏ అర్థంలో ప్రయోగించి ఉంటాడని అనువక్తకు అనిపిస్తున్నదో ఆ అర్థాన్ని ఒకపదంతో సూచించటం. ౨. కథనం తుంపులుగా గాక తీగె సాగినట్టుగా ఉండటంకోసం అనువక్త చేర్చిన అతుకుమాటలు. ౩. మూలకర్త అధ్యాహార్యాలుగా వదలివేసిన చోట భావపరిపూర్తికి చేర్చిన పదాలు. ౪. మూలకర్త అస్పష్టంగా ప్రయోగించినచోట వివరణకు చేర్చిన పదాలు. ౫. ఎదుటనున్న అనేకులతో ఒకరితో మాటాడటం పూర్తి కాగానే మరొకరితో మాటాడటం మొదలు పెట్టినప్పుడు మూలకర్త తాను ఆ మాట చెప్పకుండా సరాసరి పాత్రలచేత నాటకంలో మాటాడించినట్టు మాటాడిస్తే పఠితకు కలిగే గందరగోళం నివారించటానికి చేర్చేమాటలు. ౬. రెండర్థాలు వచ్చేటట్లు ప్రయోగించిన పదాలకు ఒకటి రెండు మాటలలో వివరణలు.

5. ఎన్నవ శ్లోకంఅనువాదం ఎక్కడకు పూర్తయితే అక్కడ, అందుకు గుర్తుగా అన్నవ శ్లోకసంఖ్య చిన్న అంకెతో సూచింపబడుతుంది. ఇందువల్ల ఇన్నవ అధ్యాయం ఇన్నవ శ్లోకంలో ఇలా ఉన్నది అని తెలుసుకొనదలచుకొన్నవారికీ, ఆ భాగాన్ని మూలంతో సరిపోల్చి చూచుకొనదలచుకొన్నవారికీ, మూలభాషను అర్థం చేసుకొనే శక్తి లేకపోయినా, ఇతరుల అనువాదాలు ఎంతవరకు మూలవిధేయాలో తెలుసుకోదలచుకొన్నవారికీ ఉపయోగం.

6. ఏ శ్లోకం అనువాదం ఆ శ్లోకాంతానికి పూర్తి అయేటట్లు లేనపుడు భావపూర్తికి అవసరమైనన్ని శ్లోకాలను కలిపి అనువదించవచ్చు. అప్పుడా శ్లోకాలు రెండయితే మొదటిసంఖ్య తరువాత కామా ఉంటుంది. ఉదా॥ 1, 2. అంతకు మించిఉంటే తొలిసంఖ్య తరువాత ఒక అడ్డగీతా, దానితరువాత చివరిసంఖ్యా ఉంటాయి. ఉదా॥ 1-4.

7. సంస్కృతసూతసంహితలో ఏమి ఉన్నదో తెలుగు చదువరులకు వీలయినంత సులభంగా, సాధ్యమైనంత వాడుకకు దగ్గరగా ఉన్న తెలుగువచనంలో తెలియజేయటమే అనువక్త లక్ష్యం.

8. ఎక్కడయినా విశేషం ఉంటే, అధోజ్ఞాపికలో వివరణ ఉంటుంది.

9. అనువదించేటప్పుడు వీలయినంతవరకూ సంస్కృతపదానికి తెలుగుపదం రావాలన్నదే అనువక్త అభిలాష. అయితే, వాక్యం అందానికీ అర్థావగతికీ భంగం కలిగినా సంస్కృతపదాలను వదలిపెట్టాలనే పట్టుదల మాత్రం లేదు. పదాల ఎన్నికలో రుచిభేదం సరే, ఎటూ తప్పదు.

### :ముఖ్యమైన మనవి:

అనువక్త అష్టాదశ పురాణాలనూ, ఇతిహాస వాల్మీకాలనూ ఈ ధోరణిలో తెలుగుచేయటం తనజీవితధ్యేయంగా

పెట్టుకొన్నాడు. ఈ లోపల పఠితల సౌకర్యంకోసమూ, పెద్దల పరిశీలనకోసమూ, రచనకు అవసరమైన ఉద్బోధం కోసమూ, (1) విష్ణుపురాణం - పశ్చిమగోదావరి జిల్లా, ఏలూరు, రామచంద్రరావు పేట, పానుగంటివారి వీధి లోని సత్యధర్మాశ్రమంనుంచి ప్రచురితమయ్యే 'ముముక్షువు' లోనూ, (2) వామనపురాణం - హైదరాబాదు-1, తిలక్‌రోడునుంచి దేవాదాయ ధర్మాదాయ శాఖ ప్రచురించే 'ఆరాధన' లోనూ, (3) సూతసంహిత - ఈ 'శ్రీరామకృష్ణ ప్రభ' లోనూ ప్రచురితమవుతున్నవి. త్వరలోనే (4) బ్రహ్మవైవర్త పురాణం - విశాఖపట్టణం, డాబాగార్డెన్సులోని వాణీ ప్రింటర్సు ప్రకటించే 'నావాణి' లోనూ, (5) శ్రీమద్భాగవతం - చిత్తూరుజిల్లా. ఏర్పేడు - వ్యాసాశ్రమంవారి 'యథార్థ భారతి' లోనూ, (6) శ్రీశైల ఖండం - శ్రీశైలం - శ్రీ భ్రమరాంబామల్లిఖార్జునదేవస్థానం వారి 'శ్రీశైల ప్రభ' లోనూ ప్రచురితం కానున్నవి. పరమాత్మ సంకల్పిస్తే ఇవి ఏనాటికైనా ప్రత్యేకగ్రంథాల రూపంలో రానూవచ్చు.

కనుక శ్రీ రామకృష్ణ ప్రభ పఠితలు, వీలయితే పై అన్నింటిలోనూ, కనీసం ఇందులో ప్రకటితం అవుతున్న ఈ సూతసంహితలోనూ, ఎంత చిన్న దోషలేశం కనిపించినా, ఉపేక్షించటం ఔదార్యమనుకొని వదలక, అనువక్తకు తెలిపితే, వివరించుకొని తప్పు దిద్దుకొంటాడు. దిద్దినవారికి పేరుగానూ, గ్రంథంలోనూ కృతజ్ఞత తెల్పుకొంటాడు.

అనువక్త ఇది ఏదో రచన అని కాక జ్ఞానయజ్ఞమనుకొని చేస్తున్నాడు.

కనుక, లోపాలనూ, సూతసంహిత గురించి ఈ అనువక్త కడచిన నెల శ్రీ రామకృష్ణ ప్రభలో వ్రాసిన వ్యాసం ఇంతవరకూ చదువనివారు తొలిమారూ, చదివిన వారు మరోసారీ దయతో చదివి, దీనిపైనిఉంటే ఇతర వ్యాఖ్యలకూ, హిందీ ఆంగ్లాంధ్ర భాషలలోని అనువాదాలకూ సంబంధించిన విశేషాలనూ అనువక్తకు చిరునామాకు వ్రాయమని వినయంతో, మరీమరీ వేడుకొంటున్నాడు.

## : ప్రార్థన :

కర్ణతాళానిలక్షిప్త విఘ్న జీమూతసంహతిం।
నతకార్యగతిం వందే గణాధిపతిమన్వహమ్॥

తా॥ చెవులనే తాళాలగాలులతో విఘ్నాలనే మేఘాలను చెదరగొట్టి, నమస్కరించిన వారిపనులకు దిక్కయిన గణాధిపతికి అనుదినమూ ప్రణమిల్లుతున్నాను.

సృష్టిస్థితిలయాకారచక్రభ్రమణకారణం।
నతార్తివారణచణం నౌమి నారాయణం సదా॥

తా॥ లోకసృష్టి స్థితిలయములనే చక్రాన్ని త్రిప్పుతూ, తనకు మ్రొక్కినవారిపీడలను తొలగించే శ్రీమన్నారాయణుని సదా నుతిస్తున్నాను.

సమస్తోపనిషత్సారక్షీరపూర్ణనిజోదరం।
నరం వందే నరవరం నారాయణసుహృత్పరమ్॥

తా॥ ఉపనిషత్తు లన్నింటిసారమనే పాలతో నిండిన కుక్షికల నరోత్తముడూ నారాయణుని మిత్రశ్రేష్ఠుడూఅయిన నరునికి వందనం.

యమప్రాప్య నివర్తన్తే వచాంసి మనసా సహ।
తస్య లీలాం వర్ణయన్తీం మంబాం వాణీ
ముపాస్మహే॥

తా॥ వాక్కులూ, మనస్సూకూడా శ్రీమన్నారాయణుని పొందలేక తిరిగివస్తున్నవి. అట్టివానిలీలలను వర్ణించే సరస్వతీమాతను ఉపాసిస్తున్నాను.

వేదాన్ విభజ్య సూత్రాణి పురాణాని విరచ్య చ।
ధర్మత్రిపథగాం పృథ్వ్యాం చాలయంతం
మునిం నుమః॥

తా॥ వేదాలను విభజించీ, బ్రహ్మసూత్రాలను నిర్మించీ, అష్టాదశ మహాపురాణాలను వ్రాసీ, మూడురీతుల ధర్మగంగానదిని ప్రవహింపజేస్తున్న వ్యాసులవారిని స్తుతిస్తున్నాము.

న త్రిమూర్త్యాత్మకత్వేన కేవలం భానుసన్నిభః।
అజ్ఞతాంధ్యనాశేన యస్తం గురుమహం
భజే॥

తా॥ మూర్తిత్రయరూపులు కావటంవల్లనే కాక, అజ్ఞానపుచీకటిని నశింపజేసినవారై నందునకూడా సూర్యునివంటివారైన గురువులను సేవిస్తున్నాను.

# శివమాహాత్మ్యఖండం

**: మొదటి అధ్యాయం—గ్రంథావతార కథనం :**

ఐశ్వరం పరమం తత్త్వమాదిమధ్యాంతవర్జితమ్।
ఆధారం సర్వలోకానా మనాధారమవిక్రియమ్॥

ఈశ్వరసంబంధమైన పరమతత్త్వం, ఆదీ, మధ్యమూ, అంతమూ లేనిది. సర్వలోకములకూ ఆధారం, తనకు ఆధారం లేనిది, మార్పు లేనిది1.

అనంతానంద బోధాంబునిధిమద్భుతవిక్రమమ్।
అంబికాపతిమీశానమనిశం ప్రణమామ్యహమ్॥

అంతులేని ఆనందమునకూ జ్ఞానమునకూ అంబునిధివంటివాడు, అద్భుత విక్రమశాలి, అంబికాపతి, ఈశానుడు ఆయనకు నేను అనవరతమూ ప్రణమిల్లుతున్నాను2.

దీర్ఘయాగం పూర్తికాగా మిక్కిలి పరిశుద్ధ బుద్ధులైన ప్రసన్నములైన ఇంద్రియములూ, మనస్సులూ గల నైమిశారణ్యనివాసులైన మునులు, విచ్చేసిన మహాత్ముని, రోమహర్షణ సుతునివి, సూతుని, పౌరాణికోత్తముని చూచి, తగురీతిని పూజించి, ఈ సంహితనుగురించి ప్రశ్నించారు4.

మునిశ్రేష్ఠులిలా ప్రశ్నించేసరికి సూతుడు సర్వార్థప్రదాతను మహాదేవునీ, మహాత్ముని వ్యాసునీ భక్తితో ధ్యానించి5, మనస్సును చక్కజేసుకొని, మునిసత్తములను విలోకించి. వేదతుల్యమైన సంహితను చెప్ప నారంభిస్తున్నాడు6.

**: అష్టాదశమహాపురాణాలు :**

మొదటిది బ్రాహ్మపురాణం. రెండవది పాద్మం. మూడవది విష్ణుపురాణమన్నారు. నాలుగవది శివపురాణం7. తరవాత భాగవతమన్నారు. ఆపైది భవిష్యం. ఏడవది నారదీయం. ఎనిమిదవది మార్కండేయం8. తొమ్మిదవది ఆగ్నేయం. తరవాత బ్రహ్మకై (వై) వర్తం. అనంతరం లైంగం. తరువాత స్కాందం. దానికంటె ఉత్తమం లేదు9. ఆపైని వామనం. తరవాతది కౌర్మం. ఆపైది మాత్స్యం అంటారు. తరువాతది గారుడమంటారు. దాని తరువాతది బ్రహ్మాండమని తెలుసుకొంటున్నారు10. పురాణశ్లోకసంఖ్య నాలుగు లక్షలు మునిపుంగవులారా. ఆగమసంహితలకు మహేశ్వరదేవుని విధంగానే, అష్టాదశపురాణాలకూ కర్త సత్యవతీసుతుడు11. [తొలుత చేసినవాడు సాక్షాత్తూ శూలపాణి శివుడని వినికిడి. విప్రులారా, పది పురాణాలు పరమేశ్వరునీ, నాలుగు విష్ణునీ, రెండు జగత్పతి బ్రహ్మనూ, ఒకటి అగ్నినీ, ఒకటి చండభాస్కర భగవానునీ చెపుతున్నవి.]

**: అష్టాదశ—ఉపపురాణాలు :**

సత్యవతీసుతునివల్ల పద్ధెనిమిదిపురా

---

3. మహాత్ముని = వ్యాసానుగ్రహంవల్ల కలిగిన పరమశివసాక్షాత్కారంకూర్చే అనుగ్రహసామర్థ్యం కలవానిని ; విచ్చేసిన = విశిష్టాధికారులు నైమిశారణ్యవాసులయిన మునులు కనుక తనంత వచ్చినాడని కారుణికత్వం తెలుసుంది —

4. ప్రశ్నించారు = 'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన' అన్న గీతార్థం — తా. దీ.

5, 6. మహాదేవునీ, వ్యాసునీ, ధ్యానించి, విలోకించి = ఇలా పరమశివునీ గురువునీ ధ్యానించి చూడటం చాక్షుషదీక్షను అనుగ్రహించటం. 'వ్యాసునీ' అన్నందున దైవంతోపాటు గురువునూ ధ్యానించటం విధాయకం అని. తా. దీ. వేదతుల్యం = సర్వవేదార్థ సంగ్రహస్వరూపం. తా. దీ.

7—10. సంహితాకర్త వ్యాసులవారు సర్వజ్ఞులనటానికిది చెప్పటం. తా. దీ.

ణాలనూ విని మునులు ఇతర – ఉపపురాణాలను చేశారు12. వేదవిద్వరులారా, (వాటిలో) మొదటిది సనత్కుమారప్రోక్తం. రెండవది నారసింహమన్నది. మూడవది నాందికేశ్వరం13. నాలుగవది శివధర్మం అన్న పేరిటిది. ఐదవది దౌర్వాసమని తెలుసుకొన్నారు. ఆరవది నారదీయమన్నది. ఏడవది కాపిలం అని తెలుసుకొన్నారు14. ఎనిమిదవది మానవ మని చెప్పబడింది. తొమ్మిదవది శుక్రుడు చెప్పినది. తరువాతది బ్రహ్మాండమన్నది. ఆ తరువాతది వారుణం అనే పేరిటిది15. ఆ పైది కాళీపురాణమన్నది విశిష్టమైనది మునిపుంగవులారా. తరువాతిది వాసిష్ఠలైంగమని పరమ మాహేశ్వరం చెప్పబడింది16. అనంతరం సాంబపురాణమన్నది. తరువాతిది సౌరం. అంతకంటె ఉత్తమమైనది లేదు. ఆ పైని చెప్పినది పారాశర్య। దానితరువాతిది మారీచమన్నది. అనంతరపుది సర్వధర్మార్థసాధనం గంగానామకం18.

## : స్కాందపురాణస్వరూపం :

ఇపుడు స్కాందపురాణంగురించి చెపుతాను. ఇందులోని శ్లోకాలు లక్ష. ఇది సర్వ విజ్ఞానసాగరం. వేదతుల్యం19. సంహితలపేర ఆరు విభాగాలుగా ఉన్నది. (వాటిలో ఉన్న) ఏభై ఖండాలతో అలంకృతం20. మొదటిది సనత్కుమారప్రోక్తం. రెండవది సూతసంహిత. మూడవది శాంకరం అని చెప్పబడింది. నాలుగవది వైష్ణవం అని అభిమతమైనది. దాని తరువాతది బ్రాహ్మసంహిత. చివరిది సౌర సంహిత అని ఇష్టమైనది21.

మొదటి సంహిత ఏభై ఐదు వేల శ్లోకాలతో నిర్మితమని చెప్పబడినది. రెండవది ఆరువేలు22. మూడవది ముప్పైవేల శ్లోకాలతో కనిపిస్తున్నది. నాలుగవసంహిత ఐదువేల శ్లోకాలతో నిర్మితం23. ఆ తరువాతిది మూడు వేల శ్లోకాలతోనే రచితమైనది. కడమది వెయ్యి శ్లోకాలతో వినిర్మితమైనది పండితోత్తములారా24.

## : సూతసంహితాస్వరూపం :

రెండవసంహితను చెప్పబోతున్నాను సర్వపాపప్రణాశిని. దానిని మునులూ, దేవతలూ, గంధర్వులూ పూజిస్తారు బహుశుభావహమైనది25. ఆ పవిత్ర వేదతుల్యసంహిత నాలుగు ఖండాలుగా ఉన్నది. మొదటిది శివ మాహాత్మ్యఖండమని ప్రశంసగొన్నది26. రెండవది జ్ఞానయోగఖండం, సర్వవేదాంత సంగ్రహం. మూడవది ముక్తిఖండమన్నది, నాలుగవది యజ్ఞవైభవఖండం27.

## : సూతసంహిత వేదతుల్యం :

మొదటిఖండం ఏడువందల శ్లోకాలని చెప్పబడినది పండితోత్తములారా. రెండవది ఏడు వందల ముప్పైఏడు శ్లోకాలని చెప్పబడినది మునులారా28. మూడవది ముప్పైఏడు తక్కువగా ఆరువందలు మునులారా (అంటే 567). నాలుగవది మునిశ్రేష్ఠులారా, నాలుగు వేలు28. అది పూర్వభాగమనీ ఉత్తరభాగమనీ రెండు విధాలుగా చెప్పబడినది30. మొదటిఖండం పదమూడు అధ్యాయాలు. రెండవది ఇరవై, మూడవది తొమ్మిది, నాలుగవది అరవై

26. ఇతర ఖండాలలోనూ శివమాహాత్మ్యమున్నా, ఇందులో దానికి ప్రాధాన్యం ఉన్నందున ఈ పేరు. తా.దీ.

27. జ్ఞానయోగఖండం = జ్ఞానమునకు యోగము లనగా ఉపాయాలు యమనియమాదులు చెప్పబడిన ఖండం. జ్ఞానస్య యోగా ఉపాయా యమనియమాదయో జ్ఞానయోగా ఆఖ్యాయన్తే అస్మిన్నితి వ్యాఖ్యాః - తా. దీ.।

ఏడధ్యాయాలు. ఆస్తికులారా, సమస్తవేద ముల అర్థమూ31 [ఈ విధంగా నాలుగురకాల ఖండాలతో వేదతుల్యమయినదీసంహిత.] ఈ సంహితలోనే ఉన్నది ప్రత్యక్షంగా, సంశయం లేదు32.

: వేదాలూ—పురాణాలూ :

సర్గం (సృష్టి), ప్రతిసర్గం (ప్రళయం), వంశం (ఋష్యాదుల వంశచరిత్రలు), మన్వంతరాలు (మనువుల పరిపాలనా కాలవిశేషాలు), వంశానుచరితం (రాజవంశాదికములు) ఈ ఐదు లక్షణములూ కలది పురాణం33. నాలుగు వేదాలూ తెలిసిన విప్రుడూ అర్థంతో పురాణం ఎరుగకపోతే, అతనిని చూచి వేదం 'నన్ను వీడు మసిపూసి మారేడుకాయ చేయగలడని భయపడుతుంది. [మిడిమిడిజ్ఞానం కలవాడంటే, 'నన్ను వీడు తలక్రిందులు చేస్తా'డని వేదం భయపడుతుంది.] ఇతిహాసపురాణాలు రెండింటితోనూ వేదాన్ని పెంపొందింపజేయాలి34. మునిపుంగవులారా, వేదాలు ఆదిస్వతః ప్రమాణాలు. తరువాత స్మృతులూ, పురాణాలూ, భారతమూ35. ఇతరములైన అనేకశాస్త్రాలూ—సర్వమూ, వేదాలకు అవిరోధముగా ప్రమాణం మునిశ్రేష్ఠులారా. మరోమార్గాన కాదు36.

ద్విజులారా, వేదం ఒకటే, వేదార్థమూ ఒకటే; అయినా, మునిశార్దూలులారా, శాఖాభేదంతో విభక్తమైనది37. ద్విజులారా, వేదవేద్యుడు శంకరుడు శివుని మాయచేతనే వేదాలు అనంతములూ వేదార్థం అనంతమూ. కాని వాస్తవానికి కావు. అహో, దేవ వైభవం38, 39.

: వేద—స్మృతి—పురాణోత్పత్తి :

మునులారా, పూర్వం మహేశ్వరుడు బ్రహ్మను సృష్టించి, తనలోనే ఉన్న ఈ వేదాలనన్నిటినీ ఆయనకిచ్చాడు40. సర్వ జగత్కర్త బ్రహ్మ సువ్రతులారా, పరమాత్మ అయిన శివుని రుద్రుని ప్రసాదంవల్లనే స్మృతులను స్మరించాడు41.

: వేదవిభజనం :

విశ్వజగన్నాథుడు విష్ణువు విశ్వేశుని శివుని పరమాజ్ఞతో నా గురువు వ్యాసుడుగా జన్మించాడు42. ద్విజులారా, ఆయన దేవదేవుని అంబికాపతి ప్రసాదంవల్ల సకల వేదాలనూ సంక్షేపించి నాలుగుగా చేశాడు44. ఋగ్వేదం మొదటిదని చెప్పబడింది. తరువాతిది యజుర్వేదం. మూడవది సామవేదమన్నది. నాలుగవది అథర్వ మనబడుతున్నది44. ఋగ్వేదం ఇరవైఒక్క భాగాలుగా ఆయన విభజించాడు. ద్విజులారా, యజుర్వేదం నూటొక్క భాగాలుగా విభక్తమైనది45. అథర్వవేదం తొమ్మిది భాగాలుగానూ, సామవేదం వేయి భాగాలుగానూ విభక్తమైనవి. వేదవిభజనంవల్లనే ఆ ముని లోకంలో వ్యాసుడని వినవస్తున్నాడు46. ఈ మహాయోగి వ్యాసుడు ప్రత్యక్ష సర్వజ్ఞుడీశ్వరుడు. ఈ ముని భగవానుడు ఆశ్చర్యకరమైన మహాభారతం నిర్మించాడు47.

ఆయన శిష్యులు మహాభాగులు మునిసత్తములు నలుగురు ఉన్నారు. ముని ఆ పైలుడు మొదలయినవారికి వేదాలను ఇచ్చాడు48. విప్రులారా, సాధ్వి, సనాతని, శ్రుతిని వారి

46. వేదాన్విభజ్య ఆ సమన్తాత్ శిష్యేభ్యో వ్యస్యతీతి వ్యాసః. తా. దీ.

47. వ్యాసులవారు సాక్షాద్విష్ణ్వవతార మనటానికీ భారతకర్తృత్వమే గమకమట.

కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్। కోహ్యన్యః పుండరీకాక్షాన్మహాభారతకృద్భవేత్॥ తా.దీ.

నుంచే అందరూ అధ్యయనం చేశారు. ఆ వేదం వల్ల ఉత్తమ వేదవేత్తలారా, వర్ణాశ్రమాచారం ప్రవృత్తమైనది49.

ఆ ముని పురాణప్రవక్తగా నన్ను నియోగించాడు. అందువల్లనే మునిశ్రేష్ఠులారా, నేను పురాణం చెప్తున్నాను మునిపుంగవులారా, పరమ శ్రద్ధాసమన్వితులై వినండి50.

అని (చెప్పినది) విని, సనాతనులు, నైమిశారణ్యవాసులు మునిశ్రేష్ఠులు51 స్తిమితమనస్కులై సూతుని నమస్కరించి ఆదరంతో పూజించారు.

ఆయనా సర్వజగత్కారణుని, శంకరుని, పరమేశ్వరుని52, అంబికాపతిని, ఈశానుని, అనంతానందచిద్ఘనుని, చాలాసేపు ధ్యానించి భక్తిపరవశుడయ్యాడు53.

సోమునికి, రుద్రునికి, శంకరునికి, మహాత్మునికి, బ్రహ్మావిష్ణు సురేంద్రులకూ ధ్యానగమ్యుడైన శూలికి నమస్కారం54, భక్తులకు భక్తగమ్యునికి, విద్వాంసులకు ఆత్మరూపునికి, స్వానుభూతిప్రసిద్ధునికి సర్వసాక్షికి నీకు నమస్కారం55.

: ఇది శ్రీస్కాందపురాణం శ్రీసూతసంహితలోని శివమాహాత్మ్యఖండంలో గ్రంథావతార కథనం అను మొదటి అధ్యాయం :

---

52. ఇదివరకు 4 వ శ్లోకంలో 'చూచి, తగురీతిని పూజించారు' అన్నది చూడగానే చేసినపూజ. ఇక్కడ 'నమస్కరించి పూజించారు' అన్నది ప్రధానగ్రంథశ్రవణారంభంలో చేసిన నమస్కారపూజలను చెప్పటం—తా. దీ.

53. 5 లో ధ్యానించినది చాక్షుషదీక్ష ఇవ్వటానికి; ఇక్కడ ధ్యానించినది పురాణారంభానికి. తా. దీ.

54. సోముడు = చంద్రుడు, శివుని అష్టమూర్తులలో ఒకటి; ఉమయా సహితః సోమః = ఉమాదేవీ సహితుడనీ చెప్పవచ్చు. రుద్రుడు = రుత్ - అనిష్టమైన సంసారాన్ని పోగొట్టేవాడు. రుదమనిష్టం సంసారం ద్రావయతీతి రుద్రః. రుద్ అంటే దుఃఖమనీ, దుఃఖహేతువనీ, వీటిని తరిమివేసేప్రభువు రుద్రుడనీ వాయవీయసంహిత.

రుద్దుఃఖం దుఃఖహేతుం చ విద్రావయతి నః ప్రభుః। రుద్ర ఇత్యుచ్యతే తస్మాచ్ఛివః పరమకారణమ్॥ తా. దీ.

ఆడించెదవు బొమ్మలాట వాడునుబోలె సర్వచరాచర జంతువులను
కనుకట్టు గట్టెదు గారడీడునుబోలె మిథ్యాప్రపంచంబు తథ్యముగను
వేర్వేర వోతువు వేషధారియుబోలె బహువిధ దేవతా భద్రకళల
తెలివి మాన్పుదువు జక్కులవానిచందాన ప్రజల సంప్రదంగవల్లి జేర్చి
ఇట్టివే కద నీ విద్యలెన్నియైన నింక నేమిటి ఘనుడవో యెఱుగరాదు
చిత్రచిత్ర ప్రభావ! దాక్షిణ్యభావ! హతవిమతజీవ! శ్రీకాకుళాంధ్రదేవ!

—ఆంధ్రనాయక శతకం.

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము :
## ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము :
## పి. గణపతిశాస్త్రి

ఉద్బోధనకార్యాలయము; ప్రార్థన మందిరము. అమ్మ తన మంచంమీద కూర్చున్నది. నేను ఆమెపేరవచ్చిన ఉత్తరాలన్ని చదివి విని పిస్తున్నాను. కృష్ణలాల్ మహారాజ్ (స్వామి ధీరానంద) కూడా పక్కనే కూర్చున్నారు. ఎవరో ఒకాయన "నేను నా మనస్సును ప్రశాంతంగాఉంచి ఏకాగ్రత సాధించలేక పోతున్నాను" అని తన ఉత్తరంలో వ్రాసి, ఇంకా అదే ధోరణిలో ఏవేవో పేర్కొని తన లేఖ ముగించాడు. అమ్మ అదివిని చాలా కంగారుపడి ఇలాగన్నది.

"ప్రతిరోజు పదిహేను లేక ఇరవై వేల మారులు భగవానుని నామం జపిస్తే తప్పక ఏకాగ్రత కలుగుతుంది. కృష్ణలాల్! ఇది ఇలాగ జరగడం నేను స్వయంగా గమనించాను. ఇందుచేత అతనిని ఇలాగ చెయ్యమని చెప్పు. ఒకవేళ ఫలితం కనిపించకపోతే అప్పుడు మాట్లాడమన్నానని చెప్పు. ముందుగా దీనినిగురించి శాయశక్తులా ప్రయత్నించాలి! కాని ఎవ్వరు ఇలాగ చెయ్యరు. అంతే! పైగా చీటికి మాటికి ఫలితమేమి కనిపించడం లేదేమని వాపోతూ ంటారు. అంతే!

ఒక శిష్యుడు మాతృదేవికి పాదాభివందనం చెయ్యడానికి వచ్చి, ధ్యానాన్నిగురించి, జపాన్నిగురించి ప్రశ్నిస్తున్నాడు. దానిమీద అమ్మ ఇలాగ సమాధానం చెప్పింది. "చేతివేళ్ళమీద లెక్కపెడుతూ, ఆ లెక్కమీద దృష్టిపెట్టుకుని నామజపం చెయ్యడం మొదలయినవి ఏకాగ్రత కలిగించడానికే ఉపయోగిస్తాయి. మనస్సెల్లప్పుడు పరిభ్రమిస్తూంటుంది. అయినా అది ఈ విధమయిన ఏకాగ్రతాసాధనలవల్ల బంధించబడవచ్చును. క్రమక్రమంగా నామజపంవల్ల భగవత్సాక్షాత్కారం సంభవించిన ఎడల, ధ్యానంలో ఏకాగ్రత కలుగుతుంది. ఆ విధమయిన ధ్యానమగ్నతవల్ల మరి జపించనక్కరలేదు. ధ్యానంలో ఏకాగ్రత సాధించుకుంటే అందువల్ల సమస్తము సిద్ధిస్తుంది.

మనస్సు బొత్తిగా విశ్రాంతి లేనిది. అందుచేత ప్రారంభంలో కొంత వ్యవధివరకు ప్రాణాయామం సాధనచేసి, ఏకాగ్రధ్యానంకోసం ప్రయత్నించాలి. అందువల్ల మనస్సు ప్రశాంతమవుతుంది కాని ఈ ప్రాణాయామం అతిగా చెయ్యరాదు. అందువల్ల తల వేడెక్కిపోతుంది. భగవత్సాక్షాత్కారము, ధ్యానము, మొదలయినవన్ని మనస్సుమీదనే ఆధారపడి ఉంటాయి. ఏకాగ్రధ్యానంవల్ల సర్వము సిద్ధిస్తుంది. మానవులెల్లప్పుడు భగవానునిమాట, విస్మరిస్తూంటారు. అందుచేత అవసరమయినప్పుడల్లా భగవానుడు మానవరూపంలో అవతరించి, దైవభక్తికి మార్గం నిర్దేశిస్తూంటాడు. ఈసారి ఆయన [శ్రీ రామకృష్ణ] సర్వసంగ పరిత్యాగానికి మార్గం నిర్దేశించారు. అంతేకాదు. నూరేళ్ళ పర్యంతమూ, తమ శిష్యసంతతి మధ్య నివసించగలమని ఆయన అన్నారు."

## మాతృదేవి చరణసన్నిధి: సరయూ బాలాదేవి ప్రథమ సందర్శనము

శుక్రవారం ఉదయం శోకహరణ్ మా ఇంటికివచ్చి "రేపు మేము మాతృదేవిని సందర్శించబోతున్నాము. మీరందరు సిద్ధంగా

ఉండండి!'' అన్నాడు. ఆహా! రేపు నేను మా తల్లిని సందర్శించబోతున్నాను! ఆ రాత్రి అంతా నాకు నిద్రపట్టలేదు! అది 1911 వ సంవత్సరము. మేము కలకత్తాలో 14, 15 ఏళ్ళనించి నివసిస్తున్నాము. అయితే మాతృదేవి కారుణ్యం నామీద ఇన్నాళ్ళనించి జాలువారుతూనే ఉన్నదన్నమాట!

ఆ మరునాడు మధ్యాహ్నం నా సహోదరి సుమతిని బ్రాహ్మణ బాలికల పాఠశాలలో కలుసుకుని ఆమెతోబాటు మాతృదేవికి నమస్కరించడానికి బయలుదేరాను. మాతృమూర్తిని సందర్శించడానికి ఎంత తహతహతో, ఉత్కంఠతో వెళ్లానో నేనిక్కడ వ్యక్తీకరించలేను! మేమక్కడికి వెళ్ళినతరవాత అమ్మ ప్రార్థన మందిరం గుమ్మంలో కనబడింది. అది బాగ్ బజారులో ఉన్న గృహం. ఒక అడుగు గుమ్మంలో ఉంది. ఇంకొక అడుగు దాని వెనకాల కనబడింది. ఆమె శిరస్సుమీద మేలిముసుగు లేదు. ఎడమచెయ్యి కొంచెం ఎగువగా తలుపుమీద ఆనుకున్నది. కుడిచెయ్యి కిందికి వేలాడుతూంది. ఆమె శరీరంలో సగం భాగం అనాచ్ఛాదితంగా ఉన్నది. నిశ్చల దృష్టితో మాతృదేవి ఎవరికోసమో నిరీక్షిస్తున్నది. నేనామె పాదధూళి స్వీకరించాను.'' మీ రెవ్వరని అడిగింది అమ్మ. సుమతి ''మా పెద్దక్కయ్య'' అని సమాధానం చెప్పింది. ఆమె అంతకుముందే కొన్నిమారులు మాతృదేవిని సందర్శించింది. మాతృదేవి నా వైపుచూసి అన్నది.

''చూడు తల్లీ! నేనొక పెద్ద ఇబ్బందిలో పడిపోయాను. నా సోదరుని భార్య, నా మేనకోడలు రాధు, అందరు జ్వరాలతో సతమతమవుతున్నారు! వారి సంగతి ఎవరు కనుక్కుంటారో, పక్కనే కూర్చుని ఉపచారాలెవరు చేస్తారో, నాకేమీ అంతు చిక్కడంలేదు! సరేగాని, కూర్చో అమ్మా! నేనిప్పుడే బట్టలు ఉతుక్కుని వస్తాను.'' మేమిద్దరము కూర్చున్నాము. అమ్మ మరికొంచెం సేపటిలోనే ప్రసాద మధురభక్ష్యాలతో నిండిన దోసిలితో తిరిగివచ్చి ''వీటిలో కొన్ని మా కోడలి *[సుమతి] కియ్యమ్మా! మరి కొన్ని నీవు తీసుకో అమ్మా!'' అన్నది.

సుమతి వెంటనే స్కూలుకి మరలిపోవలిసి ఉన్నది. అందుచేత వెంటనే మాతృదేవికి నమస్కరించి అక్కడినించి బయలుదేరాము. ''మళ్ళీ రా అమ్మా!'' అన్నది మాతృదేవి. నేను అయిదు నిమిషాలపాటే మాతృమూర్తిని సందర్శించాను. నా కది సంతృప్తికరంగా లేదు. అసంతుష్ట హృదయంతో ఇంటికి తిరిగి వచ్చివేశాను.

13, ఫిబ్రవరి 1911. ఆనాడు మాతృదేవి బలరామబోసు ఇంట ఉన్నది. నేను కొంతసేపు ఆమె బాగ్ గృహంలో నిరీక్షించాను. పాదాభివందనంచేసి శిరస్సు పైకెత్తినతరవాత, చిన్నగా నవ్వి అమ్మ ''నీవు ఎవ్వరితో కలిసి ఇక్కడికి వచ్చావమ్మా!'' అని ప్రశ్నించింది.

''నా మేనల్లుడితో'' అని సమాధానం చెప్పాను. నేను.

అమ్మ: నీ ఒంట్లో బాగా ఆరోగ్యంగా ఉన్నదా? నా కోడలికి [సుమతి] కులాసాయేనా? నీ విక్కడికివచ్చి చాలా రోజులయింది. నీ కేమన్నా ఒంట్లోగాని బాగా లేదేమో అని అనుకుంటున్నాను.

నేను నిలువుగా నిర్ఘాంతపడ్డాను. అమ్మ ఆనాడు ఒకేఒకసారి నన్ను చూసింది. అదన్నా

* శిష్యులతో సన్నిహిత బంధుత్వాలు ఏర్పరుచుకోవడం మాతృదేవికి అలవాటు.

అయిదునిమిషాల పాటే. అయినా ఆమె నన్ను జ్ఞాపకం ఉంచుకున్నది. నా కళ్ళలో ఆనంద బాష్పాలు నిండాయి.

నా వైపు ఎంతో ఆప్యాయంగా చూస్తూ మాతృదేవత అన్నది.

"నీవు వచ్చావు! బలరామబాబు ఇంటి దగ్గిర నేను అంత ఆత్రపడుతూ ఉండడానికి అదే కారణమయి ఉంటుంది."

నిజంగా నేనెంతయినా ఆశ్చర్యపడ్డాను. అమ్మ మేనలుడికి పెట్టడానికి సుమతి రెండు ఊలుటోపీలు అల్లి పంపించింది. ఆ మేనల్లుడు చాలా పసివాడు. నేనది అమ్మచేతికి అందించాను. ఆ చిన్న బహుమతులకే అమ్మ ఎంతో సంబరపడిపోయింది! ఆమె తన మంచంమీద కూర్చుని "రా, అమ్మా, రా! నా దగ్గిరికి వచ్చి కూర్చో!" అని ఎంతో ఆత్మీయంగా ఆహ్వానించింది.

నేనామె పక్కనే కూర్చున్నాను. మాతృదేవి ఎంతో ఆప్యాయంగా, "అమ్మా! ఇంతకు మునుపు నిన్ను ఎన్నో సారులు చూసానని అనిపిస్తున్నది. చాలా కాలంనించి నిన్నెరుగుదు ననికూడా నా కనిపిస్తున్నది.

నేను: అదేమిటి తల్లీ! అలాగంటావు! నేను ఒకే ఒక్కమారు వచ్చాను. అప్పుడయినా అయిదు నిమిషాలే నీతో ఉన్నాను. అంతే!"

అమ్మ నవ్వుతూ నా చెల్లెలు భక్తి ప్రేమలను గురించి, నా భక్తి ప్రేమలను గురించి ఎన్నెన్నో మంచిమాట లన్నది.

క్రమ క్రమంగా చాలామంది స్త్రీలు - అంతా అమ్మ భక్తురాండ్రే - రావడం ప్రారంభించారు. భక్తి ప్రపత్తులతో కరిగిపోతూ, అందరు ప్రేమార్ద్రమయి చిరునవ్వులు చిలకరిస్తున్న అమ్మ ముఖంకేసి చూస్తూ కూర్చున్నారు. నేను అటువంటి అపూర్వదృశ్యమెన్నడు చూడలేదు. ఆనందావేశంలో నేనంతా జాగ్రత్తగా పరిశీలించడం ప్రారంభించాను.

అంతలోనే ఇంటికి తిరిగి రావలిసిందన్న కబురుతోపాటు, మా బండి వచ్చింది. అమ్మ వెంటనే లేచి, ప్రసాదంలో కొంతభాగం తీసి, నా పెదవులముందుంచి, తినవలిసిందని బలవంతం చేసింది. నేనెంతో బిడియపడి ఆ ప్రసాదం చేతులతో అందుకున్నాను. ఆపైన అమ్మ దగ్గిర సెలవుతీసుకుని ఇంటికి వెళ్ళడానికి ప్రయాణమైనాను. ఆ సమయంలో అమ్మ అన్నది:

"ఇప్పుడు వెళ్ళి, మళ్ళీ రా అమ్మా! నీ అంతట నీవు కిందికి దిగి వెళ్ళగలవా? లేకపోతే నన్నుకూడా నీ వెంట రమ్మన్నావా?"

అలాగంటూనే ఆమె మెట్లదాకా నా వెంట బయలుదేరింది.

నేను: నా అంతటు నేను కిందికి వెళ్ళగల నమ్మా! దయచేసి నా వెంట రావద్దమ్మా!"

అమ్మ: అలాగే లే! అయితే ఎప్పుడో ఒకనాడు ఉదయమే రా!"

ఈ సారి నా కెంతో సంతృప్తి కలిగింది. మాతృదేవి అపూర్వప్రేమను గురించి ఆశ్చర్యపడుతూ ఇంటికి తిరిగి వచ్చివేశాను.

—సశేషం

# ప్రహ్లాద కథాతత్త్వ విచారము

## ధూళిపాళ శ్రీరామమూర్తి

హిరణ్యకశిపునకు శుక్రాచార్యుడు పురోహితుడు. ఆయన కిద్దరు కుమారులు చండామర్కులనువారు. వారికతడు తన కుమారుని యప్పగించి చదువు చెప్పుడని కోరెను. అతనికి తోడితర రాక్షసబాలురనుగూడ కొంతమందిని సమకూర్చెను. ప్రహ్లాదుడు గురువు చెప్పినది వినును. అతడు చెప్పినట్లే చదువును. వారతనిని దండనీత్యాది శాస్త్రములు చదివించిరి. ఇవి యన్నియు ప్రహ్లాదుడు చదివెనే గాని స్వపరభేదరూపమైన మిథ్యాభినివేశము వాటి కన్నింటికి మూలమగుటవలన నతడు ఆ చదువును మంచిదనుకొనలేదు.

ఒకనాడు హిరణ్యకశిపుడు బాలుని పిలిపించి తొడపై నెక్కించుకొని 'నాయనా! నీవేది మంచిదనుకొంటివో చెప్పు' మనెను అపుడు ప్రహ్లాదుడు 'నాయనా! ఈ ప్రాణులందరును అసద్గ్రహమువలన నిరంతరము సముద్విగ్నమనస్కులగుచున్నారు. [illegible] లగుచున్నారు] వీరికి అతఃపాత నిమిత్తమైన యంధకూపము వంటి గృహమును వదలి యడవికిబోయి శ్రీహరి నాశ్రయించుటయే మంచిదని భావింతున' ని చెప్పెను. కొడుకు మాటలు విని హిరణ[illegible]డు 'శత్రువులెవరో పిల్లలకు బుద్ధిభేదము కల్పించిరి. వీరి బుద్ధులన్నియు శత్రుపక్షమునకు మ్రొగ్గినవి. మీ యింటిలో మారు వేషములతో వచ్చి దిగు విష్ణుపక్షీయులగు బ్రాహ్మణులీ పిల్లల బుద్ధులు పాడుచేయకుండ జాగరూకత వహించి వీరికి చక్కగా బోధింపుడు' అని గురువులకు చెప్పి పంపించెను.

చండామర్కులు ప్రహ్లాదు నింటికి గొని వచ్చి వాని ననునయించి సామముగా నిట్లనిరి. 'నాయనా! ప్రహ్లాదుడా! నిజము చెప్పుము. అబద్ధమాడకుము. బాలురకెవ్వరికిని లేని యీ బుద్ధిభేదము నీ కెట్లు కలిగినది? ఇది నీకే కలిగినదా, పరులు కల్పించిరా?' ప్రహ్లాదు డిట్లు చెప్పెను. 'అయ్యా! పరులు తామని యిట్లు భావించుటయే యసద్గ్రహము. [అహంకార మమకార రూపమైన మిథ్యాభినివేశము వలన కలుగునది]. పరమేశ్వర మాయా వశులై విమోహిత బుద్ధులైనవారికి ఈ స్వపర భేదములుండును, అట్టి ఈశ్వరునకు నమస్కారము. ఆ ఈశ్వరు డనుకూలుడైనపుడీ పశుబుద్ధి వీడిపోవును. వాడు వేరు నేను వేరను కొనుట పశుబుద్ధియే గదా. ఆ పరమేశ్వరుడే యందరికీ ఆత్మస్వరూపుడు. ఏకమైన యాత్మస్వరూపమునే యవివేకులు తామని పరులని భావింతురు. ఆత్మస్వరూపమును గ్రహించుట దుర్ఘటము. వేదవాదులైన బ్రహ్మాదులు గూడా పరమేశ్వరు నెరుంగుటలో పొరబడుచుందురు. మరి నాబోటి వారికి బుద్ధి భేదము గల్పించుటలో నాశ్చర్యమేమున్నది. సూదంటు రాయి సమీపమునున్న యినుమువలె చక్రపాణియైన పరమేశ్వరుని సన్నిధిలో నా మనస్సు భ్రమించుచున్నది.

హిరణ్యకశిపుడు 'నాయనా! నీవు గురువుల యొద్ద చదివిన చదువేమి' అనియడిగిన బాగుండెడిది. అట్లడుగక నీవేది మంచిదనుకొనుచున్నావని యడిగెను. ప్రహ్లాదుడు ప్రశ్నకు తగ్గట్టు జవాబు చెప్పువాడు. అతడనుకొన్న మంచి యేదో చెప్పెను. భీత చిత్తులగుటకు కారణము జన్మమృత్యుజరావ్యాధ్యాది దోషములు. వీనికి కారణము అసద్గ్రాహము. అనగా ఉన్నదాని నున్నట్లు గ్రహింపలేక

పోవుట. ఉన్న వస్తువొకటే. ఆత్మ. అది తానే. దానినట్లుగాక మరియొక రీతిగా గ్రహించుట. ఒకటిగాకాక రెండుగా గ్రహించుట. ఒకే యాత్మను తానని పరులని వేరు వేరుగా గ్రహించుట. ఇదియే స్వపర భేదము. ఇది కన్పించుటకు కారణ మీశ్వరమాయ. అజ్ఞానముచే ఆవృతమైన బుద్ధిగల వాని కిట్టి స్వపర భేదము కలిగి సంసార కారణమగుచున్నది. మరి యిది యెట్లు తొలగును? ఎవరివలన కలిగినదో వారిని సేవించిన దొలగును. ఇది పరమేశ్వరుని మాయవలన కలిగినది కావున రమేశ్వరానుగ్రహము వలన తొలగును. నీకీ బుద్ధి భేద మెవరు కలిగించిరని గురువులడిగినారు. బుద్ధి భేదమనగా పూర్వము చెప్పిన భేద బుద్ధి సర్వజన సాధారణమైనది కాబట్టి దానికంటె మీరు చెప్పిన బుద్ధిభేదము వ్యతిరేకమైనది. అందుచేత యీ యర్థమును [యథార్థమును అనగా స్వపరభేద రాహిత్యమను ఆత్మైకత్వ లక్షణము] తీసికొని సమాధానము చెప్పినాడు. ప్రహ్లాదుడు చెప్పిన సమాధానము ప్రముఖ గంభీరార్థయుక్తమైనది,

అతని సమాధానమును విని రాజసేవకులైన యీ బ్రాహ్మణులకు కోపము వచ్చినది. వారు బహూపాయములచేత ప్రహ్లాదుని భయపెట్టుచు ధర్మార్థ కామ విషయకములైన శాస్త్రముల నన్నింటిని చక్కగా చెప్పిరి. అతడు చక్కగా చదివినాడో లేదో పరీక్షించి చూచిరి. సామ దాన దండోపాయ లక్షణములడిగి వాని యందలి సూక్ష్మము లన్నియు అడిగి సరియైన సమాధానములు బొంది తృప్తిపడి తల్లి దగ్గరకు తీసుకొనిపోయి స్నాతాలంకృతునిజేసి హిరణ్యకశిపు నొద్దకు గొనిపోయిరి. ఇచట నొక ప్రశ్న రావచ్చును. తండ్రికి అట్లు సమాధానము జెప్పినవాడు గురువులకు లౌకికమైన సమాధానము చెప్పనేలయని? దీనికి పూర్వము చెప్పితిమి. ప్రహ్లాదు డడిగినదానికే సమాధానము చెప్పువాడని. అతడడుగకుండ చెప్పడు. గురువులు లౌకిక విషయముల నడిగిరి. వారు చెప్పిన శాస్త్రములలో నడిగిరి. కావున వారికి వానిని గురించియే సమగ్రముగా నుత్తరము లొసంగెను.

ప్రహ్లాదుడు తండ్రి పాదములకు నమస్కరించెను. తండ్రి యతనిని కౌగిలించుకొని తొడపై నెక్కించుకొని మూర్ధమును మూర్కొని యానందాశ్రుకణములతో తడుపుచు నిట్లడిగెను. 'నాయనా! ప్రహ్లాదా! నీకు గురువుగా రింతకాలము చెప్పినదానిలో ఉత్తమమైన దేదియో చెప్పవలసినద' న్నాడు. హిరణ్యకశిపుడు పూర్వమువలె నీకు తోచిన మంచి దేమియని యడుగలేదు. మరి యిప్పుడు కొంచెము జాగరూకముగా నడిగినాడు. మీ గురువుగారు చెప్పినదానిలో ఉత్తమమైన దేమియని యడిగినాడు. హిరణ్యకశిపుని దృష్టిలో నతనికి కితర గురువులు లేరు. ఉన్నవారు చండామర్కులే. కాబట్టి వారు చెప్పినదే నితడు చెప్పవలెను, ఇతడు చెప్పినది వారు చెప్పినదే కావలయును, ఈ తడవ కూడా పాత పాటనే పాడిన నది వీరు చెప్పినట్లే యనుకొని యడిగినాడు. దానివలన నేరము చేసిన వారెవరో తెలియుననికూడా యనుకొన్నాడు. మరి ప్రహ్లాదుడు హిరణ్యకశిపుని ఈ ప్రశ్నను చాలా జాగరూకముగా విన్నాడు.

ప్రహ్లాదానుచ్యతాం తాత
స్వధీతం కించిదుత్తమం
కాలేనైతావతాఽఽయుష్మన్
యదశిక్షద్గురోర్భవాన్.

ఇచట గురోః అని ఏకవచనమున్నది. గుర్వోః అని ద్వివచనము లేదు. ద్వివచన

మున్నచో చండామర్కులు చెప్పినదానిలో నుండి చెప్పువాడే. ఇప్పుడేకవచనబలము వలన నారదుడు చెప్పిన పాఠము నప్పజెప్పెను. అత డట్లు ప్రశ్నించెను. ఇతడట్లే సమాధానము చెప్పెను. చండామర్కులు చెప్పినది ధర్మార్థకామములను గురించి. నారదుడు చెప్పినది మోక్షమును గురించి.

ప్రహ్లాదుడు :

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ
నివేదనం.

ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తి శ్చే న్నవలక్షణా
క్రియతే భగవత్యద్ధా తన్మన్యేఽధీత
ముత్తమం.

శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనమని భక్తి తొమ్మిది విధములు. ఈ తొమ్మిది విధముల విష్ణువునందు భక్తి చేసి తత్ఫలమూయన కర్పించుట నేను చదివినవాని యన్నింటిలో ఉత్తమమైన దన్నాడు. శ్రవణము = వినుట; పాదసేవనము = పరిచర్య; అర్చనము = పూజ; దాస్యము = కర్మార్పణము; సఖ్యము = ఈశ్వరవిశ్వాసము; ఆత్మనివేదనము = దేహసమర్పణము – అమ్మిన పశువులను గురించి పోషణపాలనాది భారమును వదలినట్లే దేహమును పరమేశ్వరున కర్పించి పోషణాది చింతను వర్జించుట. .ం.

# ఇద్దరు మిత్రులు

## సదాశివం

ఇద్దరు యువసాధకులు ఒక చిన్న నదిఒడ్డున నడచిపోతున్నారు. నదీప్రవాహాన్నిచూచి ఆ ఇద్దరిలో ఒకడన్నాడు. 'ప్రకాష్, ప్రొద్దున ఈనదిలో ఇంత ప్రవాహం లేదు. ఇప్పుడు నిండుగా ప్రవహిస్తుంది. ఎగువ భూముల్లో ఎక్కడో ఎక్కువగా వర్షించిఉంటుంది. ఈ ప్రవాహాన్నిబట్టి మనం దాన్ని ఊహించవచ్చు. ఈవిధంగా ఊహించడాన్నే తార్కికులు 'శేషవత్ అనుమానం' అంటారు. కనపడేకార్యాన్ని బట్టి కనపడని కారణాన్ని ఊహించడమన్న మాట శేషవత్ అంటే. 'పూర్వవత్' అనే మరొక అనుమానంకూడ ఉంది. కనపడే కారణాన్నిబట్టి కనపడని (జరగబోయే) కార్యాన్ని ఊహించడమే అది. దట్టమైన నల్లని మేఘాలు ఆకాశాన్ని కమ్ముకోవడం చూశామనుకో. వర్షం రాబోవుచున్నది అని దాన్నిబట్టి ఊహిస్తాం. ఇదే 'పూర్వవత్' అనుమానం. మరొక అనుమానంకూడ ఉంది. దాన్ని సామాన్యతోద్రష్ట...' వాక్యం పూర్తికాక ముందే రెండో అతను అడ్డుపడ్డాడు. 'చాలు చాలు' నీ తర్కాన్ని ఆపు. ఆనందంగా విహరించాల్సిన ఈసమయంలో శుష్కతర్కప్రసంగాలెందుకయ్యా. ఒకవేళ తర్కం చేయదలచుకొంటే శ్రుతివాక్యాలను అనుగుణంగా చేయరాదా? ఇదిగో చూడు చేతన్, దీన్ని మనం నది అంటున్నాం. జలాన్నే, ఒక పెద్ద ప్రవాహంగాపోతుంటే నది అంటాం. అదే జలం ఒక లోతైన బిలంలోఉంటే బావి అని

వ్యవహరిస్తాం. లోతు అంతగాలేని ఒక పెద్ద పల్లపుప్రదేశంలో జలం నిలిచిఉంటే దాన్ని గుంట అంటాం. అట్లాగే మఱికొంత పెద్ద భూభాగంలో నీరు నిలిచిఉంటే చెఱువు అంటాం. మఱో పెద్దప్రదేశంలో నీరు నిలిచిఉంటే దాన్ని సరస్సు అంటాం. అనంతమైన జలరాశిని చూసి సముద్రం అంటాం, ఒకేజలాన్ని ఇన్ని పేర్లతో వ్యవహారించడానికి కారణం ఏమిటి? ఉపాధుల వల్ల ఏర్పడిన నానావిధ ఆకారవిశేషాలకు వేఱువేఱు పేర్లు కల్పించి ఇది బావి, ఇది గుంట, ఇది చెఱువు, ఇది నది, ఇది సరస్సు, ఇది సముద్రం అని వ్యవహారిస్తున్నాం...' అతను ఇంకా ఏదో చెప్పబోయేంతలో చేతన్ అడ్డుపడి అన్నాడు. 'సభ్యతకోసం అతిఓర్పుతో నేను నీ వాగుడు వింటుంటే దాన్ని నీవు నా ఉత్సాహంగా భ్రమించావు. అపనంటున్నావే ప్రసంగాన్ని. నీవు చెప్పబోయేదేమిటో నాకు తెలియదా ఏమి. యథా నద్యః స్యందమానాః అనే ముండకోపనిషత్ వాక్యాన్నో ఇమాః సోమ్యః నద్యః అనే ఛాందోగ్యశ్రుతి వాక్యాన్నో సమర్థించే నెపంతో అంతంలేని తర్కంలోకిదిగి నాప్రాణాలు తియ్యాలనుకున్నావు...' అంతలో వారిద్దరిదృష్టిని అక్కడొక దృశ్యం ఆకర్షించింది.

అక్కడొక అందమైన గ్రామీణయువతి నదీప్రవాహానికి కొంతదూరంలో కూర్చొని మెల్లగా రోదించుచుండినది. చేతన్ ఆమెను సమీపించి అనునయపూర్వకంగా అడిగాడు 'ఎందుకేడుస్తున్నావమ్మా' అని. ఆవిడ తల ఎత్తి ఒకక్షణం అతనివైపు అమాయకంగా చూచింది. తరువాత ఇలా అన్నది. 'మా ఊరు ఆతట్టు. పొద్దున పనిమీద ఈతట్టుకు వచ్చాను. అప్పుడు నీళ్లు మోకాలిలోతుకూడ లేదు. పని ముగించుకొని ఇప్పుడు వచ్చిచూస్తే నీళ్లు నిండుగా పోతుంది. నాకు ఈతరాదు. మా ఇంటికెట్లా పోయేది? చీకటిపడ్డాకకూడ నేను రాకపోతే మావాళ్లెంత ఆదుర్దా పడ్తారు. నాకొకటే భయంగా ఉంది.' చేతన్, చూపులు అటుఇటు త్రిప్పకుండా ఆమెవైపే నిశ్చలంగా చూస్తూ అంతావిని, 'నీవేమీ భయపడకు. నేను నిన్నావైపు చేరుస్తాను. నాకు ఈత బాగా వచ్చు. అసలు ఈదవలసిన అవసరం ఉండదు. మహాఅంటే ఈ నీళ్లు భుజాలవఱకు రావచ్చు అంతే' అని ప్రకాశ్ వైపుతిరిగి అతణ్ణి అక్కడే ఉండమనిచెప్పి ఆవిడను నడిపించుకొని నదిలోకి దిగాడు. కాని ఆవిడ నదిలో కాలు ముందుకు పెట్టడానికే భయపడింది. వేఱే చేసేదేమీ లేక చేతన్, ఆవిడను తన భుజాలమీదికి తీసికొని మెల్లగా అడుగులుపెట్టూ నదిని దాటాడు. అప్పటికే సూర్యుడస్తమించాడు. మెల్లగా చీకట్లు ముసురుకొంటున్నాయి. ఆవిడను భుజాల మీదినుండి దించి 'అమ్మా ఇక వెళ్ళగలవా మీ గ్రామానికి, అని అడిగాడు. 'నాకు భయంగానే ఉంది. మావూరు అదిగో అక్కడ' అని ఆమె చేయిఎత్తి సాభిప్రాయంగా చూపించింది. 'సరే మీ గ్రామంవఱకు తోడుగా వస్తాను పద' అనిచెప్పి ఆవిడను పొలాలలో నడిపించుకొంటు చివరికి ఆ గ్రామంలో వదలిపెట్టి వెనుదిరిగాడు.

తన స్నేహితుడున్న చోటికి వచ్చేటప్పటికి బాగా చీకటిపడింది. అతడక్కడే ఉన్నాడు. ఇతణ్ణి చూసీచూడగనే 'అరే చేతన్! తిరిగి వచ్చావా? నారదఋషిలా కాపురం పెట్టావేమో అనుకున్నాను'అన్నాడు. దానికి సమాధానంగా, ఆలస్యం ఎందుకయ్యింది ప్రశాంతంగా వివరించి చెప్పాడు చేతన్. తరువాత అక్కడ్నుంచి వారిద్దరు తమ వాసస్థలానికి బయలుదేరారు.

వారు మౌనంగా నడుస్తున్నారు. ఉన్నట్టుండి ప్రకాష్ అన్నాడు. 'నీవలా చేసిఉండనే కూడదు. వాట్ ఈస్ అవర్ లైఫ్? స్త్రీలను చూడనైనా చూడకూడదుకదా మనం. కాని ఈరోజు నీవు చేసిందేమిటి? ఎంత పొరపాటు జరిగిందో చూడు. ఒకస్త్రీని వయస్సులోఉన్న స్త్రీని అందమైన ఆ స్త్రీని భుజాలమీద మోసుకొనివెళ్లడమా! మొన్న ఒక పుస్తకంలో చదివాను: ఆనందుడు బుద్ధభగవానుని ప్రశ్నిస్తాడు-''స్త్రీలవిషయంలో ఏవిధంగా మెలగాల''ని. దానికి భగవానుడు ''వారిని చూడనే చూడకు'' అని సమాధానంచెప్తాడు. ఆనందుడు తిరిగి ప్రశ్నిస్తాడు. ''వారిని చూడకుండా ఉండటానికి ఎలా సాధ్యమౌతుంది; సమాజంలో 50 శాతం పైగా వారే ఉన్నారుగదా'' అని. ''సరే వారితో మాట్లాడవద్దు'' అని బుద్ధభగవానుడు ప్రత్యుత్తరం ఇస్తాడు. ఆనందుడు మళ్ళీ అడుగుతాడు-''ఎందరో స్త్రీలు మీ దర్శనానికి వస్తుంటారు. నేను మీ సేవకుణ్ణి. అవశ్యం మాట్లాడవలసిన సందర్భాలెన్నో ఏర్పడుతుంటాయి' ఎలా చేయడం?'' అప్పుడు బుద్ధభగవానుడంటాడు. ''మాట్లాడాల్సిన అవసరంవస్తే మాట్లాడు. కాని అతి జాగరూకత వహించు.'' కాని ఈరోజు నీవు చేసిందేమిటి? ఎంత అజాగ్రత్త! వివేకచూడామణి ఉపదేశ సాహస్రి చదువుతూఉంటావేకాని జాగరూకత లేకపోయిందే!'

దానికి చేతన్ అన్నాడు, 'నేనా బుద్ధదేవుని కథ చదువలేదు, కాని ఆ భగవానుడు ఆదేశించినట్లతిజాగరూకత వహించాను. నీటిలో నడుస్తున్నప్పుడు జారి క్రిందపడకుండేటట్లు అడుగులువేసే ప్రతిక్షణం ఎంత జాగరూకత వహించానో అదేవిధంగా ప్రతిక్షణం మనస్సుయొక్క పరిణామాలను కనిపెట్టుతు అతిజాగరూకత వహించాను. కాబట్టే తిరిగి క్షేమంగా రాగలిగాను. వట్టిచేతులతో తిరిగి రాలేదు. భయాందోళనలతో కుమిలిపోతుండిన ఒక దీనురాలిని భద్రంగా ఇల్లు చేర్చిన పుణ్యాఫలంతో తిరిగి వచ్చాను.'

ఆతరువాత ఇద్దరు మౌనంగా నడక సాగించారు. మళ్ళీ ఉన్నట్టుండి ప్రకాష్ అన్నాడు. 'నా కాశ్చర్యంగాఉంది మిత్రమా! ఆవిడను నీవు భుజాలమీద మోసికొని వెళ్తున్నప్పుడు నీలో ఏమీ భావవికారాలు చెలరేగలేదా? నేను నమ్మలేకపోతున్నాను!'

చేతన్ ఏమీ బదులు పలుకలేదు. మళ్ళీ మౌనంగా ఇద్దరు నడకసాగించారు. ఇంక ఐదు నిముషాలనడకలో తమ బస చేరుకుంటారు. ఉన్నట్టుండి ప్రకాష్ మళ్ళీ అడిగాడు. 'బ్రదర్! భుజాలమీద నీవు మోసికొని వెళ్తున్నప్పుడు ఆవిడ నీతో ఏమీ మాట్లాడలేదా? ఆ పొలాలలో నడుస్తూ నీతో ఏమీ మాట్లాడలేదా?' అప్పుడు సమాధానంగా చేతన్ అన్నాడు. 'ప్రకాష్! నేనావిడను భుజాలమీదనుండి దించి రెండు గంటలకుపైగా అయుంటుంది, నీవింకా ఎన్నాళ్లు అవిడను మనస్సులోమోస్తూ తిరుగబోతున్నావు?' మెల్లగా మృదువుగా వీణానాదంలాగా పలికిన ఆ పలుకులు ఆ నిశ్శబ్ద వాతావరణంలో ప్రకాష్ చెవులకు, దుందుభిస్వనంలాగా గట్టిగా గంభీరంగా పలికినట్లనిపించింది.

# దివ్యానుభూతులు I

## స్వామి జ్ఞానాత్మానంద

శ్రీ రామకృష్ణపరమహంసదేవుల దివ్యలీలలో పాల్గొన్న ఆయన సన్నిహిత సహచరులందరిలోను ప్రప్రథమంగా నా మనస్సుకు స్ఫురించేవారిలో శ్రీ శ్రీ మహారాజ్ (శ్రీ బ్రహ్మానందస్వామి) ముఖ్యులు. శ్రీ శ్రీ మహారాజ్‌ను మొట్టమొదట ఎప్పుడు దర్శించానో నాకు స్పష్టంగా జ్ఞాపకం లేదు. అయితే ఒక రోజు – బహుశః 1916 లేక 1917 సంవత్సరంలో అనుకుంటూ – నా స్నేహితుడు తోడు రాగా, వరాహనగర ఘట్టందగ్గర గంగానదిని దాటి బేలూరు మఠానికి వెళ్ళడం మాత్రం నాకు బాగా జ్ఞాపకముంది.

మహాపురుషుల సందర్శనానికి వెళ్ళినపుడు, శూన్య హస్తాలతోగాక, ఏదో ఒక ఫలాన్ని ఆ మహాపురుషునికి అర్పించడానికి తీసుకొని వెళ్ళాలని మేము విన్నాం. అందువల్ల నాలుగు పైసలు వెచ్చించి రెండు లేతకొబ్బరికాయలను తీసుకొన్నాం. నావను వదలి, మెట్లు ఎక్కుతుండగానే, మఠంయొక్క వరండాలో ఒక సాధువు ఉన్నతాసనంమీద, చుట్టూరా తన సహచరులతో, గంగాభిముఖంగా కూర్చుని ఉండటం మేము గమనించాం. ఆయనను – ఆ దివ్యమూర్తిని – సందర్శించిన వెనువెంటనే, ఆయనే శ్రీ బ్రహ్మానందస్వామి అని నాకు స్ఫురించింది. స్వామిని సమీపించి మేము పాదాభివందనం చేశాం. మా ప్రణామాలు ముగిసినవెంటనే స్వామి మా చేతులలో ఉన్న ఫలాలను సూచిస్తో, తన సహచరులలో ఒకరితో ''ఠాకుర్ భోగానికి ఈ రెండు కాయలను లోపల ఇచ్చిరా,'' అని నుడివారు. ఈ సంఘటన మమ్మల్ని గాఢమైన ఆశ్చర్యంలో ముంచింది. ఎందువల్లనంటే, ఇదివరలో మేము ఎప్పుడు ఏ సాధు పురుషుడిదగ్గరకు ఫలాలను తీసుకొనివెళ్ళినా, ఆయన వెంటనే ఆ ఫలాలు శ్రీ ఠాకుర్ కోసమా, తన కోసమా అని స్పష్టంగా అడిగేవారు. ఒక ప్రత్యేక వ్యక్తి కోసం – ఒక సాధుపురుషుడి కోసం – ఉద్దేశింపబడినవి శ్రీ ఠాకుర్‌కి అర్పింపబడేవి కావు. ఆ ఆచారాన్ని ఈ విధంగా స్వామి ఉల్లంఘించడం మాకు ఎనలేని ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆ తరువాత ఈ సంఘటన వెనుకగల సూక్ష్మం నాకు అర్థమయింది: భగవాన్ శ్రీ శ్రీ రామకృష్ణులు, ఆయన ఆధ్యాత్మిక తనయుడైన శ్రీ బ్రహ్మానందస్వామి స్థూలదృష్టికి రెండు విభిన్న రూపాలు ధరించిన ఒకే దివ్యశక్తి.

శ్రీ శ్రీ మహారాజ్ ప్రవర్తన మరొక సందర్భంలో నన్ను ఆశ్చర్య చకితుణ్ణి చేసింది. స్వామి, నా తోడుగా వచ్చిన నా మిత్రుణ్ణి ఆతని పేరు, నివాసస్థలం మొదలైన వివరాలన్నీ గుచ్చి గుచ్చి అడిగి, నేను ఆతని ప్రక్కనే నిలబడిఉన్నా నన్ను ఒక్క ప్రశ్నగూడా అడగకపోవటం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. నా వంక ఒక సారిగూడా స్వామి దృష్టిని సారించకపోవడం నాకు ఎనలేని ఆశ్చర్యాన్ని కలిగించింది. అయితే, అకస్మాత్తుగా మాటల మధ్యలో స్వామి నా వంక తిరిగి 'నీవు నాకు చిరకాల పరిచితుడవే'' అని నుడివి తిరిగి నా స్నేహితుడితో సంభాషణ కొనసాగించడం మొదలుపెట్టారు. నేను అవాక్కునైనాను. ఏమంటే స్వామిని నేను దర్శించడం అదే ప్రథమం! నేను బేలూరు మఠంలో బ్రహ్మచారిగా చేరిన తర్వాత ఈ సంఘటన వెనుకగల సూక్ష్మార్థం బోధపడింది: తానే దీక్ష

నిచ్చి తన శిష్యులలో ఒకనిగా ఎన్నుకొనే అదృష్టవంతులైన కొద్ది మందితోనే స్వామి ఈ విధంగా ప్రవర్తించేవారు.

ఈ సంఘటన జరిగిన తర్వాత రెండు మూడేళ్ళవరకు శ్రీ శ్రీ మహారాజ్‌ని సందర్శించే అవకాశం నాకు కలుగలేదు. 1919 వ సంవత్సరంలో, సెప్టెంబరు - అక్టోబరు నెలల మధ్య గాలి మార్పుకోసం నేను వారణాసి వెళ్ళటం తటస్థించింది. ఒకరోజు నేను దశాశ్వమేధ ఘట్టంలో నిలబడిఉండగా నాకు ఇతఃపూర్వం పరిచయమైన ఇద్దరు వ్యక్తులను కలవడం జరిగింది. (వీరే తర్వాత, వరుసగా అఖిలానందస్వామి, విశ్వానందస్వామి అని నామాంకితులైనారు). నేను శ్రీ విశ్వనాథుడు, అన్నపూర్ణ వెలసిన స్థలానికి చాల దగ్గరలోనే నివసించినా, ఏదో కారణంవల్ల వారి సందర్శనానికి వెళ్ళటం పడలేదు. ఇది ఇలా ఉండగా, నా మిత్రు లిద్దరూ - ముఖ్యంగా నిరోదే - నన్ను వదలలేదు. చివరకు ఒకరోజు వారిద్దరు నన్ను పూజ్య శ్రీ హరి మహరాజ్ (తురీయానందస్వామి) సన్నిధికి తీసుకువెళ్ళారు. ఆయన దివ్యరూపం, కరుణపూరితమైన వాక్కులు నన్ను అనిర్వచనీయమైన ఆనందంలో ముంచినాయి. ఇతఃపూర్వం నేను మానవుడి మనస్సుకి స్థైర్యము, శీలము చేకూరడానికి రాజకీయ చైతన్యంతోపాటు మతానురక్తి కూడా అవసరమని భావించేవాణ్ణి.

ఆ రోజుల్లో నాకు మతము, దాని తత్వము గురించి అజ్ఞానమే గాక, అంతగా నమ్మకం కూడా ఉండేది కాదు. పాశ్చాత్య దార్శనిక సిద్ధాంతాలను అధ్యయనం చేయడంవల్ల నాకు భగవంతుడనే వ్యక్తిని దర్శించడం అన్నది ఏనాడూ సాధ్యం కానిపని అన్న నమ్మకం కలిగింది. భగవంతుడు కేవలం తార్కిక జిజ్ఞాసద్వారా తెలుసుకోగలిగిన ఒక మనో విశ్లేషణం అని నేను భావించేవాణ్ణి. అయితే భగవత్ చింతనద్వారా మానవ మేధస్సుకు కొన్ని అపూర్వమైన శక్తులు లభింపవచ్చు - ఇవే భగవంతుడి అస్తిత్వాన్ని గూర్చి ఆ రోజుల్లో నా మనస్సులో ఉద్భవించిన ఊహాలు.

ఈ ద్వైధీస్థితిలో నాకు పూజ్యశ్రీ హరి మహరాజ్‌ని దర్శించే అవకాశం ఏర్పడింది. ఆయనయొక్క మహత్తరమైనమూర్తి, ఆయనద్వారా తెలుసుకోగలిగిన ఆధ్యాత్మిక సూత్రాలవల్ల నాకు ఇదివరలో ఉన్న తార్కికజనితమైన సందేహాలు క్రమ క్రమంగా సన్నగిల్లడం ప్రారంభించాయి. క్రమంగా, భగవంతుడు కేవలం తర్కజనితమైన ఒక ఊహ కాదని, భగవత్ తత్వాన్ని సాధనద్వారా, సత్సాంగత్యంద్వారా, తెలుసుకోవచ్చని, ఆతని దివ్వత్వాన్ని ప్రత్యక్షంగా దర్శించినవారున్నారని, గుర్వనుగ్రహంద్వారా, మంత్రోచ్చారణద్వారా ఆ దివ్యానుభూతిని అందరూ పొందవచ్చునన్న ఊహాలు నాలో జనించసాగినై. నేను ఈ భావాల నన్నిటినీ శ్రీ హరి మహరాజ్‌కి వ్యక్తీకరించి, నాకు మంత్రదీక్ష నిచ్చి నా సందేహాల నన్నిటినీ తొలగించమని అభ్యర్థించాను. ఇది విని స్వామి చాల గంభీరులై, తన పెదవులపై దివ్యమైన చిరుహాసం తాండవించగా. శిరఃకంపనం చేస్తూ అన్నారు: "అడిగిన అందరికీ మేము దీక్ష నివ్వలేం". ఇది విని నాకు చెప్పలేని నిరుత్సాహం కలిగి, దాదాపు నేలమీద కూలబడ్డాను. నా స్థితి చూచి స్వామి కరుణార్ద్రమైన దృక్కులతో అన్నారు: "నిరుత్సాహపడకు: మా అందరిలోనూ తల మానికమైన దివ్యపురుషుని దగ్గరకు నిన్ను పంపే బాధ్యత మాది".

ఈ సంఘటన తర్వాత చాల నెలలు

గడిచినై. అప్పుడు నేను కలకత్తా విశ్వవిద్యాలయంలో విద్యార్థిగా ఉన్నా, చదువు కొనసాగించాలన్న ఇచ్ఛ నాలో అంతరించసాగింది. కాని, శ్రీ హరి మహారాజ్ ఆదేశాన్ని తలదాల్చి చదువు పూర్తిచేయడానికి తిరిగి కలకత్తా చేరుకున్నాను. ఒకరోజు శ్రీ శ్రీ మహారాజ్ దర్శనార్థం బలరామ మందిరానికి వెళ్ళాను. మొదటి అంతస్తుకు వెళ్ళే మెట్ల పక్క ఒక చిన్నగదిలో, ఒక చిన్న మంచం మీద శ్రీ శ్రీ మహారాజ్ ఆసీనులై ఉండటం నేను గమనించాను. ఆయన సాన్నిధ్యంలో ఎదురుగా కొంతమంది భక్తులు కూర్చుని ఉన్నారు. శ్రీ శ్రీ మహరాజ్‌కి సాష్టాంగ ప్రణామం చేసి నేనుకూడా భక్తులతోపాటు కూర్చున్నాను.

అవి మొదటి ప్రపంచయుద్ధం జరుగుతున్న రోజులు. స్వామి సన్నిధిలో ఉన్న భక్తులు కూడా ఈ యుద్ధం గురించి సంభాషణ కొనసాగించడం నేను గమనించాను. ఇది నాకు కొంచెం ఆశ్చర్యాన్ని కలిగించింది. ఒక భక్తుడు జర్మనీదేశానికి ప్రాతినిధ్యం వహించగా, మరొక భక్తుడు ఆంగ్లేయుల తరఫున వాదించసాగాడు. తమ తమ పక్షాలు గెలుస్తాయని వారిద్దరూ వాదించసాగారు. ఈ సంభాషణనంతనీ శ్రీ శ్రీ మహారాజ్ జాగ్రత్తగా వింటూ వినోదించసాగారు అని నాకు అనిపించింది. మధ్య మధ్యలో చుక్కాని పీలుస్తూ స్వామి ఈ సంభాషణలో జోక్యం కలుగ చేసుకుని ఒకసారి ఒకరి వాదాన్ని, ఇంకొకసారి ప్రత్యర్థి వాదాన్ని బలపరచసాగారు. ఇదంతా గమనించి నేను అవాక్కునయినాను. ఒకరకమైన దిగ్భ్రమ చెంది, ఈ వ్యక్తినా నేను దర్శించడానికి ఇంతదూరం వచ్చాను అని తలపోయ సాగాను. లౌకికమైన రాజకీయ చర్చలో ఈ విధంగా పాల్గొనే శ్రీ శ్రీ మహారాజ్, శ్రీ హరి మహారాజ్ కంటె ఏ విధంగా ఉన్నతులు అన్నశంక నాలో కలగసాగి, నా మనసు పరిపరి విధాల ఆలోచనతో కలవరపడ సాగింది.

కొన్నిక్షణాలు ఈ విధంగా గడచిన తర్వాత అక్కడి వాతావరణమంతా అకస్మాత్తుగా మారడం మొదలైంది. శ్రీ శ్రీ మహారాజ్ గంభీర వదనులవడం గమనించాను. స్వామిని ఈ స్థితిలోచూసి భక్తులందరూ ఆయనకు వినమ్రులై నిశ్శబ్దంగా ఒకరి వెనుక ఒకరు వెళ్ళసాగారు. నేనుకూడా స్వామికి ప్రణామం చేసి, నా విషయం ప్రస్తావించివిన్నవించుకుందామని ఆలోచనలో ఉండగానే, శ్రీ శ్రీ మహారాజ్ తమ ఆసనం మీంచి అకస్మాత్తుగా లేచి, గంభీర వదనులై, వీధికి అభిముఖంగాఉన్న వరండాలో అటు ఇటు తిరుగ నారంభించారు. ఆయన మూర్తి సంపూర్ణంగా మార్పుచెంద సాగింది. ఆ స్థితిలో, ఎంతె ప్రయత్నించినా ఆయన దగ్గరకు వెళ్ళేధైర్యం నాకు కలుగలేదు. అపూర్వమైన భయము, వైచిత్రి నాలో జనించి నన్ను పూర్తిగా ఆక్రమించుకున్నాయి. ఈ విధంగా కొంతకాలం గడచిన తర్వాత, ఇంతకు పూర్వంవలె, అకస్మాత్తుగా, ద్వారంప్రక్కనే నిలబడ్డ నాకు ఎదురుగా – నన్ను అనుగ్రహించడానికి అన్నట్లుగా – స్వామి ఆగారు. నేను భయాశ్చర్యమిళితమైన మనస్సుతో ఆయనకు ప్రణమిల్లి, తడి ఆరిపోయిన గొంతుతో "మహారాజ్, పూజ్య శ్రీహరి మహారాజ్ నన్ను మీ సన్నిధికి పంపారు" అని అన్నాను. ఇది తప్ప వేరేమీ నేను చెప్పలేక పోయాను. శ్రీ శ్రీ మహరాజ్ ప్రేమార్ద్ర దృష్టితో నన్నుచూసి "నాయనా, భగవంతుడే ఏకైకసత్యం" అని నుడివారు.

స్వామి ఏ దృష్టితో ఈ విధంగా నుడివారో తార్కికంగా అయితే నేను చెప్పలేను. అయితే నా మనస్సెంతో అనిర్వచనీయమైన ఆనందంతో నిండగా ఇంటికి తిరిగి వెళ్ళాను.

ఈ సంఘటన తర్వాత, ఇక నేను చదువు కొనసాగించే ప్రసక్తిలేక పోయింది. కొన్ని నెలల తర్వాత, శ్రీ శ్రీ మహారాజ్ కృపవల్ల నేను బేలూర్ మఠంలో చేరాను. నా సమవయస్కులైన కొందరు యువకులు కూడా ఇదే కాలంలో నాతోపాటు మఠంలో చేరారు. మేమందరం శ్రీ శ్రీ మహారాజ్ దివ్యప్రేమ అనే ఆచ్ఛాదనలో పెరుగసాగాము. ఆ రోజుల్లో, శరత్ మహారాజ్ (శారదానంద స్వామి) "ఉద్బోధన్" పత్రికా కార్యాలయం నుంచి తరచు మఠానికి వచ్చేవారు. ఇదే సమయంలో శ్రీ అభేదానందస్వామి కూడా అమెరికాలో ఇరవై అయిదేళ్ళ సుదీర్ఘ నివాసానంతరం బేలూర్ మఠానికి తిరిగి వచ్చారు. ఆ సమయంలో ఈ స్వాముల దివ్యవ్యక్తిత్వపు ఆధ్యాత్మిక ప్రకంపనలో మఠమంతా నిండి ఉండేది. ఇక ఏరకమైన కొరత మాకులేదని మేము భావించసాగాం. ఈ దివ్యపురుషులను ఆదర్శమూర్తులుగా భావించి, ఆధ్యాత్మిక జీవన పథంలో శీఘ్రప్రగతిని సాధించడానికి పయనించ సాగాం.

ఇలా కొంతకాలం గడచింది. ఒకరోజు మఠనివాసియైన ఒక సాధువు మావద్దకు వచ్చి, అత్యంత ఆనందముతో గూడిన తత్తరపాటుతో "శ్రీ శ్రీ మహారాజ్ మఠానికి విజయం చేస్తున్నట్లు తెలుసా?" అని అడిగారు. "అందరిలోకి అత్యున్నతమైన దివ్యమూర్తిని సందర్శించే భాగ్యం కలుగబోతుంది." ఈ సందేశం వెనుకగల గూఢార్థం మాకు అపుడు అంతగా స్ఫురించలేదు. ఏమంటే, శ్రీ శ్రీ మహారాజ్‌ను నేను అప్పటికే రెండు మూడుసార్లు దర్శించాను. అందువల్ల ఇంతగా చెప్పడానికి ఆయనలో ఏమి నవ్యతఉంది- అని నాలోనేను అనుకున్నాను. అయితే కొన్నిరోజులలోనే దూర దూర ప్రదేశాలనుంచి సాధువులు, భక్తులు మఠానికి చేరుకోవడం ప్రారభమయింది. ప్రతి ఒక్కరినోటా ఒకే మాట వినిపించసాగింది : "శ్రీ శ్రీ మహారాజ్ వస్తున్నారు! శ్రీ శ్రీ మహారాజ్ వస్తున్నారు!!" ఏగుప్తమైన ఆధ్యాత్మిక నిధియొక్క సూచన శ్రీ శ్రీ మహారాజ్ రాకతో తమకు తప్పక లభిస్తుందని వీరు భావించారో భగవంతుడికే తెలియాలి!

ఎట్టకేలకు శ్రీ శ్రీ మహారాజ్ బేలూర్ మఠానికి విచ్చేసారు. ఆయన రాకతో మఠంయొక్క వాతావరణంలో సుస్పష్టమైన మార్పు రావడం నా స్వానుభవంద్వారా నేను గమనించ సాగాను. అదివరకు మఠంలోఉన్న ఆధ్యాత్మిక వాతావరణం బలంగాఉన్నా, స్వామి రాకతో మరింత ప్రగాఢమవసాగింది. అక్కడఉన్న ప్రతి ఒక్కరు స్వామి దర్శన భాగ్యం ఎప్పుడు కలుగుతుందో అని, ఆయన దివ్యవాణి ఎప్పుడు జాలువారుతుందో అని తహతహతో వేచిఉండేవారు. సాధువులు, భక్తులే గాక, రచయితలు, కళాకారులు, మేధావులు – దాదాపు అన్ని పదవులకు, వర్గాలకు, తరగతులకు చెందినవారు – మఠంలో గుమిగూడేవారు. ఈ చైతన్యం వెనుకఉన్న ప్రగాఢమైన సత్యం ఆ సమయంలో అక్కడ ఉన్న మా బ్రహ్మచారులెవరికీ అంతగా బోధపడలేదు.

ఆ రోజుల్లో మేం గమనించింది స్థూలంగా చెప్పాలంటే: శ్రీ శ్రీ మహారాజ్ చాల వేకువనే లేచి, కాలకృత్యాలు నెరవేర్చుకొని,

మొదటి అంతస్తులోని వరండాలో ఒక ఆసనం మీద గంగాభిముఖులై కూర్చునేవారు. క్రొత్తగా బ్రహ్మచర్యదీక్ష తీసుకొన్న మేమందరం ఆయన సన్నిధిలో రెండు వరుసలలో ఆసీనులయ్యేవారం. జపము, ధ్యానము చేయ ప్రయత్నించేవారం. శ్రీ శ్రీ మహరాజ్ ఎవ్వరితోను మాట్లాడేవారు కారు. అయితే ఆయనయొక్క సాన్నిహిత్యం వల్లనే మా అందరకూ ప్రగాఢమైన ధ్యానస్థితి కలుగుతూ ఉండేది.

చాలాసేపు "శూన్య" దృక్కులతో స్వామి ఆ కుర్చీలో అట్లనే కూర్చునేవారు, మధ్యలో తమ శిష్యుల కోసమా అన్నట్లు, స్వామి తమ ఆసనం విడిచి రెండు వరుసల మధ్య శ్రీ ఠాకూర్ నామస్మరణ చేస్తూ తిరిగేవారు. తమ ఆసనంమీద కూర్చున్న కాలమంతా శ్రీ శ్రీ మహరాజ్ దివ్యస్థితిలో ఉండేవారు. ఆ స్థితిలో ఆయన చక్షువులు — శ్రీ రామకృష్ణులు ఒక కథలో ఉపహరించినట్టుగా — గ్రుడ్లను పొదిగే పక్షిలా అద్భుతమైన ఏకాగ్రతతో నిండి ఉండేవి. ఆ స్థితిలో ఆయన పరిసరాలన్నిటినీ — బాహ్య ప్రపంచాన్నంతటినీ — సంపూర్తిగా మరచేవారు. ఆ స్థితిలో ఆయన ఏ పరమసత్యాన్ని సందర్శించేవారో, వినేవారో ఆయనకే తెలియాలి. ఆయన సమీపంలో హుక్కా ఉంచబడేది. ఒకటి రెండుసార్లు మాత్రమే స్వామి అది పీల్చేవారు.

"శ్రీ రామకృష్ణ కథామృతం"లో మేము, పరిపక్వమై, సిద్ధిపొందిన యోగులయొక్క దివ్య చక్షువులను గూర్చి చదివినాము. శ్రీ శ్రీ మహరాజ్‌ని ప్రత్యక్షంగా చూడనివారు ఆ స్థితిని ఎంతవరకు అవగాహన చేసుకుంటారో చెప్పలేను. అయితే ఒకటి మాత్రం సత్యం: మా పురాకృత పుణ్యంవల్ల శ్రీ శ్రీ మహరాజ్ ఈ దివ్యస్థితిని ప్రత్యక్షంగా చూడటమనే మహదవకాశం మాకు కలిగింది. ఆయన దివ్యదృష్టి ఏ వ్యక్తిమీదనైనా ఆతని అదృష్టంవల్ల సారింపబడితే ఆతని హృదయమంతా అద్భుతమైన ఆనందంతో పరిపూర్తిగా నిండేది. హేతువాదదృష్ట్యా దీనికి — ఈ దివ్యానుభూతికి — ఇదమిత్థమైన కారణం చెప్పలేం. అయితే ఈ అనుభూతిని పొందిన ఒకరిద్దరు వ్యక్తులు ఆ స్థితిని గూర్చి వర్ణిస్తూ ఈ విధంగా చెప్పడం విన్నాను: శ్రీ శ్రీ మహరాజ్ దృష్టి ఒకసారి సారింపబడితే ఆ వ్యక్తి కనీసం ఒక రోజైనా అనిర్వచనీయమైన ఆనంద స్థితిలో ఉండేవారు; అయితే అదృష్టంవల్ల శ్రీ శ్రీ మహరాజ్ ఏ వ్యక్తినైనా స్పృశిస్తే ఆ వ్యక్తి ఈ దివ్యస్పర్శవల్ల ఏర్పడ్డ దివ్యమైన ఆనందపు అలలలో కనీసం మూడు రోజులైనా తేలి ఆడేవారు.

ఈ విధంగా మా కాలం గడచేది. తమ ప్రాతఃకాలపు జపధ్యానాలను ముగించుకొని, కొంచెం పొద్దు సాగిన తర్వాత, ఆ సమయంలో మఠంలో ఉన్న స్వాములందరూ — పిన్నలూ పెద్దలూ అందరూ — శ్రీ శ్రీ మహరాజ్‌కి ప్రణామాలర్పించడానికి వచ్చేవారు. శ్రీ శరత్ మహరాజ్, (శ్రీ శారదానందస్వామి), శ్రీ అభేదానందస్వామి శ్రీ శ్రీ మహరాజ్‌ని దర్శించి "సుప్రభాతం" అని ప్రణమిల్లేవారు. పూజ్య శ్రీ విజ్ఞాన్ మహరాజ్ కూడా శ్రీ శ్రీ మహరాజ్‌కి సాష్టాంగ ప్రణామం చేయగా మేము చూసేవాళ్ళం. అపుడపుడే ధ్యానావస్థ నుండి విడివడే కళ్ళతో మహాపురుష్ మహరాజ్ (శ్రీ శివానందస్వామి) కూడా, హృదయాంతరాళాలనుంచి వెలువడే భక్తి, శ్రద్ధలతో, "సుప్రభాతం శ్రీ శ్రీ మహరాజ్,

సుప్రభాతం!'' అని చేతులు చేర్చి వినమ్రులై ఉండటం మేము గమనించేవాళ్ళం. ఈ రకంగా తనను చూడవచ్చిన ప్రతి ఒక్కరిని శ్రీ శ్రీ మహారాజ్ తిరిగి "సుప్రభాతం!'' అని పలుకరించినా, శ్రీ మహాపురుష్ మహారాజ్‌ని మాత్రం "సుప్రభాతం, తారక్ దా!'' అని పేరున పలుకరించేవారు. బహుశా శ్రీ మహాపురుష్ మహారాజ్ తనకంటె వయస్సులో పెద్దవారు కావటం దీనికి కారణం కావచ్చు

దీని తర్వాత సాధువులు, భక్తులు శ్రీ శ్రీ మహారాజ్‌కి ప్రణమిల్లేవారు. ఈ నమస్సులను స్వామి అంగీకరిస్తో కొంతమందితో ఒకటి రెండు మాటలు మాట్లాడేవారు, తరచు ఒక దిద్దరితో ఛలోక్తులాడేవారు. అయితే అక్కడ ఉన్న ప్రతి ఒక్కరి హృదయం దివ్య ప్రేమానుభూతితో పరిపుష్టమవడం మాత్రం నేను తప్పక గమనించేవాణ్ణి.

దీని తర్వాత మా దైనందిన కృత్యాలను నిర్వహించడానికి మేము వెళ్ళేవాళ్ళం. శ్రీ శ్రీ మహారాజ్ కూడా, స్వల్పంగా ఫలహారం స్వీకరించి, మఠంయొక్క సువిశాలమైన ఆవరణలో వాహ్యాళికి వెడలేవారు. ఆ సమయంలో ఆయన మూర్తి నా మనఃఫలకంనుంచి ఏ నాటికీ చెరగిపోదు. ఒక భృత్యుడు ఛత్రం తీసుకుని శ్రీ శ్రీ మహారాజ్ మీద ఎండపొడ పడకుండా కూడా నడచేవాడు. శ్రీ శ్రీ మహారాజ్ తమ చక్షువులు పైకి చూస్తోండగా నెమ్మదిగా నడచేవారు. అయితే ఏ కారణం వల్లనో నేను చెప్పలేను కాని ఆ సమయంలో శ్రీ శ్రీ మహారాజ్ ఇతః పూర్వంకన్న పొడగిరి అయినట్లే కాక, ఆయన పాదాలు నేలను స్పృశించకుండా నడచేవారని మాత్రం నాకు గాఢమైన అనుభూతి కలిగేది! ఈ దివ్య దృశ్యాన్ని పరికించే అపూర్వావకాశం ఎప్పుడు కలిగినా నేను తేజస్సుతో నిండిన ఆయన మూర్తినుంచి చూపు మరల్చుకోలేక పోయేవాణ్ణి. కేవలం ఆ దివ్యమూర్తిని దర్శించడమే కన్నార్పకుండా!

సాయంకాలం, శ్రీ ఠాకూర్ ఆరాత్రిక మయిన తర్వాత తిరిగి మేమందరం శ్రీ మహారాజ్ సన్నిధికి చేరుకునే వాళ్ళం. అదే సమయానికి మఠంలో ఉన్న పూజ్య శ్రీ మహాపురుష్ మహారాజ్, విజ్ఞాన్ మహారాజ్, సుధీర్ మహారాజ్ (శ్రీ శుద్ధానంద స్వామి) శుకల్ మహారాజ్ (శ్రీ ఆత్మానందస్వామి), శ్రీ స్వామిజీ (శ్రీ వివేకనందస్వామి) ప్రత్యక్ష శిష్యులు, ఇతరసాధువులు భక్తులు అందరూ శ్రీ శ్రీ మహారాజ్ సన్నిధికి వచ్చేవారు. కొంత మంది అక్కడ ఉన్న కుర్చీలలో ఆసీనులైతే మిగిలినవారు మా తోపాటు నేలమీద కూర్చునేవారు. ఈ విధంగా కొంత కాలం నిశ్శబ్దంగా గడచిన తర్వాత శ్రీ శ్రీ మహారాజ్ "మీకు ఏ సందేహాలు ఉన్నాయో చెప్పండి! మీ సందేహాలన్నీ శ్రీ విజ్ఞాన్ మహారాజ్‌తో చెప్పండి!!'' అని అనేవారు. అయితే సాధారణంగా మాకు ఏమీ ప్రశ్నలు ఉదయించేవి కావు. అప్పుడు మా తరపునా అన్నట్లు శ్రీ శ్రీ మహారాజ్ శ్రీ విజ్ఞాన్ మహారాజ్‌ని ఏదో ఒక ప్రశ్న అడిగేవారు. అప్పుడు, శ్రీ విజ్ఞాన్ మహారాజ్, ఒక పసివాడు భయం నిండిన హృదయంతో, గురువుకు పాఠాలు ఒప్పగించినట్లుగా, శంకతో మెల్లగా ఆ ప్రశ్నకు సమాధానం చెప్ప నారంభించేవారు. దీని తర్వాత ఇదే ప్రశ్న శ్రీ మహారాజ్ మిగతా స్వామీజీలనందరినీ అడిగేవారు. తమ తమ ఆలోచనకు తగినట్లుగా వారు సమాధానించేవారు. వీరి సమాధానాలన్నీ మాకు సమంజసంగా ఉండి, వేయబడిన ప్రశ్నకు గల అర్థం బాగా స్ఫురిం

చేది. అయితే శ్రీ శ్రీ మహరాజ్ చివరకు చెప్పే సమాధానం మాత్రం అతి సూక్ష్మంగా, గంభీరంగా ఉండి, ఈ సమాధానం వినా, ఆ ప్రశ్నకు సమాధానం తప్పక అసంపూర్తిగా ఉండేది అని అనిపించేది. ఇలాంటి సందర్భాలలో ఒకసారి శ్రీ శ్రీ మహరాజ్ ఈ విధంగా అన్నారు: "మీ అందరి తరఫున నేను ఈ ప్రశ్న అడుగుతున్నాను: భగవత్సందర్శనం పొందిన వ్యక్తియొక్క స్థితి ఏలాంటిది?" ఈ ప్రశ్నకు అక్కడ సమావేశమయిన సాధు పుంగవులందరి నుండీ చాల గంభీరమయిన, చక్కనైన సమాధానాలు లభించినై. కాని చిట్టచివరకు శ్రీ శ్రీ మహరాజ్ తమ సహజ సరళమైన ధోరణిలో అన్నారు: "దీనికి సమాధానంకోసం "కఠోపనిషత్"లో ఉన్న ఆ శ్లోకం – "భిద్యతే హృదయగ్రంథి...తస్మిన్ దృష్టే పరావరే." – పరిశీలించండి: భగవానుని దివ్యానుభూతిని పొందినవ్యక్తి హృదయంలో ఉన్న సందేహపు ముడులన్నీ ఛిన్నాభిన్న మవుతాయి, అన్ని శంకలు మాయమవుతవి, కర్మ ఫలాలన్నీ నాశనమవుతాయి." ఇది విన్న తర్వాత మాకు అనిపించింది: ఇదే ఆ కఠినమైన ప్రశ్నకు సరియైన సమాధానం: భగవంతుని అనుభూతి పొందిన వ్యక్తి లక్షణాలు ఇవే.

(తెలుగు సేత: ఎమ్. శివరామకృష్ణ.
ఆంగ్లశాఖ. ఉస్మానియా విశ్వవిద్యాలయం.)

# పుస్తక పరిచయము

**ఊహాశక్తి - ద్వైమాస సైన్సుపత్రిక**
**ప్రచురణ: శ్రీ వివేకానంద విద్యాపరిషత్,**
**ఎ. పి. నగర్, నెల్లూరు-2. సంవత్సరచందా 3.00.**

బ్రిటిష్ పాలకులు వారి పరిపాలనా యంత్రాంగానికి కావలసిన గుమాస్తాలను తయారు చేయాలనే ఉద్దేశంతోనే మన దేశంలో మొదట ఆధునిక విద్యావిధానాన్ని ప్రవేశపెట్టారు. ఆ విద్యావిధానమే ఇంకనూ మనదేశంలో చెప్పుకోదగ్గ మార్పులేవీ లేక కొనసాగుతుంది – స్వాతంత్రంవచ్చి ముప్పైఏండ్లైనా. విద్యారంగంలో ప్రభుత్వం, ఇప్పుడు సంవత్సరమూ ఎన్ని వందలకోట్లు ఖర్చు పెట్టున్నదో తెలియదు గాని 'ఉద్యోగందేహి' అనే భిక్షుగాళ్ళు విద్యాలయాలనుండి సంవత్సరమూ లక్షలకు లక్షలు వెలువడుతున్నారు. పాఠశాలల్లో కళాశాలలలో పాతుకుపోయిన ఈ శోచనీయ విద్యావిధానంనుండి కొందరినైనా సముద్ధరించాలనే ఉదారాశయంతో ఈ ద్వైమాసిక సైన్సు పత్రిక ప్రారంభింపబడింది. విద్యార్థినీ విద్యార్థులలో, ఉపాధ్యాయులలోను పరిశోధనాపాటవాన్ని, సృజనాత్మకశక్తిని పెంపొందించేందుకు ఈ పత్రిక కంకణం కట్టుకొన్నది. చురుకైన విద్యార్థినీ విద్యార్థుల ఉపాధ్యాయుల చిన్న చిన్న పరిశోధనావ్యాసాలను ప్రచురించి ప్రచారం చేయటానికి పూనుకొన్నది. మొదటి సంచికకన్నా రెండవ సంచికలో నాలుగు పేజీలు ఎక్కువ ఉండడాన్నిబట్టి, ఇట్లే ఈ పత్రిక క్రమేణ అభివృద్ధియై తెనుగుదేశంలో మంచి వైజ్ఞానిక పత్రికలేని కొఱతను తీర్చ గలదని ఆశించవచ్చు.

## మందార మంజరి

ప్రచురణ: శ్రీ రామకృష్ణ సేవాసమితి, బాపట్ల, 522101. వెల: యాభై పైసలు.

ఇందులో మొత్తం 27 పాట లున్నవి. గాస్పెల్ ఆఫ్ శ్రీ రామకృష్ణ అనే పుస్తకంలోని కొన్ని ముఖ్యమైన పాటలకిది స్వేచ్ఛానువాదం. అనువాదకులు శ్రీ బి.ఎస్.ఆర్. ఆంజనేయులు రామకృష్ణప్రభ పాఠకులకు సుపరిచితులు. అప్పుడప్పుడు ఈయన వ్రాసిన వ్యాసాలు. గేయాలు రా. ప్రభలో ప్రచురింపబడినవి. ఇప్పుడు ఈయన వ్రాసిన 'బాలల శారదాదేవి' వరుసగా ప్రచురింపబడుచున్నది. బాపట్లలో రామకృష్ణ సేవాసమితిని స్థాపించి ఆ సమితి తరపున సేవాకార్యక్రమాలను నిర్వహిస్తూ నిర్విరామంగా కృషి చేస్తున్నారు. అప్పుడప్పుడు సమితి తరపున చిన్నచిన్న పుస్తకాలను ప్రచురించుట కూడ కలదు. అందులో ఇది ఒకటి. ఇందులోని పాటలు సరళంగాను భావయుక్తంగాను ఉన్నవి. పాటలు ఏ సందర్భంలో పాడబడినవో కూడ ఇందులో తెలియజేయబడింది. ప్రతిపాట ఏ రాగంలో ఏ తాళంతో పాడాలనేదికూడ సూచింపబడింది.

## మాఘమాహాత్మ్యము (బుఱ్ఱకథ)

గ్రంథకర్త: మధురకవి ఎ. వి. నారపరెడ్డి. వెల: 60 పైసలు, ప్రతులకు: బి. శంభురెడ్డి, శ్రీ సాయి సమాజము. వీరపునాయనిపల్లె (పోస్టు.) కడపజిల్లా.

మాఘమాసంలో సూర్యోదయానికి ముందఱ స్నానంచేస్తే గొప్ప పుణ్యం కలుగుతుందని కొన్ని పురాణకథల ఆధారంతో ఈ బుఱ్ఱకథ చెప్తుంది. వాస్తవానికి. మాఘమాసంలోనే కాదు, ప్రతి మాసంలోను సూర్యోదయానికి చాలముందఱే లేచి స్నానం ముగిస్తే మంచిది. ఒక స్వామి విదేశానికి వెళ్ళబోయేముందు తమ గురువుగారిని సందర్శించి ఇట్లడిగారు 'మహారాజ్! ఇంకెన్నేళ్ళకు మిమ్ములను తిరిగి చూచే భాగ్యం నాకు కలుగబోతుందో తెలియదు. దూరంగా వెళ్ళిపోతున్న నా కిప్పుడు మీరేమి తెలపబోతున్నారు.' దానికి సమాధానంగా గురువు ఇలా చెప్పారు. 'నీ విక్కడ చేరి 15 ఏళ్లయింది. సాధనలు చేస్తున్నావు ఎన్నో పుస్తకాలు చదివావు చదువుతున్నావు. ఎంతో ఉపదేశం ఈ వఱకే విన్నావు. ఇంకా ఏమి ఉపదేశం కావాలి? అయినా ఒకటి చెబుతాను, గుర్తుంచుకో. ఇప్పుడు నీవు ప్రొద్దున సాధారణంగా లేచే సమయానికన్నా అరగంట ముందఱే లేస్తుండు. దానివల్ల నీ కెంత మేలు జరుగబోతుందో కొన్నాళ్ళకు నీకే విశదం అవుతుంది.'

## దివ్యజ్ఞానవాణి (ద్వైమాసిక కరపత్రము)

ఆధ్యాత్మిక సాంస్కృతిక విషయకముగా దివ్యజ్ఞాన సమాజమువారిచే గాంధీనగర్, కాకినాడ - 533101 నుండి ప్రకటింపబడుచున్నది. దీనికి సంపాదకులు శ్రీ కామఋషి సత్యనారాయణవర్మగారు. ఈయన రా. ప్రభ పాఠకులకు పరిచితులు (డిసంబరు 77, జనవరి 78 సంచికలలో) ఈ సంచికలోని రంగనాథానంద స్వామిగారి భగవద్గీత - విశ్వసందేశమును అనువదించినదికూడ ఈయనే.

## శ్రీమత్కాళయుక్తినామ సంవత్సరపఞ్చాఙ్గమ్

దైవజ్ఞ శివకోటి సత్యనారాయణమూర్తి శాస్త్రిగారిచే విరచింపబడిన ఈ పంచాంగం రామకృష్ణప్రభ కార్యాలయానికందినది. ప్రాప్తిస్థానం: దైవజ్ఞ శివకోటి సత్యనారాయణమూర్తి, మారుటేరు-534122, తణుకు తాలూకా. ప॥ గో॥ జిల్లా, వెల: 1-75.

—వి. వి.

# బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## వింత తల్లి - వింత తండ్రి

నిర్మలమైన హృదయంగలవారు దేవుణ్ణి చూస్తారు. కపటములేని వాళ్ళహృదయం నిర్మలంగా వుంటుంది. వాళ్ళమనస్సు పసిపిల్లలవలె అమాయకంగాకూడా వుంటుంది. శ్రీ శారదాదేవి మనస్సు, హృదయం యిలాంటివి. ఆసంగతి ఒకసారి జరిగిన విషయంవల్ల తెలుస్తుంది.

జయరాంబాటిలో సంవత్సరంపైగా వుండి ఆరోగ్యము మామూలుగా వచ్చిన తర్వాత ఆమె మూడవసారి దక్షిణేశ్వరం బయలుదేరింది. అప్పుడో లేక యిటువంటి మరో ప్రయాణములోనో ఆమె కొందరితో జట్టుగా ప్రయాణం చేస్తున్నది. కలకత్తా పోయేవారిలో ఒకచోట చిట్టడవులున్నాయి. చీకటిపడితే వాటిగుండా వంటరిగా పోవటం భయం. దొంగలు కొట్టి దోచుకునేవారు.

శారదాదేవితో వచ్చినజట్టు గబగబా నడవటంవల్ల ఆమె ఈ చోటు చేరేటప్పటికి వెనుకబడింది. చీకటి పడుతూండటంవల్ల వాళ్లు ముందు వెళ్లిపోయారు. ఇంతలో చీకట్లు కమ్ముకువచ్చాయి. దూరంనుండి ఒకడు నల్లని యెత్తయినవాడు, చింపిరి జుట్టువాడు రావటం ఆమె చూచింది. అతనిచేతిలో కర్రకూడా యున్నది. ఆమెకు భయం కలిగింది. వాడు దగ్గరకు వచ్చి 'ఎవరక్కడ' అని అరిచాడు. శారదాదేవి అమాయకంగా యిలా అన్నది. 'నాన్నా, నేను మీ అమ్మాయి శారదను' ఆమాటతో ఆ దొంగలో దాగియున్న తండ్రిహృదయం కదిలింది. ఇంతలో యింకోస్త్రీ అక్కడికి వచ్చింది. ఆమె ఆ దొంగభార్య. ఆమె రాగానే శారదాదేవి ఆమె చేయిపట్టుకొని 'అమ్మా! మీరిద్దరూ రావటం ఎంత బాగున్నదో చూచావా! నాతో వచ్చినవారు నన్ను యిక్కడవదలి వెళ్లిపోయారు' అని అన్నది. ఆ దొంగలిద్దరి హృదయాలు మారినవి. ఈ తమకూతుర్ని తీసుకుపోయి దగ్గరలోయున్న దుకాణములో కొన్ని మరమరాలు కొని తినిపించారు. ఆ దొంగతల్లి తన చెరుగుపరచి శారదాదేవిని తనప్రక్కన పరుండబెటుకున్నది. ఆ దొంగ ఆరాత్రి అంతా వాళ్ళకు కాపలా కాచాడు. ఈ కొలది సాంగత్యముతోనే ఆమెమీద వారికెంతో ప్రేమ యేర్పడింది. తెల్లవారగానే ఆమెను ఆమెతో వచ్చిన జట్టు దాకా సాగనంపినారు. ఆ దొంగతల్లి దారిలో కొన్ని పచ్చిపప్పులు కోసి చీరచెంగున కట్టి 'అమ్మాయీ రాత్రి వీటిని మరమరాలతో కలిపి తిను' అని చెప్పింది. ఆమెను వదలి వెళ్లేటప్పుడు వాళ్ళ కళ్ళలో నీరు నిండింది. శారదాదేవి యిలా అన్నది. 'మీరిద్దరు ఒకసారి దక్షిణేశ్వరం వచ్చి మీ అల్లుణ్ణి చూచిపొండి.' 'సరే' అంటూ ప్రేమతో కళ్ళనీళ్లు తుడుచుకుంటూ వాళ్లు వెనక్కు తిరిగారు. తరువాత యీ దొంగ తండ్రి, తల్లి దక్షిణేశ్వరం వెళ్లారు. రామకృష్ణుడు వాళ్ళని తన స్వంత అత్త మామలను చూచినట్లు ఆదరించాడు.

"నీదుబిడ్డను శారద నేను సుమ్ము నాన్నయును నీవు రానిచో నాపనేమి
జరిగి యుండెడిదోగదా పొరుగువారు వెడలిపోయిరి నన్నిట విడచిపెట్టి."

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

| | |
|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము | 8-00 |
| శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర | 10-00 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 8-00 |
| శ్రీ రామకృష్ణోపనిషత్తు | 3-75 |
| శ్రీ రామకృష్ణపరమహంస నీతికథారత్నములు | 2-50 |
| గురూపదేశములు | 2-00 |
| నా గురుదేవుడు | 1-25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1-50 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహము | 0-75 |
| ఆరాత్రికము మరియు | |
| శ్రీ రామనామ సంకీర్తనము | 0-50 |
| శ్రీ రామకృష్ణుడు, వివేకానందస్వామి | 0-25 |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4-00 |
| శ్రీ శారదాదేవి | 2-50 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | 0-80 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4-00 |
| బాలల వివేకానందుడు | 2-00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి | |
| 9 సంపుటముల పూర్తిసెట్టు (సాదా) | 45-00 |
| ,, ,, (క్యాలికో) | 58-50 |
| విడి సంపుటములు ఒక్కొక్కటి (సాదా) | 4-00 |
| ,, ,, (క్యాలికో) | 5-50 |
| స్వామి శిష్య సంవాదములు | 16-50 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 5-00 |
| ,, (రెండవ భాగము) | 5-50 |
| భారత యువజనులారా! | 3-00 |
| ప్రబోధ రత్నాకరము | 3-75 |
| రాజయోగము | 6-25 |
| కర్మయోగము | 4-00 |
| భక్తియోగము | 4-00 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 2-25 |
| ,, (రెండవభాగము) | 3-00 |

| | |
|---|---|
| హిందూ మతము | 4-00 |
| వివేక సూర్యోదయము | 4-00 |
| అనుష్ఠాన వేదాంతము | 2-50 |
| ప్రాచ్యము - పాశ్చాత్యము | 1-25 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 3-00 |
| భారతదేశము | 2-00 |
| భారతీయ మహిళ | 2-00 |
| నా జీవితము, జీవిత కార్యము | 1-25 |
| శ్రీ రామకృష్ణ సేవాసంస్థ : లవాదిర్యములు | 0-50 |
| షికాగో సభోపన్యాసములు | 1-00 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0-80 |
| నవీన భారత దేశము | 0-40 |
| సర్వం విష్ణుమయం జగత్ | 0-30 |
| శ్రీ వివేకానంద సింహగర్జనలు | 0-20 |
| బ్రహ్మానంద బోధనలు | 4-75 |
| తాపత్రయ చికిత్స | 0-60 |
| ముక్తిమార్గము | 0-30 |
| పారమార్థిక సంభాషణలు | 6-50 |
| నారద భక్తి సూత్రములు | 4-00 |
| శ్రీ దొడ్డ భాగవతము-మూడవ సంపుటము | 7-00 |
| దేవీమాహాత్మ్యము | 4-00 |
| శ్రీ మద్భగవద్గీత | 9-00 |
| పారాయణగీత తాత్పర్యసహితము | 3-75 |
| ,, మూలము | 2-00 |
| కఠోపనిషత్తు | 2-00 |
| గిరీశచంద్ర | 1-00 |
| భక్తిమార్గము | 1-00 |
| శ్రీకృష్ణవాణి | 0-80 |
| బుద్ధవాచ | 0-80 |
| క్రైస్తు సూక్తిమాల | 0-80 |
| మహమ్మదు సూక్తి మంజరి | 0-80 |

ఇవి మేకాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును,
వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)
అను మాసపత్రికలును. శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైలచిత్రములు మున్నగున వెన్నియో మా యొద్ద లభింప గలవు.

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600 004

సంవత్సర చందా రూ. 7 జీవిత చందా రూ. 100 విడి సంచిక 70

# శ్రీ రామకృష్ణ కథామృతము

నేడే కొనండి! (ప్రథమ భాగము) పదేపదే చదవండి!

శ్రీ "మ.—" చే వంగభాషలో విరచితమైన మూలగ్రంథమునుండి అనూదితము. నవభారత నిర్మాతయగు శ్రీ వివేకానందస్వామికి శ్రీరామకృష్ణ పరమహంస గురుదేవుడు. ఆ పరమహంసదేవుని దివ్య వచనామృతమును శ్రీ "మ.—" ఆనంద తన్మయతతో తాను వినినది వినినట్లుగ ఐదు భాగములుగ గ్రంథస్థ మొనర్చెను. అందు ప్రథమ భాగమిది.

ఆ అవతారమూర్తియొక్క వచనములు ఈ పుటలయందు మనస్సును పూర్తిగ ఆకట్టుకొనునట్లుగ అనువదింపబడినవి. వీనిలో పరిష్కరింపబడని తత్త్వవిషయిక సమస్యలేదు, తొలగింపబడని ఆధ్యాత్మిక సంశయము లేదు. వివరింపబడని ఆత్మవికాసక విషయములేదు. ఆసక్తికరము. ఆధ్యాత్మికులకు ఒక వరప్రసాదము.

వెల : సాదా : రూ. 8-00

పుటలు : 240 + VIII ప్రథమ ముద్రణము కాలికో : రూ. 12-00

# శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర

రచయిత : శ్రీ చిరంతనానందస్వామి

వంగభాషలోని మూలప్రమాణ గ్రంథముల ననుసరించి రచింపబడినది. ఇందు శ్రీ రామకృష్ణుని జీవితాంశములు మృదుమధురమగు తేటతెనుగున సమగ్రముగ వివరింపబడినవి. ఢిల్లీ సాహిత్య అకాడెమీ వారిచే ఉత్తమోత్తమ గ్రంథముగ నిర్ణయింపబడినవి.

శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర ఆద్యంతము ఆత్మవైభవమే. దివ్యవైభవమే. ఇదియొక దెస కావ్యము. ఇంకొకదెస చరిత్రము వెరసి తత్త్వ సంహిత. లేక దివ్య కావ్యము. ఈ శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర శారదాకంఠమున ఓంకారఘంట। రోమాంచముల పంట.

—శ్రీ వేలూరి శివరామశాస్త్రి.

....విమర్శక చక్రవర్తి....కీ. శే. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి శ్లాఘామోదములనందిన మీ పూర్వ గ్రంథముల నిది రచనావైదగ్ధ్యమున....మించియున్నది. విషయౌదాత్త్యము రచనౌదాత్త్యముగా పరిణమించుట స్వాభావికమే కదా సిద్ధహస్తుల చేతులతో।

—శ్రీ కందుకూరి మల్లికార్జునం.

It is bound to communicate to the reader the beauty and power of Sri Ramakrishna's life.

**—Sri S. Radhakrishnan.**

Classic...authentic...It will be a very valuable addition to the Telugu literature.

**—The Hindu.**

పుటలు : 478+XXX వెల : రూ. 10-00

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూర్, మద్రాసు-600 004.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 35 1978 - మే : కాళయుక్తి - వైశాఖము సంచిక 5

## విషయసూచిక



శ్రీ రామకృష్ణప్రభ

సంవత్సర చందా : రూ. **7-00.** జీవిత చందా : రూ. **100-00.**

విడి ప్రతి : **70** పైసలు.

శ్రీ రామకృష్ణమఠము

మైలాపూరు

మద్రాసు – 600 004.

# స్వామి శిష్య సంవాదములు

అనువాదకులు : శ్రీ కందుకూరు మల్లిఖార్జునంగారు

ద్వితీయ ముద్రణము :

వెల : రూ. **10-50**

క్యాలికో వెల : రూ. **13-00** పుటలు : 424+6

నవభారత భాగ్యవిధాతయగు శ్రీమద్వివేకానందస్వామి శిష్యులతో కావించిన ప్రసంగము లివి: (1) శరశ్చంద్ర చక్రవర్తి, (2) ప్రియనాథ సింహా, (3) సురేంద్రనాథసేను, (4) సురేంద్రనాథగుప్త అను నలుగురు శిష్యుల డైరీలనుండి సేకరింపబడినవి. 'టాక్స్ విత్ స్వామి వివేకానంద' అను పేర ప్రకటింపబడియున్న ఆంగ్ల గ్రంథమున కిది ఆంధ్రానువాదము. ఉపనిషద్బోధనలకు సుబోధ వ్యాఖ్యానరూపములైన యీ సంవాదములు పారమార్థిక సాధకులకును, జిజ్ఞాసువులకును మాత్రమే కాక దేశభక్తులకును, సంఘ సంస్కరణాభిలాషులకును, స్త్రీ సముద్ధరణోద్యమ పరాయణులకును, లలితకళాసక్తులకును, ఇంతేల, సర్వవిధ మనఃప్రవృత్తులు కలవారికిని అత్యంతోపయుక్తములుగా నుండుననుటకు సందేహము లేదు. అనువాదశైలి హృద్యము అనవద్యము.



ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 35 1978 – మే :: కాళయుక్తి – వైశాఖము సంచిక 5

## ప్రార్థన

ఏకం సత్ విప్రా బహుధా వదంతి అగ్నిం యమం మాతరిశ్వానమాహుః

యో విశ్వాభిః విపశ్యతి భువనా సం చ పశ్యతి

స నః పుషాపితా భువన్

తత్ సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి

ధియో యో నః ప్రచోదయాత్.

ఉన్నది ఒక్క దేవుడే, కాని ఋషులు అగ్నియని, యముడని, మాతరిశ్వుడని వేరు వేరు పేర్లు పెట్టి పిలుస్తున్నారు. భువనాన్ని పోషించేవాడు, ప్రతిదీ కనిపెట్టుతూ ఉండేవాడయిన ఆ దేవుడు మనలను రక్షించుగాక.

ప్రకాశమానుడైన ఆ భగవంతుని దివ్యతేజస్సును ధ్యానించెదము. ఆ దేవుడు మన బుద్ధులను వికసింపజేయుగాక!

—ఋగ్వేదం.

“కాలేనాత్మని విన్దతి” (సకాలమున దానిని - బ్రహ్మజ్ఞానమును - తనయందే పొందును). కాలపరిపాకమున అది వచ్చితీఱును - కాని కొందఱికి శీఘ్రముగాను, కొందఱికి కొంచెము ఆలస్యముగాను వచ్చును. సాధకుడు దృఢసంకల్పుడై, దానియందు నిరంతర తత్పరత కలిగి యుండవలెను. ఇదియే యథార్థ పురుషకారము, నీ మనస్సు తైలధారవలె నిరంతరము ఒక వస్తువు మీదికే పాఱుచుండవలెను. సామాన్యమానవుని మనస్సు చెదరి చెదరి యెన్నో వస్తువుల మీదికి పోవుచుండును. ధ్యానవేళయందు కూడ అది ప్రథమమున చలనశీలమై యుండును. కాని మనస్సులోనికి ఎన్ని కోరికలైన రానిమ్ము, నీవు మాత్రము ప్రశాంతముగా కూర్చుండి, ఎట్టి ఊహలు వచ్చుచున్నవో చూచుచు, కను పెట్టియుండవలెను. కొంత కాలము అట్లు కను పెట్టియే యున్నయెడల, మనస్సు శాంతత నొందును - సంకల్పతరంగములు నిలిచిపోవును. ఈ తరంగములు మనస్సునకుగల సంకల్ప వృత్తిని సూచించును. ఇంతకుముందు నీవు అతిగాఢముగా ఆలోచించిన విషయములు స్మృతిగర్భమునందు అంతర తరంగ రూపమున నిలిచియుండి ధ్యానవేళయందు పైకి ఉబికి గోచరించును. ధ్యానములో ఈ తరంగము (లేక, ఊహలు) గోచరించుట మనస్సు ఏకాగ్రము కాబోవుచున్న దనుట కొక నిదర్శనము.

మనస్సు ఒక్కొకసారి యొక కొన్ని తలపులపై ఏకాగ్రమైయుండును - దీనిని సవికల్ప ధ్యానమందురు. కాని మనస్సు సర్వవృత్తి శూన్యమైనప్పుడు, అది ఏకమును, అనన్యాధారమును, అఖండ బోధస్వరూపమును అగు ప్రత్యక్ చైతన్యములో లీనమగును. దీనినే నిర్వికల్పసమాధి యందురు. ఈ ఇరు తెఱగుల సమాధిని మేము శ్రీ రామకృష్ణునియందు ఎన్నోసార్లు చూచితిమి. ఈ స్థితులు ఆయనకు అప్రయత్నముగా లభించెడివి - ఎప్పటికప్పుడు సహజముగనే వచ్చెడివి. అది ఆశ్చర్యకరము! ఆయనను చూచుటవలననే మేము వానిని సరిగా గ్రహింపగల్గితిమి.

ప్రతిదినము, ఒంటరిగా కూర్చుండి ధ్యానమొనర్పుము. సర్వము తనంతట తానే వెలువడి దీపించును. విద్యాస్వరూపిణియగు మహామాయ నీయందిప్పుడు నిద్రావస్థలో నున్నది. కావున నీ కిది తెలియుటలేదు. ఆమెయే కుండలిని. ధ్యానపూర్వము నీవు నాడీ శుద్ధిచేసి కొనునప్పుడు, మూలాధారమున నిద్రించుచున్న కుండలినీ శక్తిని మానసికముగా తట్టి “లెమ్ము, తల్లీ, లెమ్ము” అనుచు నిదుర లేపవలెను. ఈ యభ్యాసములు కొంచెకొంచెముగా చేయవలెను. ధ్యానవేళయందు మనస్సును ఉద్రిక్తము కానీయకుము. ఉద్రేకమును పూర్తిగా అణచివైవుము - అది అపాయకరమైనది. మిక్కిలి ఉద్రిక్తులై యుండువారి కుండలిని అతిశీఘ్రగమనముతో పైకి ఎగయును గాని, ఎంత శీఘ్రముగా పైకి ఎగయునో అంత శీఘ్రముగా క్రిందికికూడ దిగజాఱును. అట్లు దిగజాఱినప్పుడు సాధకునికి అధఃపతనదశ ప్రాప్తించును. ఈ కారణముననే కీర్తనములు మున్నగు ఆవేశకర సాధనలు అతిదోషయుక్తములై యున్నవి. నృత్యము చేయుట, ఎగురుట, గంతులు వేయుట మున్నగువాని మూలమున ఒక క్షణిక బలము ఉత్పన్నమై కుండలినీశక్తిని పైకెగయజేయును నిజమే; కాని అది స్థిరముగా నిలిచియుండనే యుండదు. అంతేకాక అది క్రిందికి దిగజాఱినప్పుడు సాధ

కునియందు భయంకర కామోద్రేకము ఉప్పతిల్లును. అమెరికాలో నా ఉపన్యాసములు వినవచ్చినవారిలో అనేకులు క్షణిక భావావేశముచే పారవశ్యస్థితి నందువారు; కొందఱు శిలాప్రతిమలబోలె చేష్టలు దక్కి నిశ్చలులగువారు. కాని ఆ స్థితి గడచిపోయిన వెనువెంటనే వారిలో అనేకులకు కామప్రవృత్తి ప్రకోపించెడిదని పిదప విచారింపగా తెలియవచ్చినది. ధ్యానధారణల స్థిరతరాభ్యాసలోపమే ఇందుకు కారణము.

పరిమళపుష్పములు ముందు ఉంచి ధూపము సమర్పింపుము. మనఃపారిశుద్ధ్యము కలిగించు బాహ్యావస్తువుల తోడ్పాటును ప్రారంభదశయందు పొందుము. నీ గురునామమును, ఇష్టదేవతానామమును ఉచ్చరించునప్పుడు "సకల జీవ జగత్తులకును మంగళమగుగాక!" అని పలుకుము. ఈ శుభ సంకల్పచింతలు ఉత్తర దక్షిణ ప్రాక్ పశ్చిమదిశలకు, ఊర్ధ్వాధోదిశలకు – సర్వదిశలకు – పంపి ఆ పిదప ధ్యానమునకు కూర్చుండుము. ప్రారంభదశలందు ఇట్లొనర్పవలెను. అంతట నిశ్చలముగా కూర్చుండి (ఎటు మరలి కూర్చుండినను ఒకటే) దీక్షాదానకాలమున ఉపదేశించిన విధమున ధ్యానింపుము. ఒక్కదినమైన తప్పరాదు. పని తొందర మిక్కిలి అధికముగా నున్ననాడు కూడ ఒక పావుగంటకాలమైనను సాధన లభ్యసింపుము. అబ్బాయీ, నిష్ఠలేకయే గమ్యమును చేరగలవా?

ఒక గొప్ప పాశ్చాత్యపండితుడు ఏదో ఒకకారణంగా జైలుశిక్ష అనుభవించాల్సివచ్చింది. అక్కడ ఊరక కాలంగడపడానికన్నా ఏదోఒకటిచేస్తే బాగుండునుగదా అని ఆలోచించి అతడు ప్రపంచచరిత్రను వ్రాయాలనే నిశ్చయానికివచ్చాడు. దానికి కావలసిన మూలగ్రంథాలన్నీ (Source Books) సేకరించసాగాడు. ఒకనాడు తన జైలుగదికికొంతదూరంలో తోటి ఖైదీలమధ్య ఒక అలజడి చెలరేగింది. తిట్లు కొట్లాటలదాకా విజృంభించింది. కావలిదళంవారువచ్చి అతిప్రయత్నంతో అక్కడ చివరకు శాంతిని నెలకొల్పారు. దూరంనుండి ఇదంతా చూస్తుండిన ఆ పండితునికి అలజడికి కారణమేమిటో బోధపడలేదు. అటువైపునుండి వస్తుండిన ఒకడ్ని అడిగాడు, 'అయ్యా! అంత గందరగోళం ఎందుకేర్పడింది అక్కడ?' అని. అతనేదో సమాధానం చెప్పాడు. పండితునికి అది ఒకకారణంగా కనిపించలేదు. మఱొకడ్ని అడిగాడు, 'అయ్యా! అక్కడెందుకంత గందరగోళం చెలరేగింది?'–అని. అతడు సమాధానంగా, పూర్వం చెప్పినవ్యక్తికి పూర్తి విరుద్ధంగా ఏదో చెప్పాడు. ఈ రెండుసమాధానాలు పరస్పరవిరుద్ధంగా ఉన్నందువల్ల పండితుడొక నిశ్చయానికిరాలేక, సత్యం తేల్చుకోవాలనే కుతూహలంతో మఱికొందర్ని వరుసగా అడిగాడు, 'అయ్యా! నీవు చూశావుగదా ప్రత్యక్షంగా, అక్కడెందుకంత అలజడి చెలరేగింది–' అని. ఒక్కొక్కరు ఒక్కొక్కరకంగా సమాధానాలు చెప్పారు; కావలివాళ్లనడిగితే వారు సరిగ్గా తేల్చి ఏదీ చెప్పలేదు. అప్పుడు పండితు డిట్లనుకొన్నాడు: 'కొన్నిక్షణాలక్రితమే, కంటికిముందర ప్రత్యక్షంగా ఈ చిన్నజైలు ఆవరణలో జరిగిన సంఘటనగుఱించిన యథార్థాన్ని తెలిసికోడానికి సాధ్యంకాకపోతున్నది నాకు. అట్టినేను, ఈ విశాలప్రపంచంయొక్క వేలాదిసంవత్సరాల గతచరిత్రను వ్రాయాలని నిర్ణయించుకొన్నాను. ఎంత మూర్ఖ్యం! ఎంత అవివేకం! ఈ మూలచరిత్రగ్రంథాలుకూడా నావంటి అవివేకుల రచనలుగాక వీటిలో యథార్థం ఏముంటుంది?'–ఇట్లనుకొని చరిత్రవ్రాసే సంకల్పాన్ని ఆరోజే వదలిపెట్టాడు.

# శ్రీ రామకృష్ణ కథామృతము

(రెండవ భాగము)

అనువాదము: ప్రవ్రాజిక శ్యామాప్రాణ

భోజనానంతరము శ్రీ రామకృష్ణులు విశ్రమించుచుండిరి. మాస్టరు దగ్గర కూర్చొని యుండిరి. ఇంతలో డాక్టరు శ్యామ్‌గారు, కొందరు భక్తులు వచ్చిరి. శ్రీ రామకృష్ణులు లేచి కూర్చుని మాట్లాడదొడంగిరి.

రామకృష్ణులు: చివరివరకు సాధనలు చేయనక్కరలేదు. భగవల్లాభమందిన పిదప కర్మలు నశించును. భగవద్దర్శనమైన పిదప సంధ్యావందనాది కర్మలుండనేరవు. సంధ్య గాయత్రిలో లీనమగును. అప్పుడు గాయత్రీ జపము చాలు. అటుపై గాయత్రి ఓంకారములో లయించును. అప్పుడు ఓంకారధ్యానమే చాలును. సంధ్యాదికర్మ లెంతకాలము? హరి నామము కాని రామనామము కాని విన్నంతనే – పులకలువచ్చి కన్నీళ్ళు కారనంతవరకే సుమా!

ఒక భక్తుడు: స్వామీ! సంసారములో ఏ విధముగ యుండవలెనో శెలవిండు.

శ్రీ రామకృష్ణులు: కుమ్మరి పురుగువలె యుండుము. అప్పుడప్పుడు సంసారమునకు దూరముగపోయి నిర్జనప్రదేశమున భగవచ్చింతన చేసినచో భక్తి కల్గును. అట్టితఱి నిర్లిప్తుడవై వుండగలవు.

మణి ఏకాగ్రచిత్తముతో వినుచుండుట శ్రీ రామకృష్ణులు గమనించిరి. శ్రీ రామకృష్ణులు (వానివైపు తిరిగి) తీవ్రమగు వైరాగ్యము కల్గినచో భగవంతుని పొందగలము. తీవ్ర వైరాగ్యము కల్గినవానికి సంసారము దావానలమువలె తోచును. దారాసుతులు నరకకూప మనిపించును. అతడట్టితరి అనాసక్తుడై కూడ గృహములో నుండజాలడు. సంసారమును త్యజించును. కామకాంచనములే మాయ. ఈ మాయను తెలిసికొన్నచో అది సిగ్గుతో పలాయనమగును. ఒకడు పులితోలును కప్పుకొని ఒకరిని బెదిరించుటకు ప్రయత్నించెను. ఆ వ్యక్తి ఇట్లు పలికెను. 'నీ వెవరో నాకు తెలుసునోయీ! నీవు మా హరివేకదా!' అంత అతడు నవ్వి అచ్చటనుండి వెడలి ఇంకొక వ్యక్తిని భయపెట్టుటకు వేరొక తావునకు పోయెను. స్త్రీలు శక్తి స్వరూపిణులు. ఆది శక్తియే స్త్రీ రూపము ధరించును. ఆధ్యాత్మ రామాయణములో నారదాది భక్తులిట్లు స్తుతించిరి. 'ఓ రామా! పురుషులందరు నీ రూపములే. ప్రకృతిరూపమును సీతమ్మ ధరించినది. నీవు ఇంద్రుడవు, సీతమ్మ ఇంద్రాణీ. నీవు శివుడవు, సీతమ్మ శివాణి. నీవు నరుడవు, సీత నారి. ఇంతకన్న అధికమేమి పల్కగలము? పురుషుడున్నచోట నీవు – స్త్రీ వున్నచోటెల్ల సీతయే.

(భక్తులతో) తలచుకొన్నంతి మాత్రమున నే అందరూ సంసారత్యాగము చేయజాలరు. ప్రారబ్ధకర్మము, పూర్వజన్మ సంస్కారము, ఇవన్నియు కలవు. యోగిపుంగవు డొకడు రాజుతో ఇట్లనెను. 'నా వద్ద నివసింపుచు భగవత్‌స్మరణ చేయుము.' అందులకు రాజు ఇట్లు బదులు చెప్పెను. 'స్వామీ! అది వీలు కాదు. ఎందుచేతననగ భోగభాగ్యములవైపు నా మనస్సు ఇంకను పరుగెత్తుచున్నది. అందుచే నేను అడవిలో మీ వద్దకు వచ్చియున్నను అచ్చటనే ఒక రాజ్యము తయారగును. నాకింకను భోగేచ్ఛ కలదు.

నటవర పంజా' (ఒక వ్యక్తి పేరు) చిన్నప్పుడు ఈ తోటలో ఆవులను మేపుచుండెను. వానికి భోగములపై మోజుండెను. అందులకే ఆముదపు మిల్లు పెట్టి ఎంతో డబ్బు గడించెను. నేను అల బజారులో వాని ఆముదపు వ్యాపారము బాగుగా జరుగుచున్నది.

స్త్రీలతో కలిసి సాధనలు చేయుమతము ఒకటి కలదు. దానినే 'కర్తాభాజా' మతి మందురు. ఒకసారి నన్ను కర్తాభాజా మతస్థుల మతమునకు తీసికొనిపోయిరి. స్త్రీ లందరూ వచ్చి నా చుట్టు కూర్చొనిరి. నేను, అమ్మా! అమ్మా! అని పలుకుచుంటిని. అంత వారు 'ఇతడింకను ప్రవర్తకుడోయీ! ఇంకను దారి తెలిసికొనలేదు' అని పరస్పరము చెప్పుకొనిరి. వారి మతములో ప్రారంభావస్థలో యున్న వానిని ప్రవర్తకుడనియు అటుపై సాధకుడనియు, చివరకు సిద్ధులలో సిద్ధుడనియు చెప్పుదురు. ఒక స్త్రీ వైష్ణవచరణుని మీద కూర్చొనెను. ఇదేమని వైష్ణవచరణుని ప్రశ్నింప ఆమెది బాలికా భావమని నాకు చెప్పెను. ఈ సాధనలు చేయువారు త్వరగ పతితులగుదురు.

కాంనారివాడానుండి వచ్చిన భక్తులు లేచి 'మేమింక శెలవు తీసికొనెదము. కాళికాలయము - మిగిలిన దేవాలయముల దర్శించుకొనిపోయెదము' అనిరి. మణి కాళికాలయ ప్రాంగణములో పంచవటి మున్నగుచోట్ల ఒంటరిగ తిరుగుచుండెను.

మధ్యాహ్నము ౪-౪౹౦ గంటలకు మణి శ్రీ రామకృష్ణుని గదిలోనికివచ్చి కూర్చొనెను. బ్రౌటన్ ఇన్స్టిట్యూషన్ నుండి ఒక అధ్యాపకుడు విద్యార్థుల వెంటబెట్టుకొని శ్రీ రామకృష్ణుల దర్శించుటకై వచ్చెను. అతడు శ్రీ రామకృష్ణుల కొన్ని ప్రశ్న లడుగుచుండెను. విగ్రహారాధన గురించిన ప్రసంగము తలఎత్తినది.

శ్రీ రామకృష్ణులు (అధ్యాపకునితో) విగ్రహారాధనలో లోప మేమి? చిన్న పిల్లలు బొమ్మలతో ఎంతకాలము ఆడుకొందురు? పెద్దయై వివాహమై అత్తవారింటికి పోయినచో ఆ బొమ్మల నన్నింటిని పెట్టెలో దాచిపెట్టుతారు కదా! అట్లే భగవద్దర్శనమైన పిదప విగ్రహారాధన చేయనక్కరలేదు. (మణివైపు చూచుచు) ఇట్లు పలికిరి. అనురాగము కలిగినచో భగవల్లాభము చేకూరును. వ్యాకులత అవసరము. ఎక్కువ పడినచో మనస్సంతయు భగవంతునిలో ఐక్యమగును. ఒక కథ చెప్పెదను.

ఒకనికి ఒక పుత్రిక యుండెను. చిన్నవయస్సులోనే ఆమె భర్త మరణించెను. అందుచే ఆమె తనభర్తను చూడనేలేదు. ఆమె కొంత పెద్దదైన తరువాత తన స్నేహితురాండ్ర భర్తలు వచ్చుచుండుట ఆమె గమనించెను. ఆమె తండ్రితో ఒకనా డిట్లనెను. 'నాన్నగారూ! నా భర్త ఎక్కడుండెను? ఎవరో చెప్పండి?' తండ్రి ఇట్లు బదులు చెప్పెను. 'అమ్మా! గోవిందుడే నీ భర్త, నీవు మనసారా పిలిచినచో అతడే తప్పక నీ దగ్గరకు వచ్చును. ఆ బాలవితంతువు తండ్రిమాటను విశ్వసించి ఒక గదిలోనికిపోయి లోన గొళ్లెము పెట్టుకొని ఎలుగెత్తి ఏడ్చెను. 'ఓ గోవిందా! ఎక్కడున్నావు? నీవు రా. వచ్చి నాకు కనుపించు. నీ వెంతకు వచ్చుటలేదు' అని విలపింపసాగెను. ఆ విలాపానికి తాళలేక గోవిందుడు పరుగున వచ్చి దర్శన మిచ్చెను. పలయునది పసిబాలుర విశ్వాసము. అటుపై తల్లిని చూడవలెనను వ్యాకులత. ఈ వ్యాకులత కలిగినచో అరుణోదయమైనట్లే. అరుణోదయమైన వెంటనే

సూర్యుడుదయించును. ఇట్టి వ్యాకులత కలిగిన వెంటనే భగవద్దర్శనము కలుగును.

'జటిలుడు' అను చిన్నబాలకుని కథ కలదు. అతడు పాఠశాలకు పోయెడివాడు. బడికిపోవుదారిలో చిన్న అడవిని దాటిపోవలెను. అడవి దాటునపుడు వానికి చాల భయము వేసెను. బాలుడు తన తల్లికది తెల్పెను, వానితల్లి ఇట్లు పల్కెను. 'నీకేమి భయము నాయనా! నీకు భయము కలిగినచో వెంటనే మధుసూదనుని పిలువుము' బాలుడు 'మధుసూదనుడెవరమ్మా?' అని అడిగెను. 'మీ అన్నయ్య' అని తల్లి బదులు చెప్పెను. మరునాడు బడికి పోవునపుడు అడవిలో భయపడి ఆ బాలుడు 'మధుసూదనన్నయ్యా! అని పిల్చెను. కాని అచ్చట చుట్టుపట్ల ఎవ్వరూ కనపడలేదు. అంత వానికి భయమెక్కువై బిగ్గరగా ఏడ్చుచు 'ఓ మధుసూదనన్నయ్యా! ఎక్కడున్నావు? తొందరగా రా. నాకు చాల భయముగా ఉంది.' అని కేకలిడెను. వాని ఆర్తనాదము విని భగవంతుడు ఊరకుండలేక పోయెను. వెంటనే వచ్చి 'ఇదిగో నేను వచ్చాను. నీకింకేమి భయము?' అని పలికి చేయిపట్టుకొని బడివద్ద వదలిపెట్టి 'నీ వెప్పుడు పిలిస్తే అప్పుడు వస్తాను' అని చెప్పిపోయెను. భయమెందుకు? కావలసినది ఇట్టి పసిబిడ్డల విశ్వాసము. ఇట్టి వ్యాకులత.

ఒకానొక బ్రాహ్మణుని ఇంటిలో దేవతార్చన రోజూ జరిగేది. ఒక దినము పూజ ముగిసిన పిదప ఆ బ్రాహ్మణుడు పనిమీద ఇంకొక ఊరికి పోవలసియుండెను. అందుచే తన చిన్నకుమారుని పిలిచి 'నాయనా! నేను పనిమీద పోవుచున్నాను. నీవీదినము దేవునికి నైవేద్యము పెట్టుము' అని చెప్పివెళ్లెను. బాలుడట్లే సరియైన వేళకు పీటవేసి నీళ్లుపెట్టి పళ్లెములలో నైవేద్యము చక్కగా అమర్చి పూజాగృహములోనికి తెచ్చి దేవునిముందర పెట్టి మెదలకుండ కూర్చొనెను. దేవుడు వచ్చి పీటమీద కూర్చొని భుజించిపోవునని యే తలంచుచుండెను. కాని ఎంతసేపటికి దేవుడు రావడమే లేదు. చాలసేపైన తరువాత ఓపిక పట్టలేక 'దేవుడా! వచ్చి తినిపో. నేనింక కూర్చోలేక పోతున్నాను! అని ఎంతో బ్రతిమాలుకొనెను. దేవుడు మారు పలుకలేదు. వచ్చి భుజింపలేదు. తరువాత ఆ బాలుడు ఏడ్చుచూ 'దేవుడా! మా నాన్నగారు నీకు నైవేద్యము పెట్టమని చెప్పిపోయినారు. నేను పెట్టిన నైవేద్యము తినడము లేదేమి?' అని అడుగగా భగవంతుడు నవ్వుచూవచ్చి నైవేద్యము నంతయు తినిపోయెను. అటుపై బాలుడు దేవునింటినుండి బయటకురాగా ఇంటివారు ప్రసాదము తీసికొనిరమ్మని చెప్పిరి. ప్రసాదమేమియు మిగులలేదు. దేవుడే అంతా తినిపోయెనని బాలుడు చెప్పగా ఇంటివారందరు దేవునింటిలోకి వచ్చిచూచి ఆశ్చర్యపడిరి.

(సశేషం)

# ప్రత్యక్ష దైవం

చిర్రావూరు వెంకట్రావు

ఋగ్వేదకాలంనుంచి భారతీయులు ప్రకృతిని ఆరాధించటం నేర్చుకున్నారు. ప్రకృతిలో ఆత్మ వుందని వారు చక్కగా గ్రహించారు. భూమి, నీరు, వాయువు, అగ్ని వర్షము మొదలైన ప్రకృతి సంబంధమైన వస్తువులు దైవశక్తితో కూడినవని వారి బుద్ధికి తోచింది. అలాంటి ప్రకృతి సంబంధమైన వస్తువులలో సూర్యునకు అగ్రస్థానం ఇవ్వబడింది. ఆ నాటి నుండి ఈ నాటివరకు సూర్యుణ్ని ప్రత్యక్ష దైవంగా ఆరాధించటం భారతీయులకు ఆచారమైంది.

కనబడుతున్న ప్రకృతిలో సూర్యుణ్ని దైవంగా భావించటం తగివుంది. ఎందుకనగా ప్రకృతిపదార్థంగావున్న సూర్యుడు, మనకు దైవత్వాన్ని వివరించి చూపుటకు చక్కగా తగివున్నాడు.

ఇతర దైవాలను ఆరాధించేటప్పుడు వారిని గురించి మనసులో భావించుకుంటాం. మనసులో భావించలేనివారు విగ్రహాలు లేక చిహ్నాల మూలంగా ధ్యానిస్తారు. మూల పదార్థం జ్ఞాపకం చేయటానికే విగ్రహాలుకాని విగ్రహాలే మూలపదార్థం కాదు.

సూర్యుని ధ్యానించుటకు విగ్రహాలు కాని చిహ్నాలు కాని అవసరంలేదు. దేవాలయం నిర్మించే అవసరం అసలేలేదు. కంటి కెదురుగా ఆకాశంలో సూర్యనారాయణ కనుపిస్తున్నాడు. ఉదయం మధ్యాహ్నం, సాయంత్రం, నమస్కరించి ధ్యానించటం పవిత్రమైన ఆచారంగా ఉంది. ఆరాధించేవారికి ఎదురుగా కనిపిస్తున్నందువల్ల సూర్యుడు ప్రత్యక్ష దైవమని చెప్పటం సబబుగా వుంటుంది.

సూర్యనారాయణ చాలా దూరంలో ఉన్నాడు. అందువల్ల ఎంత పెద్దవాడో మనకు తెలియటంలేదు. దాన్ని గురించి మనం ఆలోచించటంగూడ లేదు. మనకు సూర్యునకు గల దూరం తొమ్మిదికోట్ల మైళ్లకు కొంచెం జాస్తిగానే వుంటుంది. భూమికంటె ఎన్నో రెట్లు సూర్యుడు పెద్దగా ఉన్నాడు ఆ సూర్యునిలో నుంచి చెదరిపడిన ఒక ముక్క ఈ భూమి. మొదట నిప్పుముద్దగానే వుండి అది చల్లబడుటకు చాలా కాలం పట్టింది. ఇప్పటికి భూమి లోపలిభాగం వేడిగావుండటం చూస్తున్నాం. అప్పుడప్పుడు కొన్నిచోట్ల భూకంపం జరిగినప్పుడు భూమిని పగులగొట్టుకొని అగ్ని రావటం చూస్తున్నాం.

దీని ఆధారంగా భగవంతునకు ప్రపంచానికి గల సంబంధాన్ని ఊహించవచ్చు. మూల పదార్థం భగవంతుడు. భగవంతునిలోనుంచి వచ్చిన పదార్థం ఈ విశ్వం.

భగవంతుని ప్రకాశమే మొత్తం ప్రపంచానికి వెలుగునిస్తూవుంది. పరమాత్మయైన భగవంతునిగాని అతని ప్రకాశాన్నిగాని స్థూల దృష్టితో చూచుటకు వీలుకాదు. కాని పరమాత్మ ప్రతినిధిగావున్న సూర్యప్రకాశాన్ని ఆధారంగా భగవంతుని ప్రకాశాన్ని తెలుసుకోవచ్చు. ఏది తాను ప్రకాశిస్తూ ఇతర వస్తువులను ప్రకాశింపజేయునో అదే స్వయం ప్రకాశమైన పరమాత్మయని చెప్పబడుతుంది.

భూమి చంద్రుడు సూర్యునిలో నుంచి వచ్చినవైనప్పటికి వాటికి స్వయంప్రకాశం లేదు. సూర్యుడు తానే జ్యోతిమూర్తిగావుండి భూమికి చంద్రునకు వెలుగు నిస్తున్నాడు. కాబట్టి ప్రకృతి పదార్థాలలో సూర్యుడు పరమాత్మ చిహ్నముగా తగియున్నాడు

సూర్యుడు తన వెలుగునిచ్చి భూమిని ఇతర గ్రహాలను కాపాడుచున్నాడు. ఎడతెరిపిలేక

వానివద్దనుంచివచ్చు కాంతి కిరణాలవల్ల లోకం జీవిస్తూవుంది. కాంతికిరణాలు వెదజల్లుచూ ఉన్నా కొరతలేని పూర్ణస్వరూపిగా ఉన్నాడు. భగవంతుడు పరిపూర్ణస్వరూపుడనే భావం కలుగుటకు కూడ సూర్యుడు ఉదాహరణగా వున్నాడు.

జీవులమైన మనయందుండు ప్రకాశం పరమాత్ముని ప్రకాశమే. పరమాత్మునకు అన్యమైన ఆత్మజ్యోతి మనవద్దలేదు. పరమాత్మ మూలపురుషుడు. అతని ప్రతిబింబాలమే మనం ఈ విషయం గ్రంథాల పరిశోధనమూలంగా తెలియబడదు. ఆత్మజ్ఞానం ఉన్నవారికే తెలుస్తుంది. దీనిని తెలుసుకోలేని మనకు పరమేశ్వరరూపంగా సూర్యుడున్నాడు. ఆ సూర్యుని వద్దనుండి గ్రహించిన వెలుగుతో చంద్రుడు ప్రకాశించినట్లు జీవాత్మ యున్నాడు. చంద్రుడు అను శరీరము సూర్యునినుండి వచ్చింది. వెన్నెలయను ప్రకాశము సూర్యునివల్లనే కలిగింది.

వేసవికాలంలో వేడిని భరించలేక చల్లని నీటిలో స్నానం చేస్తున్నాం. ఆ నీటిలోని వేడి చాలా సామాన్యంగా వుండి మన జీవితానికి తగివుంది గనుక ఆనందం కలిగిస్తూవుంది. ఉత్తర దక్షిణ ధృవాలలోవున్న నీటిలోగాని కరిగెడి మంచులోగాని కొద్దిసేపుంటే ప్రాణాలకు ముప్పువస్తుంది. ఎందుకంటే ఆ నీరు సూర్యరశ్మి కొంచెమైనను లేని నీరని అర్థం. నీటిలోని వేడిమిని పూర్తిగా తీసివేసిన ఆ నీరే గడ్డకట్టును. అటువంటి మంచుగడ్డల మధ్య చిక్కినప్పుడు ప్రాణాపాయం కలుగుతుంది. కనుక ఈ భూమియందు ఆదిత్యుని ఆధిక్యత లేనిచోట వున్న వాతావరణం మానవ జీవిత విధానానికి పనికిరాదని తెలుస్తూవుంది. సూర్యుని వేడివల్లనే మనం జీవిస్తున్నాం. మన శరీరంలోని ఉష్ణము అతనినుండి సంక్రమించినదే. శరీరంలో వేడి వున్నంతవరకు ప్రాణం వుంటుంది. శీతలం కమ్మితే జీవం పోతుంది. కనుక ఉష్ణమే ప్రాణాలు నిలవటానికి కారణమని స్పష్టంగా తెలుస్తూవుంది.

మనజీవితమనే అగ్నికి ఆహారం అనే కట్టెలు కావలసివుంది. ఆహారమనే కట్టెలను శరీరమనే పొయ్యిలోని జఠరాగ్నిలో వేస్తున్నాం ఆహారం తీసుకొని జఠరాగ్ని నిలుస్తుంది. అది నిలిచినసంతకాలం మానవులు జీవిస్తారు. మనం భుజించే ఆహారం సూర్యరశ్మితో తయారయింది. సూర్యరశ్మిలేని మంచుప్రదేశమందు చెట్లుచేమలు పెరుగవు. ఆహారపదార్థాలు పండవు. సూర్యుని వేడిలేనిచోట జీవితంలేదని స్పష్టంగా తెలుస్తుంది. చలిప్రదేశాలకు జనులు వెళ్ళి జీవిస్తున్నారంటే వారు భోజనపదార్థాలు వంటచెరుకు తీసుకొని పోతున్నారు. ఆ వస్తువులు మారురూపంలోవున్న సూర్యుని వేడిమే అవుతున్నాయి. వంటకు కట్టెలు కావాలి. కట్టెలతో వంటచేస్తున్నాం. ఆ వంట కొత్తరూపమెత్తిన సూర్యుని వేడియే. భూమినుండి బొగ్గునుతీసి నిప్పుచేస్తున్నాము. ఆ బొగ్గు పూర్వము సూర్యునినుండి వచ్చిన వేడి చిహ్నమే. భూమిలోనుండి నూనెనుతీసి పొయ్యి మండిస్తున్నాము. అదిగూడ సూర్యునినుండి వచ్చిన ఉష్ణమే. భూమియందు ఏ వస్తువు చూచినా సూర్యుని వేడియొక్క వేర్వేరు లీలలుగా గోచరిస్తుంది. సూర్యుని వేడిలేనిదే మానవులు, జంతువులు, వృక్షాలు, పక్షులు జీవించలేవని స్పష్టంగా తెలుస్తుంది. అందువల్ల సూర్యుడు శక్తివంతుడైన ప్రత్యక్ష దైవమని చెప్పబడుతున్నాడు.

విశ్వరూపియైన విరాట్పురుషుని కండ్లనుండి సూర్యుడు వచ్చాడనీ, ఆదిపురుషునియొక్క నేత్రమే సూర్యుడనీ, వేదాలు, శాస్త్రాలు

చెపుతున్నాయి. ఈ సూర్యుడే మనకండ్లకు అధిష్టానదైవంగా వున్నాడు.

గ్రహాలు సూర్యుని చుట్టివస్తున్నాయి. ఆ విధంగానే భూమికూడ చుట్టివస్తుంది. కాని సూర్యుడే తిరుగుతున్నట్లు కనపిస్తున్నాడు. ఒక వస్తువుయొక్క నిజస్వరూపం మన ఇంద్రియాలు ఉన్నదున్నట్లు గ్రహించలేదనటానికి ఇది చక్కని ఉదాహరణ మవుతుంది.

చీకటిని పోగొట్టువాడు సూర్యుడు – భూలోకానికి దేవలోకానికి అంతరిక్షానికి వెలుగును ఇస్తున్నాడు. అతడు పది దిక్కులు చూడగలవాడు. అతని దృష్టి కందనిదేదియు లేదు. ప్రాణుల ప్రతి కదలికకు అతడు సాక్షీభూతుడుగా ఉన్నాడు. నిద్రించువానిని తట్టి లేపుచున్నాడు. కర్మ చేయనివారిచేత కర్మ చేయించుచున్నాడు, జబ్బులను తొలగించు శక్తి అతనికి గలదు. బాధలు రాకుండ అడ్డగించగలడు.

అభయ మొసగువాడు నారాయణుడని ప్రతీతి. ప్రాణుల భయమును పోగొట్టువాడు సూర్యనారాయణ. చీకటి కమ్మిన వేళ ప్రాణులు ఏదేదో ఊహించుకొని భయభ్రాంతులవుతారు – సూర్యోదయం కాగానే భయాలన్నీ పారిపోతున్నాయి. కొత్తప్రాణం వచ్చినట్లవుతోంది – కనుక అభయ మొసగువాడు ఆదిత్యుడు. దేవునకు కాలస్వరూపుడనే పేరుంది. మనము కంటికెదురుగా సూర్యునియందు దానిని చూస్తున్నాము. వాని సహాయం లేకపోతే కాలాన్ని కొలవటం మన సాధ్యంకాదు. వేళను రాత్రింబవళ్లుగా విభజించటానికి అతడు సహాయపడుతున్నాడు, కనుక అతనినే కాలస్వరూపుడు అనటం ఉచితంగా వుంటుంది. మంచివారిపైనా చెడ్డవారిపైనా ఒకే విధంగా సమున [illegible] ఉన్నాడు. ఎవరేవృత్తి చేయాలనుకున్నా తగిన ప్రోత్సాహమిస్తున్నాడు. అందువల్ల జీవుల కందరకు వరప్రసాదియని చెప్పవచ్చును.

ఆరు మతాల్లో సౌరమతం ఒకటి. సూర్యుడ్ని ప్రధానంగా కొలిచేవారంతా సౌరమతస్థులవుతున్నారు. సూర్యుని వెలుగు అన్ని దిక్కులకు విస్తరించి అన్నిటిలో లీనమైనట్లే అన్ని మతాల్లోను సౌరమతం లీనమైపోయింది. కాబట్టి సూర్యుణ్ని ధ్యానించటం ప్రతి ఒకడు చేయాల్సినపని. లోకమంతా ఏదో విధంగా సూర్యుని పూజిస్తూనేవుంది. భగవంతుడనే పేరుతోనే పూజిస్తున్నారని అర్థంకాదు. మనకు అవసరమైన వస్తువు ప్రయోజనకారి అని పొగడినా ఆ పొగడ్తకు కూడా ఆరాధన అనే పేరు చెల్లుబాటవుతుంది. ఏదో ఒక విధంగా ప్రాణులన్నీ సూర్యుడ్ని ఆరాధిస్తున్నాయి.

సూర్యమంత్రానికి గాయత్రి అని పేరుంది. ఆ మంత్రం వేదాల్లోని మంత్రా లన్నిటికంటే చాల పవిత్రం అయింది. గాయత్రీ మంత్రాలు అనేకం వున్నాయి. రుద్రగాయత్రీ, దేవీ గాయిత్రీ, విష్ణుగాయిత్రీ, మొదలైన పేరున్నాయి. వాటిలో ప్రథమస్థానం వహించేది సూర్యగాయిత్రీ. కాశ్మీరం మొదలు కన్యాకుమారివరకు సూర్యగాయత్రిని జపించేవారిని అనేకమందిని చూడవచ్చు. అన్ని మతాల వారికి ఇది సమానమైంది. ఒక వృక్షమంతయు బీజంలో అణగియున్నరీతిగా వేదాలన్నీ గాయత్రిలో అణగివున్నాయి, కాబట్టి గాయత్రిని బీజం అని వేదాలను వృక్షమనీ చెప్పొచ్చు.

"ఎవరు మన బుద్ధులను ప్రేరేపించుచున్నారో ఆ జ్యోతి స్వరూపునియొక్క గొప్ప తేజస్సును ధ్యానింతముగాక" అని గాయత్రీ మంత్రమునకు అర్థము. (ఓం భూర్భువస్సువః ... భర్గో దేవస్య ... హి ధియో యో నః ప్రచోదయాత్.)

# దివ్యానుభూతులు

## స్వామి జ్ఞానాత్మానంద

శ్రీ శ్రీ మహారాజ్ పాదాలచెంత మాకు ఆ విధంగా ప్రతి ప్రొద్దు, సాయంత్రమూ దివ్యానుభూతులతో కాలం గడచేది. అయితే ఒకరోజు చిత్రమైన ఒక సంఘటన జరిగింది. ఆ రోజుల్లో శ్రీ రామకృష్ణ మఠాని సేవా సంస్థకు శ్రీ శుద్ధానందస్వామి సహాయ కార్యదర్శిగా ఉండేవారు. పైగా బేలూర్ మఠానికి సంబంధించిన కార్యకలాపాలను కూడా కొన్నిటిని ఆయన నిర్వహించేవారు. అపార పాండితీ ప్రతిభ యేగాక, వినయసంపద, ఆప్యాయత తొణికిసలాడే వ్యక్తిత్వం ఆయనది. మా అందరకూ మా యొక్క విధి నిర్వహణలో ఆయన వ్యక్తిత్వం ఆదర్శప్రాయమై అమితమైన ఉత్సాహాన్ని కలుగజేసేది.

ఒకరోజు మే మందరమూ, అమృత సాదృశమైన శ్రీ శ్రీ మహారాజ్ వాణిని మైమరచి వింటూఉండగా, శ్రీ శుద్ధానందస్వామి, తమ వెంట మఠంయొక్క ముఖ్యాధికారి, మరొక సాధువురాగా, ఆకస్మికంగా అక్కడకువచ్చి, ఆందోళనాపూరిత కంఠంతో "మహారాజ్! మేము మీతో ఒక ముఖ్య విషయం విన్నవించుకోవాలి" అని అన్నారు. తమ అంతర్దృష్టితో సర్వమూ గ్రహించినా శ్రీ శ్రీ మహారాజ్ "మంచిది సుధీర్! (శ్రీ శుద్ధానంద స్వామి) నీవు చెప్పదలచుకున్నది ఏమో తెలియచెయ్యి" అని ప్రత్యుత్తరించారు.

ఈ విధంగా శ్రీ శ్రీ మహారాజ్ అనుజ్ఞ ఇచ్చిన తర్వాత శ్రీ శుద్ధానందస్వామి చెప్పనారంభించారు: "మహారాజ్! వీ రందరూ మీ సన్నిధానంలో కూర్చుని అమూల్యమైన మీ సూక్తులను గ్రహిస్తున్నారు. అయితే మఠంయొక్క కార్యనిర్వహణలో మాత్రం వీరి సహాయం మృగ్యం. ఈ పరిస్థితి ఇలానే కొనసాగితే మఠంయొక్క కార్యనిర్వహణ చాల కష్టమవుతుంది. కనుక మఠంలో నివసిస్తూ కూడా, దానికి సంబంధించిన పనులలో సహాయపడని వారందరినీ మఠంనుంచి శాశ్వతంగా పంపించి వేయడానికి మీ అనుమతి ఇవ్వమని మా అభ్యర్థన." ఇదంతా వింటూ శ్రీ శ్రీ మహారాజ్ ప్రత్యుత్తరంగా ఒక్క మాటకూడా మాట్లాడలేదు. అయితే శ్రీ శుద్ధానందస్వామి తమ అభ్యర్థన మరింత విశదీకరిస్తో "మహారాజ్! మాది ఇంకొక విన్నపం కూడా ఉంది. ఇక్కడినుంచి పంపివేసినవారికి మీ దగ్గర తిరిగి ఆశ్రయం పొందే అవకాశం మాత్రం కలగరాదని మా వినతి," అని చెప్పినప్పుడు శ్రీ శ్రీ మహాజ్ తమ మౌనస్థితిని కొనసాగించలేక పోయారు. ప్రస్ఫుటంగా ఆందోళన వ్యక్తమయ్యే కంఠంతో ఆయన అన్నారు: "నువ్వు అనేది ఏమిటి సుధీర్? నీకు పని తప్ప వేరే ధ్యాసలేదు. ఈ పసివాళ్ళు ఏ ఆధ్యాత్మిక సత్యాన్వేషణ నిమిత్తం స్వజనాన్ని, తమ సర్వస్వాన్ని త్యజించి ఈ ప్రదేశానికి వచ్చారో ఆ అన్వేషణలో ఏమైనా అభివృద్ధి సాధించారో లేదో, ఏనాడైనా నీవు వాళ్ళని అడిగావా? వారు ఎంత కాలాన్ని జపానికి, ధ్యానానికి వినియోగిస్తున్నారో నీవు ఏ నాడైనా గమనించావా? నేను గ్రహించింది ఏమంటే ఈ విషయంలో వీరందరి కృషి దాదాపు ఏమీ లేదు. కొంతమంది కనీసం ఆరాత్రికంలోనైనా పాల్గొంటున్నారు. మరికొందరి విషయంలో అదికూడా లేదు. ఇది గ్రహించే నేను వారందరూ నా దగ్గర కూర్చునేలా చేస్తున్నాను. సాధన, భజన మొదలైన విషయాలలో నీ అనుభవంలో గ్రహించిన సూక్ష్మాలను వారితో

పంచుకోనకుండా ఉండటమేగాక, ఎప్పుడూ పనిని గురించి మాట్లాడటమేనా ?''

ఈ సమయంలో అక్కడఉన్న ఒక సాధువు, ఈ సంభాషణలో పాల్గొంటూ, వ్యంగ్యంగా ''ఈపసివాళ్లు ఇప్పటికే సర్వజ్ఞులు! మన దగ్గరనుంచి వారు నేర్చుకొనేది ఏముంది?'' అని అన్నారు. ''ఏమిటి నువ్వనేది బాబూ ? వాస్తవానికి వీళ్ళకు తెలిసినది ఏపాటిది ? ఇప్పుడేకదా వీరందరూ తమ స్వజనాన్ని విడిచి ఇక్కడకు రావటం ! మీలాంటివారు వారికి మార్గదర్శకులై వారికి అవసరమైన విషయాలను తెలియచెప్పందే వేరెవరి వద్దనుంచి వారు ఇవి గ్రహించగలరు ? చూడు నాయనా! ఒకదాన్ని నీవు పొందాలంటే వేరొక విషయాన్ని నీవు తప్పక త్యజించాలి. సోదరుడు హరిని (శ్రీ తురీయానందస్వామి) సేవించడానికి యువకులు వారణాసికి వెళ్ళడం నీవు గమనించలేదా ? ఇక్కడ పరిస్థితి చూశావు కదా! మనకు ఒక్క పరిచారకుడు కూడా దొరకటం దుర్లభంగా ఉంది. అక్కడ ఆ యువకులకు కావలసినది దొరుకుతోందని అన్న మాట. ఇక్కడ అది దొరకటంలేదన్నది స్పష్టమేకదా !''

శ్రీ శ్రీ మహరాజ్ తమ ప్రసంగాన్ని కొనసాగిస్తూ సుధీర్ మహరాజ్ వైపు తిరిగి అన్నారు. ''సుధీర్ ! వీళ్ళని అవసరమైతే పంపివేయడానికి మా అనుమతిని అడుగుతున్నావు సరే, అల్లాగే చేయి. కాని వారికోసం నా ద్వారాలు మాత్రం ఎల్లప్పుడూ తెరచే ఉంటాయి. నాకు, ఎవ్వరినీ ఇక్కడనుంచి వెళ్ళగొట్టే శక్తిగాని, అధికారంగాని లేవు. నీవు పనిగురించే మాట్లాడుతున్నావు. మంచిదే, కాని సాధనకు, భజనకు తమ్ముతాము అంకితం చేసుకొనే సాధువుల అవసరం కూడా ఈ పరిస్థితులలో ఎంతైనా ఉంది.

శ్రీ శ్రీ మహరాజ్ యొక్క ఈ మాటలను విని మేము ఆశ్చర్యపోయాము. ఆయన అపారమైన కరుణని మా ఆధ్యాత్మిక అభివృద్ధి కోసం ఆయన పడే తపనను గ్రహించి మా హృదయాలన్నీ ఆశ్చర్యానందాలలో మునిగినాయి.

శ్రీ మహాపురుష్ మహరాజ్ మమ్మల్నందర్నీ తండ్రికంటెకూడా ఆపేక్షతతో చూచేవారు. ఒకరోజు ఆయన తమవెంట కొంతమంది బ్రహ్మచారులను తీసుకొని, శ్రీ శ్రీ మహరాజ్ దగ్గరకు వెళ్ళి ఈవిధంగా అన్నారు. ''మహరాజ్ ! ఈ పిల్లలు ఇంతక్రితమే మనతో వచ్చి చేరారు. మీ దగ్గర 'దీక్ష' గ్రహించాలని వీరందరి ప్రగాఢ ఆకాంక్ష. మీరు 'దీక్ష' నొసగి వీళ్ళని ధన్యుల్ని చేస్తారని వీరు గాఢంగా నమ్ముతున్నారు.'' దీనికి సమాధానంగా శ్రీ శ్రీ మహరాజ్ ఆ సమయంలో ఒక్కమాటగూడా మాట్లాడలేదు. అయితే వేరొక సందర్భంలో మేమందరమూ ఆయన దగ్గర కూర్చుని ఉండగా శ్రీ శ్రీ మహరాజ్ అన్నారు. ''మీకందరకూ 'దీక్ష' ఇవ్వమని అడిగారు కదా? ఈ కాంక్ష నిజమే అయితే మీ మీ (మానసిక) అరణ్యాలని నాశనం చేయండి. శమ, దమ, ఉపరతి, తితీక్ష మొదలైన సాధన నియమాల్ని పాటించడం ప్రారంభించండి. దీని తర్వాత నా దగ్గరకు రండి దీక్షకోసం. శుభ్రపరచని నేలలో బీజాలను నాటి మాత్రం ప్రయోజనం ఏముంది?''

ఈ విధంగా అన్నప్పటికీ, శ్రీ శ్రీ మహరాజ్ మాపట్ల వాత్సల్యభావం వహించి, మాలో కొందరకు 'దీక్ష' ఇచ్చారు 'దీక్ష' గ్రహించినమర్నాడు మేము ఆయనదర్శనం కోసం వెళ్లినపుడు ఆయన కరుణార్ద్రమైన చూపులతో మా కేసిచూస్తూ అన్నారు: ''చూడండి ! కాళీ (శ్రీ అభేదానందస్వామి) మా

అందరిలాగా, మీలో ఎవ్వరూ 'భిక్ష' కోసం వెళ్ళటంలేదని అంటున్నాడు. రివ్రాజకుల కఠినమైన జీవితాన్ని మీరెవ్వరూ చవి చూడ లేదు. 'దీక్ష' గ్రహించి బ్రహ్మచారులయ్యారు కదా! మూడురోజులు 'భిక్ష' చేసుకుని జీవించండి. ఇది చాలామంచి సూచనకదా!'' శ్రీ శ్రీ మహరాజ్ మాటలలోని సత్యాన్ని-మా పట్ల ఆయనకు గల ఆప్యాయతను, గ్రహించి మేము'' శ్రీ శ్రీ మహరాజ్! మీరు ఆనతి ఇచ్చినట్లే మేమందరం మూడురోజులు 'భిక్ష' చేసుకుని జీవిస్తాము''

శ్రీ అభేదానందస్వామి అమెరికా దేశంలో ఇరవైఅయిదేళ్ళ సుదీర్ఘ నివాసానంతరం భారతదేశానికి తిరిగి వచ్చారు– అప్పుడే. వారు, వారి సోదర శిష్యులు తమ సాధన కాలంలో ఎన్నో క్లిష్టమైన పరిస్థితులను ఎదుర్కొన్నారు. భిక్ష దొరకనందువల్ల ఎన్ని రోజులు వారు పూర్తిగా లేక పాక్షికంగా ఉపవాసం ఉన్నారో! స్వామి ఈ విశేషాలన్నీ ఎప్పుడూ చెపుతూ ఉండేవారు – చెప్పి మేమందరమూ కూడా ఈ రకమైన కష్టాలను అనుభవించాలి అని అనేవారు. శ్రీ శ్రీ మహరాజ్‌తో తరచు ఈ విషయం మీద ప్రసంగం వచ్చేది. అయితే శ్రీ కాళీ మహరాజ్ చాలా కాలం దేశంవదలి బయట ఉండటంవల్ల, ఈ మధ్యలో దేశ వాతావరణంలోనూ, సాంఘిక పరిస్థితులలోనూ – ముఖ్యముగా మా తరంవారి శారీరక, మానసిక ప్రవృత్తులలోనూ – కలిగిన మార్పులు అంతగా అవగాహన చేసుకొనలేదేమో! మిగతావారు మాత్రం ఇవి అర్థం చేసుకుని ఆ విధమైన కఠినమైన నియమాలను మేమెవ్వరమూ పాటించనవసరం లేకుండా చేశేవారు.

ఏది ఎలాఉన్నా, మేము 'భిక్ష' కోసం బయటకు వెళ్ళడానికి నిర్ణయించుకుని, బయల్దేరుతుండగా, శ్రీ శ్రీ మహరాజ్ సేవకులొకరు వచ్చి కొత్తగా 'దీక్ష' గ్రహించిన బ్రహ్మచారులనందరినీ శ్రీ శ్రీ మహరాజ్ రమ్మంటున్నారని సందేశం తెచ్చారు.

ఆయన సన్నిధికి వెళ్ళగానే, శ్రీ శ్రీ మహరాజ్ అమితమైన ప్రేమ ధ్వనించే కంఠంతో అడిగారు. ''మీరు 'భిక్ష' కోసం వెళుతున్నారుకదా?'' ''అవును, మహరాజ్!'' అని మేము అన్నాం. ఇది వినగానే మరింత అప్యాయతను వ్యక్తపరుస్తూ ఆయన అన్నారు. ''చూడండి! సుజ్జీ (శ్రీ శ్రీ మహరాజ్ సేవకులలో ఒకరై, 'శ్రీ నిర్వేదానందస్వామి' అని తరువాత పిలువబడిన శ్రీ సూర్య మహరాజ్) ఈ 5 రూపాయలు మీ 'భిక్ష' కోసం ఇచ్చాడు. ఈ డబ్బుతో బియ్యం, అవసరమైన మిగతా సంభారాలు కొనుక్కుని మన మఠావరణలోనే ఏదైనా చెట్టునీడను పచనం చేసుకుని తినండి. అది 'భిక్ష'తో సమానంగా గ్రహించవచ్చును.'' శ్రీ శ్రీ మహరాజ్ అంతరంగంలోని వాత్సల్యభావాన్ని మేము గ్రహించి, ఆయన ఆదేశించినట్లే చేశాం. శ్రీ మహాపురుష్ మహరాజ్ కూడా మా దగ్గరకు వచ్చి, 'భిక్ష'తో తయారైన అన్నం చాలా పవిత్రమైనది'' అని అంటూ ఆ అన్నం కొంచెం తీసుకుని, చాలా రుచిగా ఉందని ప్రశంసిస్తూ మాతోపాటు తిన్నారు. ఆ తర్వాత రెండు రోజులుకూడా మా 'భిక్ష' ఇదే విధంగా జరిగిందని నాకు జ్ఞాపకం. దీనివల్ల మేమెవ్వరమూ ఒక్కరోజుకూడా భిక్షార్థం బయటకు వెళ్ళవలసిన అగత్యం లేకపోయింది. ఈ విధంగా శ్రీ శ్రీ మహరాజ్ మాతృసమానమైన ప్రేమతో మమ్మల్ని చూస్తూ, తర్ఫీదు ఇచ్చేవారు.

అయితే, ఆ ఏడాది మరెవ్వరకూ 'దీక్ష' ఇవ్వబడలేదు. మరుసటి సంవత్సరం—1922

లో—శ్రీ శ్రీ మహరాజ్ కాశీ క్షేత్రానికి వెళుతూ దారిలో రెండు రోజులు మఠంలో ఆగారు. వారణాసిలో నెలకొనిఉన్న రెండు మఠ కేంద్రాలు సక్రమంగా నడవటంలేదని మాకు తెలియవచ్చింది. పరిస్థితి చక్కదిద్దటానికే శ్రీ శ్రీ మహరాజ్‌ని, శ్రీ శారదానందస్వామి వారణాసి తీసుకువెళుతున్నట్లు మాకు తెలిసింది.

కొన్ని రోజుల తర్వాత శ్రీ మహరాజ్ వారణాసి చేరుకున్నారు. ఎవ్వరినీ ఏమీ ప్రశ్నించకుండా కేవలం తమ దివ్యప్రేమతో రెండు ఆశ్రమాలను పునీతం చేయసాగారని మాకు తెలియవచ్చింది. ఉదయమూ, సాయంకాలమే కాక, ఎప్పుడెప్పుడు విరామం దొరకినా, అక్కడున్న సాధుపురుషులు, బ్రహ్మచారులు శ్రీ శ్రీ మహరాజ్ దివ్య సాంగత్యాన్ని, సంభాషణను ఆస్వాదించసాగారు. త్వరలోనే అన్నిరకాల సంఘర్షణలు, అభిప్రాయభేదాలు సమసిపోయాయి. అక్కడ ఉన్న, శ్రీ వివేకానందస్వామి శిష్యులు, ఏనాడూ సన్న్యాసాశ్రమాన్ని స్వీకరిద్దామని తలపుకూడా లేని కొందరు 'కర్మయోగులు', సైతమూ ఒకరి తర్వాత ఒకరు శ్రీ శ్రీ మహరాజ్ వద్దకు వచ్చి సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించడం ప్రారంభించారు. సాధనాపథంలో 'కర్మ' ఒక బలమైన అవరోధమని తలచని వారుకూడా, "నిష్కామకర్మ" యొక్క నిజతత్త్వాన్ని గ్రహించి, క్రమేణా ఈ ఆదర్శానికి తమ్ము తాము అంకితం చేసుకొనసాగారు. శ్రీ శ్రీ మహరాజ్ అద్భుత వ్యక్తిత్వం ఆ రెండు ఆశ్రమాలనేగాక, వారణాసి నగరాన్నే దివ్యప్రేమ వాహినిలో ముంచివేసినది.

ఈ విషయాలన్నిటినీ విశదీకరిస్తో ఆ సమయంలో వారణాసిలోని అద్వైత ఆశ్రమంలో ఉన్న ఒక బ్రహ్మచారి తన సోదర శిష్యునికి లేఖ వ్రాసాడు. ఆ లేఖను శ్రీ మహాపురుష్‌కి చూపించగా, ఆయన ఆ లేఖను గౌరవ సూచకంగా తన లలాటానికి మరల మరల అద్దుకుని వందనం చేస్తో ఆతనితో ఇలా అన్నారు: "ఈ సంఘటనలలో ఆశ్చర్య మేముంది? ఏ పరమ పురుషుడి తాత్కాలిక, క్షణమాత్ర సందర్శనమైనా మన హృదయాలను అపారమైన ఆనందానుభూతితో నింపుతుందో, ఆ పరమపురుషుణ్ణి ఎల్లవేళలా దర్శించే పురుష పుంగవుడు అక్కడ నివసించి ఉండగా ఈ విధంగా జరగదా? ఈ విధంగా జరిగితే దీనిలో విస్మయం చెందవలసినది ఏమున్నది? అయితే, ఒక విషయం మాత్రం నీవు నీ స్నేహితునికి తెలియజేయి: ఎవ్వరూ శ్రీ శ్రీ మహరాజ్ దివ్యసన్నిధిని విడనాడకుండా ఉండెదరుగాక! తమ తమ ఆత్మ సంతృప్తిగా ఆ దివ్యమూర్తి సాన్నిధ్యాన్ని అనుభవించెదరుగాక!"

ఈ సంఘటన మమ్మల్ని పూర్తిగా అవాక్కుల్ని చేసింది. కాని ఒక విషయం మాకు సుస్పష్టంగా తెలిసింది; మహాపురుషుడే వేరొక మహా పురుషుణ్ణి అర్థం చేసుకోగలడని.

వారణాసిని తమ దివ్యప్రేమ అనే కెరటాలలో ఓలలాడించి శ్రీ శ్రీ మహరాజ్ మఠానికి తిరిగి వచ్చారు. ఈ సారి ఆయన మరింత దయాళువుగా కానవచ్చారు. ఒకరోజు శ్రీ మహాపురుష్ మహరాజ్‌తో ఆయన అన్నారు: "తారక్‌దా! వీళ్ళందరకు (మమ్మల్ని చూపుతో) నేను 'దీక్ష' ఇవ్వదలచాను. అయితే ఈ సారి ఉచితంగా మాత్రం ఇచ్చేది లేదు! ప్రతి ఒక్కరు రూ 101/- 'దక్షిణ'గా ఇచ్చుకోవాల్సి ఉంటుంది! నీ అభిప్రాయం ఏమిటి?" శ్రీ మహాపురుష్ మహరాజ్, శ్రీ శ్రీ మహరాజ్ ఛలోక్తిని అర్థం చేసుకుని, శిరఃకంపనం చేస్తో అన్నారు: "అవును! వారికి మీరు ఉచితంగా 'దీక్ష' ఎందుకు

ఇవ్వాలి? ప్రతి ఒక్కరు 101 రూపాయల్ని సేకరించవలసినదే!'' మాకేగాక, వారిద్దరకూ కూడా, మేము ఈ మొత్తాన్ని సంపాదించటం అసంభవమని పూర్తిగా తెలుసును.

కాలక్రమాన మేమందరమూ 'దీక్ష'ను పొందాము. అయితే 'దీక్ష' ముగిసిన తర్వాత మేము శ్రీ శ్రీ మహారాజ్‌కు నూటొక్క రూపాయలతో కాక, వారే ఒసగిన పళ్ళు, పుష్పాలతో మా 'దక్షిణ' చెల్లించుకున్నాము. ప్రణామం చేస్తూ శ్రీ శ్రీ మహారాజ్ వద్ద 'దీక్ష' గ్రహించి మేమందరమూ ఆనందముతో తన్మయులమయినాము. మా హృదయాలన్నీ, ఆర్ద్రమైన ఆయన దివ్యదృక్కులతోనూ, దివ్యస్పర్శతోనూ, పూర్తిగా నిండినవి. అయితే ఈ ఆనందాతిరేకత త్వరలోనే రాబోయే విపత్తుకు సూచన అని మాత్రం మేము అప్పుడు గ్రహించలేక పోయాము. ఏమంటే – ఒక రకంగా ''శ్రీ శ్రీ మహారాజ్ బహిరంగంగా, అంగడిలో, తమ మృణ్మయ పాత్రను ఛిన్నాభిన్నం చేయబోతున్నారు.'' ఈ కారణాన, ఏ అవధి, సంకోచమూ లేకుండా, తమ అపార సంపదను చివరి బిందువువరకూ మాకు పంచి ఇచ్చి మా జీవితాలను పునీతం చేయసాగారు.

ఈ సంఘటనల తరువాత నేను ఏదో పని మీద మా స్వగ్రామం వెళ్ళవలసివచ్చింది. అక్కడ నేను ఒకరోజు ఏకాంతంగా కూర్చుని ఉండగా నా మనోనేత్రం ముందు శ్రీ శ్రీ మహారాజ్ దివ్యవిగ్రహం గోచరించింది. దీని వెంటనే నాకు అకారణంగా ఈ తలంపు కలిగింది : ''శ్రీ శ్రీ మహారాజ్ నా వారు; నాకు ఆప్తులలో అత్యంత ఆప్తులు; నా గురువు, నా ఇష్టదైవం, నా జీవితానికి ఏకైక మార్గదర్శి.'' ఇది జరిగిన మరుసటిరోజే అని నాకు జ్ఞాపకం, నా మిత్రులలో ఒకరు మఠంనుంచి, ''శ్రీ శ్రీ మహారాజ్‌కు కలరా సోకింది; వెంటనే రావలసింది.'' అని ఉత్తరం వ్రాశారు.

నేను ఆలస్యం చేయకుండా, గుండెలనిండా ఆదుర్దాతో బయల్దేరి మర్నాటికి మఠం చేరుకున్నాను. ఏదో ఒక అనూహ్యమైన పెద్ద విపత్తు రాబోతుందిఅని గ్రహించినట్లుగా మఠమంతా గంభీరమైన నిశ్శబ్దతతో నిండినదని నాకు అనిపించింది. బాగ్ బజారులోని శ్రీ బలరాము మందిరంలో శ్రీ శ్రీ మహారాజ్ అస్వస్థులై ఉన్నారని తెలిసింది. ఆయనను దర్శించడానికి, సేవచేయడానికి సాధువులందరూ గుంపులు గుంపులుగా మందిరానికి వెళ్ళసాగారు. మేముకూడా అక్కడకు వెళ్ళి ఆయన దర్శనం చేసుకొన్నాం. ఇది జరిగిన ఒకటి రెండు రోజుల తర్వాత అనుకుంటాను, శ్రీ శ్రీ మహారాజ్, తమ శిష్యులను, సాధువులను, పిలవనంపి, వారిని దీవించారని, దీవించి, శ్రీ శ్రీ ఠాకుర్ తమ దివ్యదృష్టిలో గోకులంలో శ్రీ కృష్ణునితో ఆడుకుంటున్నట్లు చూచిన గోపాలబాలుడు తానేనని మరల మరల దృఢీకరించారని నేను తెలుసుకున్నాను. ఇది జరిగిన తర్వాత శ్రీ శ్రీ మహారాజ్ తమ లీలను చాలించే సమయం ఆసన్నమయినదని మేము గ్రహించాం. మేము ఊహించినట్లుగానే, ఈ సంఘటన జరిగిన రెండు రోజుల తర్వాత – ఏప్రిల్ 10, 1922న శ్రీ శ్రీ మహారాజ్ తమ లీలను పరిసమాప్తం చేసి దైవసన్నిధికి చేరుకున్నారు.

ఇది జరిగిన కొంతకాలం తర్వాత మేమందరమూ శ్రీ శ్రీ మహారాజ్ దివ్యస్మృతులను గూర్చి చర్చించుకుంటూండగా మాలో ఒకరు అన్నారు : ''ప్రియమైన సోదర శిష్యులారా! శ్రీ శ్రీ మహారాజ్ మనమధ్య నుంచి భౌతి

కంగా వెళ్ళిపోయారు. అయితే, మనందరి లోనూ, నన్నే ఆయన అతి గాఢంగా ప్రేమిం చారని మాత్రం చెప్పగలను.'' ఇంకొక వ్యక్తి కూడా "నేనూ అదే విధంగా, నన్నే ప్రేమిం చారని చెప్పగలను అని అనగా, మూడవ వ్యక్తి కూడా అదే భావాన్ని వ్యక్తం చేశాడు. ఈ ప్రసంగమంతా వింటోన్న మా కంటె పెద్ద వారైన ఒక స్వామి ఈ ప్రేమను ఈ విధంగా విశదీకరించారు: "చూడండి, శ్రీ శ్రీ మహా రాజ్ ప్రేమ అవధులు లేని ఒక మహా సము ద్రం లాంటిది. ఒకటి రెండు బిందువులు మాత్రం మనమీద చిలకరించి ఆయన మనను సంతృప్తిపరచేవారు. అయితే మనలో ప్రతి ఒక్కరం బహుశః ఆ జల సంపదనంతనీ మనం పొందాం అని భావించాం - అయితే ఈ వ్యయంవల్ల ఆ ప్రేమ సముద్రానికి ఏ అభా వమూ రాలేదు. అది ఎప్పటివలనే సంపూ ర్ణంగా ఉంటుంది!'' శ్రీ శ్రీ మహారాజ్ మా ఎడల చూపిన ప్రేమ ఈ విధంగా పవిత్రమూ, అనంతమూ, శుభావహమూ అయినట్టి అపూర్వమైన ప్రేమ!

చాలా సంవత్సరాల తర్వాత మేము హరిద్వార్ (కన్ఖల్) వెళ్ళాము. అక్కడ ఆశ్రమంలో శ్రీ శ్రీ మహారాజ్ జన్మదినో త్సవం జరిగింది. ఆ ఉత్సవంలో, ఆ ఆశ్రమ స్థాపకులైన శ్రీ కల్యాణ్ మహారాజ్, శ్రీ శ్రీ మహారాజ్ దర్శనభాగ్యం పొందిన వారం దరినీ ఆయన గురించి ప్రసంగించమని కోరారు. ఆ సందర్భంలో వారణాసి మఠ వ్యవహారాల గురించి ప్రసంగం రాగా, నేను "శ్రీ శ్రీ మహారాజ్ చాల తెలివైనవారు'' అని అన్నాను. (చాల "లౌక్యులు'' అని అర్థం స్ఫురించేలా) ఇది విని శ్రీ కల్యాణ్ మహారాజ్ చాలా బాధపడుతూ అన్నారు: "వారిని నీవు ఎంతవరకూ అర్థం చేసుకున్నావు బాబూ? నీవు శ్రీ శ్రీ మహారాజ్ తెలివైనవారు అన్నావు కదూ? అయితే ఇది మరువకూడదు: శ్రీ వివేకానందస్వామి ప్రచండ సూర్యుడిలాంటి వారు. మే మెవ్వరమూ ఆయనను సమీపించ లేక పోయేవాళ్ళం. శ్రీ శ్రీ మహారాజ్ చంద్రుడిలాంటివారు. ఆయన చల్లని కాంతిలో మా కందరకూ సేద తీరేది. ఆయన ఎవరిని ఏది చేయమని ఆజ్ఞాపించినా అది అందరి క్షేమంకోసం అని మేము గ్రహించి చేసే వాళ్ళం: అంతేగాని శ్రీ శ్రీ మహారాజ్ మఠానికి అధ్యక్షులని కాదు. అందువల్లనే మేము ఏ సందేహమూ లేక ఆయన ఆజ్ఞ నిర్వర్తించేవాళ్ళం—ఆయన తెలివైనవారు, లౌక్యులనీ కాదు.'' ఇదివిని మేము శ్రీ శ్రీ మహా రాజ్ నిజతత్త్వాన్ని గ్రహించి అమితా నందాన్ని పొందాము.

శ్రీ శ్రీ మహారాజ్ ప్రేమ ఏ విధంగా వ్యక్త మవుతుండేదీ ఆ పద్ధతిని గురించి మరి రెండు మూడు మాటలు వ్రాయటం ప్రస్తుతం కాదనుకుంటాను. ఆయన కనబరచిన ప్రేమ సాధారణంగా మనం చూచే ఆప్యాయతకంటే చాల భిన్నమైనది, విలక్షణమైనది. ఈ విలక్ష ణత ఏమిటంటే: ఆయన ఏ వ్యక్తినైతే అతి గాఢంగా ప్రేమించేవారో ఆ వ్యక్తిని పూర్తిగా అలక్ష్యం చేసినట్లు స్థూలదృష్టికి అనిపించేది. ఆ వ్యక్తులు ఆయన సమక్షంలోనే ఉన్నా, శ్రీ శ్రీ మహారాజ్ మిగతా అందరితోను మాట్లాడేవారు, వారి సంభాషణను విని ఆనం దించేవారు—కాని తా మెవరినైతే గాఢంగా ప్రేమించేవారో వారివైపు ఒక్కసారి కూడా చూచినట్లుండేది కాదు. అయితే అకస్మాత్తుగా ఒక్కసారి అటువంటి వారివైపు ప్రేమార్ద్ర తలతో నిండిన తమ దృష్టిని సారించినచో,

వారి హృదయం అపూర్వమైన ప్రేమ, ఆనందాలతో పరవళ్ళు తొక్కేది. ఈ ప్రేమ యొక్క పరిమళం ఆ రోజంతా ఆ వ్యక్తితో ఉండేది. అయితే అదృష్టవశాత్తూ శ్రీ శ్రీ మహారాజ్ స్పర్శకనుక లభిస్తే ఆ దివ్య పరిమళాలు మూడు రోజులు అవిచ్ఛిన్నంగా ఉండేవి! ఇందులో ఇసుమంత అతిశయోక్తి కాని, మిథ్యకాని లేవు. ఇది మా స్వానుభవంతో గ్రహించిన సత్యమే కాదు; ఈ ప్రేమని పొందిన అనేకుల అనుభవం ద్వారా కూడా దృఢీకరింపబడిన పరమసత్యం. ఈ అపూర్వ వ్యక్తియొక్క అపూర్వమైన ఆప్యాయత, ప్రేమ ఒక్కక్షణం లభిస్తే చాలు జీవితమంతా ధన్యము, పునీతమూ అవుతుందని మా స్వానుభవంద్వారా మేము గ్రహించిన సత్యం.

(స్వేచ్ఛానువాదం:
ఎమ్. శివరామకృష్ణ.
ఆంగ్లశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం.)

# ప్రహ్లాద కథాతత్త్వ విచారము

## ధూళిపాళ శ్రీరామమూర్తి

ఆ మాటను వినుటతో హిరణ్యకశిపునకు ఒడలు మండిపోయినది. అతడు కోపముతో పెదవులు వణకుచుండగా 'ఓ దుర్బ్రాహ్మణుడా! ఏమి పని చేసితివి. నన్నునాదరించి శత్రుపక్షమునచేరి నా కుర్రవానికి సారము లేని చదువు చెప్పితివి. లోకమునందు కపటవేషులైన దుర్మిత్రులుందురు. మహాపాపులకు కాలము పక్వమై రోగము పుట్టునట్లు మీకు మిత్రద్వేషము పుట్టె'నని తిట్టెను.

ఆ మాటలకు గురుపుత్రులు భయపడి 'అయ్యా! మాపై నూరక దోషారోపణము చేయకుడు. ఇది మేము వీనికి జెప్పినది గాదు. ఇతరులును జెప్పినదియుగాదు. ఇది పుర్రెను బుట్టిన బుద్ధియే. కావున మాపైన కోపగింపకుడ'న్నారు. ఆ మాటలు విని 'ఓయీ! నీ కీ పాడుబుద్ధి గురువు చెప్పనిచో మరి యెక్కడ నుండి నేర్చుకొంటివ'న్నాడు. ప్రహ్లాదు డిట్లు దానికి సమాధాన మిచ్చినాడు.

'అయ్యా! గృహవ్రతులై అవశములైన యింద్రియములతో సంసారకూపమున బడి చర్వణము] నుండెడివారికి విష్ణుభక్తి స్వతంత్రముగా గాని పరులవలన గాని పరస్పర బోధ వలన గాని కలుగదు. ఎందుచేతననగా వారు దురాశయులు. అనగా బయటనున్న విషయములయందే దృష్టిగలవారు. తమకు కావలసిన ప్రయోజనము బహిఃప్రపంచమునందే నున్నదని భావించువారు తమ లోపలనే పురుషార్థమున్నదని భావించువారికి పొందదగిన విష్ణువు వా రెట్లెఱుంగుదురు? వా రంధులు. వారికి చెప్పెడివారు నంధులే. గ్రుడ్డివాడు గ్రుడ్డివానిని తీసుకొనిపోయి యెచ్చట పడవేయును? పరమేశ్వరుని చేతిలో నొక పెద్ద పాశమున్నది. చాలా పొడవైన పాశము. దానికి శాఖాపాశము లున్నవి. ఆ పెద్ద పాశమునకు వేదమని పేరు. ఈ శాఖాపాశములకు బ్రాహ్మణాది నామము లనేకములు. వానికి సంబంధించిన కామ్యకర్మ లనేకములు. వీనితో నీ యంధులందరును కట్టివేయబడియున్నారు. ఆ సంగతి కూడా వారికి తెలియదు. ఆ కట్టిన పాశములమీద మిక్కుటమగు ప్రేమకూడాను. వా రెటు చెప్పుదురు?

విషయావిష్ట చిత్తానాం
విష్ణ్వావేశస్సుదూరతః
వారుణీ దిగ్గతం వసు
వ్రజన్నైంద్రీం కిమాప్నుయాత్.

మనస్సెల్లప్పుడు విషయ భోగముల మీద నున్నవారికి ఈశ్వరజ్ఞానము ఈశ్వరభక్తి దొరుకునా? తూర్పుదిక్కుగా ప్రయాణించు వానికి పడమటి దిక్కునున్న వస్తువు దొరుకునా! భోగలాలసులకు చిత్తము బయటకు ప్రసరించును ఆత్మపదార్థము లోన నున్నది. అన్నిటికంటె లోననున్న యాత్మపదార్థము వీరికెట్లు దొరుకును? కాబట్టి వీరి మనస్సు శ్రీహరి పాదపద్మములను స్పృశింపదు. వీరి మనస్సు అర్థాభిముఖముగా నున్నది. విష్ణు పాదములు స్పృశించినచో నాయర్థము తొలగి పోవలసినదే. విషయాభిమానము కొంచము గానైన లేని సాధుజనుల పాదరజమునందు మునుగునంతవరకు వారిబుద్ధి శ్రీహరి వంకకు తిరుగదు.

సంసార పతితులకు హరిభక్తి పుట్టదు. సంసారమందలి విషయభోగమునందే వారి బుద్ధులు ప్రవర్తించును. అవి పూర్వమనుభవించినవే. బహుజన్మలనుండి చర్వితచర్వణమైనవే. కాని వారజితేంద్రియులు. ఆయింద్రియములు వారిని సంసారమువంకకె లాగును. ధర్మార్థకామములు బహిరర్థములు. బయట నున్నవి. వానిని సంపాదించుటకే జనులు పాటుపడుదురు. మరి మోక్షమో లోపల నున్నది. అది పరమాత్మయైన హరి స్వరూపమే. బయటి యర్థముల యందు బుద్ధి ప్రసరించుట ప్రవృత్తి మార్గము. లోపలి యర్థమున ప్రసరించుట నివృత్తి మార్గము. ఆ నివృత్తి మార్గమునందు వీరంధులు. వీరికి ప్రవృత్తి మార్గమును ఉపదేశించువారుకూడ అంధులే. మరి యీ ప్రవృత్తిమార్గము కూడా వేదమే చెప్పుచున్నది గదా యన్నచో చెప్పుచున్నది. ఎవరికి చెప్పుచున్నది? వేదము బ్రాహ్మణాది వర్ణములను బ్రహ్మచర్యాద్యాశ్రమములను తత్తదుచిత నిత్య నైమిత్తిక కర్మలను కామ్యకర్మలను చెప్పుచున్నది. కాని యెవరికి? ఎవరికి ఆ వర్ణాశ్రమములలో అభిమానముండునో వాని కాధర్మములను ఆచారములను కర్మల నుపదేశించుచున్నది. త్రిగుణ ప్రభావము వలన [సత్త్వ రజస్తమములు] ఆయా వర్ణాశ్రమాభిమానము కలుగును. ఆయా గుణములయందలి వైచిత్రివలన ఆయా జన్మములు, అభినివేశములు, స్వభావములు, కామములు, కర్మములు కలుగును. వానియందు వీరందరు బంధితులై యుందురు. మేము వేదములు గౌరవింపము. లక్ష్యపెట్టమని కొందరందురు. ఇదికూడా వేదమన్న యీ పాశమున కొక శాఖాపాశమే. దీని యందు వీరి కభిమానము. అయ్యవారిముద్రభుజము తప్పినను వీపు తప్పదు. ఈ వేద బంధమును తప్పించుకొన్నవా డెవడు? పిపీలికాది బ్రహ్మపర్యంతము తప్పించుకొన్నవాడు లేడు. తప్పించుకొన్నవా డొక్కడే వాడాత్మవేత్త. ఆత్మారాముడు. ఆత్మస్వరూపుడై సర్వత్ర ఆత్మదర్శనము చేయువానికి మాత్రమే యీ వేద పాశముల బెడదలేదు. వానికి వీని నుండి విముక్తి యన్నమాట. అనగా నీ వేద పాశ మెవని యధీనమందున్నదో అట్టి పరమాత్మయే వాడైనాడు. దీని ప్రభావము వాని మీద ఎట్లు ప్రసరించును?

తక్కినవారి యందరిపై దీని ప్రభావము ప్రసరించును. దానిపైన నిప్రశ్న. అయ్యా! వేదము చెప్పిన వర్ణాశ్రమములయందు నా కభిమానము లేదు. మరి దాని విధి నిషేధ

ములు నన్నేట్లు బంధించును అని. వట్టిమాట. నీకు ఆత్మానగతి లేదని యొప్పికొంటివి గదా. నీకు ఆత్మానగతి లేదుగదా శరీరమే యాత్మ యనుకొందువు గదా. అనగా నీకు శరీరాభిమాన మున్నది గదా. అప్పుడీ పాశము నిన్ను బంధించుటలో అభ్యంతరమేమున్నది? మరి నీకు లేనివి వర్ణాశ్రమములు. వానియం దభిమానము నీకు లేకపోవచ్చును. ఇది కూడ నిజము కాదు. నీకు తెలియకుండ వానియం దభిమానము నీకుండనే యున్నది. సరే నీవు చెప్పుచుంటివిగాన లేదని యొప్పికొందము. వర్ణాశ్రమములు లేకపోయినను నీవు సామాన్య మనుష్యుడవగుదువు గదా. అదికూడా కాదందువా. అన్నను అనకున్ననుగూడా నిన్ను వేద ధర్మము బంధించును. సామాన్య మానవ ధర్మములు, కర్మములు, కామ్యములు, వేదము చెప్పనే చెప్పినది. సర్వమానవులు యథాశక్తి వాని ననుసరించుచున్నారు. యథానుసరణము వారికి ఫలములు కలుగుచున్నవి. కాదు నేను మానవుకనే. ఐనను యే ధర్మము ననుసరింపను అన్నచో నిషిద్ధము చేయుచుంటివిగదా. అప్పుడు దానియం దభిమానము నీకుండును గదా. ఆ యభిమానము నీ మెడ బిగించుచున్నది కదా. కాబట్టి వేద బంధమును తప్పించుకొనుట యనునది లేదు. ఓయి నాయనా! పిచ్చి తండ్రీ! ఈ సృష్టియంతయు త్రిగుణాత్మకము. వేదము త్రైగుణ్య విషయములను బోధించునట్టిది. తదభిమానులను తత్తద్విషయిక కామములచేత కర్మములచేత బంధించుటలో అసంభవ మేమున్నది? ఎవరిని బంధింపదు? నిస్త్రైగుణ్యుడైన వానిని బంధింపదు. అందుచేత ఎల్లరు వేదమునకు బాధ్యులే. కాబట్టి ధర్మాచరణులు గాని నిషిద్ధాచరణులు గాని వేద శాసనమును తప్పించుకొనలేరు.

మరి యీ సంసారులకు దీనినుండి ముక్తి యెట్లన్నచో ఆ ప్రశ్న పుట్టుటనే వీరికుండదు. మహాత్ముల పాదధూళి తలపైన ఏ కొంచెమో పడినగాని యిట్టి ప్రశ్న పుట్టదు వారి దర్శనముచేతనే పాపము పటాపంచలగును కదా. అపుడు వారి బుద్ధి వెనుకకు మళ్ళును. అనగా నివృత్తి మార్గమునందు ప్రవేశించును. ఎంత యెంతగా వెనుకకు మరలునో నంత యంతగా సంసారము వారినుండి దూరమగును.

హిరణ్యాకశిపునకు యిది యంతయు తెలిసినదే. తన తల్లికి నతడు తత్వమంతయు నుపదేశించెను. మరి ప్రహ్లాదుడు చెప్పినదానిలో క్రొత్త యంశ మేమున్నది యన్నచో నున్నది. హిరణ్యాకశిపుడు తల్లికి చెప్పినది తత్వము. ఆ తత్వావగతికి విచారణమార్గము నతడు చెప్పెను. ఆ తత్వమే హరి స్వరూపమని దానికి భక్తి మార్గమని ఆ భక్తికి సత్సంగము కారణమని చెప్పినాడు. ఇదికూడా హిరణ్యకశిపునకు క్రొత్తగాదు. ఐనను తన తల్లికి మార్గము నుపదేశింపకపోవుటలో కారణ మతడు శాపదగ్ధుడగుట. అతనికున్న హరిభక్తి యంతయు హరిద్వేషముగా మారుట. అనగా వానియందున్న రజస్తమస్సులు హరిద్వేషముగా పరిణమించినవి.

—సశేషం.

# మాతృదేవిచరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:

ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము:

పి. గణపతిశాస్త్రి

14, మే, 1911 నే నీవేళ అమ్మను చూడడానికి వెళ్లాను. నమస్కారం చేస్తూంటే, ఆమె గట్టిగా అడిగింది.

"అయితే నీవు వచ్చివేశావే! నీ కేమయినా జరిగిందేమో అని నేను ఆత్రపడుతున్నాను. అప్పటినించి మళ్లీ నీవు రానే లేదు! ఎందుచేత రాలేదమ్మా?"

నేను: నేనిక్కడ లేనమ్మా! మా నాయనగారి ఇంటికి వెళ్లానమ్మా!"

ఆ పైన అమ్మ మాబంధువుల క్షేమసమాచారముల నడిగింది. తరువాత "ఎంత వేడిగా ఉన్నదీ వేళ!" అని నా చేతిలో ఒక విసనకర్ర ఉంచింది.

"అయితే తొందర తొందరగా భోజనం ముగించుకుని ఇక్కడికి పరిగెత్తుకుని వచ్చావన్నమాట! అయ్యో! పాపం! రా అమ్మా! నా పక్కనే పడుకో!"

మాతృదేవికోసం నేలమీద ఒక చాప పరిచారు. ఆమెకోసం వేసినదానిమీద, ఆమె పక్కనే పడుకోవడానికి నేను కొంచెం సంకోచించాను; అమ్మ అది గమనించి, "మరేం పరవాలేదమ్మా! రా! పడుకో! అని ఆహ్వానించింది.

చిట్టచివరికి నేను ఆ చాపమీదనే పడుకున్నాను. మాతృదేవికి కునుకుపట్టుతున్నట్టు అనిపించింది. అది గమనించి నిశ్శబ్దంగా పడుపడుకున్నాను. సరీగా అదేసమయంలో ఇద్దరు స్త్రీలు లోపలికి వచ్చారు. వారివెనకాల సన్యాసినులు ఇద్దరు కనిపించారు. ఆ మహిళలిరువురు అమ్మ భక్తురాండ్రు. ఒకామె పెద్దది. రెండవ ఆమె ప్రాయంలో చిన్నది. మాతృదేవి కన్నులు రెండు తెరవకుండానే ఆ వచ్చినది గౌర్దాసికాదూ?" అని ప్రశ్నించింది.

"నీవు ఎలాగ గుర్తుపట్టావమ్మా?" ఆ మహిళలలో చిన్నామె అడిగింది.

"నా కలాగ అనిపించింది." అని అమ్మ సమాధానం చెప్పింది. మరికొంతసేపటికి ఆమె లేచి కూర్చున్నది. ఆ పైన మహిళలలో చిన్నామె అన్నది.

"నేను బేలూరుమఠానికి వెళ్లాను. ప్రేమానందస్వామిజీ మాకు గొప్పవిందు చేశారు. ఆయన అక్కడ ఉన్నప్పుడు భోజనం చెయ్యకుండా తప్పించుకుని వెళ్ళడానికి వీలులేదు."

చిన్నామె నుదుటిమీద కుంకుమబొట్టులేని సంగతి గమనించిన అమ్మ ఆమెను మృదువుగా మందలించింది.

ఆ తరవాత గౌరీమా [గౌర్దాసి] అమ్మ ముఖతః నన్నుగురించిన వివరాలన్నీ విని తన ఆశ్రమానికి రమ్మని ఆహ్వానించింది.

"మేమక్కడ యాభై, అరవై మంది బాలికలకు శిక్షణ ఇస్తున్నాము. నీకు కుట్టుపని ఏమయినా తెలుసునా? నేను ఏవో కొంచెం తెలుసునని అన్నాను. దానిమీద ఆమె ఆ కొంచెమైనా తన ఆశ్రమంలో బాలికలకు నేర్పవలిసిందని కోరింది.

మాతృదేవి అనుమతితో నే నొకసారి గౌరీమా ఆశ్రమానికి వెళ్ళడం జరిగింది. ఆమె నన్నెంతో ఆత్మీయంగా గౌరవించి ప్రతిదినము రెండుగంటలపాటు స్కూలుకివచ్చి బాలికాశిక్షణ ఇవ్వవలిసిందని కోరింది.

దానిమీద నేను నాకున్న స్వల్పజ్ఞానంతో ఉపాధ్యాయురాలుగా మారిపోవడం నగుబాటు

కాగలవని, అయితే ఆమెకు సంతోషం కలిగించడానికి బాలికలకు కుట్టుపనిలో ఓనమాలు నేర్పగలనని అన్నాను. అయినా గౌరీమా నన్నంత తేలికగా విడిచిపెట్టలేదు. చిట్టచివరకి ఆమె చెప్పినదానికి అంగీకరించాను.

నేనొకనాడు స్కూలు ముగిసిన తరవాత తిన్నగా గౌరీమా ఆశ్రమంనుంచి మాతృదేవి దర్శనంకోసం వెళ్లాను. అది వేసవి. నేను ఆ నాడు కొంచెం అలసిపోయాను. ఆ నాడు మాతృదేవి ఒక గదిలో భక్తురాండ్ర మధ్యన కూర్చునిఉన్నది. నేను ఆమెకు నమస్కరించిన వెంటనే అమ్మ నా కేసిచూసి, దోమ తెర మీద ఉన్న విసనకర్ర అందుకుని విసరడం మొదలుపెట్టింది. "ని[illegible]చుకం త్వరగా తొలగించుకో అమ్మా. చల్లనిగాలి తగిలి శరీరం అంతా చల్లబడుతుంది."

నేనెంతో ఆత్రంగా "ఆ విసనకర్ర నా చేతి కివ్వవమ్మా! నేను విసురుకోగలను!" అన్నాను. అలాగ మాటి మాటికి అడుగుతున్నకొద్దీ అమ్మ "ఫరవాలేదులే, అమ్మా! ఫరవాలేదులే! నీ ఒళ్లు కొంచెం చల్లబడనీ!" అంటూ ఎంతో ఆప్యాయంగా ఓదార్చింది. అంతేకాదు, నైవేద్యంలోనుంచి కొన్ని తినుబండారాలు, ఒక గ్లాసుతో మంచినీళ్లు నాకందించేదాకా మరి మాతృదేవికి ఊరట కలగలేదు! అంతలోనే మా స్కూలునుంచి వచ్చిన బండి నా కోసం వేచిఉన్నదని తెలిసింది. శారదాంబదగ్గిర సెలవు తీసుకున్న తరవాత నేను దానిలో కూర్చుని వెళ్లిపోయాను.

3, ఆగస్టు, 1917 ఈ వేళ పొద్దున్న అవసరమయిన కొన్ని వస్తువులు తీసుకుని అమ్మ దగ్గిర మంత్రదీక్ష స్వీకరించడానికి వెళ్లాను. గౌరీమా దగ్గిర ముందుగా ఏమేమి వస్తువులు కావాలో తెలుసుకుని, ఆమెను కూడా నాతో వెంటబెట్టుకుని వెళ్లాను. అమ్మ ఇంట అడుగు పెట్టినప్పట ప్రార్థనలోను, అర్చనలోను ఆమె మునిగిఉన్నట్లని గ్రహించాను. ఆ తరవాత అమ్మ నీళ్లు కొంచెం తెచ్చి, కూర్చోవలసినదని మా కిద్దరికీ సూచించింది. పూజ ముగియగానే అమ్మ నా మంత్రోపదేశం సంగతి ప్రస్తావించింది. నేను ఈ విషయం ఇంతకు మునుపే అమ్మతో ప్రస్తావించాను.

మరి కొంత సేపటికి అమ్మ నాతో "నీ తివాసీ తెచ్చుకుని నా ఎడమపక్కనే దానిమీద కూర్చో!" అన్నది.

"అమ్మా, నేను ఇంకా గంగలో స్నానం చెయ్యలేదమ్మా!" అన్నాను.

అమ్మ: మరేమీ ఫర్వాలేదు. నీవు ఉతికిన బట్టలు కట్టుకున్నావనుకుంటాను."

నేను ఆమె దగ్గరే కూర్చున్నాను. నా గుండె గుబగుబ కొట్టుకున్నది. మిగిలిన వారినందరిని ఆ గదిలోనుంచి వెళ్లిపోవలసినదని అమ్మ ఆదేశించింది. ఆ తరవాత నాతో "నీవు కలలో ఏమి స్వీకరించావో చెప్పు!" అన్నది.

నేను: "అది వ్రాయనా? లేక నోటితో ఉచ్చరించాలా?"

అమ్మ: ఉచ్చరించు.

మంత్రోపదేశ సమయంలో అమ్మ నేను ఇంతకు మునుపు కలలో స్వీకరించిన మంత్రం పరమార్థం వివరించింది. ముందు ఆ మంత్రం ఉచ్చరించవలసిందని అన్నది. నేను ఆ మంత్రం యథాతథంగా నోటితో అన్న పిమ్మట నూతనమంత్రం నాకుపదేశించి, దానిని పలుమారులు జపించి ధ్యానించవలసిందని ఆదేశించింది.

ఆ మంత్రం పరమార్థం నాకుపదేశించే ముందు అమ్మ కొన్ని క్షణాల పర్యంతము

ధ్యానంలో మునిగి ఆత్మవిస్మృతి పొందింది. ఆమె నాకు మంత్రం ఉపదేశిస్తూంటే శరీరం అంతా గబగబ వణికింది. కన్నీటిబిందువులు జలజలా రాలాయి. దీని కేమి కారణమో నే నెరగను. అమ్మ ఆటుపిమ్మట రక్తచందనంతో నా నుదుట గుండ్రని పెద్ద తిలకం తీర్చిదిద్దింది. నేను కొంత సొమ్ము గురుదక్షిణ రూపంలోను, మరికొంత ఠాకూరు పూజారూపంలోను అమ్మ కందించాను. మంత్రోపదేశం పూర్తి అయిన పిమ్మట అమ్మ ఆ సొమ్ము అక్కడినించి తీసుకుని వెళ్లవలసిందని గోలాప్ మా చేతికిచ్చింది.

నా మంత్రోపదేశం సమయంలో అమ్మ ముఖం చాలా గంభీరంగా ఉన్నది. ఆపైన ఆమె తన ప్రార్థన పీఠంనుండి లేచింది. ఆ సమయంలో "ని మంత్రం జపించి ధ్యానించి కొంతసేపు ప్రార్థించు!' అని అన్నది.

నేను ఆమె చెప్పినట్టు చేసి, ధ్యానంనుండి లేచి, అమ్మ పాదాలకు నమస్కరించాను... ఆపైన ఆమె "అమ్మా! నీకు నమ్మిక కలుగుగాక!" అని ఆశీర్వదించింది. నే నదివిని ఆంతర్యంలో "తల్లీ! నీ వన్నమాట గుర్తుంచుకో! గుర్తుంచుకో! నా కేవిధము లోపము రానీయకు!" అని మనసా ప్రార్థించాను.

శారదామాత ఆపైన గంగలో స్నానానికి ప్రయాణమయింది. గోలాప్‌మా ఆమెవెంట వెళ్లవలసి ఉన్నది. మాతృదేవి చీర, తువ్వాలు తీసుకుని ఆ ఇద్దరిని అనుసరించాను. అమ్మ గంగలో అడుగు పెట్టగానే చిన్న జల్లు ప్రారంభమయింది.

స్నానం ముగించుకుని శారదామాత పురోహితునికి ఒక మామిడిపండు. ఒక అరటిపండు. ఒక కానీ ఇచ్చి "నేను నీకు పళ్లు ఇస్తున్నాను. అయితే దీని ఫలితం మాత్రం నీ కందుగాక!" అని వక్కాణించింది. 'అయ్యో! పురోహితుడా! అవి నీ కిచ్చిన వారెవ్వరో నీకు తెలియలేదుకదా! అమ్మ అన్న మాటల అంతరార్థమేమో నీ కవగాహన కాలేదు గదా!' అనుకున్నాను.

శారదామాత నా దగ్గర ఉన్న పొడిబట్ట లందుకుని తడిసినవి నా చేతి కందించి, "మరి వెళదాం? పదండి!" అన్నది. గోలాప్‌మా మా ముందు నెమ్మదిగా సాగిపోయింది. అమ్మ మా ఇద్దరికి మధ్యన ఉన్నది. నేను చివర ఉన్నాను. అమ్మ గంగాజలంతో నిండించిన చిన్నపాత్ర చేతపట్టి దారిలో కనిపించిన మర్రివృక్షాల మొదళ్లలో కొంచెం కొంచెం నీరుపోసి నమస్కరించింది. ఆపైన మేమందరము ఇంటికి చేరుకున్నాము... గోలాప్‌మా తాను తీసుకవచ్చిన జలపాత్ర ఒక మూలగా ఉంచడానికి ప్రార్థనమందిరానికి వెళ్లింది. మెట్లదగ్గర నీటికుండీకి దగ్గరగా ఒక జలపాత్ర ఉన్నది. అమ్మ తన కాళ్లు అక్కడ కడుక్కుని నాతో "నీ కాళ్లుకూడా చాలా బురదగా ఉన్నాయి. కడుక్కో" అని అన్నది. నేను నీటికోసం నాలుగు వైపుల పరకాయించాను. అంతలోనే అమ్మ "నా నీటిపాత్రలో నీరు వాడుకోరాదా?" అని హెచ్చరించింది.

"అయితే అమ్మా, ఆ నీరు నీ స్పర్శతో పునీతమయింది" అన్నాను నేను.

"ఆ నీటిలో కొన్ని చుక్కలు నీ శిరస్సు మీద చల్లుకుంటే మరేమి ఫరవా లేదులే!" అని హితవుపదేశించింది మాతృదేవత. నా మనస్సామె మనస్సంత సరళంగా ఆలోచించలేకపోయింది. అందుచేత "అలాగ ఎలా కుదురుతుంది?" అని సమాధానం చెప్పి వేరొక జలపాత్ర తీసుకవచ్చి దానిలోని నీటితో నా కాళ్లు కడుక్కున్నాను అమ్మ నేను వచ్చేదాకా నిరీక్షించింది. —సశేషం.

# జపయజ్ఞము

కాశావఝ్ఝల రామకోటి శాస్త్రి.

ఇహపరసుఖముల బడయుటకును, జనన మరణ రూపమగు సంసార బంధమునుండి విడువబడి భగవత్ప్రాప్తి రూపమగు మోక్షమును బడయుటకును శాస్త్రములు అనేక సాధనములను తెలిపినవి. వానిలో కొన్ని యజ్ఞములను పేర బరగుచున్నవి. అట్టి యజ్ఞములు పెక్కులు. భగవద్గీతలో భగవానుడు ఇట్లు తెలియజేసి యుండెను. "ద్రవ్యయజ్ఞాః తపోయజ్ఞాః యోగయజ్ఞాః తథాపరే। స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాశ్చ" అనగా క్షేత్రములయందు ద్రవ్య త్యాగరూపమైనవి ద్రవ్య యజ్ఞములు. "అనశనం తపః" అనెడి స్మృతి ననుసరించి ఉపవాసాది రూపమైనవి తపోయజ్ఞములు; రేచక పూరక కుంభక రూపమైనవి యోగ యజ్ఞములు; వేదాధ్యయనము భారత, భాగవత, రామాయణాది పారాయణ రూపమైనవి స్వాధ్యాయ యజ్ఞములు; వీని అర్థగ్రహణ రూపమైనవి జ్ఞాన యజ్ఞములు. ఇట్టివే ఇంకను కొన్ని. అన్నియు పాపక్షయకరములు, సుఖకరములు, శ్రేయస్కరములు నగుచున్నవి.

ఈ చెప్పినవానికంటె వేరుగా ఇంకను రెండు యజ్ఞములను భగవానుడు భగవద్గీతలో తెలిపియుండెను. అందు ఒకటి జ్ఞానయజ్ఞము, రెండవది జపయజ్ఞము. "శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః" అని "యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి" అని ఈ రెండు యజ్ఞములు సర్వోత్కృష్టములుగా జెప్పబడినవి.

"ద్వేవావ బ్రహ్మణోరూపే మూర్తంచా మూర్తంచ" అనెడి శ్రుతి ననుసరించి ఒకే బ్రహ్మము సగుణము, నిర్గుణమునై యున్నది. జ్ఞానయజ్ఞము నిర్గుణబ్రహ్మమునకు సంబంధించినది. జపయజ్ఞము సగుణబ్రహ్మమునకు సంబంధించినది. ఇందు నిర్గుణబ్రహ్మమునకు సంబంధించినగతి చాల ప్రయాసముతోగూడ గూడినట్టిది. "క్లేశోధికతర స్తేషాం అవ్యక్తా హి గతిర్దుఃఖమ్" అని గీతలో ఈ విషయము స్పష్టముగా జెప్పబడినది. "క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథః తత్కవయో వదంతి" వాడిగలకత్తియంచుపై నడచుటవలె జ్ఞానమార్గము మిగుల దుస్తరమైనదని కఠశ్రుతిగూడ ఇట్లే చెప్పియుండెను. పరిశేష న్యాయముగా జపయజ్ఞము శ్రేష్ఠముగా నుండుటయేకాక సులభముగూడ నైనదని తేలినది. పలు బాలురకును, యువకులకును, వృద్ధులకును మేలుచేయునటు నామయజ్ఞము సాధారణ మానవులకును సాధకులకును, సిద్ధులకును మేలు కలుగజేయ సమర్థమైనది. ఈ యజ్ఞము ఇహపరసుఖములనే కాక మోక్షమునుగూడ సిద్ధింపజేయుచున్నదగుటచే సర్వశ్రేష్ఠమైయున్నదని శాస్త్రములు పెక్కులు వెల్లడించుచున్నవి.

"తస్యనామ మహద్యశః" భగవన్నామము మహామహిమోపేతము అని శ్రుతి వచించియున్నది. "జప్యేనైవహి సంసిద్ధ్యేద్బ్రాహ్మణో నాత్ర సంశయః, కుర్యాదన్యన్నవాకుర్యా న్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే" ఇతర కర్మలను చేయనీ చేయకపోనీ, కేవలము ఒక్క జపముచేతనే బ్రాహ్మణుడు చిత్తశుద్ధిని, క్రమేణ జ్ఞానసిద్ధిని, మోక్షసిద్ధిని బడయుచున్నాడు. ఇట సంశయము లేదు. అతడు సకల భూతములకును మిత్రుడును అయి పోవుచున్నాడని మనుస్మృతి వచించెను. "జపస్తు సర్వధర్మేభ్యః పరమోధర్మ ఉచ్యతే,

అహింసయాచ భూతానాం జపయజ్ఞః ప్రవర్తతే” జపము అన్నిధర్మములలో ఉత్తమ ధర్మముగా నున్నది. ఎట్లన, జపయజ్ఞము ప్రాణిహింస లేకయే నడచుచున్నది అని మహాభారతము వచించెను.

“ఏషమే సర్వధర్మాణాం ధర్మోధికతమోమతః, యద్భక్త్యా పుండరీకాక్షం స్తవైరర్చేన్నరస్సదా వి సుతించుట యనునదే సర్వధర్మములలో మిక్కిలి ఉత్తమధర్మమని. ఇది సిద్ధాంతమని సర్వధర్మజ్ఞుడైన భీష్ముడు ప్పెను

“ నామైవ మమ జీవనః కలౌనాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా” నా దృష్టిలో హరినామమే జీవనము; కలియుగమున వేఱుగతి లేదు లేదు లేదు అని దేవర్షి నారదుడును దీనినే పృథపరచెను. “యజ్ఞానాం జపయజ్ఞో ” యజ్ఞములలో జపయజ్ఞము నేనే యని భగవంతుడు స్వయముగా గీతలో చెప్పియుండెను. జపయజ్ఞము శ్రేష్ఠమనుటకు కారణమును విష్ణు సహస్రనామ స్తోత్ర భాష్యములో శ్రీ శంకర భగవత్పాదులు విశదముగా చెప్పియున్నారు. “హింసాది పురుషాంతర, ద్రవ్యాంతర దేశకాల నియమానపేక్షత్వమాధిక్యే కారణమ్” అనగా ఈ జపయజ్ఞమునందు ప్రాణిహింస లేదు. అదియు గాక ఎవ్వరిని ఆశ్రయింపవలసిన పని లేదు. ఇతర ద్రవ్యముల అవసరము లేదు, దేశ నియమము లేదు. ఏ నియమము లేదు

ప్రహ్లాదుడు, ధ్రువుడు, వాల్మీకి, హనుమంతుడు మొదలైన పూర్వులును, కబీరుదాసు, రామదాసు, త్యాగరాజు మొదలైన ఆధునికులును ఎందఱో కేవలము భగవన్నామము చేతనే ముక్తులైనట్లు వారివారి చరిత్రలలో స్పష్టముగా తెలియజేయబడియున్నది. ప్రస్తుతము మనకు కనబడుచున్న మహాత్ములలోను ఎవరెవరు సిద్ధులు, ముక్తులునైయున్నారో వారెలరును ఈ నామ యజ్ఞమును అవలంబించినవారే యని విశదమగుచున్నది. కావున సంశయమును విడనాడి నామయజ్ఞమును ఆశ్రయించి ఆత్మకళ్యాణమును, లోక కళ్యాణమును సాధించెదము గాక!

మన నేంద్రుకలను పెంచేది ఆ పరమాత్మే. మన నరాల్లో రక్తం ప్రవహింపజేసేది అదే. మనం చూడను, మాట్లాడను, శక్తినిచ్చేది అదే. నీ వాక్కులో దేవుడున్నాడు. నీ శ్రవణశక్తిలో దేవుడున్నాడు. నీలో నిండియున్న ఈ దైవత్వమే – ఈ సత్యాత్మే – నీ సోదరునిలోకూడా కనపడుచున్నది. నీ స్నేహితునిలో, నీ బంధువర్గంలో, నీ శత్రువులోకూడా ప్రత్యక్షమగుచున్నది. నీవు దైవభావప్రపూర్ణుడవైనప్పుడు, నీకు శత్రువులు కనపడరు. నీ వెప్పుడు దైవమును చూడలేవో, అప్పుడు నీకు శత్రువులు కనిపిస్తారు. నీవన్వేషిస్తున్న ఆనందాన్ని అనుభవించు. ఆ దైవత్వం నీకు అతి సమీపంలో ఉన్నది. అతి సన్నిహితంగా ఉన్నది. నీ స్వస్వరూపమే అయిఉన్నది.

—స్వామి రామతీర్థ.

# సూతసంహిత

ఏలూరిపాటి అనంతరామయ్య

## రెండవ అధ్యాయం: పాశుపతవ్రతం

మిగిలిన మహర్షులు వ్యాసుడా! ఈ అనిత్యమైన జగత్తు సర్వమూ ఎందువల్ల విభక్తమైంది? ఎవరు దీనిని సృష్టించారు? పశువు1 అజ్ఞుడు కనుక ఇందుకు కారణం కానేకాడు. ప్రకృతీ కాదు. కనుక, తపోధనా, ఈ సర్వజగత్కారణం ఇతరుడే. మహాభాగా, శ్రేష్ఠపుణ్యాత్మా, అతనిగురించి మాకు చెప్పు'' అని ప్రశ్నించారు.

### సూతుడు చెప్పాడు

విప్రులారా, పూర్వం విష్ణ్వాది దేవతలందరూ కలిసి, జగత్కారణంగురించి ఆలోచించి, సంశయగ్రస్త మనస్కులై, అతి సుఖదాయకమూ, శుద్ధమూ అయిన రుద్రలోకానికి వెళ్ళారు+3,4.

సంసార నాశకుడు, మహాదేవుడు, హరుడు, రుద్రుడు, పరమకరుణాశాలి వారి నడుమ స్వయంగా సాక్షాత్కరించాడు. ద్విజులారా.

విష్ణ్వాది దేవతలు ఇదివరకు చూచి ఉండని ఆ మహాదేవుణ్ని చూచి నమస్కరించి ''యెవరునీ''అని ప్రశ్నించారు6.

ఆ భగవానుడు రుద్రుడు, పశుపతి, ఈశ్వరుడు, సర్వజ్ఞుడు, సర్వతత్త్వతత్త్వభూతుడు, సనాతనుడు ''జగత్సృష్టికి ముందు ఈశ్వరుడను నేనొక్కడినే ఉన్నాను. ఉంటున్నాను, ఉండగలను. నాకంటె ఇతరుడెవ్వడూ లేడు8. నా మాయాశక్తినిర్మితమే ఈ చరాచర జగత్తు సర్వమూ. విప్రులారా, నిజానికి ఆ మాయకూడా నాకంటె వేరుగా లేదు9. నన్ను గురించి వేదవాక్యాలవల్ల ఆచార్యునిద్వారా తెలిసికొన్న పశువు, వేదాంత వాక్యజనితజ్ఞానం కారణంగా విముక్తుడవుతాడు'' 10+ అని చెప్పాడు.

ఇలా చెప్పి రుద్రభగవానుడు తన పూర్ణరూపంలో ప్రవేశించాడు(అంతర్థానమయ్యాడు)

1. పశువు = ఈపదం చూచి పతితలు కంగారు పడకూడదు. ఇది ఒక పారిభాషికపదం. మల - మాయా - కర్మ - రూపములైన మూడుపాశముల చేతనూ బద్ధులైన జీవులను పశువులు అంటారు. వీరిని గూర్చిన విపుల వివరణం తాత్పర్యదీపికలో ఉన్నది.

2. ప్రకృతీ కాదు=జడం కనుక ప్రకృతి సృష్టికర్త్రి కాదు. తా. దీ.

7. పశుపతి = త్రివిధపాశబద్ధజీవులనూ అనుగ్రహంతో పాలిస్తాడు కనుక శివుడు పశుపతి.

ఈశ్వరుడు = పాశములకు వాటి పనులలో సామర్థ్యం కలిగించీ, పశువులకు భోగమోక్షములిచ్చీ శాసిస్తాడు కనుక ఈశ్వరుడు.

సర్వతత్త్వతత్త్వభూతుడు = ప్రళయంవరకూ ఉండేవి తత్త్వాలు; ప్రళయంలోనూ ఉంటాడు కనుక శివుడు సర్వతత్త్వతత్త్వభూతుడు. తా. దీ.

10. వేదవాక్యాలవల్ల = తత్త్వమసి మొదలైన వాటివల్ల. తా. దీ.

అనంతరం విష్ణ్వాది దేవతలు రుద్రుని కానలేక 11 ఊర్ధ్వబాహులై అథర్వశిరస్సుతోనూ ఇతర బహువిధ సూక్తాలతోనూ శ్రీమత్పంచాక్షర మంత్రంతోనూ ఆ దేవుని స్తుతించారు12. మునిపుంగవులారా, మళ్ళీ సాక్షాత్ శివజ్ఞాన సిద్ధికొరకు అగ్నిహోత్రంనుంచి ఏర్పడిన భస్మం ఆదరంతో తీసుకొని13 దానిని పరిశుద్ధపాత్రలో ఉంచి నీళ్ళతో కాళ్ళు కడుక్కొని రెండు మార్లు ఆచమించి పవిత్ర సహితులై స్తిమిత మనస్కులై14 భక్తితో 'ఓ మాపస్సర్వం' ఇత్యాదిమంత్రం ఉచ్చరించి, జలాధ్యక్షుని విష్ణుని ధ్యానించి, భస్మం తీసుకొని (నీటితో తడిపి) 'అగ్నిః' మొదలైన సప్తజాబాల మంత్రాలతో శ్రద్ధాసహితబుద్ధులై, పరిశుద్ధులై శివునీ, శివనూ ధ్యానించారు16. మునిశ్రేష్ఠులారా, భావనతో బ్రహ్మభూతమైన ఆ తెల్లని భస్మం ఆపాదమస్తకమూ పూసుకొన్నారు17. ఆసురోత్తములు లలాటాన హృదయాన ఉదరాన రెండు బాహువులపైన బ్రహ్మ విష్ణు శివాత్మకమైన త్రిపుండ్రధారణం చేసారు18. సువ్రతులైన దేవతలు అథర్వ శిరస్సునందున్న వ్రతం ఈ ప్రకారం చేసి శాంతులు, దాంతులు, విరక్తులుఅయి, కర్మలను పరిత్యజించి19 జాతవేద (అగ్ని) స్వరూపుని, వాలాగ్రమాత్రుని, విశ్వేశుని హృదయపద్మకర్ణికా మధ్యంలో ఆ దేవవిద్వరులు ధ్యానించారు20. సర్వజ్ఞుడు సర్వకర్త, సమస్తాధారుడు, అద్భుతుడు అయిన ఈశ్వరుని ప్రణవమంత్రంతోనే పూజించారు21.

అనంతరం వారి నైర్మల్యంకొరకు పశుపతి, ఈశ్వరుడు ఉమార్ధవిగ్రహుడు, శ్రీయుతుడు, చంద్రఖండాకృతిశిరోభూషణుడు 22, నీలకంఠుడు, నిరాధారుడు, నిరుపద్రవుడు, బ్రహ్మవిష్ణు మహేశానులకు ఉపాస్యుడు, పరమేశ్వరుడు 23, సర్వసాక్షి, ఉపనిషద్ద్నీయస్వరూపుడు, సాక్షాత్ సంసారనాశకుడు, రుద్రుడు, ప్రత్యక్షమయ్యాడు24. శ్రౌతస్మార్త విహీనులైన దుర్వృత్తులు చూడని శంకరునే సురసత్తములు సాక్షాత్తూ వీక్షించారు 25. ద్విజులు శ్రద్ధాసహితులయి, యెవని ప్రాప్తి కొరకు వేదాధ్యయనం చేస్తారో, ఆ శంకరునే దేవపుంగవులు ప్రత్యక్షంగా తిలకించారు+26. మునిశ్రేష్ఠులారా, బ్రాహ్మణోత్తములు శ్రద్ధతో యజించే ఈశానుని, రుద్రునే త్రిదశులు బాగా దర్శించారు27. దగ్ధపాపులైన యోగులు పరికించే దేవేశుని పరమదేవునే స్వర్గవాసులు దర్శించారు28. ఎవని ప్రసాదంవల్ల విష్ణుభగవానుడు విశ్వజగత్పతి అయినాడో, ఆ ఆనంద

11. గురూపదేశంవల్ల మాత్రమే తెలియదగినది గనుక తనరూపం, అది ఉపదేశించాడు రుద్రుడు. దాని సాక్షాత్కారసాధనాలు పాశుపతవ్రతం, ప్రణవం, పంచాక్షరజపం మొదలైనవి శాస్త్రంవల్ల దేవతలు తెలుసుకోగలరు, కనుక రుద్రుడు స్వరూపంలో ప్రవేశించాడు. తా. దీ.

12. ఊర్ధ్వబాహులై = చేతులు పైకి చాచి; ఇది అలభ్యమైనది లభించినందువల్ల కలిగిన హర్షానికి సూచకం. తా. దీ.

22, 23. వ్రతాదులకు పూర్వమే శివుడు సాక్షాత్కరించి ఉపదేశించాడు కదా. ఇంక వ్రతాదు లెందుకని అడగవచ్చు. మొదట కన్పడినది సకలరూపం. నిష్కలరూపం ఉపదేశించాడు. అపుడు శబ్దంద్వారా పరోక్షంగా తెలిసింది. వ్రతాదులవల్ల ప్రతిబంధదురితంపోయి నిష్కలతత్త్వం ప్రత్యక్షంగా చూడబడినదన్నమాట. తా. దీ.

25. శంకరుడు = శం సుఖం సంసారిణాం ముక్తానాం చ కరోతీతి శంకరః, సంసారులకూ ముక్తులకూ సుఖం కలిగించేవాడు. తా. దీ.

స్వరూపుని శర్వునే లోకనాయకులు అభిషేకించారు29. ద్విజులారా, సువ్రతులారా, ఎవని ప్రసాదంవల్ల బ్రహ్మ సర్వస్రష్ట ఐనాడో, ఆ సర్వలోకేశునే పురుషార్థికులు సందర్శించారు30. సత్యసంయుతులు సత్యస్వరూపుడైన ఆ ఈశానునే విలోకించారు.

అనంతరం ఆ దేవతలు సర్వఫలప్రదుని సంసారరోగదుఃఖౌషధునిసాంబుని గద్గదస్వరంతో స్తోత్రంచేశారు.

దేవతలు బాగా స్తోత్రం చేసినపిదప దేవుడు, సాంబుడు, మహాదేవుడు3 32, హరుడు అఖిల దేవతలనూ ఆలోకించి 'ప్రీతుడయినాను' అన్నాడు.

విష్ణ్వాది దేవతలను మళ్ళీ సమాలోకించి రుద్రుడు33 కరుణానిధి భగవానుడు గంభీర వాక్కుతో 'సురలారా, నేనే పరతత్వాన్ని; నా నుంచే జగత్తు ఉద్భవించినది34. నష్టమై నాయందే ఉన్నది. నాకు సముడుగాని, అధికుడుగాని లేడు, నా స్వరూప పరిజ్ఞానం వల్లనే సదా సంసారహరణం35; నాకు సంబంధించిన జ్ఞానం ముముక్షువు, వ్రతనిష్ఠుడు, ప్రశాంతుడు, కర్మకలాపమును విడిచినవాడు ధ్యాననిష్ఠుడు, శివగోచరధ్యాననిష్ఠుడు, యజ్ఞదానాదుల చేత మహాపాపార్ణవాలను క్షీణింపచేసుకొన్న వాడు అయిన మహాత్మునికి వేదాంతశ్రవణంవల్లనే కలుగుతుంది.3 ,3".

ఈవిధంగా నన్నుగూర్చి తెలుసుకొన్నవాడు సర్వమూ తెలిసినవాడు. సురపుంగవులారా, మీకు చెప్పిన వేదాంతజ్ఞానం పాశుపత వ్రతాన్ని ఆదరంతో ఆచరించిన ద్విజులకే ఉపదేశించదగినది. ఇది వేదానుశాసనం'38 39 అని వక్కాణించాడు.

## సూతుడు చెప్పాడు

ఇలా చెప్పి భగవానుడు రుద్రుడు అక్కడనే అంతర్థానం అయినాడు.

అపుడు దేవతలు, 'మునిశ్రేష్ఠులారా,, దేవదేవుని వైభవం40 తెలుసుకొని అసూయారహితులై ఆయనను జగత్కారణునిగా భావించారు కనుక, మీరుకూడా శ్రేష్ఠులారా, సర్వజ్ఞుని పరమేశ్వరుని 41 జగత్కారణునిగా తెలుసుకొని సర్వకారణుని సేవించండి. ఆ సర్వజగత్కారణుడు, సోముడు సోమార్ధశేఖరుడు అఖిలేశ్వరుడు కూడా ప్రసాదాభిముఖుడై బ్రహ్మ విష్ణ్వాదులతోసహా సాన్నిధ్యం అనుగ్రహిస్తాడు వేదవేత్తృశ్రేష్ఠులారా' 42 43 అని చెప్పాడు.

ఇలా మహాదేవుని మాహాత్మ్యమూ, శ్రీమత్పాశుపతప్రభావమూ విని, మహాత్ములు నైమిశారణ్యవాసులు44 మనస్సులో హర్షించి మహాత్ముని సర్వార్థసాగరుని సూతుని నమస్కరించి విజ్ఞప్తిసిద్ధికొరకు భక్తితో పూజించారు45.

: ఇది శ్రీస్కాందపురాణం శ్రీసూతసంహితలోని శివమాహాత్మ్యఖండంలో పాశుపతవ్రతం అను రెండవ అధ్యాయం :

41. అసూయారహితులై = అసూయ అన్నది మనస్సుకు పట్టిన మకిల. మలినచిత్తులకు జ్ఞానం కలుగదు కనుక మనోమాలిన్యం పోవటానికి పతంజలి కొన్ని కర్మలు నిర్దేశించాడు. 1. సుఖపడేవారిపట్ల మైత్రిని భావించటం. ఇందువల్ల ఇతరులసుఖం తమదే అనిపించినందున మనసులోని ఈర్ష్యామలం పోతుంది. 2.దుఃఖితులపట్ల జాలిపడడం. ఇందువల్ల దుఃఖకారణమైన ద్వేషమలం తననుంచి పోతుంది. 3. పుణ్యం చేసేవారినిచూచి సంతోషించటం. ఇందువల్ల మంచినికూడా చెడుగా చూసే అసూయామలం పోతుంది. 4. పాపం ఆచరించేవారిపట్ల ఉపేక్షవహించటం. ఇందువల్ల పాపాత్ముల సాంగత్యంపోయి సంసర్గజన్యమైన మలం పోతుంది. తా. టీ.

# భగవద్గీతాధ్యయనమునకు పరిచయము

## స్వామి రంగనాథానంద

ఉపనిషత్తులలో మహోన్నతమైన, అత్యంత నిగూఢమైన భారతీయ భావసంపద నిండి ఉన్నది. అందులోని భావాలను ఒక ప్రణాళికలో క్రమబద్ధం చేయుటకు ప్రప్రథమంగా చేయబడిన యత్నమే భగవద్గీత. క్రీస్తు పూర్వం 14 వ శతాబ్దంలో భారతదేశంలో జరిగినసంఘటనలను క్రోడీకరించిన మహాభారత గాథకు గీత సంబంధపడిఉంది. నవీనపండితులు ఈ గ్రంథం క్రీ. పూ. 9 వ శతాబ్దిలో వ్రాయబడినట్లుగా ఊహించారు. ప్రాచీన భారత చరిత్రయందలి కాలనిర్ణయం సరిగాలేదు. బుద్ధుని కాలంనుండి కొంత సరియైన కాల నిర్ణయం లభిస్తుంది. గీతా గ్రంథరచన బుద్ధునకుముందు ఒకటి రెండు శతాబ్దాలక్రిందట జరిగినట్లుగా భావించారు.

మనదేశంలో ప్రచారమునకు తేబడిన ప్రతి గొప్ప సిద్ధాంతం ఒక చరిత్రను సృష్టించింది. అట్టి సిద్ధాంత నిర్మాణం వెనుక ఒక మహోన్నతవ్యక్తి ఉంటువచ్చాడు. క్రీ. పూర్వం 6 వ శతాబ్దంలో బుద్ధుడు - క్రీ. శ. 8 వ శతాబ్దంలో శంకరాచార్యులవారు అవతరించారు. ఆ మహాత్ములందించిన వెలుగులోనే నేటికి మనం జీవిస్తున్నాము. మన వెనుక అయిదువేల సంవత్సరాల చరిత్ర గలదు. మన మింకను ఆ ప్రాచీనజాతికి చెంది ఉన్నాము. ఆ సనాతన ఆశయాలే నేటికి మనలో చైతన్యం కలిగిస్తున్నాయి. ఈ ప్రపంచంలో ఈ సంస్కృతిని సుస్థిరంగా ఉంచగలిగినదేది? అనేక నాగరికతలు ఈ ప్రపంచరంగంలోనికి వచ్చాయి. నీటి బుడగలవలె అంతరించిపోయాయి. ఈ నాగరికతలలో ఇండియా, చైనా సంస్కృతులు స్థిరంగా ఉండిపోయాయి. మన సంస్కృతిలో గల ఈ నిత్య జీవ చైతన్యానికి కారణం ఎక్కడుందో, ఎటువంటిదో గాఢంగా తెలుసుకోవాలి. ప్రపంచంలో గొప్ప చరిత్ర పాత్ర వహించిన గ్రీసు, రోము దేశాలు ఈ నాడు నశించిపోయాయి. వాటి సంస్కృతీ స్రవంతి ఎండిపోయింది. ఇండియా తన నిజస్వరూపం చెడగొట్టుకోనకుండా నూతన ఆగంతుకులకు, ఇంకను భవిష్యత్తులో రాగలవారికి స్వాగతం చెపుతూనే ఉంది. ఇది చరిత్రలోని సత్యం. నేటివరకూ ఇది నిలచిఉండుటలో గల ఆంతర్యం గ్రహించాలి. వేదములు, ఉపనిషత్తులనుండి ప్రారంభమైన ఆలోచన, భావాలు, వాటిచే ప్రభావితులైన శ్రీకృష్ణ, బుద్ధ శంకరాదులు మనకందించిన సంస్కృతి విలువల ప్రభావం మనం వాటి ననుసరించుట - ఇవి మనజాతి, సంస్కృతులయొక్క సంతత జీవ చైతన్యానికి కారణంగా గ్రహించాలి. ఒక సంతత జాతిగా మనకూ ఉన్నతి, పతనావస్థ లున్నాయి. ప్రతి చోట పెరుగుట, తరుగుట ఉంటాయి. కాని మనదేశంలో గల ప్రత్యేకత ఏమంటే ఇతరులు పతనమై మరల తలెత్తలేరు. కాని మనం పతనమైనప్పటికి మరల తల ఎత్తగలం. ఇతరులు జీవించి మృతి పొందుతూంటే, ఇండియా మృతి చెందినప్పటికి మరల ద్విగుణీకృత చైతన్యంతో, వైభవంతో తలయెత్తి జీవిస్తుంటుంది. 19 వ శతాబ్దంలో వచ్చిన క్రైస్తవ మిషనరీలు, మరల తల యెత్తకుండా ఇండియా నశించి పోయిందనుకున్నారు. అమెరికాలో గొప్ప నాగరికతను సృష్టించిన తెల్లవాని హస్త స్పర్శతో నశించిపోయిన రెడ్ ఇండియనులు, మెక్సికనులు, ఐనన్సు జాతు

లతో పోల్చి ఈ అభిప్రాయం వెలిబుచ్చారు. మనంకూడా ఈ మిషనరీలు చెప్పిన తీర్పు అంగీకరించవలసి వస్తుందనుకున్నాము. ఈ నాడు పరిస్థితులను జూచిన మనం మరొక విధంగా భావిస్తున్నాము. మన నాగరికత సంస్కృతుల గూర్చి కేవలం పశ్చాత్త్య దృష్టితోగాక ప్రభావపూర్ణమైన దృష్టితో ప్రపంచాన్ని ఎదుర్కొంటున్నాము. పొంగిపొరలే స్వభావంగల ఏ సంస్కృతియైనా సరే అది సజీవంగా ఉన్నట్లు భావించాలి. వికాసము పొందుట జీవలక్షణం – ముకుళించుట మృత లక్షణము. ఒక వేయి సంవత్సరాలనుండి మనం మృతిని అభినందించాము. మనచుట్టు సంకుచితమైన గోడలు నిర్మించుకున్నాము. గత నూరేండ్లనుండి ఈ సంకుచితమైన గోడలు బ్రద్దలుగొట్టి మన ఆశయాలను ప్రపంచ మండలి దూర దేశాలలో వ్యాప్తిచేస్తూ ప్రపంచాన్ని ఎదుర్కొంటున్నాము. ఒకనాటి సనాతనజాతి, సనాతన సంస్కృతి మరల పునరుజ్జీవితమై బలపడింది. ఇది ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. ఇతర దేశాలు ఏదో కొంత సందడి చేసి నశించిపోతూంటే మనం కొంతకాలం నిద్రించి మరల ద్విగుణీకృత తేజస్సుతో ప్రపంచాన్ని అవలోకిస్తున్నాము.

మన చరిత్ర నొకమారు అవలోకించండి. ప్రతి వేయి సంవత్సరాలకూ ఒక మహా పురుషుడు జన్మిస్తుంటాడు. ప్రాచీన సనాతన ఆశయాలనే మరల నూతనోత్సాహంతో కాలానుసరణమైన, అవసరాలకు తగిన కొలది మార్పులతో కూడిన ప్రభావం కల్పించి ప్రబోధించుటకే ఈ మహాత్ములు అవతరిస్తూంటారు. మన సంస్కృతి నిరాటంకంగా సంతతధారగా ఉండుటకు ఇదే కారణం.

భగవదవతారమూర్తులని మనం భావించే మహా పురుషులమూలంగా మన సంస్కృతి స్రవంతి నిర్విరామంగా సాగిపోతూందని ఎల్లవేళలా గుర్తుంచుకోవాలి. వారు, జాతీయ జీవనం పతనావస్థలోనున్న తరుణంలో వస్తారు. వారి స్పర్శతో నిర్జీవమైపోయిన జాతి ఎముకలు, కండరాలలో నవచైతన్యం ఉదయిస్తుంది.

## శ్రీ కృష్ణునిపాత్ర.

శ్రీకృష్ణు నంతటి గొప్పవ్యక్తి అత్యున్నత తేజశ్శాలి భారతచరిత్రలో మరొకవ్యక్తి గోచరించడు. మహా భారతచరిత్ర చదివినవారికి తెలుస్తుంది. శ్రీకృష్ణుడు అందరికి ప్రేమపాత్రుడైనాడు. శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థం వచ్చినపుడు వేలాదిజనం ఆయనను అభినందించుటకై వచ్చేరు. ఈ నాటి ప్రజానాయకులకు స్వాగతమీయడానికి వచ్చినట్లె ప్రజలు పిట్టగోడ లెక్కి కిటికీలలోంచి చూస్తూ, ఆయన పట్టణవీధులలో నడుస్తూంటే పువ్వులు జల్లుతూ కృష్ణునకు స్వాగతమిచ్చారు. సాధారణపౌరులు మొదలు మునీశ్వరులవరకు ప్రతి ఒక్కరూ ఆయనయెడల అధిక గౌరవం ప్రదర్శించారు. ఆయన క్షత్రియోత్తముడైనప్పటికీ ఎంతో వినయసంపన్నుడు. ఏదైనా ముఖ్యకార్యం ప్రారంభించేముందు ధర్మజ్ఞులకూ నమస్కరించుటకై వెళ్లును. అంత్యజులకు, నిమ్న జాతీయులకు ఆయన స్నేహితుడు. ఆయన ఇంద్రప్రస్థంలో దుర్యోధన చక్రవర్తి రాజభవన మండలి విడిది నిరాకరించి పేదయగు విదురునింట విడిది చేసెను. ఆయన గొప్ప పరాక్రమశాలి. అనేకమంది రాజులు ఆయనకు పాదాక్రాంతులైనారు. ఆయనకు సామ్రాజ్యమక్కర లేదు. పశులకాపరులచే ప్రేమింపబడిన గోపాలుడాయన. వృద్ధులు బాలురు, స్త్రీలు

పురుషులు, జ్ఞానులు, సాధారణులు అందరికి ఆయన ప్రేమపాత్రుడు. ఆయన కాలంనాటి భారతదేశంలో ప్రతిచోట ఆయన ప్రభావం వెల్లివిరిసింది. ప్రజలలో ప్రతి తరగతి ఆయనను గుర్తించారు.

శ్రీకృష్ణుడు ఎంతటి ప్రతిభాశాలియో ఆయన ప్రబోధలు అంత శక్తివంతములు. ఇటువంటి కృష్ణుని మనం బోధపరచుకోవాలి. పతిత భారతదేశాన్ని ఉద్ధరించుటకై సుదర్శన చక్రంతో అవతరించిన శ్రీకృష్ణుని స్తుతించే ఒక బెంగాలీ గీత ఇలా ఉంది.

'అవనత భారత సహే తుమారె
ఏసో సుదర్శనధారీ మురారీ'

భారతదేశ సంస్కృతిలోని ప్రతి రంగాన్ని ప్రభావిత మొనర్చినవ్యక్తి ఆయన. శ్రీకృష్ణుడు లేనిదే సంస్కృతిలో విలువగలవన్నీ మరుగై పోతాయి. భారతీయ కళలలో, శిల్పాలలో, సాహిత్యంలో, సంగీతంలో, చిత్రరచనలో, నాట్యంలో ఇంకను ఎన్నింటిలోనో ఆయన ముద్ర ఉన్నది. అనేకమంది విదేశీయులు భారతీయ సంస్కృతీ వారసత్వం చూచి అసహనంతో ఉంటారు. సనాతనమైన వేదములనుండి ఉద్భవించిన ఈ భారతీయ సంస్కృతీనది వేల కొలది సంవత్సరాల నిరాటంక ప్రవాహంలో అనేక శాఖలనుండి బలము, సమృద్ధి సంతరించు కొన్నది. ఈ నాడిది శక్తి, పవిత్రత సౌశీల్యములలో పొంగి పొరలుచున్న మహాసాగరము. ఇంతటి సుసంపన్నమైన సంస్కృతీ వారసత్వంలో భాగస్వామినని ప్రతి భారతీయుడు గర్వించాలి.

మన సంస్కృతిని బలపరచి, వృద్ధిచేసిన వారిలో శ్రీకృష్ణుడు అగ్రేసరుడు. మానవ జాతి, హిందు, ముసల్మాను, క్రైస్తవాది మత శాఖలుగా విడిపోవుటకు చాలకాలం ముందు ఆయన అవతరించాడు. కాబట్టి హిందు ముస్లిం మొదలగు వారెవరైనా సరే, ఈ దేశంలో పుట్టిన ప్రతి శిశువుకు ఆయన చెందుతాడు. ఈ మహోన్నత సంస్కృతీవారసత్వ సంపదలను తరతరాలుగా మనకందించి మానవ హృదయమందిరాలను తీర్చి దిద్దిన శిల్ప సమ్రాట్టులు వారని ప్రతిఒక్కరు గ్రహించేకాలం వస్తుంది. ఈ సంస్కృతి సకల జాతులకు సమష్టి సంపద. ఇండోనీషియా మాజీ అధిపతి డాక్టరు సుకర్నో హిందూపత్రిక కిచ్చిన వ్యాసంలో "ప్రతి ఇండోనీషియను రక్తంలో భారతీయ సంస్కృతి ఉన్నదని" వ్రాశాడు. భారతీయులలో ప్రతివ్యక్తి ఈ ప్రాచీన సంస్కృతి తమకు ఆదర్శమని, ఉత్తేజ కారణమని అంగీకరించే కాలం రాగలదని ఊహించుటలో కష్టంలేదు.

మహాభారతకృష్ణుడు గొప్ప వేదాంతి, కర్మవాదిఅయినప్పటికి ఆయన పూర్తిగా నిర్లిప్తుడు. గీత, ఇంతటి మహోన్నత విద్యుత్సదృశశక్తిగల వ్యక్తిచే ప్రబోధింపబడినది. తమలో ఏ మాత్రమైనా అట్టి మహోన్నత భావనాశక్తిగలవారే అందలి ఉన్నత భావాలను బోధపరచుకొనగలరు. బలహీనులకు మూఢ నమ్మకస్థులకు గీత ప్రబోధలలో స్థానం లేదు. శ్రీకృష్ణుడు అర్జునునితో చేసిన సంభాషణ ప్రథమ శ్లోకంలోనే "కుతస్త్వాకశ్మలమిదం విషమే సముపస్థితం?" ఈ క్లిష్టతరుణంలో ఎక్కడనుండి ఈ బలహీనత నీలో ఆవరించింది?" అంటాడు. ఉపనిషత్తులు, గీత, పౌరుషాన్ని ప్రబోధిస్తాయి. స్వామి వివేకానంద "ఉపనిషత్తులు ప్రతి పుటలోను ప్రబోధించేది బలం – బలం అంటారు. దుర్బల మనస్కులు ఎన్నటికి గొప్ప ఉన్నతభావాలనూ గ్రహించి బోధపరచుకోలేరు.

జీవితసమస్యలన్నింటిలోను మనలను బలపరచేది గీతలలో దొరుకుతుంది. జీవితంలోని క్లిష్టసమస్యల నెదుర్కొన భయపడువారికి పురాణాలలో కొల్లలుగా ఆశ్రయం, ఆలంబన లభిస్తుంది. కష్టముల సహించి జీవనం గడుపు వారికి, ఉన్నత జీవితాశయాలు గలవారికి గీతలలో ఉత్తేజం లభిస్తుంది. దృఢమనస్కులు మాత్రమే గీతవిలువ గ్రహింపగలరు. ''సింహముయొక్క శక్తి ఏనుగు గ్రహిస్తుంది గాని, దోమ కాదు'' అని వివేకానందులంటారు. జోలపాడి జోకొట్టుటకు నిద్రపుచ్చుటకు గీత పనికిరాదు. నిద్రమత్తునుండి, సోమరితనంనుండి మనలను మేల్కొలిపి అత్యుత్తమమైన ఆత్మజ్ఞానం కలిగించుటకు గీత ఉపకరిస్తుంది. మనలో నూతన చైతన్యం కలిగించి నూతన దృక్పథంతో మన ఆలోచనను పురికొల్పేశక్తి గీతాశ్లోకాలలో గలదు.

(స్వేచ్ఛానువాదం : కామఋషి సత్యనారాయణవర్మ.)

## పుస్తక పరిచయము

**శంకరగ్రంథరత్నావళి — అష్టమసంపుటము.**
**పేజీలు : 316, వెల : రూ. ౮-00.**

ఆదిశంకరుల గ్రంథనిర్ణయ విషయంలో మూడు వాదాలున్నాయి. 1. సంప్రదాయ వాదం, 2. హేతువాదం, 3. తీవ్ర హేతు వాదం. ఆయనపేర ఉన్న గ్రంథాలన్నీ వ్రాసింది ఆయనే అన్న అభిప్రాయం సంప్రదాయ వాదులది. దశోపనిషత్ భాష్యాలు, గీతాభాష్యం, బ్రహ్మసూత్రభాష్యం, ఉపదేశ సాహస్రి శ్లోకభాగం — ఇంతవరకే ఆయన వ్రాసిందని హేతువాదు లంటారు. దశోపనిషత్తులలోను ఈశ, మాండూక్యాల భాష్యాలు ఆయనవి కావని తీవ్రహేతువాదుల అభిప్రాయం. సాధన గ్రంథమండలివారు సంప్రదాయానుసారంగా శంకరాచార్య పేరనున్న గ్రంథాలన్నీ ౪౭ సంపుటాలుగా తెలుగు లిపిలో తాత్పర్యసహితంగా వెలువరించాలనే సంకల్పంతో ఇంతవరకు 8 సంపుటాలను ముద్రించ గలిగారు. ఈ అష్టమ సంపుటంలో 31 స్తోత్రాలు తాత్పర్యసహితంగా ముద్రింపబడినాయి. సంస్కృతాంధ్రభాషల్లో మంచి పాండిత్య సంపదగల శ్రీ తాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రిగారు ఈ స్తోత్రాలకు మూలానుసారంగా హృద్యమైనశైలిలో తాత్పర్యం వ్రాసియున్నారు. సాధనగ్రంథ మండలి వ్యవస్థాపకుడైన శ్రీ బులుసు సూర్య ప్రకాశశాస్త్రిగారికి, తక్కిన సంపుటాలను వెలువరించే ప్రయత్నంలో తగిన ప్రోత్సాహం ఇవ్వగల ఆదరణ ఈ గ్రంథానికి లభించాలని ఆశిస్తున్నాం.

**జగద్గురుబోధలు—తొమ్మిదవ సంపుటము.**
**సంకలనకర్త : విశాఖ, పేజీలు : 212,**
**వెల : రు. 6-00.**

ఏడుకొండలవాడు శివుడా? విష్ణువా? సుబ్రహ్మణ్యుడా? అంబికా? లేక సర్వ దేవ దేవీ స్వరూపుడా? ఈ దేవుణ్ణి ఉత్తర దేశం వారు బాలాజీ అని ఎందుకు పిలుస్తారు? శంకరాచార్యులకు ఎన్ని వేలమంది శిష్యులు? ఆయన్ని జగద్గురువు అనడం సమంజసమేనా? దీపావళి ఆచారాల వెనుకగల అర్థం ఏమిటి? సుబ్రహ్మణ్యస్వామిని తమిళులు మురుగన్ అని చాల అప్యాయంగా పిలుస్తుంటారే ఆ పదానికి గల అర్థం ఏమిటి? — ఇత్యాది ఆసక్తికరమైన విషయాలెన్నో హిందూమతానికి సంబంధించినవి ఈ పుస్తకంలో చక్కగా చర్చించబడినాయి. కంచి కామకోటి శ్రీ చంద్రశేఖరేంద్ర

సరస్వతీస్వాములవారు ఆంధ్రదేశ పర్యటనలో ఇచ్చిన ఉపన్యాసాలనే ఈ పుస్తకరూపంగా సాధనగ్రంథమండలివారు ప్రచురించారు. కేవలం అక్షరజ్ఞానం మాత్రమే ఉన్నవాళ్ళ కయినా సరే చదవడానికి కష్టమనిపించనంత సరళంగా ఉన్నది ఇందులోని భాష.

### శ్రీ విద్యాంధ్రభాష్యము

రచన : ఈశ్వర సత్యనారాయణశర్మ,
పేజీలు : 80, వెల : రు. 3-00.

బ్ర. శ్రీ హరి సాంబశివశాస్త్రిగారన్నట్లు, ఈ గ్రంథంలో గాయత్రీ విద్యాస్వరూపము, ఉపాసనావశ్యకత, గాయత్రీవిద్యా-శ్రీ విద్యల యొక్క అనన్యత్వము, షోడశీవిద్య - ఆ విద్యకు గల, గురుముఖైక వేద్యములయిన, వివిధ గూఢార్థములు - సులభగ్రాహ్యమగు శైలిలో వివరింపబడినవి.

పై మూడు గ్రంథముల ప్రతులకు :
సాధనగ్రంథమండలి, తెనాలి.

### వెంకటేశ్వర సుప్రభాతగీతములు
మరియు
### శ్రీ లక్ష్మీనారాయణ స్తోత్రమంజరి.

నాల్గవ కూర్పు, పేజీలు : 128, వెల : రు. 3-00.

ఇందు శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం, స్తోత్రం, ప్రపత్తి, మంగళాశాసనం; శంకరాచార్య విరచిత కనకధారా, నారాయణ షట్పదీ, లక్ష్మీనృసింహ భజగోవిందస్తోత్రాలు, దేశిక విరచిత శ్రీస్తుతి పద్యానువాద సహితంగా ప్రచురింపబడినవి.

### ఆపదుద్ధారక శతకము
మరియు
### సప్తర్షి రామాయణము - తెనుగు సీసములు.

మూడవకూర్పు, పేజీలు : 30, వెల : రు. 1-00.

ఆపదుద్ధారక స్తోత్రానికి, ఆపదుద్ధారకా అన్నే మకుటంలో తెనుగు శతకరూపంలో అనువాదం మరియు సప్తఋషులు రామునిపై చెప్పిన ఏడు శ్లోకాలకు సీసపద్య అనువాదములను ఇందు కలవు.

### హనుమాన్ చాలీసా
మరియు
### శ్రీ కృష్ణ బోధామృతసారము

మూడవకూర్పు, పేజీలు : 44, వెల : రు. 1-00.

ఇందు శ్రీ రామచంద్రప్రభాతీ, సాయంకాలికీ వందనా, శ్రీ రామాయణ ఆరతీ, శ్రీ హనుమాన్ స్తోత్ర - దండక సహిత హనుమాన్ చాలీసా మరియు భగవద్గీతలోని ఒక్కొక్క అధ్యాయంలోని ఒక్కొక్క ముఖ్య శ్లోకానికి పద్యగద్య రూపాలలో వివరణయు గలదు.

పై మూడు గ్రంథముల రచయిత : కీ. శే. బాపట్ల హనుమంతరావుగారు. ప్రతులకు : బాపట్ల వేంకట పార్థసారథి, శ్రీ సాయీ నిలయం, చెరువు (పోస్టు) 522113.

### సహస్రాధిక సూక్తి ముక్తావళి

రచయిత : కాశావఝ్ఝల రామకోటిశాస్త్రి,
పేజీలు: 186, వెల: రు. 4-00. ప్రతులకు : కాశావఝ్ఝల రామకోటిశాస్త్రి, కోమటివీధి, మార్కాపురం - 523316.

ఈ గ్రంథ విషయమై పుట్టపర్తి నారాయణాచార్యులుగారు ఈ క్రింది అభిప్రాయమును ప్రకటించియున్నారు. 'ఇందులో వేయికిపైగా భగవన్నామములను వారు (రచయిత) జపించి ఒక్కొక్క నామముక్రిందను ఒక్కొక్క నీతిని అలంకారసుందరముగ రమణీయముగ జెప్పిరి. ఈ చెప్పుట వారి స్వాభిభాషణముగాదు. ఎన్నియో శతకములనుండి సంగ్రహించినవి. ముఖ్యముగానిది శతక వాఙ్మయసారమని చెప్పవచ్చును. ప్రజలు వీరి కృతిని ఆదరాభిమానములతో గారవింతురని తలచుచున్నాను'

—సదాశివం.

# బాలల శారదాదేవి

**బి. ఎస్. ఆర్. ఆంజనేయులు**

"ప్రభూ! చంద్రునిలోనైనా మచ్చవున్నది, నా శీలంలో మచ్చవద్దు."

శ్రీ శారదాదేవి మూడవసారి దక్షిణేశ్వరానికి వెళ్లటానికిముందే చంద్రామణీదేవి చని పోయింది. అత్తగారు లేకపోవటంవల్ల ఆమె వంటరిగానే వుండాల్సి వచ్చింది. శారదాదేవి చిన్నప్పుడంతా కష్టాలే పడింది. దక్షిణేశ్వరం వచ్చినతర్వాతకూడా అవి తప్పలేదు. చిన్న గదిలో ఉండేది. అక్కడే వంటసామాన్లు, అక్కడే వంట, అక్కడే పడక.

శ్రీ రామకృష్ణునిదగ్గరకు రకరకాలవాళ్లు వచ్చేవారు. వాళ్ళందరికి రకరకాలవంటలు చేయాలి. ఒక్కొక్కసారి నలభైమందికికూడా వండాల్సి వచ్చేది. శ్రీ రామకృష్ణుని ఆరో గ్యానికి తగినట్లుగా ప్రత్యేకంగా వండాలి. ఇంత చేయాల్సివచ్చినా ఆమె ఏమీ బాధ పడేది కాదు. చాలా దగ్గరలోయున్నా రామకృష్ణుని చూడటానికికూడా కొన్నిరోజులు వీలుండేది కాదు. ఒక్కొక్కసారి నెలరోజులదాకా అవకాశం చిక్కేదికాదు.

ఇంత ఓర్పుకు కారణమేమిటో తెలుసా? అది ఆమెకున్న నిర్మలమైన మనస్సే. అది ఆమె చేస్తున్న తపస్సువల్ల కల్గింది. ఆమెకు చాలా సిగ్గు కాబట్టి తెల్లవారురూమున మూడు నాలుగు గంటలకే లేచేది. చీకట్లో గంగకుపోయి స్నానం చేసేది. తెల్లవారినతర్వాత ఎవరికంట పడేదికాదు. తెల్లవారేదాకా జపము, ధ్యానము చేసేది. ఒక్కరోజుకూడా ఆల స్యంగా లేచేదికాదు. ఇన్నిపనులుచేస్తున్నా ఆమె సాధన మానేదికాదు.

ఇంకో కారణంకూడా వుంది. ఆమె జపంతోపాటు భగవంతుని ప్రార్థనకూడా చేసేది. తెల్లవారురూమునే గంగకు పోయినప్పుడు నీళ్ళల్లో చంద్రుని చూచేది. పూర్ణిమనాడు వెన్నె లలో కూర్చుని అన్నివైపులా పడుతున్న వెన్నెల చూచేది. గుండ్రంగాయున్న చంద్రబింబం కూడా పరిశీలించేది. ఇంత చల్లని వెన్నెలయిచ్చినా, యింతహాయిని కల్గించినా, చంద్రునిలో మచ్చ వుండటం ఆమె గమనించింది. అందుచే దేవుణ్ణి యిలా ప్రార్థించటం మొదలుపెట్టింది. "ఓ దేవా! చంద్రునిలోకూడా మచ్చవున్నది. నాశీలం యేమాత్రము కల్మషం లేకుండా చెయ్యి. నన్ను చంద్రుని వెన్నెలవలె పవిత్రంగా వుండేట్లు అనుగ్రహించు". శ్రీ శారదాదేవి ఓర్పుకు, పవిత్రతకు ఆమె చేసిన తపస్సే కారణం.

తెల్లగను చల్లగను హాయి వెల్లివిరియు
చంద్రునకు కూడ మచ్చలు చాలగలవు.
ఎంతమాత్రము కల్మషమెరుగనట్టి
శీలమును నాకు ప్రాప్తింప జేయుమయ్య.

సంపాదకులు: శ్రీ చిద్ఘనానందస్వామి.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600 021) న ముద్రింపబడి.

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600 004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

| | |
|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము | 8.00 |
| శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర | 10.00 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 8.00 |
| శ్రీ రామకృష్ణోపనిషత్తు | 3.75 |
| శ్రీ రామకృష్ణపరమహంస నీతికథారత్నములు | 2.50 |
| గురూపదేశములు | 2.00 |
| నా గురుదేవుడు | 1.25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1.50 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహము | 0.75 |
| ఆరాత్రికము మరియు | |
| శ్రీ రామనామ సంకీర్తనము | 0.50 |
| శ్రీ రామకృష్ణుడు, వివేకానందస్వామి | 0.25 |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4.00 |
| శ్రీ శారదాదేవి | 2.50 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | 0.80 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4.00 |
| బాలల వివేకానందుడు | 2.00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి | |
| 9 సంపుటముల పూర్తిసెట్టు (సాదా) | 45.00 |
| ,, ,, (క్యాలికో) | 58.50 |
| విడి సంపుటములు ఒక్కొక్కటి (సాదా) | 4.00 |
| ,, ,, (క్యాలికో) | 5.50 |
| స్వామి శిష్య సంవాదములు | 16.50 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 5.00 |
| ,, (రెండవ భాగము) | 5.50 |
| భారత యువజనులారా! | 3.00 |
| ప్రబోధ రత్నాకరము | 3.75 |
| రాజయోగము | 6.25 |
| కర్మయోగము | 4.00 |
| భక్తియోగము | 4.00 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 2.25 |
| ,, (రెండవభాగము) | 3.00 |

| | |
|---|---|
| హిందూ మతము | 4.00 |
| వివేక సూర్యోదయము | 4.00 |
| అనుష్ఠాన వేదాంతము | 2.50 |
| ప్రాచ్యము - పాశ్చాత్యము | 1.25 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 3.00 |
| భారతదేశము | 2.00 |
| భారతీయ మహిళ | 2.00 |
| నా జీవితము, జీవిత కర్తవ్యము | 1.25 |
| శ్రీ రామకృష్ణ సేవాసంస్థ : ఉద్దేశ్యములు | 0.50 |
| చికాగో నగరోపన్యాసములు | 1.00 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0.80 |
| నవీన భారత దేశము | 0.40 |
| సర్వం విష్ణుమయం జగత్ | 0.30 |
| శ్రీ వివేకానంద సింహగర్జనలు | 0.20 |
| బ్రహ్మానంద బోధనలు | 4.75 |
| తాపత్రయ చికిత్స | 0.60 |
| ముక్తిమార్గము | 0.30 |
| పారమార్థిక సంభాషణలు | 6.50 |
| నారద భక్తి సూత్రములు | 4.00 |
| శ్రీ పెద్ద భాగవతము-మూడవ సంపుటము | 7.00 |
| దేవీమాహాత్మ్యము | 4.00 |
| శ్రీ మద్భగవద్గీత | 9.00 |
| పారాయణగీత తాత్పర్యసహితము | 3.75 |
| ,, మూలము | 2.00 |
| కఠోపనిషత్తు | 2.00 |
| గిరీశచంద్ర | 1.00 |
| భక్తిమార్గము | 1.00 |
| శ్రీకృష్ణవాణి | 0.80 |
| బుద్ధవాచ | 0.80 |
| క్రైస్తు సూక్తిమాల | 0.80 |
| మహమ్మదు సూక్తి మంజరి | 0.80 |

ఇవి యేకాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును,

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైలచిత్రములు మున్నగున వెన్నియో మా యొద్ద లభింప గలవు.

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600 004

సంవత్సర చందా రూ. 7 జీవిత చందా రూ. 100 విడి సంచిక 70 పై.

# శ్రీ రామకృష్ణప్రభ

సంపుటము 35 1978 - జూన్, జూలై సంచిక 6.

## విషయసూచిక



శ్రీ రామకృష్ణప్రభ

సంవత్సర చందా: రూ. 7-00. జీవిత చందా: రూ. 100-00.

విడి ప్రతి: 70 పైసలు.

శ్రీ రామకృష్ణమఠము

మైలాపూరు

మద్రాసు – 600 004.

## చందాదారులకు మనవి

ఆగస్టునుండి ప్రతినెల మొదటివారములోపలనే చందాదారులకు రామకృష్ణ ప్రభను అందజేయవలెనని నిశ్చయించినాము. అందువలన జూన్, జూలై సంచికలను ఒకటిగా చేర్చి జంట సంచికగా ప్రచురించవలసి వచ్చినది. ఆగస్టునుండి యథాప్రకారము ప్రతినెల విడివిడిగానే రామకృష్ణ ప్రభ వెలువడగలదు. ఇకమీదట, ఇంగ్లీషునెల మొదటి వారములోపల మీకు రామకృష్ణ ప్రభ చేరకపోయినచో ఆ విషయమును మాకు తెలియజేయగలరు.



ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 35 1978 - జూన్, జూలై సంచిక 6, 7

## నారాయణ సూక్తమ్

సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశమ్భువమ్
విశ్వం నారాయణం దేవమక్షరం పరమం ప్రభుమ్

సహస్రశీర్షం=అనంతశిరస్సులు కలిగినట్టియు, విశ్వాక్షం=అనంతనయనములు కలిగినట్టియు, విశ్వశంభువం=సమస్తజగత్తునకు సుఖమును కలుగజేయునట్టియు, విశ్వం=జగదాత్మకుడైనట్టియు, నారాయణం = పంచమహాభూతములందుండునట్టియు, అక్షరం = నాశరహితుడైనట్టియు, పరమం=శ్రేష్ఠుడైనట్టియు, ప్రభుం=జగన్నియామకుడైనట్టియు, దేవం=మహేశ్వరుని= (ధ్యానము చేయవలెను.)

విశ్వతః పరమం నిత్యం నారాయణగ్ం హరిమ్
విశ్వమేవేదగ్ం పురుషస్తద్విశ్వముపజీవతి

విశ్వతః పరమం = జడప్రపంచముకంటే శ్రేష్ఠమైనట్టియు, నిత్యం = వినాశరహితుడైనట్టియు, విశ్వం = సర్వాత్మకుడైనట్టియు, హరిం=పాపములను అజ్ఞానమును హరించునట్టియు (అగు పరమేశ్వరుని ధ్యానించవలెను). ఇదం=ఈ కనపడుచున్న, విశ్వంఏవ=ప్రపంచమే, పురుషః=పరమాత్మ, తత్=ఆ పరమాత్మ, విశ్వం=ప్రపంచమును, ఉపజీవతి=(స్వవ్యవహార నిర్వాహణార్థము) ఆశ్రయించుచున్నాడు.

పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్

విశ్వస్యపతిం=ప్రపంచమునకు పాలకుడును, ఆత్మేశ్వరం = జీవుల నియామకుడును, శాశ్వతం=నిరంతరముగా నుండువాడును, శివం=పరమమంగళస్వరూపుడును, అచ్యుతం=నాశరహితుడును, మహాజ్ఞేయం=(తెలిసికొనదగిన తత్త్వములలో ప్రౌఢుడగుటవలన) మహాజ్ఞేయు

డును, విశ్వాత్మానం=విశ్వాత్ముడును, పరాయణం=ప్రపంచాధారుడును (అగు పరమేశ్వరుని ధ్యానించవలెను.)

నారాయణపరోజ్యోతిరాత్మా నారాయణః పరః
నారాయణపరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరం
నారాయణపరోధ్యాతా ధ్యానం నారాయణః పరః

నారాయణః=నారాయణుడే, పరఃజ్యోతిః=శ్రేష్ఠమగు జ్యోతిస్స్వరూపము, నారాయణః= నారాయణుడే, పరఃఆత్మా=పరమాత్మ, నారాయణః=నారాయణుడే, పరంబ్రహ్మతత్వం= వేదాంతవేద్యమగు తత్వము, నారాయణః = నారాయణుడే, పరః
నారాయణః=నారాయణుడే, పరఃధ్యాతా=శ్రేష్ఠుడగు వేదాంతసాధకుడు, నారాయణః= నారాయణుడే, ధ్యానం=ధ్యానము, నారాయణః = నారాయణుడే, పరః = పాపులకు శత్రువు అగుచున్నాడు. (ఇట్టి నారాయణస్వరూపమును ధ్యానించవలెను.)

యచ్చకించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా
అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః

జగత్=ఈ ప్రపంచమునందు, యత్=ఏ, కించిత్=కొంచెమగునది, సర్వం=అంతయు, దృశ్యతే=చూడబడుచున్నదో, అపివా=లేక, శ్రూయతే చ=వినబడుచున్నదో, తత్=దాని యొక్క, అంతః=లోపలను, బహిః చ=వెలుపలను, సర్వం=అంతట, నారాయణః=నారాయణుడు, వ్యాప్య=వ్యాపించి, స్థితః=ఉన్నాడు. (అట్టి నారాయణస్వరూపము ధ్యానించవలెను.)

అనంతమవ్యయం కవిగ్ం సముద్రేంతం విశ్వశంభువమ్
పద్మకోశప్రతీకాశం హృదయం చాప్యధోముఖమ్

అనంతం=దేశకాలవస్తు పరిచ్ఛేదశూన్యుడును, అవ్యయం=వినాశరహితుడును, కవిం= సర్వజ్ఞుడును, సముద్రే అంతం = సముద్రసదృశసంసారమునందు అవసానరూపుడును, విశ్వ శంభువం=సకలజీవుల సుఖోత్పత్తికి కారణభూతుడును (అగు నారాయణస్వరూపమును ఉపా సించవలెను). (ఇక ఉపాసనాస్థానము చెప్పబడును) పద్మకోశ ప్రతీకాశం=తామర మొగ్గతో సదృశమగు, అధోముఖం=అధోముఖమగు, హృదయం=హృదయకమలము (కలదు).

అధోనిష్ట్యా వితస్త్యాంతే నాభ్యాముపరితిష్ఠతి
జ్వాలమాలాఽఽకులం భాతీ విశ్వస్యాయతనం మహత్

నిష్ట్యాః=గ్రీవాబంధముయొక్క, అధః=క్రిందిభాగమున, నాభ్యాం ఉపరి వితస్త్యాంతే= నాభిప్రదేశము నుండి పన్నిండంగుళముల పైభాగమున, (హృదయపుండరీకము) తిష్ఠతి=ఉన్నది విశ్వస్య=బ్రహ్మాండమునకు, ఆయతనం=ఆధారభూతమైనట్టి, జ్వాలములాకులం= ప్రకాశ పరం పరలతో కూడికొనియున్న, మహత్=పరబ్రహ్మము, (ఆ హృదయ పుండరీకమునందు) భాతి =ప్రకాశించుచున్నది.

సంతతగ్ం సిలాభిస్తులంబత్యాకోశసన్నిభమ్
తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం తస్మింత్సర్వం ప్రతిష్ఠితమ్

ఆకోశసన్నిభం=పద్మముకుళముతో సమానమగు (హృదయకమలము), లంబతి=శరీర మధ్యమునందు అధోముఖముగా వ్రేలాడుచున్నది, (ఆ హృదయకమలము) శిలాభిః=నాడుల చేత, సంతతం=అంతట వ్యాపింపబడియున్నది, తస్య=ఆ హృదయముయొక్క, అంతే=సమీపమునందు, సూక్ష్మం=సూక్ష్మమగు, సుషిరం=సుషుమ్నానాడీ నాళము (గలదు,) తస్మిన్= దానియందు, సర్వం=ఈ జగమంతయు, ప్రతిష్ఠితం=ఆశ్రితమయియున్నది.

తస్య మధ్యే మహానగ్నిర్విశ్వార్చిర్విశ్వతోముఖః

సోఽగ్రభుగ్విభజన్తిష్ఠన్నాహారమజరః కవిః

తిర్యగూర్ధ్వమధశ్శాయీ రశ్మయస్తస్య సన్తతాః

తస్య=ఆ సుషుమ్నానాళముయొక్క, మధ్యే=మధ్యభాగమునందు, మహాన్=ప్రౌఢమగు, అగ్నిః=అగ్ని (కలదు). (ఆయగ్ని) విశ్వార్చిః=బహుజ్వాలలు కలది, విశ్వతోముఖః=అన్నివైపుల వ్యాపించిన ముఖములుగలది, సః=ఆ అగ్ని, అగ్రభుక్=తనకు ముందున్నదానిని అనగా అన్నాదికమును భుజించును, ఆహారం=భుజించిన ఆ యాహారమును (ఆయా అవయవములకు సమానముగా) విభజన్=విభాగించుచు, తిష్ఠన్=ఉండును, అజరః=తాను నశింపనివాడై, కవిః=కుశలుడై యుండును, తస్య=ఆ యగ్నియొక్క రశ్మయః=జ్వాలలు, తిర్యగూర్ధ్వమధశ్శాయీ= అడ్డముగా నిలువుగా వ్యాపించినవై, సంతతాః=అంతట వ్యాపించియున్నవి.

సంతాపయతి స్వం దేహమాపాదతలమస్తకమ్

తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః

(ఆ యగ్ని) ఆపాదతలమస్తకః – పాదములు మొదలుకొని శిరస్సువఱకు వ్యాపించియున్నదై, స్వం దేహం=స్వకీయమగు దేహమును, సంతాపయతి=వెచ్చగానుంచుచున్నది, తస్య=దేహమంతయు వ్యాపించియున్న ఆ అగ్నియొక్క, మధ్యే=మధ్యభాగమునందు, వహ్నిశిఖా=ఒకజ్వాల, అణీయః=అత్యంతసూక్ష్మమైనదై, ఊర్ధ్వా=ఊర్ధ్వప్రసారముగలదై, వ్యవస్థితః =విశేషముగానున్నది.

నీలతోయదమధ్యస్థావిద్యుల్లేఖేవ భాస్వరా

నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా

(ఆ వహ్నిశిఖ) నీలమేఘముయొక్క మధ్యభాగమునందున్న, విద్యుల్లేఖేవ = మెఱుపుతీగవలె, భాస్వరా=ప్రకాశించునదైయున్నది, (అది), నీవారశూకవత్ – నీవారధాన్యపు గింజయొక్క కొనయందుండు పొడవైన తోకవలె, తన్వీ=సూక్ష్మమైనది, పీతా=పసుపు వర్ణము గలది, అణూపమా=లౌకికములగు అతిసూక్ష్మవస్తువులకు ఉపమానముగా చెప్పదగినది.

తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః

స బ్రహ్మ స శివస్సేంద్ర స్సోఽక్షరః పరమస్స్వరాట్

తస్యాః శిఖయాః=ఆ సూక్ష్మమగు వహ్నిజ్వాలయొక్క, మధ్యే=మధ్యభాగమునందు, పరమాత్మా=పరమేశ్వరుడు, వ్యవస్థితః=ఉన్నాడు, సః=అతడే, బ్రహ్మా=విద్యాపతి, సః= అతడే, శివః=గౌరీపతి, సః=అతడే, ఇంద్రః=స్వర్గాధిపతి, సః=అతడే, అక్షరః=మాయానిర్లిప్తుడైన ఈశ్వరుడు, సః=అతడే పరమః=శుద్ధచిద్రూపుడు, సః=అతడే, స్వరాట్=స్వప్రకాశుడు

# వివేకానందవాణి

మీ సర్వాంగ కార్యక్రమముతో ముందుకు సాగిపొండు. ప్రేమ, చిత్తశుద్ధి, క్షమ - ఇవి దక్క మరేమియు అక్కఱలేదు.

జీవితమనగా వికాసము. వికాసమనగా ప్రేమగాక మరేమి? అదియే జీవితసూత్రము. స్వార్థపరత్వమంతయు మృత్యువే. ఇహమునందు పరమునందుగూడ ఇదియే సత్యము. శుభము చేయుట జీవితము. మేలు చేయక పోవుట మరణము.

సానుభూతి కలిగియుండుడు. బిడ్డలారా సానుభూతి కలిగియుండుడు. పేదలపట్ల పీడితుల పట్ల, అజ్ఞులపట్ల సానుభూతిని కలిగియుండుడు. తరువాత సర్వేశ్వరుని చరణములకు మీ ఆత్మను సమర్పింపుడు. అంతట మీకు సహాయము, అప్రతిహతమగు శక్తి లభించును. పోరాటమే నా ధర్మసూత్రము. అంతయు చీకటిమయముగా ఉన్నప్పుడు పోరాడుడనియే నేను చెప్పెడివాడను. చీకటిని ఛేదించుకొని వెలుగు ప్రసరించుచున్నప్పుడుగూడ పోరాటము సాగింపుడనియే చెప్పుదును.

బిడ్డలారా, భయపడకుడు. నక్షత్రఖచితమైన ఆకాశము మీపైబడి మిమ్ము అణచి వేయునేమోయను భయముతో దానిని వీక్షింపకుడు. ఆ దృష్టితో దానిని చూడకుడు. ఓర్పు వహింపుడు. కొంత కాలమునకు అదంతయు మీ పాదములక్రిందనుండును. వేచియుండుడు. అక్కఱకు వచ్చునది డబ్బుగాదు, కీర్తిప్రతిష్ఠలుగాదు, పాండిత్యముకాదు. అక్కఱకు వచ్చునది ప్రేమయే.

మనకిప్పుడు స్పష్టముగా తెలియుచున్న విషయమిది; స్వేచ్ఛవినా వికాసమసంభవము. మనపూర్వులు మతవిషయములందు స్వేచ్ఛను అనుమతించిరి. తత్ఫలితముగా మన కద్భుతమైన మతము దక్కినది. కాని, వారు సంఘము యొక్క పాదములకు బరువైన సంకెళ్ళు తగిలించిరి. అందువలన, ఒక్క మాటలో చెప్పవలెననిన, మనసంఘము ఘోరమైన పెనుభూతముగా రూపొందినది. వికాసమునకు మొట్టమొదట కావలసినది స్వేచ్ఛ. ఆలోచించుటకు, మాట్లాడుటకు వ్యక్తికి స్వేచ్ఛ అవసరమైనట్లే ఆహారము, వివాహము, దుస్తులు మున్నగు ప్రతి విషయములోను - ఇతరులకు హాని కలిగింపనంతవఱకు - స్వేచ్ఛ అవసరము.

సంఘమునందు మూఢనమ్మకస్థులవలన కలుగుచున్న అరిష్టములను నివారింపవలెను. వారి పెత్తనము సంఘమునకు ఎంతమాత్రము తగదు. మీ మతమునుండి మూఢ నమ్మకముల ప్రాబల్యమును నిర్మూలింపుడు. అప్పుడు మీకు జగత్తులోకెల్ల ఉత్కృష్టతమమయిన మతము లభించును. నా మాటలు మీకు అర్థమగుచున్నదా? భారతీయ మతముతో ఐరోపాలోని సంఘమువంటి సంఘమును నిర్మింపగలరా? అట్టిది సాధ్యమని, అత్యవసరమని నా నమ్మకము.

మీలో ప్రతి యొక్కరును, ఎవరిమట్టుకు వారు, తనపైన కార్యభారమంతయు పడినదను భావముతో తీవ్రముగా పని చేయుడు. ఏబది శతాబ్దములు మీపై దృష్టి సారించుచున్నవి. భావిభారత భాగ్యోదయము మీపై ఆధారపడియున్నది. కృషి సాగింపుడు. ఇది మహత్తరమైన కార్యక్షేత్రము. ఆలస్యమైనను తప్పక విజయము సాధించి తీరుదురు.

# శ్రీ రామకృష్ణ కథామృతము
## (రెండవ భాగము)

అనువాదము: ప్రవ్రాజిక శ్యామాప్రాణ

సూర్యుడింకను అస్తమించలేదు. శ్రీ రామకృష్ణులు నౌబత్తుకు ఆగ్నేయముగా నిల్చి మణితో మాట్లాడుచుండిరి. ఎదుట [illegible]ది ప్రవహించుచుండెను. శీ[illegible]మైనందున ఉన్ని దుస్తులు ధరించియుండిరి.

శ్రీ రామకృష్ణులు: పంచవటి దగ్గరయున్న గదిలో పరుండెదవా?

మణి: నౌబత్తు మేడపైగల గది [illegible]యరా?

మణికి నౌబత్తు మేడమీది గదియే నచ్చును. ఆయన కవిత్వప్రియుడు. ఆ మేడమీది గదినుండి ఆకాశము, గంగ, వెన్నెల, పూల మొక్కలు అన్నియు అగపడును.

శ్రీ రామకృష్ణులు: ఈయుదేము. పంచవటిదగ్గర గది ఎందుకు చెప్పుచున్నాననగ, భగవత్ సంకీర్తనము భగవత్ ధ్యానము చేసినట్టి పుణ్యస్థలమది.

### జీవితప్రయోజనము భగవంతుని ప్రేమించుటయే:

శ్రీ రామకృష్ణుల గదిలో సాంబ్రాణిపొగ వేయబడెను. చిన్న మంచముపై వారు కూర్చొని ధ్యానము చేయుచుండిరి. మణి నేలపై కూర్చొనియుండెను. రాఖాల్, లాటూ, రామ్‌లాల్ కూడ గదిలోనే యుండిరి. శ్రీ రామకృష్ణులు ధ్యానమునుండి మేల్కొని రామ్‌లాల్‌ను పాడుమనిరి. రామ్‌లాల్ గౌరాంగ మహాప్రభువుల సన్న్యాస స్వీకారమునకు సంబంధించిన పాట పాడెను.

కి జేఖిలామ్ రే కేశవభారతీ రే కుటీరే
అపురూపజ్యోతి శ్రీ గౌరాంగ మూరతి

[భావము: అహా! కేశవభారతి కుటీరములో ఏమి చూచితినిరా! అపురూపజ్యోతి స్వరూపుడగు గౌరాంగమూర్తిని చూచితిని. నయనములనుండి ఆనందభాష్పములు సంతత ధారగా ప్రవహించుచున్నది. గౌరాంగుడు ప్రేమోన్మాదములో పాడుచు నాట్యము చేయుచున్నాడు. ఒకపరి నేలపై పొరలాడుచు కన్నీళ్ళు కడవలుగా కార్చుచున్నాడు. మూడు లోకములు ప్ర[illegible]ించునట్లుగ 'హరి' అని [illegible] అరుచుచున్నాడు. దీనాతిదీనుడై [illegible]కందరుల ముక్కి మాటికి మాటికి ప్రార్థించుచున్నాడు. అందమైన ఉంగరాల కురులుగల శిరస్సు ముండనము చేసికొని యోగివేషము ధరించినాడు. భక్తి ప్రేమావేశములో నిమగ్నుడైన వానిని చూచి పాషాణహృదయములు కూడ కరగిపోవుచున్నవి. ప్రజల దుఃఖమును సహించలేక ప్రేమధనమును పంచుటకే అవతరించెనా ఏమి!]

శ్రీ రామకృష్ణులు రామ్‌లాల్‌ను మరొక పాట పాడమనిరి. రామ్‌లాల్ 'ఆమి ముక్తిదితే కాతర్ నై' అనే పాట పాడెను. 'గౌరనితాయి – తోమారా దోభాయి' అనే పాటను కూడ పాడెను.

* * *

నౌబత్తు మేడపైగదిలో మణి ఒంటరిగా కూర్చొని ప్రకృతిని తిలకించుచుండెను. పున్నమివెన్నెల నిండుగా కురియుచుండినది. ఆకాశము, గంగ, కాళికాలయము, ఆలయగోపురములు, ఉద్యానవన వృక్షములు, పంచవటి అన్నియు పూర్ణచంద్రుని వెన్నెలలో నిగనిగలాడుచుండెను.

వేకువఝాము 5 గంటలైనది. మణి క్రిందకు దిగివచ్చెను. ఉత్తరదిక్కున గల పంచవటి వైపున కదలుచుండిరి. శ్రీ రామకృష్ణులు పంచవటిస్థల మహాత్మ్యము చెప్పినందువలన మణి అచ్చటకు వెళ్ళి ధ్యానముచేయ నిశ్చయించుకొనెను. ఇంతలో దూరమునయున్న పంచవటినుండి 'మధుసూదనా! ఎక్కడున్నావు' అను ఆలాపము వినిపించెను. అక్కడకు వెళ్ళిచూడగా ఒక కృష్ణభక్తుడు ఏకాంతమున కూర్చొని విలపించుచుండెను.

## అధ్యాయము - 13

దక్షిణేశ్వరాలయమున ప్రాణకృష్ణుడు మాస్టరు మున్నగు భక్తులతో. క్రీ. శ. 1884 ఏప్రెల్ 6 వ తేది ఉదయము 8 గంటలకు మాస్టరు దక్షిణేశ్వరముచేరి శ్రీ రామకృష్ణుని గదిలో ప్రవేశించిరి. శ్రీ రామకృష్ణులు చిన్న మంచముపై కూర్చొనియుండిరి.

ప్రాణకృష్ణుడు జనాయి గ్రామములోని సంపన్నమగు బ్రాహ్మణవంశమునకు చెందినవాడు. కలకత్తాలో శ్యామపురంలో ఇల్లున్నది. ఒక యూరోపియను ఆఫీసులో సెక్రటరీగా పని చేయుచుండెను. గృహస్థుడైనను వేదాంతచర్చమీాద ప్రీతి ఎక్కువ. శ్రీ రామకృష్ణులఎడ భక్తికలిగి అప్పుడప్పుడు వారిని దర్శించుటకు వచ్చుచుండెను. ఇటీవల శ్రీ రామకృష్ణుని తమ ఇంటికి ఆహ్వానించి ఉత్సవము జరిపెను. ఆయన బాగ్‌బజార్ ఘట్టంలో ప్రతి రోజు ప్రొద్దుననే గంగాస్నానము చేయును.

శ్రీ రామకృష్ణులు: (ప్రాణకృష్ణునితో) భగవదవతారమూర్తులు కూడ జీవులవలె ఆకలిదప్పులకు శోకమోహములకు గురియైనట్లు కనపడుచున్నదికదా? దీనికేమి సమాధానమని యడిగిన 'పంచభూతములనెడి వలలో చిక్కుకొని బ్రహ్మకూడ వీటిని అనుభవించును' అనియే సమాధానము చెప్పనగును. శ్రీరాముడు సీతావియోగమును సహించలేక అతి దీనముగా విలపించెను. శ్రీ మన్నారాయణుడు హిరణ్యాక్షుని వధించుటకై వరాహరూపము ధరించెను. వధించుట పూర్తియైనను వైకుంఠమునకు పోవుటకు ఇచ్ఛగించలేదు. వరాహరూపములోనే ఆనందించుచుండెను. తిరిగి రమ్మని దేవతలు ఎంత ప్రార్థించినను సమ్మతించలేదు. దేవతలు శివుని కడకేగి ఈ విషయము చెప్పిరి. శివుడు పోయి మొదట బ్రతిమాలిచూచెను. కాని లాభము లేకపోయెను. చివరకు తన త్రిశూలముతో వరాహదేహము చీల్చివేసెను. అప్పుడు శ్రీ మన్నారాయణుడు నవ్వుచు ఆ శరీరమును వీడి తన లోకమునకు పోయెను.

ప్రాణకృష్ణుడు: మహాశయా! అనాహత శబ్దమననేమి?

శ్రీరామకృష్ణులు: అనాహత శబ్దము సర్వదా మ్రోగుచునేయున్నది. అది ప్రణవ ధ్వని. పరబ్రహ్మమునుండి వచ్చునది. యోగులు వినుచుందురు. విషయాసక్తులు దానిని వినజాలరు. ఈ శబ్దము కొందరు నాభినుండి పుట్టుచున్నదనియు, మరికొందరు క్షీరసాగరశయుడగు సర్వేశ్వరుని నుండి పుట్టుచున్నదనియు చెప్పుదురు.

ప్రాణకృష్ణుడు: మహాశయా! పరలోకమెట్టిది?

శ్రీరామకృష్ణుడు: కేశవసేనుడు కూడ ఇదే ప్రశ్న వేసెను. ఎంతకాలము మానవుడు అజ్ఞానములో ఉండునో అనగా ఎంతకాలము భగవల్లాభము కలుగదో అంతవరకు పునర్జన్మ ఎత్తవలసినదే. కాని, జ్ఞానము చేకూరిన పిదప మరల ఈ ప్రపంచమునకు రానక్కరలేదు. ఈ

మర్త్యలోకానికే కాదు. ఏ లోకానికైనను తిరిగి రావక్కరలేదు.

కుమ్మరివాళ్లు కుండలు ఎండబెట్టుదురు. వాటిలో కాల్చిన కుండలు కాల్చనికుండలు కూడ ఉండును గమనించితివా? ఆవులు మున్నగు పశువులు ఒక్కొక్కమారు వాటిని త్రొక్కి పోవును. అప్పుడు కొన్ని కుండలు పగిలి పోవును. కాల్చిన కుండలు పగిలినచో చిల్లర పెంకులను ఏరి కుమ్మరి అవల పారవేయును. వాటితో ఇంక పని లేదాయె. కాని పగిలిన పచ్చి కుండలను ప్రోగుచేసికొని మట్టిముద్ద చేసి కుమ్మరి సారెలో పెట్టి మరల కుండలు తయారు చేయును. అందుచేతనే భగవద్దర్శనము కలుగునంత వరకును కుమ్మరివాని చేతిలో పడవలసినదే. అనగా ప్రపంచములో మాటిమాటికి పుట్ట వలసినదే!

ఉప్పుడు వడ్లను నాటిన మొలచునా? అట్లే జ్ఞానాగ్నిచే దగ్ధకర్ముడైన జీవిద్వారా సృష్టి జరుగదు. అతడు ముక్తుడైపోవును.

శరీరము ఒక పళ్ళెమువంటిది. ఆ శరీర మనెడి పళ్ళెములో మనోబుద్ధి అహంకారము లనెడి నీరు నింపబడెను. బ్రహ్మ సూర్యునివంటి వాడు. అతడే ఆ నీళ్ళలో ప్రకాశించు చున్నాడు. అందుచే భక్తుడు భగవద్రూప మును దర్శింపగలుగుచున్నాడు.

బ్రహ్మయే సత్యము మిగిలినవంతయు మాయ స్వప్నతుల్యమని వేదాంతము చెప్పుచున్నది. అహమనెడికఱ్ఱ సచ్చిదానంద సాగరమున పడి యున్నది. (మాస్టరుతో) నీవు దీనిని చక్కగా వినుము. 'అహమ్' అనెడి కఱ్ఱను తీసివేసినచో ఒకే సచ్చిదానందసాగరము సుమా. ఈ అహమనెడి కఱ్ఱ యున్నందుననే రెండు భాగ ములుగ అగపడును. నీళ్లు ఈ వైపు ఒక భాగము ఆ వైపు ఒక భాగము అనిపించును. బ్రహ్మజ్ఞానము కలిగినచో సమాధిస్థితినందును. అట్టితరి ఈ అహము పూర్తిగా తుడిచివేయ బడును. కాని లోకశిక్షార్థమై శంకరా చార్యులు విద్యయనెడి అహము నుంచుకొనిరి. (ప్రాణకృష్ణునితో) నేను జ్ఞానినైతినని కొందరు తలచెదరు. జ్ఞాని లక్షణము లేవి?

జ్ఞాని ఎవ్వరికి చెడుపు చేయజాలడు. చిన్న పిల్లల స్వభావము కలిగియుండును. పైకి కోప మున్నట్లు అహంకారమున్నట్లు అగపడునే కాని యథార్థముగ జ్ఞానికట్టివి యుండవు. కాలి పోయిన త్రాడును దూరమునుండి చూచు వారలకు ఒక త్రాడువలెనే కనపడును. కాని దగ్గరకుపోయి ఒకసారి 'ఫూ' అని ఊదగనే ఎగిరిపోవును. అట్లే అహంకారము, క్రోధము కేవలము ఆకార ఛాయలుగా మాత్రమే జ్ఞాని యందు గనపడును.

చిన్నపిల్లలకు దేనిమీదను ఆసక్తిఉండదు. ఇసుకతో ఇండ్లుకట్టుదురు. ఎవరైనా వాటిపై చెయిపెట్టినచో, పడిపోవునను భయముతో గొంతుచించుకొని చిందులు త్రొక్కుచు ఏడ్పు మొదలుపెట్టుదురు. కొంతసేపైన తరువాత తామే వాటిని పడగొట్టుదురు. తన చొక్కా ఎవరైనా అడిగితే 'మా నాన్న కొనిచ్చారు. నేనివ్వను' అనును. ఎవరైనా ఒక బొమ్మ కొని ఇచ్చినచో అంతా మరచి ఆ చొక్కాను అవ తల పారవేసి బొమ్మను తీసికొనిపోవును.

జ్ఞానుల లక్షణములన్నియు ఇట్టివేసుమా! ఇంట్లో అన్ని రకముల భోగైశ్వర్యములు, కుర్చీలు, సోఫాలు, వస్తువాహనములు అన్నీ ఉన్నా అన్నిటిని వదలివేసి కాశికి పోయి సన్న్యాసి అగును.

వేదాంత మతానుసారము జాగ్రవ వస్థయు మిథ్యయే. ఒక కథ వినుము. కట్టెలు

కొట్టి జీవించువాడొకడు నిద్రలో మునిగియుండగా వేరొకడు వచ్చి తట్టిలేపెను. ఆ నిద్రలోనున్నవాడు లేచి లేపిన వానిని కోపగించుకొనెను. నా నిద్ర పోగొట్టితివేల? నేను కలలో రాజునైతిని. ఎందరో మంది కొడుకులుండిరి వారు మంచి తెలివితేటలు కలిగి అస్త్ర శస్త్ర విద్యలందు ఆరితేరినవారై యుండిరి. నేను సింహాసనముపై కూర్చొని రాజ్యము సేయుచుంటిని. ఇట్టి నా సుఖసంసారమును పోగొట్టితివేల? అనెను. అంత ఆ లేపినవాడు 'అది ఒక కలయేగదా! అందులో ఏముంది?' అనెను. దానికి కట్టెలమ్మువాడిట్లనెను. నేను కట్టెలుకొట్టి జీవించుట ఎంత యథార్థమని భావించుచున్నావో కలలో రాజుగా జీవించుటకూడ అంత సత్యమనియే గుర్తుంచుకొనుము. జ్ఞానిని కలయని త్రోసివేసినచో ఇది మాత్రము సత్యమై నిలిచిపోవునా?

(మణి స్వగతములో) ప్రాణకృష్ణుడు సర్వదా జ్ఞానమును గూర్చియే మాట్లాడుచుండును. అందుకే కాబోలు శ్రీరామకృష్ణులు వానికి జ్ఞానియొక్క స్థితిని తెలుపుచున్నారా? ఏమి!

శ్రీరామకృష్ణులు: నేతి నేతి అని విచారించుచు ఆత్మను పొందుటయే జ్ఞానము. విజ్ఞానము అనగా విశేషముగా తెలిసికొనుట. అదెట్లనగా పాలను గూర్చి వినుట-పాలను చూచుట- పాలను త్రాగుట. పాలను గూర్చి వినినవాడు అజ్ఞాని. పాలను చూచినవాడు జ్ఞాని. పాలను త్రాగినవాడు విజ్ఞాని —స

ప॥ పరమహంస బోధ వినరండీ - శ్రీరామకృష్ణ పరమహంస పథము గనరండీ -
అ॥ చిరతరమ్మగు మాయాసాగరో-పరమునకై జయించి పామర
జనుల కాధ్యాత్మికవివేకము-కరతలామలక మొనర్చిన ॥పర॥

2. కలదు దేవుడు కలదు కలరండీ - సంశయాత్ములై
కలిగి సద్గతి కెడము గాకండీ -
తళుకు తళుకున రాత్రివేళల - వెలుగు నక్షత్రములు - పట్టప
గలున లేవని యనుట యెట్టటి - తెలివితక్కువ తనమొ చూడుడు! ॥పర॥

3. మొదట నాత్మవివేకమందండీ - విజ్ఞానధనులై
పిదప విత్తార్జనము సేయండీ -
విదితముగ నేనరసి తెలిపిన - దిది అపక్రమముగ నొనర్చిన
మొదలుసెడు నష్టమొనర్చిన - పదిలమగు తుదిపదము చిక్కును ॥పర॥

4. హరిహరీ హరియనుచు నరవండీ - నరులారమీరు -
హరిహరీ హరియనుచు నగురండీ -
కరము లెత్తుకనెత్తి యుచ్చైస్స్వరముతో నరహరిని బాడిన
అరుదుగా వైకుంఠమార్గము - బిరబిరన్ పరుగులిడివచ్చును ॥పర॥

5. యోగమున తపియింపజేయండీ - మీ శరీరాత్మల
భోగరసమున దడపబోకండీ -
వేగకుండిన వడ్లగింజలు - విత్తకున్నను మొలకలెత్తును
వేగియుండిన వడ్లగింజలు విత్తినన్ మొలకలెత్తదు. —కృష్ణమాచార్యులు.

# ధ్యానమునకు కూర్చొనుటకు ముందు

స్వామి అశోకానంద

ధ్యానముద్వారా ఎవరైనను ఆధ్యాత్మిక మార్గములో అత్యున్నత స్థితిని చేరగలరని నా నమ్మకము. ధ్యానమనగా భగవంతుని గూర్చిన నిరంతరమైన ఆలోచన. ఆధ్యాత్మిక మార్గమందు ప్రవేశమున్నను లేకున్నను ప్రప్రథమమున భగవంతుని గూర్చిన ఆలోచనలతో నున్నను లేకున్నను, ప్రాపంచిక సంబంధమగు ఆలోచనలతో అల్లకల్లోలముగా నున్నను, మనస్సునొక విధమైన "ఎఱుక"చే క్రమ క్రమముగా నింపుటవలన తుట్టతుదకు కోరిన మార్పు సంభవించియే తీరును.

ఈ సత్యమునే శ్రీరామకృష్ణులు నొక్కి చెప్పెడివారు. ఈ విషయమును గురించి ఆయన బోధలలోని ఒక విషయమును గ్రహించుటకు నాకు చాలకాలము పట్టెను. అది అవగాహన అయిన మీదట నాకు దానివలన చాల మనో ధైర్యమును, భావి ఉన్నతియందు నమ్మకయు కలిగెను. మనస్సు ఒక బట్టవంటిదనియు, ఏ రంగులో దానిని ముంచిన, ఆ రంగును గ్రహించుననియు ఆయన తరచు పలుకుచుండెడివాడు. దేవునిరంగు గ్రహించుటకు మనస్సుపూర్తిగా పరిశుద్ధముకావలెనని మొదట నేను అనుకొనుచుండెడివాడను. కాని శ్రీరామకృష్ణుల ఉపమానమునుగూర్చి తీవ్రముగా ఆలోచించిన కొలది, వేరొక విధముగా దానిని అర్థముచేసి కొనుట మొదలిడితిని. చాకలివానికి వేసిన బట్టతో మనస్సును పోల్చుటవలన ఆయన సామాన్య మానవుని మనస్సును ఉపమానముగా తీసికొనెను. ఇది ఎప్పుడును ప్రాపంచిక వాసనలతోను విరుద్ధములగు ప్రాపంచిక కోరికలతోను నిండి భగవంతుని గురించిన ఆలోచనయే లేకయుండును. ఇట్టి మామూలు మనస్సుకూడ భగవంతుని గురించిన ఆలోచనలో ముంచిన మొదల అది దాని రంగునే గ్రహించునని ఆయన యుద్దేశ్యమైనట్లు నేను గ్రహించితిని.

ఈ పరమార్థ సత్యము మిక్కిలి ఉత్సాహమిచ్చునది. సాధకులకు చాల ఉపయోగమైనది. కాని దీనిని సాధకులు తరచు మరతురనుట శోచనీయము. ఒకానొకప్పుడు ఒక వ్యక్తి శ్రీరామకృష్ణులకడకేతెంచి "అయ్యా నా మనస్సు స్వాధీనములోనికి వచ్చుటలేదు. ఎందులకో నాకు తెలియకున్నది" అనెను. పరమహంస ఆశ్చర్యముతో "అభ్యాస యోగమేల మీరు చేయరు?" అని ప్రశ్నించెను. మనస్సు ఇతర విషయములపై పోయినప్పుడెల్లను ప్రయత్నపూర్వకముగా దానిని భగవంతుని గురించి చింతింపచేయుటయే అభ్యాసయోగము. ఈ అభ్యాసమే భగవద్గీతయందు సాధకులకు చెప్పబడినది. ప్రప్రథమమున మనస్సు పూర్వాభ్యాసమువలన ఇతరవిషయములనుగూర్చి, చింతించిన చింతించుగాక, ఏమిపోయినది. మరల తిరిగి దేవుని గూర్చి చింతించుట ముఖ్యావసరము. ఇది జ్ఞాపకమున్నచో సగము యుద్ధము నెగ్గినట్లే. కాని దురదృష్టమునల్ల మనమీ విషయమును గుర్తుంచుకొనము. ఇతర విషయములు గురించి చింతించుటలో మనమీ పరమార్థలక్ష్యమును మరతుము. పరిస్థితులిట్లుండ, ధ్యానము గూర్చియు, చిత్త ఏకాగ్రమును గూర్చియు కొన్ని విషయములనిక్కడ చర్చించుట లాభదాయకమగును.

ధ్యానమునకు యోగ్యమగు మనస్సెట్లుండును? అది ప్రశాంతత అని మీకందరకు తెలుసుననుకొనెదను. బలాత్కారమువల్ల తెచ్చుకొన్న ప్రశాంతత కాదది. ప్రాపంచిక విషయములపైనుండు బలవత్తర కోరికలు

అణగిన మీదట ఇట్టి ప్రశాంతత ఏర్పడును. మన మనసును కల్లోలపరచు భావములు బయటనుంచి వచ్చినను లోపలనుండి వచ్చినను మనస్సులో దాగియున్న ప్రబలకోరికలనుండియే పుట్టును. మనమెప్పుడును కొన్ని లక్ష్యములను సాధింపవలెనని చింతించుచుందుము. తీవ్రముగా యత్నించినను తరచు మనము విఫలుల మగుచుందుము. దీనివలన మనస్సు మరింత చీకాకుపడును. ఒకవేళ జయించినను తరచు వింతఫలితములు ఏర్పడుచుండును. ఒకప్పుడు మనము అనుభవించుచుండగనే, సుఖమునిచ్చు పదార్థములు తమంతట తామే జారిపోయి మనలను మోసగించును. అలా ఒక విధమగు ఆశాభంగము కలుగును. ఆశాభంగము కలుగనప్పటికి ఆ వస్తువులతో మనకు సన్నిహిత సంబంధమేర్పడును. ఇట్టివిధ అనుభవము లెప్పుడును ప్రబలముగ ఉండజాలవు కావున ఒక విధమగు అసంతృప్తి ఏర్పడును. ఈ ఫలితములన్నియు సంతోషముగా గాని విచారముగా గాని మనస్సునెప్పుడును కల్లోలముగనే నుంచును. దీనినిబట్టి తేలునదేమన మన మనస్సును భగవంతునిపై నిలుపకుండ చేయునవి సుఖవస్తువులపై మనకుండు వాంఛయే. ప్రాపంచిక వస్తువులపైయుండు వ్యామోహము తగ్గి, వాటి యందలి వాంఛలుడిగినప్పుడే మనస్సు ప్రశాంతత వహించగలదు.

ఈ తాత్కాలికపు ప్రశాంతతనే మనము ప్రత్యాహార ప్రారంభమని నుడువుదుము. ఈ స్థితియందు మనసు ఒకప్పుడు గందరగోళముగను, ఒకప్పుడు ప్రశాంతముగాను యుండును. ప్రాపంచిక సుఖవస్తువులను గురించి ఆలోచించినపుడు కల్లోలముగాను, లేనప్పుడు చాలవరకు ప్రశాంతిముగాను నుండును. ఇది చాలా అనుకూలమైన స్థితి. మనస్సుయొక్క ప్రశాంతతకు భంగము కలిగించు విషయవస్తువులు లేనప్పుడు కాని, వాటిని గురించి మనస్సు భావించనప్పుడు గాని, అది శాంతముగానే యున్నచో అట్టి స్థితి చాల కోరదగినదని భావించుము. ఏకాంతవాసమందు ఇట్టి ఒక విధమగు నిర్మలత్వము, ప్రశాంతత, ఇవి కోరదగిన మానసిక స్థితులు. ఇట్టిస్థితి యందే ధ్యానసాధన చేయుటకు వీలగును. ఈ స్థితిని ఎప్పుడును విడిచిపెట్టరాదు. మనస్సు తరచు పరిణమించు స్వభావముగలది. ఒకసారి సాధించిన మానసికస్థితి ఎల్లకాలముండెనను నిలబడునని మాత్రము భావింపకుము. బయటనుండిగాని లోపలనుండిగాని మనలక్ష్యమునుండి మనలను లాగివేయునదేదో బయలుదేరవచ్చును. మరల మనస్సు పూర్వపు ప్రశాంతి స్థితికి వచ్చుటకు ఐదు లేక పది సంవత్సరములు పట్టవచ్చును. ఎటుల ఒకసారి గాలి వాన పట్టినయెడల సంక్షోభము చెందిన సముద్రము తిరిగి ప్రశాంతస్థితికి వచ్చుటకు కొంతకాలము పట్టునుగదా.

ఎన్నటికిని మనము సుస్థిరముగా నుండజాలమని నా అభిప్రాయముగాదు. ఎట్టి పరిస్థితులందును నిర్భయముగానుండు మానసిక స్థితి కూడ కలదు. కాని ఇది చాల ఉన్నత స్థాయికి చెందినది. ఇట్టి చిత్త ఏకాగ్రతకు వచ్చినపిమ్మట మనుజుడు తన వెనుక వదలిన వంతెనలన్నిటిని దహించినాడన్నమాట. ఈ ప్రాపంచిక వస్తువులు ఎన్నడును అతనిచిత్తము నాకర్షింపలేని స్థాయికి అతడు వచ్చినాడన్న మాట. అతడు వెనుకవదలిన ప్రపంచ వస్తువులన్నియు అతని చిత్తమును తిరిగి ఆకర్షింపలేవు. అప్పుడప్పుడు చలించుచున్నాను సాధారణముగా ప్రసన్నముగాను శాంతముగానుండు మానసికస్థితిని చేరినానుకొనినవాడు, ధ్యానములో జయము సాధింపవలెనన్న ఏమి చేయవలెనన్న

(1) తొలుత తన సాధనలో తాను నియమబద్ధముగాను జాగ్రత్తగాను నుండుటకు అతడొక తీర్మానమును చేసికొనవలెను. పరిస్థితులేమైనను మన శారీరక అవసరములకు మనము తప్పక శ్రద్ధవహింతుము. అట్లే మన ధ్యానముపట్ల కూడ శ్రద్ధ వహింపవలెను.

ఉచ్ఛ్వాస నిశ్వాసములవలె ధ్యానము కూడ జీవితమందొక భాగమై సహజము కావలెను. ఏ పనియందైనను నిమగ్నమైయుండు నతడు "నాకు ఊపిరి పీల్చుటకు కూడ నావకాశము లేదు" అనును. కాని వాస్తవమున కతడు శ్వాస పీల్చుకొనుచునే యుండును. ధ్యానము పట్ల కూడ అట్టి శ్రద్ధనే చూపవలసియుండును. మొట్టమొదట సాధన చేయుట అస్వాభావికముగా కనిపించినను నీ మనస్సులో ఈ తీర్మానమాత్రము చేసికొనుము. "నేను ధ్యానము చేసి తీరుదును."

శ్రీరామకృష్ణులు, ముసల్మానుల ప్రార్థన విషయమై పాటించు కాలనియమమును మెచ్చుకొనిరి. ముసల్మానులు ఎట్టి పరిస్థితులలో ఎక్కడనున్నను ప్రార్థనకు సమయము వచ్చినపుడు, వారు కాలుచేతులను ముఖమును కడుగుకొని, అవసరమైనచో రోడ్డు వారను కాని, రైల్వే ప్లాట్‌ఫారం మీదగాని, తమ కంబళీని పరచి నమాజు చేయుదురు. వారెన్నడును ఇట్లు చేయుటయందు అశ్రద్ధ వహించరు. టైమ్ లేనట్టి విపరీత పరిస్థితులు కొందరు అప్పుడప్పుడు సంభవింపవచ్చును కాని, "నాకు పని లెక్కువగా నుండుటచే ధ్యానమునకు టైము వినియోగించుట అసంభవమనియు సాయంకాలమగునరికి నేనలసిపోవుదును కాన ధ్యానము చేయుట అసంభవము" అనిగాని చెప్పుట నిజముగా దాని నెగగొట్టుటకు చెప్పుమాటె.

తాను జీవితమంతయు వృథా కాలక్షేపమొనర్చిన ఒక వ్యక్తిని గురించిన పాట ఒకటి కలదు. తుదకతడిట్లు వాపోయెనట. "ఓ ప్రభూ! ప్రతి ప్రాపంచిక విషయమునకు నాకు కాలముండెను కాని నిన్ను గురించి చింతించుటకు మాత్రము అది లేకపోయెను." మన మనస్సుయొక్క ఈ ప్రత్యేక పరిస్థితిని గమనింపుడు. ఏ యితర పనులకు కేనికైనను ఒక స్థలము ఒక కాలము గలదు. కాని ధ్యానాభ్యాసమునకు 15 నిమిషములైనను టైము లేదు. టైములేదనిగాని, శక్తిలేదనిగాని నీవన్నచో నేనది నమ్మగలనా? వెంటనే నేను ఇట్లు జవాబిత్తును. 'మిత్రమా! నీవు నిన్నే మోసగించుకొనుచున్నావు.' చేయవలెనను తీవ్రేచ్ఛ ఎచటగలదో అచటనే మార్గము కూడ గలదు. కృతనిశ్చయుడవైనచో తప్పక ధ్యానమునకు టైము దొరకితీరును.

ఇచట నేనొక సూచన చేయుచున్నాను. కొందరేమన ఈ సందర్భములందు తరచు నిరుత్సాహము కలుగవచ్చును. ఒకప్పుడు సమయములో మనస్సు చాల త్వరగా ఏకాగ్రతనొంది ప్రశాంతముగా వర్తించును. కాని మరొకప్పుడది మనము చెప్పినట్లు వినుటమాని తిరుగుబాటు ఒనర్చును. నానావిధ ఆలోచనలతో అది కల్లోలమగును. ఇది ఎంతవరకు సాగునన లేదనగా "నాకు ధ్యానము కుదురుట కష్టము, కాదు కాదు అసాధ్యము నేను ప్రయత్నించినను ఒక గట్టుకు చేరలేను."

మీకిది చెప్పదలచుకొన్నాను. "పరమార్థములో ఉత్తీర్ణులగుటకు ప్రయత్నించు వ్యక్తులందరివలె నీవు కూడ ఇట్టి మానసిక స్థితులతో కుస్తీ పట్టవలసి యుండును. ఇట్టి పరిస్థితుల వలన నిరుత్సాహము చెందకుము. కొందరిట్లు అను

కొందురు. "నికృష్టావస్థలోనున్న మనస్సుతో నేను భగవంతునెట్లు చేరగలను?" నీకు చలి ఎక్కువగా నున్నదనుకొనుము. అప్పుడు నీవు చలి తగ్గినమీదట, నిప్పువద్దకు పోయెదను- అందువా, లేదా చలిగానున్నది కనుక మొట్ట మొదట నిప్పువద్దకుపోయి వెచ్చపడవలెనని సంకల్పింతువా? నీయందు పరమార్థము లేనే లేదని అనుకొను సమయమే దేవుని గూర్చి చింతించుటకు మంచి సమయము.

మనస్సు, నిన్ను తప్పుదారుల పట్టింప నివ్వకుము. అనేక విధములుగా నీ మనస్సు నిన్ను మోసము చేయగలదు. ఒక్కొక్కప్పుడు అది తిన్నగా నిన్ను మోసగించును. ఒక్కొక్కప్పుడు మతముపేర నిన్ను తప్పుదారుల పట్టింపవచ్చును. నీ మానసికస్థితి నికృష్టమైనను నీ మనస్సులోని తలంపులు నీచమైనవయినను, దేవునిగూర్చి చింతింపుము. ఇంత మాత్రమున నష్టమేమియు లేదు, ప్రయత్నము చేయుటమాత్రము నీ వంతు. దుష్టాశ్వము తనను స్వారీచేయ నెక్కిన రౌతును క్రింద పడవేయుటకెంతో ప్రయత్నించును. కాని అతడు అన్ని పరిస్థితులయందుకూడ గుఱ్ఱముపై కూర్చొనకల్గినచో మెల్ల మెల్లగా గుఱ్ఱము శాంతించును. తనను నిజముగా స్వారిచేయగల రౌతే తనపై యెక్కెనని అది గ్రహించుకొని నెమ్మది వహించును. మనస్సుకూడ అట్లే ప్రవర్తించును. అది మొదట నిన్ను తప్పించుకొనుటకు యత్నించును. కాని అన్ని పరిస్థితుల యందును నీవు దానిని వదలకయున్నచో విధిలేక అది నీకు లొంగవలసివచ్చును. ఇది మనస్సుయొక్క రహస్యము. కావున అదెట్లున్నది నీకు అక్కరలేదు. దానిపై స్వారి చేయుటకు నిశ్చయించుకొనుము; ఈ నిశ్చయ బలమే ఏకాగ్రతగాన, నీకు జయము సిద్ధించును.

(2) ధ్యానముచేయుటకొక నియమిత కాలము అత్యవసరము. నా అభిప్రాయములో ఒక వ్యక్తి దినమునకు కనీసం రెండు సారులయినను ధ్యానము చేయవలెను. రెండు సార్లు ధ్యానము చేయలేనిచో ఉదయమునకాని, సాయంకాలముకాని, కనీసము దినమునకు ఒకసారైనను ధ్యానములో గూర్చుండవలెను.

హిందూదేశమందు సాధారణముగా ధ్యానమునకు నాలుగు కాలములు మంచివని తలంతురు. ప్రాతఃకాలమందు సూర్యోదయమునకు ఒక గంటముందుగా, ఇంకనూ చీకటిగానే యున్నప్పుడు, ధ్యానమునకు మంచి సమయము. దీన్నిగురించి తరువాత విపులంగా చర్చింతము. మధ్యాహ్నము (రెండు ఝాముల వేళ) ధ్యానమునకు మంచిసమయముగా భావింపబడను. నగరములందు. దీనివలన ఏదైనను విశేష లాభముండునో లేదో కాని పల్లెలందు మాత్రము, ముఖ్యముగా ఉష్ణదేశములందు ఆ సమయమున నిశ్శబ్దముగా యుండి, ప్రకృతి యంతయు కదలక మెదలక నిదురించునట్లే యుండును. ఉష్ణాధిక్యతవలన పక్షులుగూడ నిశ్శబ్దముగా చెట్ల ఆకులసందున దాగి యుండును. ప్రజలందరును నిశ్శబ్దముగా నుండు వేళ. చాలమంది విశ్రాంతి తీసుకొను సమయము. కనుకనే కాబోలు ఆధ్యాత్మిక మార్గమందు సాగిపోయే సాధకులు ఈ సమయమును ధ్యానమునకే వినియోగింతురు. మా దేశమందు నేనిది ప్రత్యేకముగా గమనించితిని. ఆ సమయమందు మాత్రము అంతటను నిశ్శబ్దము ఆవరించియుండును.

ధ్యానమునకు ముఖ్యమగు మూడవ కాలము, సాయంకాల సంధ్యాసమయం. ఈ

దేశమందైతే, (అమెరికా) ఈ సమయమున ధ్యానముచేయుట కష్టసాధ్యమే. కారణ మేమన ఇది యిక్కడ భోజనముచేయు సమయము. అయినను సాయంకాలము ధ్యానము చేయుటకు చాల యోగ్యమగు సమయము. సాధ్యమైనఎడల భోజనమునకు ముందుగా ధ్యానింపుడు, కాని ఎప్పుడును భోజనానంతరము ధ్యానము చేయకుడు. దీనివలన మీ జీర్ణమునకు భంగముకలిగి ఆరోగ్యము చెడ వచ్చును.

ధ్యానమునకు నాలుగవకాలము అర్ధరాత్రి. ప్రపంచమునందే భాగములో అర్ధరాత్రికూడ నిశ్శబ్దముగా నుండదు. అయినను ఒక విధమగు ప్రశాంతత ఉండునని నా అభిప్రాయము. ఏ ప్రాంతములందు ఈ సమయమునందు నిశ్శబ్దముగా నుండునో అట్టి ప్రదేశములు ధ్యానమునకు మిక్కిలి అనుకూలముగా నుండును. నిజమునకు అర్ధరాత్రి ధ్యానమునకు అనుకూల సమయమని పెక్కుండ్ర అభిప్రాయము

రాత్రి నిద్రానంతరము ప్రాతఃకాలమున మనస్సు నిర్మలముగాను నిశ్శబ్దముగా నుండుటచే ఆ సమయము ధ్యానమునకు చాలమందికి మిక్కిలి ఉపయోగకరమై యుండును. గత దివసమందలి తలపులు, సంకల్పములు అన్నియు రాత్రి నిద్రయందు నశించి, వ్రాత వ్రాసిన పలకను పిల్లవాడు తుడిచిపెట్టినట్లు మనస్సు స్వచ్ఛముగాను, ప్రశాంతముగాను ఉండును. ప్రొద్దున జనులందరును నిద్రావస్థయందే యుందురు. కాన అప్పుడు కొంత ప్రశాంతముగానే యుండును. కావున మనస్సును అప్పుడు నిశ్చలముచేయుట సులభముగనే సాధ్యమగును. ఇంకొక లాభమందు గలదు. సూర్యోదయము కాకముందు ధ్యానము చేయుటవలన మనస్సునకు ఒక విధమగు ఆధ్యాత్మిక ప్రవృత్తి నిచ్చి మార్గము చూపినవారమగుదుము. దినము గడచినకొలది కొంత ఆధ్యాత్మిక బలమును ఉత్సాహమును తగ్గినను, ప్రాతఃకాలమందలి ధ్యానము చాల గంటలవరకు మన మనస్సును బలముగానుంచి దినములో చాల భాగము మనలను కాపాడుచుండును.

ఇచట ఒక విషయము చెప్పవలెను. కొందరికి ప్రాతఃకాలముకంటె సాయంకాలమే ధ్యానమునకు అనుకూలించవచ్చును. దినము వృద్ధి పొందినకొలది మెల్లమెల్లగా మేల్కొను వారు కొందరు గలరు. ప్రొద్దున వారు ఇంకను నిద్రలో మునిగి సగముమాత్రమే మేల్కొని, దినము గడచినకొలది పూర్తిగా మేల్కొని సాయంకాలము చురుకు కలిగి ఏ పనైనను సునాయాసముగా చేయకలుగు మనస్సులు కలిగియుందురు. అటివారు సాయంకాలమందు గాని, రాత్రిగాని ధ్యానించుట లాభదాయకముగా నుండునని భావింతును.

ఈ చెప్పిన కాలములేవి మీకు అనుకూలించునో మీరే ఎన్నుకొనవలెను. కాని ఒకసారి కాలనిర్ణయమునకు వచ్చిన తరువాత, ఆ విషయమందు మాత్రము పట్టుదల కలిగి, ఎట్టి పరిస్థితులలలోను దానికే అంటిపెట్టుకొని యుండవలెను. ధ్యానముపట్ల నియమితకాల మత్యావసరము. కారణమేమన మనస్సు అభ్యాసమునుబట్టి పనులు చేయును. ఒకేవిధముగా ఒక విషయమును గూర్చి చాల దినములు వరుసగా చింతించుటవలన మనస్సు ఇతర దినములందుకూడ అదే సమయమునకు, అదే తలంపులు కలిగియుండును. మనము భగవంతుని గూర్చి ఏదైన ఒక గంటలో ఆలోచింప మొదలిడి బహుదినములు అట్లు ఒనర్చినచో తరువాతి కాలమందుకూడ అదే సమయమునకు అదే విధముగా అప్రయత్నముగనే మనస్సు

చింతింప ప్రారంభించును. క్రమసాధనవలన పొందు ఈ విధమగు లాభము అంత చులకన చేయవలసినదికాదు.

(3) ధ్యానము చేయుటకు ఒక నియమిత కాలమెట్లు అవసరమో అట్లే ఒక నియమిత స్థలముకూడ నుండవలెను. ఇదియే దేవాలయములయొక్కయు, చర్చిలయొక్కయు లాభదాయకమగు ముఖ్య ఉపయోగము. అట్టి ప్రదేశములను దేవునిగూర్చి చింతించుటకే ఉపయోగింతుము కాన ఆ ప్రదేశమున వాతావరణమంతయు అట్టి తలంపులతోనే దట్టముగా నిండి పవిత్రమగును. అక్కడ వెళ్ళినంత మాత్రమున మనము పునీతులమై యున్నత స్థాయికి చేరుదుము.

దేవాలయములందును, చర్చిలలోను ఉండునట్టి వాతావరణమును మనము మన గదిలోకూడ ఒకమూల సృష్టించుకొనవచ్చును. ఏలయన ఏ చోట ప్రబలమగు ఆలోచన నిరంతరము సాగుచుండునో, ఆ చోట ఆ భావముచే ద్యోతకమగు గుణములే ప్రకటమగును. అందువలన ఏ నిర్ణీతస్థలమందు నీవు ధ్యానమొనర్తువో అట్టి స్థానము ఆధ్యాత్మిక శక్తివలన సంపూర్ణముగా నిండియుండును. కావున ఆ స్థలమునకు మనము పోగానే ఆ శక్తి మన ప్రభావము కలిగి ధ్యానము చేయవలెనను ఇచ్ఛ మన యందు జనించును. మనస్సు మంత్రముగ్ధమైనట్లు ప్రశాంతమై మనపై యొకవింత ప్రభావమేర్పడును. ఇది యెంత లాభదాయకము!

(4) మన మనస్సులో దాగియున్న కామ క్రోధలోభాది అరిషడ్వర్గములయొక్క బలమును అంచనావేసి చూచినచో యిప్పుడు నేను ఉదహరించిన మార్గములన్నియు చాల బలహీనమైనవిగా తోచవచ్చును. దీనిని నేను ఒప్పుకొందును. మనలో ఎంత గొప్పవారైనను మనస్సులోని ప్రబల శత్రువులను జయించినారనుట అసంభవము. అందుచేతనే మనస్సులో "దాగియున్న" అని నేనంటిని. భగవంతుని పాదపద్మములను స్పృశించువరకు ఎవ్వరును ఈ అరిషడ్వర్గములను పూర్తిగా జయించుట అసాధ్యము.

చలికాలమందు మనము తోటలోని కలుపంతయు తీసివేసి, భూమినంతను అనవసరపు మొక్కలు లేకుండ చేతుము. కాని వసంతమందు ప్రథమమున వర్షాగమము కాగానే భూమిలో దాగియున్న చిన్న చిన్న విత్తనము లన్నియు మొక్కలై భూమి ఉపరితలమంతయు ఆక్రమించునట్లు మన మనస్సులో దాగియుండు చిన్న చిన్న సంకల్పములును, కామవాసనలును సమయము వచ్చినపుడు ప్రబలముగా అంకురించుటకు అవకాశము కనిపెట్టి యుండును. కావున మనము చాలా జాగ్రత్తగా నుండవలెను. ఈ దుష్టభావములన్నియు మన మనస్సులో దాగియున్నవనియు, వాటిని అణచిపెట్టియుంచనిచో క్షణములోనే అవి మన మనస్సునంతయు ఆక్రమించుననియు మన మెరుగవలెను.

మన భావోద్రేకములను, కామవాసనలను జయించుటకేమి చేయవలయును? ఒకప్పుడవి, తిన్నగా ఎదిరించి యుద్ధము చేయుటవలన జయింపబడవచ్చును. కాని సాధారణముగా ఒకవైపునుండి వాటితో యుద్ధము చేయుటయే మేలు. మనస్సును తిన్నగా ఎదుర్కొని దానిని జయించుటకు యత్నించుటవలన తరచు మేలుకన్న కీడు ఎక్కువరావచ్చును. ఏలయన దాని వలన మనస్సు ఎక్కువగా చిక్కులలో పడవచ్చును. మనస్సుయొక్క ఏ స్థితిని మనము జయింపదలతుమో ఆ స్థితిపై ఎక్కువ కాలము దానినుంచుట మంచిదికాదు. మానసిక తత్వ

శాస్త్రము ప్రకారము మనస్సు దేని విషయమై ఎక్కువ చింతించుచుండునో ఆ స్థితియే ప్రబలమగును.

దారిప్రక్కన ఒక చెట్టునీడన కూర్చొని ధ్యానము చేయు ఒక సాధువుకథ ఇందుకు ఉదాహరణంగా చెప్పవచ్చు. దుర్వృత్తి యందున్న ఒక కాంత ఆ బాట ప్రక్కనుండి తరచు పోవుచుండ అతడు ఆమెకు సలహానిచ్చుచుండెను. ఆమె పాప వృత్తిలోనున్నదనియు, ఎంత శీఘ్రముగా దానిని వదిలినచో ఆమెకును, ఇతరులకును కూడ అంత మంచిదనియు అతడు నుడువుచుండెను. లేనిచో మరణానంతరము ఎక్కువ యిక్కట్లకు లోనగుదువని అతడు బెదరించుచుండెను. ఆ వనితను చూచినప్పుడెల్ల, ఆ సాధువామెను ఇట్లు మందలించుచుండెడివాడు. కాలక్రమమున వారిరువురు మరణించిరి. జీవులను కొనిపోవుటకు యమదూతలు వచ్చిరి. పుణ్యజీవులను స్వర్గమునకు గొనిపోవుటకు తేజోమయుడగు దేవదూత బంగారు రథమును తీసికొనివచ్చునని యు, పాపులైన జీవులను గొనిపోవుటకు వచ్చు యమదూతలు నల్లగా నుందురనియు ప్రతీతి. యమదూత సాధువును నరకమునకు గొనిపోవుటకు వచ్చెననియు, తేజోమయుడగు దేవదూత వ్యభిచారిణియగు వనిత జీవిని స్వర్గమునకు కొనిపోవుటకు వచ్చెననియు కథ.

ఆశ్చర్యముతో సాధువు యిట్లనెను. "ఏదో తప్పు జరిగియుండును" దానికి దూత యిట్లనెను. "లేదు. తప్పేమియూ జరగలేదు. అంతయు సరిగనే యున్నది." అప్పుడు ఆ సన్యాసి ఆ దూతనిట్లు ప్రశ్నించెను. "అదెట్లు పొసగును" అప్పుడా దూత యిట్లు సమాధానమిచ్చెను. "మీరు సర్వసంగసన్యాస మొనర్చినను, సదా వ్యభిచారిణియొక్క చేష్టలను నడవడిని గూర్చియే ఆలోచించుచుంటిరి. మానసికముగ మీరెల్లప్పుడును దుర్మార్గమును గురించియే చింతించుచుంటిరి కదా! అట్లుగాక ఆ స్త్రీ భగవంతుని యెల్లప్పుడునూ ఇట్లు ప్రార్థించెడిది. 'దేవా నన్ను రక్షింపుము నేను అబలను, ఏమియూ చేయలేనిదానను.' ఆమె మనస్సెల్లప్పుడునూ దేవుని గురించి చింతించుచునే యుండెనుగదా? నీ కన్నా ఆమె మేలవును కాదా?" ఆ సాధువు జవాబివ్వలేకపోయెను.

ఇది ఒక మిక్కిలి అరుదగు ఉదాహరణగా వచ్చును. కాని చాల ముఖ్యమగు మానసిక తత్త్వమును ప్రకటము చేయుచున్నది. మనస్సెట్లు పనిచేయునో దానిని గూర్చిన రహస్యమును ఇది వెలిబుచ్చును. మనస్సును, కోరదగని, ఒక దుష్టగుణముపై తరచు నీవాలోచింప నిచ్చినచో, అది మొదట నుండు సంకల్పముకంటె చాలరెట్లు ప్రబలమగు సంకల్పమును పుట్టింపగలదు. ఈ దుర్గుణమును తరచు మనస్సునందు గుర్తుంచుటచే అనగా తరచు దానిని గురించియే ఆలోచించుటచే తుదకది ప్రబలమగు సంస్కారముగా నేర్పడవచ్చును.

మున్ముందు నీ మనస్సును పాప విషయమును గూర్చి చింతించుటనుండి మరలించి మరొక దోషరహితమును, సంతోషదాయకము నగు విషయముపై ఆలోచించుట మొదలిడుము. ఇదే మనస్సును నిగ్రహించుపద్ధతి. దాని నణచి పెట్టక క్రమ క్రమముగా ఉన్నతస్థాయికి తెచ్చునది అగును. కోరదగని ప్రమాదకరమగు దుష్టాలోచనలనుండి క్రమ క్రమముగా మనస్సును మరలించి కోరదగిన సదాలోచనలపై అది నిల్చునట్లు ఈ అభ్యాసము చేయగలదు.

ప్రస్తుతము నీయందు, నిర్మూలింప అశక్యమని తోచు ఒక ప్రబల దుర్గుణముండినచో దానికి కారణమిది. దీర్ఘకాలము దానినిగురించి

తీవ్రముగా నీవాలోచించి, ఆ కార్యములనే చేయుచు దానికి తగినంత బలము సమకూర్చినా వన్నమాట. దానికి బలమునిచ్చు ఆధారమును తీసివేసినచో అది కాలక్రమమున దుర్బల మగుటయే కాక పోషణ ద్రవ్యములు లేనందున తుదకు నశింపగలదు. ఇదంత సులువుపద్ధతి అని చెప్పుటలేదు, కాని అభ్యాసబలమువలన ఇది యొక స్వభావముగా మారి ఆధ్యాత్మికోన్నతిని పడయగలవు. ఇది తప్పక ఆధ్యాత్మిక మార్గము నందు క్రమోన్నతిపొందు సాధనా పద్ధతి. కొంతకాలము కోరదగని వీడురాలోచనలను ఉపవసింపచేయుటచే, కొంత కాలమునకు వాటిలో చాలవరకు నశించినను, కొన్ని మాత్రమింకను మిగిలియున్నట్లు నీవు కను గొందువు. కాని వాటియెడ మిక్కిలి జాగరూ కత అంత మంచిదికాదు. అవి అట్లేయుండ నిమ్ము. అవిమాత్రము బలమును సమకూర్చు కొనకుండిన చాలు. వాటినొక మూల జాగ్ర త్తగా కనిపెట్టి వృద్ధిపొందకుండ చూచిన చాలును. కాలాంతరమున వాటియంత అవియే నశించును.

(5) మనస్సు తనలో తాను పెనుగులాడు కొనుటకును, కలత చెందుటకును, దుర్జన సాంగత్యము ఒక ప్రబలకారణము. వారి సహ వాసము వలన మనపై ఎట్టి పరిణామము కలుగనిచో మన మందరితోను కలిసి మెలసి యుండవచ్చును. కాని ఇది ఎప్పుడును సాధ్యము కాదు. అట్టి వ్యక్తిని నేనింతవరకును చూడ లేదు. కాని పరమార్థజీవితమునందు మంచి వారిని కలియుట వారితో సహవాసముచేయుట అత్యావసరము.

దుష్టులతో సహవాసమొనర్చినచో, చెడ్డ విషయములలో తరచు పరిచయము కలిగి, నీవు నిగ్రహింపదలచిన తలపులనుల నీ స్వాధీన మందెన్నడును నుంచుకొనజాలవు. అవి నీ వెఱు గకయే వృద్ధిపొంది బలవత్తరమై నిన్ను ఒక నాడు జయించగలుగును.

(6) ఆధ్యాత్మిక మార్గమున ఉన్నతస్థాయికి పోవలెనన్న కొంత ఇంద్రియ నిగ్రహము అవ సరము. మీలో కొందరు ధ్యానము చేయుటకు తీవ్రేచ్ఛ లేక "మేమది రాబోయే జన్మకు వాయిదా వేసెదము' అనికాని, "కొన్ని సంవత్సరములయినాక దాని నభ్యసింతుము" అని కాని అనవచ్చును. చాలమంది యౌవ్వన మందు జీవిత సుఖానుభవము పొందవలెననియు వృద్ధాప్యమే మతవిషయముల గురించి ఆలో చించు సమయమనియు వచించుచు ందురు. మరి కొందరు జీవితమందలి అనుభవములు, దుఃఖ మయములైనప్పుడు దేవాలయమునకు, చర్చికి పోవుట మొదలిడుదురు. వారి ముఖములపై వారి జీవితానుభవములు తాండవించుచుండును. వారందరూ మతము చెప్పినట్లు నడచుకొను చున్నామనుకొందురు. అది మతము కాదు. మతమగుట కూడ అసంభవమే.

అట్టియెడ, మనము భగవంతునికేమి కొని పోదుము? దేవునికి కుళ్ళిన పళ్ళనుగాని, చీక పట్టిన పూలనుగాని అర్పింపముగదా. శుభ్ర ముగా నిర్మలముగానుండు పదార్థములనే దేవు నకు తగినవిగా మన మర్పింతుము. అదే విధ ముగా మనలోనుండు ఉత్తమ పదార్థమునే ఆయన కర్పింపనగును. నిర్మలమును, స్వచ్ఛ మును అగు మనస్సే ఆయనకు మిక్కిలి సంతో షమును కలిగించు సమర్పణ. మతము అనునది వృద్ధులకే కాని యువకులకు కాదనుకొనుటగొప్ప తప్పు. చిన్నతనముననే పరమార్థ మార్గమున నెలవుట మంచిది. ఏలయన ఆసమయమున మన స్సు నిర్మలముగాను, నిశ్చింతగాను నుండును. అందుచే పరమార్థజీవితమును చిన్నతనముననే

ప్రారంభించి ఇంతవరకు చెప్పబడిన సాధనలను చక్కగా అనుష్ఠించినచో మనస్సును నిర్మలముగా యుంచుట సాధ్యమగును. ఎట్టి పరిస్థితులయందును మనస్సు ప్రాపంచిక పరిస్థితులవలన కలుషితము కాకూడదు. ఇహముకాని పరముకాని సాధించుటకు యౌవనమే తగుకాలము. కావున దానిని సద్వినియోగ మొనర్చవలెను.

శ్రీరామకృష్ణులు ఒకప్పు డొక కళాశాల విద్యార్థితో యిట్లనెను "ఇటుకలు చేయువాడు, ఇటుకలు గట్టిపడకమునుపే వాటిపై తన ముద్రను వేయును. ఎండలోఎండి బట్టిలో కాల్పబడిన తరువాత ఆ ముద్ర శాశ్వతముగా నిలిచిపోవును. అట్లే నీ మనస్సు మృదువుగా నుండు చిన్నతనమందే భగవంతుని ముద్ర దానిపై పడెనేని, అది శాశ్వతముగా చెడిపోక నిలిచిపోవును.

(7) ధ్యానము చేయుటకుముందు, కొంతసేపు, ప్రశాంతముగా మనస్సు నుంచుటకు ప్రయత్నించి. ప్రపంచములో మనకెట్టి సంబంధమును లేనట్లుండవలెను. భర్తగాను, భార్యగాను, తల్లివలెను, తండ్రివలెను, కుమారునివలెను లేక కుమార్తెవలెను, ప్రాపంచిక సంబంధములనుబట్టి నీకనేక పనులను నిర్వహింపవలసిన బాధ్యత లుండవచ్చును. వేయి పనులయందు నీ బాధ్యత, ప్రసక్తి యుండవచ్చును. భగవంతుని ధ్యానము చేయునపుడు (సమీపించునపుడు) నీ వేమి చేయవలెనో ఎరుగుదువా? ప్రపంచము ఎప్పుడును లేనట్లు, నీకు భార్యభర్త మొదలగు సంబంధము లేమియు ఎప్పుడును లేనట్లును, దేవునితో ఒక్కనితోనే సంబంధము పెట్టుకొనవలెను. ధ్యానము చేయునపుడు ఈ భావమే సరియగునది. ధ్యానించునపుడెల్ల నీవనంతకాలమందున్నావని భావించుకొనుము. ధ్యానమందెవరు జయింపగలరన ధ్యానమందు ఎవరు నిస్సంగులై యుందురో వారు. అంటే ఏమో నీకు తెలియునా? అనంతకాలమనిన ఎట్లుండునో కొంచె మూహించుము. అది కాలాతీతమైనది. అందుచేతనే దృశ్యములకన్నిటికి అతీతమైనది. ఆ స్థితియందు పరస్పర సంబంధముగల ఈ వస్తువులేవియు లేనివని చెప్పవచ్చును. సర్వకాలములయందుండు దేవుని గురించి ధ్యానించునపుడు, తాత్కాలికముగా మనము అన్ని సంబంధములనుండి దూరీకృతము అగుచున్నామన్నమాట. "నాకు శరీరముగాని మనస్సుగాని లేవు" అని అనుకొనుము. దేశము, కాలము లేకుండ మాయమయిపోయినవి, జగత్తంతయు అదృశ్యమైనది. దేవుడొక్కడే యున్నాడు. అప్పుడు మాత్రమే మనస్సునకు దేవుని దివ్యసన్నిధిని అంతటను అనుభవించు సూక్ష్మ ప్రసక్తి కలుగును. కావున ధ్యానమునకై నిర్ణీతమైన గది ప్రవేశించుటకుముందు పరస్పర సంబంధముగల ప్రపంచవస్తువుల నన్నింటిని నీవు బయటనే వదలవలెను.

మన మఠములందు చాల నియమబద్ధముగా నుండు సన్యాసులు, ఎవరినైనను ఎంతటి గొప్పవారినైనను తమ గృహవిషయముల గురించిగాని (భార్యాపుత్రాదులను గురించి) ప్రాపంచిక విషయముల గురించిగాని ముచ్చటింప నంగీకరించరు. ప్రతివారును వారి కర్తవ్యముల నొనర్చుటయందు వీరికి అయిష్టత లేదు కాని మనస్సు ఆధ్యాత్మిక మార్గమున ఉన్నత స్థాయికి పోవలెనన్నచో, అది దేశకాలములను అతిక్రమించిన భగవంతుని స్వభావమున పాల్గొనవలెను. దినమందేదైనను ఒక సమయమున నీవు ప్రపంచముతో ఎట్టి సంబంధమును లేకుండనుండవలెను. ఏలయన అది నీ నిజస్వభావము. ప్ర

సంబంధమున్నట్లు వ్యవహారమునందు నీకు కనిపించినను, ఈ సంబంధములన్నియు, అశాశ్వతములే అని నీకు తెలియును. నీ నిజస్వభావము ఎవరితోనూ ఏ వస్తువుతోను సంబంధము లేనిది. ఇట్టి స్థితిలోనే నీవు ధ్యాన మభ్యసింపవలెను.

(8) పైన ఉదహరింపబడిన ప్రక్రియలను చక్కగా అనుష్ఠించుటవలన, ఆధ్యాత్మిక మార్గమున నిజమగు అభివృద్ధిని తగినంత సాధింపవచ్చును. కాని, ఇక్కడ ఒక విషయమును గురించి హెచ్చరిక చేయవలసియున్నది. ధ్యానము సహా పరమార్థ సాధనలన్నియూ, సత్యవిషయమై నీకుండు తహ తహానుబట్టి అందలి అభివృద్ధి ఆధారపడియుండును. నీకా తహ తహ, ఆసక్తి గలదా? "మా కది లేదని" మీరనవచ్చును. అప్పుడు ఇంక ధ్యానమువలన ఏమి లాభము పొందగలరు? కాని ఆ తీవ్రేచ్ఛనుపుట్టించుట అసంభవమా? దేనియందైనను నైపుణ్యము సంపాదించుటకు కాని, పాఠశాలలోనో, కళాశాలలోనో విజ్ఞానము అలవరుచుటయందు కాని, మరల మరల యత్నించుటవలననే జయమును సాధింతుము. మొట్టమొదట మనము పొందదలచుకొన్న స్థితి మనకు సహజముగాని, స్వాభావికముగాని కాదు. కాని ప్రయత్నబలమువలన దానిని సాధించినచో తరువాత మనలో అది ఒక భాగముగా మారును. ఇది ఆధ్యాత్మిక జీవితమందు ప్రాపంచిక జీవితమందు కంటెకూడ ఎక్కువ సత్యమైన విషయము. కనుక దానికనుగుణ్యముగా మనము యత్నింపవలెను. మున్ముందు మార్గమందలి ప్రతి విషయముకూడ కష్టసాధ్యముగనే కనుపించును. అప్పుడు నీ నిజమగు స్వభావమేదని నిన్ను నీవే ప్రశ్నించుకొందువు? "నాకు మత సంబంధమగు సంస్కారములు లేవేమో! నేను మత విషయములందభివృద్ధి పొందుట సాధ్యము కాదేమో!" నేనుకూడా నా విషయమై ఇట్లే అనుకొన్న రోజులు గలవు. ఏదైనను ప్రతిబంధకము కలిగినప్పుడు, అది నాకు ప్రబలమగు అవరోధమనియు, దానిని జయించుట నాకు అసంభవమనియు, అనుకొనుచుండెడివాడను. అట్టి సమయములందెల్లప్పుడునూ, నేను శరీరమును, మనస్సునూ కాననియునూ, వాస్తవముగ నేను ఆత్మస్వరూపుడననియు, నా ఆత్మను నే ననుభవించుట నా జన్మ హక్కనియు భావించెడివాడను.

ధ్యానాభ్యాసములో గమ్యస్థానమును చేరుటకు తీవ్రేచ్ఛ, ప్రబలమగువిశ్వాసము అత్యవసరము. ఏలయన దైవప్రాప్తికి ప్రబలమగు కోరిక, దేవునియందు గాఢమగు విశ్వాసము లేనిచో ధ్యానమంతయు వృథాయగును. ఇట్టి అభ్యాసమంతయు హృదయపూర్వము కానిదియు, నమ్మిక లేనిదియు అగును. శ్రద్ధలేనియెడల, చేయునదంతయు, లాంఛనప్రాయమై, ప్రయత్నము శీఘ్రముగనే వదలివేయబడును.

సగుణపరమాత్మయందు నీకు నమ్మిక కలదేని ఆయనను ప్రార్థింపుము. సగుణపరమాత్మ అనగా సాకారముతోనుండు దేవుడని నా అభిప్రాయము కాదు. జగత్తునంతను సృష్టించి, అంతటను వ్యాపించియుండు దేవుడు. మన తండ్రియు, తల్లియు, మిత్రుడును, ప్రభువును అయిన దేవుడు. మనము ప్రార్థించునపుడాయన అవశ్యము వినును. పిల్లలు తలిదండ్రులను సమీపించునట్లు మనముకూడ దేవుని విశ్వాసముతో సమీపించవచ్చును. సగుణుడైన దేవుని నమ్ముటయు, ప్రేమించుటయు పూర్తిగా నున్నచో, అది ధ్యానమును చాల సులభముగా నొనర్చును. ఆయనను

గురించి ఎక్కువగాను, ఇంకను ఎక్కువగను చింతించుచుండుము. ఆయనకై కర్మలొనర్చుము. ఆధ్యాత్మిక మార్గములో విజయము సాధించుటకు, ప్రతి ఆలోచనయు, ప్రతిభావనయు, ప్రతి జౌన్నస శక్తియు ఆయనకై వినియోగించుము.

(9) నీవు దానినెట్లు చేయుదువు? నీవు మాట్లాడునప్పుడు దేవునిగురించియే మాట్లాడుము. నీవు నడచునపుడు ఆయన ఆలయమునకు నడచునట్లే నడచిపొమ్ము. చేతులతో పని చేయునపుడు ఆయనకై చేయునట్లు భావింపుము. దేహము యొక్కయు, మనస్సుయొక్కయు, ప్రతిపనియూ కూడ ఏదో విధమున, ఆయనకు సంబంధించి యుండునట్లు భావించుకొనుము.

ఎల్లప్పుడును ధైర్యము అవలంభించుట వసరము. ఎప్పుడును ఈ విషయము జ్ఞప్తియందుంచుకొనుము; ఈ జగత్తును సృష్టించిన దేవుడు ఎప్పుడును దాని వెనుకనే యున్నాడు. మనల నెప్పుడును, ఆయన ఉపవసింపచేయడు. మనము నిజముగా సత్యవస్తువే కావలసినచో అసత్యమగు తప్పు పదార్థములన్నింటిని త్యజింప సంసిద్ధులమై యున్నచో, సరియగు మార్గమును అవలంభించుటలో మనకెన్నడును జంకుండదు. లక్ష్యమును తప్పక సాధింతుము.

నీ వృత్తి వ్యాపారములు ధార్మికమైనచో, అవి భగవంతునికి ప్రీతికరములుగా నీవు భావింపవచ్చును. నీవు ఇంటిపనులు చేయునపుడుగాని, బైటి వ్యవహారములు నిర్వహించునపుడుగాని, భగవద్ధ్యానమును ఎప్పుడును మానకుము. పగలంతయు నీ ఒనరించిన పనులను, నీ యజమానికై వ్యవహారదృష్ట్యా నిర్వహింపబడినను, దేవుని పనిగా భావించి ఆయన కర్పింపుము. ఇట్లు చేయుటవలన నీవు నీ భావములకు వేరే మార్గము చూపినవాడవు అగుదువు. అవును, అది పనులచేయుటయందు నైపుణ్యము. మొదటది విపరీతమని అనిపించవచ్చునుగాని, ఎట్లైనను దానిని నిర్వర్తింపుము. క్రమ క్రమముగా నీకు దానియందొక గంభీరమగు అర్థము గోచరింప ప్రారంభించును. నీవు మొదట అనుకొనిన అభ్యాసముగా, నీకు కనిపించుటమాని వేరు భావములందు స్ఫురించును. అది చాల ప్రబలముగా ఫలవంతమైనదై అగును.

ఈ ప్రకారముగా ఇతరులకుగాని, నీకుగాని యేదైనను చేసికొనినపుడెల్ల భగవంతునికొరకే చేయుచున్నాను అని తలచుకొనుము. జీవితములో ప్రతి విషయమును అట్లు ఆధ్యాత్మికముగా మార్పు చేయగలము. కొందరు దేవుని బుద్ధిపూర్వకముగాను, ఇష్టముతోను, సేవించువారు కలరు. వారు ఎంత అదృష్టవంతులో! అందుకనే జనులు చాల ప్రయాసముతో బాహుళ్యమగు దేవతారాధన చేయుదురు. వారు పుష్పములను సంపాదించి దేవుని కర్పింతురు. అంతేకాదు వారు ధూపమునర్పించి దీపములను వెలిగింతురు. బహుశః ఈ అభ్యాసములు నీ కంత రుచింపవేమో! అట్లైనచో దినమందలి కాలము ఏ విధమున గడుపుదువు? చిన్న అహంను వివిధ కార్యములవల్ల సేవించుటచే నీ కాలమును, శక్తియు వ్యర్థమగుచున్న వని నీవు గుర్తించుట లేదా? ఇట్టి భావన నాటియే దేవతాపూజ మున్నగు కర్మకాండ ఉత్పన్నమైనది. ఇట్టియుద్దేశము వలననే ప్రపంచమందలి దేశములన్నిటియందును, దేవుని పేర ఆలయములు గట్టి అందు పూజాధికములను నిర్వహించుచున్నారు.

అయినను అందరును కర్మకాండతో కూడిన యట్టి విధానములను అభ్యసింపవలెనని నేననుట లేదు. ప్రతివాడును వారి ఆధ్యాత్మిక

తయారీనిబట్టి. దేవుని ఆరాధింపవలెను. కాని ఏదో ఒక విధమున నీవు, నీ భావములను, భావోద్రేకములను, క్రియా కలాపములను, భగవంతునిసేవకై వినియోగించుట అభ్యసింప వలెను. ఇట్లింతఎక్కువగా చేయుదువో అంత సన్నిహితముగా, ఆయనకు నీవుండగలవు. ఇట్లు చేయగా చేయగా ధ్యానములో నీవితర విషయములనన్నిటిని మరచి దేవునొక్కనే హృదయమందు చివరకు నిలుపుకొనగలవు.

(10) బహుశః జ్ఞాన విచారముచలన ఆధ్యాత్మికసత్యములనుగురించి నమ్మికను పొంది యుండవచ్చును. నీ అంతట నీవు, ఈ సత్యములను అనుభవించువరకు, వాటిని అనుభవించిన ఒక మహానుభావుని ప్రత్యక్షముగా కొనుట గొప్ప యదృష్టమని నేను నొక్కి చెప్ప గలను. ఆధ్యాత్మిక సత్యములయొక్క యాథార్థ్యము (ఋజువు) వాద వివాదములందును, బుద్ధికుశలతతో గూడిన విచారణయందును, వేయేల, ఎట్టి బాహ్య ప్రదర్శనలయందునూ ఉండబోదు. ఈ సత్యములను అనుభవించిన ఒక వ్యక్తియొక్క మాటలయందు ఇవి గర్భితములై సాధకునియందు నమ్మిక కలిగించవలెను. ఇతరులు దీనిని అంగీకరించినమా, లేకున్ననూ, దీనిమీద తప్పక సాధకుడు ఆధారపడి యుండు బాహ్య ఋజువుగా నేను నమ్ముదును.

అట్టి ఆధ్యాత్మికోన్నతి కలిగిన వ్యక్తి. నా కిట్లు చెప్పెను. "పుత్రా, నీవు నిజముగా ఈ శరీరమును, మనస్సును కావు. ఆత్మయే నీ నిజమగు స్వరూపము. నిజమగు నీవు నాశములేని సర్వకాల సర్వావస్తలయుండు ఆత్మయే. తాత్కాలికమగు వస్తువులతో నీకేమియు సంబంధము లేదు. నిజమగు నీ ఆత్మను కనుగొన యత్నింపుము. లోతుకు దిగుము." నేనుతప్పక ఆయన మాటలను అంగీకరించి, దాని ప్రకారమే నడుచుకొనుటకు, సంసిద్ధుడను కావలసి నదే. ఆయన యిట్లు మాట్లాడుచుండ ఆయన కంఠధ్వనిలో ఏదో నా హృదయములోనికి దిగి, నేను దానిని వ్యతిరేకించకుండ చేసెను. మీరందరును యే వ్యక్తి జిహ్వనుండి అట్టి దివ్యవాణి వెలువడునో, అట్టి వ్యక్తిని, కను గొందురని నేనెం ఆశించుచున్నాను. అప్పుడు మీరు దానిని సందేహించుటగాని, నిర్లక్ష్యముగా చూచుటగాని జరగదు. మీలో మీ నిజస్వభావము యొక్కయు, మీ గమ్య స్థానము యొక్కయు నమ్మిక వృద్ధియగును. కొంతకాలమువరకు పరాజయము మీ యందు ఆశాభంగమును కలిగించవచ్చునుకాని తుట్ట తుదకు మీరిట్లందురు. "కానిమ్ము మరల ప్రయత్నించి చూచెదము." అప్పుడు తప్పక మీరు జయింతురు.

ధ్యానముయొక్క తయారీకి మున్ముందు ఏమి చేయవలెనో సంగ్రహముగా మీకు ఉదహరించితిని. ఇప్పుడు నే నుదహరించిన సాధనల నన్నిటిని, జాగ్రత్తగా అభ్యసించినచో మీరు దేవునకు తప్పక సన్నిహితులు కాగలరు. ముగించుటకు పూర్వము ముఖ్యమగు కొన్ని సంగతులను యిట ఉదహరింపనిండు. నీవు చేయవలసిన పనులన్నిటిని చేయుము. కాని వాటి నన్నటిని ఈశ్వరార్పణము ఒనర్చుము. అప్పుడు నీ మనస్సు చాంచల్యము నొందదు. దేనితోనూ, ఎవరితోనూ, ఎట్టి సంబంధము లేకయుండుము. ఎల్లప్పుడును అన్ని చోట్లనూ ఉండు ఆత్మతో తాదాత్మ్యము నొందుము. అప్పుడు ధ్యానము సుసాధ్యమగును. నీ మనస్సు నెప్పుడును పరి పరి విధములు పోనివ్వకుము. ఏలయన అట్లు చేయనిచ్చిన ప్రాపంచిక భావములు మనసును క్రమ్ముకొనును. ఇది ఎప్పుడును జరుగకూడదు. నీవు ధ్యానములో

కూర్చుండుటకు ముందు నేను యిప్పుడు సూచించిన విషయముల గురించి చింతింపుము.

బాహ్య భావము లేవియూ, నీ మనస్సు నందు చొరకుండినచో, అది ప్రశాంతముగా యుండును. అప్పుడు నీ హృదయమందిరమున భగవంతుని కాంతివంతమైన ముఖమున్ను నీవు చూడగలవు దానిని ధ్యానించుకొలది, అది మరింత అందముగా కనిపించి దాని అనంత సౌందర్యమందు నీవు తుదకు మునిగిపోయి అంతయు మరతువు. నీవు తుదకు ఆయనయందే లీనమైపోవుదువు.

(అనువాదం: శిష్ట్లా సుబ్బారావు.)

# స్వామి అద్భుతానంద

డి. వి. బ్రహ్మాజి

"శ్రీ రామకృష్ణభగవానుని అద్భుత చర్యలన్నింటిలోను మహాద్భుతమయినది లాటూ జీవితచరిత్ర. అక్షరజ్ఞానం ఏ మాత్రమూ లేనప్పటికీ, కేవలం పరమహంస దివ్య సాహచర్యమాత్రం చేతనే, లాటూ మహోన్నతమయిన ఆధ్యాత్మికశిఖరాన్ని అధిరోహించాడు." అని అనేవారు స్వామి వివేకానంద. సన్యాసాశ్రమ స్వీకారానికి ముందు అద్భుతానందస్వామి లాటూ అనే పేరుతో పిలవబడేవారు. నిరక్షరాస్యత విషయంలో మన లాటూమహారాజ్ తమ గురుదేవుల కన్న ఒక ఆకు ఎక్కువే చదివారు. శ్రీ రామకృష్ణులకు చదవడం వ్రాయడం వచ్చును. కాని లాటూ విషయం చూస్తే ఈయన పూర్తిగా అక్షరజ్ఞాన శూన్యుడే. అధమం చదవటం, వ్రాయటం, లెక్కలు వేయటం ఎంతయినా అవసరమని భావించి శ్రీ రామకృష్ణులు ఒకసారి లాటూను కూర్చోబెట్టి వంగభాషలోని అక్షరక్రమాన్ని నేర్పడానికి స్వయంగా ప్రయత్నించారు. కాని లాటూకి ఆ అక్షరాలను సరిగా ఉచ్చరించడానికే వీలు కాలేదు. రెండు మూడు సార్లు ప్రయత్నించి గురుదేవులు తమ ప్రయత్నాన్ని మానుకొన్నారు. ఇంతటితో లాటూ చదువు పూర్తియింది.

అయితే, పుస్తకాలద్వారా లభించే విజ్ఞానం కేవలం రెండవ తరగతికి చెందినది మాత్రమేనని మనం గుర్తించాలి. ఆధ్యాత్మిక విజ్ఞాన పరమావధి అయిన శ్రీ రామకృష్ణుల నుంచి నేరుగా పారమార్థిక విజ్ఞాన సంపదను అందుకొన్న అదృష్టవంతుడు లాటూమహారాజ్. అందుచేతనే ఎంతో గొప్ప పండితులు సహితం అద్భుతానందస్వామి నోటినుండి వచ్చే పలుకులు వినడానికి ఆతృతతో ఎదురు చూస్తుండేవారు. ఈ సందర్భంలో "కాంతి కంతకు మూలాధారమయిన భగవంతునినుండి ఒక్క కటాక్ష కిరణం ప్రసరిస్తే చాలు; పుస్తకజ్ఞానం అంతా నిరుపయోగమయి పోతుంది" అని రామకృష్ణులు చెప్పిన సంగతి జ్ఞాపకం వస్తుంది.

అద్భుతానందస్వామికి తల్లిదండ్రులు పెట్టిన పేరు రఖ్తూరామ్. ఈయన బీహారు రాష్ట్రంలోని ఛాప్రాజిల్లాలో ఒక చిన్న గ్రామంలో అతి బీదకుటుంబంలో జన్మించారు. మాఘ పూర్ణిమనాడు జన్మించారని మాత్రమే తెలుసుగాని, అంతకుమించి స్వామి చరిత్ర మన కంతగా తెలియదు. ఇందుకు ఆయన

నిర్లిప్తతకూడా కొంత కారణమే. "మనం భగవంతుణ్ణిగూర్చి మాత్రమే మన ఆలోచన లన్నీ కేంద్రీకరించాలి కాని ఇట్లాంటి లౌకిక విషయాలు అసలు పట్టించుకోరాదు" అని ఆయన అంటూండేవారు.

లాటూకు అయిదు సంవత్సరాల వయస్సు కూడా నిండకముందే తల్లిదండ్రులిద్దరూ చనిపోయారు. ఆయన సంరక్షణభారాన్ని పినతండ్రి వహించారు. బీహారులో జీవనం గడవక, పినతండ్రితో కలసి లాటూ జీవిక వెతుక్కుంటూ కలకత్తా చేరారు. కలకత్తాలో శ్రీ రామకృష్ణుని ముఖ్య శిష్యుడయిన రామచంద్రదత్తా ఇంటిలో రఖ్తూరామ్ ఒక బాల సేవకుడుగా పనికి కుదిరాడు. సేవకవృత్తిలో ఉన్నా రఖ్తూరామ్ ఆత్మగౌరవానికి భంగం కలిగితే సహించేవాడుకాదు. ఒకసారి రామచంద్రదత్తా స్నేహితుడొకడు "ఈ పని కుర్రాళ్లను కూరలు కొనడానికి పంపినపుడు అందులో కొంత మిగుల్చుకొని జేబులో వేసుకుంటారు. జాగ్రత్తగా కనిపెట్టి ఉండాలిసుమా" అని మిత్రుని హెచ్చరించాడు. అది విన్న రఖ్తూరామ్ వెంటనే "అయ్యా. నేను సేవకుణ్ణే... —కాని దొంగను ఎంతమాత్రం కాదు." అని దృఢంగా సమాధానం చెప్పారు. అది విని రామచంద్రదత్తా కూడా రఖ్తూరామ్‌నే బలపరిచారు. చదువుకోక పోవటంవలన లాటూకు మొహమాటం అన్నది తెలియదు. తాను నమ్మిన విషయాన్ని ముక్కుమీద గుద్దినట్లుగా ప్రకటించేవారు.

గొప్ప భక్తుడయిన రామచంద్రదత్తా ఇంట్లో ఎల్లప్పుడు సంకీర్తన, జపాలు, పూజలు జరుగుతుండేవి. ఒకసారి ఆయన "ఏకాంతంగా భగవంతుణ్ణి ప్రార్థిస్తూ ఆయన దర్శనానికై తపిస్తూ ఉంటే ఆయన తప్పక సాక్షాత్క-రిస్తాడు." అని చెబుతుండగా రఖ్తూరామ్ విన్నాడు. పసిబాలుడు కావడంవల్ల ఈ మాటలు ఆయన మనసులో నాటుకు పోయాయి. ఒక దుప్పటి కప్పుకొని పడుకొని విలపిస్తూ చేతితో కన్నీళ్లు తుడుచుకునే లాటూని చూసి ఆ ఇంట్లో స్త్రీలు "పాపం పసివాడు. వాళ్ల స్వగ్రామంలో చుట్టాలను, మిత్రుల్ని తలచుకుని ఏడుస్తున్నాడు" అని జాలిపడేవారు. కాని, మన రఖ్తూరామ్ విలపిస్తున్నది భగవంతుని గురించి అన్న సంగతి వారికి తెలియదుగదా!

మొదటిసారిగా రఖ్తూరామ్ దక్షిణేశ్వరం వెళ్లినపుడు ఆయనకు రామకృష్ణుల గురించి అంతగా తెలియదు. గది వసారాలో అటూ ఇటూ తిరుగుతున్న ఒక మనిషిని చూసి, కాషాయవస్త్రములు ధరించక పోవడంవల్ల, ఆయన తాను చూడవచ్చిన సన్న్యాసి కాడని అనుకున్నారు. అయినా, ఏదో తెలియని ఆకర్షణ కల్గి ఆయనకు ప్రణామం చేశారు. గురుదేవు లాయన యోగక్షేమాలు అడిగి స్వల్పాహారం ఏర్పాటుచేశారు. మాటల సందర్భంలో ఆయనే రామకృష్ణులని వెల్లడయింది. ప్రథమ సమాగమంలోనే రఖ్తూరామ్ హృదయంమీద రామకృష్ణుని ప్రభావం గాఢంగా నాటుకుంది. శ్రీ రామకృష్ణునకు పండ్లు, పూలు, మిఠాయి పదార్థాలు ఇచ్చి రావడంకోసం రఖ్తూరామ్ తరచుగా రామచంద్రదత్తా ఇంటినుంచి దక్షిణేశ్వరం వెళ్లివస్తూ ఉండేవారు. శ్రీ రామకృష్ణునకు పరిచర్యలు చేయడానికి ఒక మనిషి అవసరం ఎంతగానో కన్పించింది. అందుకోసం రఖ్తూరామ్‌ని పంపమని కోరగా రామచంద్రదత్తా సంతోషంగా అంగీకరించారు. అప్పటి నుండి రఖ్తూరామ్ రామకృష్ణుల సన్నిధిని విడవకుండా గురుదేవుని సేవకు తాము

పరిపూర్ణంగా అంకితమయిపోయారు. శ్రీ ఆంజనేయస్వామి శ్రీరామునకెట్లా సేవ చేశారో అదే రీతిలో మన స్వామి శ్రీ రామకృష్ణునికి పరిచర్యలు చేశారు. పరమహంస ప్రేమ పాత్రంగా రఖ్తురామ్‌ని ''లేటో'', ''నేటో'', ''లాటూ'' అని పేర్లతో పిలచేవారు. తర్వాత, తర్వాత మన స్వామికి ''లాటూ'' అనే పేరు స్థిరపడిపోయింది.

చదువు రాకపోవటం లాటూ మహారాజ్‌కి ఒక గొప్ప వరంగా పరిణమించింది. ఆయన తన శక్తిని సర్వస్వము క్రియారూపంలో రచన బరిచేవారు. అంతేగాని వ్యర్థమయిన వాదాల జోలికిపోయే అవకాశం ఆయనకులేదు. కాని, మన మో...నం నేర్చిన కొద్దిపాటి మిడి మిడి జ్ఞానంతోను ప్రతి విషయం సందేహిస్తూ, దృఢమయిన నమ్మకం కుదరక, శంకాకులిత మానసులమయి నిజాన్ని నిజంగా తెలుసుకోడంకోసం అనవసరంగా మన శక్తినంతా వెచ్చించుతాం. క్రియలో ఆచరించే స్థితికి వచ్చేనరికి మనకు శక్తి చాలదు. ఈ విధమయిన సందేహాస్పదం కాని చిత్తవృత్తి మన స్వామిది. దానికి తోడు, ఆయన పూర్వ పుణ్య విశేషంవల్ల రామకృష్ణునివంటి సద్గురువు లభించారు. గురువాక్యాన్ని తత్‌క్షణమే ఆచరణలో అమలు పరచేవారు మన స్వామి. గురుదేవుని పవిత్ర సాంగత్యమహిమచే లాటూ తన పారమార్థిక జీవనవిధానంలో అతి త్వరితగతిని ముందుకు సాగిపోయారు.

లాటూమహారాజ్ ఒకసారి మాటల సందర్భంలో ''శ్రీ రామకృష్ణులకు సేవ చేయటం అనేదే గొప్ప పూజ, అదే గొప్ప ధ్యానము'' అని అన్నారు. సంపూర్ణమయిన ఆత్మార్పణతో లాటూమహారాజ్ తన గురువర్యుని జీవితపర్యంతం సేవించారు. రామకృష్ణులు స్వయంగా అందించిన కాషాయ వస్త్రాలను అందుకున్న కొద్దిమంది పుణ్యాత్ముల లోను మన లాటూ ఒకరు. శ్రీ రామకృష్ణుని నిర్యాణానంతరం ఆశ్రమం స్వీకారం చేసిన సన్యాసులలో లాటూ ఒకరు. అప్పుడే ఆయనకు అద్భుతానందస్వామి అను పేరు వచ్చింది. నిజంగా మన స్వామిజీవిత అద్భుతావహ మయినదే.

శ్రీ రామకృష్ణుల మరణానంతరం మన స్వామి మాతృశ్రీ శారదాదేవికి కూడా అత్యంత భక్తి ప్రపత్తులతో సేవ లొనర్చారు. మాతృదేవి కూడా స్వామిని పుత్ర నిర్విశేషంగా అభిమానించేవారు. పల్లెటూరిలో ఛాందస కుటుంబంలో పుట్టి పెరిగిన కారణంచేత శారదాదేవి పురుషులతో అంతగా మాట్లాడేవారు కాదు. కాని, చిన్న పిల్లవాడు కావడం వల్ల, తనయెడల పసిబాలుడు తల్లియెడల ప్రవర్తించిన రీతిలోనే ప్రవర్తించడంవల్ల మన అద్భుతానందస్వామితో మాత్రం మాతృదేవి చనవుగా మాట్లాడుతూ ఉండేవారు.

స్వామికి ధ్యానంలో తీవ్రంగా నిమగ్నమయిఉండటం తరచు పరిపాటి అయింది. ఆ సమయంలో ఆయనకు బాహ్యస్మృతి అసలు ఏ మాత్రమూ ఉండేదికాదు. ఒకసారి గంగానది ఒడ్డున మన స్వామి ధ్యాననిమగ్నులయి ఉండగా నదికి వరదవచ్చి పొంగసాగింది. కాని, స్వామికి ఆ ధ్యాసేలేదు. అప్పుడు కొంతమంది పరుగెత్తిపోయి రామకృష్ణులకు విన్నవించగా ఆయన పరుగు పరుగునవచ్చి స్వామిని ఈ లోకంలోకి తీసుకురాగలిగారు. ఏ భక్తుని గృహంలోనో, లేక అచ్చు యంత్రం ఉన్న చిన్న గదిలోనయినా సరే, అదీ లేకపోతే గంగానది ఒడ్డున ఆరుబయట స్థలంలోనో స్వామి తన ధ్యానం కొనసాగిస్తూ జీవనం

గడిపేసేవారు. ఆరుబయట ధ్యానం చేసుకుంటూండగా, ఒకసారి వాన రావటంతో స్వామి ప్రక్కనేఉన్న ఖాళీ రైల్వే వేగనులో చేరి ధ్యానంలో నిమగ్నమయి బాహ్యస్మృతి కోల్పోయారు. ఈ లోగా రైలింజనువచ్చి వేగనును తగిలించుకొని చాలాదూరం లాగుకొని పోయింది. అప్పుడు బాహ్యస్మృతి కల్గిన స్వామి మెల్లగా దిగి వెనకకు నడిచివచ్చారు.

చిన్ననాటినుంచి కూడా అద్భుతానంద స్వామికి సంకీర్తనం అంటే ఎంతో ఇష్టం. రామచంద్రదత్తా ఇంటిలో బాలసేవకుడుగా పనిచేస్తున్న కాలంలో ఆ వీధిలో భజన కూటమి ఏదయినా పోవడం జరిగితే ఆయన తాను చేస్తున్న పనిసంగతి మరచిపోయి వాళ్లతో కలసి పాడుతూ కొంతదూరము పోయి తిరిగి వచ్చేవాడు. భక్తిమార్గా లన్నింటిలోను అద్భుతానందస్వామికి నామజపం అత్యంత ప్రీతిపాత్రమయినది. ఒకసారి భక్తుడొకడు స్వామిని, "స్వామీ కండ్లార చూడజాలని భగవంతుడికి మనం ఆత్మసమర్పణ గావించుకోడం ఎట్లా?" అని ప్రశ్నించాడు. దానికి మన స్వామి—"నువ్వు భగవంతుణ్ణి స్వయంగా ప్రత్యక్షంగా చూడకపోతేనేం. ఆయన నామం నీకు తెల్సుగదా. నామజపం చెయ్యి. ఉన్నతి చెందగలవు. ఆఫీసులలో ఏం చేస్తుంటారో నీకు తెలుసుగదా. ఆఫీసరును ప్రత్యక్షంగా చూడకనే, ఆయన ఎట్లాఉంటాడో తెలియకనే ఆయనపేరిట పంపుకొన్న దరఖాస్తులవల్ల పని జరిగిపోతోందిగదా. అట్లాగే భగవన్నామం జపిస్తూ దాని ద్వారా నీవు ఆయన కృపకు పాత్రుడవు కాగలవు"—అని సెలవిచ్చారు.

రాత్రికాలం అంతా మన స్వామి ధ్యానంలోను, జపంలోను గడిపెడేవారు. పగటిపూట ఏ కొద్దిసేపో నిద్రపోయేవారు. జీవితపర్యంతం ఇదే విధానం అనుసరించారు. తాను తీవ్రమయిన అనారోగ్యంతో బాధపడుతున్న రోజులలో కూడా సాయంత్రంపూట కూర్చుని ధ్యానంచేసే అలవాటును అద్భుతానందస్వామి విడవకుండా కొనసాగించారు. స్వామి బారానగరు ఆశ్రమంలో ఉండగా ఒక చిత్రమయిన సంఘటన జరిగింది. మిగిలిన సోదర సన్యాసులంతా నిద్రిస్తున్న రాత్రి సమయంలో స్వామి లేచి కూర్చుని జపమాల త్రిప్పుతూ నామజపం సాగించేవారు. ఒకసారి అర్ధరాత్రి సమయంలో స్వామి తన జపమాల త్రిప్పుతున్న చప్పుడువిని ఎలకవచ్చిందనుకొని శారదానందస్వామి లేచి దీపం వెల్గించి వెతకడం సాగించారు. చివరకు అసలు విషయం తెలుసుకుని అంతా విరగబడి నవ్వుకున్నారు.

స్వామికి భగవంతునియెడల ఎంతటి విశ్వాసం ఉండేదో రామకృష్ణులయెడల కూడా అంతటి అపారమైన భక్తివిశ్వాసాలు ఉండేవి. "శ్రీరామకృష్ణులను సేవించటమే గొప్పపూజ అదే గొప్ప ధ్యానము, జపము." అని ఆయన తరచు బోధిస్తూ ఉండేవారు. భక్తిలో ఉండవలసిన తీవ్రతను గురించి మాట్లాడుతు స్వామి ఇట్లా అనేవారు: "నీవు కోరినది కోరుకున్నట్లు కోరిన సమయంలోపల జరగకపోతే భగవంతుడిలో నీ విశ్వాసం తగ్గిపోతే అది నిజమయిన భక్తి అనిపించుకోదు. నీవు భగవంతుడికన్న తెలివయినవాడవని అనుకోడం వల్లనే ఈ అనర్థంవస్తోంది. నిజమయిన ఆత్మార్పణబుద్ధితో భగవంతుణ్ణి సేవించిననాడు ఎట్టి విపత్కర పరిస్థితులెదురయినా నీ భక్తి విశ్వాసాలు సడలవు.

పరివ్రాజక జీవితంలో అద్భుతానందస్వామి పూరి, కాశీ, ప్రయాగ, బృందావనం మొద

లయిన పుణ్యక్షేత్రాలను ఎన్నింటినో దర్శించారు. వివేకానందస్వామితో కలసి కాశ్మీరు కూడా చూసి వచ్చారు. కాశ్మీరు యాత్ర చేస్తున్నపుడు మనస్వామి ఒకసారి వాదనలో వివేకానందస్వామినే నిరుత్తరుణ్ణి చేసివేశారు. అక్కడున్న ప్రాచీన దేవాలయాన్ని ఒకదానిని చూచి స్వామి వివేకానంద "ఈ గుడి నిర్మింపబడి కనిసం రెండు మూడు వేల సంవత్సరాలయినా అయివుంటుంది" అన్నారు. అది విన్న అద్భుతానందస్వామి వెంటనే "ఏ ఆధారంగా ఈ నిర్ణయానికి మీరు రాగలిగారు?" అని నిలదీశారు. వివేకానంద పరిస్థితి ఇరకాటంలో పడింది. సరిఅయిన సమాధానం తోచక, తప్పించుకోవడానికి—: "నీకు ఆధునికమయిన విద్యరాదు. అందువల్ల కారణంచెప్పినా నీకు అర్థంకాదులే." అని దాటవేయజూచారు. మన స్వామి మాత్రం తక్కువతిన్నారా? "ఆహా! ఏమి చదువులండీ మీవి. నాబోటి చదువుకోని వాళ్ళకు అర్థం అయేటట్లు చెప్పి ఒప్పించలేని చదువులు ఎందుకు?" అని త్రిప్పికొట్టారు. అక్కడున్నవారంతా ఆ సమాధానం విని నవ్వులతో తేలిపోయారు.

సన్యాసిగా పేరుపొందిన తర్వాతకూడా స్వామి తన పూర్వ యజమాని అయిన రామచంద్రదత్తాను మరువలేదు. రామచంద్రదత్తా మరణశయ్యమీద ఉన్న సమయంలో స్వామి ఆయన ప్రక్కనే ఉండి హృదయపూర్వకంగా పరిచర్యలనొనరించారు. ఆ తర్వాత రామచంద్రదత్తా భార్యకుకూడా అంత్యసమయంలో విశేషంగా సపర్యలు సలిపారు.

అద్భుతానందస్వామికి, వివేకానందస్వామికి గల సన్నిహితసంబంధం చూడ ముచ్చటగా ఉండేది. స్వామి, నరేంద్రనాథ అని పిలువలేక వివేకానందస్వామిని "లోరెన్" అని పిలచేవారు. అమెరికాలో దిగ్విజయానంతరం తిరిగి వచ్చిన వివేకానందస్వామికి కలకత్తాలో బ్రహ్మాండమయిన స్వాగతం ఏర్పాటయింది. ప్రతివారూ ఆయనను కలుసుకొని మాట్లాడాలని తహతహతో ముందుకు చొచ్చుకు వచ్చేవారే. కాని, వారిలో లాటూమాత్రం వివేకానందకు ఎక్కడా అగుపడలేదు. లాటూగురించి ఆత్రంగాఅడిగి దగ్గరకు పిలిపించుకున్నారు వివేకానంద స్వామి. "ఇంతసేపు నాదగ్గరకు ఎందుకు రాలేదు?" అన్న వివేకానందప్రశ్నకు, మనస్వామి తన సహజమయిన నిర్మొహమాటస్వభావంతో "ఇంత గొప్ప గొప్ప వాళ్ళమధ్య, బాగా చదువుకొన్నవాళ్ళ మధ్య నేను తగినుకదా" అని జవాబిచ్చారు. అదివిన్న వివేకానందస్వామి ఆప్యాయంగా అద్భుతానందస్వామిని చేరదీసి ఆలింగనం చేసుకొని, ప్రేమతో "అదేమిటి నాకు నువ్వు ఎప్పటి 'లాటూభాయీవే'." అని తనతోపాటుగా భోజనానికి గొనిపోయారు. వారిరువురిమధ్య ఇంతటి అనిర్వచనీయమయిన ప్రేమాభిమానాలుండేవి.

లాటూమహరాజ్ జీవితం ఆయన ఇష్టం వచ్చినపద్ధతిలోనే కొనసాగేది. అంతేకాని ఫలానాసమయానికి ఫలానాపని చేసితీరాలి అనే సమయనియమం ఆయనకంతగా అలవాటుకాలేదు. అందువల్లనే ఆయన ఆలంబజారుమఠంలో గాని బేలూరుమఠంలోగాని స్థిరనివాసం ఏర్పరచుకొనలేకపోయారు. ఒకసారి ఆశ్రమవాసులందరికి వివేకానంద కొన్నినియమాలు ఏర్పరిచారు— ఉదయాన్నే ఒకగంట కొడతారు, వెంటనే అందరూ మేల్కొని ధ్యానంచెయ్యాలి. అట్లాగే మరొకగంట కొట్టగానే అల్పాహారానికి రావాలి. ఇట్లా ఒకో కార్యక్రమానికి ఒక నిర్ణీతసమయం ఏర్పాటుచేశారు. ఆ మరునాడే అద్భుతానంద స్వామి తన మూటా ముల్లె సర్దుకొని ఆశ్రమం

విడిచి వెళ్ళిపోడానికి ఉద్యుక్తులయ్యారు. అది చూచి వివేకానంద ప్రశ్నించగా "నువ్వు గంట కొట్టి కొట్టగానే ధ్యాననిమగ్నం అయ్యే స్థితికి నా మనస్సు ఇంకా చేరుకోలేదు. ప్రత్యేక సమయాలలో ధ్యానం చెయ్యాలంటే మాత్రం నాకు సాధ్యంకాదు" అని అద్భుతానంద జవాబిచ్చారు. అది విని వివేకానందస్వామి తన నియమ నిబంధనావళిని ఒక్క అద్భుతానంద స్వామి విషయంలో మాత్రం పూర్తిగా సడలించారు.

మనస్వామి జీవితంలో [illegible] కరమయిన సంఘటన ఒకటి [illegible] ది. ఆయన ఒక ఒక్క [illegible] లో తొమ్మిది [illegible] గా ఉండటమే ఈ ఆశ్చర్యవిషయం, 1903 నుంచి 1912 దాకా మనస్వామి నిలకడగా బలరాం బోసు ఇంట్లో నివాసం ఏర్పరచుకున్నారు. స్వామి చాలా నిరాడంబరమయిన జీవితాన్ని గడిపేవారు. ఆయన ఉండేగదిలో—ఒక చిన్న చాప, పడుకునేబల్ల, ఒక పొయ్యిలో సగం కాలిన పిడకలు, వాటిమీద టీ కాగుతున్న పాత్ర—ఉండే సామానంతా ఇంతే. శరీరసౌఖ్యం కోసం స్వామికి కావలసినదంతా ఆ ఒక్క చిన్న టీపాత్ర మాత్రమే ఏమో! చిన్నచిన్న పసిపిల్లలు స్వామితో ఎంతో చనవుగా ఆడుకునేవారు. ఆయన వీపుమీద, బుజాలపైన ఎక్కి సవారిచేస్తూ ఆడుకునేవారు. దరిద్రులు, దీనులు పతితులు అంటే మనస్వామి ఎంతో సన్నిహితంగా కలిసి ఆప్యాయంగా చేరదీసి ఆదరించేవారు.

"మానవతా దృక్పథంతో చేసే సేవలవల్ల సంఘ పురోభివృద్ధి జరుగుతుంది. నిజమేకాని, దానివల్ల నీకు లాభం ఏమిటి? దానితో, కొంత కాలం అయేసరికి నీలో నిరాశ, నిస్పృహ చోటు చేసుకుంటాయి. అట్లా కాకుండా నీకు [illegible] సేవ[illegible] చేయాలి అంటే ముందుగా నీవు భగవంతుని [illegible] విశ్వాసం ఉంచి తర్వాత మానవ సేవ ప్రారంభించవలసి ఉంటుంది. నీలో ఉన్న దైవమే ఇతరులలో కూడా ఉన్నాడని నీవు గ్రహించిననాడు ఇతరులు బాగుపడితే నీవూ బాగుపడినట్లే భావిస్తావు." ఇదే స్వామి సంఘసేవకుల కిచ్చే అమూల్యమయిన సలహా.

తన చివరిరోజులు కాశీలో గడపాలని స్వామి ఆశించేవారు. అట్లాగే 1912 లో కాశీ చేరిన అద్భుతానందస్వామి 1920 సం॥ ఏప్రిలు నెల 24 తేదీనాడు మహాసమాధి చెందారు. అన్ని మతాలవారు కడసారిగా ఆయన భౌతిక కాయానికి భక్త్యంజలి ఘటించడానికి వచ్చారంటే సర్వమత సమన్వయం ఆయనలో ఎట్లా రూపు దాల్చినదీ తెలుస్తుంది.

ధ్యానం చేసేటప్పుడు నిద్రమత్తులో పడిపోకుండా జాగ్రత్త పడాలి. కొంతసేపటికి మెలకువవచ్చే నిద్ర నిజమైననిద్రకాదు. కొంతసేపటికి నిద్రవచ్చే మెలకువ నిజమైన మెలకువ కాదు. ఇప్పుడు నీది మెలకువయేనా? కాదు. నిజమైన మెలకువ నీకింకా రావలసిఉంది. నీవు అబద్ధపునిద్ర పోరాదు. అబద్ధపు మెలకువలో ఉండకూడదు. 'లయే సంబోధయేత్ చిత్తం, విక్షిప్తం శమయేత్ పునః'—అంటే ఏమిటి? పై రెండవస్థల్లో దేనిలోనూ పడకుండా వాటి మధ్య నీ స్వరూపంలో నీవుండిపోవాలి.

—రమణమహర్షి.

# మాతృదేవి చరణ సన్నిధి

ఆంగ్ల గ్రంథము:

## ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

ఆ పైన మేము మందిరము మేడమీదికి వెళ్లాము. రెండు పత్రాలమీద నైవేద్యం చేసిన తియ్యని తినుబండారాలుంచాము. ఆ పత్రాలలోనుండి ఒకభాగం అమ్మ స్వీకరించింది. రెండవది నా చేతి కందించి, తన సరసనే కూర్చుని ఫలహారం చెయ్యవలిసిందని ఆదేశించింది.

క్రమక్రమంగా చాలామంది మహిళ లక్కడికి చేరుకున్నారు. వారిలో ఎవ్వరిని నే నెరగను. మధ్యాహ్న సమయంలో వారందరు నైవేద్యం చేసిన ఫలహారాలందుకుంటారని నా కొకరు చెప్పారు. నివేదన జరిగిన తరవాత మే మందరము ఫలహారాలందుకుని భుజించ డానికి కూర్చున్నాము.

మాతృదేవి తన కలవాటయిన చోటనే కూర్చున్నది. ఆ పైన వేళ్ళతో మూడు మారులు అన్నం స్పృశించి, నన్ను దగ్గిరికి పిలిచి, ఆ అన్నం నా కిచ్చింది. అప్పుడు ఆ అన్నం ఘుమ ఘుమ లాడుతూ పరిమళించింది! ఆ అనుభూతి నేనిప్పటికి మరిచిపోలేను. ఆ తరవాత అమ్మ నివేదించిన అన్నాది పదార్థా లన్ని అందరికి వడ్డించారు. గోలాప్‌మా అంద రికి వడ్డించిన పిమ్మట తానుకూడా భోజనానికి కూర్చున్నది.

అమ్మ భోజనం ప్రారంభించింది. భోజనం చేస్తున్నంతసేపు అమ్మ అందరితోను నవ్వుతూ కబుర్లు చెబుతూనే ఉన్నది. నే నది గమనించి ప్రశాంత హృదయంతో నిట్టూర్పు విడిచి పెట్టాను. దీనికొక కారణమున్నది. నా కుప దేశం ఇచ్చిన క్షణం మొదలుకుని ఇప్పటివరకు ఆమె వేరొక వ్యక్తిలా కనిపించింది. గంభీరంగా అంతర్ముఖంగా ఉన్నట్టు స్ఫురించింది. శిక్షించ డానికి ఆశీర్వదించడానికి అన్నివిధాలా సమర్థు రాలైన దేవతామూర్తిలాగే భాసించింది. ఇంతవరకు నేను భయంతో కంపించుచుకు

ఇది జరిగిన తరవాత అమ్మ ఎంద రెందరికో మంత్రోపదేశాలనుగ్రహించింది. కాని ఆ ఉపదేశం వ్యవహారం అంతా మూడు నాలుగు నిమిషాలలోనే ముగిసిపోయింది. ఆమె ముఖం లో ఆ గంభీరవైఖరి మరి నే నెన్నడూ తిలకించ లేదు. ఆ తరవాత ఆమె తన శిష్యులలో కొందరికి మంత్రదీక్ష ఇస్తున్నప్పుడులా నవ్వు తూనే ఉన్నది. అమ్మ సామాన్యంగా నిలు చుండిగాని, కూరుచుండిగాని మంత్రాలను గ్రహిస్తూండెడది. ఆ శిష్యులు కూడా ఎంతో ఆనందంతో పరిపూర్ణ సంతృప్తితో వెంటనే అక్కడినించి వెళ్లిపోయేవారు.

నే నాక్కడుండగా, తెలుసుకోవాలన్న తహ తహతో మంత్రదీక్ష ఇచ్చిన తరవాత అమ్మ ఎలాగ కనిపించేదని అమ్మదగ్గిర మంత్రం స్వీకరించిన కొందరు శిష్యుల నడిగేదాన్ని. వారిలో ఒకావిడ నాకిలాగ చెప్పింది.

"అందరికి జరిగినట్టే నాకుకూడా మంత్రోప దేశం జరిగింది. మొట్టమొదట నేను మా కుల గురువులదగ్గిర సాంప్రదాయిక పద్ధతిలో మం త్రోపదేశం పొందాను. అమ్మ మంత్రోప దేశం సంగతి విన్నాక నే నిక్కడికి వచ్చాను. మంత్రోపదీక్ష అనుగ్రహించవలిసిందని అడి గాను. సంప్రదాయ గురువిచ్చిన మంత్రం పది నిమిషాలపాటు జపించవలిసిందని అమ్మ నా కాదేశించింది.

ఆ పైన ఆమె తన మంత్రం ఉపదేశించి, ఠాకూరువైపు నిర్దేశించి "ఆయనే నీ గురువు" అన్నది. తరవాత వేరొకవైపు నిర్దేశించి "ఇదిగో, ఈయన నీ ఇష్టదైవతము" అన్నది. అటుపిమ్మట అమ్మ నన్నుద్దేశించి "ప్రభూ! నేనీ జన్మలో చేసిన వాని ఫలితాల భారమంతా తొలగించి వేయవలిసింది. ఇలాగే ఇంతకు ముందటి జన్మల కర్మల ఫలితాలన్ని తొలగించవలిసింది." అని ప్రార్థించవలిసిందని ఆజ్ఞాపించింది.

ఆ తరువాత ఆమె నాతో ఇలాగన్నది.

"చూడమ్మా! అరగంట కంటె నేనెక్కువ సేపు ప్రార్థన చెయ్యలేకపోతున్నాను. ఎవ్వరో నన్ను కూర్చున్న చోటునించి తోసివేస్తున్నట్టున్నారు. దీనికేమి కారణమో నాకు బోధపడడంలేదు. నీకు కూడా ఇలాగే జరుగుతున్నదా? నేనింకా ఎన్నెన్నో సంగతులు అమ్మతో చెబుదామని అనుకుంటూంటాను. కాని తీరా ఆమెతో నేనేమీ చెప్పలేకపోతున్నాను. కాని నీవు అమ్మతో చాలా ధారళంగా మాట్లాడగలుగుతున్నట్టున్నావు. నన్నుగాని తప్పించుకొని తిరుగుతున్నదా మాతృదేవి ?"

నేనావిడ ముఖతః ఇదంతా వినాలని అనుకోలేదు. ఆమె వయస్సు చాలా పెద్దదయినట్టు కనబడుతున్నది. కాని చాలా సరళంగా మాట్లాడింది. దానికి నేనిలాగ సమాధానం చెప్పాను'

"నీవు చెప్పదలుచుకున్నది అంతా ఎందుకు చెప్పవమ్మా? కొన్నాళ్ళపాటు అలవాటు చేస్తే అమ్మదగ్గిర చాలా చనువు స్వాతంత్ర్యము కలుగుతాయి. మొట్టమొదట మేము కూడా ఎక్కువగా చనువు తీసుకుని, మాట్లాడలేక పోయాము. ఇప్పుడు కూడా మాతృదేవి ఒక్కొక్కప్పుడు చాలా గంభీరంగా కన్పిస్తుంది అలాంటప్పుడు మేము ఆమె దగ్గిరికి వెళ్ళడానికి కూడా భయపడతాము."

క్రమ క్రమంగా సాయంత్రం చల్లబడినకొద్దీ అక్కడ చేరిన స్త్రీలు ఒక్కొక్కరు అమ్మకు నమస్కరించి సెలవుతీసుకున్నారు.

మరికొంతసేపటికి సాయంత్రమయింది. రాధూను, మాకూను, మిగిలిన వారిని అమ్మ ప్రార్థన చేసుకునే గదికి రమ్మని పిలిచింది. వారు రావడం ఆలస్యమవుతున్నకొద్దీ ఆమె కోపగించి విసుక్కున్నది.

"సాయంత్రం ప్రార్థనకోసం వచ్చి కోర్చోవడానికి బదులు, వారందరు ఎలాగ తచ్చాడుతున్నారో చూడు!" అ తరువాత వెంటనే వారందరు అక్కడికి వచ్చి కూర్చున్నారు.

పూజ్యురాలు గోలాప్‌మా జోగీన్‌మా, మొదలయినవారు కొందరు సంధ్యాసమయంలో శారదా మాతకు నమస్కరించడానికి వచ్చారు. అమ్మ అందరి శిరస్సుల మీద చేతులుంచి ఆశీర్వదించింది. కొందరి చిబుకాలు స్పృశించి తన చేత్తో ముద్దుపెట్టుకున్నది. మిగిలిన వారిని ఆమె చేతులు జోడించి గౌరవించింది. అటుపిమ్మట ఠాకూరుకు నమస్కరించి ఒక తివాసీ పరిచి దాని మీద జపానికి కూర్చున్నది

అంతలోనే దీపికలతో సాయంకాల పూజ కోసం ఏర్పాటులారంభమయినాయి. అదే సమయంలో అమ్మ తన జపం ముగించుకుని ఆసనం మీదనుండి లేచింది.

స్కూలులో పని ఎక్కువగా ఉన్నందువల్ల కొంతకాలంపాటు నాకు మాతృదేవత సందర్శనం సాధ్యపడలేదు. చాలానాళ్ళు గడిచిన తరువాత నేనినాడు అమ్మదగ్గరికి వెళ్ళి పాదాలదగ్గిర కూర్చున్నాను. ఆమె వెంటనే ఎంతో ఆప్యాయంగా కౌగిలించుకున్నది.

అమ్మ మేనల్లుడు భూదేవ్ మహాభారతం

పఠిస్తున్నాడు. అతడింకా పసివాడు. అందుచేత మహాభారత పఠనంతో తడబడుతున్నాడు. ఆలస్యమవుతున్న కొద్దీ అమ్మ బాగా ఆత్ర పడుతూంది. అందుచేత అమ్మ అతనికేసి చూసి "ఆ పుస్తకం ఆమెకియ్యి. ఆమె అనర్గళ ప్రవాహంలాగ నెమ్మదిగా చదవగలదు! ఆ అధ్యాయం పూర్తిఅయితేనేగాని నేనిక్కడనించి లేవడానికి వీలు లేదని నీవెరుగుదువుగదా!"

మాతృదేవత ఆనతి అనుసరించి మహాభారతం చదవడానికి కూర్చున్నాను. ఇంతకు మునుపు ఎప్పుడు నేను ఆమె కేసి చదివి వినిపించలేదు. అందుచేత కొంచెం సంకోచించాను. అయినా ఆ అధ్యాయమెలాగో అలాగ పూర్తి చెయ్యడానికి ప్రయత్నించాను. అధ్యాయం ముగియగానే అమ్మ చేతులు రెండు జోడించి భారత గ్రంధానికి నమస్కరించి లేచింది. సాయంకాల పూజ చూడడానికి మేమంతా ప్రార్ధనల గదిలోకి వెళ్లాము. అమ్మ తను జపం చేసే చోట కూర్చున్నది.

ప్రార్ధనలన్నీ ముగింపగానే మాతృదేవి భగవన్నామం పలుమారులుచ్చరించి నమస్కరించింది. ఆపైన, నివేదించిన పదార్థాలన్నీ అందరికి ప్రసాదంగా, పంచిపెట్టింది. మేమంతా ప్రసంగించుకుంటూండగా ఒకామె కర్మను గురించి ప్రస్తావించింది. దాని మీద అమ్మ ఇలాగన్నది.

"మనిషి ఎప్పుడు పనిచేస్తూనే ఉండాలి. అందువల్ల శరీరానికి మనస్సుకు చక్కని శక్తి కలుగుతుంది. పూర్వం నేను జయరాంబాటిలో ఉన్నప్పుడు, రాత్రింబగళ్ళు ఎల్లప్పుడు ఏదో పని చేస్తూండేదాన్ని. ఇరుగు పొరుగుల ఇళ్ళకెన్నడు వెళ్ళేదాన్ని కాను. ఒకవేళ వెడితే, 'ఇదిగో, చూశావమ్మా! ఈఅమ్మాయి శ్యామసుందరి కుమార్తె పాపం పిచ్చివాడికిచ్చి పెళ్ళి చేశారు!' అని అంటూండేవారు. అటువంటి మాటలు వినడానికి ఇష్టంలేక పోయినందువల్లనే నేను ఎక్కడికి వెళ్లేదాన్ని కాదు. జయరాంబాటిలో నాకొకప్పుడు చాలా జబ్బుచేసింది. అది ఒక పట్టాన నయంకాలేదు. అప్పుడు సింహవాహినీ దేవి దేవాలయం ద్వారంలో ప్రాయోపవేశం చేసి ఆరుగ్మత పోగొట్టుకున్నాను."

అమ్మ గృహానికి ఎదురుగా వున్న ప్రదేశంలో భ ప్రదేశాలకు చెందిన జనులనేకులు నివసిస్తున్నారు. వారందరు వేర్వేరు మార్గాలలో తమ తమ జీవనోపాధులు సంపాదించుకుంటున్నారు. వారిలో ఒకమనిషి ఉంపుడుకత్తె అక్కడనే నివసిస్తున్నది. ఆమె కొకప్పుడు చాలా ప్రమాదకరంగా జబ్బు చేసింది. అమ్మ ఆసంగతి ప్రస్తావించి ఇలాగన్నది.

"అతడు ఆమెకు ఎంత గొప్పగా పరిచర్య చేశాడు! అంతటి ఆప్యాయత నేను ఇంతకు మునుపు ఎక్కడ చూడలేదు! నిజంగా పరిచర్య అంటే అదే. నిజమయిన ప్రేమ అంటే అదే!"

ఈ విధంగా అతన్ని ప్రశంసించింది అమ్మ. ఇదంతా ఒక ఉంపుడుకత్తెమీద ఆత్మీయత ఒలకబోసినందుకు! ఇదంతా మేము చూసి ఉంటే ఛీ! ఛీ! అని అసహ్యించుకుని ఉందుము! చెడు నడవడి కలవారిలోనుంచి మేమెన్నడు మంచిగుణాలెన్ని ఉండేవారము కాము!

అమ్మ గృహానికి ఎదురుగాఉన్న గుడిసెలో ఎగువ దేశానికి సంబంధించిన ఒక పేదరాలున్నది. ఆమె ఒకనాడు జబ్బుతో బాధపడుతున్న తన పసిపాప నెత్తుకుని అమ్మ దగ్గిరికి వచ్చి, ఆశీర్వచనా లర్థించింది. ఆహా! మాతృదేవత ఆమెమీద ఎంతగా జాలి పడింది! శారదామాత ఆ పసిపాప నాశీర్వదించింది.

—సశేషం.

పిల్లలను చేరదీసి వారివంక జాలితో జూచుచు వారికిట్లు బోధించెడివాడు.

'బాలకులారా! నా మాటలు వినండి. మీకు మేలు కలుగును. మన యీడు పిల్లలు కూడా చనిపోవుచుండుట మీరు చూడలేదా. మరి మీకీ సరాగమేల. క్లేశము కల్గించు ప్రవృత్తి విద్యలలో ప్రయోజనములేదు. అవి మనకు గురువులు బోధించినను వానిని మనము స్వీకరింపరాదు. కావున బాల్యమునందే ప్రాజ్ఞుడు భాగవత ధర్మముల నాచరించవలయును. మనుష్యజన్మ చాలా దుర్లభమైనది. అది కల్గినదో ధృవముగా నుండునని నమ్మకము లేదు. మరణ మెప్పుడైనను కల్గవచ్చును. మరల మానవజన్మ వచ్చునని నిశ్చయ మేమున్నది. కావున లభించిన నాలుగునాళ్లు అర్థకామములను సాధించుటకై యత్నింపక భాగవత ధర్మముల నాశ్రయించి జన్మ చరితార్థము జేసికొనవలయును. దీపముండగనే యిల్లు చక్కబెట్టుకొనవలయును గదా. కావున పరమ పురుషుడైన శ్రీహరి పాదసేవయే కర్తవ్యము. ఆయన సర్వభూతములకు ప్రియుడు. మిత్రుడు. ఆత్మస్వరూపుడు. సర్వప్రాణులకు శరీరము కల్గినది గావున దుఃఖమెట్లో యట్లే యింద్రియ సుఖమును యత్నరహితముగనే దైవయోగము వలన కలుగును. కావున ప్రయత్నము జేయుట వృథాయాసమే. దానివలన ఆయువు వ్యర్థమగును. క్షేమమును గల్గించు పరమేశ్వర చరణములు దొరుకకుండబోవును. కాబట్టి తెలివిగలవాడీ సంసారములో పడినప్పుడు శరీరపాటవ ముండగనే తన బాగును తాను చూచుకొనవలయును. నరునికి నూరు సంవత్సరము లాయుర్దాయము. ఇందు సగము రాత్రి రూపమున నుండును. నిద్రతో గడిచిపోవుట వలన నిది నిష్ఫలమే. ఇందిరువది సంవత్సరములు బాల్యము క్రీడాసక్తితో గడచిపోవును. ఇరువది సంవత్సరములు వార్ధక్యము. ముసలితనము పైనబడి శరీరము పాటవము లేక సామర్థ్యము తప్పియుండును. తక్కిన కాలము తనివితీరని కామముచేత గాఢమైన మోహముచేత దారాపుత్ర గృహక్షేత్ర వృత్తాదులందు ఆసక్తిచెంది గడచిపోవును. ఇది గడచిపోవుచున్నట్లే వానికి తెలియదు. ఇంద్రియ జయములేక దారాపుత్రాది సక్తుడైన నరుడు స్నేహపాశములను త్రెంచుకొనలేడు. ధనతృష్ణ నెవడు జయింపగలడు. డబ్బు ప్రాణములకంటె తీపి. దొంగ, సేవకుడు, వణిజుడు ధనముకొరకు ప్రాణములను కూడా లెక్కపెట్టరు. ప్రియురాలైన భార్యతోడి సంగమము ఆమె మధురమైన మంత్రాంగము మిత్రులతోడి యిష్టాలాపములు పిల్లల ముద్దు పలుకులనుండి చిత్తమును మరలించుకొనుట యెట్లు. కొడుకులను కూతుళ్లను తల్లిదండ్రులను నన్నదమ్ములను నప్పచెల్లెండ్రను మనోహరములైన సర్వసౌఖ్యములతో కూడిన యిండ్లను ధనధాన్య సంపదను పశుభృత్య వర్గమును వీనినన్నింటిని వదలుకొనుట యెట్లు. ఎంత యనుభవించినను కోరికలు తీరక గూడు పెట్టు కీటమువలె బయట పడుటకు చిన్ని బెజ్జమయిన ఒదలిపెట్టక లోభముతో కామ్య కర్మలను పాశములు తనచుట్టు నల్లుకొనుచు శిశ్నోదర పరాయణులై దురంత మోహగ్రస్తులైనవారు విరక్తి నెట్లు పొందుదురు. కుటుంబపోషణకై తమ యాయువునంత వెచ్చపెట్టుకొను ప్రమత్తుడు పరమ పురుషార్థమైన మోక్షమునందు తాను వంచితుడనైతినని యెరుంగునా. తాపత్రయ దుఃఖముతో వాని మనస్సు నిండియున్నను నిర్వేదము కలుగదు. అప్పటికిని సంసారమునందే ఆతడు రమించును.

వాడు విద్వాంసుడైనను వాని మనస్సున ధనాభిలాష చావనిచో నేమి లాభము. వాడు పరవిత్తము నపహరించుటకై ప్రయత్నింపక మానడు. దాని కిచ్చట రాజదండము నచ్చట యమదండనను బొందవచ్చునని వాడాలోచించి మాత్ర మేమి లాభము. సంసారములో మగ్నుడై యింద్రియ జయములేక కోరికలు శాంతించక నున్నవాడు వాడెంత విద్వాంసుడైనను పర ద్రవ్యాపహారణమునకు వెను దీయడు. వానికిగూడ కుటుంబభారమున్నది. స్వపరభేద మున్నది. కాకపోయిన ఊరక చదువుకున్నాడంతే. వాని చదువు వాని కుపయోగింపదు. వాని కాత్మలోకము దొరుకదు. దానిని పొందు సామర్థ్యము వానికి లేదు. మూఢునివలె వాడుకూడ అహంకార మమకారములకు లోనై తమస్సునందు పడిపోవును. కాబట్టి యెక్కడైనను యెప్పుడైనను యెవ్వడైనను విద్వాంసుడైన మాత్రమున తన కుటుంబిని యపాంగ వీక్షణమునుండి విడిపించుకొననేరడు. కామోత్తేజమైన యామె యపాంగవీక్షణము సంసారమన్న యురి వాని మెడకు పోసి వానినికూడా మృగమువలె నాడించును. కావున మీ రందరు దైత్యులతోడి స్నేహము దూరముగా పరిహరించి యాదిదేవుడైన నారాయణుని నాశ్రయింపుడు. అదియే మోక్షము.

ఆ పరమేశ్వరుడైన నారాయణుడు సులభముగా సేవింపతగ్గవాడు. ఆయన యన్ని చోటుల నున్నాడు. ఆత్మస్వరూపుడు. ఆయన సేవలో కష్టమేమున్నది. స్థావరములగు వృక్షాదులనుండి బ్రహ్మాండమైన భూతకోటియందు, దేవతలయందు, భౌతికములైన ఘటపటాదులందు, ఆకాశాదిభూతములందు, గుణసామ్యరూపమైన ప్రధానమునందు, గుణవైషమ్యరూపములైన మహదాది తత్త్వములందు నన్నింట వ్యాపించి బ్రహ్మస్వరూపుడై యాత్మస్వరూపుడై యవ్యయుడైన ఈశ్వరుడున్నాడు. ఆయన కేవలానందస్వరూపుడు. మాయవలన ద్రష్టృభోక్తృదృశ్య భోగ్య వ్యాప్య వ్యాపక స్వరూపమున వికల్పితుడగుచున్నాడు. ఉన్నది యొక్కడే. చూచువాడు చూడబడునది ఈ మొదలైన భేదములన్నియు అజ్ఞాన కల్పితములు. కావున సర్వ భూతములయందు కృపాస్నేహములు గలిగి యసురభావమును వీడియుండుడు. పరమేశ్వరుడు సంతసించును. ఆయన సంతసించిన అలభ్యమేమున్నది. ఆయన పాద సరోజములే దొరికిన తర్వాత తన్మకరంద సేవనముకంటె కావలసిన దేమున్నది. ఈ ధర్మార్థకామములుగాని కర్మవిద్యగాని నీతి గండశాస్త్రములుగాని మరి యే యితర శాస్త్రములుగాని నివియున్నియు వేదోదితములైనప్పటికిని అంతర్యామి రూపమున మనయందున్న పరమ పురుషునికి ఆత్మార్పణ సాధనములైనచో సత్యములగును. లేనిచో అసత్యములే. సత్యస్వరూపుడైన పరమేశ్వరుని చేరుటకివి సాధనములైననాడు వీనికి సత్యత్వము సంక్రమించును. లేనిచో నీ శాస్త్రములన్నియు దబ్బలే. ఈ జ్ఞానము పొంద శక్యముగానిది. శ్రీనారాయణమూర్తి నారదునకుపదేశించినది. పరమేశ్వరునియం దేకాంత భక్తి గలిగి దేహ దారాపుత్రాది సంగము విడిచి యహంకార మమకార శూన్యులైన సాధుజనుల పాదారవిందరజమున స్నాతులైన వారందరికి ఇట్టి జ్ఞానము లభించును. విజ్ఞాన సంయుతమైన ఈ జ్ఞానమును (విజ్ఞాన సంయుత మనగా యనుభవ పర్యంతమైనయని యర్థము) పరిశుద్ధమైన భాగవత ధర్మమును నేను నారదునివలన వింటిని.'

—సశేషం.

# రామకృష్ణ జననము - నాటిక

శ్రీమతి భువనగిరి లక్ష్మీకాంతమ్మ

## ఇందలి పాత్రలు :

పురుషులు

ఖుదీరాముడు - రామకృష్ణుని తండ్రి
గిరీశుడు - ఖుదీరాముని మిత్రుడు
రామానందరాయలు - జమీందారు
రాజారామ్ - దివాను
అబ్దుల్ - బంట్రోతు
రామేశ్వరుడు - ఖుదీరాముని కొడుకు
మాధవుడు, గోవిందుడు, కేశవుడు } బ్రాహ్మణులు
సుఖలాల్ గోస్వామి - ఒకదాత
కృష్ణచంద్రుడు - గోస్వామి కొడుకు
పండాలు - ఇద్దరు
యాత్రికులు - ఇద్దరు
నారదుడు
ఇతరులు

స్త్రీలు

చంద్రాదేవి - రామకృష్ణుని తల్లి
రామశీల, సంపూర్ణ, ప్రసన్న } చంద్రాదేవి స్నేహితురాండ్రు
ధని - కుమ్మరిది

### ప్రథమాంకము—ఒకటవరంగము

స్థలము : దర్యాపురములో ఖుదీరాముని గృహము
(ప్రవేశము- ఖుదీరాము, భార్య చంద్రాదేవి)
(పూజామందిరములో దేవుని యెదురుగా కూర్చుండి పాడుదురు)

దేవా దేవాదిదేవా బ్రోవా రావా దేవాదిదేవా
దుర్మార్గుల శిక్షింపన్ ధర్మాత్ముల రక్షింపన్ ధర్మము భువిస్థాపింపన్ జన్మింతువు భువిదేవా॥
శాంతి సత్యములు స్థాపించుటకై జ్ఞాన తేజమును చల్లుటకొఱకై
రామకృష్ణాది నామమ్ములతో భూమిని యావిర్భూతుడవగువో దేవా॥
దేవా దేవాదిదేవా బ్రోవా రావా దేవాదిదేవా॥

(హారతిఇచ్చి నమస్కరించి కూర్చుందురు.)

ఖు:- చంద్రా! మన భరతమాత సచ్చిదానందసాగరమునుండి అమృతబిందువుల సేకరించి, తన బిడ్డలకు తృప్తికలిగిస్తోంది.

సచ్చిదానంద సంపూర్ణ సాగరమ్ము సత్యశౌచదయాదుల జన్మభూమి
ధర్మయుతి నాత్మసంధానదాయకమ్ము క్షితిని భారతజాతీయజీవనమ్ము
ఇది అతి పవిత్రము - శాంతికరము

(ప్రవేశము గిరీశుడు)

గి:- మిత్రుడా! ఏమంటున్నావు శాంతికరమా ఏకాలమున ఏ యుగమున?
ఖు:- అన్నికాలాలలోనూ, పవిత్రం పవిత్రమే. పవిత్రము అపవిత్రం కాదు కదా.

గి:- అదే పొరపాటు. నీవన్న పవిత్రం, ఇంకొక సమయంలో అపవిత్రంగా కనబడును. దేశ పరిస్థితులు గమనిస్తూ అన్నుకూటలేనా ఇవి. ఒక ప్రక్క అర్ధకడుపేనా నిండక, అన్నమో రామచంద్రాయన్న ప్రజల ఆర్తనాదాలూ, మరియొక ప్రక్క మహామారి చుట్టుకొని ప్రజల మారణహోమం చేస్తుంటే పొందే హాహాకారాలూ, ఇంకొక ప్రక్క అత్యాచారాలు దోపిళ్ళూనూ. శాంతము పవిత్రము ఎక్కడ?

ఖు:- మిత్రుడా! మన జమీందారులున్నారుకదా; ప్రజలను బాధలనుండి తొలగించి రక్షించు భారము వారిదేకాదా.

గి:- ఎంత పెరటిదారిలో నున్నావయ్యా నీవు. ప్రజల విషయం వారికి కావాలా. వారి విలాసా లేమో వారి ధనసంపాదన లేమో. వారికి ప్రజల విషయం, దేశము, కావాలా! పాశ్చాత్య వ్యామోహాల్లోపడి, దేశ పరిస్థితులు గమనిస్తారా వారు.

ఖు:- నిజమే, నీవు చెప్పినది కాని మనమేమి చేయగలం. అన్నిటికి దైవమే ఉన్నాడు. కాలాన్ని నడిపించేవాడు దైవం. కాలం ఒక్కరీతిగా ఉండదు. ప్రతివాడు కాలానికి కట్టుబడక తప్పదు. రేపు ఏమి కానున్నదో.

(ప్రవేశం జమీందారు బంట్రోతు అబ్దుల్)

అబ్దుల్: ఖుదీరామ్‌సాబ్! సర్కార్ హుకుమ్, మిమ్ముల త్వరగా రమ్మని.

ఖు:- ఎందుకు, అంత త్వరగా రావడం. విషయమేమి.

అ:- అదంతా నాకు తెల్వదు.

ఖు:- సరే అయితే వస్తాను. నీవు వెళ్లు. (వాడు వెళ్ళును) గిరీశా! ఈ జమీందారు ఎందుకు కబురు చేసాడంటావు.

గి:- ఎందుకేమిటి. ఏ కూట సాక్ష్యానికో, ఏ దొంగ దస్తావేజులో సాక్షిగారమ్మనమనో, అంత కన్న ఈ జమీందారులకింకేమిపని మనతో.

ఖు:- సరే వెడతాను. ఏం జరిగినా సరే. దైవేచ్ఛ తప్పదు.

(తెరపడును)

## ప్రథమాంకము—రెండవరంగము

స్థలము: రామానందరాయల గృహము

(ప్రవేశము: రామానందరాయులు, దివాను రాజారాము)

రామానందరాయలు:- (కుర్చీలో కూర్చుండి హుక్కా పీల్చుచు) నా జమీందారీలో నాకు లొంగి నేనేమి చెప్పిన అది చేస్తూవుండాలి. అలా చేయనివాడికి, ఈ నేలలో పుట్టుగతు లుంటాయా. వానిని కాల్ర్తొక్కి నేలరాయలేనా. వాడికి గతిమోక్షం ఉంటుందా అసలు. (ఏవో కాగితాలు తీసి చూస్తూ) రాజారామ్! ఈ కాగితా లొకసారి పరిశీలించి చూడు. దీనిమీద కోర్టులో వ్యాజ్యం వేస్తున్నాను. (రాజారామ్ ముఖంలోకి చూస్తూ ఉంటాడు)

రాజా: (కాగితాలు చూచి) మీరు వీనిమీద పదివేలకు దావావేస్తారా? వీడు చాలా బీదవాడు. వీడికి మీరు పదివేలు ఇచ్చారా? నిజముగానేనా?

**రామా:** లేదు. ఇది కల్పించిన దస్తావేజు. ఎందుకంటే వీడు నాతో చాలా పొగరుగా జవాబు చెప్పాడు. ఏదో పనిచెప్పితే ఆ పని నాకు తగదని తిరస్కరించాడు. అందుకే నేను వాడిని మట్టంచేయాలని ఈ పని చేస్తున్నాను.

**రాజు:** ఇదన్యాయం కాదండీ? వాడు చేసిన చిన్నతప్పుకే శిక్షా!

**రామా:** అన్యాయమేమిటి? ఇట్టి అన్యాయాలెన్ని చేసి ఈ జమీ పెంచానో. వాడా పైకం ఇవ్వక పోతే వాడి ఆస్తి జప్తు. నమ్మకముకలవాడని, ఖుదీరామునికబురుచేసాను ఇందు సాక్ష్యం కొఱకేకదా, వాడొక పిరికిపంద. ఇంకా రాలేదు. (బంట్రోతు ప్రవేశించి) ప్రభూ! ఖుదీ రాముసాబ్ వచ్చాడు.

**రామా:** వచ్చాడా (అని ఎదురుగా వెళ్ళి తీసుకొని వచ్చి కుర్చీలో కూర్చుండబెట్టును. ఇద్దరూ కూర్చున్న తర్వాత) ఖుదీరామ్! విశేషాలేమిటి?

**ఖు:-** విశేషాలా. నా వంటి బీదవాడు మీ వంటి జమీందారుచే పిలవబడుటే విశేషం.

**రామా:** (నవ్వుతు) చక్కగా గ్రహించావు. (కాగితంచూపి) వీనిపై వ్యాజ్యం వేస్తున్నాను. నీవు సాక్షిగా ఉండి నన్ను గెలిపించాలి. ఈ వ్యాజ్యం నీ సాక్ష్యం మీదే ఆధారం.

**ఖు:-** (తెల్లబోయి) సాక్ష్యమా! కోర్టుకెక్కి సాక్ష్యం చెప్పుట నేనెన్నడూ చేయనిపని.

**రా:-** ఎన్నడూ చేయకపోతే ఇకముందు చేయకూడదా? దీనివల్ల నీకూ లాభముంటుందిలే.

**ఖు:-** జమీందార్! ఇతడు మీకింత డబ్బు నిజంగా బాకీ ఉన్నాడా?

**రా:** లేదు. వీడు పొగరుగా నేను చెప్పినట్లు చేయలేదు. వాని కావరమే నన్నీపని చేయించింది.

**ఖు:-** సరి సరి. ఇది అబద్ధపుదావా. దొంగసాక్ష్యం ఇందుకా నన్ను పిలిపించుట.

**రా:** ఖుదీరామ్! అబద్ధాలు, సుబద్ధాలు నీకక్కరలేదు. ఆ రెండు మాటలూ కోర్టులో చెప్పి ఆ రెండువేలూ చేతిలోవేసుకొని సుఖపడు. నీ దరిద్రం తొలగుతుంది.

**ఖు:-** అయ్యో! ఆ పని నేను చేయలేను. అసలే నాకు కోర్టంటే భయం.

**రా:** (రోషముతో) నన్నూ నా సామర్థ్యాన్ని ఎరిగియేనా నన్నిట్లు అవమానిస్తున్నావు?

**ఖు:-** జమీందార్! మిమ్ములనవమానపరచలేదు. నా సంగతి చెప్పుకున్నాను. ఈ సాక్ష్యం చెప్పినచో మొదటి పర్యాయం నా అంతరాత్మకు విరుద్ధంగా నడుచుకొన్నవాడనౌతాను.

**రా:** సరే వెళ్లు. ఇంక ఈ గ్రామంలో కాపురముండి నీ ఆస్తిని నీవనుభవించగలవా!

**ఖు:-** (లేచి నిలిచి) స్వామీ! ఏమి జరిగిననది జరుగుగాక! దివ్య జ్యోతియై ప్రకాశించు అంత రాత్మకు విరుద్ధముగా ప్రవర్తింపజాలను. సర్వమూ దైవాధీనము. జరిగేది జరుగును.

**రా:** ఓ! ఇట్టివారలెందరో! నీవనగానెంత! వెళ్ళు (తల పంకించును)

(తెరపడును)

## ప్రథమాంకము—2 వ రంగము

స్థలము—పల్లెప్రాంతము

ప్రవేశము - ఖుదీరాము, చంద్రాదేవి, బిడ్డలిద్దరు.

**చంద్రాదేవి :-** సూర్యుడస్తమిస్తున్నాడు. చాలాదూరం నడిచి వచ్చాము. సమీపంలో ఏ గ్రామమును కనబడదు. ఇప్పుడెచ్చటికి పోవాలి?

ఖుదీరాము :- (విచారముతో) ఎచ్చటికని చెప్పను? అది నాకూ తెలియదు. చోరవ్యాఘ్ర సంకులముగు ఈ అరణ్యాలలో నిలవడమూ క్షేమం కాదు.

చం :- (పరికించి చూచి) ఈ పరిసరాలు మహారణ్యంవలె కనుపించడం లేదు. ఈ కేదారాలు, గున్నమామిళ్లు, ఈ సారసమూలు చూస్తే ఇది ఒక పల్లెప్రాంతమని తోస్తోంది. పరికించండి.

ఖు :- (చూచి) అవును. నిజమే శోకారణ్యంలో మునిగియున్న నాకు అంతా అరణ్యంలాగే కనుపిస్తోంది. అయితే సీవే మంటావు?

చం :- ఈ రాత్రి ఇచ్చట విశ్రమించి వేకువనే లేచి పయనింతము.

ఖు :- సరే (పైబట్టపరచి బిడ్డలను పరుండజేసి వారిప్రక్క న కూర్చుని) కటకటా! ఈ అడవిలో ఆలుబిడ్డలతో పయనింపవలసివచ్చిందికదా! శ్రీరామచంద్రా! ఇప్పుడేమి దారి జేవా!

చం :- దుర్మార్గుడగు రామానందిరాయలు కూట సాక్ష్యం చెప్ప నిరాకరించిన కారణాన్ని మన ఆస్తినంతా అపహరించి నిలువ నీడకూడా లేకుండా చేశాడు. దుర్మార్గులను చూస్తే దేవునికికూడా భయమేమో! లేనిచో భక్తులగు మీరిట్లు బాధ పడుచుండ, చూచి ఊరకుంటాడా?

ఖు :- చంద్రా! అట్లనకు. ఇది మన కర్మసూత్రం, అంతే.

చం :- దానికేమిగాని, ఇప్పుడు మనమెచ్చటికి పోవాలి? ఎవ్వరైనా మీకు సాయపడే వారు లేరా?

ఖు :- దైవము తప్ప సాయమొనర్చువారెవ్వరూ లేరు. కాని నాకొకటి తోస్తోంది.

చం :- ఏమది? (జాగ్రత్తగా వినును.)

ఖు :- (ఆలోచిస్తూ) నీవు...ఈ బిడ్డలనుతీసుకొని నీ పుట్టింటికి వెళ్లు. క్రొత్త కాపురం ఎక్కడైనా ఏర్పడ్డతర్వాత వత్తువుగాని.

చం :- (దీనంగా) నా చిన్న వయస్సులోనే పుట్టిల్లు విడిచి మీ యొద్దకు వచ్చాను. మరల ఆ ఇల్లు ఏలాంటిదో ఎరుగను. అదీకాక సుఖపడుతున్నప్పుడు భర్తను విడువక కష్టం వచ్చినప్పుడు మాత్రం విడిచిపెట్టే గుణహీనురాలననుకొన్నారా నన్ను. దుఃఖంలో అనాలోచనగా చెప్పారా?

ఖు :- చంద్రా! నిజంగా ఆలోచన లేకుండానే చెప్పాను. నన్ను విడిచివెళ్లిన సుఖపడతారని నా తలంపుకాని, మిమ్మల విడిచి నేను మాత్రం ఉండగలనా? హో దైవమా! (దుఃఖించును.)

చం :- ఎందుకు దురపిల్లుట? కష్టకాలం తలవని తలంపుగా వచ్చింది. ఇది భగవంతుని పరీక్ష. బంగారాన్ని మాలిన్యం పోయేందుకు పుతం వేస్తారు. అట్లే పరమేశ్వరుడు మానవులను పరిశుద్ధుల చేసేందుకు కష్టాలు కల్పిస్తాడు. అలిసిపోవుటచే బుద్ధి కలతపడింది. కొంచెం సేపు నిద్రించి విశ్రాంతి పొందితే కర్తవ్యం తోస్తుంది. (అని పరుండును.)

ఖు :- నీవు పరుండుము. అర్ధరాత్రి కావచ్చింది. ఈ వంగదేశ ప్రాంతాలు, చోరభయ సంకులాలు. నేను కొంతసేపు మేలుకొనియుండాలి. (ఆమె వైపుచూచి) పాపం!

ఈమె నడచి నడచి అలసిపోయి త్వరగా నిద్రించింది. నాకో అగమ్యగోచరమైన భారముండుటచే నిద్ర దూరమైంది. (నిట్టూర్పుతో) అహా, రామచంద్రా! ఏమి నీ విలాసము! బహుకాల నివాసమైన దేర్జాపురము జారితివి. క్షేత్రియమంతా హరింప చేసితివి. ఆలుబిడ్డలతో అరణ్యవాసాలు చేసితివి ఇట్టి కష్టాలు పొందేందుకు కారణమేమి? దేవా!

మరచితినో మదిన్నీ పుణ్య మార్గము విప్పితినో స్మరింపనో
కరము వచింపరాని దుష్కర్మలనేయని చేసినానో భా
సుర శుభరూప నీదు పరిశోధన రోషమొ ఏమొ రుగజాల, నా
దరమున దారి చూపి పరితాపము [illegible] రఘుప

(కొంతసేపు నిశ్శబ్దము. తర్వాత తెరలో వెలుగు. దానినుండి [illegible] కోదండపాణియగు రాముడు ప్రత్యక్షమగును ఖుదీరాముడు తెల్లబోయి [illegible].)

రాముడు :– భక్తాగ్రేసరా! (ఒకవైపు [illegible] చూపి [illegible]) నేను చెట్టుక్రింద చాల కాలము నుండి దిక్కులేక నిరాహారంగా పడియున్నాను [illegible] ఇంటికి తీసుకొనిపోమ్ము. నీపూజయు నైవేద్యమును తీసుకొనుటకు [illegible] [illegible].

ఖు :– (ఉలికిపడుచు రామునకు సాష్టాంగపడి) స్వామీ స్వామీ వద్దు. నేను భక్తిహీనుడను. కుటీరముకూడా లేని సర్వశూన్యుడను ఎట్లు పూజించి నైవేద్యం ఇవ్వగలను దేవా!

రా :– భయపడకు. అన్నీ సమకూడును. (అంతర్హితుడగును. మరల చీకటి.)

ఖు :– (కొంతసేపు ఆనందబాష్పము కార్చి దిక్కులు పరికించి) భగవానుడు నా పూజకు తృప్తిపడటం ఏమి నా అదృష్టము! (కంగారుగా లేచి భగవానుడు చూపిన చెట్టుక్రిందకు వెళ్లును. ఒక పాముపడగక్రింద ఒక సాలగ్రామ శిలను చూచి అది తీసుకొందుకు చేయి చాపగా ఆ పాము మాయమగును. అది తీసుకొని కళ్ల కద్దుకొని)

జయతు జయతు దేవో జానకీ వల్లభోయం
జయతు జయతు రామః చంద్రచూడార్చితాంఘ్రిః
జయతు జయతు వాణీనాథనాథ పరాత్మా
జయతు జయతు రామో లోకనాథః కృపాళుః

దేవా శ్రీ రామచంద్రా నీకు నా బీద గృహంలో ఉండుటకు కోరికయా? తండ్రీ! నీ దివ్యప్రేమచే నేను ధన్యుడను.

చం :– (ఉలికిపడి లేచి) ఈ అర్ధరాత్రి ఎవ్వరితో మాట్లాడుచున్నారు?

ఖు :– చంద్రా! రామచంద్రునకి నా పూజపై కోరిక గలిగింది (సాలగ్రామము చూపి) చూడుము. ఇది ఆ చెట్టుక్రింద చూపి అంతర్హితుడయ్యాడు రాముడు. ఇది రఘువీరుని సాలగ్రామము. చూడుము.

చం :– (చూచి కన్నుల కద్దుకొని) భగవంతుడు మన గృహమున నుండకోరుటచే మనము ధన్యులము. ఆ దేవుని యనుగ్రహం మనపై పూర్ణముగా నున్నదనుటకు ఇదియే నిదర్శనము. ఇంక మన కష్టాలు గట్టెక్కుతాయనే ఆశ కలుగుతోంది.

ఖు:- ప్రియా! నీ ఉత్సాహవాక్యం మన భావిజీవితానికి ఉపశ్రుతి. ఇదిగో తూర్పున వేగుచుక్క కనబడుతోంది. బిడ్డలనులేపి ప్రయాణం సాగిద్దాము.

చం: ఎక్కడికి ప్రయాణం?

ఖు:- ఎక్కడికని అడగకు. భగవానుడు ఎక్కడికి తీసుకువెళితే అక్కడికి. వాని కరుణ మనపై కలిగియుంటే మనకేమి కొదవ. అతడే మనకు దారి చూపి నడిపించును రక్షించును పోషించును.

(ప్రవేశము సుఖలాల్ గోస్వామి)

సుఖలాల్:- ఖుదీరామ్! నీకు రామానందరాయలు చేసిన అన్యాయానికి దర్యాపురమంతా దుఃఖిస్తోంది. ఎంతవారికైనా దైవము అలంఘ్యంకదా! భారతభూమిని న్యాయం నశించింది. సత్యం స్వస్తిచెప్పింది. సనాతన ధర్మాలు సారహీనాలయ్యాయి. అత్యాచారాలు అండ చూచుకొన్నాయి. ఏదో అనిర్వచనీయమైన మార్పు రానున్నది. అంతా ఈశ్వరేచ్ఛకదా!

ఖు:- ఈశ్వరేచ్ఛయే. నేడు ఇల్లూ వాకిలీ లేక కూడు గుడ్డలకు కఱవై ఆలు బిడ్డలతో అడవి పాలౌట ఈశ్వరేచ్ఛయేగా.

సు:- విచారపడకు, ఈ సమీపాన్నున్న కమార్పుకూరువచ్చి కొత్త కాపురం ఏర్పరచుకో. అక్కడ నీ కొక కుటీరమునిచ్చి భోజనానికి చేయదగిన ఏర్పాటు చేస్తాను. నీ వంటి భక్తాగ్రేసరుడు మా గ్రామాన్ని నివసిస్తే అది నిజంగా పుణ్యభూమే అవుతుంది. త్వరగా బయలుదేరు.

ఖు:-(నమస్కరించి) ఆపద్బాంధవా! నీవు మా వంశమున్నంత కాలమూ స్మరణీయుడవు. నీవు చెప్పినట్లే చేస్తాను.

(గోస్వామి వెళ్ళును)

ఖు:- చంద్రా! సర్వేశ్వరుని సాయమనగానిట్టిదేసుమీ. అనన్యాశ్చింతయంతోమాం యే జనాః పర్యుపాసతే తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ అన్నాడు భగవానుడు. పోదమురండు——(తెరపడును)

ప్రథమాంకము - ముగిసెను

## ద్వితీయాంకము (విష్కంభము) (1 వ రంగము)

స్థలము: హాల్దారు పుష్కరిణీ తీరము

(ప్రవేశము - గోవిందుడు, మాధవుడు)

గో:- ఒరే మాధవా స్నానానికి వచ్చి నిలబడి పోయావేమిరా చలిచేతనా.

మా: చలికాదు ఏమీకాదు. ఇందు ఖుదీరాము స్నానంచేస్తున్నాడు అందుకోసం.

గో:- ఖుదీరామెవ్వడురా? అతను స్నానంచేస్తుంటే నీకేమీ.

మా: పది సంవత్సరాలు ఇక్కడున్న ఖుదీరామునే ఎరుగవా?

గో:- నేనెరుగనులే అయితేనేమి ఆయన స్నానం చేస్తుంటే నీవు చెయ్యొచ్చుగా.

మా: అతడు స్నానంచేస్తుంటే అతని కాంతి పుష్కరిణి అంతా వ్యాపిస్తుందిట. అందుచే అతను స్నానంచేసి జపం చేసుకుంటూండగా ఎవ్వరూ పుష్కరిణిని తాకరు. ఆ కాంతి అందరికీ భయంకలిగిస్తుందిట. ఆయన వెళ్ళేవరకు ఎవ్వరు అందులో కాలుపెట్టరు.

గో:- అబ్బా! అంత గొప్పవాడా! అయితే అతను దేవుణ్ణి చూచాడంటావా?

మా: ఆహా తప్పక చూచాడు. నిజంగా ఆయన మునీశ్వరుడే.

గో:- ఒరే అతడే దేవుణ్ణి చూచాడంటావు?

మా: ఏ దేవుడేమిటి? నీ మొగము.

గో:- అదికాదురా రాముడా, కృష్ణుడా, శివుడా, అని.

మా: అదా అతడు రామభక్తుడు. రాముణ్ణే చూచి ఉంటాడు. వారి కుటుంబంలో అందరి పేర్ల లోను రామనామముంది అందుకనుకున్నాను.

గో:- అయితే ఖుదీరాముడేమిచేస్తాడు?

మా: ఆయన రోజంతా దేవపూజలోను, ధ్యానంలోను గడుపుతాడు. సాయంత్రం కొంచెంసేపు గ్రామస్థులతో భక్తివిషయాలు మాట్లాడుతాడు.

గో:- గ్రామస్థులేమైనా ఇస్తారేమో లేకపోతే జీవితమేలా గడుస్తుంది.

మా: గ్రామంలోవాళ్లు డబ్బేమీ ఇవ్వరు. ఆయన బోధలు విందామనీ, ఆయన ఆశీస్సులుపొందు దామనీ వస్తారు. జీవనాధారంగా సుఖలాల్ గోస్వామి ఆయనకు "లక్ష్మిజాల" అనే పొలం ఇచ్చాడు. అదేచాలు వారికి.

గో:- ఆయనకు పిల్లలున్నారా?

మా: ఆయనకు ఇద్దరు కొడుకులు, ఒక్క కొమార్తె. మొన్ననే కుమారునికి కొమార్తెకు పెళ్లి చేశారు కూడా. ఆయన పెద్దకొడుకు ధర్మశాస్త్రమూ జ్యోతిషం చదువుకొన్నాడట. జ్యోతి షంలో వానికి చాలా మహిమలున్నాయంటారు.

(ప్రవేశం కేశవుడు)

కే:- ఏమిట్రా! పనికిమాలిన కబుర్లు చెప్పుకుంటూ ఇక్కడున్నార్రా!

మా: విశేషాలేమిరా?

కే:- చూడు ఎంత ప్రొద్దెక్కిందో! ధర్మాత్ముడైన సుఖలాల్ చనిపోయి నేటికి పదిరోజులుకదా, వానికొడుకు దానాలు ధర్మాలు చేస్తున్నాడు.

గో:- ఒరే కేశవా! నాకు కూడా ఒక దానమేదైనా ఇప్పిద్దూ పిల్లలుగలవాణ్ణి.

కే:- పనికిమాలిన కబుర్లుచెప్పుకుంటూ ఉండండి. ఆ పుణ్యకాలం దాటిపోతుంది.

గో:- పోదాం పదండి. (అందురు వెళ్లుదురు)

(తెరపడును)

## ద్వితీయాంకము—రెండవ రంగము

స్థలము: పువ్వులతోట

(ప్రవేశము - ఖుదీరాము పూలసజ్జతో)

దేవా! శ్రీరామచంద్రా!

నిశాచింతింపగ మార్గమేది యగునో నీ పూజకేమేని శ్రో
న్నన తేనేరిచి తెప్పుకోన్వలయునో నైవేద్యమున్నియ్యనే
దినుసుల్ ఖర్చులకిచ్చుకోన్వలయునో దేవా యెరుంగన్ సదా
మనమర్పించెదు గ్రుక్కగొనుచును రామా కృష్ణయన్వోరుమన్

(అతడు పువ్వులు కోయుచుండును. సీతాదేవి బాలికారూపంలో నీలి ముసుగుతో తానును పువ్వులుకోసి ఖుదీరాముని సజ్జలో వేయును)

అమ్మా! జనకతనయా! నీ పూజకు నీవే పువ్వులు కోసుకొనుచున్నావా!

(పువ్వులను సజ్జపట్టినంతలో నామె అంతర్హితమగును. కూర్చుండి దండకట్టును)

(ప్రవేశము - చంద్రాదేవి)

మన రామకుమారుని జ్యోతిష్యమెంతవరకూ వచ్చిందో విన్నారా?

(దండకట్టుచూ) ఏమిటది?

మనవాడు గ్రహణస్నానానికి కలకత్తా వెళ్లాడుకదా అక్కడ ఒక జమీందారుని కుటుంబం స్నానానికివచ్చిందిట. ఘోషాపద్ధతి ఖచ్చితంగా పాటించేవాని భార్య పల్లకిని తీరానికి పట్టించుకొని స్నానం చేస్తుండగా, ఆమె ముఖం మనవాడికి కనబడిందిట.

(ఆమె ముఖంలోకి చూస్తూ) అప్పుడేమైంది?

అప్పుడువాడు నిట్టూర్పువిడిచి "అయ్యో! ఇంత ఘోషాలోనున్న ఈమె దేహం రేపీపాటికి నిర్జీవంగా ఈనదికే అర్పింపబడునుకదా!" అని మెల్లిగా అనుకొన్నాడట.

(దండకట్టుట ఆపి) ఆ మాటలెవ్వరూ వినలేదుకదా!

ఎవ్వరేమిటి ఆ జమీందారే విన్నాడట. పూర్ణారోగ్యంలోను నిండు యవ్వనంలోనూ ఉన్న తన భార్యను గురించి వాడు చెప్పినమాటలు విని, జమీందారు విషాదాశ్చర్యాలు పొంది, వాని జోస్యం పరీక్షించి వానిని శిక్షింప నిశ్చయించి వానిని తనతో తీసుకొని పోయాడట.

(దండక్రిందవిడచి) తర్వాత?

అందరూ ఆశ్చర్యం దుఃఖమూ పడునట్లు ఆమె అట్లే మరణించిందిట.

అప్పుడా జమీందారేమి చేశాడు మనవాడిని?

జమీందారు దుఃఖము ఆశ్చర్యంపొంది మనవాడిని విడిచిపెట్టాడట.

అయ్యో! ఎంత చిత్రం ఎంత ప్రమాదం. కాళీమాత వానికి జ్యోతిషంలో అద్భుత శక్తులను గ్రహించింది, వాడు వానిని వెల్లడి పరుచుకోకూడదు.

చం: ఆ జమీందారు రామానందరాయుల వంటివాడు కాడుగనుక వానిని విడిచాడు. అబద్ధపు సాక్ష్యం చెప్పజాలని కారణంగా ఆస్తినంతయు అపహరించి ఊరు వెళ్ళగొట్టాడుకదా అతడు.

ఖు:- చంద్రా! అట్లనకు. ఎడతెగని శ్రీరామచంద్రపాదారవిందమకరందం గ్రోలుటకు అతడే కారణం. అతడు మనకు కృతజ్ఞుడు కూడా.

చం: ఎంత చిత్రం ఎంత విపరీతం!

ఖు:- విపరీతమేమీ లేదు. దర్వాపురం విడిచిన నాటి దృశ్యం నా మనఃఫలకమున మాయక నన్ను పూర్తిగా మార్చింది. ఎట్లనగా ఈ ప్రాపంచిక విషయాలు వృథా క్రోధ కాపట్య దురాశా పూరితాలనీ, భగవంతుడొక్కడే తృప్తిదాయకుడనీ తెలిపింది. ఈ పరివర్తనకు కారణం అతడేకదా.

చం: అయితే సుఖలాల్ గోస్వామినేమనాలి?

ఖు:- అతడే మనకు ఈ ఐహికజీవనము సుఖ శాంతములతో గడుచుటకు కారణము. అతడు మనకే కాదు. మన వంశమునంతకూ కృతజ్ఞుడే. ఈ గోస్వామిని మనము మరిచిపోగలమా! చూడు జీవితమెంత శాంతిగానున్నదో.

శ్రీరఘువీరుని చిత్తములోనల్పి పొలమునసేవరి మొక్కనాట
అతివృష్టియైన ననావృష్టియైనను తృప్తిగా ధాన్యమ్ము నిచ్చుచుండ
అరుదెంచు యతిథి యభ్యాగతులకునెల్ల నన్నదానము చేయునవసరమున
కొంగుబంగారమై కొఱత కనబడనీక చేయు 'లక్ష్మీజాల' చిత్రముగను
ఇంటనేదైన లేదనుకొంటతడవు కోరినట్టులనదియు చేకూరుచుండె
శాంతి జీవనమేర్పడె చింతతొలగె తలపనింతయు శ్రీరాము దయయకాదె

చంద్రా! ఆ దేవదేవుని భక్తితో నారాధించినచో భవబంధాలు తొలుగునుకదా!

చం:- భక్తియనగా ఏమిటో వివరించండి.

ఖు:- సర్వభూతములయందు సమముగు ప్రేమగలిగి, త్రికరణశుద్ధిగా భగవంతుని సేవచేయుచు అతని సర్వకాలములయందు బుద్ధియందు నిల్పుకొనుటయే భక్తి. ఈ భక్తివైధిక, ప్రేమ భావాలతో రెండు విధములు.

చం:- ఆ విధములేవి? వైధిక భావన ప్రేమభావన అనగా?

ఖు:- వైధికభక్తుడు తరచుగా గంగాది పుణ్యనదులలో స్నానం చేయకోరుతాడు. పుణ్యతీర్థాలు సేవింపకోరుతాడు. ఏకాదశీ మొదలగు పుణ్యదినాలలో ఉపవాసాలుండకోరుతాడు. గీతా మొదలగు పవిత్రగ్రంథాలు పారాయణచేస్తాడు.

చం: ప్రేమ భక్తున కివేమియు అవసరంలేదా?

ఖు:- అవసరంలేదు. అతడు భావోద్రేకపూరితుడై భగవంతుని ఆప్తబంధువుగా తలచి ఒళ్ళు మరచి ప్రవాహమునివలె హృదయప్రేరణనుబట్టి సంచరిస్తాడు

చం: ఈ రెండు విధాలలోనేది శ్రేష్ఠమైనది?

ఖు:- రెండును శ్రేష్ఠములే. మొదటిది రెండవదానికి సోపానము.

చం: అసలు భక్తి కలుగుటకు మార్గమేమి?

ఖు:- నిరంతర సత్సాంగత్య తీర్థాటనము. తీర్థాటనములో భగవంతుని లీలలు అర్థమగును. ప్రజల కష్టసుఖాలు తెలియును. సహనము ఎక్కువగును.

చం: అయితే మొదటిది నాకు రెండవది మీకు కలిగినది.

ఖు:- అది ఎట్లా?

చం: సత్పురుషులగు మీ సాంగత్యం నాకు, తీర్థాటనము మీకు.

చంద్రా:- చక్కగా చమత్కరించావు. తీర్థాటనమంటే జ్ఞాపకం వచ్చింది. ధర్మాత్ముడగు సుఖలాల్ గోస్వామి చనిపోయాడుకదా. వాని కుమారుడు కృష్ణచంద్రుడు ఆయనకు పిండ ప్రదానం చేసేటందుకు గయకు వెళ్ళుచున్నాడు. నేను కూడా వానితో ప్రయాణం పెట్టు కున్నాను.

చం: మీరిదివరకు కాశీ ప్రయాగ బృందావనాది తీర్థాలకు వెళ్లినప్పుడు గయకు వెళ్ళలేదా? ఇంత పెద్ద వయసులో ఇప్పుడా ప్రయాణం కాలినడకన.

ఖు:- అప్పుడేదో ఆటంకంవల్ల గయకు వెళ్ళలేదు. గయలో పితరులకు పిండం వేసి పితౄణము తీర్చుకోవాలని ఎన్నాళ్లనుండియో అనుకుంటున్నాను. నేటికి తగిన సహవాసం లభించింది. ఇందేదో ప్రేరణఉన్నట్లు తోస్తోంది. తిరిగి ఒక్క నెలకు వస్తాను.

(ప్రవేశం రామేశ్వరుడు)

రా:- నాన్నా! కృష్ణచంద్రబాబు ఈ తెల్లవారుజామున ప్రయాణమని చెప్పమన్నాడు.

ఖు:- సరే! చంద్రా! శ్రీరాముని పూజాదులు చేస్తూఉండు.

(తెరపడును)

(ద్వితీయాంకము ముగిసెను)

## తృతీయాంకము—మొదటి రంగము

(స్థలము గయాగుండము—ప్రవేశము : ఇద్దరు యాత్రికులు, ఒక పండా)

మొదటి యాత్రికుడు :- ఇంతకన్న నే నిచ్చుకోలేను. బీద బ్రాహ్మణ్ణి. నన్నేలాగైనా రక్షించి ఈ కార్యం గట్టెక్కించు బాబూ.

పండా:- ఛీ! పిండప్రదానానికి రెండు రూపాయిలా. ఇది ఇచ్చేందుకు నీకు చేతులేలా వచ్చాయి, ఇవికూడా జాగ్రత్తగా మూట కట్టుకొని ఇంటికి చేరుకో, నీకు పిండమేమిటి ?

రెండవవాడు :- ఇక్కడ పిండప్రదానానికి రూపాయ పావలా కదయ్యా.

పండా:- (మహాకోపంతో) ఎవ్వరైనా నవ్విపోతారు. నీ కేం తెలుసూ. నూరూ, యాభై, పాతిక, పరక, ఇట్లా రేట్లున్నాయి. వీని దరిద్రంచూచి కనికరించి పది ఇచ్చుకో మన్నాను. అదీ ఇచ్చుకోలేకపోతే పొమ్మను.

రెం-వా:- (గట్టిగా) పొమ్మనటానికి నువ్వెవ్వడవు. ఇది మీ తాతగారి కానాచా? ఇష్టమైతే ఆయనిచ్చేది పుచ్చుకొని పిండం వేయించు. లేకపోతే నీవే పో.

పండా :- మీ కెందుకు బాబూ మీరూరుకోండి. మీరుకూడా స్నానంచేసి...

రెం-వా :- (మాటలోనే అందుకొని) ఆఁ ఆఁ - నాకు తల్లీ దండ్రు లున్నారయ్యా.

పండా :- అయితేనేం - చచ్చినవాళ్లకీ బ్రతికున్నవాళ్లకీ కూడా పిండం వేయవచ్చు. ఆత్మపిండం వేసుకోవడం లేదా?

రెం-వా :- ఆత్మపిండం తల్లిదండ్రులు లేనివాళ్లు వేసుకుంటారుగాని బ్రతికియున్న పెద్దలకు పిండాలు వేస్తారా? ఈ మాట ఎవ్వరివద్దా అనకు చెప్పుదెబ్బలు తింటావు.

పండా :- (మొదటివానితో) సరే అయిదు ఇచ్చి పిండం వేసుకో.

రెం-వా :- అయిదూ ఇవ్వడు రెండూ ఇవ్వడు. మామూలు ఇస్తాడు. ఇష్టమైతే రూపాయి పావలా పుచ్చుకొని వేయించు. లేకపోతే నీ తాత ఇంకొకడు.

పండా :- ఇంకొకడు ఇక్కడికి ఏలా వస్తాడో చూస్తాను.

రెం-వా :- ఎందుకు రాడో చూస్తాను. తేనెపట్టున ఈగలవలె ముసరి యాత్రికులను పీకిస్తున్నారీపండాలు. పుణ్యక్షేత్రాలు పిశాచభూములయ్యాయి.

(ఇంతలో ఖుదీరాము, కృష్ణచంద్రుడు మరియొక పండాతో ప్రవేశము.)

రెం-వా :- అయ్యా! (అని ఆ పండాను పిలిచి) వీనికి పిండప్రదానం చేయిస్తారా? మామూలిస్తాడు.

క్రొత్త పండా :- చిత్తము. అలాగే.

రెం-వా :- మామూలెంత?

క్రో-పండా :- మామూలు రూపాయి పావలాకదా!

రెం-వా :- అదే తీసుకో. అదీ ఇదీ అని ఇంతకన్న ఒడికితివా జాగ్రత్త!

క్రో-పం :- చిత్తం, బాబూ! వీరి పని అయ్యాక, అలాగే చేయిస్తాను.

రెం-వా :- (మొదటి పండాతో) ఇక చల్లగా జారుకో. అత్యాశ మొదటికే మోసం తెలుసా. వచ్చినదానితో తృప్తిపడడం నేర్చుకో. బాగుపడతావు.

మొ-పండా :- స్వామీ, బుద్ధి వచ్చింది. నేనే చేయిస్తాను - రమ్మనమనండి.

రెం-పండా :- స్వామీ! ఏదో తెలియక అన్నాడు. అతన్నే చేయించుకోనివ్వండి. (రెండవ వాడు నవ్వుకుంటూ వెళ్లిపోతాడు)

ప్రవేశము : ఖుదీరాము, కృష్ణచంద్రుడు పండాతో

పండా :- అయ్యా! చేతులలో పిండాలు పట్టుకోండి. నేను చెప్పే మంత్రాలు చెప్పండి.

(వారిద్దరు అట్టే చేస్తారు)

అస్మిన్ విష్ణుగయాక్షేత్రే గదాధరపాదపద్మసన్నిధౌ
అస్మత్ పితృపితామహేభ్యః పిండోదకం సంప్రదదేన్నమః

(కృష్ణచంద్రుడు, ఖుదీరాము మంత్రము చెప్పి నీళ్లు వదులుదురు)

ఖు :- (కొంతసేపు కన్నులు మూసుకొని ఆనందబాష్పాలతో) కృష్ణచంద్రా! నేను విడిచిన పిండోదకాలు నా పితరులు అందుకొని ఆరగిస్తున్నారు - చేతులెత్తి నన్నాశీర్వదిస్తున్నారు - చూడు.

కృ:- (తెల్లబోయి చూచుచుండును.)

ఖు:- (సాష్టాంగపడి) పరమ పితరులారా! మీరు తృప్తితో నేనిచ్చిన పిండాలను ఆరగించి నన్ను దీవించినందుకు సహస్ర వందనాలు. ఈ మీ బిడ్డ మనస్సు సర్వదా సర్వేశ్వరుని యందు స్థిరముగా నిలుచునట్లు ఆశీర్వదింపుడు: (అల్లే కొంతసేపుండును.)

కృష్ణ:- బాబూ! భోజనానికి వేళైనది. ఇక పోదామా?

ఖు:- (లేచి నిలబడి) అగే వెళ్లుదాము. (తెరపడును.)

## ము—రెండవ రంగము

ఖుదీరాముని ఇంట గృహము - రాత్రి కాలము

(కృష్ణచంద్రుడు - ఖుదీరాము పరుండుదురు - తెరలో వెలుగు)

ఖు:- (తొందరగా లేచి వెలుగువైపు నడచి మోకాళ్లమీద నిలచి నమస్కారముతో) హే సృష్టిస్థితి లయకారణా, పురాణపురుషా, యోగయోగీశ్వరా, పుండరీకాక్షా, చక్రధరా, గదాధరా, శరణు శరణు.

సకలసృష్టికి మూల - మొదవై నిలిచిన - సర్వాత్మకా, నీకు శరణు శరణు
దశరథేశ్వరునకు - తనయుడై పుట్టిన - సత్యాత్మకా నీకు - శరణు శరణు
వసుదేవునకు దివ్య - శిశువువై పుట్టిన - జ్ఞానాత్మకా నీకు - శరణు శరణు
కైవల్యపదమున - కాంతిపుంజమువైన - శాంతాత్మకా నీకు - శరణు శరణు
జగము సృష్టింప రక్షింప సంహరింప కర్తవును భర్తవును నీవు-హర్త నీవె
సకల కళ్యాణగుణ జగచ్చక్రవర్తి - కరుణజూడు గదాధరా - శరణు శరణు.

(తెరలో భగవద్వాక్యము వినపడును)

భ:- భక్తాగ్రేసరా! ఖుదీరామ్!

నిర్మలమైన నీదగు, సు - నిశ్చలభక్తికి, సంతసించితిన్
దుర్మతులన్నడంచి సుమనోమహితాత్ములగాచి, సత్యమున్
ధర్మము నిల్పబూనుకొని - ధారుణినన్ని యుగమ్ములందు, నే
నర్మిలి పుట్టుచుండుదును - నాదగు భక్తులకప్పుడప్పుడున్.

అందుచే, సనాతనధర్మము లడుగంటు నీ కాలమున, మత కలహములు ప్రబలు నీ కాలమున భక్తిజ్ఞాన వైరాగ్యములు నశించు నీ కాలమున 'భగవంతుడున్నాడా,' యని సంశయించు నీ కాలమున, సర్వనాశన మహోపద్రవము కలుగు నీ దేశమున ప్రతికూల వ్యక్తులచే భారతీయ విజ్ఞానము మూలచ్ఛేదమగు నీ సమయమున నీ కుటీరమున బుట్టి నిన్ను తండ్రిగా స్వీకరింతును.

ఖు:- (లేచి చేతులు జోడించి) వలదు వలదు తండ్రీ! అంతదయకు నేను తగను. నా యోగ్యతకు మించిన దయ మీరిదివరకే చూపినారు. నేను మీ సేవచేయ లేని నిరుపేదను.

భ:- బిడ్డా! భయపడకు. భక్తియే చాలు. నీలోపము లెంచను.

(భగవానుడు అంతర్హితుడగును. మరల చీకటి).

ఖు:- (లేచి ప్రక్కలో కూర్చుండును) భగవానుడు నా బీదగృహమున పుట్టడం నన్ను తండ్రిగా స్వీకరించడం! ఏమి నా అదృష్టము!

కృష్ణ:-(లేచి) ఖుదీరామ్! కలవరిస్తున్నావా?

ఖు:- లేదు. స్వప్నవృత్తాంతం తలుచుకొంటున్నాను.

కృ:- స్వప్నమా ఏమని?

ఖు:- నేను గదాధరుని దేవాలయానికి వెళ్లితిని. ఆ దేవుని ఆవరణలో పితృదేవతలు పిండా లారగిస్తున్నారు. ఇట్లు కలకన్నాను.

కృ:- పగలంతా కోవెలలోనే ఉన్నాముకదా! అందుకే అట్లు కలగన్నావు.

ఖు:- అంతేకాదు. అకస్మికముగా, ఆ గర్భగుడి కాంతితో నిండిపోయింది. ఆ కాంతిలో ఒక దివ్యపురుషుడు, దేదీప్యమానమగు నొక దివ్యసింహాసనముపై కూర్చుండి నన్ను తన ఆసనంవద్దకు రమ్మని సంజ్ఞ చేశాడు.

కృ:-(లేచి కూర్చుండి) భక్తాగ్రేసరుడవగు నిన్ను భక్తత్రాణుడు చేరబిలుచుట యుక్తమేకదా! తర్వాత

ఖు:- తర్వాత నేనాదేవుని సమీపించి స్తోత్రము చేసితిని. ఆయన నన్నాదరించి, త్వరలో నా కుటీరములో నాకు నందనుడై పుట్టుదునని చెప్పి అంతర్హితుడయ్యెను.

కృ:- ఆహా! ఎంత సుకృతివి! త్వరలో నొక దివ్యశిశువు నీ గృహం పావనం చేయనున్నాడన్నమాట!

ఖు:- ఈ కల నిజమగునా? ఇంతకన్న ప్రబల నిదర్శనములు కలుగువరకూ ఎట్లు నమ్మడం!

కృ:- భగవంతుడు త్రేతాయుగంలో దశరథునకు బిడ్డడై పుట్టినప్పుడున్ను, ద్వాపరంలో వసుదేవునకు సూనుడై పుట్టినప్పుడున్ను ఇంతకన్న ప్రబల నిదర్శనాలేమి పొడగట్టాయి!

ఖు:- కృష్ణచంద్రా! లోకులు కాకులు. నా స్థితపరిస్థితులు లోకంలో ప్రబలి ఉన్నాయి. కాలక్రమాన్ని అదే తెలుస్తుంది. తొందరఏల?

కృ:- సరే! ఈ విషయం మనలోనే ఉంటుందిలే. మనము ఈ పట్టణం చూడాలి. బుద్ధభగవానుని జ్ఞానోదయవటం చూడాలి. ఎప్పుడు?

ఖు:- రేపు ఉదయం త్యాగమూర్తియగు బుద్ధుని వటముచూచి పట్టణంలోని విశేషాలు పరికించి తర్వాత మనవీటికి పయనింతము.

కృ:- సరే అట్లే చేతాము.

(తెరలో) జయసృష్టి స్థితినాశ హేతు ఘనస-త్సామర్థ్య సన్మార్గ-గా
జయ వేదాంతశిరః ప్రచారపటవీ-సంచార జ్ఞానప్ర-దా
జయవైకుంఠపురీ నివాస సుఖదా, శాంతాత్మదా మోక్షదా
జయ హేచక్రధరా! గదాధర! ధరాచక్రంధరా! శ్రీధరా

ఖు:- (విని) అదిగో గదాధరుని మంగళతూర్యవాదములు. తెల్లవారుచున్నది. కాల్యములు నిర్వర్తించుకొని భగవానుని సేవించుకొందుము.

తెరపడును (తృతీయాంకము ముగిసెను)

## చతుర్థాంకము—ఒకటవరంగము

స్థలము: ఖుదీరాముని గృహము.

(ప్రవేశము - చంద్రాదేవి, ధని, ప్రసన్న)

ప్రసన్న:- వేసిన తలుపులు వేసినట్లేఉంటే, ఎవరు వస్తారమ్మా! అదంతాకలే! ఈ విచిత్రమైన కలను ఎవ్వరికీచెప్పకు. నవ్వుతారుకూడా.

చం: ప్రసన్నా! మొదట కలే అనుకున్నాను-మేలుకొన్నాను-కళ్లు తెరిచాక కూడా ఆ పురుషుని నా పక్కమీద కళ్ళారా చూచాను. అప్పుడప్పుడు నా పక్కమీదనుంచి లేచి నా గదిలో నడుస్తుండడం కూడా చూచాను. నిజంగా అతడు నా భర్తలాగే ఉన్నాడు. కానీ మహా తేజశ్శాలి! తర్వాత వానిని దేవత అని ఊహించాను. అది కలమాత్రంకాదు.

ధని:- నన్ను లేపగానే, దీపం వెలిగించి గది నాలుగు మూలలా చూచానమ్మా ఎవ్వరూ లేరే!

ప్రస:- ఇది కలకాకపోతే, ఏదో భూతమైయుంటుంది. సకల భూతశాంతికరమగు రుద్రాభిషేకమూ, అమ్మవారికి కుంకుమపూజా చేతాము.

చం: నేనూ అలాగే అనుకుంటున్నాను. (ధనితో) ధనీ! టెంకాయ, పళ్లు పసుపుకుంకుమా, పట్టుకురావే. శివాలయానికి వెడదాము.

ధ:- అట్లే (లోపలికి వెళ్లును)

ప్ర:- ఒదినా! మా అన్నగారు గయకువెళ్లి నెలకావచ్చిందనుకుంటాను. నేడో రేపో వస్తారు.

చం: ప్రసన్నా! ఈ గొడవ జరిగినప్పటినుండీ మనస్సు ఆయనమీదకే పోతోంది. సుఖంగా ఇల్లు చేరితేగాని స్థిమితపడదు.

ప్ర:- ఏమీ భయంలేదు. ఆయన ఇదివరకెన్నో ప్రయాణాలు కాలినడకతో చేసారు. ఆయన సుఖంగా వస్తారు.

ధ:- (టెంకాయ, పళ్లు, పసుపు, కుంకుమ, పళ్ళెంలో పెట్టుకొని వచ్చుచు) అమ్మా గుడికి వెళదామా?

ప్ర:- ఇంకా ప్రదోషకాలంకాలేదు. కొంతసేపాగి వెడదాము.

చం: ఇప్పుడేపోయి కొంచెంసేపు అక్కడే కూర్చుందాము. (అని పళ్ళెంచేత్తో పట్టుకొని నడిచి తెరవైపు చూచి) తలుపు తెరచే ఉంది. దీపం కూడా వెలుగుతోంది. (అని తొందరగా నడుచును.)

ప్ర:- (ఆమెననుసరించి) దీపమేదీ? దీపమూలేదు. గర్భగుడి తెరవనూలేదు.

చం: (తెరవైపుచూస్తూ) అమ్మో! ఆ గర్భగుడిలో ఎంత తేజస్సు. ఆహా! దివ్యకాంతి! (కంగారుతో) ఆఁ ఆకాంతి వస్తోంది! ఆఁ నాలోపలికే (పడిపోవును)

ప్ర:- అయ్యో! ధనీ పట్టుకోవే (చూచి) ఈమె మూర్ఛపడ్డది.

(ధని, ప్రసన్న ఆమెను పట్టుకొని పరుండబెట్టుదురు.)

ధ:- అమ్మా! నిజంగా ఈమెను గ్రహమేదో పట్టింది. రాత్రినుంచీ బాధపడుతోంది. తగినచికిత్స చేయించాలి. లేకపోతే చాలా ప్రమాదంకూడా.

ప్ర:- ధనీ! ఈమెను చూడగా గ్రహంకాదని తోస్తోంది. గ్రహమైతే గర్భగుడిలోనుంచి తేజస్సు తనలోపలకే రావడం ఏమిటి!

(మాటలోనే రామశీల, సంపూర్ణ ప్రవేశం)

రామ:- పిన్నీ! ఇది ఏమి? ఈమె పడిపోయింది. ఏమైంది?

ప్ర:- ఈమెకు రాత్రి ఏదో చెడ్డకల వచ్చిందిట. అభిషేకం చేయిద్దామని వచ్చింది. గుడినుంచి కాంతివచ్చి ఆక్రమించిందని అంటూ పడిపోయింది.

రా:- ఇదీ నరాల సంబంధమైనజబ్బు. వెంటనే మందిప్పించాలి.

ధ:- గ్రహబాధేమో అని అనుకుంటున్నాను.

ప్ర:- గ్రహమూ కాదు. మరేమీ కాదు. ఈమె దేవతాగణంలోనిది. దేవతలు కనుపించడం ఆవహించడం ఈమెకు పరిపాటే. ఆ దేవత శరీరం నుంచి తొలగగానే లేచి కూర్చుంటుంది చూడండి.

(చంద్రాదేవి లేచి కూర్చుండును)

ప్ర:- వదినా! ఎలాఉంది? ఏమిటి విశేషం?

చం: ఏమీ లేదు. ఆ తేజస్సు నా గర్భంలో ప్రవేశించింది.

ప్ర:- (నవ్వుతూ) తేజస్సును గర్భంలో ధరించావన్నమాట!

చం: అవును. అది తిరుగుతోంది కూడా.

రా:- అత్తా! ఎంత అమాయకురాలవమ్మా! ఆమె నిన్ను హాస్యం చేస్తే అవునంటున్నావు.

సంపూర్ణ:- ఈమె మాటలు అమాయకపు మాటలని త్రోసై రాదు. నిజంగా ఆమె గర్భంలో దేవతాంశ ప్రవేశించెనేమో! ఆశ్చర్యంలేదు. ఖుదీరాము పరమభక్తాగ్రేసరుడు. ఈమె పావన చరిత. అవతార పురుషుల పితరులు ఇట్టివారేకదా!

(ప్రవేశము రామేశ్వర్)

రా:- అమ్మా! అమ్మా! నాన్నగారు వచ్చారు.

చం: ఏరీ! ఎక్కడా!

రా:- ఆమూరులో అక్కగారింట్లో ఉన్నారట, కృష్ణ చంద్రబాబు చెప్పాడు

ప్ర:- వదినా! మా అన్నగారు రాగానే, ఈ విషయాలన్నీ చెప్పి ఆయనను కంగారుపెట్టకు. నిదానంగా చెప్పుముగాని మేము వెడతాము.

(తెరపడును)

## రెండవ రంగము—నీలాటిరేవు

(ప్రవేశము ప్రసన్న, రామశీల, సంపూర్ణ చేత బిందెలతో)

ప్ర:- రామశీలా! మీ అత్త సాధింపులెల్లున్నాయి?

రా:- అత్త సాధింపులా! చచ్చిందాకా ఉండేవే. మొన్న చంద్రాదేవి వచ్చి బాగా బుద్ధి చెప్పివెళ్లింది. ఎన్ని చెప్పితేనేమి! పుత్తెను పుట్టిన బుద్ధి పుడకలతో కాని పోదు కదా!

సం :- రామశీలా! చంద్రాదేవి గర్భం ధరించిందని అంటున్నారు. నిజమేనా?

రా :- నిజమేనమ్మా!

ప్ర :- నేను "గర్భంలో తేజస్సుని ధరించావా" అని హాస్యం చేసాను - నిజమే నన్నమాట.

రా :- నీ హాస్యమూ, ఆమె అవుననడం కూడా నిజమైంది!

సం :- నేను చెప్పలేదమ్మా "ఆమె మాటలు త్రోసి పుచ్చరానివనీ."

ప్ర :- ఆమెకిప్పుడు నలుబది వళ్లు. ముసలి వదేళ్లకు గర్భం. ఎలా ఉంటుందో ఏమో!

సం :- ఆమె భక్తురాలు. ఆమె కేమీ భయం ఉండదు.

రా :- పిన్ని! చంద్రాదేవి, ఇప్పుడు బహు చిత్రంగా ప్రవర్తిస్తోంది సుమా! ప్రక్కనే ఉన్నాము గనుక మా కన్నీ తెలుస్తున్నాయి.

సం :- (బట్టలుతుకుటమాని) ఏమిటమ్మా ఆ చిత్రం?

రా :- ఆమెకు ఇంటిపనులలో తీరికే లేదు అయినా తీరిక చేసుకొని ఇరుగుపొరుగు వాళ్ళ ఇళ్ళకు వెళ్ళి వాళ్ళ కష్టసుఖాలు తెలుసుకొని వాటికి సాయంచేస్తుంది.

ప్ర :- ఆమెకాగుణం ఇదివరకే ఉంది.

రా :- వాళ్ళభోజనానికేమైనా తక్కువైతే తన ఇంటినుంచి తెచ్చి వారికిస్తుంది. తాను భుజించకుండానే పొరుగువారంతా భుజించారో లేదో అని వెళ్లిచూస్తుంది.

సు :- ఆశ్చర్యం. లోకరక్షణ భారం వహించిన దేవతా అనిపిస్తోంది. పాతికేళ్ళ యువతిలాగున్నది. ఆమె తరుచుగా దేవమందిరంలోనే ఉండి దేవతలకు దగ్గరగా కూర్చుండి వారితో మాట్లాడుతుందని కూడా విన్నాను.

ప్ర :- చంద్రాదేవి కోడలుగాని కూతురుగాని ఆమెకు సాయానికి వచ్చారా?

రా :- సాయమెవ్వరూ లేరు. పనులన్నీ ఆమే చేసుకుంటుంది. అప్పుడప్పుడు ధని కొంచెం సాయం చేస్తుంది.

(చేతిలో బిందెతో ధని ప్రవేశము)

ధ :- (ప్రసన్నతో) అమ్మా! మీ ఇంటికి పోయివస్తున్నాను.

ప్ర :- ఎందుకూ? చంద్రాదేవి ఆరోగ్యమేనా?

ధ :- ఆరోగ్యమే. మిమ్మల్ని నొక్కసారి పిలుచుకురమ్మన్నది. ఆమె రోజూ ఏవో కలలుకంటుంది. అస్తమానం తనలోతాను మాట్లాడుకుంటుంది. మరియు పడకగదిలోను, దేవునిగదిలోను దేవతలు కనిపిస్తున్నారట. భయపడుతుంది.

ప్ర :- సాయంకాలం తప్పక వస్తానని చెప్పు.

సం :- పిన్నీ! నీవు వెళ్ళేటప్పుడొక కేకవెయ్యి నేనూ వస్తాను ఆమెను చూడాలి.

(అందరూ బిందెలు నింపుకొని వెళ్లుదురు)

(తెరపడును)

## మూడవరంగము—ఖుదీరాముని గృహము

(ప్రవేశము ఖుదీరాము)

ఖు:- (పచారుచేయుచు) గయనుండి వచ్చినప్పటినుండీ చూస్తున్నాను. చంద్ర దేవతావేసినివలె తోస్తోంది (యోచించి) భగవానుని తేజము ఆమె గర్భంలో ఉన్నట్లుంది.
మించి కన్పట్లు నీదేవి-మేనీకాంతి। తలపశక్యముకానియు-దారగుణము
జీవకోటులపైన వి-శేషదయయు తనదు కులదేవతలపై ని-తలి ప్రేమ
ఈ లక్షణాలీమెవద్ద కనబడుచున్నాయి. గయలో నా స్వప్నమున్న, ఈమె ప్రవ రవ మున్న సమన్వయముచేసి చూడగా, భగవానుడిచ్చట జన్మించి మమ్ములను పావనం చేస్తాడని తోస్తోంది (లోపలకు చూచి) ఈమె దేవతలతో గుసగుసలాడుతోంది. ఇప్పుడు దేవతలకూ ఈమెకు ఒక్కపొరమాత్రమే అడము.

(ఆవేశంగా చంద్రాదేవి ప్రవేశము)

చం: గదిలో గజ్జలచప్పుడౌతోంది. పొరుగింటి బాలుడు వచ్చాడేమో!

ఖు:- (లోపలచూచి) ఎవ్వరూ లేరే!

చం: ఇప్పుడు కూడా గజ్జలచప్పుడు వింటున్నాను. (భయముతో వణకును)

ఖు:- చంద్రా! భయపడ్డావా? (వీపుతట్టి) భయమేమీలేదు.

చం: ప్రసన్న చెప్పినట్లు పిశాచాల దుండగాలో జబ్బో తెలియడంలేదు.

ఖు:- చంద్రా! కలతపడకు. ఇది భగవానుని మహిమలు, అనుగ్రహము. వినుము గయలో నా స్వప్నమూ ఇచ్చట నీ స్వప్నమూ, తేజము నీలో ప్రవేశించుటయూ ఈ రెండు సమన్వయించి చూస్తే ఒక దివ్య శిశువు మన గృహం పావనం చేయనున్నాడనుట నిశ్చయము. నీవు నిర్భయముగను ఆనందంగాను ఉండుము.

చం: మీరు చెప్పినట్లే ధైర్యంగా ఉంటున్నాను. కాని శాంతంగా ఉండలేకపోతున్నాను. ఈ గర్భభారంచేతను, దివ్యావేశాలచేతను, ఇంటియందు పనులుకూడా చేసుకోలేకుండా ఉన్నాను.

ఈ రోజుకెట్లో చేసుకో. రేపటినుండి పై పనులన్నియు ధనిచేత చేయించుకో. రఘువీరుని పూజా నైవేద్యాలకు కావలసిన పనులు నీవు చేసుకొందువుగాని అధైర్యపడకు. రామకుమారునికి కబురుచేసాను కోడలుని తీసుకురమ్మనమని, వస్తారో రారో! అన్నియు భగవానుని లీలలు. మనము భగవంతుని శుభోదయం కొరకు ఎదురుచూస్తూ ఉందాము పూజకు వేళైనది పోదాంపద.

(తెరపడును)

చతుర్థాంకము-ముగిసెను

## పంచమాంకము—ఒకటవరంగము

(ప్రవేశము: తెరబయట వీణాపాణియై నారదుడు పాటపాడుచు)

ఓమ్ నారాయణా హరినారాయణా

నమో నారాయణా శ్రీమన్నారాయణా నారాయణా
కేశవ మాధవ కృష్ణ ముకుందా వాసుదేవాచ్యుత వామన విష్ణో నారాయణ
శ్రీశా హృషీకేశా జగదంతర్నివాసా పాహి పాహి పరమేశా ఓమ్ నారాయణ
నమో నారాయణా శ్రీమన్నారాయణా నారాయణా నమ ఓమ్ (ఆగి)

(పరవశుడై ఆకసమువైపుచూచి) ఆహా! ఏమి ఈ తేజఃపుంజము! కోటి సూర్య ప్రభా సమానము. కన్నులు మిరుమిట్లు గొల్పుచున్న కాంతి! ఏమిది! (ఆగి) ఆఁ తెలిసినది. యోగ యోగీశ్వరుడైన మహావిష్ణుని కాంతి కిరణమిది. (ఆగి మరలచూచి) ఈ కిరణము బయలు దేరి క్రిందికి దిగుచున్నదే! బ్రహ్మలోకానికా? కాదు, నక్షత్రలోకానికి వచ్చి ఆగినది. ఆశ్చర్యం! చూచుచుండగనే ఆ కిరణం శిశువుగామారినది. (ధ్యానించి) పరాత్పరా! ప్రబల విషయరోగభారముచే క్రుంగికుములుచున్న మనుజకోటికాశయనెడి రాయభారమంది య్యానిప్పుడే యవతరించుచుంటివా దేవ! (మరల పైకిచూచి) ఆ శిశువు సప్తఋషులలో నొక్కని తన మృదుహస్తముతో స్పృశించి ఏదో చెప్పుచున్నది. (వినుటనభినయించి) ఆఁ నేను పోవుచున్నాను. నీవూరమ్మనమనియా? ఆ ఋషి ఎవ్వడు?

నరుడను దివ్యమునీంద్రుడు–పురాతనపు ఋషియు, దివ్య–పురుషోత్తముడే
పరమేశ్వరు సంకల్పము–ధరనీతండవతరించి ధన్యముచేయుఁ

పరమపురుషా! దేవ దేవా! నీ లీల లత్యద్భుతములు, బ్రహ్మదులుకూడ నెరుంగ జాలరన నేనెంతవాడను!

సంసారికారణ్య –సంచారజనులకు, బహుశాఖయుత మహా వటమువోలె
తాపత్రయాగ్నిచే – తాపమొందెడివారి – కమృతమ్ము వెదజల్లు – నంబువట్లు
బహిరోగపీడచే – బాధనొందెడివారి – వంత దీర్చుటకు ధ–న్వంతరివలె
జనన మరణములను – సంభ్రమిం దెడివారి దరికి జేర్చెడి మహా–తరణివోలె
అమితప్రేమామృతమ్మొక – హస్తమందు నధికజ్ఞానమ్ము వేరొక–హస్తమందు
దాల్చి చంద్రామణీదేవి – తనయుడనగ – నవతరించుచునుంటివో – యాదిదేవ
సర్వమత సామరస్యమై – జగతియందు – శాంతిసత్యమ్ము నెలకొల్పి – చక్క జేయ
రమ్యగుణధాముడీఖుదీ–రామునకును అవతరించుచునుంటి మహాత్మనీవు

(పై పాటనే పాడుకుంటూ నిష్క్రమించును)

# రామకృష్ణ జననము - నాటిక

## తెరలో (పాట నేపథ్యమున)

(గాగగపాపప-సాససనిదా-సాసరీగగ-రీసరిసపా।
గాపమగరీ, గారిసారిగ, సారిసనిధప-ధనిధపమగరి। గాగ పదసాని పదసా॥)
దివ్యజగదవతీర్ణుడై నిజ-తేజమెల్లడచిమ్ముచున్ భువి
నవ్యపురుషుండుదయమయ్యెను-జ్ఞానకాంతులతో మేలుకొనరే
ప్రకృతి నూతన జీవకళతో ప్రబలువేళ ప్రశాంతి మనముల
సుకమునిచ్చెడివేళయగునీ-సుప్రభాతమునా మేలుకొనరే॥
మందమాలయానిలుడు కలకల-మధురగీతముపాడు పక్షులు
వందనీయానందునకును సుస్వాగతమ్మొసగే మేలుకొనరే
సర్వమతముల సామరస్యము-శాంతిదాయకమని జగమ్మున
పర్వజేయు ప్రవక్తయగునీ-పరమపురుషుండే మేలుకొనరే
మేలుకొనరే భరతపుత్రులు-మేలుకొనరే శాంతచిత్తులు,
మేలుకొను డజ్ఞాన నిద్రను-చాలునికనైనా మేలుకొనరే.

## పంచమాంకము——రెండవరంగము

స్థలము: ఖుదీరామునింటిముంగిట

ప్రవేశము-ప్రసన్న, రామశీల, సంపూర్ణ (తెరబయట)

ధ:- (తెరలోనుండి తొందరగావచ్చి అమ్మా! అమ్మా! చంద్రాదేవి, ముద్దులమూటగట్టు కొడుకును కన్నదమ్మా!

ప్రసన్న:- ఏమీ! ఎప్పుడు?

ధని:- ఇంతకిముందే. బిడ్డకి స్నానం చేయించి పడుకోబెట్టి, ఈ శుభవార్త మీతు చెప్పాలనే బయలుదేరాను ఇంతలో మీరూ వచ్చారు.

ప్ర:- ఏదో చూడాలని బయలుదేరాము. ఆమె సుఖముగా ప్రసవించిందా?

ధ:- సుఖంగానే. ఇప్పుడు తల్లీ బిడ్డలు సుఖంగా ఉన్నారమ్మా.

సం:- ధనీ! బిడ్డడెట్లున్నాడు?

ధ:- అంత అందమైన బిడ్డని నేనెక్కడా చూడలేదు.

సం:- అంత చక్కగా ఉన్నాడా?

ధ:- చక్కదనమేకాదు-వింతకాంతి-విచిత్రమైన లక్షణాలు కలవాడు.

రామ:- ధనీ! ఏమిటా విచిత్రలక్షణాలు?

ధ:- వినండమ్మా! పిల్లవాడు పుట్టగానే ఏడవనేలేదు. నేను తల్లిని పరుండబెట్టి చూస్తినికదా! ఆ పిల్లవాడక్కడలేదు.

రా:- మరెక్కడున్నాడు? విచిత్రం!

ధ:- దగ్గరవున్న పొయ్యిలో సగం బూడెదలో కప్పబడిఉన్నాడు.

ప్ర:- అయ్యో! అక్కడికేలా వెళ్ళాడు?

ధ:- ఏమోనమ్మా? వానిని తీసుకువచ్చి నీళ్ళుపోసి ఎత్తుకొన్నానుగదా! వాడు ఆరునెలలవాడంత బరువుగా ఉన్నాడు.

సం:- అసలాబిడ్డ బరువుగానే పుట్టాడేమో!

ధ:- అట్లైతే ఆశ్చర్యమేమి? పుట్టగానే బరువులేనే లేడు.

సం:- అతడు అవతారపురుషుడేఅని తోస్తోంది చూతాము. లోపలికిరండి (తెరలోపలికి నలుగురు వెళ్లుదురు.)

పంచమాంకము—మూడవరంగము (తెరబయట)

(ప్రవేశము - ఇద్దరు జ్యోతిష్కులు, ఖుదీరాము, కృష్ణచంద్రుడు)

కృష్ణచంద్రుడు:- మిత్రుడా! సుందర మందస్మిత వదనముగల ఈ దివ్యశిశూదయముచే నీవేకాదు మేమందరమూ ధన్యులము. బాహ్యప్రపంచమున కీర్తి దివ్యగంటారావమగుగాక. గయలోకన్న స్వప్నవృత్తాంతము ఎవ్వరికీ చెప్పవద్దన్నావు. ఇప్పుడు సూర్యుని పటాంతముచే కప్పవచ్చునా!

ఖు:- మిత్రుడా! ఇది నీ ప్రేమమయమైన ఆశీర్వాదము.

మొ-జ్యోతి:- ఖుదీరామ్! నీపవిత్రగర్భము చల్లనగుగాక! (జ్యోతిశ్చక్రము చూచి) నీ కుమారుని భావిదశపరిశీలింప ఇట్టివాడు ధర్మజ్ఞుడు, మానసనీయుడు, యుగసంప్రదాయ ప్రవక్త, దేవ మందిరనివాసి, బహుశిష్య సమన్వితుడు, నారాయణాంశ సంభూతుడు కాగలడని భృగు సంహితలో వ్రాయబడింది.

రెం-జ్యోతిషుడు:- అదికాదయ్యా! ఏ పుణ్య ముహూర్తంలో దశరథగర్భం ధన్యంచేస్తూ శాంత మూర్తి పుట్టాడో, ఏ శుభసమయంలో వసుదేవుగర్భం పవిత్రచేయుచూ జ్ఞానమూర్తి పుట్టెనో ఆ ముహూర్తంలోనే ఈ బాలునిజన్మ. ఇది గొప్పయోగము.

ఖు:- (నమస్కరించి) ఇదంతయు భగవంతుని యనుగ్రహం, పెద్దల ఆశీర్వాదఫలము.

(తెర ఎత్తగానే)

(ఉయ్యాలలో పిల్లవాడు-చంద్రాదేవి-ప్రసన్న-రామశీల-ధని మొదలగు ముత్తైదువులు. చంద్రాదేవి వారికి పసుపుకుంకుమ పళ్లు తమలపాకులు పంచిపెట్టును.)

చం: ప్రసన్నా! ఒక జోలపాట పాడవే. నీ గొంతు బాగుంటుంది.

ప్రసన్న:- అందరం కలసిపాడదాము. నేనొక్కదానినీ ఏమిటి. (అందరూ పాడుదురు.)

(కొందరొక చరణం కొందరొక చరణం పాడుదురు)

కమ్మరపకూరున-కడుభక్తుడైనా-అలఖుదీరామునకు ఆత్మజుడవైతి।
దాక్షిణ్యశీల చంద్రాదేవికీవు-ముద్దుబిడ్డడవగుచు ముదముగాంచితివి॥ జోజో
ప్రకృతి నూతనకళల-భాసిల్లువేళ పక్షులింపుగ గూడిపాడెడివేళా।
పరిమళవాయువుల్-ప్రసరించువేళ। జననమొందితివీవసంత సమయానా॥ జోజో
చిరునవ్వులొలికెడు చిన్నిముఖమ్ము। కలువరేకులనేలు-కన్నులబెగడు।
పసిమిఛాయనుమించు-పచ్చనిమేను ఎంతచూచిన తృప్తియే లేదుమాకు। జోజో
పుట్టినప్పుడె నీవు బూదిలోనుంట। మిగుల భారంబగుట మీ తల్లికీవు
ఆజానుభావుడైనట్టి పురుషునిగా। కాన్పింపనినుజూచి-కంగారుపడుట॥
గజ్జలందెల ధ్వనుల్-గదిలోననుంట। మానవాతీతమా మహిమలను గనుట।
చూడ చూడగ మది చోద్యమ్ముగాను। రామకృష్ణులవలె రంజిల్లుచుంటి॥ జోజో
జన్మింపగలవనెడి సమయాన నీవు। ప్రేమ స్వరూపులౌపితరులకీవు।
మితిలేని మహిమలనమేయముగజూపి। సాంద్రమానాశ్చర్యజలధి ముంచితివి॥ జోజో
ఎంత పుణ్యాత్ముడో ఈ ఖుదీరాము। ఎంత ధన్యాత్మయో ఈతనిదేవి।
పావనమూర్తులీ వరదంపతులకు-పతితపావనమూర్తి ప్రభవించెనేడు॥ జోజో
చాటర్జివంశాబ్ధిచంద్రుడై పుట్టి। అటనుండి ధరయను-నంబరముచేరి।
కటువైనకలుషాంధకారమడగింప-పటువాక్సుధారసము-వర్షించుదేవ! జోజో

మంగళం :

జయరామకృష్ణాయ। జయశాంతరూపాయ। జయప్రేమనిలయాయ-జయజయదేవా॥
శాంతి సౌఖ్యములిచ్చి జ్ఞాన తేజమునిచ్చి సామరస్యమునిచ్చి-జనుల బ్రోవగదే॥ జయమంగళం
అఖిల భారతభూమి ఐకమత్యముగల్గి-అన్యోన్య కలహమ్ములడగిపోగాక ॥ జయమంగళం, ఓమ్

పంచమాంకము—సంపూర్ణము

శ్రీ రామకృష్ణజననము-సంపూర్ణము



# సూతసంహిత

## ఏలూరిపాటి అనంతరామయ్య

### మూడవ అధ్యాయం
### నందీశ్వరవిష్ణుసంవాదంద్వారా ఈశ్వర ప్రతిపాదనం

నైమిశీయ మహర్షులు "మహాభాగా, శ్రేష్ఠ పుణ్యాత్మా, సర్వార్థవేత్తృసత్తమా, భగవానుడా, సురలు, అసురులు, సిద్ధులు, కిన్నరులు, మునులు, యక్షులు, గంధర్వులు, తదితరులు, అందరూ, సర్వప్రాణులూ భుక్తిముక్తులకొరకు పూజింపదగినవాడెవడు? అతన్ని గురించి మాకు చెప్పు" అని అడిగారు 1, 2.

సూతుడు చెప్పాడు:

మహాప్రాజ్ఞులారా, మునిపుంగవులారా, మేలు, మేలు. జగద్ధితకరమైనది అడిగారు. ఆ విషయం చెపుతాను శ్రద్ధాసహితులయి వినండి

పూర్వం జగన్నాథుడు, పురాణపురుషోత్తముడు, విష్ణుమూర్తి, సాక్షాత్పరమాత్మఅయిన శివునిమాయవల్ల మోహితుడయినాడు 4. 'నేనే సర్వజగత్కర్తను, నాయందే ఈ జగత్తంతా ఉన్నది, నాకు సముడుగాని అధికుడుగాని ఎక్కడా, ఎన్నడూ లేడు 5, ఈచరాచర జగత్తు సర్వమూ నాశక్తి విలాసమే, సర్వదా సర్వప్రాణులకూ నేనే సమారాధనీయుడను' 6. అని అహంభావం కప్పివేయగా అంబికానాథుని, అనంతానంద చిద్ఘనుని, స్వాత్మభూతుని, మహేశ్వరుని తెలిసికొనక 7. బ్రహ్మాదుల నందరనూ మరీ ఆజ్ఞాపించాడు శ్రీహరి

అనంతరం సర్వభాసకుడు, సర్వాత్ముడు, మహాదేవుడు, దేవుడు8, శంకరుడు అతనిశక్తిని హరించి మోహితుని చేశాడు. అందువల్ల బ్రహ్మాది ప్రముఖ పశువులందరూ శంభుమాయవల్ల మిక్కిలీ మోహితులై మరీ వశం తప్పిపోయారు.

ఇంతలో శంకరునికిష్టుడు, సర్వవిజ్ఞానరత్నాకరుడు, కరుణాలయుడు, సర్వజ్ఞుడు, శ్రీమన్నందీశ్వరుడు విచ్చేసి, హరి బ్రహ్మాది అమరాధిపులకు శివుని పరత్వం వివరించాడు "విష్ణో, విశ్వజగన్నాథుడు, శంకరుడు, పరమేశ్వరుడు 9-12 సర్వసాక్షి, మహానందస్వరూపుడు, సర్వాత్మభావంతో ఉన్నాడు. ఆయనే సర్వప్రాణులకూ ఆత్మ, సర్వావభాసకుడు13. ఆయన ప్రసాద లేశలవలేశలవంచేతనే ఈ విష్ణుపదం నీకు లభించింది. వేరెందువల్లనూ కాదు 14. ఇతరులందరకూ కూడా ఆయన ప్రసాదంవల్లనే పదవి లభించింది. ఆయన వినా ఈ జగత్తు సర్వమూ స్వయంగా ఉండదు 15. సర్వదా సర్వవస్తువులకూ ఆయన స్రష్టికర్తా, పోషకుడూ కూడా ఇనుము అగ్నిలో కాలి, కాల్చినట్లే వెలిగినట్లే ఈ జగత్తు సర్వమూ ఆయనవల్ల ఉంటున్నది.

2. భుక్తిముక్తులకొరకు = మొదట భుక్తికి (భోగాలకు) క్రమంగా ముక్తికి. లేదా అనేకులలో కొందరి భుక్తికి మరికొందరికి ముక్తికి. మొత్తంమీద అందరికీ భుక్తిముక్తులకు.

జగద్ధితకరమైనది = మహర్షులు స్వయంగా విరక్తులు, అయినా లోకంకోసం భోగవిషయం అడిగారు. తా. దీ.

10, 11. నంది దేవతలనూ అనుగ్రహింపగలసమర్థుడనటానికి సర్వవిజ్ఞానరత్నాకరుడు అన్న విశేషణం సామర్థ్యమే కాదు అతనిస్వభావమే అట్టిది అనటానికి కరుణాలయుడు అన్న విశేషణం. ఈ రెండింటికీ కారణం అతడు శంకరునికి ఇష్టుడు కావడం. తా. దీ.

12. భోగమోక్షప్రదాత అనటానికి శంకరుడనీ, నియమనసామర్థ్యం చెప్పడానికి పరమేశ్వరుడనీను.

ప్రకాశిస్తున్నది. అన్య ప్రాణులు ఆయన ఆనంద లేశం పొందటంవల్లనే సర్వదా మహాసంతోషం పొందుతున్నవి. బ్రహ్మవేత్త్రసత్తములారా, ఈయన ఆజ్ఞాలేశముచేత ఆకర్షింపబడియే జగత్తు నిత్యము ప్రవర్తిస్తున్నది16-18. ఈయనను ఆత్మగా తెలియక నీవు మోహితుడవయ్యావు; అహంకారానికి లొంగిపోయావు; నీవల్ల మోహితమైనది జగత్తు 19. కనుక, నీవు భ్రాంతిని విడిచిపెట్టి స్వాత్మభూతుడైన మహేశ్వరుని ఉమాపతినే దేవతలతోసహా ఆదరంతో ఆరాధించు'' అని చెప్పాడు 20.

సూతుడు చెప్పాడు :

మునులారా, శంకరవల్లభుడు శ్రీమన్నందీశ్వరుడిలా చెప్పి రథమెక్కి శ్రీమత్కైలాస పర్వతానికి వెళ్ళాడు 21.

అటుపిమ్మట బ్రహ్మవిష్ణ్వాది దేవతలు విశ్వాధికుని, మహర్షిని, సర్వసాక్షిని, రుద్రుని ఆదరంతో పూజించారు 22. అలాగే, లక్ష్మి మొదలైన దేవీమణులు ఇతర సర్వప్రాణులు ఈశానుని పురుషుని కృష్ణపింగళుని పూజించారు23.

ఆ పైని సర్వజ్ఞుడు శంకరుడు వృషవాహనుడు, శ్రీమదంబికాపతి, ఈశ్వరుడు వీరియెదుట ప్రత్యక్షమైనాడు. బ్రహ్మవేత్తలలో ముఖ్యులు, బ్రహ్మ విష్ణు ప్రభృతులు అందరూ ఆ పశుపతిని ఈశ్వరుని చూచి నేల(బడి) దండప్రమాణం చేశారు 25. కలత దేరిన ఇంద్రియములతో మనస్సులతో శిరస్సున దోసిళ్ళుంచి ఆ భుక్తిముక్తిదాయకుని సంసారామయుని భక్తితో స్తోత్రం చేసారు 26.

దేవ దేవేశా, నీకు నమస్కారం, కరుణాలయా, నీకు నమోవాకం. సర్వప్రాణులకూ భుక్తి ముక్తి ఫలములిచ్చేవాడా, నీకు వందనం 27. సర్వలోకసృష్టిస్థితిప్రళయకారణా, నీకు నమస్సు. సంసారభీతుల సంసారభీతిని పోగొట్టేవాడా, నీకు నమస్య 28 ద్విజోత్తములు వేదవేదాంతములచేత అర్చింపదగినవాడా, నీకు ప్రణతి. శూలహస్తా, నీకు మ్రొక్కు. అగ్నిపాణీ, నీకు దండం 29. విశ్వనాథా నీకు జోత. విశ్వకారణా నీకు జోహారు, నీలకంఠా, నీకు జోహారువు. కృత్తివాసా, నీకు జోహారు 30 సోమరూపా, నీకు ప్రణిపాతం. సూర్యరూపా, నీకు ప్రణిపాతం. వహ్నిరూపా, నీకు జోహారువు 31. భూమిరూపా, నీకు నమోవచనం. వాయుమూర్తీ, నీకు కైమోడ్పు. ఆకాశరూపా, నీకుఅభివాదం. యజమానరూపా, నీకు ప్రణామం32. సత్యరూపా, నీకు చేమోడ్పు. అసత్యరూపా; నీకు అయిదుపదిసేత. జ్ఞానరూపా, నీకు నమస్కారం33. అజ్ఞానరూపా, నీకు నమోవాకం. సుఖరూపా, నీకు వందనం. అసుఖరూపా, నీకు నమస్సు. పూర్ణరూపా, నీకు నమస్య. అపూర్ణరూపా, నీకు నతి 34. బ్రహ్మరూపా, నీకు ప్రణతి, అబ్రహ్మరూపా, నీకు మ్రొక్కు. జీవరూపా, నీకు దండం. అజీవరూపా, నీకు జోత 35. వ్యక్తరూపా, నీకు

22. మహర్షి = ఋషి అంటే ద్రష్ట. శివుడు సర్వజ్ఞుడు కనుక ఈయన మహర్షి. తా. దీ.

23. శివుడు అంతర్యామి. అందరి హృదయాలలోనూ ఉంటాడు. హృదయాలు శరీరాల్లో ఉంటాయి. కనుక పూర్షు శరీరేషు శేతే ఇతి పురుషః. శరీరాలలో ఉండువాడు పురుషుడు. తా. దీ.

కృష్ణపింగళుడు = శివునికంఠం నల్లగా ఉంటుంది కనుక కృష్ణుడు. నొసలు ఎఱ్ఱగా ఉంటుంది (గోరోజనపు రంగు) కనుక పింగళుడు. తా. దీ.

జోహారు. అవ్యక్తరూపా, నీకు జోహారువు. శబ్దరూపా, నీకు ఏటకోళ్లు. అశబ్దరూపా, నీకు ప్రణిపాతం 36. స్పర్శరూపా నీకు అభివందనం. అస్పర్శరూపా, నీకు జోహారువు. రూపరూపా, నీకు నమోవచనం. అరూపరూపా, నీకు కైమోడ్పు 37. రసరూపా నీకు ప్రణామం. అరసరూపా నీకు చేమోడ్పు. గంధరూపా, నీకు అయిదు పదిసేత. అగంధరూపా, నీకు వినతి. దేహరూపా, నీకు నమోవాకం. అదేహరూపా, నీకు వందనం. ప్రాణరూపా నీకు నమస్య. అప్రాణరూపా, నీకు ప్రణతి 39. శ్రోత్రరూపా, నీకు దండం. అశ్రోత్రరూపా, నీకు జోత. త్వక్ స్వరూపా, నీకు జోహారు. అత్వక్ స్వరూపా, నీకు జోహారువు 40. దృష్టిరూపా, నీకు జోహారు. అదృష్టిరూపా, నీకు ఏటికోళ్లు. రసనారూపా, నీకు అభివందనం. అరసనారూపా, నీకు జోహారువు. 41 ఘ్రాణరూపా, నీకు నమోవచనం. అఘ్రాణరూపా, నీకు కైమోడ్పు. పాదరూపా, నీకు ప్రణామం. అపాదరూపా, నీకు చేమోడ్పు 42. పాణిరూపా, నీకు నతి. అపాణిరూపా, నీకు నమస్య, వాగ్రూపా, నీకు మ్రొక్కు. అవాగ్రూపా, నీకు దండం 43. లింగరూపా, నీకు జోత. అలింగరూపా, నీకు జోహారు. పాయురూపా, నీకు కైమోడ్పు. అపాయురూపా, నీకు చేమోడ్పు 44. చిత్తరూపా, నీకు జోహారువు. అచిత్తరూపా, నీకు ఏటికోళ్ళు. మాతృరూపా, నీకు ప్రణిపాతం. అమాతృరూపా, నీకు అభివందనం 45. మానరూపా, నీకు జోహారువు. అమానరూపా, నీకు ప్రణామం. మేయరూపా, నీకు నమోవాకం. అమేయరూపా, నీకు చేమోడ్పు 46. మితిరూపా నీకు అభివందనం. అమితిరూపా, నీకు జోహారువు. సర్వరూపా, నీకు వినతి. అసర్వరూపా, నీకు నమోవాకం 47. రక్షించు, రక్షించు, మహాదేవా, క్షమించు, కరుణాలయా భక్తహృదయసమాసీనా బ్రహ్మవిష్ణుశివస్వరూపా, 48 అని స్తోత్రంచేశారు.

సూతుడు చెప్పాడు :

ఈ విధంగా బ్రహ్మాదిదేవతలు స్తుతించి నేలపై దండంవలె (పడి) నమస్కరించి పరమేశ్వరునియందు కడముట్టిన భక్తితో ఉన్నారు. దేవదేవుడు, మహాదేవుడు, సర్వభూత హితసక్తుడు, అంబికాపతి, ఈశ్వరుడు వివశులైన దేవతలను అనుగ్రహించి 50 తన పరత్వం చక్కగా ప్రదర్శిస్తూ మహానృత్యంచేసి విష్ణ్వాదులతోపాటు శ్రీమద్వ్యాఘ్రపురం వెళ్లాడు 51.

దేవతలందఱూ భుక్తిముక్తిప్రదమైన అఖిలేశ్వరుని నృత్యం చూడగోరి శ్రద్ధతో అక్కడ ఉన్నారు. మునీశ్వరులారా, మీరు కూడా మహాదేవానుగ్రహంకోసం కృపానిధి అయిన మహాదేవుని మహాభక్తితో పూజించండి 53.

ఈ ప్రకారం సూతుడు చెప్పగా; విని మునిశ్రేష్ఠులు నైమిశీయతపోధనులు ఆత్మహిత పరాయణునికి సూతునికి నేలపై దండంవలె (పడి) నమస్కరించి 54 ఈ దేవదేవుడు, శంకరుడు, శ్రీమదంబికాపతి సర్వప్రాణులకూ పూజనీయుడని తెలుసుకొన్నారు 55.

వారి శిష్యులూ ప్రశిష్యులూ అలాగే ఇతర సర్వప్రాణులూ మహాదేవుడు సదా సర్వులకూ పూజ్యుడనియే తెలుసుకొన్నారు 56.

: ఇది శ్రీ స్కాందపురాణం శ్రీ సూతసంహితలోని శివమాహాత్మ్యఖండంలో నందీశ్వరవిష్ణుసంవాదంద్వారా ఈశ్వరప్రతిపాదనం అను మూడవఅధ్యాయం :

45, 46, 47, మితి = ప్రమ = జ్ఞానం; మితికర్తమాత; మితిసాధనం మానం; విషయం మేయం, తా. దీ.

# అచింత్య లీలా స్వరూపిణి – పరాశక్తి

కె. లక్ష్మీప్రసాద్

సృష్టితత్వమును విచారించిన అనేక ప్రశ్న లుదయించును.

విశ్వమనగా నేమి? విశ్వచాలకుడెవరు? అట్టి విశ్వచాలకుడున్నచో ఆతడు వ్యక్తియా లేక ఒక తత్వము మాత్రమా? మాయ అనగా నేమి? అను ప్రశ్నలకు వివిధ వ్యక్తులు వారి వారి అనుభవములను సిద్ధాంతరూపముగ అందించిరి. వీటియందు బుద్ధి సంతృప్తికరముగా తోచునది అద్వైతసిద్ధాంతము. వేద ఉపనిషత్ప్రతిపాదితమైన ఈ తత్వమును సాక్షాత్తుగా అనుభవింప జేసికొని జీవన్ముక్తులైన వారు కలరు. వారి జీవనమను ప్రత్యక్ష ప్రమాణమే లేనిచో కేవల సిద్ధాంతము మిథ్యగా తోచి నిరుపయోగమయి యుండును.

ఒక్కొక్కప్పుడు కేవలాద్వైత సిద్ధాంతము నంగీకరించి యనుభవించు జ్ఞానులకును, భగవంతుని వ్యక్తిగాతలచి సేవించి యానందించు భక్తులకును భేదాభిప్రాయము కలుగుచుండును. నిశ్చలతత్వము నుపాసించువారు జ్ఞానులు. సచలమైన లీలాతత్వము నుపాసించువారు భక్తులు. వారి వారి ఉపాస్య తత్వముల ఆధిక్యత నుగ్గడించుకొనుట సహజమే కదా! కాని సాధారణాచార్యుల నధిగమించి మించు మహాచార్యులయందు మాత్రమీ రెండు ప్రవాహములు గంగాయమునలవలె ఓతప్రోతమై ప్రసరించుచున్నట్లు తెలియుదుము. కేవల అద్వైత సిద్ధినంది జీవన్ముక్తులైన మహాత్ములు కూడ పరాశక్తియొక్క ఆధిక్యతను గుర్తింప వలసిన స్థితి అనేకమార్లు ఏర్పడినది. ఇంకొక మాటగా ఆ పరాశక్తి లేక సగుణలీలారూపక పరమాత్మయే అనేకానేక సాధకుల భ్రమలను తొలగించుటకని మహాపురుషులను ఉపకరణముగా చేసికొని తన నిజతత్వమును ప్రకటించి కరుణించెనని చెప్పవచ్చును.

శ్రీమత్ శంకర భగవత్పాదులను మించిన జ్ఞానిని లోకమున నెరుగముకదా! వారు అద్వైత సిద్ధాంతమును సుదృఢముగా స్థాపించుటయే కాక షణ్మత స్థాపనాచార్యులై వివిధోపాసనలను నిర్దేశించిరి. వారు చూపిన మహిమ లనేకములు కాని మాయ లేక సాకారవిశ్వము భ్రమయనియు, కేవల స్వప్రయత్నముచే అజ్ఞాన సంజనిత భ్రమను తొలగించుకొని ప్రతి జీవుడును ఈశ్వరుడు కాగలడనియు వీరి అభిప్రాయముండెడిది. అందుచే లీలావిభూతి యగు శక్తిని ఉపాసించుట ఒకప్పుడు వారికి అప్రధానముగా తోచెను. కాని భగవదవతారము లన్నియు శక్తి యొక్క ఆవిర్భావములే కదా! మరి శంకరులయందు మాత్రము శక్తి యావిర్భావము తప్ప మరేమియుండును? ఈ అపభ్రంశము నివారణమగు సమయమే తెంచెను. ఒకనాడు పరాశక్తి స్వయముగా నొక వృద్ధస్త్రీ రూపము దాల్చి శంకరులు వచ్చు దారిపై లేవ లేక పడియుండి, దీనముగా సహాయము నపేక్షించుచుండెను. శంకరులు వచ్చుసరికి తన దుఃస్థితిని వారికి చెప్పుకొని వారి కరుణనర్థించెను. శంకరులామెను స్పృశించి లేవదీయుటకు ప్రయత్నించిరి. ఆమెను తాకుట తోడనే ఆతనిలోగల ప్రభావము, శక్తియంతయు నదృశ్యమయ్యెను. ఆమెనొక యంగుళము కదల్పజాలకపోవుటయే గాక తన ప్రభావమంతరించుటగాంచి శంకరుడు నిశ్చేష్టుడై ఆమెను శక్తిగా గ్రహించి ప్రణమిల్లెను. స్తోత్రముచే ఆమె కరుణ నర్థించి తన ప్రభావమును తిరిగిపొందెను. ఇదే 'సౌందర్యలహరి'కి మూలము. ఆమె ప్రభావము

తెలియుటచేతనే "అమ్మా! భస్మధారుడు, దిగంబరుడు, జటాధారి, కపాల హస్తుడైన భిక్షుకుడు ఈ జగత్తున కధీశ్వరుడైనది నీ పాణి గ్రహణ ప్రభావము చేతనే కదా!" అనుచు శంకరులు తమ దేవ్యాపరాధస్తోత్రమున వర్ణించి నారు. వారి దేవీపదానురాగము అతిగాఢమై వర్ధిల్లినది.

అనేక శతాబ్దములకాలము తిరిగినది. పందొమ్మిదవ శతాబ్దిలోని తోతాపురి శంకరా చార్యుల (శృంగేరి) సంప్రదాయమునకు చెందిన సన్యాసి. వీరు వేదాంతసాధనచేసి నిర్వికల్ప సమాధిని పొందిన మహాజ్ఞానులు, జీవన్ముక్తులు. అతిబాల్యమునుండి సకల మాయాజాలమునుండి దూరమై తన గురుచరణ సాన్నిధ్యమునందుండు సౌభాగ్యము వీరికి ప్రాప్తించినది. శ్రీ శంకరా చార్యులచే కేవల దైవానుగ్రహ హేతుకము లని చెప్పబడిన మనుష్యత్వ, ముముక్షుత్వ, మహాపురుష సంశ్రయములు మూడును వీరికి బాల్యముననే లభించినవి. అప్పటినుండి తన ధ్యేయము వైపే దృష్టినుంచి నిరాటంకముగా నలుబదియేండ్లు పరిశ్రమచేసి నిరాకార ఈశ్వర సాక్షాత్కారము నందిరి. గుర్వనుగ్రహముచే వారికి తన మనస్సుతో అధిక సంఘర్షణ చేయ వలసిన అవసరము లేకపోయినది. ఏ మనస్సు యొక్క అనుగ్రహము లేనిచో, ఇతర అను గ్రహములున్నప్పటికి జీవుడు తరింపశక్యము కాదని చెప్పబడినదో, అట్టి దుష్టమనస్సు యొక్క జాలములో తోతాపురి ఎప్పు డును చిక్కుకొనలేదు. సంసారములోని జగడములు జంజాటములవైపు వారి దృష్టి ఒకసారి కూడ పోలేదు. స్వాభావికముగ వారు పూర్ణముగా పురుష ప్రయత్నము, ఆత్మ విశ్వాసములపైనే ఆధారితులైరి. శమద మాది సంపత్తికలిగి, శాంత ప్రకృతికలిగి విచారశీలుడై నేతి నేతి మార్గమున ఉపాధు లను వర్జించి నేను, నీవు, జగత్తు అనుభావన లను అతిక్రమించి, ప్రకృతి వికృతి శూన్య మయిన నిర్గుణ బ్రహ్మ సాక్షాత్కారమును, శాంతభక్తిని సాధించిన వీరికి వేదాంతోక్త కర్మఫలప్రదాతయైన ఈశ్వరుడు తప్ప మిగిలిన సాకార దేవీ దేవతలపై శ్రద్ధలేదు.

కాని వీరు సంచారులై దక్షిణేశ్వరము చేరు సరికి వీరి దృష్టి ఒక మూల ఈశ్వర ధ్యాన నిమగ్నులైన శ్రీ రామకృష్ణులపై బడెను. వారి భావోజ్జ్వల తేజోప్రకాశితమూ రిని గాంచగనే ఆయన అసాధారణ పురుషుడనియు, వేదాంత సాధనకు ఉత్తమ అధికారియనియు భావించి వారిచే వేదాంత సాధన చేయింప నిశ్చయించు కొనిరి. శ్రీరామకృష్ణులకీ విషయము చెప్పి "అద్వైత సాధన చేయుదువా?" అని అడిగిరి. ఆయన అమ్మనడిగి వచ్చెదననియు జగదంబ మందిరములోనికి తిన్నగాపోయివచ్చి దేవి యనుజ్ఞయైనదని చెప్పిరి. తోతాపురికది మనో దౌర్బల్యముగా తోచెను. శ్రీరామకృష్ణుల బాలక స్వభావము, జగదంబపై ఆయన సరళ నిర్భరత్వమును చూచి తోతాపురి దానిని అజ్ఞాన సంజనిత సంస్కారముగా నెంచి జాలిపడి, "సద్బ్రహ్మజ్ఞానము కలుగుట తోడనే ఈ దౌర్బల్యము పోవునని" యూరకుండిరి. శ్రీరామకృష్ణులు ప్రార్థించిన అమ్మ ఎవరు? ఆమెయే త్రిగుణమయి, పరాశక్తి, మహా మాయ.

తరువాత తోతాపురి శ్రీరామకృష్ణులకు సన్యాసమిచ్చి వేదాంతోపదేశము చేయుట తోడనే ఆయనకు నిర్వికల్ప సమాధి ప్రాప్తిం చుట, తోతాపురి ఆశ్చర్యపడి శిష్యునిపై అధిక గౌరవ మేర్పడ ఆయనకు 'పరమహంస' పదవిని

ప్రసాదించి ఆయన దివ్యసాంగత్య ఆనందమున ఆరునెలలపాటు అవిచ్ఛిన్నముగా దక్షిణేశ్వరవాసము చేయుట తెలిసినదే.

తోతాపురియొక్క శరీరప్రకృతి మిక్కిలి బలిష్ఠము, ఆరోగ్యవంతమైయుండెను. అజీర్ణమను మాటయే తెలియదు. సుఖనిద్రనుండి ఎప్పుడును ఆయన వంచితుడుకాలేదు. కాని ఉన్నట్టుండి దక్షిణేశ్వరమున ఆయనకు కడుపులో శూలనొప్పి ప్రారంభమయ్యెను. చికిత్సవలన ప్రయోజనము లేకపోయెను. ఒకరాత్రి నొప్పి అధికముకాగా నిద్రపట్టకపోయెను. ఆయన స్వయముగా బ్రహ్మైక్యము సాధించినవాడు. శరీరముతో నిమిత్తము లేకుండ సమాధియందుండుట ఆయనకు కరతలామలకము. ఆ రోజదికూడ సాధ్యముకాకపోయెను. మనసంతయు వేదనపై పే లాగుచుండెను. ఇక శరీరత్యాగము చేయనెంచి "ఈ శరీరమువలన కదా నా మనసు స్వాధీనము కాకుండనున్నది. దీనిని గంగలో త్యజించి వేసెదను. ఇక బ్రహ్మానంద ప్రవేశించుటకెట్టి ఆటంకము ఉండదు." అని గట్టిగా నిశ్చయించి, బలపూర్వకముగ మనస్సు బ్రహ్మచింతనయందు స్థిరముచేసి మెల్లమెల్లగా గంగానదియందు దిగి మునిగిపోవుటకై నీళ్ళలో నడువసాగెను. కాని ఆశ్చర్యము! ఎంతదూరము నడచినను ఒక మనిషిని ముంచగలుగు నీరే లేకపోయెను. ఇంత పెద్ద గంగానది ఈనాడు ఎండిపోయినట్లుండెను. ఇదెట్లు జరిగినది? శ్రీ తోతాపురి నడచి నడచి దాదాపు గంగానది ఆవలి యొడ్డునకు చేరెను. కాని మునుగుటకు తగిన నీరే లేకపోయెను. క్రమముగా అవతలి గట్టుపైనున్న గృహములు, వృక్షములు కన్పించసాగెను. "ఇదేమి ఈశ్వరలీల? గంగానదిలో నీరులేక పోవుటయా?" అని తోతాపురి విచారించుచుండ అకస్మాత్తుగా లోపలినుండి ఎవరో ఆయన బుద్ధియొక్క ఆవరణమును దూరముగా తొలగించి వేసినట్లయ్యెను. ఆయన అంతఃకరణమున ఒక దివ్యప్రకాశము కలిగెను.

"ఇదంతయు ఆ జగదంబ, విశ్వజనని, అచింత్య శక్తిస్వరూపిణి, మహామాయ యొక్క విలాసము. అంతయు ఆమె లీలయే. జలములో, స్థలములో, కఱ్ఱలో, రాళ్ళలో, సర్వత్ర అదే మహామాయ అదే జగదంబ. ఆమెయే శరీరము మనస్సు; సుఖము, దుఃఖమును ఆమెయే, జ్ఞాన అజ్ఞానములు, జ్ఞేయము అజ్ఞేయము, దృశ్యము అదృశ్యము సమస్తమును ఆమెయే. అఘట నఘటనాపటీయసి ఆమె, సర్వసామర్థ్యములకు మూలమామెయే. ఆమె ఇచ్ఛలేనిదే ఆమె మాయనుండి ఎవరికిని విడివడుట సాధ్యము కాదు. ఆమె ఇచ్ఛలేనిదే మరణించుశక్తి కూడ ఎవనికిలేదు. ఇంతకాలమునుండి బ్రహ్మమని దేనిని చింతించుచున్నానో అదే ఈ జగదంబ. శివుడు, శివశక్తి ఏకము."

అర్ధరాత్రి సమయము. అమావాస్య అంధకారము. సర్వజగత్తు శాంతముగ నుండెను. చీమ చిటుకుమను శబ్దముకూడ లేదు. శ్రీ తోతాపురి ఆ గంగానదియందు నీరులేని అపూర్వస్థితియందు - శ్రీజగదంబయొక్క అచింత్య లీలలను చింతించుచు నిలబడియుండెను. ఇంతలో ఆయనకు సహస్ర సూర్యప్రకాశమానమై చిరునవ్వు చిందించుచు, ఎక్కడ చూచిన నక్కడ ఆ సువిశాలాకాశమున అన్ని దిక్కులయందు జగదంబ దర్శనము కావొదగెను. "జయ జగదంబే, జయజగదంబే" అని జయఘోష చేయుచు తనకుతానే ఆమె చరణములయందు సర్వవిధముల ఆత్మసమర్పణము చేసికొనెను. ఆమెకు శరణాగతుడయ్యెను. వెళ్ళిన విధముగనే నీళ్లను చీరుకొనుచు

గంగలో నడచుచునే తిరిగి ఈవలి ఒడ్డునకు చేరెను. పంచవటి యందలి తనస్థానమునకు వచ్చి చేర ఆయనకు శరీర కష్టము కొంచెము కూడ స్ఫురణ లేకపోయెను. మనస్సున కూడ ఒకవిధమైన అపూర్వశాంతి కలిగెను. ఆ రాత్రి యంతయు ఆయన శ్రీ జగదంబ నామస్మరణ, జపధ్యానములలో గడపిరి

ప్రభావితమగుచుండగనే శ్రీరామకృష్ణులు వచ్చి చూడ తోతాపురి ముఖమండల మంతయు ఆనంద ప్రఫుల్లితమయి కన్పించెను.

శ్రీరామకృష్ణులు దరిచేరగానే తోతాపురి యిట్లనెను. "నాయనా! ఈ రోగమే నా బంధువయి నిన్నరాత్రి నాకు శ్రీ జగదంబ దర్శనము చేయించినది. ఇన్నిరోజుల అజ్ఞానము దూరమయినది. ఇదంతయు ఆమె లీలయని నాకు విదితమయినది. నా కన్నులు తెరిపించుటకే ఆమె నన్నిన్నాళ్ళు కట్టయుంచినది. ఆమెఇచ్ఛ లేనిదే కదలుట సాధ్యమా!"

ఉదయమున శివుడు, రాముడు అన్నట్లు తోచు ఆ గురుశిష్యసంబంధబద్ధులయిన ఇద్దరు మహాపురుషులు లేచి శ్రీజగదంబ మందిరమునకుపోయి ఆమె చరణములయందు సాష్టాంగ ప్రణామము చేసిరి. ఇప్పటికి తోతాపురికి దక్షిణేశ్వరమునుండి పోవుటకామె యనుజ్ఞ యిచ్చినట్లు వారిరువురికి తోచెను.

ఈ విధముగా జగదంబ తన విశేష కృపచే తోతాపురివంటి పూర్ణజ్ఞానిని నిమిత్తముగా గైకొని లోకమునకు తన మహిమాతిశయమును తెలియజేసినది. 'సైషా ప్రసన్నా వరదా నృణాం భవతి ముక్తయే'. ఆమె ప్రసన్నయైననే ముక్తిలభించునని శ్రీరామకృష్ణులు వచించువారు.

శ్రీరామకృష్ణుల ప్రధాన శిష్యులులైన శ్రీమత్ వివేకానందస్వాములవారు ఎంతటి మహాజ్ఞానియో అంతటి మహాభక్తులు. వారికి గుర్వనుగ్రహముచే నిర్వికల్ప సమాధి ప్రాప్తించుటయేగాక జగజ్జనని దివ్యసందర్శనమనేకసార్లు జరిగినది. కన్యాకుమారి యందు జగన్మాతృపాదముల ముందర దేవి ధ్యానమున నుండగనే ఆయనకు భారత దేశమునకు పూర్వపుటాధ్యాత్మిక ఉన్నతిని తిరిగి కల్పించి ఆ దేశపు ధార్మిక సంస్కృతిని ప్రపంచమునకు వ్యాపింపచేయుటకొరకు ఆదేశ లభించె. ఈ ఆదేశానుసారముగనే వారు భారతీయుల ధార్మిక, ఆధ్యాత్మిక ఉన్నతికై పాటుపడ నిశ్చయించుకొనిరి. వారి లోకోద్ధరణ కార్యము పూర్తియగు సమయమే తెంచినదనగా జగదంబ వారికి మరొక విలక్షణ దర్శనమునను గ్రహించినది.

పాశ్చాత్య దేశములనుండి తిరిగివచ్చిన తరువాత కొంత కాలమునకు అమరనాథ యాత్రచేసి తిరిగి వచ్చుచు వివేకానందస్వామి కాశ్మీరులోని క్షీరభవాని దేవి ఆలయమునకు పోయి అచట ఏకాంతముగ వారము రోజులు గడపిరి. ఇది సుప్రసిద్ధ క్షేత్రము. స్వామి ఇచట దేవినర్చించుచు, మందిరమున ప్రతిదినము హోమము చేసి అమ్మవారికి క్షీరాన్నము వండి నివేదనచేసి సామాన్యునివలె అతి నమ్రభావముతో జపము చేయుచుండువాడు. ప్రతి ఉదయము ఒక బ్రాహ్మణ పండితుని చిన్న కుమార్తెను ఉమాకుమారిగా భావించి కుమారీపూజ చేయువాడు. తానొక జగత్ప్రసిద్ధ ఆచార్యుడు, ఆధ్యాత్మిక నాయకుడు, వక్త అను ఆలోచనా లేశము కూడ లేకుండ, సమస్త ఆచ్ఛాదనలను విచ్ఛిన్నముచేసి జగదంబ శిశువువలె నుండి ప్రార్థనము సలుపువాడు.

ఒకరోజు స్వామి, చిన్మయమైన జగదంబ మందిరమునకు పూర్వపు మహమ్మదీయ దురాక్రమణవల్ల కలిగిన శిథిలావస్థ గురించి యాలోచించుచుండెను. హృదయమున వేదన నంది "ఆ నాటి ప్రజలీ దుష్కార్యమును ప్రాణములొడ్డి ఎదిరించకుండ యెట్లుండగలిగిరి! నే నపుడక్కడ ఉండినచో ఆ పని జరగ నిచ్చెడి వాడనా! అమ్మ మందిరము కాపాడుటకై ప్రాణముల నర్పించెడివాడను." అని తలపోయుచుండెను. ఇంతలో దైవవాణి వినిపించెను. స్వామి నిశ్చేష్టుడగునట్లుగా అమ్మ స్వయముగా నిట్లు పలికెను. "నా స్తికులు నా ఆలయమును ప్రవేశించి అపవిత్రము చేయనెంచినచో నే మయినది! దానివలన నీకు వ్యథ ఎందులకు? నీవా నన్ను రక్షించు వాడవు లేక నేనా నిన్ను కాపాడుదానను!" స్వామి అభిప్రాయములు తలక్రిందు లయ్యెను. మరియొకరోజు అదే ఆలయమున అమ్మను పూజించుచుండ స్వామి హృదయమున, ఆ శిథిలాలయ స్థానమున ఒక పెద్ద నూతన ఆలయము కట్టించవలెనను తీవ్రమైన కోరిక కలిగెను. అంత దేవిమాట మరల వినిపించెను. "నాయనా! నేను సంకల్పించిన అసంఖ్యాక మఠములను, దేవాలయములను బడయగలను. ఈ క్షణముననే ఇచట ఏడంతస్థుల బంగారు మందిరము నిర్మింపజేయగలను." అమ్మ మాట వినుట తోడనే మాయా అవనిక విచ్ఛిన్నమై స్వామికి సర్వము జగన్మాత అధీనముగా తోచెను. సర్వభావములు ఆమెయందు లీన మయ్యెను. "నా ఊహాలన్నియు గతించినవి. కార్యసంరంభము సమసిపోయినది. ఇక సకలము 'అమ్మ', 'అమ్మ' మాత్రమే. అన్ని ఆమె ఇచ్ఛప్రకారమే జరుగుగాక. నేను కేవల ఆమెను స్మరించుచుందును." అని స్వామి యాత్రనుండి తిరిగి వచ్చిన పిదప నివేదితాది శిష్యులతో పలికెను. ఈ క్షేత్రమున స్వామికి దేవి అనేక రూపముల దర్శన మిచ్చెనట. నవయుగాచార్యుడు, మహాభక్తాగ్రేసరుడు, అసమాన జ్ఞానాచార్యుడై అపర శంకరాచార్యులనదగు వివేకానందుల అనుభవమిది.

పరాశక్తి వైభవమును వెల్లడించు పాట శ్రీ రామకృష్ణులు తరచు పాడుచుండువారు.

సకలి తోమార ఇచ్ఛా, ఇచ్ఛామయి తారాతుమి,
తోమార కర్మ తుమికరోమా, లోకేబోలే కరి అమి,
పంకేబద్ధ కరేకరి, పంగురే లంఘా ఒగిరి,
కారే దాఒమా బ్రహ్మపద, కారేకరి అధోగామి.
అమియంత్ర తుమియంత్రి, అమిఘరతుమి ఘరణి
అమి రథ తుమి రథి, యేమని చలాఒ తేమని చలి.

"అమ్మా! సకలము నీ ఇచ్ఛయే, నీవు ఇచ్ఛామయివి నీవేమో నీ కర్మలు చేయుచుందువు. లోకులు తాము చేయుచున్నామనుకొనుచుందురు. నీవు తలచినచో కుంటివానిచే కొండలు దాటించగలవు. అల్పునికి బ్రహ్మజ్ఞాన మీయగలవు. అమ్మా! నేను యంత్రమును, నీవు యంత్రచాలకురాలవు. నేను ఇంటిని, నీవు యజమానివి. నేను రథమును, నీవు రథికవు. నీ వెట్లు నడపించిన అట్లు నడతును."

# సంసార కాననం

సదాశివం

ఒకానొక మహారణ్యంలో ప్రయాణం చేయవలసిన దౌర్భాగ్యం దాపురించింది ఒకనికి. అతడా అరణ్యంలో పోతుండగా ఒక దుర్గమమైన ప్రదేశం ఎదురైంది. భీకరంగా గర్జించే సింహాలు పులులు ఏనుగులతో నిండి ఉంది ఆ [illegible]. ఆ దృశ్యం చూసేసరికి వానికి ఒళ్ళంతా చెమటలు పట్టింది, నోట తడి ఆరిపోయింది. వెంట్రుకలు నిక్కబొడుచుకొన్నాయి. అమిత భయంవలన తోచక అటు ఇటు ఆ అడవిలో పిచ్చిగా పరుగెత్తాడు. తప్పించుకుపోవడానికి ఎక్కడా సందు దొరకలేదు. ఆ వనప్రదేశమంతా పెద్ద పెద్ద వలలతో నాలుగువైపులా చుట్టబడి ఉంది. అంతలో ఒక పరమ ఘోరాకారమైన ఒక స్త్రీ అతనిని గట్టిగా కౌగలించుకొన్నది. ఆ పట్టును ఎట్లో విదిలించుకొని చూసేసరికి చుట్టూ పర్వతాలవంటి పెద్ద పెద్ద ఐదు తలల ఏనుగులు గుమికూడాయి. వాటి బారినుండి తప్పించుకొనే ప్రయత్నంలో అతడు తృణాచ్ఛాదితమైన ఒక లోతైన బిలంలో తలక్రిందులుగా పడిపోయాడు. అక్కడ, పైనుండి క్రిందకు శాఖోపశాఖలుగా వ్యాపించి ఉన్న తీగలవృక్షంయొక్క తీగెలలో తగుల్కొని పైన పాదములు క్రింద తలగలిగి వ్రేలాడుచుండెను. అక్కడైనా అతని ఉపద్రవాలకు అంతం కలిగిందా అంటే అదీ లేదు. లోపల బిలంలో ఒక భయంకరమైన పెద్ద నాగుబాము పడగెత్తియుండుటను అతడుచూశాడు. భయంతో అటువైపునుండి చూపులు త్రిప్పించి పైకి సారించాడు. అప్పుడతనికి ఆ కూప పైభాగంలో ఒక భయంకరమైన ఆఱు తలల పన్నెండు పాదముల ఏనుగు తెలుపు నలుపు వర్ణములు గలది కనిపించింది. అంతేగాక తాను ఏ తీగల వృక్షంలో తగుల్కొని వ్రేలాడుచున్నాడో ఆ తీగల వృక్షం యొక్క మొదళ్ళను చిత్రమైన మూషికములు తెలుపు నలుపు వర్ణములు కలవి కటాకటా శబ్దము చేయుచు కొఱికివేయుచుండుటనుకూడ చూచినాడు. ఆ శాఖోపశాఖలైన తీగలను ఈ వఱకే ఆశ్రయించియుండిన లెక్కలేనన్ని పెద్ద పెద్ద తేనెటీగలు అతనిని ముసురుకొని చిత్రవధ చేయడానికి ప్రారంభించాయి. ఆ తేనెటీగలు సమకూర్చి ఉంచిన తేనెధారలు ఆ శాఖోపశాఖలనుండి ధారగా స్రవించుచుండినవి. ఆ మధుధారలను వాడు దోసిలిలో పట్టి పట్టి త్రాగుటలో నిమగ్నుడైనాడు. ఎంత త్రాగినా అతని తృష్ణ చల్లారలేదు. అతృప్తి అంతరించలేదు. దుర్భరమైన ఆ దైన్యస్థితిలో పడిఉన్నా ఆ మధుపాన నిమగ్నతవలన అతనికి జీవితంఎడల వైరాగ్యం జనించలేదు.

అడవిలోని ఆ క్రూరమృగాలు, ఆ ఘోరాకారమైన స్త్రీ, కూపంలోపల ఆ భయంకర సర్పం, కూపం ఒడ్డున ఆ అతిఘోరమైన ఏనుగు, ఆ ఎలుకల బెడద, ఆ తేనెటీగల చిత్రవధ - ఈ ఆఱు భయాలనుండి తప్పించుకొని బయటపడే ఉపాయం అతనికున్నదా ! ఉన్నది.

ఈ కథనం ఉపమానంగా చెప్పబడింది. జీవుని సంసారమునకు ఉపమానంగా ఇది మోక్షవేత్తలచే చెప్పబడింది. సంసారమును మహారణ్యంతో వారు పోల్చారు. దుర్గమమైన ఆ కాంతారస్థలమే సంసారంలో మాటి మాటికి ఎదురయ్యే సమస్యలు. క్రూర మృగములనునవియే వ్యాధులు. ఆ ఘోరాకార

మైన స్త్రీయే మానవుని రూపాన్ని, దేహ కాంతిని నశింపజేసే ముసలితనం. ఆ కూపమే జీవుని శరీరం. ఆ పెద్దపామే, కాలుడు అంత కడు సర్వాపహారి అనే పేర్లతో పిలువబడే మృత్యువు. ఆ తీగలవృక్షమే జీవితాశ. ఆ కూపం ఒడ్డున ఉన్న ఏనుగే సంవత్సరం. దాని ఆఱు తలలు ఆఱు ఋతువులు, దాని పన్నెండు పాదములు పన్నెండు మాసములు. ఆ మూషికములే అహోరాత్రములు. ఆ ముసురుకొన్నటువంటి తేనెటీగలే వివిధమైన కామనలు. జాలువారుచున్న ఆ మధుధారలే కామరసములు. ఆ కామరసములను ఆస్వాదించుటయందే మునిగియుండునంతవరకు అతనికి సంసారమునుండి ముక్తిలేదు. వైరాగ్యము జనించి ఎన్నడు ఆ ఆస్వాదించుటను వదలిపెట్టునో అప్పుడే అతనికి ముక్తికి మార్గము కనపడును.

(మహాభారతంలోని స్త్రీ పర్వంనుండి.)

# గ్రంథపరిచయము

## గీతావ్యాసములు (ద్వితీయ సంపుటము) :

ఆంగ్లమూలము : శ్రీ అరవిందులు, ఆంధ్రానువాదము : శ్రీ చెలగానినాగేశ్వరరావు, పేజీలు 412, వెల : 12-00, ప్రాప్తిస్థానము : శ్రీ అరవిందసొసైటి, బోసురోడ్డు, తెనాలి—522201.

శ్రీ అరవిందులు భగవద్గీతపై వ్యాఖ్యవ్రాసి రెండు సంపుటములుగా ప్రచురించిరి. ప్రథమ సంపుటములో గీతయొక్క ప్రథమ షట్కమునకు, రెండవ సంపుటములో గీతయందలి ద్వితీయ, తృతీయ షట్కములకు వ్యాఖ్యానము గలదు. ఈ మూడు షట్కములు కర్మ, భక్తి, జ్ఞానములకు చెందిన విచారణ యని అందరకు తెలిసినదే.

సర్వకాలములకు, సర్వదేశములకు, సర్వజనులకు ఉపయోగపడు శ్రేయమైన జీవన విధానమును మహోన్నతముగా ప్రబోధించు అద్వితీయ గ్రంథరాజము భగవద్గీత. గీతలోని పురుషోత్తమ తత్త్వరహస్యమును విశదీకరించి యందుండు ప్రాశస్త్యమును లోకమునకు వెల్లడిచేసిన ప్రప్రథములు శ్రీ అరవిందులు. సర్వద్వంద్వములను సమన్వయపరచి సామరస్యమును ఐక్యతను ప్రసాదించుచున్నదీపురుషోత్తమని తత్త్వము. త్రిపురుషులను గుఱించిన గీతలోని 15వ అధ్యాయమునకు, ఆత్మసమర్పణ, స్వభావ స్వధర్మములను గుఱించిన 18 వ అధ్యాయమునకు శ్రీ అరవిందులు గావించిన వ్యాఖ్యానము అసమానముగ నున్నది.

శ్రీ చెలగాని నాగేశ్వరరావుగారు గావించిన ఈ రెండవ సంపుట అనువాదము మొదటి సంపుట అనువాదమువలె శోభాయమానముగ నున్నది. వీరిశైలి ప్రౌఢముగను, మధురముగ నున్నది. వీరు శ్రీ అరవిందుల గీతావ్యాసముల అనువాదము నొక యజ్ఞముగా నడిపినారు. యజ్ఞప్రభువైన శ్రీకృష్ణభగవానుడు వీరికి దివ్యజీవనఫలము ప్రసాదింతురుగాక!

—టి. కోదండరామ రావు.

## శ్రీ మచ్ఛంకర భగవత్పాదచరిత్ర :

రచన: డా. పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి, పేజీలు : 554. మూల్యము : 15-00.

శంకరభగవత్పాదులు తన రచనలందు తనను గుఱించి ఏమీ చెప్పుకొనలేదు. ఆయన

రచనలందు 'నేను' అన్న పదప్రయోగమే చాల అరుదుగా కనబడుతుంది. కొంత ప్రకటంగా 'నేను' అని చెప్పుకొన్నది తైత్తిరీయోపనిషత్ భాష్యంలో 'అతో జేష్యామి సర్వాన్. ఆరభే చ చింతాం'-అని అన్నప్పుడు మాత్రమే. ఆయన ప్రత్యక్ష శిష్యులు ఏమైనా ఆయనను గురించి చెప్పారా అంటే అదీ లేదు. 'మా అజ్ఞానచీకటిని పారద్రోలిన జ్ఞాన భాస్కరుడగు మా గురువుకు నమస్కరిస్తున్నాం' - అన్న అర్థం స్ఫురించేటటువంటి శ్లోకాలు మాత్రమే కొన్ని గురుస్తుతి పరమైనవి వారు చెప్పియున్నారు. అంతే. ఆయన దగ్గర కొంత చదువు సంపాదించిన శిష్యులెవరైనా ఆయన జీవిత విశేషాలను గురించి కుతూహలంతో ఒకవేళ ప్రశ్నించి ఉంటే ఆయన మందహాసం చేస్తూ ఇలా సమాధానం చెప్పిఉండేవారేమో: 'ఈ విషయాలను తెలిసికొనుటవలన నీవు సాధించబోయే పురుషార్థమేమున్నది? ఏమీలేదు. కాబట్టినీవు ప్రశ్నించదలచుకొంటే ఇట్లు ప్రశ్నించు: 'కథం బంధః? కథం మోక్షః? కా అవిద్యా? కా విద్యా?'

ఇప్పుడు ప్రపంచంలో ఉన్న శంకర విజయాలు, ఆయన వెళ్ళిపోయిన అయిదారు వందల సంవత్సరాల తరువాతనే ఒక్కొక్కటిగా లభింపబడినాయి. ఇవి ఆయన కాలానికి ఎంత దూరమో సత్యానికీ అంతే దూరమనుటకు జంకవలసిన అవసరం లేదు. ఆచార్యులు ఎక్కడ అవతరించారు? ఎక్కడ పరమపదించారు? ఎన్నేండ్లు భూమిపై సంచరించారు? అన్న ముఖ్య విషయాలలోనే ఏకాభిప్రాయం ఈ శంకర విజయాల్లో లేదు.

డా. పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, ఆచార్యుని గురించి వ్రాయబడిన అనేక గ్రంథాలను పరిశీలించి, పరిశోధనాత్మక పద్ధతిలో ఈ జీవితచరిత్రను వ్రాసియున్నారు. శంకరవిజయాలు, అవతారసమయము, గోవిందుని శిష్యుడు, కాశీవాసము, అద్వైత విజయము, కాంచీనివాసము, దిగ్విజయము, మతామ్నాయము, మహానుశాసనము, శాంకర దర్శనము అను పది శీర్షికలక్రింద మొత్తము గ్రంథమును శ్రీ శాస్త్రిగారు చక్కగా రచించియున్నారు. సందర్భానుసారంగా శంకరాచార్యుల అనేక శ్లోకాలను కూడ తాత్పర్యంతోసహా పొందుపరచియుండుట, ఈ గ్రంథము యొక్క విశిష్టతను ఇనుమడింప జేసినది. ఆచార్యశంకరుని జీవితముపై ఇంతవరకు వెలువడిన తెలుగు గ్రంథములలో బహుశః ఇది ప్రథమస్థానము నాక్రమించవచ్చును.

### భావనోపనిషత్ :

వ్యాఖ్యాత: దువ్వూరి నరసింహమూర్తి, 143, వెల. 5-00.

'భావనోపనిషత్తునందలి నిగూఢ భావములను బాగుగ వివరించి 'సర్వాత్మభావ సామ్రాజ్ఞి' అను వాఖ్యను తెలుగులో వ్రాసి సమర్పించిరి. మేమీ వాఖ్యను చూసి సంతసించినాము' అని జగద్గురువులు శ్రీ శృంగేరి పీఠాధిపతులు శ్రీ మదభినవ విద్యాతీర్థ స్వామివారు ఈ గ్రంథకర్తను ఆశీర్వదించియున్నారు గనుక భావనోపనిషత్తును గురించి తెలిసికొనదలచుకొన్నవారికి ఇది మిక్కిలి ఉపయుక్తమగును.

పై రెండు గ్రంథముల ప్రతులకు: సాధనగ్రంథ మండలి, తెనాలి - 522201.

### శ్రీ కృష్ణగీతా :

పేజీలు: 190, మూల్యము: 4-00.

### శ్రీ భగవన్నామ మహిమ :

పేజీలు: 124, వెల: 3-00.

**ఒకడే దేవుడు :**

పేజీలు : 96, వెల : 8.00.

పై మూడు గ్రంథముల రచయిత: కాశావజ్ఝల రామకోటిశాస్త్రి, ప్రతులకు: కాశావజ్ఝల రామకోటి శాస్త్రి, మార్కాపురం—523316.

శ్రీ. శ్రీ. విశ్వనాథ సత్యనారాయణగారు ఒకడే దేవుడు అన్న పుస్తకంపై వెలిబుచ్చిన అభిప్రాయం తక్కిన పై రెండు గ్రంథాలకు కూడ చక్కగా అన్వయిస్తుంది. ఆయన కాశావజ్ఝలవారికి 5-8-76 లో ఈ విధంగా వ్రాశారు. 'అయ్యా, మీ "ఒకడే దేవుడు" అన్న గ్రంథం నాకు చేరినది. వెంటనే సుమారు రెండు గంటలు మీ గ్రంథమునే చూచుచున్నాను. మీరు చక్కని పండితులు. శాస్త్రములు, వేదములు, శిక్ష, వ్యాకరణము, ఉపనిషత్తులు చక్కగా చదివినవారు. చక్కగా అర్థము చేసికొన్నవారు. అద్వైత మతానుసారముగా మీ గ్రంథము చక్కగా నిర్వహింపబడినది. ఒక్కటే కొఱత - ఈ రోజులలో యింత పాండిత్యమెవరికి కావలయును. మీ గ్రంథము చదివి తెలిసికొనెడి వారి సంఖ్యయే చాల స్వల్పముగా నుండును. నేను చాల ఆనందించితిని. కలికాల మెంత ముదిరినా మీ వంటివారుండుచునే యుందురు.'

**శ్రీ లలితాస్తోత్ర రత్నాకరము :**

పేజీలు: 143, వెల: 10.00, ప్రతులకు: ఆర్. వెంకటేశ్వర్ అండ్ కంపెనీ, 11-సి, అంపర్‌సన్ వీధి, లోన్ స్క్వేర్, మద్రాసు—1.

ఇందులో పూజావిధానం, స్తోత్రమాహాత్మ్యం, శ్రీ లలితాసహస్రనామస్తోత్రం, నామపారాయణఫలశ్రుతి, నామావళి, లలితాత్రిశతీస్తోత్రం, దేవీనామాదిస్తోత్రములు కలవు. స్తోత్రమాహాత్మ్య 'కాలకు ఫలశ్రుతి శ్లోకాలకు సులభశైలిలో తాత్పర్యముకూడ కలదు.

—సదాశివం.

గురుమహారాజా - పరమాత్మా
పరమానందతేజా - పావననామా ॥

ధరణి ధర్మము స్థాపన సేయగ
పావనరూపము దాల్చిన సదయా
నీ పదములనే నిరతము గొల్తుము
పాపము లెల్లను - బాపవే - బ్రోవవే ॥

రాముడ వీవని - కృష్ణుడ వీవని
ప్రేమయే జీవిత - పరమార్థంబని
మానవసేవయే - మాధవ సేవని
ఈ మహి చాటియు - మహిమలు జూపిన ॥

పరమార్థార్థివై పరమహంసవై
వరసతి శారదమాయనుగూడి
వరహితకార్యము జరిపిన నిన్నే
శరణని కొల్తుము - కరుణించుము ప్రభూ ॥

# బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## లక్ష్మీనారాయణ మార్వాడీ

శ్రీరామకృష్ణుని దగ్గరకు అనేకమంది వస్తూయుండేవాళ్ళు. వారిలో పెద్దవాళ్ళూ ఉన్నారు. స్కూలు, కాలేజీ పిల్లలు ఉన్నారు. ఉద్యోగస్తులు ఉన్నారు. ధనవంతులూ ఉన్నారు. కొన్ని కొన్ని సార్లు వాళ్ళ శ్రీరామకృష్ణుని దగ్గర భోజనం చేస్తుంటారు. ఆ ఖర్చులు కొందరు భక్తులు భరిస్తూయుంటారు.

ధనికులైన భక్తులలో ఒక వ్యాపారస్తుడున్నాడు. అతడు మార్వాడీ. పేరు లక్ష్మీ నారాయణుడు. అతనికి ఒక ఆలోచన కలిగింది. "రామకృష్ణునకు కొంత డబ్బు యిస్తే ఆయన ఖర్చులకు పనికివస్తుంది గదా!" అని అనుకున్నాడు. ఒకరోజు శ్రీరామకృష్ణుని దగ్గరకు వెళ్ళి నప్పుడు పదివేలరూపాయలు తీసుకువచ్చాడు. ఇలా చెప్పాడు "స్వామీ! ఈ డబ్బు మీ దగ్గర పెట్టుకోండి. మీ ఖర్చులకు పనికివస్తుంది" శ్రీరామకృష్ణుడు దానికి ఒప్పుకోలేదు. అతడు మళ్ళీ బలవంత పెట్టుతూ "ఇది మీ పేరులో బ్యాంకిలో వేస్తాను. అప్పుడు ఆ డబ్బు కాపాడటం బాధ్యత మీకు వుండదుగదా!" అన్నాడు. శ్రీరామకృష్ణులు యిలా బదులు చెప్పినారు "నాకు వద్దు. బ్యాంకులోయున్నా దానిమీద నాది అనే ఆలోచన వుంటుంది. ఈ మాట నా తలమీద పెద్ద దెబ్బ కొట్టినట్లుగా యున్నది." లక్ష్మీనారాయణ మార్వాడీ యెంత చెప్పినా ప్రయోజనం కలుగలేదు.

అతనికి యింకో ఆలోచన తట్టింది. శారదాదేవికి యిస్తానన్నాడు. రామకృష్ణుడు కూడా ఆమెను పరీక్ష చేద్దామనుకున్నాడు. శారదాదేవిని తన గదికి పిలిపించాడు. ఆమెతో యిలా చెప్పాడు. "చూడు, ఈ మార్వాడీ పదివేల రూపాయలు యిస్తానన్నాడు. నా సంగతి నీకు తెలుసు. ఒంటిమీద గుడ్డకూడ జాగ్రత్తచెయ్యటం నాకు చేతకానిపని. అందువల్ల ఈ డబ్బు నీ దగ్గరయుంచుకో. ఖర్చులకి పనికివస్తుంది." శ్రీ శారదాదేవి రామకృష్ణునికన్న ఎక్కువ వైరాగ్యం కలది. చాల సూక్ష్మగ్రహి. వెంటనే యిలా సమాధానం చెప్పింది. "నా దగ్గరయున్నా, మీదగ్గరయున్నా ఒకటే. అది మీకే చెందుతుంది. కావున నేను తీసుకోను."

"వలదు వలదది మనకది వలదు వలదు
త్యాగమూర్తులు వైరాగ్యధనులు మీరు
నాకు చెందినదెల్లను మీకు చెందు
కాన ఈతని ధనము గైకొనను నిజము."

సంపాదకులు : స్వామి తన్మయానంద.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600 021) న ముద్రింపబడి.

స్వామి తన్మయానందవారిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600 004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ కథామృతము

నేడే కొనండి! (ప్రథమ భాగము) పదేపదే చదవండి!

శ్రీ "మ.—" చే వంగభాషలో విరచితమైన మూలగ్రంథమునుండి అనూదితము. నవభారత నిర్మాతయగు శ్రీ వివేకానందస్వామికి శ్రీరామకృష్ణ పరమహంస గురుదేవుడు. ఆ పరమహంసదేవుని దివ్య వచనామృతమును శ్రీ "మ.—" ఆనంద తన్మయతతో తాను వినినది వినినట్లుగ ఐదు భాగములుగ గ్రంథస్థ మొనర్చెను. అందు ప్రథమ భాగమిది.

ఆ అవతారమూర్తియొక్క వచనములు ఈ పుటలయందు మనస్సును పూర్తిగ ఆకట్టుకొనునట్లుగ అనువదింపబడినవి. వీనిలో పరిష్కరింపబడని తత్త్వవిషయిక సమస్యలేదు, తొలగింపబడని ఆధ్యాత్మిక సంశయము లేదు. వివరింపబడని ఆత్మవికాసక విషయములేదు. ఆసక్తికరము. ఆధ్యాత్మికులకు ఒక వరప్రసాదము.

వెల : సాదా : రూ. 8-00

పుటలు : 240 + VIII ప్రథమ ముద్రణము కాలికో : రూ. 12-00

# రామకృష్ణ జీవిత చరిత్ర

రచయిత : శ్రీ చిరంతనానందస్వామి

వంగభాషలోని మూలప్రమాణ గ్రంథముల ననుసరించి రచింపబడినది. ఇందు శ్రీ రామకృష్ణుని జీవితాంశములు మృదుమధురమగు తేటతెనుగున సమగ్రముగ వివరింపబడినవి. ఢిల్లీ సాహిత్య అకాడెమీ వారిచే ఉత్తమోత్తమ గ్రంథముగ నిర్ణయింపబడినవి.

శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర ఆద్యంతము ఆత్మవైభవమే. దివ్యవైభవమే. ఇదియొక దైన కావ్యము. ఇంకొకదెవ చరిత్రము వెరసి తత్త్వ సంహిత. లేక దివ్య కావ్యము. ఈ శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర శారదాకంఠమున ఓంకారఘంట ; రోమాంచముల పంట.

—శ్రీ వేలూరి శివరామశాస్త్రి.

....విమర్శక చక్రవర్తి....కీ. శే. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి శ్లాఘామోదములనందిన మీ పూర్వ గ్రంథముల విధి రచనావైదగ్ధ్యమున....మించియున్నది. విషయౌదాత్త్యము రచనౌదాత్త్యముగా పరిణమించుట స్వాభావికమే కదా సిద్ధహస్తుల చేతులలో !

—శ్రీ కందుకూరి మల్లికార్జునం.

It is bound to communicate to the reader the beauty and power of Sri Ramakrishna's life.

—Sri S. Radhakrishnan.

Classic...authentic...It will be a very valuable addition to the Telugu literature.

—The Hindu.

పుటలు : 478 + XXX వెల : రూ. 10-00

---

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూర్, మద్రాసు-600 004.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 35 1978 ఆగస్టు సంచిక 8

## విషయసూచి




రామకృష్ణ ప్రభ

సంవత్సర చందా: రూ. **7-00.** జీవిత చందా: రూ. **100-00.**

విడి ప్రతి: **70** పైసలు.

శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు

మద్రాసు - 600 004.

# శ్రీమత్ స్వామి రామకృష్ణానంద మహరాజ్
# జయంతి మహోత్సవ కార్యక్రమము

1-8-78 : తిథిపూజ, ఉదయము 8 గం. నుండి 11 గం. వఱకు
(విశేషపూజ హోమము మొదలగునవి)

1-8-78 : సా. 6-30 గం. (ఆరతి తరువాత) ఉపన్యాసములు జరుగును.
వక్తలు : స్వామి నందనానంద, స్వామి ఆత్మస్థానంద, స్వామి బుధానంద

2, 3, 4, 5 తేదులందు సా. 5-30 గం. శైవసిద్ధాంతముమీద చర్చలు జరుగును. శ్రీయుతులు దేవసేనాపతి, రత్నసభాపతి, అరుణాచలం, గణపతులు వరుసగా ఆంగ్లమునందును; శ్రీయుతులు జగన్నాథన్, రామన్, మురుగవేల్, సుబ్రమణ్యములు వరుసగా తమిళమునందును ఉపన్యసింతురు.

6-8-78 : ఆదివారము బహిరంగసమావేశము జరుగును. సా. 4-30 నుండి 5-30 గం. వఱకు భజనలు శ్రీ రామస్వామిభాగవతర్‌చే నిర్వహింపబడును. తరువాత 5-30 నుండి 7-00 వఱకు ఉపన్యాసములుండును. స్వామి తపస్యానంద, స్వామి బుధానంద ఆంగ్లములోను, మద్రాసు హైకోర్టు న్యాయపతి శ్రీ నయనారుసుందరము తమిళములోను ఉపన్యసింతురు.

శ్రీ రామకృష్ణమఠము,
మద్రాసు-4.




ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 35 1978 - ఆగస్టు సంచిక 8

## ప్రార్థన

చరణం పవిత్రం వితతం పురాణం
యేన పూతస్తరతి దుష్కృతాని
తేన పవిత్రేణ శుద్ధేన పూతా
అతి పాప్మాన మరాతిం తరేమ.

యత్=ఏ, పవిత్రం=పవిత్రమగు, చరణం=చరణము, వితతం=విస్తారమయినదో, పురాణం=పురాతనమైనదో, యేన=ఏ పవిత్రమగు చరణముచేత, పూతః=పవిత్ర మొనర్పబడిన మనుష్యుడు, దుష్కృతాని=పాపములను, తరతి=దాటుచున్నాడో, పవిత్రేణ=పవిత్రమగు, శుద్ధేన=శుద్ధమయిన, తేన=ఆ శ్రీ మహావిష్ణువుయొక్క పాదము చేత, పూతాః=పవిత్ర మొనర్పబడినవారలమై, అరాతిం=నరక హేతువగుటచేత శత్రుభూతుడగు, పాప్మానం=పాపమును, అతితరేమ=అతిక్రమించెదముగాక.

ఈ మంత్రము శ్రీ మహావిష్ణువుయొక్క చరణారవింద స్తుతిపరము.

తా. ఏ చరణము పవిత్రమును, విస్తృతమును, పురాణమును అగుచున్నదో, ఏ పాదముచేత పవిత్రమొనర్పబడినవాడు పాపములను అతిక్రమించుచున్నాడో, అట్టి శ్రీ మహావిష్ణువుయొక్క పాదముచేత మేము పవిత్రులమయి నరకహేతువైన పాపమును అతిక్రమించెదముగాక.

# వివేకానందవా

మహావీరుని (హనుమంతుని) శీలమును మీ రిప్పుడు లక్ష్యముగా ఉంచుకొనవలెను. శ్రీరామచంద్రుని ఆనతిని నెఱవేర్చుటకై అతడు సముద్రము నెట్లు లంఘించెనో చూడుడు! చావు బ్రదుకుల తలంపే అతనికి లేదు! అతడు మహాజితేంద్రియుడు, అత్యద్భుతవివేకమహితుడు.

ఆ దాస్యభావ మహాలక్ష్యానుసారముగా మీ జీవితములను దిద్దుకొనవలెను. ఆ లక్ష్యము ద్వారా ఇతర లక్ష్యములన్నియు జీవితమున అభివ్యక్తములగును. మాఱుమాటాడక గురువు నాజ్ఞను పరిపాలించుట, నిష్ఠురబ్రహ్మచర్యము నభ్యసించుట – ఇందే విజయరహస్యము కలదు.

హనుమానుడు ఒక వంక దాస్యభావ స్వరూపుడు, మఱొకవంక లోకమును ఆశ్చర్యచకిత మొనర్చు సింహవిక్రమ స్వరూపుడు. రామునికి హిత మొనర్ప తన ప్రాణమును సమర్పింపవలసివచ్చినను అతడు ఏమాత్రమును జంకువాడుకాడు. రామసేవయెడ తప్ప తక్కిన సర్వమునందును—జగదారాధ్యులగు బ్రహ్మమహేశ్వరుల పదవి నార్జించుటందుకూడ—అతనికి పూర్తి నిర్లక్ష్యత! శ్రీరాముని ఆజ్ఞను పరిపాలించుటొక్కటే అతని జీవితవ్రతము! అట్టి పరిపూర్ణనిష్ఠ కావలయును.

ఖోల్ (ఒక విధమగు మృదంగము) కరతాళ వాద్యములు వాయించుటయు, సంకీర్తనావేశమున నృత్యము చేయుటయు, దేశస్థుల నందఱిని అధోగతికి తెచ్చినవి. ఏమండలమునకు పోయినను, ఏ గ్రామమునకు పోయినను, ఖోల్ కరతాళ వాద్యములే నీకు వినిపించును! దుందుభులు ఈ దేశమున చేయరా? బాకాలు, ఢంకాలు ఈ దేశములో దొరకవా? ఈ వాద్యముల గురుగంభీరనినాదములు మన బాలురు విందురుగాక!

చిన్ననాటినుండియు ఈ ఆడంగి వాద్యముల తోడి సంగీతమును, సంకీర్తనములను వినివిని, మన దేశస్థులు స్త్రీజనప్రాయులుగా మాఱిపోయినారు. అంతకన్నను దుర్దశ యేముకలదు? ఈ దుర్దశను ప్రతిభకూడ చిత్రింపజాలదు!

వీరరస ప్రధానములగు గంభీరయుద్ధనినాదములు వినవచ్చునట్లు డమరుకములు వాయింపవలెను, కొమ్ములు ఊదవలెను, దుందుభులు మ్రోయింపవలెను. ''మహావీర, మహావీర!'' నామధ్వనితో ''హర, హర, వ్యోమ్, వ్యోమ్,'' అని అఱచుచు, దిగ్దేశములను కంపిల్లజేయవలెను. మానవుని కోమలభావములనే రెచ్చగొట్టు గీతవాద్యములను కొంతకాలము ఆపివేయవలెను. 'ఖేయాల్', 'టప్పా' మొదలగు సుకుమారగీతికలు నిలిపివైచి, జనులకు 'ధ్రుపద్' గానము వినుటను అలవాటు పఱుపవలెను.

గంభీరములగు వేదబుక్కల మేఘగర్జారావములద్వారా దేశమునకు మరల ప్రాణము పోయవలెను. ప్రతి విషయమునందును వీరపురుషోచితమగు గంభీరబుద్ధిని పునరుజ్జీవింపజేయవలెను. ఇట్టి లక్ష్యము ననుసరించుటచే ప్రజలకును దేశమునకును అభ్యుదయము కలుగును. నీ శీలమును ఇట్టి లక్ష్యానుకూలముగా నిర్మించుకొనగలిగితివేని, ఇతరులు వేయిమంది నిన్ను అనుకరింతురు. కాని లక్ష్యమునుండి అణుమాత్రమేని తొలగకుండునట్లు జాగ్రత్త వహింపుము. ఎన్నడేని అధైర్యచిత్తుడవు కాకుము.

ఆహార విహారములందును, వేషభాషలందును, నిద్రించుటందును, ఆటపాట లందును, రోగభోగములందును ఎల్లెడల అత్యున్నత నైతిక బలమును ప్రదర్శింపుము. అట్లు చేసిననే నీకు మహాశక్తిపయ — జగన్మాతృకృ: అనుగ్రహము లభించును.

# శ్రీ రామకృష్ణ కథామృతము

## (రెండవ భాగము)

అనువాదము: ప్రవ్రాజిక శ్యామాప్రాణ

రామకృష్ణులు: శ్రీరామునకు వైరాగ్యము కలిగి 'సంసారములో నేనుండను' అని పలికెను. అతని బుద్ధి మార్చుటకై దశరథుడు రాముని వశిష్ఠునికడకు పంపెను. వశిష్ఠుడిట్లనెను. 'శ్రీరామా! భగవంతుడు లేనట్టి జగమున్నచో అట్లే నీవు సంసారమును వీడిపోవచ్చును.' రాముడు మారు పలుకుటకు వీలులేకపోయెను. ఈశ్వరుడు లేని జగము లేదని అతడెరుగును. అందుచే రాముడు సంసారమును వదలిపోలేదు.

(ప్రాణకృష్ణునితో) వలయునది దివ్యదృష్టియే. మనస్సు పరిశుద్ధమైననే దివ్యదృష్టి కలుగును. ఒకవ్యక్తి, భార్యను పుత్రుని ప్రేమించును. కాని భార్యను ఒక భావముతోను పుత్రుని మరొక భావముతోను ప్రేమించును. భావములు వేరు. అన్నిటికీ మనస్సే కారణము. మనశ్శుద్ధినిబట్టి భావము కలుగును. శుద్ధమగు మనస్సు కలిగినచో సంసారములోనున్ననూ భగవద్దర్శనము కలుగును. కాని యిందులకు సాధన చేయవలెనుసుమా. స్త్రీ పురుషులు అన్యోన్యాకర్షణ కలిగి యుండుట సైజమే. అందుచే ధర్మమార్గమునుండి జారిపడిపోకుండ జాగ్రత్తపడవలెను. అట్లు కానిచో ఉభయులు భ్రష్టులగుదురు. కాని సంసారములో కొన్ని వసతులు కూడ కలవు. నీ అక్కరల తీర్చుటకై భార్యకలదు......

మాస్టరు (స్వగతమున) గృహస్థులు సమస్తమూ ఒకేమారు త్యాగము చేయజాలరని ఇట్లు అనుమతించుచున్నారా ఏమి? సంసారములోనుండి సంపూర్ణ బ్రహ్మచర్యము పాటింపవీలగునా?

శ్రీరామకృష్ణులు: (ప్రాణకృష్ణునితో) సంసారములో నుండవలెనన్న సత్యమును అంటి పెట్టుకొనవలసినదే. సత్యముతోనే భగవల్లాభము పొందవగును. నాకిపుడు సత్యవాక్కుపై పట్టుదల కొంచము తగ్గినది. ఇదివరలో గట్టి పట్టుదల ఉండెడి. 'స్నానము చేయుదును' అని పల్కినచో వెంటనే గంగలోదిగి మంత్రాలు చదివి నెత్తిన నీళ్లు చల్లుకొని మునకలు వేసిన పిదపకూడ స్నానముపూర్తి అయినదా లేదా అని సందేహము కలిగెడిది.

ప్రాణకృష్ణుడు: ఇక ఉద్యోగము వదలి వేయాలను కుంటున్నాను. ఉద్యోగములో నున్నన్నాళ్లు ఇంకేమియు చేయుటకు కుదరదు.

శ్రీరామకృష్ణులు: అవును అది పెద్ద జంజాటమే. కొన్ని దినములపాటు నిర్జన ప్రదేశమున భగవత్ చింతన చేయుట చాలమంచిది. నీవు నోటితో చెప్పుచున్నావు కాని వదలగలవా? కాప్టెన్ కూడ ఇట్లే చెప్పెను. గృహస్థులు వదలిపెట్టవలెనని తలచురేగాని వదలిపెట్టజాలరు. చాలమంది పండితులున్నారు. ఎన్నో ఉపదేశములు చేయుదురు. నోటి పలుకులేగాని చేతలలో సున్న. గ్రద్ద ఎంతో ఎత్తులోనే ఎగురుచుండును. కాని దాని దృష్టి యంతయు క్రింద కుళ్లిన శవములమీదనే. పండితుల దృష్టికూడ అట్లే కామినీకాంచనముల మీదనే. వివేక వైరాగ్యములున్న పండితుని చూసినచో నేను చాల భయభక్తులతో నమస్కరింతును. అవిలేని వారిని చూసి కుక్కలు నక్కలుగానే భావింతును.

ప్రాణకృష్ణుడు ప్రణామముచేసి శెలవు గైకొనెను. మాస్టరు పంచవటికడ కొంతసేపు పచారుచేసి తరువాత శ్రీరామకృష్ణులు స్నానముచేయు ఘట్టములో స్నానము చేసెను. అటుపై భవతారిణీ రాధాకృష్ణులను దర్శించి ప్రణమిల్లెను. ఆ తరువాత తనలో తాను ఇట్లు తలపోయుచుండెను.

''ఈశ్వరుడు నిరాకారుడని విని యున్నానే. అట్లైన ఈ విగ్రహామునకు ఏటలు? శ్రీరామకృష్ణులు సాకార దేవుళ్లనందరిని ఒప్పుకొనుచున్నారా? ప్రియుక్కుటు అందుకేనా? ఈశ్వరుని గురించి నీకేమి తెలియును? శ్రీరామకృష్ణులే మూర్తి ఆరాధనను ఒప్పుకొనునపుడు నీ వెంత? నీవును తప్పక ఒప్పుకొని తీరవలసినదే. ఈ భవతారిణీదేవి ఒక చేతిలో కపాలము మరొక చేతిలో కృపాణము మరియొక చేత అభయముద్రను గలిగియున్నది. ఈ తల్లి ఒకవైపు భయంకరమైనదియు మరియొకవైపు భక్తవత్సలయు. ఆహా రెండు విరుద్ధభావముల సమ్మేళనము! భక్తులు, దీనులయెడ ఈమె దయామయి స్నేహామయి. మరల ఈమెయే భయంకరియు. ఇట్టి రెండు విరుద్ధభావముల సమావేశమెందులకో ఆమెకే తెలియును అని శ్రీరామకృష్ణులు పలికెడివారు.''

ఆలయములలో నైవేద్యములు ముగిసెను. మధ్యాహ్న హారతులు ఇచ్చుచుండిరి. కంచు గంటలు మ్రోగుచుండెను. కాళికాలయము ఆనందముతో నిండెను. హారతుల శబ్దములు వినుటతోడనే సాధువులు, పేదలు, ఫకీరులు, అందరూ అన్నసత్రము వైపునకు త్వరగా వచ్చుచుండిరి. కొందరు చేతులతో విస్తళ్లు, కొందరు పళ్ళెరములు లోటాలు తీసికొనివచ్చిరి. వచ్చిన వారందరూ ప్రసాదము స్వీకరించిరి. మాస్టరు కూడ ప్రసాదమును గ్రహించిరి.

(సశేషము)

ఉపనిషత్ క్లాసులు తీసికోమని ఒక స్వామిని కొందరు భక్తులు నిర్బంధించారు. 'సరే రేపటినుండి ప్రారంభిస్తాం ఉపనిషత్ క్లాసులు' అన్నారు స్వామి. ఉపనిషత్తులలో మొదటిది ఈశావాశ్యం ప్రారంభిస్తారేమో అని మఱునాడు భక్తులు ఆ పుస్తకాన్ని చేత బట్టుకొని క్లాసుకు వచ్చారు. కాని స్వామి ప్రశ్నోపనిషత్ తో వచ్చి కూర్చున్నారు. క్లాసు ప్రారంభమయింది. ''భరద్వాజుని కొడుకైన సుకేశుడు, శిబి కొడుకైన సత్యకాముడు, గర్గ గోత్రానికి చెందిన సౌర్యాయణి, అశ్వలుని కొడుకైన కౌసల్యుడు, విదర్భదేశానికి చెందిన భార్గవుడు, కత్యుని కొడుకైన కబంధుడు—ఈ ఆఱుగురు సాధకులకు పరబ్రహ్మను తెలుసుకోవాలనే అభిలాష కలిగింది. గురువును వెదకుకుంటు చివరకు పిప్పలాదుని సమీపించారు. పిప్పలాదుడు వారిని చూచి అన్నాడు ''మీరు ఈవరకే సాధనలు చేసిఉన్నా సరే మళ్ళీ ఒక సంవత్సరం తపస్సుతో బ్రహ్మచర్యంతో శ్రద్ధతో భక్తితో గడపవలసింది. ఆ తరువాత వచ్చి నన్నేమి అడగదలచుకొన్నారో అడగండి. సమాధానాలు నాకు తెలిసిఉంటే నేను వాటిని మీకు చెప్తాను.'' స్వామి తమ ఉపన్యాసాన్ని ఇక్కడ నిలిపి పుస్తకాన్ని మూసివేస్తూ శ్రోతలను చూచి ఇలా అన్నారు. 'మనమూ ఒక సంవత్సరకాలం తపస్సుతో బ్రహ్మచర్యంతో శ్రద్ధతో భక్తితో గడిపి తరువాత తెలుసుకొందాం—వాళ్ళేమడిగారు, పిప్పలాదుడేమి సమాధానాలిచ్చాడనేది.'

# ఏది తప్పు?

## చీమలకొండ ఉమారామలింగమూర్తి

హిందువులు దేవాలయమునకును, క్రైస్తవులు చర్చికిని మహమ్మదీయులు మసీదునకును పోవుచుందురు. దేవాలయమునకు వెళ్లుట వారి ధర్మమని భావింతురు. ఒక విచిత్రమైన ప్రశ్న కలదు. దేవాలయమునకు వెళ్లుట తప్పా? ఈ ప్రశ్నను నాస్తికునికి వేసినచో తప్పే అని సమాధానమిచ్చును. ఆస్తికుడైనచో దేవాలయమునకు వెళ్లకుండుట తప్పు అని చెప్పును. ఖండాంతరముల హిందూ మతముయొక్క గొప్ప తనమును చాటిన వివేకానందుడు దేవాలయమునకు వెళ్లకుండుట కొందరకును, వెళ్లుట కొందరకును తప్పు అని చెప్పినాడు. "If a younger man does not go to church, he ought to be condmned; but if an old man goes to church, he also ought to be condemned. యువకుడు దేవాలయమునకు వెళ్ళకుండుట తప్పు; వృద్ధుడు దేవాలయమునకు వెళ్లుటయు తప్పే." ఈ వాక్యముయొక్క అంతరార్థమును గ్రహించుటకు, అది ఏ సందర్భమున చెపబడినదో గమనించిన గాని దాని భావము బోధపడదు.

అమెరికా ఖండమున భక్తిని గూర్చి ఉపన్యసించుచు వారు చెప్పిన వాక్యమది. భక్తి యనగా దేవునియందు ప్రగాఢమైన ప్రేమ. భగవంతుని ఏల ప్రేమించవలెను? ప్రాక్పశ్చిమములలో దీని దృక్పథము వేరుగ నున్నది. శరీరము, ఆత్మ, కలసి మనుజుడు అనబడుచున్నాడు. మనుజుడు శరీరమే అనియు అతనికి ఆత్మ కలదనియు పశ్చిమ దేశస్థులు చెప్పుదురు. మనుజుడు ఆత్మయే అనియు అతనికి శరీరము కలదనియు హిందువులు చెప్పుదురు. పశ్చిమ దేశస్థులు శరీరమునకు ప్రాధాన్యము ఈయగా, హిందువులు ఆత్మకు ప్రాధాన్య మిత్తురు. అందువలన వేరు వేరు దృక్పథములు కలిగియుండుటచే వారికి మనకు జీవనముయొక్క గమ్యము (Aim of life) కూడ వేరు వేరుగ నున్నది. ప్రాపంచిక సుఖముల ననుభవించుటయే మన గమ్యమని పశ్చిమ దేశస్థులు చెప్పుదురు. ప్రాపంచిక సుఖములు అశాశ్వత మైనవనియు, శాశ్వత మైన సుఖమును పొందుటయే మన గమ్యమనియు, అట్టి శాశ్వతసుఖము ఆత్మ సాక్షాత్కారము (Self realization) వలననే కలుగు ననియు అదియే ముక్తి (జన్మరాహిత్యము) అనియు హిందువులు చెప్పుదురు.

సుఖమును బడయుటకు భగవదనుగ్రహము కావలెననియు, భక్తిని అలవరచు కొనవలెననియు ఉభయులు అంగీకరింతురు. భగవదనుగ్రహమువలన మన కోరికలు సఫలమగును. అయితే కొన్ని కోరికలు సఫలమగుసరికి మరికొన్ని కోరికలు బయలుదేరు చుండును. సుమారు 200 సంవత్సరముల క్రితము మానవుని కోరికలు ప్రస్తుత కోరికల కంటె చాలా తక్కువ. శాస్త్రీయ విజ్ఞానము పెరిగినకొలది మన కోరికలు అంతకంటె ఎక్కువ నిష్పత్తిలో వృద్ధి యగుచున్నవి. వివేకానందుడు ఈ విషయమునే ఇట్లు నుడివెను. As our knowledge increases in arithemetical progression, our wants increase in geometrical progression. దీనికి కారణమేమన సుఖజీవనమే మన గమ్యమనియు భగవంతుడు అందులకు ఒక సాధనము మాత్రమేననియు తలచుటయే. (We make the world the end and God the means.) ఆరోగ్యమును కోరియో ధనమును

కోరియో సంతానమును కోరియో భగవంతుని ప్రార్థింతుము. ఈ కోరికలవలన తృప్తి కలుగదు. మనకు తృప్తి కలుగవలెనన్న మనము కోరికలను విడనాడవలసినదే. భగవంతుడే మన గమ్యమనియు, ప్రాపంచిక జీవితము అందులకొక సాధనము మాత్రమే అనియు భావించవలెను. (We must make God the end and the world the means.)

భగవంతుడు మనకు కనుపించడు. మనకు తెలిసిన వస్తువును ఒక సాధనముగ గైకొని తెలియని వస్తువును కనుగొనుటకు పరిశోధించుచుందుము. From the known to the unknown, from the Concrete to the abstract అను మాటల భావము ఇదియే. అందుచే మనకు కనుపించని దేవుని సాక్షాత్కరింప చేసికొనుటకు మనకు కనుపించు మత ప్రవక్తనో, ఆయన చిహ్నమగు పటమునో విగ్రహామునో స్మరించుటతో ప్రారంభించి కృషి చేసిననే కొంతకాలమునకు భగవత్సాక్షాత్కారము కలుగును. ఈ ఉద్దేశము తోనే దేవాలయమునకు వెళ్లుచుందుము.

ఈ తీరున భక్తి యలవడుటకు దేవాలయమును దర్శించుట ప్రథమ సోపానము, ప్రారంభమున దేవుడు దేవాలయమునందే కలడని భావించినను నిరంతర కృషివలన భగవంతుడు సర్వాంతర్యామి యని గ్రహించుట సాధ్యమగును. ఇది కొన్ని సంవత్సరములకో కొన్ని జన్మలకో సాధ్యము కావచ్చును. అవిరళ కృషివలన శ్రీ రామకృష్ణపరమహంస తన జీవితకాలముననే దేవి సాక్షాత్కారము పొందగలైను. సాధారణ కృషి సల్పువారికి ఇది దీర్ఘకాలము పట్టవచ్చును. అందువలన ప్రథమమున దేవాలయమునకు పోవుట అలవరచుకొని భగవంతునియందు మనస్సు నిల్పి భక్తిని పెంపొందించుకొని నిష్కామ్య భక్తిని అలవరచుకొని సగుణోపాసననుండి నిర్గుణోపాసనలోనికి ప్రవేశించి భగవంతుడు సర్వాంతర్యామి యని అవగత మొనర్చుకొనుటయే ఆత్మ సాక్షాత్కారము.

అందుచే వివేకానందుడు నుడివిన వాక్యములో వృద్ధుడు దేవాలయమునకు వెళ్లుట తప్పు అనగా వృద్ధుడగుసరికి జ్ఞానము సంపాదించి భగవంతుడు 'తనయందు నిఖిల భూతములందు' గలడని అవగత మొనర్చుకొనవలెను అనియే. బాలురు కూడిక తీసివేత (Addition and substraction) నేర్చుటకు వారి చేతివేళ్లు కాలివేళ్లు లెక్కించుట అవసరము. గణితశాస్త్రములో ప్రావీణ్యము సంపాదించిన కొలది ఇట్టి అలవాట్లు పోవునుకదా! వివేకానందుడు పై వాక్యము తరువాత చెప్పిన ఈ దిగువ వాక్యమును గమనింపుము. "He has no business with this children's play any more. The church is only a preparation for some thing higher. దేవాలయమునకు పోవుట యనునది మరియొక ఉన్నతస్థితిని సాధించుటకు ప్రయత్నము మాత్రమే. ఇట్టి ఉన్నత స్థితిని సాధించిన పిమ్మట బాలురవలె ప్రవర్తించుట తగదు." వారు నుడివిన వాక్యములోని 'వృద్ధుడు' అను పదమునకు వయోవృద్ధుడనిగాక జ్ఞానవృద్ధుడని గ్రహింతము. అట్టి జ్ఞానము కలుగువరకు వయస్సుతో నిమిత్తము లేకుండ మనము బాలురమే; దేవాలయమునకు పోవలసినదే.

# ప్రహ్లాద కథాతత్త్వ విచారము

## ధూళిపాళ శ్రీరామమూర్తి

ఆ మాటలువిని దైత్య బాలకులు 'ప్రహ్లాదా! మనకందరకును నీచండామర్కులే గురువులు గదా. మరియొక గురువు నెరుగముగదా. అందులో నీవు రాజకుమారుడవు. అంతఃపురములలో నుందువు. నీకు సాధుసంగ మెట్లబ్బెను? నారదుడు నీకెట్లు బోధించెను?' అని యడిగిరి. ప్రహ్లాదుడిట్లు చెప్పెను. 'మా నాయన తపస్సు చేయుటకు మందరాచలమునకు పోయెను. ఆ యదనుగని పెట్టి దేవతలు రాక్షసులపైకి దండెత్తిరి. వారెత్తివచ్చుచున్న మాట విని యసురులందరు భార్యా పుత్రులను, గృహారామ పశు విత్తములను నెక్కడివక్కడ విడిచి ప్రాణభీతిచే పలాయనము చిత్తగించిరి. దేవతలు జయోత్సాహముతో రాజ శిబిరమును కొల్లగొట్టిరి. ఇంద్రుడు రాజమహిషియైన మా తల్లిని చెఱబట్టి భయముతో గొంతెత్తి యేడ్చుచున్న యామెను లాగికొని పోవుచుండ త్రోవలో నారదుడెదురుపడి ఏమయ్యా! యిది యేమిపని? ఈమె నిరపరాధిని. పతివ్రత. పరసతి. వదలిపెట్టుమన్నాడు. దానికింద్రుడు మహర్షీ! ఈమెను నేనవమానించుటకో చంపుటకో గొనిపోవుట లేదు. ఈమె గర్భమునందు హిరణ్యకశిపుని వీర్యమున్నది. ప్రసవపర్యంత మీమెను చెఱయందుంచి తరువాత నీమెను వదలిపెట్టెదనని చెప్పెను. నారదుడు ఓయీ! ఈమె గర్భగతుడైన బాలుని నీవేమి చేయగలవు? వాడు, నిష్పాపుడు. సాక్షాత్ స్వగుణములచేతనే మహాత్ముడు. మహాభాగవతుడు. విష్ణుభక్తుడు. మహాబలవంతుడు. నీవల్ల నీతనికి మృత్యువు కలుగదని చెప్పి విడిపించెను. ఇంద్రుడు నారదుని యందలి భక్తిచే మాయమ్మకు ప్రదక్షిణించి స్వర్గమునకు వెడలిపోయెను. అంతట నారదుడు మా యమ్మను నిజాశ్రమమునకు గొనివచ్చి యోదార్చి అమ్మా! నీ భర్త వచ్చువరకు నీ విచట నుండవచ్చునని చెప్పెను. ఆమె దాని కొడంబడి మా నాయన తిరిగి వచ్చునంత వరకు పరమభక్తితో నారదునకుపచారములు చేయుచు తన గర్భరక్షణమునకై నాయనను సేవించుచుండెను. కరుణాళువైన మహర్షి యామెకు శోకశాంతి యగునట్లు ధర్మతత్త్వమగు భక్తిని జ్ఞానము నొసంగెను. నేను మా యమ్మకడుపులో నుండుటవలన నా మహర్షి నన్నుకూడా నుద్దేశించి నిర్మలమైన భక్తి జ్ఞానము బోధించెను. ఇట్లు మా యిద్దరకుభక్తి జ్ఞానములు మహర్షి బోధించినను దీర్ఘకాలమగుటవలన, స్త్రీయగుటవలన మా తల్లికి విస్మృతమైపది. ఆయన యనుగ్రహమువలన నాకు మాత్రము మరపునబడలేదు. మీరు కూడ నా వచనములను శ్రద్ధగా విన్నచో నహంకార మమకారములను దూరముచేయు శ్రద్ధా వివేకములు మీకు కలుగును. ఇది ఎవరికో పండితులకు మాత్రమే తెలియును. మాకు తెలియదనుకొనరాదు. నారదమహర్షి స్త్రీయైన మాయమ్మను బాలుడనైన నన్నుద్దేశించియే గదా చెప్పినాడు. కావున శ్రద్ధగా విన్నచో చక్కగా తెలియకపోవుట యుండదు.

నారదుడు చెప్పిన రీతి మీకు విన్పించెదను. వినుడు. ఈ దేహమునకు జన్మాదిషడ్భావ వికారములు కన్పించుచున్నవి. (చెట్టునకు పిందె పుట్టినది. పెరిగినది. పండినది. ఎండినది. రాలినది.) పుట్టుటకు పూర్వము రాలిన తర్వాత రూపాంతరమున నున్నవి. అట్లే అస్తి జాయతే వర్ధతే పరిణమతే అపక్షీయతే వినశ్యతి-ఉన్నది. కావుననే పుట్టినది. కావుననే పెరిగినది. కనుకనే

పండినది. అందుకనియే దిగనాశిల్లినది. కాబట్టి మరణించినది – అన్నవి యీయారు వికారములు. కాని యీ యారు దశలయందు ఆత్మ నిర్వికారముగా నుండనే యున్నది. ఈ యారు దశలును ఆత్మకులేవు. దేహమునకీయారు దశలు కాలముచేత సంప్రాప్తము. ఈ కాల ప్రభావ మాత్మపైన లేదు. మరి యాత్మ యెట్టిది?

ఆత్మా నిత్యోఽవ్యయశ్శుద్ధో హ్యేకః క్షేత్రజ్ఞ ఆశ్రయః
అవిక్రియస్స్వదృగ్ హేతు ర్వ్యాపకోఽసంగ్యనావృతః

ఇవి పన్నెండు లక్షణములు. ఆత్మనిత్యమైనది. అనగా వినాశములేనిది. అవ్యయ మనగా తరుగు లేనిది, కృశించనిదియని యర్థము. శుద్ధమనగాదోషరహితమనియర్థము. ఏకమనగా నద్వితీయమని యర్థము. రెండవది లేనిది భేదము లేనిది. భేదము ముచ్విధము సజాతీయ, విజాతీయ స్వగతరూపములు. ఆత్మకు సజాతీయమైన వస్తువు లేదు. ఉన్నదదొక్కటే కావున విజాతీయమైన వస్తువు లేదు. ఈ రెండు భేదములును రెండవది లేదనుటవలన తెలిసినది. మరి స్వగత భేదమున్నది కూడా లేదు. స్వగత భేదమనగా జలమునందు తరంగ బుద్బుద ఫేనములవంటిది. అది నిరవయవముగాన నిర్వికారముగాన నిట్టి భేదము గూడా నుండదు. క్షేత్రజ్ఞమనగా ద్రష్టృస్వరూపము. తెలిసికొను నట్టిది. తెలిసికొనునదిగాని తెలియబడునది గాదు. క్షేత్రము శరీరము. క్షేత్రజ్ఞమాత్మ. ఆశ్రయమనగా సృష్టిస్థితి లయముల కాధార భూతము. అవిక్రియమనగా నవయవములు లేనిది. కావుననే వికారము బొందింపరానిది. స్వదృక్కనగా స్వయంప్రకాశమైనది. హేతు వనగా ఈ సర్వలోకములను సృజించినట్టిది. వ్యాపకమనగా సర్వమునందు వ్యాపించి యుండుటయే గాక సర్వమును మిగిలి కూడా నున్నది. అసంగియునుటవలన దేనితోడను సంగము పొందనిది. అంటుకొననిదియన్న మాట. అనావృతమనగా పరిపూర్ణమైనది. ఈ పన్నెండు లక్షణములచేత తాను దేహము కంటె వేరని వివేకించుకొని దేహాదులయందు నహంకార మమకారరూపములైన మిథ్యా దృష్టిని వదలిపెట్టవలెను. బంగారపు గనిత్రవ్వియచటిరాళ్లను తెచ్చి వాని నగ్నియందు కాచి మట్టినుండి బంగారమును విడదీయు హేమ కారునివలె అధ్యాత్మవేత్త శరీరమునుండి యాత్మను విడదీసుకొనవలెను. ఏది యేది తెలియబడుచున్నదో నదియెల్ల ననాత్మ పదార్థమే. క్షేత్రమే. ఆత్మ పదార్థముగాదు.

(సశేషము)

అయం నిజః పరో వేతి గణనా లఘుచేతసాం
ఉదార చరితానాం తు వసుధైవ కుటుంబకం.

నాది – నీది అని లెక్కించే స్వభావం అల్పబుద్ధులకేగాని ఉదార స్వభావులకు సమస్త ప్రపంచం ఒకే కుటుంబంగా కనపడుతుంది.

# స్వామి రామకృష్ణానంద

డి. వి. బ్రహ్మాజి

పశ్చిమఖండమున తన వేదాంత దిగ్విజయం ముగించుకొని వచ్చినపిమ్మట, వివేకానంద స్వామి మద్రాసునగరంలో, మొదటిసారిగ తన భావి కార్యక్రమ ప్రణాళికను ప్రకటించారు. ఆ మహోపన్యాసంలో స్వామి వెలిబుచ్చిన ఆదర్శాలను ఆచరణలో వ్యాప్తిచేయడానికి, లోకసేవా కార్యక్రమములకు దక్షిణాదిన కేంద్ర స్థానంగా ఉండటానికి, ఒక మఠాన్ని స్థాపించవలసినదిగా కొంతమంది మద్రాసుపౌరులు, స్వామికి విన్నవించుకొన్నారు. ఈ కార్యాన్ని తటిని పర్యవేక్షించడంకోసం, సమర్థుడయిన సోదరశిష్యుని ఒకర్ని మద్రాసు పంపమని, వారు స్వామిని అర్థించారు. దానికి ప్రత్యుత్తరంగా జవాబుగా, వివేకానందస్వామి: "సరే; నేను మీదగ్గరకు పంపబోయే వ్యక్తి మీ దక్షిణాది వారిని కూడా పూర్వాచార పరాయణత్వంలో మించిపోయేవాడుగా ఉంటాడు. భగవదారాధనలో గాని, ధ్యానంలోగాని ఆయనకు సాటివారెవ్వరూ ఉండబోరు." అని సెలవిచ్చారు. ఆ మహనీయ వ్యక్తియే మన రామకృష్ణానందస్వామి.

అనూచానమయిన సనాతన మతానికి ఒక వంక నూతనోత్తేజాన్ని కలుగజేస్తూ, మౌలికమయిన సాంప్రదాయ స్రవంతికి మాత్రం ఎక్కడా విచ్ఛిన్నం కలుగకుండా సమర్థవంతగా నిర్వహించిన దక్షుడు, మన రామకృష్ణానందస్వామి. అద్వితీయమయిన మేధాసంపత్తికి తోడుగ, ఆదర్శసాధనలో వెనుకంజ వెరుగని దృఢదీక్ష ఆయనకు సహజగుణాలు. వివిధ పూజావిధానాలలోను రామకృష్ణానంద స్వామికి గల భక్తి గౌరవాలు అనన్య సామాన్యమయినవి.

సన్న్యాసాశ్రమ స్వీకారానికి ముందు మన స్వామి అసలుపేరు శశిభూషణచక్రవర్తి. ఈయన 1863 సం॥ జూలయి 13 న, కలకత్తా నగరంలో ఆచారపరాయణమయిన కుటుంబంలో జన్మించారు. వీరి తండ్రి ఈశ్వరచంద్ర చక్రవర్తి సంప్రదాయానువర్తి అయిన గొప్ప దేవీపూజా తత్పరుడు. ఆయన తన కుమారుడయిన శశిభూషణుని చిన్నతనంనుంచి ఆదర్శప్రాయమయిన శిక్షణలో తీర్చిదిద్దారు.

హైస్కూలు విద్య పూర్తిఅయినపిమ్మట శశిభూషణుడు, ఉన్నతవిద్యకై మెట్రోపాలిటన్ కళాశాలలో ప్రవేశించాడు. కళాశాలలో మన శశి గొప్ప ప్రతిభాశాలిగా పేరు గడించారు. ఈయనకు సంస్కృతాంగ్ల సాహిత్యములు, గణితము, వేదాంతశాస్త్రము, అత్యంత అభిమాన విషయాలు. వీరి దాయాది అయిన శరత్ చంద్రచక్రవర్తితో బాటుగా ఈయన కూడా, ఆ రోజులలో బ్రహ్మసమాజ ప్రభావానికి లోనయ్యారు. బ్రహ్మమతాచార్యుడు కేశవ చంద్రసేనునికి మన శశిభూషణునికి మధ్య అతిసన్నిహితం అయిన పరిచయం ఏర్పడింది.

1883 సం॥ అక్టోబరు నెలలో శశిభూషణ చక్రవర్తి, శరత్ చంద్రచక్రవర్తి, మరికొంత మంది స్నేహితులు కలసి శ్రీరామకృష్ణ పరమహంసను దర్శించడానికై దక్షిణేశ్వరం చేరుకున్నారు. అదే, మన శశిమహరాజ్ మొదటి సారిగా శ్రీ గురుదేవులను కలిసిన సందర్భం. వచ్చిన బాలకులందరిని పరమహంస తన సహజమైన రీతిలో మందహాస పూర్వకంగా అత్యంతాదరంతో ఆహ్వానించారు. ఆ రోజున వారితో రామకృష్ణపరమహంస, ఆధ్యాత్మిక జీవనంలో త్యాగంయొక్క ఆవశ్యకతనుగూర్చి

ముచ్చటించారు. వచ్చినపిల్లలు అందరలోకి మన శశిభూషణుడే పెద్దవాడు కావడం వలన, గురుదేవుల సంభాషణఅంతా శశినుద్దేశించి కొనసాగింది. మాటల సందర్భమున పరమహంస శశిని ఉద్దేశించి: "నీకు సాకారుడయిన భగవంతునిలో నమ్మకం ఉన్నాదా? లేక, నిరాకారుడయిన భగవంతునిలో నమ్మకమున్నదా?" అని ప్రశ్నించారు. దానికి మన శశి: "నాకు అసలు భగవంతుడనేవాడు నిజంగా ఉన్నాడో లేడో అన్న విషయమే నిశ్చయంగా తెలియదు. అందువలన మీ ప్రశ్నకు సమాధానం చెప్పజాలను. అని నిర్మొహమాటంగా జవాబిచ్చారు. నిష్కపటంగా, సంకోచరహితంగా మనసులోనున్న మాట పైకి చెప్పిన శశిభూషణుని ప్రవర్తనకు శ్రీ గురుదేవులెంతయో సంతోషించారు.

శ్రీరామకృష్ణపరమహంసయొక్క అపూర్వ వ్యక్తిత్వానికి ముగ్ధులయిన శశిభూషణ, శరత్ చంద్రులు ఇరువురూ కూడా ఆ ప్రథమ సమాగమంలోనే గురుదేవులయెడ ఆకర్షితులయ్యారు. శ్రీరామకృష్ణులు ఈ బాలకులిరువురను గురించి తరచుగా: "పూర్వజన్మలో వీరిద్దరు క్రీస్తుప్రభువు యొక్క అనుయాయులు" అని అనేవారు. ఒకసారి వీరిద్దరిచేత పరమహంస బైబిలులో ఒక ప్రకరణాన్ని చదివించి వినిపించి ఇతర శిష్యులకు పెండ్లి చేసుకొనవలదని బోధించెను.

శ్రీరామకృష్ణుని పరిచయభాగ్యం లభించిన నాటినుండి శశిభూషణుడు ఆధ్యాత్మికమార్గంలో త్వరితగతిని ముందుకు సాగజొచ్చెను. కాని, తత్ఫలితంగా కళాశాల చదువు మాత్రం రాను రాను సన్నగిల్లసాగింది. ఆయన తన సర్వశక్తుల్నీ ఒక్క భగవత్సాక్షాత్కారం అనే విషయంమీద మాత్రమే కేంద్రీకృతంగావింపసాగిరి. బాల్యంనుండీ శశికి మతగ్రంథములనిన అపరిమితమయిన గౌరవము. ఒకసారి ఆయనకు సూఫీతత్త్వాన్ని తెలుసుకోవాలని కోరికకల్గింది సూఫీ తత్త్వవేత్తల బోధనలను, మూలంలోనే చదువవలెనని ఆయన నిశ్చయించారు. అందుకని పర్షియన్ భాషాపరిచయాన్ని కలుగజేసే పుస్తకాలు కొన్ని సంపాదించి దీక్షగా చదువసాగారు. ఆ పుస్తకాలలో నిమగ్నమయిపోయిన శశిభూషణునికి ఒకరోజున శ్రీరామకృష్ణులు మూడుమార్లు ఎలుగెత్తి పిలచినా విన్పించలేదు. సంగతి తెల్సుకున్న శ్రీ గురుదేవులు: "కేవలమూ గ్రంథపఠనంలో మాత్రమే మునిగిపోయి నీ విధులను నువ్వు ఏమరునట్లయితే, అసలు నీ భక్తి ప్రపత్తి సర్వమూ చలించిపోయే ప్రమాదమున్నది. జాగ్రత్త." అని మందలించారు. నాటినుండి శశిభూషణునకు పుస్తక పఠనంమీది వ్యామోహము తగ్గిపోయింది. శీఘ్రకాలముననే ఆయన పరమహంస అంతరంగిక శిష్యులలో ఒకడై గురుదేవునే తన జీవిత పరమావధిగా గ్రహించారు.

శశిభూషణ చక్రవర్తి బి.ఏ. చదువుతుండగా పరమహంస తీవ్రమయిన అస్వస్థకు గురయి శ్యామపుకం చేరి చికిత్సనందసాగారు. వెంటనే మన శశి తన చదువువిషయం వదలివేసి, తన సర్వస్వమూ గురుదేవుల సేవకై వినియోగింపసాగిరి. పిమ్మట రామకృష్ణులను చికిత్స నిమిత్తమై కాసిపూర్ ఉద్యానభవనానికి గొనిపోగా, శశికూడా ఆయన వెంట వెళ్లారు. ఇతర శిష్యులు కూడా అత్యంతశ్రద్ధా భక్తులతో గురుదేవుని సేవించిన మాట వాస్తవమే కాని, గురు శుశ్రూషావిషయంలో మన శశి విషయం మాత్రం అత్యంత ఆశ్చర్యకరము, అపూర్వమునయి విరాజిల్లింది. గురుసేవా

సందర్భంలో విశ్రాంతి అన్నదే ఎరుగడాయన. గురుసేవయే ఆయన పరమార్థము. ఆ రోజులలో ఆయన గురుసేవమాత్రమే పట్టించుకొన్నారు గాని, మిగిలిన సాధనల విషయం ఏమీ ఆలోచించేవారే కాదు. మూర్తీభవించిన గురుసేవయే శశి అన్నట్లుండెను. స్వసౌఖ్యమును గాని, కడకు నిద్రాహారములను సయితము పాటింపక, గడియారము మాదిరిగా, సక్రమముగా తనపనిని చేసెడివాడాయన. అత్యున్నత ధర్మమని భావించి త్రికరణశుద్ధిగా ఆచరించిన గురుసేవవలననే శశిభూషణుడు పరిపూర్ణతను బడయగల్గెను.

శ్రీ గురుదేవుని అంతిమయాత్ర సమయంలో శశిభూషణుడు బాగా చలించిపోయారు. శ్మశానవాటికయందు శ్రీరామకృష్ణుని దివ్యనామాన్ని ఉచ్చైస్స్వరముతో పలుమార్లు కీర్తించారు. ఆ సందర్భమున ఆయనలో మహాసమాధి చెందుటకు పూర్వం గురుదేవులు తమపయిన వర్షించిన అవ్యాజానంద కృపావిభూతి ఒక వంకను, పరమహంస నిర్యాణంతో తామంతా ఒంటరివాళ్ళం అయిపోయామే అనే విషాదభావం ఒకవంకను మనస్సును ముప్పిరిగొన్నాయి. దహనకర్మ ముగిసిన పిమ్మట మిగిలిన పవిత్రావశేషములను శశి కడుభక్తిశ్రద్ధలతో పోగుచేసి భద్రపరిచారు.

తమ గురువర్యుని నిర్యాణం అనంతరం శిష్యబృందం బారానగరులో మఠం ఏర్పరచుకొని కాలం వెళ్ళబుచ్చసాగారు. ఆ రోజులలో ఆ బాలసన్యాసులందరూ పరమాత్మ సాక్షాత్కారమే తమధ్యేయంగా జీవించారు; శరీరాన్ని గురించిన ఆలోచనయే వారికుండెడిది గాదు. అట్టి సందర్భమున మన శశిభూషణుడే వారినందరను కంటికి రెప్పవలె కాపాడి వారి అవసరములను కనిపెట్టి నెరవేర్చెడివాడు. అఖండభక్తి విశ్వాసములతో ఒక ప్రక్క గురుపూజను నిర్వర్తించుచు, వేరొకవంక సోదర శిష్యులను కన్నబిడ్డలను మాతృమూర్తి విధముగా పర్యవేక్షించెడి శశిభూషణుని గురించి వివేకానందస్వామి తరచుగా: "మఠమునకు అతడే మూలస్తంభము, తల్లి." అని ప్రశంసించెడివారు.

తనను తిరిగి ఇంటికి తీసుకుపోవుటకు వచ్చిన తండ్రిగారితో, శశిభూషణుడు: "ఈ లౌకిక ప్రపంచము, ఇల్లు అంతా కూడా పెద్దపులుల తోను, వన్యమృగాలతోను సంకీర్ణమయిన ఘోరారణ్యంలాగా నేను భావిస్తున్నాను." అని చెప్పి, తిరిగిపోవటానికి నిరాకరించారు. ఆ తర్వాత సన్యాసదీక్ష తీసుకునే సమయమున మన శశిమహరాజ్ రామకృష్ణానంద నామధేయమును స్వీకరించారు. మన రామకృష్ణానందస్వామికి శ్రీరామకృష్ణుని యెడలగల ప్రేమానురాగాలు, భక్తి విశ్వాసాలు ఈ పేరును సార్థకంచేసినవని చెప్పాలి. రామకృష్ణ పరమహంస భౌతికంగా జీవించి ఉండగా ఆయనను తాను ఎట్లా పూజించి సేవించువారో; అదేమోస్తరుగా పరమహంస అవశేషాలను కూడా మనస్వామి అర్చించేవారు. బారానగరు మఠంలో కొంతకాలం సాధనలు చేసిన పిమ్మట ఇతర సోదరశిష్యులు పరివ్రాజక జీవితం గడపటంకోసమని దేశాటనకై వెడలిపోయారుకాని, రామకృష్ణానందస్వామి మాత్రము తన గురుదేవుని అవశేషములు ప్రతిష్ఠించిన ప్రదేశాన్ని వీడుటకు ఇచ్ఛగింపక అచ్చటనే ఉండి, వానిని పూజించేవారు. గంగాజలమును తానే స్వయముగా గొనివచ్చెడివారు, పూజకై పూవులను తానే కోసికొనివచ్చెడివారు. గురుదేవునికి నివేదింపవలసిన నైవేద్యమును తానే స్వయంగా తయారుచేసి సిద్ధపరచేవారు. శ్రీరామకృష్ణ

లకు నివేదించక పూర్వం ఏ ఆహారాన్నీ కూడా మనస్వామి స్వీకరించేవారు కాదు.

శ్రీ గురుదేవులయెడ మన రామకృష్ణా నందస్వామికి ఎంత భక్తి ప్రపత్తులు ఉన్నాయో మనం ఇంతవరకు గమనించాం. ఇదే విధమయిన భక్తి విశ్వాసాలు వివేకానంద స్వామి పట్లకూడా రామకృష్ణానంద ప్రకటించేవారు. ఒక్కొక్క సారి వేళాకోళము నకె వివేకానంద స్వామి ఏదయినా అడిగితే దానిని కూడా మనస్వామి అత్యంత శ్రద్ధా భక్తులతో నెరవేర్చేవారు. మనస్వామి ఎంతటి ఆచారపరాయణుడో మనకు తెలుసు. ఈయనను ఆటపట్టించడాని వివేకానందస్వామి ఒకనాడు: "శశి నాయెడల నీకుగల ప్రేమను పరీక్షించాలి అనుకుంటున్నాను. నాకోసమని నువ్వు ఇంగ్లీషు రొట్టెనొక దానిని ఒక మహమ్మదీయుని దుకాణంనుంచి కొనుక్కొనిరావాలి." అని అడిగారు. వెంటనే ఏమీ సంకోచించకుండా మన రామకృష్ణానందస్వామి ఆ కోర్కను నెరవేర్చారు! తాను ఎంతో కాలంగా గురుదేవుని అవశేషాలను భక్తితో పూజిస్తున్న ప్రదేశాన్ని విడిచిపెట్టి దక్షిణ దేశానికి పోవలసి వచ్చినపుడు కూడా, ఆయన వివేకానందస్వామి కోరికను నిస్సంకోచంగా నెరవేర్చారు.

మద్రాసునగరంలో నెలకొన్న శ్రీరామకృష్ణమఠం ఈనాడెంతో అభ్యున్నతిజెంది, ఆధ్యాత్మిక జిజ్ఞాసువుల కెందరికో మార్గదర్శకమై ఆశ్రయం చేకూర్చి విరాజిల్లుతోంది. దీనికంతటికి పునాదివేసిన మహనీయుడు రామకృష్ణానందస్వామియే. శ్రీరామకృష్ణుని దివ్య జ్యోతిని దక్షిణాదికి గొనివచ్చి ప్రతిష్ఠించినది మనరామకృష్ణానందయే ననుటలో సంశయింప బనిలేదు.

వివేకానందుని ఆదేశం మేరకు రామకృష్ణానందస్వామి 1897 సం॥లో మద్రాసు నగరం చేరుకొన్నారు. అప్పుడు, మొదట్లో ఒక చిన్న ఇంట్లో ఉండేవారు. 1907 సం॥లో మద్రాసు మఠానికి ఒక స్వంతగృహం శాశ్వతంగా ఏర్పడింది. తర్వాత మద్రాసు మఠం బాగా విస్తరించింది. ఇదివరలోనే గ్రహించినట్లుగా శ్రీరామకృష్ణులు జీవించి ఉండగా ఆయనను తానెట్లు సేవించేవారో అదేవిధంగా ఆయన ఎడ కూడా మనస్వామి అట్లానే పూజించి ఆరాధించేవారు. ఇదంతా చూడటానికి అద్భుతంగానూ, ఆశ్చర్యకరంగానూ ఉండేది.

శ్రీరామకృష్ణపరమహంసకు కొన్ని పదార్థాలు, పూరీలవంటివి, వేడి వేడిగా తినడం ఇష్టం ఉండేది. అందుకని, మనస్వామి, నైవేద్యం సమయంలో ఒక స్టౌను వెల్గించి ఒక్కొక్క పూరీని వేడిచేస్తూ, వేడివేడిగా వాటిని పరమహంసకు నివేదించేవారు. ముఖం కడుగుకోడానికి శ్రీ గురుదేవులకై మెత్తగా చేసిన పలుదోము పుల్లను ఉపయోగానికి సిద్ధం చేసేవారు. ఆహారం నివేదించిన పిమ్మట శ్రీ రామకృష్ణపరహంస సుఖంగా నిద్రపోవడానికి [ఆయన పటానికి] ప్రక్కనేచేరి వీవనతో విసరే వారు. ఒకసారి, మద్రాసు మఠంఉన్న ఇంట్లో వానకురుస్తుంటే శ్రీరామకృష్ణపరమహంస పటం ఎక్కడ తడిసిపోతుందో అని మనస్వామి వాన వెలిసేవరకు ఆపటానికి గొడుగుపట్టుకొని నిల్చున్నారు!!! వేసవికాలంవస్తే ఒకోసారి రాత్రివేళ హఠాత్తుగా మేలుకొని మనస్వామి శ్రీరామకృష్ణపరమహంసకు ఎక్కడ నిద్రాభంగం కల్గుతుందో అని జాగ్రత్తగా మందిరం తలుపులన్నీ తెరచి [ఆపటానికి] విసరుతూ ఉండేవారు. అక్కడున్నది పటమే అనే భావం ఆయనకేనాడూ కలిగేదికాదు. ఆ పటంలో

శ్రీ పరమహంస జీవించి ఉన్నట్లే ఆయన భావించేవారు. ఒక్కొక్క సారి చిరాకు కల్గితే ఆ చిరాకును కూడా తన గురుదేవునకు— జీవించి ఉన్నట్లే విన్నవించేవారు. ఆర్థికంగా కష్ట కాలంలో ఉన్న సమయంలో ఒక రోజున [illegible] వేసారిపోయిన స్వామి కో[illegible] పటంలోనున్న శ్రీరామకృష్ణ[illegible] "[illegible] ఇది దొరకకపోతే ఇక్కడున్న [illegible] మాత్రమే నీకు నైవేద్యం పెట్టాల్సి వస్తుంది" అని బెదిరించారు!!

ఇదంతా కూడా చూచేవాళ్లకు వింతగాను, విడ్డూరంగానూ కనిపించవచ్చు. కాని, ఆయనకు మాత్రం ఈ చర్యలన్నీ అత్యంత సహజంగానే అన్పించేవి. ఆయన ఆరాధనా విధానం ఎంత సహజంగా ఉండేదంటే;—చూచే వాళ్లకది విచిత్రంగా కన్పించినా స్వామి యొక్క భావపారవశ్యానికి ముగ్ధులయి ఆయనను గౌరవించకుండా ఉండలేకపోయేవారు.

భక్తి తత్పరతలోనే కాకుండా, బుద్ధి వైభవంలో కూడా మనస్వామి అద్వితీయుడు. సంస్కృతభాషలో స్వామికిగల పాండిత్యం అసామాన్యమయినది. తమిళభాష తెలియని స్వామి, స్థానిక పండిత ప్రకాండులతో తన వాద ప్రతివాదనలను సంస్కృతంలోనే సాగించే వారు. స్వామి వంగభాషలో రచించిన శ్రీ రామానుజాచార్యుల జీవితచరిత్ర గొప్ప ప్రామాణిక గ్రంథముగా మన్ననలు అందు కొంది. క్రైస్తవ, మహమ్మదీయ మత గ్రంథాల గురించి స్వామికిగల విజ్ఞానం అసాధారణమయి నది. ఆయనకు బైబిలు గ్రంథము ఆమూలా గ్రము కంఠస్థమే. ఒకసారి, మనస్వామి, క్రీస్తును శిలువవేయుటం గురించి ఉపన్యసింపగా; చర్చిప్రవచనములలో బాగా అనుభవమున్న పాశ్చాత్యుడే ఒకాయన, స్వామి మాటలలోని భావగాంభీర్యానికి, వర్ణనాస్పష్టతకు ముగ్ధుడయి పోయెను. తన తన ఆచార పరాయణుడే అయి నప్పటికిన్నీ, స్వామి, ఇతర మతప్రవక్తల యెడల కూడా ఎంతో గౌరవాదరములు చూపించేవారు. మద్రాసులోనున్న సెంటు థామస్ చర్చికి వెళ్ళినపుడు, మనస్వామి, అక్కడి బైబిలుపీఠం వద్దకు వెళ్లి దానిముందు మోకాళ్ళపయిన వంగి నిజమయిన క్రైస్తవుని మాదిరిగా ప్రార్థించేవారు.

ఒకసారి కొందరు మహమ్మదీయ విద్యార్థులు ఆ త్రోవనే పోతుండగా ఇంతలో వాన [illegible] మఠంలోకి వచ్చి తలదాచు కున్నారు. అప్పుడు మనస్వామి వారిని ఆదరించి వారి [illegible] వారితో మాట్లాడనారం భించారు. మహమ్మదీయ మతం గురించి ఆయన ఎంత విశదముగ వ్యాఖ్యానించారంటే; ఆ వ్యాఖ్యానం విన్న ఆ మహమ్మదీయ విద్యార్థు లకే ఆశ్చర్యంకల్గింది. తమ మతం గురించి స్వామికిగల పరిజ్ఞానమునకు ముగ్ధులయిన ఆ మహమ్మదీయ విద్యార్థులు ఆ తర్వాత పలు సార్లు మఠానికి వచ్చి వెడుతూ ఉండేవారు.

వేదాలనుగురించి మన స్వామి ఉపన్యసించే టపుడు, కేవలమూ పుస్తకపాండిత్యాన్ని మాత్రమే ఆయన ఎన్నడూ కూడా ప్రదర్శించే వారు కారు. స్వానుభవం లోతులనుంచి జనించిన అనుభవపూర్వకమయిన విజ్ఞానమే ఆయన మాటలలో వెల్లివిరిస్తూ ఉండేది. అందువలననే ఆయన ఏది మాట్లాడినా శ్రోతల చెవులలోకి మాత్రమేగాక వారి హృదయాలలోతులను స్పృశించి చొచ్చుకొని పోయేది. పుస్తకాలకు పుస్తకాలు సంపుటాలు చదివినా సమాధానం దొరకని ఆధ్యాత్మిక పరమయిన చిక్కుప్రశ్నలకు, మనస్వామి చిన్న చిన్న మాటలలో జవాబు చెప్పగలిగే వారు.

ఆయన పలుకులలో పసిడితునకలు కొన్ని ఉదాహరణకు:—

(1. ఒక కాలేజి ప్రొఫెసరుగారితో రాజకీయానికి, మతానికిగల భేదాన్ని వివరిస్తూ మన స్వామి ఇట్లా అంటారు. ''ఇంద్రియములన్నీ స్వేచ్ఛగ సంచరించడం రాజకీయము; ఇంద్రియములనుండి స్వేచ్ఛ (విముక్తి) పొంది సంచరించడము మతము.''

(2. ద్వైతసిద్ధాంతము, అద్వైతసిద్ధాంతము వీటి గురించి రామకృష్ణానందస్వామి ఇట్లా అనేవారు: ''ద్వైతభావమునందు ఆనందమే పరమగమ్యము; అద్వైతభావమున విముక్తియే పరమగమ్యము. ఇందు మొదటిదానిలో ప్రియుడు తానుకోరిన ప్రేమను అందుకుంటాడు; రెండవదానిలో సేవకుడే చివరకు యజమాని అవుతాడు. రెండూ ఉత్కృష్టమయినవే; ఏదీ తక్కువకాదు. ఒక భావముతో సాధన గావిస్తున్నవారు రెండవదానికి మారవలసిన అగత్యంలేదు.

(3. ''మానవుడు బాహ్యంగా సాగిస్తున్న పోరాటానికి ఫలితమే విజ్ఞానశాస్త్రము; అతడు తనకి అంతరంగమున సాగిస్తున్న పోరాటానికి ఫలితమే మతము. రెండూ కూడా గొప్పవే; కాని, మొదటిది చిట్టచివరకు భంగపాటుకే దారితీస్తుంది; రెండవది విజయానికి దారి తీస్తుంది. విజ్ఞానశాస్త్రం, దారితెన్ను తోచక ఎక్కడయితే ఆగిపోతుందో, మతమన్నది ఆ చోటునుంచి బయలుదేరి మనకు త్రోవ చూపిస్తుంది.''

మన రామకృష్ణానందస్వామికి గణితశాస్త్రం అంటే ఎంతో అభిమానం. ఒకసారి ఆయన మద్రాసులోని ఒక కళాశాలనుండి అత్యంత ఆధునికమయిన ఖగోళశాస్త్రవిషయక గ్రంథములను తెప్పించుకొని వానినన్నిటిని క్షుణ్ణంగా చదివారు. సరదాగా కాలక్షేపం చేయడంకోసం ఆయన గణితశాస్త్ర సమస్యలను సాధిస్తూ ఉండేవారు!

మద్రాసు మఠమున నున్నంతకాలమూ స్వామి ఎంతో కష్టించి పనిచేశారు. మొదట్లో ఆయన స్వయంగా వంటచేసుకొనేవారు, మఠంలోని పలురకాల కార్యక్రమములన్నిటిని తానే నిర్వర్తించేవారు. నగరమున పలుతావులలో జిజ్ఞాసువులకు పాఠబోధన గావించేవారు. ఒకసారి, శ్రీరామకృష్ణపరమహంస జన్మదినము ఇక కొద్దిరోజులు మాత్రమే ఉన్నదనగా జరిగిన ఒక సంఘటన ఒక భక్తుడిట్లా వర్ణించాడు: ''పరమహంస జన్మతిథినాడు బీదలకు అన్న సంతర్పణమన్నది అతిముఖ్యమయిన కార్యక్రమము. కాని, ఆరోజువరకు కావలసిన ధనసహాయం ఏదీ అందనేలేదు. ఆ రోజురాత్రి నాకు మెలకువవచ్చి చూడగా స్వామి బోనులో బంధింపబడిన సింహముమాదిరిగా రొజుతూ రొప్పుతూ గొణుక్కుంటూ వేగంగా పచార్లు చేస్తున్నారు. బీదలకు సంతర్పణచేయటం ఎట్లాగా అని స్వామి చెందిన ఆరాటమే అదంతానని తర్వాత నాకు అర్థం అయింది. విచిత్రముగా, ఆ మరునాడే, మైసూరు యువరాజు పంపిన పెద్దమొత్తం స్వామిచేతికి అంది సంతర్పణ ఏ లోటూలేకుండా నెరవేరింది.''

మనమంతా కేవలమూ నిమిత్తమాత్రులమే నంటూ స్వామి ఇట్లా సెలవిచ్చేవారు: ''ఒక కలము (Pen) ఉన్నది అనుకోండి. దానికే గనుక భావించేశక్తి ఉన్నట్లయితే అది 'నేను ఎన్నివందల ఉత్తరములు వ్రాశానో' అనుకుంటుంది. వాస్తవానికి ఆ కలం చేసింది ఏమీ లేదు. ఉత్తరాలు వ్రాసిన వ్యక్తి చేతిలో అది ఒక సాధనముగా ఉపయోగింపబడింది; అంతే. అట్లాగే 'ఇదంతా మనమే చేశాము.' అని

అనుకుంటాం గాని, నిజానికి, ఆ కలములాగానే మనం కూడా పరమాత్మచేతిలో సాధనముగా నిమిత్తమాత్రులమే. అన్నింటిని నిర్వర్తించునదంతా ఆ సర్వేశ్వరుడే''.— ఆయనలో ఈ భావము జీర్ణింపబడి ఉన్నందుననే, ఎవరూ నిర్వహింపలేని అతిక్లిష్టమయిన కార్యభారాన్ని స్వామి సునాయాసముగ నిర్వహించగలిగినారు.

బోధనా తరగతులు తీసుకోడంలో కూడా స్వామి ఒక ప్రత్యేకతను చూపించేవారు. అజ్ఞానులయిన శ్రోతలకు జ్ఞానబోధ చేస్తున్నాము అనే భావం ఆయనకెన్నడూ ఉండేది కాదు. క్లాసులకు గనుక ఒకవేళ శ్రోతలెవ్వరూ హాజరు కాకపోయినా సరే, స్వామి తన పాఠం మామూలుగా చెప్పుకుపోవడమో; లేక, ఆ నిర్దిష్టసమయాన్ని ధ్యానంలో గడపటమో చేసేవారు. దీనిని గురించి ఆయన: ''ఒకళ్లకు బోధించే ఉద్దేశంతో మాత్రమే నేనిచ్చటకు రాలేదు. ఈ పని అంతా నాకొక యజ్ఞదీక్ష లాంటిది. ఎవరువచ్చినా, రాకపోయినా సరే నా దీక్షకు భంగము రానీయను.'' అనేవారు.

తాను బోధించే ఆదర్శభావముల విషయంలో స్వామి రాజీపడటం అన్నది ఏనాడూ ఎరుగరు. తనవద్దకు వచ్చినవారందరికీ సర్వసంగ పరిత్యాగం యొక్క ఉత్కృష్టతను గురించి స్వామి తరచు బోధించేవారు. ఇది విని యువకులు సంసారం పరిత్యజించి సన్న్యాసులుగా మారిపోతారేమో అని కొందరు భయపడ్డారు. వీరంతా మఠానికి ఎంతో ధనసహాయ మొనర్చి తోడ్పడుతున్నారు. వీరికి నచ్చని విషయం చెబుతూంటే మఠానికి ధన సహాయం ఆగిపోవచ్చునేమోనని కొందరు స్వామిని హెచ్చరించారు. ఇదివిన్న మన స్వామి: ''నా గురుదేవుని నుండి నేను తెలుసుకొన్న విషయం ఇదే(త్యాగం). అదికాక నేను ఇంకేమి బోధింపగలను. మఠానికి ధనసాహాయ్యం రాకపోయినా ఫర్వాలేదు. ఏదో విధముగా గడుపుకొంటాను. ఈ త్యాగబోధనలో మాత్రం రాజీ ప్రసక్తిలేదు'' అన్నారు.

స్వామివారి కార్యరంగము ఒక్క మద్రాసు నగరానికి మాత్రమే పరిమితంకాలేదు. ఉమ్మడి మద్రాసురాష్ట్రం అంతటా విస్తరించాయి. మైసూరు ప్రాంతమున మనస్వామి విశిష్టమయిన కార్యభారాన్ని నిర్వహించి శ్రీరామకృష్ణ దివ్యసందేశవ్యాప్తికి కృషిచేశారు.

వివిధ ప్రదేశములలో స్వామివారొసగిన ప్రసంగములన్నీ పుస్తకరూపంగా ప్రచురితం అయ్యాయి. వీటిలో ''దియూనివర్స్ అండ్ దిమాన్,'' ''దిసోల్ ఆఫ్ మాన్'', శ్రీకృష్ణా ది పాస్టొరల్ అండ్ కింగ్ మేకర్'' ముఖ్యమయినవి.

ప్రేమానురాగములు మూర్తీభవించిన అనురాగశీలియే మన స్వామి. బారానగరు మఠంలో సోదరశిష్యులనందర్నీ ఆయన కన్నతల్లిలాగా కంటికి రెప్పమాస్తరుగా సంరక్షించారు. సోదరశిష్యులెవరయినా దక్షిణదేశయాత్రకు వస్తే స్వామి వారినెంతో ఆదరముగా ఆహ్వానించి చక్కటి ఏర్పాట్లు చేసేవారు. బ్రహ్మానందస్వామి మద్రాసు వచ్చిన సమయంలో మన స్వామి ఆయన ప్రయాణానికి చక్కగా తోడ్పడ్డారు. స్వామి తన భారీ శరీరాన్ని అంతటిని వంచి బ్రహ్మానందస్వామి ముందు సాగిలబడి నమస్కరించే దృశ్యం చూసి తీరవలసినదే. తర్వాత మాతృశ్రీ శారదాదేవి కొంతమంది స్త్రీభక్తబృందంతో కలిసి దక్షిణదేశయాత్రకు వచ్చిన సందర్భమున స్వామి చక్కటి ఏర్పాట్లు సమకూర్చారు. ఆ యాత్రాబృందం అంతటికి ఇసుమంతయినా

అసౌకర్యంగాని, ఇబ్బందిగాని కలుగకుండా చూడటంలో ఎంతో శ్రమపడ్డారు.

దయార్ద్రహృదయుడయిన రామకృష్ణానందస్వామి తాను మద్రాసులో నున్నపుడు అనాథ పిల్లలకోసము "రామకృష్ణామిషన్ స్టూడెంట్సుహోం" స్థాపించారు.

కేవలమూ జనాన్ని ఒక మందిగా ప్రోగుజేసి ఉపన్యాసములు గుప్పించడమనుకంటె; నిజమయిన గురువుగా, శిష్యుల జీవనవిధానాన్ని తీర్చిదిద్దడమే మనస్వామి అభిమతము. క్రమశిక్షణ విషయంలో స్వామి ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చేవారు. ఒకసారి విద్యార్థులలో ఒకడు అరచేతిపైన గడ్డమును ఆన్చి కూర్చొనడం చూచి "అట్లా ఎప్పుడూ కూర్చొనరాదు. ఆ భంగిమ తీవ్ర విచారాన్ని సూచిస్తున్నది. ఎప్పుడూ సంతోషంగ ఉండాలి," అని ఆ యువకుణ్ణి హెచ్చరించారు. మఠానికి వచ్చినవారిలో కొందరు దినపత్రికను చదువుతూఉండటం చూచిన స్వామి: "ఆ పత్రికను అవతల పారవేయండి. ఎక్కడయినా దినపత్రికను చదువుకోవచ్చు. మీ రిక్కడ చేయవలసినది కేవలమూ భగవచ్చింతనము మాత్రమే." అని మందలించారు. మరొకసారి, గర్విష్ఠి. అహంకారి అయిన పండితు డొకడు స్వామితో దేవాలయములను, సంఘాన్ని సంస్కరించాలి అని, అందునిమిత్తం తానొక ప్రణాళికను సిద్ధముచేసి ఉంచానని మాట్లాడటం మొదలుపెట్టాడు. కొంతసేపు శాంతముగా ఆ మాటలు విన్నపిమ్మట స్వామి అతనితో: "అయ్యా! మీరీ భూమిమీద అవతరించటానికి పూర్వం భగవంతుడు ఏమి చేశాడా అని సందేహిస్తున్నాను." అని వ్యంగ్యముగ చీవాట్లు వేశారు. ఆ దెబ్బతో ఆ పండితుడి ప్రవృత్తిలో గొప్ప మార్పు వచ్చింది.

మద్రాసు మఠానికి స్వామి చేసిన సేవ నిరుపమానమయినది. మఠ పురోభివృద్ధికి తన శరీరాన్నికూడా లెక్కచేయక శ్రమ పడ్డారు. ఈ విపరీత పరిశ్రమ కారణముగా స్వామికి క్షయవ్యాధి అంకురించింది. వెంటనే స్వామిని కలకత్తాకు తీసుకుపోయి బాగ్ బజారు మఠంలో ఉంచి వైద్యం చేయించారు. కాని ఫలిత మేమీ లేకపోయింది. అయితే, ఒకవంక తన శరీరం రోజు రోజుకి కృశించిపోతున్నా స్వామివారి ఆధ్యాత్మికప్రవృత్తి ఇసుమంతయు తొణకలేదు. అత్యంత అనారోగ్య స్థితిలో కూడా ఆయన: "భగవానుని గురించి మాట్లాడుతూఉంటే, నాకు ఏ బాధా అనిపించదు." అనేవారు. మృగతలోకూడా స్వామి, "దుర్గా, దుర్గా, శివా, శివా, రామకృష్ణా" అనే పేర్లనే స్మరించేవారు. చిట్టచివరకు, 1911 సం॥ న, ఆగష్టు 21 న మన రామకృష్ణానందస్వామి మహాసమాధిస్థితిని అందుకొన్నారు.

1885 సం॥ డిసెంబరు 23 న శ్రీ పరమహంస ఒక విధమయిన దివ్యానందస్థితిలో నుండి తనకు వైద్యము చేయుచున్న డాక్టరు మహేంద్రునితో ఇట్లా అన్నారు: "ఎవరు అంతరంగ కోటిలోనివారో, ఎవరు బహిరంగ కోటిలోనివారో ఈ వ్యాధి తెల్పుచున్నది. సంసారమును త్యజించి ఇచట నివసించుచున్న వారు నా అంతరంగకోటి." ఇట్లు గురుదేవుని చే అంతరంగికులని పేర్కొనబడిన వారిలో మన రామకృష్ణానందస్వామి ముఖ్యులు. శ్రీరామునకు హనుమంతు డెట్లో శ్రీ రామకృష్ణపరమహంసకు మన రామకృష్ణానంద స్వామియు నట్లే!

# సూతసంహిత

ఏలూరిపాటి అనంతరామయ్య

## నాలుగవ అధ్యాయం-ఈశ్వరపూజా విధానం :

నైమిశీయులు "భగవానుడా, విద్వాంసుడా, దీనదేవుడు నీలకంఠుడు అయిన శూలి పూజావిధానం భుక్తిముక్తిప్రదం. అది దయతో చెప్పు" అని అడిగారు.1

సూతుడు చెప్పాడు :

విప్రులారా, భోగమోక్షప్రదమైన పూజావిధి చెపుతున్నాను. వినండి. శ్రద్ధతో శ్రుతిస్మృతి ప్రోక్తమైన కర్మ ఆచరించి 2, స్నానం చేసి, గోమయంతో అలికిన పరిశుద్ధమైన శుభప్రదేశంలో ఉత్తరముఖంగా సుఖంగా కదలకుండా కూర్చొని పూజ అయేవరకూ మౌనంగా ఉండాలి 3. ఆగమశాస్త్రంలో చెప్పిన లక్షణాలు కల విచిత్రాసనం అక్కడ ఉంచాలి ఉత్తమ బ్రహ్మవేత్తలారా4. నియమంతో శ్రద్ధతో శివలింగం తీసుకొని, హృదయంలో ఉన్న దేవేశుని ప్రణవంతో ఆ శివలింగమందే ఓంకారంతో ఆవాహనం చేయాలి విప్రులారా 5. ప్రణవసహిత పంచాక్షరీ మంత్రంతో అర్ఘ్యం సమర్పించాలి మునిశ్రేష్ఠులారా. పాద్యమూ ఆచమనమూ మళ్ళీ ఆ మంత్రంతోనే సమర్పించాలి 6 'ఆపోహిష్ఠ' మొదలైన మూడు మంత్రాలతోనూ, పురుషసూక్తంతోనూ, శ్రీమత్పంచాక్షర మంత్రంతోనూ, మహాదేవునికి పునః స్నానం చేయించాలి 7. మళ్ళీ ఆచమనం సమర్పించి హరుని ఆసనంపై ప్రతిష్ఠించాలి. మునిశ్రేష్ఠులారా ప్రణవంతో నియమవంతుడై వస్త్రం అర్పించాలి 8. యజ్ఞోపవీతమూ ఆభరణాలూ ఆదరంతో ఇవ్వాలి. గంధపుష్పధూపదీపాలూ ఆదరంతోనే ఇవ్వాలి 9. ప్రణవసహిత శ్రీమత్పంచాక్షరంతోనే దేవునికి పానీయంతోసహా హవిస్సు ఆదరంతో నివేదనం చేయాలి 10. పునః ఆచమనం సమర్పించి, వక్కలు మొదలైన వానితో తాంబూలమూ, మాల్యమూ, అనులేపమూ ఇచ్చి భూమిపై దండప్రణామం చేయాలి.'' లౌకిక వైదికస్తోత్రాలతో స్తోత్రం చేసి సర్వకారణుని, సర్వజ్ఞుని, మహాదేవుని ప్రణవంతో హృదయంలో విసర్జించాలి 12.

సువ్రతులారా, బ్రహ్మచారీ, గృహస్థుడూ, వానప్రస్థుడూ ఈ ప్రకారం దేవుని అంబికాపతిని దినదినమూ పూజించాలి 13. సన్యాసి దేవదేవేశుని ప్రణవంతోనే పూజించాలి. స్త్రీలకు నమశ్శబ్దం చివరగల శివశబ్దంతోనే పూజ విహితమైనది. విరక్తులైన శూద్రులకూ ఈలాగే పూజ చెప్పబడినది 14. మునిపుంగవులారా, ఇతర సర్వనరులకూ దేవాలయం చూచి దానికి నమస్కరించటం పూజగా చెప్పబడినది. 15. ఇలా పూజచేసిన వాని జీవితం సఫలం 16 పూజవల్ల భోగం దొరుకుతుంది. పూజవల్ల మోక్షం లభిస్తుంది.

### పూజవల్ల తరించిన బోయకథ

పూర్వం ఒకబోయ ఉండేవాడు. అతడు మహాపాపి. పురుషాధముడు 17. వేదవిద్వరులారా, గోబ్రాహ్మణుల హత్యచేసి, ప్రాణాలు తీసి దారిదోపిడులు చేసి 18, కనికరంలేకుండా ఇష్టంవచ్చినట్లు భూమి అంతటా తిరిగాడు విప్రులారా.

అతనికి నేస్తమయ్యాడు ఒక బ్రాహ్మణుడు గణికాపతి 19. అతనికి ఆ బోయ కొంచెం ధనం ఇచ్చాడు ద్విజోత్తములారా. ఆ బ్రాహ్మణుడు సంతోషించి అతనికి బుద్ధి చెప్పాడు.

"నాకు (నీవు ధనమిచ్చావు కనుక) మంచి చుట్టానివే కాని నీ బుద్ధి చెడ్డది. జాలిలేకుండా అస్తమానూ చేశావు పాపాలు. నీకేమీ తెలియదు. అబ్బా! నీకేమి కానున్నదో 21." ఇలా అనేక విధాలుగా విప్రుడు బోయతో అన్నాడు.

పండితోత్తములారా, అతడూ పలుసార్లు బ్రాహ్మణవాక్కులు విన్నాడు 22. చాలా కాలానికి పురుషాధముడు బోయ వేలజన్మలలో చేసిన పుణ్యావశంవల్ల ఇంద్రియాలను జయించి 23 ఉత్తమ బ్రహ్మవేత్తలారా, విప్రునికి దండప్రణామంచేసి: "దేవా, విప్రుడా, నీవు నాకు మంచి చుట్టానివి. నేను ఎల్లప్పుడూ ఎల్లచోట్లా 24 మహా ఘోరపాపాలు చేశాను. ఏమీ తెలియనివాడిని, కనికరం లేనివాడిని. నా నాయకా, నేనిపుడీలోకంలో ఏమిచేయను? 25. అది చెప్పు. నామనస్సునిండా ఎడతెగకుండా భయం క్రమ్మింది" అని అడిగాడు.

బ్రాహ్మణుడు "మంచిది. బాగా అడిగావిప్పుడు. నీకు హితం చెప్పుతాను విను 26. భూలోకంలో పుణ్యక్షేత్రం, పురాణమహాతీర్థం, మునులూ సిద్ధులూ గంధర్వులూ అమరులూ చక్కగా సేవించేది 27 శ్రీమాద్వ్యాఘ్రపురం. అక్కడ అంబికాపతి బాగా నృత్యం చేస్తాడు. అక్కడ భక్తిపరుడవై ఉండి ఉదయమే నియమంతో స్నానం చేసి 28, దూరంనుంచి దభ్రసభను చూచి నేలపై దండంవలె (పడి) నమస్కరించి నరులకు యోగులకూ భోగులకూ గడించిన సర్వస్వమూ దానం చేసి 29 ఆ స్థానానికి భయమేర్పడినపుడు పని గట్టుకొని రక్షణ కల్పిస్తూ ఉండు" అన్నాడు.

ఇలా ద్విజోత్తముడు చెప్పగా పురుషాధముడు బోయ 30 శ్రద్ధతో పుణ్యప్రదమైన శ్రీమద్వ్యాఘ్రపురం వెళ్ళాడు.

మునిపుంగవులారా, బ్రాహ్మణుడూ శ్రద్ధతో అతనితోపాటు 31 (వెళ్ళి) అత్యంతశ్రద్ధతో ఆ ఉత్తమస్థానం చేరాడు.

ఉత్తమ వేదవేత్తలైన బ్రాహ్మణులారా, బోయ శ్రద్ధతో స్నానంచేసి 32, యోగులకూ ఇతరులకూ గడించిన సర్వస్వమూ ఇచ్చివేశాడు. వేదపారగులైన బ్రాహ్మణులారా; శ్రీమద్దభ్ర సభను నిత్యమూ 33 దూరంనుంచి చూచి నమస్కరించేవాడు. ద్విజులారా, ఐదు క్రోసులకు వెలుపల నివసించేవాడు. ఇలా దిన దినమూ చాలాకాలం ఆచరించాడు 34.

ఈ ప్రకారం బహుకాలం గడపగా ఎక్కువ పుణ్యావల్ల స్థానసంగక్షణం మిమతో అక్కడే కాలం చేశాడు 35. ద్విజోత్తములారా, అతడు మరణానంతరం వ్యాఘ్రపురాధీశుడైన అంబికాపతి అనుగ్రహంవల్ల అనేక భోగాలను అనుభవించి నిర్విఘ్నంగా పరమముక్తిని పొందాడు 36

బ్రాహ్మణుడు కూడా అలాగే ఈవ్యాఘ్రపురంలో ఉదయం నియమంతో 37 స్నానం చేసి అంబికాపతిని ఈశ్వరుని మహాదేవుని మహేశ్వరుని ముందు చెప్పిన ప్రకారం పూజించాడు 38. బ్రహ్మవేత్తృసత్తములారా, శ్రీమద్దభ్రసభాపతి ఈశ్వరుడు పరమేశ్వరుడు అతని పూజకూ ముక్తినిచ్చాడు 39

## దేవ పూజాఫలం

వేదవేత్తృశ్రేష్ఠులారా, అనేకులు కూడా ముందు చెప్పిన మార్గంలోనే శివలింగార్చనం ఆచరించి భవబంధనంనుంచి విముక్తులైనారు40. కొందరు వారాణాసి వెళ్ళి ముందుచెప్పిన

మార్గంలో మహాత్ముని మహాదేవుని పూజించి భవబంధనం నుంచి విముక్తులైనారు 41. కొందరు సోమనాథానికి, కొందరు అద్భుత కేదారానికి, కొందరు ముఖ్యమైన శ్రీశైలానికి, కొందరు నరులు గోపర్వతానికి 42, కొందరు దక్షిణ కైలాసానికి, కొందరు అగ్నీశ్వరానికి, కొందరు శ్రీహరతీర్థానికి, కొందరు వృద్ధాచలానికి 43, కొందరు ఆశ్చర్యకరమైన వల్మీకానికి, కొందరు హాలాస్యానికి, కొందరు పుణ్యప్రదమైన రామేశ్వరానికి, కొందరు కాంతారానికి ఆదరంతో 44 వెళ్ళి ముందు చెప్పిన మార్గంలో శివుని పూజించి, ద్విజోత్తములారా, వేదవిత్తములారా, అనాయాసంగా సంసారంనుంచి విముక్తులైనారు 45.

కొందరు తమ తమ ఇండ్లలోనే యథాశక్తి పూర్వోక్తమార్గంలోనే దేవుని ఆరాధించి భవబంధనం నుంచి విముక్తులైనారు 46.

కొందరు భోగేచ్ఛతో ముందు చెప్పిన మార్గంలోనే దేవుని దేవేశుని బాగా పూజించి మహాసుఖం అనుభవించారు 47.

ఎందుకిన్ని మాటలు! వినండి మునిపుంగవులారా, పూజవల్ల సర్వప్రాణులకూ భోగమోక్షములు లభిస్తాయి, మరొకవిధాన కాదు 48.

కనుక, మీరు గూడా ఈ ముందు చెప్పిన మార్గంలోనే భుక్తిముక్తిఫలప్రదుని మహాదేవుని పూజించండి 49.

అని (సూతుడు చెప్పినది) విని మునిశ్రేష్ఠులు సర్వార్థసాగరునికి సూతునికి నమస్కరించి శశిభూషణుని శంకరుని పూజించారు 50. వారి పుత్రులూ, పౌత్రులూ, జ్ఞాతులూ, స్నేహితులూ, జనులూ వారి ప్రోత్సాహంతో ఈశానుని పూజించారు 51.

ముల్లోకాలలోనూ పూజకుసాటి పుణ్యం లేదు. పూజకే మహాదేవుడు శంకరుడు, పరమేశ్వరుడు నీలకంఠుడు విరూపాక్షుడు శివుడు నిత్యమూ ప్రసన్నుడవుతాడు 52,

సర్వకారణుడు పురాణ దేవ దేవేశుడు పూజితుడైతే 53 సర్వదేవతలూ పూజితులే అని వేదాంత నిశ్చయం. భోగమూ మోక్షమూ పొందుతాడు (పూజించినవాడు). ఈవిషయమై ఆలోచన అక్కర లేదు.

: ఇది శ్రీస్కాందపురాణం సూతసంహితలోని శివమాహాత్మ్యఖండంలో ఈశ్వరపూజావిధానం అను నాల్గవ యం :

అహంకారం అణగిపోవడమే నమస్కారం. అణగడమంటే, దానిమూలంలోకి లీనమైపోవడమన్నమాట. భగవంతుడు బయటి సాష్టాంగప్రణామాలకు మోసపోడు. అహంకారం ఉన్నదా లేదా అని పరిశీలిస్తాడు. రమణమహర్షి

మూడు ప్రధానమైనత్రోవలు సాధకునకున్నవి. 1. భగవంతునిపై భారంవేసి, ఆయన అనుగ్రహంకొఱకు వేచిఉండడం. 2. అద్వైతివలె, బౌద్ధునివలె, స్వశక్తిమీదనే ఆధారపడడం. 3. మధ్యమార్గమవలంబించి పరమసంసిద్ధికై ఆకాంక్ష, అధమప్రవృత్తుల నిరాకరణ మున్నగు వానిద్వారా ఈశ్వరశక్తితోట్పాటుతో ముందుకు సాగడం. ——యోగి అరవింద.

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:

ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము:

పి. గణపతిశాస్త్రి

1911 ఆగస్టు:

ఈ వేళ సాయంత్రం కావచ్చింది. నేను మా పాతల్‌డాంగా ఇంటినించి శారదామాత సందర్శనానికి వెళ్లాను. అమ్మ గదిలో ప్రవేశించి కూరుచోగానే గోలాప్‌మా అక్కడికి వచ్చి "గురువుగారి అప్పులు తీర్చడానికి చందాలు వసూలు చెయ్యడానికి ఒక సన్న్యాసిని వారణాసినించి వచ్చింది. నీవుకూడా ఏదో కొంత ఇవ్వాలమ్మా!" అన్నది నా కేసి తిరిగి.

నేను ఎంతో సంతోషంగా దానికి అంగీకరించాను. దానిమీద అమ్మ నవ్వి అన్నది.

"ఆవిడ నన్నుకూడా చందా ఇవ్వమని అడిగింది. కాని నేను ఎవ్వరిదగ్గిర అప్పు తీసుకోలేను. అందుచేత 'ఇంకా కొంతకాలం ఇక్కడ ఉండమ్మా, అన్ని అవే సానుకూల పడతాయి' అన్నాను."

"అవును! చిట్టచివరికి అమ్మ అన్ని ఏర్పాటులు చేసింది" అన్నది గోలాప్‌మా.

దానిమీద అమ్మ నా చెవిలో "గోలాప్ మూడు కాసు లిచ్చింది." అని చెప్పింది.

మరికొంత సేపటికి ఆ సన్న్యాసిని వచ్చింది. ఆమె అంతకుమునుపు బలరామ్‌బోసు ఇంటికి వెళ్లింది. అక్కడ ఉన్న భక్తులందరు తమ శక్తి సామర్థ్యాల ననుసరించి చందా లిచ్చారు.

సన్యసించడానికి పూర్వం ఆమె ఒక గొప్ప ఇంటి ఇల్లాలని, ఏడుగురు కొడుకు లున్నారని విన్నాను. వారంతా ఇప్పుడు పెరిగి పెద్దవారయినారు. తమ విధులన్ని తమ భుజస్కంధాలమీద వేసుకుని స్వయంగా తాము నిర్వహిస్తున్నారు. ఆ తరవాతే ఆమె సంసార పరిత్యాగంచేసి సన్న్యాసం స్వీకరించింది.

"తన గురువును గురించి ఎవ్వరు అమర్యాదగా ప్రసగించకూడదు" అన్నది ఆ సన్న్యాసిని. ఆ తరవాత ఆమె నమస్కరించి తిరిగి అందుకున్నది.

"ఆయనకు కోర్టు లావాదేవీలంటే ఇష్టం. ఇప్పుడాయన బాగా పెద్దవారయినారు. అందుచేత ఆ వ్యవహారం లేవి నడిపించ లేదు. ఆయన కింతకుమునుపు అప్పులిచ్చిన వాళ్లందరు, దావాలువేసి డిక్రీలు పొందారు. ఆయన్ని జైలుకులో పెట్టించాలని కోరుతున్నారు. ఇటువంటి పరిస్థితుల్లో ఇంటింటికి వెళ్లి చందాలు వసూలుచేసి ఇవ్వడంకన్న నే నేమి చెయ్యగలను?"

అమ్మ అదంతా విని ఏదో ఒక సూక్తి ఉదాహరించింది. ఆమె సరిగా అన్నమాట లేమో నా కిప్పుడు గుర్తులేవు కాని, గురువుకు కూడా సలహా ఇవ్వవచ్చునని అలాగ చేస్తే తప్పేమీ లేదని దాని సారాంశము. ఆ పైన అమ్మ ఇలా అన్నది.

"కాని అదే సమయంలో గురువంటే గొప్ప గౌరవం కూడా ఉండాలి, అతడెటువంటి వాడయినా గురువుమీదే శిష్యుని ముక్తికి తగిన అవకాశాలన్ని ఆధారపడి ఉన్నాయి. ఠాకూరు శిష్యు లాయన నెంత గొప్పగా గౌరవిస్తున్నారో చూడండి! ఆయన మీద గౌరవంకొద్దీ, ఠాకూరు కుటుంబంలోని వారి సందరినే కాదు, ఆయన జన్మించిన జిల్లాలోని పిల్లుల్ని కూడా ఎంతో గౌరవిస్తున్నారు."

11, ఫిబ్రవరి, 1912

నేను నమస్కరించి అమ్మ దగ్గిర కూర్చోగానే ఆమె ఎంతో బాధపడుతూ ఇలా అన్నది, "అయ్యో! గిరీశబాబు పరమపదించాడు.

నాలుగవనాటి అంత్యక్రియల సందర్భంలో నన్నక్కడికి తీసుకువెళ్లడానికి వచ్చారు అతని బంధువులు. గిరీశబాబు మరి అక్కడ లేనప్పుడు నా కక్కడికి వెళ్లడానికి మనస్కరించలేదు. అతని ప్రేముడీ, నమ్మిక ఎంత మహనీయమయినవి! గిరీశబాబును గురించిన ఈ కథ ఎప్పుడయినా విన్నావా? ఠాకూరు తన కుమారుడుగా జన్మించాలని గిరీశబాబు అభిలాష. అదే కోరిక ఒకసారి ఠాకూరు సమక్షంలో వెల్లడించాడు."

"నీకు కుమారుడుగా పుట్టడానికి నాకంతటి ఆసక్తిలేదు!" అని సమాధానం చెప్పారాయన.

కాని ఆ తరవాత ఏమి జరిగిందో తెలుసునా అమ్మా! ఠాకూరు తమ భౌతిక శరీరం విడిచిపెట్టిన తరవాత గిరీశబాబుకు ఒక కుమారుడు కలిగాడు. అయితే ఆ పసివాడు నాలుగేళ్ల వయస్సు వచ్చినా ఎవ్వరితోను పెదవి కదిపి మాట్లాడడానికి ఇష్టపడలేదు! వట్టి సంజ్ఞల ద్వారానే తన అభిప్రాయాలు ఇతరులకు వెల్లడించేవాడు. ఆ పసివాడు ఠాకూరే అన్నంత భక్తిశ్రద్ధలతో తల్లిదండ్రులు ఎంతో ఆప్యాయంగా ఆదరించారు. ఆ పిల్లవాడికి నూతన వస్త్రాలు పళ్లాలు, గిన్నెలు, గ్లాసులు మొదలయినవన్నీ కొని ఇచ్చారు. వానిని ఇంకెవరిని తాకనిచ్చేవారు కాదు. "ఒక శిష్యుని విపరీతమయిన ఆకాంక్ష నెరవేర్చడానికి ఆ ఠాకూరే తిరిగి వచ్చారు ఈ రూపంలో!" అని గిరీశబాబు తరుచు అంటూండేవారు. ఒకనాడు ఆ పిల్లవాడు నన్ను చూడడానికి ఎంతగానో ఆత్రపడ్డాడు. ప్రతివారి చెయ్యి పట్టుకుని లాగుతూ అంతస్తుకేసి చూపించేవాడు. ఇలాగ చూపించేసమయంలో ఊం ఊం అని కేకలు పెడుతూండేవాడు. మొట్టమొదట ఆ పిల్లవాడి అభిప్రాయమేమో ఎవ్వరికి బోధ పడలేదు. చిట్టచివరికి అందరికి అర్థమయింది. ఆ పసివాణ్ణి నాదగ్గిరికి తీసుకువచ్చారు. ఎంతటి చిన్నవాడైనా అతడు నా కాళ్లమీదపడి నమస్కరించాడు.

తరవాత కిందికి వెళ్లి గిరీశబాబు చెయ్యి పట్టుకుని లాగడం ప్రారంభించాడు. గిరీశబాబును నా దగ్గిరికి తీసుకునిరావడమే అతని ఉద్దేశం. గిరీశబాబు కళ్లమ్మట నీళ్లు పెట్టుకుని "బాబూ? పాపిని నేను, అమ్మని చూడడానికి ఎలాగ రాగలను?" అని అడిగాడు. కాని ఆ పిల్లవాడు అతనిని విడిచిపెట్టలేదు. ఎలాగయితేనేం, ఆ పిల్లవాణ్ణి ఎత్తుకుని పైకివచ్చి, కళ్లమ్మట నీళ్లతో నేలమీదపడి సాష్టాంగ నమస్కారంచేసి, గద్గద స్వరంతో అన్నాడు. "అమ్మా, నీ పాదాల సందర్శనానికి ఈ పిల్లవాడే కారణం!" అని. కాని ఆ పసివాడు నాలుగేళ్లు నిండగనే మరణించాడు.

ఈ సంఘటన జరగడానికి కొంతకాలానికి పూర్వం గిరీశబాబూ అతని భార్య వారి ఇంటి డాబామీదికి వెళ్లారు. నేనా సమయంలో బలరామబాబు ఇంట్లో ఉన్నాను. సాయంకాలం కాగానే చల్లగాలి కోసమని బలరామబాబు ఇంటి డాబామీదకి వెళ్లాను. గిరీశబాబు ఇంటి డాబామీదినించి గమనిస్తే, నే నగపడగలనని నా కప్పుడు తెలియలేదు. ఆ సమయంలో అతని భార్య గిరీశబాబుతో "అమ్మ అక్కడ ఆ డాబామీద పచారు చేస్తున్నది." అని నిర్దేశించినదట! ఆ మాట విని వినగానే గిరీశబాబు తటాలున వెనుదిరిగి "వద్దు! వద్దు! నా కళ్లు పాపంతో నిండిపోయాయి! నే నిలాగ దొంగలాగ ఆమెకేసి చూడకూడదు" అని అంటూనే అక్కడినించి వెళ్ళిపోయాడట! నాకీసంగతి అంతా ఆయనభార్యవల్ల ఆతరవాత తెలిసింది.

—సశేషం.

# పాశ్చాత్యుల దృక్పథములో - రామకృష్ణుడు

డా. ఎమ్. శివరామకృష్ణ

శ్రీరామకృష్ణుల దివ్య వ్యక్తిత్వం మొదటి నుంచీ జిజ్ఞాసువుల దృష్టిని అమితంగా ఆకర్షించిందనటం చర్విత చర్వణమవుతుంది. ఏ హేతువాదానికీ, తార్కిక దృష్టికి అందని, లొంగని, ఆయన అపూర్వ దివ్యానుభూతులు, శుష్క పాండిత్యాన్ని నిస్తేజపరచిన ఆయన మేధస్సంపద, సమస్త మానవకోటిని తన దివ్య ప్రేమానురాగాలతో బంధించివేసిన ఆయన వ్యక్తిత్వం —ఇవి భారతీయుల్నేగాక, పాశ్చాత్య దార్శనికులను, మేధావులను, రచయితలను మొదటి నుంచీ ఇదమిత్థమని చెప్పలేని ఆకర్షణతో ఆకట్టుకున్నాయనటం నిర్వివాదాంశం.

ఈ అపూర్వ వ్యక్తిత్వాన్ని, దాని ప్రాముఖ్యాన్ని అర్థం చేసుకునేందుకు పాశ్చాత్య మేధావులు ప్రయత్నిస్తూనే వచ్చారు. అయితే ఈ సందర్భంగా ఒక విషయం గుర్తుంచుకోవాలి. శ్రీరామకృష్ణుల జీవితసారం, ఆయన దివ్యావతరణ యొక్క ప్రయోజనం, స్థూలంగా కనిపించే బాహ్యజీవిత సంఘటనలలోగాక, ఆయన అతీంద్రియానుభూతులలోను, అనితర సాధ్యమైన ఆధ్యాత్మికతలోను నిక్షిప్తమైఉంది. కనుక ఈ అనుభూతులను, ఆధ్యాత్మికతను, పాశ్చాత్య జిజ్ఞాసువులు ఏ దృక్పథంతో లించి, అర్థంచేసుకున్నారన్నది చాలా ముఖ్యమైన విషయం.

శ్రీరామకృష్ణుల జీవిత సంఘటనలను పరిశీలించి, వాటిని క్రమబద్ధంచేసి, ఆయన వ్యక్తిత్వాన్ని తమతమ శక్త్యనుసారంగా అర్థం చేసుకుని, ఆయన జీవితాన్ని రచించిన పాశ్చాత్య మేధావులు ముగ్గురు: మాక్స్‌ముల్లర్ (1823-1900), రోమారోలా (1866-1944), మనకు సమకాలికుడైన రచయిత క్రిస్టోఫర్ ఇషర్‌ఉడ్ (ఇతను 1904 లో పుట్టాడు.)

మాక్స్‌ముల్లర్ భారతీయ సాహిత్యానికి తత్వశాస్త్రానికి చేసిన సేవ అనితరసాధ్యం అని అందరూ అంగీకరిస్తారు. అపార మేధాసంపత్తి, నిశితమైన శాస్త్రీయ దృక్పథం, భారతీయ తత్వవేత్తలపట్ల గౌరవమూ, ప్రేమాగల వ్యక్తి ముల్లర్. భారతీయత, దాని సంస్కృతిపట్ల ఆయనకుగల గౌరవం దృష్ట్యా, ఆయనను 'మోక్షముల్లరు భట్టాచార్యులు' అని పిలవడం కూడా జరిగింది. ఆయనను కలసినపుడు భారతీయతపట్ల ప్రస్ఫుటమైన ఆయన గాఢమైన అనురాగాన్ని చూసి శ్రీ వివేకానందస్వామియే సంభ్రమం చెంది ఈ విధంగా ఒక లేఖలో వ్రాసారు:

"ఆయనకు భారతీయులన్నా, భారతదేశమన్నా ఎంత గౌరవం! ఆయన వ్యక్తపరచే ప్రేమలో శతాంశమైనా నాకు నా మాతృభూమిపై ఉంటే నేను ధన్యుణ్ణి!!"

శ్రీరామకృష్ణుల జీవితాన్ని, దివ్యవాణిని పాశ్చాత్య ప్రపంచానికి పరిచయం చేసే మహాదవకాశం మాక్స్‌ముల్లర్ వంటి పండితుడూ, మహామనీషికి లభించడంలో ఒక చిత్రమైన ఔచిత్యం ఉన్నది. మాక్స్‌ముల్లర్ శ్రీరామకృష్ణుల గూర్చి వ్రాసిన "A real Mahatman" అన్న పరిచయ వ్యాసం, శ్రీరామకృష్ణుల సూక్తులతో, 1896 వ సంవత్సరం, డిసెంబరు నెలలో, The Nineteenth Century అన్న ప్రముఖ పాశ్చాత్య పత్రికలో ప్రచురించబడింది. ఈ

వ్యాసాన్నే, మాక్స్‌ముల్లర్, శ్రీ వివేకానంద స్వామి ద్వారా ప్రత్యక్షంగా గ్రహించిన మరి కొన్ని విషయాలను చేర్చి, Sri Ramakrishna His Life and Sayings అన్న పేరుతో పుస్తక రూపాన తరువాత ప్రచురించడం జరిగింది.

మాక్స్‌ముల్లర్ వ్రాసిన ఈ పుస్తకం ఆయనకు భారతీయ ఆధ్యాత్మిక సంప్రదాయాల పట్ల–ఈ సంప్రదాయాలకు ఆధునికయుగంలో ప్రతీకగా నిలచిన శ్రీ రామకృష్ణులపట్ల—గల ప్రగాఢమైన గౌరవాన్ని తెలియజేస్తుంది అని అనటంలో సందేహంలేదు. అయితే ముల్లర్ పరిశోధకుడు, పండితుడు, జిజ్ఞాసువు. కాని స్వయంగా ఆధ్యాత్మిక పథంలో నడచినవాడు కాదు—అంతగా. పైగా ఆధ్యాత్మికానుభూతి ఏ లేశమాత్రమైనా లేందే శ్రీరామకృష్ణుల జీవితసారం తెలుసుకోవడం దుర్లభం. వేరొక విధంగా చెప్పాలంటే, మాక్స్‌ముల్లర్‌కి జ్ఞాన తృష్ణ ఉన్నా, ఆధ్యాత్మిక తత్వాన్ని ప్రత్యక్షంగా స్వయంగా – తెలుసుకోవాలన్న కాంక్ష అంతగా అతనిలో కనిపించదు.

అయితే శ్రీరామకృష్ణుల ఆధ్యాత్మికత పాండిత్యానికి లొంగని అద్భుతశక్తి. కనుక ఆయన జీవితంలో స్థూలమైన భౌతిక సంఘటనల వెనక సూక్ష్మమైన ఆధ్యాత్మిక సూత్రాల సాంకేతికార్థాలు దాగి ఉంటాయి. ఈ అర్థాలు అనుభవైకవేద్యాలు: తర్కానికి, చరిత్రకారులకు అంతగా అందవు. పైగా శ్రీరామకృష్ణులే చెప్పినట్లు "గ్రంథాలన్నీ గ్రంథులు" అవి మనిషిని శుష్క-పాండిత్యపు పాశాలలో బంధిస్తాయి.

దీనివల్ల ఒక విషయం స్పష్టమౌతుంది: శ్రీ రామకృష్ణుల జీవితాన్ని పాశ్చాత్య ప్రపంచానికి పరిచయం చేయడంలో కృతకృత్యుడైనా మాక్స్‌ముల్లర్, ఆయన నిజతత్వాన్ని, అతీంద్రియానుభవప్రాశస్త్యాన్ని, మానవజాతికి ఆయన అవతారం యొక్క ప్రాముఖ్యాన్ని విశదీకరించడంలో పూర్తిగా సఫలుడయ్యాడన్నది సందేహాస్పదం.

ఈ దృష్టితో పరిశీలిస్తే, శ్రీరామకృష్ణుల జీవిత సందేశాలను మరింత అభిమానంతోనూ, కొంత ఆధ్యాత్మిక అభినివేశంతోనూ వ్రాసిన తర్వాతి పాశ్చాత్యుడు రోమాఁరోలా (Romain Rolland) ఈయన ఫ్రెంచి రచయిత, కళాకారుడు, మేధావి. మాక్స్‌ముల్లర్‌వలె భారతీయ సాంప్రదాయాలపట్ల గౌరవం కలవాడు. తనకు లభ్యమైన పుస్తకాలను, పత్రికలను నిశితంగా పరిశీలించి, తన సహజ గంభీర శైలికి, తన సృజనాత్మక ప్రతిభ జోడించి, శ్రీరామకృష్ణుల, శ్రీ వివేకానంద స్వాముల జీవిత చరిత్రలను రోమాఁరోలా వ్రాసాడు. ఇవి మొదట ఫ్రెంచి భాషలో వెలువడి, 1930 లో ఆంగ్ల భాషలో ప్రచురింపబడ్డాయి.

మాక్స్‌ముల్లర్‌కూ, రోమాఁరోలాకు రామకృష్ణుల జీవిత సందేశాల్ని అర్థంచేసుకోడంలో కొన్ని సామ్యాలున్నా, విభేదాలే ఎక్కువగా కనిపిస్తాయి. సృజనాత్మక రచయితగా కొంత అనుభూతి, ప్రతిభ ఉన్న రోమారోలా శ్రీరామకృష్ణుల అంతరంగ తత్వాన్ని అర్థంచేసుకొనడంలో మరింత విజ్ఞత చూపాడనే చెప్పాలి. దీనివల్ల శుష్క-పాండిత్యపు ఛాయలూ తార్కిక జనితమైన సందేహాలూ రోమారోలా వ్రాసిన జీవిత చరిత్రలో అంతగా కనిపించవు.

పైగా రోమాఁరోలా శ్రీరామకృష్ణుల జీవిత సందేశాల్ని చిత్రించడంలో, పాశ్చాత్య మత సిద్ధాంతాలతో తులనాత్మకంగా పరిశీలించే ధోరణి కనిపిస్తుంది. దీనివల్ల, శ్రీరామకృష్ణుల ప్రాముఖ్యత భారత దేశానికే పరిమితం కాకుండా, అన్ని విలువలూ సన్నగిలి మర్మ

భూమిగా మారిన ప్రపంచాన్ని పునరుజ్జీవం చేసే పునీత ఆధ్యాత్మిక ధారగా భాసిస్తుంది. అంటే, మాక్స్‌ముల్లర్, శ్రీరామకృష్ణులను భారతదేశపు సాంప్రదాయపు ఆధ్యాత్మికతకు ఈ కాలపు చిహ్నంగా భావిస్తే, రోమారోలా ఆయన నిజమైన ఆధ్యాత్మిక తత్వాన్ని స్థూలంగానైనా గ్రహించి, దాని ప్రాముఖ్యత సమస్త మానవకోటికి చెందుతుందని భావించాడు. క్లుప్తంగా చెప్పాలంటే, రోమారోలా శ్రీరామకృష్ణ, వివేకానందులను "విశ్వజనీనమైన దివ్యప్రబోధం" (Universal gospel) గా వర్ణించాడు.

అయితే, వీరిద్దరూ ఈ జీవిత చరిత్రలను వ్రాసిన నాటి ఆధ్యాత్మిక, నైతిక, మానసిక వాతావరణాన్ని పరిశీలిస్తే ఒక చిత్రమైన విషయం గమనిస్తాం. హేతువాదం పెచ్చు పెరిగి, దీనికి తోడు ఫ్రాయిడ్ మొదలైన మానసిక శాస్త్రవేత్తల ప్రభావం చేరి అతీంద్రియానుభూతుల పట్ల, ఆధ్యా[illegible]త్మ[illegible] క్రమేపీ నమ్మకం సడలుతున్న సంధియుగంలో మాక్స్‌ముల్లర్, రోమారోలా తమ జీవిత చరిత్రలను వ్రాసారు. దీనివల్ల అతీంద్రియానుభూతులపట్ల కుతూహలమేగాని (Curiosity), వాటి ద్వారా పరమ సత్యాన్ని గ్రహించవచ్చునన్న నమ్మకం చాలా మందివలె మాక్స్‌ముల్లర్‌కి, రోమారోలాకు తక్కువేమో అనిపిసుంది. అంటే మతం నైతికమైన విలువలను పరిరక్షించే సాధనంగా వారు గ్రహించారుగాని అది పరమ సత్యాన్ని గ్రహించగలిగే ప్రక్రియగా వారు అంతగా గుర్తించలేదు. అందువల్ల శ్రీరామకృష్ణులను వారు ఒక అపూర్వ [illegible]కిగా వర్ణించారుగాని ఆ వ్యక్తిత్వం మానవజాతికి ప్రసాదించిన అపార ఆధ్యాత్మిక సంపదను, దాని ప్రాముఖ్యాన్ని, ఆ సంపదను మనందరం స్వంతం చేసుకొనే పద్ధతులను, ఈ ఇద్దరు రచయితలు అంతగా గుర్తించలేదనిపిస్తుంది.

ఈ విషయం దృష్టిలో ఉంచుకుంటే, వీరిద్దరి తర్వాత Sri Ramakrishna and His Disciples అన్న పేరుతో క్రిస్టోఫర్ ఇషర్‌ఉడ్ వ్రాసిన జీవిత చరిత్రయొక్క ప్రాముఖ్యత స్పష్టంగా గోచరిస్తుంది. (ఇది 1965 లో ప్రచురింపబడింది) ఈ ప్రాముఖ్యాన్ని విశదీకరించాలంటే, మాక్స్‌ముల్లర్, రోమారోలాల తర్వాత పాశ్చాత్య భావ ప్రపంచంలో వచ్చిన సాంస్కృతిక విప్లవాన్ని గుర్తుంచుకోవాలి. విలియం జేమ్స్, సి. జి. యూంగ్, జె. బి. రైన్ మొదలైన మానసిక శాస్త్రవేత్తల పరిశోధనల వల్ల చాలా చిత్రమైన విషయాలు బహిర్గతమయినాయి. ఆధ్యాత్మిక సాధనల ద్వారా పొందే అతీంద్రియానుభూతులు నరాల బలహీనతవల్ల ఏర్పడ్డ మానసిక జాడ్యాలు కావనీ, అవి ఒకానొక,—భౌతికమైన హద్దులను దాటిన— సత్యాన్ని దర్శింపచేసే ప్రక్రియలనీ పాశ్చాత్య మేధావులు గుర్తించారు. దీనివల్ల హైందవ సాధనా పద్ధతులపట్ల ఉత్సుకత, అతీంద్రియ జ్ఞానం పొందాలనే తపన చాలమంది పాశ్చాత్య మేధావులను ఉద్దీపింప చేసాయి. పైగా రెండు ప్రపంచయుద్ధాల మారణహోమం తర్వాత పాశ్చాత్య దేశాలలో సంభవించిన ప్రబలమైన ఆధ్యాత్మిక నిర్వేదం, నైతికమైన పతనం గుర్తించి, ఈ మేధావులు, దీనికి ఆధ్యాత్మికత పట్ల నిర్వేదమే ముఖ్యమైన కారణం అని గ్రహించారు. అందువల్ల వీరు-ఆల్డస్ హక్స్‌లీ, గెరాల్డ్ హెర్డ్ మొదలైనవారు—మానవ

జీవితం సంపూర్ణతను సంతరించుకోటానికి ఆధ్యాత్మికానుభూతి వినా వేరే మార్గమూ లేదని గ్రహించారు. అంటే వీరికి మతమూ, సాధనా కేవలం కుతూహలాన్ని కలిగించే మానసిక విశ్లేషణాలు కాదు. అవి పరమ సత్యాన్ని గ్రహించడానికి అవసరమైన ప్రక్రియలు.

ఈ విషయాలు దృష్టిలో ఉంచుకుంటే క్రిస్టోఫర్ ఇషర్‌ఉడ్ వ్రాసిన జీవిత చరిత్ర యొక్క విశిష్టత అర్థమౌతుంది. ఇషర్‌ఉడ్ ప్రముఖ పాశ్చాత్య మేధావులందరిలాగా ఆధ్యాత్మిక మరుభూమిలో హేతువాదమనే కర్రను పట్టుకుని ప్రయాణం సాగిద్దామని ప్రయత్నించినవాడే. కనుక దీని వెనక ఉన్న నిర్వేదం దృష్ట్యా ఆధ్యాత్మికత యొక్క నిజమైన విలువను స్వానుభవం ద్వారా గ్రహించిన వ్యక్తి. పైగా ఇతను అపార ప్రతిభగల నవలా, నాటక రచయిత. అన్నిటినీ మించి శ్రీరామకృష్ణ సంప్రదాయంతో ప్రత్యక్షంగా సంబంధం కలిగినవాడు. అమెరికాలోని హాలీవుడ్ మఠ వ్యవస్థాపకులైన శ్రీ ప్రభవానంద స్వామి వద్ద ఇషర్‌ఉడ్ దీక్ష గ్రహించాడు

దీనివల్ల శ్రీరామకృష్ణుల జీవితాన్ని చిత్రీకరించటంలో ఇషర్‌ఉడ్ కృత్రిమమైనపాండిత్య ధోరణిని లవలేశమైనా కనిపించనీయడు. పైగా ఒక పరిశోధకుడు అద్భుత విషయాన్ని అర్థం చేసుకోనటంలో చూపించే నిష్పాక్షికత, శ్రద్ధ, వినయమూ ఇషర్‌ఉడ్ జీవిత చరిత్రలో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. వీటన్నిటినీ మించి తాను రచనకై గ్రహించిన వ్యక్తిత్వంపట్ల సిద్ధ్వంద్వమైనగౌరవమూ, శ్రద్ధా, ఆవ్యక్తిత్వం లౌకికమైన పరిధులకు అందదన్న విశ్వాసం వల్ల జనించిన వినయమూ ఇషర్‌ఉడ్‌లో కనిపిస్తాయి.

దీనివల్ల శ్రీరామకృష్ణుల జీవితంలో పడుగూ పేకల్లా పెనవేసుకొన్న అసంఖ్యాకమైన అద్భుత సంఘటనలపట్ల, అతీంద్రియానుభూతులపట్ల, ఇషర్‌ఉడ్ తటస్థంగా ఉండడు- మాక్స్‌ముల్లర్, రోమారోలాలవలె. ఈ అనుభూతులే శ్రీరామకృష్ణుల జీవితసారమనీ వాటిలోనే ఆయన సందేశం ఇమిడి ఉన్నదని ఇషర్‌ఉడ్ నమ్మటమేగాక, తన పాఠకులకు సూటిగా, విస్పష్టంగా చెపుతాడు. పైగా శ్రీరామకృష్ణులు దివ్యపురుషులేకాక, ఆధునిక యుగంలో ఆధ్యాత్మిక విలువలను పునరుజ్జీవం చేయటానికి మానవరూపం దాల్చిన దివ్యావతారం అని ఇషర్‌ఉడ్ పాఠకులకు విస్పష్టంగా తెలియచేస్తాడు.

పాశ్చాత్య మేధావులు రచించిన శ్రీరామకృష్ణుల జీవిత చరిత్రల ఈ పరిచయంవల్ల ఒక విషయం స్పష్టమౌతుంది. శ్రీరామకృష్ణుల స్థూల జీవితాన్ని అందరూ గ్రహించినా, ఆ జీవితం వెనక ప్రచ్ఛన్నమైన సత్యాన్ని గ్రహించటానికి వేరొక జ్ఞానం పొందించుకోవాలి. సాధనవల్లగాని, పూర్వ పుణ్యం వల్లగానీ ఆ జ్ఞానంలో లవలేశమైనా మనకు లభిస్తే శ్రీరామకృష్ణుల ఆధ్యాత్మికానుభూతుల అపార అమృత కలశంలో ఒక్క బిందువును రుచి చూసినట్లే. ఆ ఆధ్యాత్మికపథం వైపు మనమందరమూ నిర్విరామంగా పయనించాలనే శ్రీరామకృష్ణుల జీవిత, సందేశసారం,

# ఆస్తికత్వమంటే...

ఎమ్. కృష్ణస్వామి

సామాన్యంగా శుచీశుభ్రాలకెక్కువగా ప్రాధాన్యమిస్తూ, అంతో యింతో నామ స్మరణా, ఎంతో కొంత పూజలూ పునస్కారాలూ చేసుకొనే వాళ్ళను ఆస్తికులని పిలవడం మనకలవాటు. అలా చేయనివాళ్ళను, దేవుడున్నాడని మేం నమ్మం అనేవాళ్ళనూ నాస్తికులని మనం కోప్పడుతూ వుంటాం. దేవునికి దణ్ణాం పెడుతున్న మనలోనే పిల్లికి కూడా బిచ్చం పెట్టనివాళ్ళూ, తోటి వాడికి కష్టం వస్తే కన్నెత్తి చూడటానికి యిష్టపడని వాళ్ళూ, తల్లిదండ్రులు వృద్ధులైతే ఈ బరువంతా అనవసరంగా మన నెత్తిన పడిందే అని బాధపడేవాళ్ళూ, తల్లిదండ్రులు పోయి అప్పా చెల్లెళ్ళ బాధ్యతమీద పడినా, చిన్న వయస్సులోనే దిక్కులేక ఆడబడుచు యింటికి చేరినా వాళ్ళను పని మనుషులకన్నా హీనంగా చూసేవాళ్ళూ, భార్య స్వతంత్రించి ఒక మంచి పనిచేస్తే భరించలేనివాళ్ళూ, యింకెన్నో చిత్ర విచిత్ర లక్షణాలు కలవాళ్ళు వున్నారు. అందరమూ ఆస్తికులుగానే చెల్లిపోతున్నాం.

చిత్రమైన సత్యమేమిటంటే, దేవుడున్నాడని నమ్ముతున్న మన ఆస్తికులకన్నా, దేవుడు లేడని ప్రచారం చేస్తున్న నాస్తికులలోనే మంచి హృదయాలు కలవాళ్ళు ఎక్కువ సంఖ్యలో కనబడుతున్నారు. ఎవరికి కష్టం వచ్చినా "మేమున్నాం" అనేవాళ్ళూ, పది మందికి పనికొచ్చే పనికోసం ప్రాణాలైనా ఇచ్చే వాళ్ళూ వాళ్ళలోనే ఎక్కువగా కనబడుతున్నారు. వాళ్ళలో మనం పట్టగలిగే తప్పల్లా ఒక్కటే. దేవుడు లేడంటున్నారని అంతేగా!

దేవుడు లేడంటున్నా వాళ్ళు అంతో ఇంతో మంచిపని చేస్తున్నారు. వాళ్ళని తిడుతూ దేవుడున్నాడని వేషభాషల్లో చాటే మనం మంచి చేయాలంటే ఏదో మునిగిపోయేటట్లు మొహం పెడుతున్నాం. నిజానికి దేవుడున్నాడని నమ్మటమంటే ఎక్కడో వున్నాడని నమ్మడం కాదు. దేవుడెక్కడో లేడు. అంతటా వున్నాడు. మనతోటి జీవరాసుల రూపంలో ప్రత్యక్షమవుతోంది వాడే. మిత్రులుగా శత్రువులుగా, బంధువులుగా, భార్యాబిడ్డలుగా మనచే చూడబడుతున్న యింకెన్నో రకాల వాళ్ళుగా నటన చేస్తోంది వాడొక్కడే. "నర్తకుని భంగి పెక్కగు మూర్తుల నెవ్వడాడు" అని గదా భాగవతం చెబుతోంది! మనం అసహ్యించుకొంటున్న నాస్తికుల వేషం వేసుకొని వచ్చింది కూడా వాడే. ఆ సంగతి మర్చిపోయి మనం వాళ్ళని తిడుతున్నాం. ఇలా మర్చిపోవడాన్నే 'మాయ' అంటారు.

దేవుడున్నాడని నమ్మడంకాదు మనం చేయవలసింది. దేవుడున్నాడని మనకి తెలియాలి. దేవుడున్నాడని యివ్వాళ నమ్మాము అంటే, దేవుడు లేడని రేపో ఎల్లుండో బాకా వూదుతామన్నమాట. దేవుడున్నాడని తెలియడమంటే ఈ విశ్వముయొక్క రూపమే ఆయన విశ్వరూపంగా తెలియడం. ఇప్పుడు చెప్పండి, దేవుడికి పూజ చేయడమంటే ఏమిటో? తోటి జీవరాసుల రూపంలో దిగివచ్చి, మనతో కలిసి వుంటూ, కలిసి తింటూ లీల చూపిస్తున్న ఆ దేవుని సేవించడమే నిజమైనపూజ. అంటే మనమేం చేయగలమో, ఏం చేయగల శక్తి భగవంతుడు మనకి ప్రసాదించాడో ఆశక్తితో మన చుట్టూవున్న ప్రపంచాన్ని సేవించడమే దేవుని పూజ. ఇంట్లో మనం చేసుకొనే పూజలన్నీ ఈ అసలు పూజ చేయడానికి మన మనస్సు దారికి వచ్చేందుకుగాను నిర్వహించుకొనే శిక్షణ తరగతులలాంటివి. ఒక నాటకం రక్తికట్టేలా వేయా

లంటే ఆనాటకం వేసేవాళ్లు తరచు 'రిహార్సల్సు' వేసుకొంటూ వుండాలి. కొద్ది నెలలపాటు 'రిహార్సల్సు' లేకపోతే ఎంతపెద్ద యాక్టర్లయినా 'స్టేజి' మీద రాళ్లు పడే ప్రమాదముంది. అలాగే మనశక్తికొద్దీ మనం సమాజాన్ని సేవించగలగాలన్నా, సమాజాన్ని సేవించేశక్తి మనకు పెరగాలన్నా ఋషులు మనకొరకు వేసిపెట్టిన మార్గాన్ని తప్పక అనుసరించాలి. ప్రార్థన, పూజ, సత్సంప్రదాయములు, అష్టాంగ యోగమార్గము తప్పక అభ్యాసం చేయాలి. మన చుట్టూవున్న జీవులను సేవించడం మాని పూజలు మొదలైనవి ఎంతచేసినా ఏం ప్రయోజనం వుండదు. కట్టెలకు నిప్పంటించకుండా ఎంత విసిరితే మాత్రం ఏం ప్రయోజనం?

బాధ్యతలను విడిచిపెట్టడమే భక్తి అనుకొనేవాళ్ళు మనలో కొందరున్నారు. తల్లిదండ్రులను, భార్యాబిడ్డలను వదలిపెడితే మోక్షం వస్తుందనుకొనేవాళ్ళు ఇంకొందరున్నారు. బాధ్యతలను విడిచిపెట్టటం భ్రష్టత అవుతుందిగాని భక్తికాదు. ''కర్మల యందు నిపుణత చూపటమే యోగమని కృష్ణుని ఉపదేశం. బాధ్యతలను బరువుగా కాకుండా లీలగా, క్రీడగా, పరిపూర్ణంగా నిర్వహించాలని ఆ జగద్గురువు నొక్కి చెప్పాడు. బంధాలను వదలిపెట్టమంటే బంధువులను వదలిపెట్టమని అర్థం కాదు. తల్లిదండ్రులలో, ఆలుబిడ్డలలో నీవనుకొంటున్న బంధుత్వాలను వదలి 'నన్ను' అనుభవించుట నేర్చుకొనుమని కృష్ణుని ఉపదేశము. ఆయనెవ్వరినీ వదలిపెట్టలేదు. అవకాశం ఇచ్చినంతవరకూ అందరికీ సహకరించాడు. కనుక వేదాంతం వేరు, పెట్ట వేదాంతం వేరు. ఈ తేడా తెలియాలి.

మనం మాటల్లో చెబుతున్నవి, మంత్రాల్లో వల్లిస్తున్నవీ ఆచరణలోకి తెచ్చుకోలేకపోవడం వల్లనే నాస్తికులు పుట్టారు. 'సమత్వం యోగ ఉచ్యతే' అని ఉపదేశించి, విద్యావినయ సంపన్నుడైన బ్రాహ్మణునిలోను, గోవులోను, ఏనుగులోను, కుక్కలోను, కుక్కను చంపి తిన్నవానిలోను ఒకేదేవుని అనుభవించవలెనని కృష్ణుడు చెప్పగా, ఆ భగవద్గీతనే వీళ్లు చదువవచ్చు, వాళ్లు చదువకూడదు అని మనం ఆంక్షలుపెట్టాం. అందరిలో అందరిగా వున్నది నేనేనని ఆయన చెబుతూవుంటే అస్పృశ్యులంటూ కొందరిని వేరుగా నిలబెట్టాం. ఈ సృష్టి వైభవమంతా ''నా పరా ప్రకృతి స్వరూపమని'' 'ఆయన' చెబితే ఆడువాళ్లు వేదం చదవకూడదని మనం అహంకరించాం. మరి అడుగడుగునా యిలా ముళ్లకంచెలు వేసుకొంటూ వెళుతున్నాం కనుకనే విసుగుపుట్టి కొందరు దేవుడే లేడన్నారు. దేవుడిపేరిట మనం అడ్డమైన పనులూ చేస్తున్నాం కనుక, దేవుడే లేడంటే రోగం కుదురుతుందని వాళ్ల వుద్దేశం. మనం పెద్దల మార్గంలో సక్రమంగా నడుస్తుంటే సంతోషించి, వాళ్లూ మన సరసన చేరుతారు.

అయితే, దేవుడు లేనేలేడని తీవ్రంగా వాదించే వారి మాటేమిటి? అని మీరడగవచ్చు. వాళ్లు నిజానికి నాస్తికులు కారు. దైవదర్శనం కోసం తపనపడుతూ, ఆతన్ని వెతుక్కుంటూ, విరహపడుతూ, ఓపికలను కోల్పోతున్న గోపికలు వాళ్లు. ఆ కృష్ణుడు అనుగ్రహించిన మరుక్షణమే ఆతనిలో కరిగిపోగలరు. ఆ తరువాత వారే ఆతని చేరేమార్గం మనకు కూడ చూపగలరు!

# ప్రారబ్ధకర్మ

కాశావజ్ఝల రామకోటిశాస్త్రి

'ఎచ్చటెచ్చట పొగ యుంటున్నదో, అచ్చటచ్చట అగ్ని యుంటున్నది. ఆ తీరున శరీరమున్నచోట్లెల్ల ఉపాధి యున్నంతవఱకు సుఖదుఃఖాదుల యనుభవముండియే యున్నది' అను శాస్త్రములందు ప్రతిపాదింపఁబడిన వ్యాప్తి ననుసరించి సుఖదుఃఖాదులు ప్రారబ్ధ రూప శరీర మున్నంతవఱకు అనుభూతము లగుచున్నవి. కారణములేక కార్యము గలుగదు. అగ్నిలేక ధూమముండదు. వహ్నిలేక పాకముగాదు. జలములేక దాహము తీరదు. మేఘములేక వర్షము కురియదు, శాంతిలేక ప్రసన్నత గలుగదు. కట్టెలులేక అగ్ని ఉద్దీపముగాదు. ఈ లాగున కారణముండియే కార్యము గలుగుచున్నది. కావున కర్మ యుండి యున్నందుచేతనే సుఖదుఃఖాదులు గలుగుచున్నవి. కాబట్టి యెవరికైనను యత్కించిత్ సుఖదుఃఖాదులుండిన దానికి కారణమగు ప్రారబ్ధకర్మను అవశ్యమంగీకరించ వలయును. అందుచే సుఖదుఃఖాదులనుభవింపఁబడుచుండగా "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" అన్నట్లు బ్రహ్మజ్ఞానియొక్క ప్రారబ్ధకర్మ నశించుచున్నదని శాస్త్ర సిద్ధాంతము. ఈ శ్లోకమున జీవన్ముక్తి స్థితిపొందిన విద్వాంసునియొక్క ప్రారబ్ధకర్మను గుఱించి చెప్పి యున్నారు. వారికి సుఖదుఃఖాద్యనుభవముచే ప్రారబ్ధకర్మ ప్రతీయమానమైనను అది స్వప్నము వంటిదనియు ఆ ప్రారబ్ధకర్మ తన యాత్మానుభవమునకడ్డు రాదనియు తెలియ వలెను. ఈ శ్లోక తాత్పర్య వివరణముచే జీవన్ముక్తుల యొక్కయు విదేహముక్తుల యొక్కయు యత్కించిత్తుగానున్న స్వరూప భేదము విశదమగుచున్నది. జీవన్ముక్తులు గాని, విదేహముక్తులుగాని జీవించి యున్నప్పుడే జీవన్ముక్త్యవస్థను గాని, విదేహావస్థనుగాని పొందవలయును. జీవన్ముక్తులు అఖండవిజ్ఞానమును సంపాదించినవారైనను, ఆ మహానుభావులకు ప్రారబ్ధజనిత శరీరోపాధి యున్నంతవఱకు సుఖదుఃఖాదులు ప్రతీయమానములై యుండును. అయిన నాసర్వము స్వప్నమువలె మిథ్యగా భాసించును. ఇదియే తురీయ స్థితి యగును. ఈ తురీయస్థితిలో నున్నవారు జీవన్ముక్తులగుదురు. విదేహముక్తులనగా దేహముండినను దేహధర్మముల నంటక ఈషత్ ప్రారబ్ధకర్మకుగూడ దూరులయినందుచే సుఖదుఃఖాదులుగూడ ప్రతీయమానములు గాని వారై, సకలదృశ్యాతీతులై గాఢసుషుప్తియం దున్నవారెటుల జగత్తును మఱచియుందురో ఆలాగున సమస్తమును తన శరీరమునుగూడ మఱచినవారై ప్రచ్యుతి లేనివారై అచ్యుతులై ప్రపంచాతీతులై పరబ్రహ్మమందే నిరంతర ముండువారు. ఇదియే తురీయాతీతస్థితి యగును. ఇట్టి తురీయాతీతస్థితిలో నున్నవారే విదేహముక్తులగుదురు. తురీయములోనున్న వారు జీవన్ముక్తులనియు, తురీయాతీతస్థితిలో నున్నవారు విదేహముక్తులనియు సకల వేదాంతసారగ్రంథములు తెలుపుచున్నవి. ఇక సంచితకర్మ విషయ మెట్లనగా :- సంచిత కర్మయనగా అనేక జన్మలనుంచి జగత్తున యెన్ని రూపములున్నవో వానినన్నింటిని ధరించి శతకోటి ముఖములుగా ఆర్జింపఁబడిన మలిన ధన సమూహము. అదెన్నటికిని యను భవముచే తరుగునదిగాదు. ఒక మహా విశాలమైన అపరిమితమైన కంటకారణ్యము గొడ్డండ్లచే, కత్తులచే భేదింప సాధ్యముగాదు. దానిని ఆటంబాంబును ప్రయోగించి దహిం

తురు. ఆలాగున సంచితకర్మయు శాస్త్రవిచారణచే కించిత్తు ధ్యానముచే కొంత శ్రవణ, మనన, నిధిధ్యాసములచే నశించునదిగాదు. అగాధనిమ్నలోనికి, అఖండములగు శ్రవణ, మనన, నిధిధ్యాస సాక్షాత్కారములలోనికి నిరంతరము ప్రవేశించి అనాత్మవాసనలను దరి జేరనీయక "అహం బ్రహ్మాస్మి" (నేను అఖండ పరిపూర్ణ పరబ్రహ్మను) అను బ్రహ్మాస్త్రమును ప్రయోగించిన సకల సంచితకర్మ భస్మమగుచున్నది. అనాదిగా చిలుముపట్టిన బంగారమును అగ్నిలో తప్తము జేసిన సకలమాలిన్యమునశించి శుద్ధమగునటుల జీవుఁడు మలినాత్ముడైనను "అహంబ్రహ్మాస్మి" అను విజ్ఞానముచే మాలిన్యనిర్ముక్తుడై శుద్ధతను గాంచుచున్నాడు. సకల సంచితకర్మనుంచి విముక్తుఁడగుచున్నాడు. ఒకానొకడు అప్పుజేసి ఋణపడి తీవ్రబాధను అనుభవించు చున్నాడు. అతడు కోటీశ్వరుడగు దయామయుడగు ప్రభువు శరణము పొందుట చేత ఆ ధనమంతయు నిచ్చి ఋణవిముక్తిని జేయుచున్నాడు. ఆ తీరున జీవుడును భగవంతుని శరణుపొంది అహంబ్రహ్మాస్మి అను విజ్ఞాన ధనమునుపొంది సంచితబంధ విముక్తుడగుచున్నాడు. అనంతముగా దూది రాసులుండిన ఒకే క్షణకాలమున వహ్నిజ్వాలలచే దగ్ధమగునటుల విజ్ఞానముచే కర్మసంచితమంతయు దగ్ధమగుచున్నది. స్వప్నములో నెన్నియో వ్యవహారముల తాఁ జేయుచున్నాడు. అనంతముగానానందించుచున్నాడు. అటులనే దురవగాహదుఃఖముల ననుభవించుచున్నాఁడు. మేలుకొనిన తర్వాత దానినంతయు అసత్యముగా తలంచి శాంతినొందువిధమున నేను బ్రహ్మమను స్వయంప్రబోధచే మేల్కాంచిన అనుభవవిజ్ఞాని సకల సంచితకర్మక్షయమును పొందుచున్నాఁడు. అనగా స్వయంప్రబోధచే సకల కర్మలు నశించుచున్నవి. ఋణవిముక్తునివలెను, రాహుముక్త చంద్రునివలెను అమందానందమును పొందుచున్నాడు. మేలుకొనినవాడు సమస్తమును నెఱుంగువిధంబున ప్రబోధముగలవాడు సమస్తమును బ్రహ్మముగా జూచువాడగుటచే సకల కర్మనిర్ముక్తుడై పరబ్రహ్మము తానగుచు అట్టి పరబ్రహ్మ విజ్ఞానమును పొందుచున్నాడు. అహంబ్రహ్మాస్మి జ్ఞానమహిమను ఉపనిషత్తులు యీ లాగున తెలుపుచున్నవి.

అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం
బుద్ధివ్యాధిం వినాశయేత్ ॥
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం
చిత్తబంధం వినాశయేత్ ॥
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం
చిత్తవృత్తిం వినాశయేత్ ॥
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం
సంకల్పాదీన్ వినాశయేత్ ॥
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం
కోటి దోషం వినాశయేత్ ॥
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం
కామాదీన్ నాశయేత్ క్షణాత్ ॥

అహం బ్రహ్మాస్మి అను విజ్ఞానమును మనస్సునకు వ్యాధి రూపమైన, బంధరూపమైన, ఆవరణరూపమైన, వృత్తిరూపమైన, సంకల్పరూపమైన చిత్తరూపమైన మూలాజ్ఞానమును నిశ్శేషముగా నాశనమొనరించుచున్నదని భావము. అట్టి విజ్ఞానము అజ్ఞాన జన్యకోటి దోషములను, కామాదులను పోనిమ్మాలముగ నశింపఁ జేయుచున్నది.

# ఏకం సత్

చిర్రావూరు వెంకట్రావు

పంచభూతాలైదింటిలో జలమనే పదార్థం ఒకటి. ఆ నీటికి నామరూపాలు చాలా వున్నాయి. జలమునకు ఆవిరిగా మారి అన్ని దిక్కులకు వ్యాపించే శక్తి వుంది. ఆ యావిరికి రూపం లేదు. నామం మాత్రమే వుంది. అది మనకంటికి అగోచరంగా వుంటుంది. కాని ఆవిరి అనే పదార్థం ఉన్నట్లు మనం తెలుసుకోగలం. అదే ఆవిరి మంచుగడ్డగా మారి కొండలమీద వాలుతుంది. అప్పుడు దానికొక స్వరూపం యేర్పడుతుంది. కళ్లు జిగేలు మనేటట్లు తెల్లని కాంతితో ప్రకాశిస్తుంది. కాబట్టి జలమనే పదార్థం కంటికి కనిపిస్తుంది, కనపడకుండానూ వుంటుంది. నీటికొక రంగు కూడ వుంది. వెలుపలి రంగులను తీసుకొనే శక్తికూడ వుంది. సముద్రంలో నీరు నీలం రంగుగా వుంటుంది. నూతిలో నీరు నల్లగా కనుపిస్తుంది. చెరువులో నీరు ఎరుపురంగుగా కనపడుతుంది. హిమాలయాల్లో సూర్య కాంతితో మెరుస్తుంది. ఆ నీటికే నదినీరని, సముద్రంనీరని, నూతినీరని, గుంటనీరని, మురికి నీరని పేర్లున్నాయి.

ఈ విధంగా అనేక నామరూపాలతో ఉన్నప్పటికినీ జలమనే పదార్థం ఒక్కటేనని మనం తెలుసుకోవాలి. అదే విధంగా దైవ స్వరూపంగూడ ఒక్కటే.

"ఏకం సద్విప్రా బహుధా వదన్తి"

నిజమైన పదార్థం ఒకటే, జ్ఞానులు దానికి అనేక పేర్లు పెట్టుతున్నారని వేదం చెబుతుంది.

భగవంతు డొక్కడే. అతను ప్రపంచాని కవతల కనుపించకుండా వుంటాడు. ప్రపంచంలో కనుపించే ప్రతిపదార్థంలోను ఉన్నాడు కాబట్టి కంటికి కనుపించే ప్రతి పదార్థంలోను దైవమున్నాడు. అందువల్ల కంటికి కనబడే పదార్థాలన్నీ దైవ స్వరూపాలని చెప్పొచ్చు.

సత్ అను పదంలోనుంచి సత్యమనే అర్థం వస్తుంది. ఉండే పదార్థాన్ని సత్ అని, లేని పదార్థాన్ని అసత్ అని చెపుతారు. ప్రపంచ స్వరూపంగాగాని, దాని కవతల కనుపించకుండాగాని దైవపదార్థం ఉంది. అందువల్ల ఆ దైవాన్ని సత్ అని అంటున్నారు.

చిత్ అనగా ఒక ఉదాహరణతో మనం తెలుసుకోవచ్చు. రాయి వుంది, మనిషి ఉన్నాడు, అనే జ్ఞానం మానవుడికి ఉంటుంది. ఆ విధంగా తెలుసుకునే శక్తి రాతికి లేదు. కాబట్టి రాయి అచిత్ పదార్థం అవుతుంది.

నిజమైన పదార్థం ఎప్పుడూ చిత్ స్వరూపంలోనే ఉంటుంది. దానిలోనుంచి ప్రాణులన్నీ గ్రహణశక్తిని పొందుతున్నాయి. ఆ పదార్థానికి ఇంకొక స్వభావం ఉంది. దానినే ఆనంద స్వరూపమని అంటారు. ఆనందం ప్రపంచంలో ఉన్న జీవులన్నింటిలో సంతోష రూపంతో ఉంది. ఆనందంలేని జీవిలేదు. ఆ ఆనందమే దైవం. ఆనందం, దైవం, వేరు వేరు పదార్థాలు కావు. సత్, చిత్, ఆనందం, అనే మూడు కలసి సచ్చిదానందం అని పిలుస్తారు. అదే భగవత్ స్వరూపం.

సచ్చిదానందం విడి విడిగా విడదీయుటకు వీలుగాని గొప్ప పదార్థం. దానినే అఖండ సచ్చిదానందమని వేదాంతులు చెపుతారు.

ఈ అఖండ సచ్చిదానందమే ప్రపంచంగా మారినప్పుడు వేరు వేరు పదార్థాలుగా తోస్తుంది. నిజంగా అది పరిపూర్ణంగాను అఖండంగాను ఉన్న సచ్చిదానందమే.

ఈ పదార్థానికి ఎవరికి కావలసిన పేరు వారు పెట్టుకోవచ్చు దీనిని వేదాంతులు

పరబ్రహ్మమని, శైవులు సదాశివుడని, వైష్ణవులు మహావిష్ణువని, శాక్తేయులు పరాశక్తి అని, కౌమారులు కుమారస్వామి అనీ, చైనీయులు టో అని, మహమ్మదీయులు అల్లా అని, క్రైస్తవులు ఏసు అని పిలుస్తున్నారు.

పేరు ఏదైనా పదార్థం ఒక్కటే. అనే కలనుకొన్నట్లు ఒక్కొక్క మతానికి ఒక్కొక్క దేవుడు లేడు. దేవుడొకడే.

అన్ని మతాలవారు తమ దైవమే గొప్పవాడని, పరమానందం ఇస్తాడని, మోక్షాన్ని ప్రసాదిస్తాడని, చెబుతారు. కాబట్టి దైవం సచ్చిదానందమనే మాటను అన్ని మతాలవారు అంగీకరిస్తారు.

బ్రహ్మమనే సత్య పదార్థమే సగుణ బ్రహ్మగాను నిర్గుణ బ్రహ్మగాను ఉంటుంది. ప్రపంచంలో అంతర్యామిగా ఉండి తన మహిమ లన్నింటినీ చూపిస్తుంది. పరిశుద్ధమైన మనస్సుకే దాని మహిమలను తెలుసుకునే సమర్థత ఉంటుంది.

అటువంటి మహిమలను వాక్కుతో వివరించటానికి సాధ్యమవుతుంది. అప్పుడు అది సగుణ బ్రహ్మమనే పేరు వహిస్తుంది. సగుణ బ్రహ్మం గొప్పది కాదనీ, నిర్గుణ బ్రహ్మం మేలైనదని కొందరు భావిస్తారు. ఆ విధంగా అనుకోవటం తగదు.

నీటిఆవిరి లాంటిది నిర్గుణ బ్రహ్మం. వేగంగా ప్రవహించే నీటికి మంచుగడ్డకు సమానమైంది సగుణ బ్రహ్మం. దీనిలో ఒకటి కొద్ది, ఒకటి గొప్ప అనుకోటం తప్పు. అన్ని సమయాల్లో ఉండటమే దాని గొప్పతనం. కాబట్టి సగుణ నిర్గుణ బ్రహ్మలు రెండు ఒకటేనని తెలుసుకోవటం ముఖ్యం.

పురాణాలు ఒక దైవాన్ని గొప్పగాను, ఇంకో దైవాన్ని కొద్దిగాను వర్ణించాయి. విష్ణుపురాణం శ్రీ మహావిష్ణువే మొదటి దైవమంటుంది. దేవీభాగవతం పరాశక్తికి మించిన దైవం లేదంటుంది. శివపురాణం మహాదేవుడే గొప్పవాడంటుంది. ఈ చెప్పటంలో ఒక అర్థం వుంది. భక్తుడు తన ఇష్టదైవాన్ని ఆరాధించటంలో ఆసక్తి చూపిస్తాడు. అందువల్ల తాను పూజించే దైవం గొప్పవాడని చెప్పటం తగివుంది. ఒక్కొక్క పసిబిడ్డ లోకంలో అందరికన్నా తన తల్లియే గొప్పదనుకోవటం తప్పు కాదు. అట్లా అనుకుంటేనే శిశువుకు మాతృభక్తి ఎక్కువగా వుంటుంది. వయసు ముదిరిన తర్వాత తన అభిప్రాయాలు మార్చుకొంటుంది.

ఆ విధంగానే ప్రారంభదశలో భక్తుడు అందరి దైవాలకంటె తన దైవం గొప్పవాడని చెప్పటం సహజం. అందుకోసం పురాణాల్లో దైవాలకు కొద్ది గొప్ప తారతమ్యం చెప్పబడింది. కాని అదే నిజమని చెప్పటకు వీలులేదని మనం గుర్తించుకోవాలి.

మనదేశంలో వేదాలను అంగీకరించే మతాలు ఆరున్నాయి. ఈ ఆరు మతాలు కలసి హిందూమతమని పిలవబడుతున్నాయి. ఆరు మతాల్లో వర్ణించిన రకరకాలైన దేవతలు ఒకడే అయివున్నాడు. బ్రహ్మోపాసకుడు ఆరు మతాల్లో వర్ణించిన ఏ దేవతా స్వరూపాన్నయినా తీసుకోవచ్చు. నిదానంగా తాను పూజించే దైవమే ఇతర మతాల్లో దైవాలుగా ప్రకాశిస్తున్నాడని గుర్తించాలి. ఆ దైవమే తనలోగూడ ఉన్నాడని తెలుసుకోవాలి. తరువాత లోకమంతా నిండి ఉన్నాడని గ్రహించాలి. ఈ విధంగా తెలుసుకున్నవాడే నిజమైన భక్తుడు.

# బాలల శారదా   వి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## పతి సాన్నిధ్యము

శారదాదేవి దక్షిణేశ్వరంలో పదమూడేండ్లు ఉన్నది. ఆ రోజులన్నీ యెంతో సంతోషంతో గడచినయి. ఇప్పుడు ఆమెకు ముప్పదియేండ్లు దాటినవి. రామ కృష్ణుడు తా నెప్పుడు సమాధిలో కాలం గడుపుతున్నా శారదాదేవిమాట మరచిపో లేదు. ఆమె సరస్వతీ అవతారం కనుక ఆమెకు ఆభరణములు పెట్టి అలంకరించాలి. చిన్నప్పుడు చంద్రామణీదేవికూడా "శారదా, నీవు పెద్దదానివైనతర్వాత మా అబ్బాయి నీకు మంచిసొమ్ములు చేయించిపెడతాడు" అని చెప్పింది. అలాగే రామకృష్ణుడు తాను కాళికాలయంలో పూజారిపని చేసినప్పుడు యిచ్చిన తనజీతం దాచిపెట్టి ఆమెకు ఒక బంగారుగొలుసు, చేతికి బంగారుమురుగులు చేయించాడు. అయన తాను సీతా దేవిని దర్శించినప్పుడు ఆమెచేతికి అటువంటి గాజులుండటం చూచాడు. అటువంటివి శారదాదేవికి చేయించిపెట్టాడు.

శారదాదేవి తల్లి ఒకసారి తన కుమార్తెకు పిల్లలు లేరని విచారపడ్డది. అప్పుడు శ్రీరామకృష్ణులు "మీ అమ్మాయికి వినుగుపుట్టేట్లు, 'అమ్మా, అమ్మా' అని పిలిచేవాళ్ల ఎంతోమంది వస్తారు" అన్నారు. అలాగే యిప్పుడు జరిగింది. శారదాదేవి దక్షిణేశ్వరంలో యుండగా ఆమె యెందరికో తల్లిలాగా వండిపెట్టింది. యెంతోమంది భక్తులు స్త్రీ, పురుషులు ఆమెను 'అమ్మా, అమ్మా' అని పిలవటం మొదలుపెట్టారు. ఆమె యెంతో సంతోషంతో ఆ కాలం గడిపింది.

బంగరు మురుగులు గొలుసును
రంగుగ చేయించె రామకృష్ణుడు సతికిన్
పొంగెను శారద డెందము
అంగన శ్రీ సీతచేతివట్టివె యనగాన్.

# let your money grow more than 7 times




**A Cash Certificate of Rs. 1000.00 will yield Rs. 7328.07 in 20 years.**

Plan ahead for future needs and invest in UBI Cash Certificates
Watch how your money grows !

You can buy UBI Cash Certificates in denominations of Rs. 100.00 or its multiples for a fixed period—7, 10, 15 or 20 years. On maturity, you will get back a lump sum amount which may be more than seven times of your initial deposit.

the amount and term you think suit you
Buy a UBI Cash Certificate today.

A few examples

| Issue Price (Rs.) | Encashment value after 7 years | 10 years | 15 years | 20 years |
|---|---|---|---|---|
| 100 | 200.79 | 270.70 | 445.39 | 732.81 |
| 500 | 1003.96 | 1353.52 | 2226.95 | 3664.04 |
| 700 | 1405.54 | 1894.93 | 3117.74 | 5129.65 |
| 1000 | 2007.92 | 2707 04 | 4453.92 | 7328.07 |
| 5000 | 10039.60 | 13535.21 | 22269.60 | 36640.37 |
| 10000 | 20079.20 | 27070.41 | 44539.19 | 73280 73 |

*For details, come to your nearest UBI branch*



**United Bank of India**

సంపాదకులు: స్వామి తన్మయానంద.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600 021) న ముద్రింపబడి.

స్వామి తన్మయానందవారిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600 004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

| గ్రంథము | వెల |
|---|---|
| శ్రీ రామకృష్ణ కథా[illegible] | |
| శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర | 10.00 |
| శ్రీ రామకృష్ణ లీ[illegible] | 8.00 |
| శ్రీ రామకృష్ణోపనిషత్తు | 3.75 |
| శ్రీ రామకృష్ణపరమ[illegible] నీతికథారత్నములు | 2.50 |
| గురూపదేశము | 2.00 |
| నా గురుదేవు | 1.25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1.50 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహము | 0.75 |
| ఆరాత్రికము మరియు | |
| శ్రీ రామనామ సంకీర్తనము | 0.50 |
| శ్రీ రామకృష్ణుడు, వివేకానందస్వామి | 0.25 |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4.00 |
| శ్రీ శారదాదేవి | |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | 0.80 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4.00 |
| బాలల వివేకానందుడు | 2.00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి | |
| 9 సంపుటముల పూర్తిసెట్టు (సాదా) | 45.00 |
| (క్యాలికో) | 58.50 |
| విడి సంపుటములు ఒక్కొక్కటి (సాదా) | 4.00 |
| .. .. (క్యాలికో) | 5.50 |
| స్వామి శిష్య సంవాదములు | 16.50 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 5.00 |
| .. (రెండవ భాగము) | 5.50 |
| భారత యువజనులారా! | 3.00 |
| ప్రబోధ రత్నాకరము | 8.75 |
| రాజయోగము | 6.25 |
| కర్మయోగము | 4.00 |
| భక్తియోగము | 4.00 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 2.25 |
| .. (రెండవభాగము) | 3.00 |

| గ్రంథము | వెల |
|---|---|
| [illegible]తము | 4.00 |
| వివేక సూర్యోదయము | 4.00 |
| అనుష్ఠాన వేదాంతము | 2.50 |
| ప్రాచ్యము - పాశ్చాత్యము | 1.25 |
| కులము, సంస్కృతి, సా[illegible] | 3.00 |
| భారతదేశము | 2.00 |
| భారతీయ మహిళ | 2.00 |
| నా జీవితము, జీవిత కార్యము | |
| శ్రీ రామకృష్ణ సేవాసంస్థ : తదా[illegible] | |
| చికాగో నగరోపన్యాసములు | 1.00 |
| శ్రీ వివేకానంద శంఖారావం | 3.81 |
| నవీన భారత దేశము | 0.41 |
| సర్వం విష్ణుమయం జగత్ | |
| బ్రహ్మానంద బోధనలు | 4.7 |
| తాపత్రయ చికిత్స | 3.00 |
| ముక్తిమార్గము | 0.30 |
| పారమార్థిక సంభాషణలు | |
| నారద భక్తి సూత్రములు | 4.00 |
| శ్రీ మద్భాగవతము మొదటి సంపుటము | 7.00 |
| దేవీమాహాత్మ్యము | 4.00 |
| [illegible] | 8.00 |
| పారాయణగీత తాత్పర్య సహితము | |
| .. మూలము | |
| కఠోపనిషత్తు | |
| గిరీశచంద్ర | 1.00 |
| భక్తిమార్గము | 1.00 |
| శ్రీకృష్ణవాణి | 0.80 |
| బుద్ధవచన | 0.80 |
| క్రైస్తు సూక్తిమాల | 0.80 |
| మహమ్మదు సూక్తి మంజరి | 0.80 |
| శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము | 1.25 |

ఇవిమేకాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును,
వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)
అను మాసపత్రికలును, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైలచిత్రములు మున్నగున వెన్నియో మా యొద్ద లభింప గలవు.

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600 004

సంవత్సర చందా రూ. 7 జీవిత చందా రూ. 100 విడి సంచిక 70 పై.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 35 1978 - సెప్టెంబరు సంచిక 9

## విషయసూచిక



గమనిక :—స్థలాభావముచే ఈ సంచికలో "బాలల శారదాదేవి" ప్రచురింపబడలేదు.

శ్రీ రామకృష్ణ ప్రభ

సంవత్సర చందా : రూ. **7-00.** జీవిత చందా : రూ. **100-00.**

**విడి ప్రతి : 70 పైసలు.**

శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు

మద్రాసు - 600 004.

# రామకృష్ణ సేవాసంఘము ఒక విన్నపము

ఇటీవల అతివృష్టిచే కలిగిన ఉద్ధృతమైన వరదలవలన ఉత్తరభారతములోని అనేకప్రదేశ ములందు ప్రాణనష్టము, వస్తునష్టము ఎక్కువ సంభవించినది. పల్లపు ప్రదేశములందు నీరు నిలిచి పోవుటవలన వేలాదిప్రజలు నిర్వాసితులైరి. ఈ దారుణ పరిస్థితులందు సహజముగానే ఉత్పన్నము లగు వ్యాధులున్ను విజృంభించి ప్రజలను మరింత బాధలకు లోను జేయుచున్నవి.

రామకృష్ణ సేవాసంఘము, బీహారు రాష్ట్రమునకు చెందిన దర్భాంగ జిల్లాలోని హయాఘాట్ ప్రాంతమున సహాయకార్యక్రమములను ప్రారంభించినది. ఇక్కడ 17 పంచాయితీలకు చెందిన 77,400 ప్రజలకు అతి త్వరితమైన సహాయము చేయవలసి ఉన్నది. అన్న వస్త్ర వైద్య సదుపాయ ములు వెంటనే వీరికి ప్రారంభించవలసియున్నది.

ఇతర బాధిత ప్రాంతములకుకూడ సహాయకార్యక్రమమును విస్తరింపజేయవలసియుండును.

ఈ సేవాకార్యక్రమములను నిర్వహించుటకు ధనరూపమైన వస్తురూపమైన విరాళములకై ఉదారహృదయులను అభ్యర్థించుచున్నాము. పూర్వమువలె ఇప్పుడున్ను ప్రజల సహకారము పుష్కలముగా లభించగలదని ఆశించుచున్నాము.

విరాళములు కృతజ్ఞతతో ఈ క్రింది విలాసములందు స్వీకరింపబడును. చెక్కులు, డ్రాఫ్టులు రామకృష్ణ మిషన్ పేరున ఉండవలెను. రామకృష్ణ మిషన్‌కు పంపెడి విరాళములపై ఆదాయపు పన్ను లేదు.

1. రామకృష్ణ మిషన్, బేలూరుమఠం, హౌరా—711202.
2. అద్వైత ఆశ్రమం, 5, దేహి ఎన్‌టల్లీ రోడ్, కలకత్తా—700014.
3. ఉద్బోధన్ ఆఫీస్, 1. ఉద్బోధన్ లేన్, కలకత్తా—700003.
4. రామకృష్ణ మిషన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కల్చర్, గోల్‌పార్క్, కలకత్తా—700029.
5. రామకృష్ణ మిషన్ ఆశ్రమం, రామకృష్ణ అవెన్యూ, పాట్నా—800004.
6. రామకృష్ణ మిషన్ వివేకానంద సొసైటి, 'ల్' రోడ్, బిస్తుపూర్, జమ్‌షెడ్‌పూర్—831001.
7. రామకృష్ణ మిషన్, రామకృష్ణ ఆశ్రమమార్గ్, న్యూఢిల్లీ—110055.
8. రామకృష్ణ మిషన్, రామకృష్ణ మిషన్ మార్గ్, ఖార్, బొంబే—400052.
9. రామకృష్ణ మిషన్, సల్లివన్ గార్డన్ స్ట్రీట్, మైలాపూర్, మద్రాస్—600004.

బేలూరు మఠము
8-8-'78

స్వామి గంభీరానంద,
కార్యదర్శి.



ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ.



# శ్రీరామకృష్ణ ప్రభ



సంపుటము 35 1978 - సెప్టెంబరు సంచిక 9

## ప్రార్థన

త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్।
ఉర్వారుకమివ బంధనాన్మృత్యోర్ముక్షీయ మాఽమృతాత్॥

(భగవంతుడగు ఓ పార్వతీపతీ! మేము) సుగంధిం = మంచి పరిమళము కలిగినట్టియు, పుష్టివర్ధనం = లౌకిక వైదిక పుష్టిని వృద్ధి చేయునట్టియు, త్ర్యంబకం = మూడు నేత్రములుగల ఈశ్వరుడవగు నిన్ను, యజామహే = పూజించుచున్నారము, (ఓ పార్వతీపతీ!) బంధనాత్ = తొడిమనుండి, ఉర్వారుకం ఇవ = దోసకాయను వలె, మృత్యోః = మృత్యువునుండి, ముక్షీయ = వదలిపెట్టబడినవారము అయ్యెదము గాక, అమృతాత్ = మోక్షమునుండి, మా = వదలిపెట్టబడినవారము కాకపోయెదము గాక.

తా. మొగిలిపువ్వు మల్లెపువ్వు మున్నగు పరిమళముగల పుష్పములయొక్క సుగంధము దూరమునందుండు వారల ఘ్రాణేంద్రియమునకు ఎట్లు గోచరమగునో అట్లే ఎవని దేహముయొక్క పరిమళము దూరమునందుండు వారలకును గోచరించునో అట్టివాడు సుగంధి యనబడును; లౌకిక వైదికములగు పుష్టులను కలుగజేయువాడు పుష్టివర్ధనుడు; మూడునేత్రములు కలవాడు త్ర్యంబకుడు - ఇట్టి నిన్ను సత్కర్మలచేత పూజించెదము. దోసకాయను తొడిమనుండి ఎట్లు వేఱుగా జేయుచున్నావో అట్లే మమ్ములను మృత్యువునుండి వేఱుగా జేయుము. మోక్షమునుండి మమ్ములను వేఱు పరచకుము.

# వివేకానందవాణి

ప్రస్తుత సృష్టిక్రమమునందు మానవుడు స్వతస్సిద్ధముగనే ఉపాధిగతుడు. కావున మనము భగవంతుని మానవునిగనే చూడగలము. గత్యంతరము లేదు. ఎనుములు భగవంతు నర్చింప గోరినచో వాని ప్రకృతి ననుసరించి అవి యతని నొక బ్రహ్మాండమైన యెనుముగా భావించును. చేప భగవంతు నర్చింపగోరుచో అతని నొక బ్రహ్మాండమైన చేపగా భావించును. అట్లే మానవుడతనిని మానవునిగనే భావింపవలెను. ఈ వివిధ భావనలకు కారణము ఊహ. ప్రచార వైపరీత్యము కాదు. మనుష్యుని, ఎనుమును, చేపను వివిధ పాత్రములకు పోల్చవచ్చును. ఇవన్నియు నీళ్లు ముంచుకొనుటకై భగవత్సముద్రమునకు పోయినచో, తమ తమ ఆకారములకును పరిమాణములకును అనురూపముగనే గదా తెచ్చుకో గల్గును. మానవుడు మానవాకృతితోను, ఎనుము ఎనుము ఆకృతితోను, చేప చేప ఆకృతితోను తెచ్చుకొనును కాని వీని యన్నిటిలో గలది భగవత్సముద్రజలమే. మానవులతనిని చూచినప్పుడు మానవునిగా చూతురు, జంతువులు—భగవద్భావము వానికేమైన నుండెనేని—తమ తమ రూప పరమావధి గల జంతువులుగా చూచును. కావున మనము భగవంతుని మానవునిగనే చూడగలము. అందుచే మనమతనిని మానవరూపముననే అర్చింపవలెను. గత్యంతరము లేదు.

మానవులలో రెండు వర్గములవారు మాత్రము భగవంతుని మానవరూపముననర్చింపరు: ఆస్తికధర్మమునే యెఱుగని మానవపశువొకడు, మానవోపాధుల నన్నిటినతకరించి మానవప్రకృతిసిద్ధపరిమితులకతీతుడైన పరమహంస యొకడు. అతనికి ప్రకృతి యంతయు తన ఆత్మగానే కానిపించును. అతడొక్కడే భగవంతుని యథార్థస్వరూపమున ఆరాధింపగలవాడు. ఇతర విషయములన్నిటియందువలె ఈ విషయమునగూడ అగ్రగతమస్థితులు రెంటికిని ఒకేరూపము కలదు. అవిద్యాపరమావధి యందున్నవారును విద్యాపరమావధి యందున్నవారును ఆరాధన కృత్యములేవియు చేయరు—అజ్ఞాన కారణమున మానవపశువవి చేయడు, జీవన్ముక్తుడు తనయందే భగవంతుడు కలడని యెఱుగును గనుక అవి చేయడు. ఈ రెండు అగ్రములకు నడుమ నుండువాడెవడైనను తాను భగవంతుని మానవరూపునిగా అర్చింపడని పలికినచో, వానిని కొంచెము జాగ్రత్తతో కనుపెట్టి యుండుము. అతనిని—ఎంత మృదువాక్కులతో వర్ణించినను—బాధ్యతనెఱుగక మాటలాడువాడనవలెను. అతని మతభావములు అస్థిర మానసులకును శూన్యబుద్ధులకును, మాత్రమే అర్హమైనవి.

భగవంతుడు మానవ లోపములనెఱుగును గనుక లోకోపకారార్థమై మానవరూపమును పూనును.

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్॥
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగేయుగే॥

(ఎప్పుడెప్పుడు ధర్మము క్షీణించి అధర్మమభివృద్ధియగునో అప్పుడెల్ల నేను సశరీరుడనై అవతరింతును. సాధురక్షణ కొఱకును, దుష్టవినాశము కొఱకును, ధర్మ సంస్థాపనము కొఱకును నేను ప్రతి యుగమందును జన్మించుచుందును).

అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్।
పరం భావమజానన్తో మమ భూతమహేశ్వరమ్॥

(నేను మనుష్యరూపమును దాల్చినప్పుడు, సర్వభూతమహేశ్వరరూపమగు నా పరతత్త్వము నెఱుగక, మూఢులు నన్ను అలక్ష్యభావముతో చూతురు).

ఇవి అవతారములనుగూర్చి గీతలో శ్రీ

వాగులును చిఱుకంపకములును అప్రయత్నముగా నిండిపోవును. అట్లే భగవదవతారమేతెంచినప్పుడు పారమార్థిక రూపమగు ఉన్నవారియొకటి లోకముపై పారలిపడును. వాతావరణమే పారమార్థికతా పూరితమైనట్లు శ్రీరామకృష్ణ

ఉన్నరూపమున పొంగి వచ్చినప్పుడు చిఱు భగవానుడు పలికియున్నాడు.

# జాయమానే జనార్దనే

సదాశివం

కృష్ణజయంతిరోజున భగవానుని ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా స్మరించుకొందురు. ఒకస్వామి ప్రతి సంవత్సరమూ నియతముగా ఆ రోజున విష్ణుపురాణములోని కృష్ణావిర్భావ ఘట్టమును భక్తులకు చదివి వినిపించువారట. కృష్ణావిర్భావ ఘట్టములోని ఆ మధుర శ్లోకములలో ఒక శ్లోకమును మనమూ స్మరించుకొందము.

మందం జగర్జుర్జలదాః పుష్పవృష్టిముచో ద్విజ
అర్ధరాత్రేఽఖిలాధారే జాయమానే జనార్దనే.

(అఖిలాధారుడైన జనార్దనుడు ఆవిర్భవించు ఆ అర్ధరాత్రివేళ మేఘములు మందమందముగా గర్జించుచు పుష్పవర్షమును కురిపించినవి.)

బృందావనములో జరిగిన ఒక సంఘటనను కూడ స్మరించుకొందము. శరత్కాలము వచ్చినది. ఇంద్రయజ్ఞము చేయుటకొఱకు గోపాలురు హర్షముతోను ఉత్సాహముతోను పెద్ద పెద్ద సన్నాహములను చేయుచుండిరి. అప్పుడు బాలగోపాలుడైన శ్రీకృష్ణుడు వారలను చూచి ఇట్లనెను: ''పశువులను మేపుకొని జీవించువారము మనము. ఆ కొండలు, ఆ కొండలను ఆని ఉన్న అడవులు మనకు మేపుకొను స్థలములు. ఈ పశువులవలన, ఆ కొండలవలన ప్రత్యక్షముగా ఇంత ఉపకారమును పొందుచుండియు వీనిని పూజింపక అర్చింపక అన్యదేవతలను-మనకు సంబంధించని దేవతలను-పూజించుట ఏమి బాగు! అర్చింపవలసిన ప్రత్యక్షదేవతలను ఉపేక్షించి అన్యదేవతలను పూజించు మానవుడు ఇహలోక పరలోక సుఖములను బడయజేయునా? శిలామయములైన పర్వతములను పూజించుట ఏమి అని అనకుడు. పర్వతములకును అధిష్ఠాన దేవతలు గలరు. కాబట్టి గోపూజ చేయుదము, గిరియజ్ఞము చేయుదము. ఇంద్రయజ్ఞము చేయవలసినది మనము కాదు, అది చేయవలసినవారు వేరే ఉన్నారు.''

కృష్ణుని ఆదేశానుసారము గోయజ్ఞము గిరియజ్ఞము జరిగినది. దానికి ఇంద్రుడు కోపించి ఏడు దినములు వడగండ్లవాన కురిపించినాడని నమ్మెడివారలు, శ్రీకృష్ణుడు చిటికెనవ్రేలిపై గోవర్ధన పర్వతమును ఆ ఏడు దినములూ ఎత్తి ఉంచినాడనియు నమ్మవలయును. అది వేఱు విషయము. ఇక్కడ మనము గమనించవలసిన విషయము ఇది: తరతరములుగా గోపాలురు చేయుచు వచ్చుచుండిన ఇంద్రయజ్ఞమును

కృష్ణుడు ఒక్క క్షణములో రూపుమాపి దాని స్థానములో ఒక క్రొత్తయజ్ఞమును స్థాపించ గలిగెను. ఈ విప్లవాత్మకమైన మార్పును తీసికొని వచ్చుటకుగా కృష్ణుడు ఇంద్ర యజ్ఞమునకు వ్యతిరేకముగా ద్వేషపూరితమైన ఉపన్యాసములేమియు చేయలేదు. ప్రశాంతమైన, ప్రేమపూరితమైన, సమంజసమైన చల్లని మాటలతో గోపాలురనందఱిని పాత సంప్రదాయములను వదలిపెట్టి క్రొత్తది గ్రహించునట్లు చేయగలిగెను. మానవ సమాజమును సంస్కరించవలెనను ఉబలాటము ఉన్నవారు గుర్తించవలసిన విషయమునే ఇక్కడ మనము చూపదలచుకొన్నది. సమాజమును సంస్కరింపదలచినవారు మొట్టమొదట తమ హృదయములను రాగద్వేషాదిదోషరహితమొనరించుకొనవలెను. అప్పుడు ఆ హృదయములు అప్రయత్నముగనే ప్రేమ పూరితములై పోవును. ఆప్రేమపూరిత హృదయములనుండి ఉద్భవించు మాటలకు ఇక తిరుగుండదు. గోపాలురు కృష్ణుని అనుసరించినట్లు మానవసమాజము వారిని అనుసరించియే తీరును.

కురుక్షేత్రములోని కృష్ణుని గూడ స్మరించెదము. రెండు సైన్యములు యుద్ధమునకు దిగబోతున్న దినమది. ధర్మరాజు తన భారమునంతయు కృష్ణునిమీద బెట్టియున్నాడు. అయినను కృష్ణుడెంత ఉల్లాసముగా నుండెనో చూడుడు.

భీష్ముని నాయకత్వము క్రింద యుద్ధము చేయనని ప్రతినబూనిన కర్ణుడు, యుద్ధము చూడవలెనను కోరికను చంపుకొనలేక అక్కడికి వచ్చియుండుటను కృష్ణుడు కనుపెట్టి అతనిని సమీపించి మందహాసము చేయుచు నిట్లనెనుగదా! "అమరతటినీ తనూజుపై యలుకఁ జేసి యనికిఁ జొరవటె యట్లైననతడు సచ్చునంతదాఁకఁ బాండవులకై కొంత సమరకేలి వేడుకఁ జలుపుట వోలదొక్కొ."

ఉద్రిక్తవాతావరణము నెలకొనియున్న ఆ యుద్ధభూమిలో అంత బాధ్యత నెత్తిమీద బెట్టుకొనియు ఇంత సరసముగా మాట్లాడగల కృష్ణుడుగదా మనకు నిత్యస్మరణీయుడును, అనుసరణీయుడును.

రాయబారమునకు వెళ్ళినపుడు కృష్ణుడు విదురునింట అన్న రెండు మాటలను గూడ స్మరించి ఈ చర్చను ముగింతము. "ఈ దురాత్ములు నీ మాటలు వినబోరు. నీ వెందుకిక్కడికి వచ్చితివి ప్రభో!" అన్న విదురుని మాటలకు కృష్ణుడు ఇచ్చిన సమాధానమునుండి రెండు శ్లోకములను మాత్రము మనమిప్పుడు స్మరింతము.

ధర్మకార్యం యతన్ శక్త్యా న చేచ్ఛక్నోతి మానవః
ప్రాప్తోభవతి తత్పుణ్యమత్ర మే నాస్తి సంశయః.

సంఘ సంక్షేమకార్యములను చేపట్టి శాయశక్తుల ప్రయత్నించియు నెఱవేర్పలేని మానవుడు నష్టపోవునదేమియు లేదు. ఆ కార్యములను నెఱవేర్చినంత పుణ్యము వానికి దక్కియే తీరును. ఇందులో నాకు సందేహము లేదు.

మనసా చింతయన్ పాపం కర్మణా నాభిరోచయన్
న ప్రాప్నోతి ఫలం తస్య ఏవం ధర్మవిదో విదుః.

మనస్సులో పాపపుటాలోచనలు తలయెత్తినను అవి క్రియారూపము ధరించుటకు ఎవడు ఇచ్చగింపడో వానిని ఆ పాపములు అంటవు

మొదటి శ్లోకము, సంఘసంక్షేమకార్యశీలురకు తగినంత ఉత్సాహమును, బలమును, ప్రేరణను ఇవ్వగల శక్తిగలిగియున్నది. రెండవ శ్లోకము, అనవసరపాపభీతినుండి మానవుని తప్పింపజేయునదియేగాక, వానిలోని నిగ్రహశక్తికి తగినంత చేయూత నివ్వగలదిగాను నున్నది.

# శ్రీ రామకృష్ణ కథామృతము

(రెండవ భాగము)

అనువాదము : ప్రవ్రాజిక శ్యామాప్రాణ

## అధ్యాయము-14. కలకత్తాలో

### 'చైతన్యలీల' నాటకము చూడబోవుట

క్రీ. శ. 1884 సెప్టెంబరు 21 వ తేది ఆదివారము శ్రీ రామకృష్ణుల గదిలో రామ్, మహేంద్రముఖర్జీ, చున్నీలాల్, మాస్టరు ఇంకను కొందరు భక్తులు గుమికూడిరి. చున్నీలాల్ బృందావనమునుండి ఈ మధ్యనే తిరిగి వచ్చెను. రాఖాల్, బలరామ్‌తో బాటు అతడు బృందావనమునకు బోయెను. రాఖాల్ బలరామ్‌లు ఇంకను తిరిగి రాలేదు. నిత్యగోపాలుడుకూడ బృందావనముననే ఉండెను. శ్రీ రామకృష్ణులు చున్నీలాల్‌ను బృందావన సమాచారములు అడుగుచుండిరి.

శ్రీ రామకృష్ణులు : రాఖాలెట్లున్నాడు?

చున్నీ : ప్రస్తుతము కులాసాగానే ఉన్నాడు.

శ్రీ రామకృష్ణులు : నిత్యగోపాలుడు ఇంకను తిరిగి రాలేదా?

చున్నీ : నేను వచ్చేముందుగ అక్కడనే చూచివచ్చితిని.

శ్రీ రామకృష్ణులు : మీ ఇంటివారు ఎవరితో వచ్చెదరు?

చున్నీ : బాగుగా తెలిసిన మంచివాళ్ళతోడ పంపెదనని బలరామ్‌బాబుగారు చెప్పిరి. వారెవరో మరి పేరు చెప్పలేదు.

తరువాత శ్రీ రామకృష్ణులు మహేంద్రముఖర్జీతో నారాయణుని గూర్చి ముచ్చటించుచుండిరి. నారాయణుడు బడిలో చదువుచున్నాడు. 18 ఏండ్ల వయస్సు. అప్పుడప్పుడు శ్రీ రామకృష్ణులకడకు వచ్చుచుండెను. శ్రీ రామకృష్ణులు వానిని కడు గారాబముగ చూతురు.

శ్రీ రామకృష్ణులు : అతడు చాల సరళస్వభావుడుకదా?

సరళస్వభావుడు అని పల్కుచు శ్రీ రామకృష్ణులు ఆనందముతో నిండిపోయిరి.

మహేంద్రుడు : అవునండీ - చాల సరళస్వభావుడు.

శ్రీ రామకృష్ణులు : ఆ రోజు వాని తల్లి ఇచ్చటికి వచ్చెను. చాల గర్విష్ఠి. చూచిన భయము కలుగును. మీరందరు తరచు ఇచ్చటికి వచ్చుచుండుటయు, కాప్టన్ కూడ వచ్చుచుండుటయు ఆమె గమనించెను. తాను తన కుమారుడగు నారాయణుడేగాక ఇంకను పెక్కురు వచ్చుచుందురేయని ఆమె తలంచి యుండవచ్చు. (అందరు నవ్వుదురు). గదిలో పటికబెల్లము చూచి, ''మంచి పటికబెల్లమే!'' అనెను. ఇక్కడ తినుటకేమియు లోటు లేదనికూడ తెలిసికొనెను.

ఆమె నాతో ఇట్లనెను. ''నారాయణుని వివాహాము చేసికొనమని మీరు చెప్పండి.'' అదంతా అదృష్టము మీదనే ఆధారపడి యుండును. మధ్యలో నేనేమి చెప్పను! (అందరు నవ్వుదురు) అతడు శ్రద్ధగా చదవడట. అందుచే నాతో ''శ్రద్ధగా చదువుకోమని మీరైనా చెప్పండి'' అనెను. నేను వెంటనే 'బాగా చదవరా అబ్బాయి!' అంటిని. ''మీరు కొంచము గట్టిగా చెప్పండి'' అని మరల చెప్పెను. (అందరు నవ్వుదురు)

శ్రీ రామకృష్ణులు నేడు స్టారు థియేటరులో 'చైతన్యలీల' నాటకము చూడబోయెదరు. ఆ నాటకశాలయే ప్రస్తుతము కోహినూరు థియేటరను పేరుతో కలదు. మహేంద్ర ముఖర్జీతో కూడా వారి బండిలోనే పోయెదరు. ఎక్కడ కూర్చున్న నాటకము బాగుగా చూడవచ్చునో అని మాట్లాడుకొనుచుండిరి. కొందరు ఒకరూపాయ టికట్ల సీట్లలోనుండి బాగా చూడవచ్చుననిరి.

రామ్: అదేమి! వారు బాక్సులో కూర్చొనెదరు.

రామకృష్ణులు నవ్వుచుండిరి. కొంద రిట్లనిరి. నాటకములో అందరు వేశ్యలేనండి. చైతన్యుని వేషము నిత్యానందుని వేషము లన్నియు వారే అభినయము చేస్తున్నారండి.

[illegible]లు: నేను వారిని ఆనంద మయులగు తల్లులవలెనే భావింతును. వారు చైతన్యదేవుని వేషము వేసిన నేమి? నిజముగ చైతన్యదేవులే జ్ఞప్తికివచ్చునుగదా! కొయ్యతో చేసిన సీతాఫలమును చూచినంతనే యథార్థ మగు సీతాఫలము జ్ఞాపకమునకు వచ్చును కదా! ఒక భక్తుడు దారిన బోవుచు కొన్ని తుమ్మచెట్లను చూచెను. వెంటనే భగవదా వేశము కలిగెను. అదెట్లన శ్రీ శ్యామసుంద రుని తోటలోగల పార పలుగులకు ఈ తుమ్మ కఱ్ఱలతోనే పిడి చేయవచ్చునని అతడు తలం పగనే శ్రీ శ్యామసుందరుడే జ్ఞప్తికి వచ్చెను. ఒకసారి బెలూను చూపించుటకు కలకత్తాలో గల మైదానమునకు నన్ను తీసికొనిపోయిరి అక్కడ ఒక ఆంగ్లేయబాలుడు చెట్టుకు ఆను కొని ఒరిగ నిలబడియుండెను వానిని చూచుటతోడనే శ్రీకృష్ణుని భావన కలిగి వెంటనే సమాధిస్థితి నందితిని. చైతన్యదేవులు 'మేడ్ గాం' అను పల్లెమీదుగా పోవుచుండిరి ఆ గ్రామపు మట్టితోనే మృదంగము లు[illegible] చేయుదురని వింనంతనే భావపరవశులైరి. శ్రీ రాధాదేవి మేఘమును, నెమలికంఠమును చూచినను స్థిరముగ నిలువజాలక పోయెడిది. కృష్ణుని ఉద్దీపన కలిగి బాహ్యజ్ఞానమును కోల్పోయెడిది.

శ్రీ రామకృష్ణులు కొంతసేపు మౌనముగా నుండి మరల మాట్లాడ నారంభించిరి.

శ్రీ రాధాదేవిది మహాభావము. గోపికల ప్రేమ కామనారహితమైనది. ఏ కోర్కెలు కోరనివాడే నిజమగు భక్తుడు. అతడు పరిశుద్ధ మగు భక్తినే ప్రార్థించును. ఎలాటి శక్తులు కాని సిద్ధులు కాని కోరడు. సిద్ధులు ఉన్నచో బాధ కలుగును. తోతాపురి నాకొక కథ వినిపించెను. అష్టసిద్ధులు సంపాదించిన ఒక యోగి సముద్రపు ఒడ్డున కూర్చొనియుండ గొప్ప తుఫాను వచ్చెను. గాలివానవల్ల వానికి ఇబ్బంది కలుగుచున్నందువలన "గాలి వాన ఆగిపోవుగాక" అనెను. వాని నోటి మాట ఫలించి తీరునుగదా! ఆ సమయమున యాత్రికులతో నిండిన ఒక ఓడ సముద్రములో గాలితోబాటు కొట్టుకొని పోవుచుండెను. తటాలున గాలి ఆగిపోవుటచే ఆ ఓడ తల క్రిందులాయెను. అందులోని యాత్రికులెల్లరు మరణించిరి. ఆ పాపమంతయు వానికే తగిలెను. ఆ పాపఫలముగ వాని సిద్ధులు పోయినవి. నరకదుఃఖముకూడ అనుభవించ వలసి వచ్చినది. ఇంకొక కథ వినుడు. ఒక సాధువునకు అష్టసిద్ధులు కలిగెను. అందుచే అతడు చాల అహంకారము కలవాడయ్యెను. కాని తపము చేయును. మంచి మనస్సు గల వాడు, అందుచే భగవంతుడు వానికి బుద్ధి చెప్ప

దలచి ఒక సాధువువలె మారువేషముతో వచ్చి "స్వామీ! మీకు అష్టసిద్ధులు కలిగెనని వింటిని" అనెను. అంత మన సిద్ధయ్య సాధువును చాల గౌరవించి కూర్చుండబెట్టెను. అపుడొక దారిన ఏనుగు ఒకటి పోవుచుండెను. ఆ సాధువు ఇట్లు పలికెను. "స్వామీ! మీరు తలచుకొన్నచో ఈ ఏనుగును చంపగలరా?" అనెను. ఆ సిద్ధుడు 'ఓ' అని పలికి కొంచెము ధూళి తీసికొని మంత్రించి దానిపై చల్లగా అది వెంటనే పడిపోయి గిలగిల కొట్టుకొని మరణించెను. అంత నా సాధువు "బాబోయి! ఇదేమి! అమోఘమగు శక్తి! ఒక్క క్షణములో ఏనుగును హతమార్చితిరి!" అనెను. సిద్ధయ్యగారు సంతోషముతో పొంగిపోయిరి. ఆ సాధువు మరల "మీరు ఆ ఏనుగును తిరిగి బ్రతికింపగలరా?" అని యడుగ 'ఓ' అని పలుకుచు కొంత ధూళి మరల మంత్రించి దానిపై చల్లగనే ఆ ఏనుగు వెంటనే జీవించి తటాలున లేచి నిల్చెను. ఆ సాధువు ఇట్లు పలికెను. "ఆహా! మీ కేమి శక్తి! కాని మిమ్ములను ఒక ప్రశ్న అడుగవలచితిని. ఈ ఏనుగును చంపగలిగితిరి, మరల బ్రతికింప గలిగితిరి. దీనివలన మీ కేమైనా మేలు లేక ఉన్నతస్థితి కలిగినదా? మీరు భగవంతుని చూడగలిగితిరా?" అని పలికి అంతర్ధానమైరి. ధర్మమార్గము చాల సూక్ష్మమైనది. లేశమైన కోర్కె యున్నను భగవంతుని పొందజాలరు. దారములో చిన్న నలక యున్నను సూదిలో దూర్చలేము. కృష్ణుడు అర్జునునితో ఇట్లనెను. "పార్థా! అష్టసిద్ధులలో ఒక్క సిద్ధి కలిగినను అహంకారము విజృంభించును భగవంతుని మరపించును." మెల్లకన్ను గల ఒక ధనికుడొకడు వచ్చి నాతో "మీరు పరమహంస కదా! కొంచెము స్వస్తివచనము నాకై చేయవలెను" అనెను. ఎంత నీచబుద్ధి! నన్ను పరమహంస అని సంబోధించెను. స్వస్తి వచనము చేయవలెననియు కోరెను! అహంకారము ఉన్న భగవల్లాభము కలుగదు. అహంకార మెట్టిదో తెలియునా? మట్టి దిబ్బపై వర్షపునీరు నిల్చునా? క్రిందికే దిగి పోవును. పల్లపు నేలపైననే నీరు నిల్చును. హాజరాతో నే నిట్లంటిని: నేనే తెలివిగల వాడను. మిగిలినవారు తెలివి తక్కువ దద్దమ్మలు అని తలంపకుము. అందరిని ప్రేమించవలెను. పరాయివా రెవరును లేరు. సర్వ భూతములలో హరియే కలడు. అతడు లేని పదార్థమే లేదు. ప్రహ్లాదుని వరము కోరుకొమ్మని శ్రీ హరి పలికెను. ప్రహ్లాదుడు అందులకు "మీ దర్శనభాగ్యము కలిగినది. ఇక నా కేమియు వరము అక్కరలేదు" అనెను. భగవంతుడు వదలడాయె. అంత ప్రహ్లాదుడు ఇట్లనెను: "నాకు వర మీయదలచినచో నన్ను బాధలు పెట్టినవారి తప్పులనెల్ల మన్నింపుమనియే కోరుచున్నాను." —సశేషము.

మంచి పాండిత్యంగల ఒక సన్న్యాసి ఒకానొక ఆశ్రమంలో గీతా ప్రవచనాలు మొదలుపెట్టారు. 'ధర్మక్షేత్రే కురుక్షేత్రే' అన్న మొదటి శ్లోకం తీసుకొని వ్యాఖ్యానం ప్రారంభించారు. 'ధర్మం' అంటే ఏమిటి అని కొన్ని నెలలు వివరించి చెప్పారు. తరువాత 'క్షేత్రం' అంటే ఏమిటి అని కొన్ని నెలలు వివరించి చెప్పారు. తరువాత 'ధర్మక్షేత్రం' అంటే ఏమిటి అని చెప్పుటకు మొదలుపెట్టి కొన్ని నెలలు లాగసాగారు. ఓపిక కోల్పోయిన ఒక శ్రోత ఎట్టకేలకు ధైర్యంచేసి ఒకనాడు ప్రసంగం మధ్యలో లేచి అందరికి వినపడేలా గట్టిగా ఇలా అన్నాడు: "స్వామీ! ఎనిమిది నెలలుగా మనం ధర్మక్షేత్రంలోనే ఉండిపోతిమి! ఇక కురుక్షేత్రానికి ఎప్పుడు వెళ్ళగలమో చెప్పండి!"

# "కౌపీనవంతః ఖలు భాగ్యవంతః"

## చీమలకొండ ఉమా రామలింగమూర్తి

భాగ్యవంతుడన ఎవరు ? ధనము అధికముగ గలవాడు భాగ్యవంతుడని వ్యవహరింతుము. ధరించు దుస్తులను బట్టియు భుజించు ఆహారమును బట్టియు, నివసించు గృహమును బట్టియు ప్రాపంచిక సుఖములను అనుభవించు తీరును బట్టియు సంఘములో కొందరు వ్యక్తులను పేదవారనియు, కొందరు వ్యక్తులను ధనవంతులనియు పరిగణించుట పరిపాటి. లేమరికము వలన ఒంటినిండ బట్ట ధరించజాలక, కౌపీనమును మాత్రము ధరించి నిలువ నీడలేక భిక్షాటనము వలన జీవించు వారినందరను దరిద్ర నారాయణులుగ జమకట్టుదుము. పై శీర్షికలో ఉదహరింపబడిన వాక్యములో కౌపీనమును ధరించువాడే భాగ్యవంతుడని చెప్పబడినది. ఆదిశంకర కృతమైన 'యతిపంచకము'లోని ఈ వాక్యము యొక్క భావమును పరిశీలింతము.

భౌతిక శాస్త్రము అభివృద్ధి చెందిన కొలది ప్రకృతిని వశీకరించుకొని మానవుడు అనేక క్రొత్త విషయములను కనుగొనుట వలన మన కోరికలు అభివృద్ధి చెందుచుండుటచే ఎన్ని సుఖములున్నను ఇంకను మరికొన్ని సుఖములను బడయుటకు ప్రాకులాడుచుందుము. తృప్తి యనునది కానరాదు. పాశ్చాత్యులలో సుప్రసిద్ధ శాస్త్రజ్ఞులు ఉద్భవించిన చందమున నే ప్రాగ్దేశములందు ఆధ్యాత్మిక శాస్త్రమున గణుతికెక్కిన ద్రష్టలు (Seers) విలసిల్లిరి. పాశ్చాత్యులు బాహ్యప్రకృతికి (external nature) ప్రాముఖ్యమునీయగా, ప్రాగ్దేశస్థులు అంతఃప్రకృతికి (Internal nature) విలువనిచ్చుటయే దీనికి కారణము. To conquer oneself is a greater feat than Conquering others అను ఆంగ్ల నానుడి భావమేమనగా బాహ్యప్రకృతిని జయించుటకంటె అంతఃప్రకృతిని జయించుటయే కష్టము. రాజ్యకాంక్షవలన తన శత్రువులను ఓడించి రాజ్య విస్తీర్ణము పెంచిన రారాజు తన అంతః శత్రువులగు కామక్రోధ లోభ మోహ మదమాత్సర్యములను జయించలేక పోవుచున్నాడు. వీనిని జయించుటయనగ శత్రుమిత్రులు, మానావమానములు శీతోష్ణములు సుఖదుఃఖములు కలిమిలేములు నిందాస్తుతులు ఇత్యాది ద్వంద్వములను సమముగ స్వీకరించుటయే. ద్వంద్వాతీతుడగుటకు తన 'మనస్సును' స్వాధీనపరచుకొనవలసి యున్నది. వ్యవహారిక భాషలో 'మనస్సు' అనుమాట అంతఃకరణ చతుష్టయమను మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అను మాటలకు పర్యాయపదముగ ఉపయోగింపబడుచున్నది. అందుచే ఈ నాలుగు మాటలలో ప్రధానమగు అహంకారము(Ego)ను జయించవలసి యున్నది. 'అహంకారము' 'మమకారము' అనగా 'నేను' 'నాది' అను భావము కలిగి యుండుట. మనస్సును స్వాధీనపరచుకొనుటకు మన ప్రయత్నము(అభ్యాసము)తో పాటు వైరాగ్యము (Detachment) కూడ అవసరమని భగవద్గీతయందు చెప్పబడినది. వైరాగ్యము (విరాగము) అనగా కాంతాకనకములను, యశఃకామమును, విద్యాగర్వము - ఇత్యాది లౌకిక సంపదలందు కోరికను విడిచి అవి అశాశ్వతములనియు నిష్ప్రయోజనములనియు దృఢమైన విశ్వాసము ఏర్పడి వానియందు ఏహ్యభావము ఏర్పడుట.

హిందూమతము ప్రకారము మానవ జీవితములో బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్యాసము అను నాలుగు ఆశ్రమ

ములు గలవు. ధర్మ, అర్థ, కామ, మోక్షము (Duty, wealth, desire and liberation) అను పురుషార్థములను సాధించుటకు ఒక ఆశ్రమము నుండి మరియొక ఆశ్రమమునకు పోవుట అవసరము. గృహస్థాశ్రమములో ధర్మ, అర్థ, కామములను మాత్రము సాధింతుము. మోక్షమును సాధించుటకు వానప్రస్థసన్యాసాశ్రమములు చెప్పబడినవి. జనసామాన్యము గార్హస్థ్య జీవితములో తృప్తిచెంది జీవితమును ముగింతురు. ఈ నాలుగు ఆశ్రమములను ఒకదాని తరువాతి ఒకదానిని స్వీకరించవలెనను కఠిన నియమములేదు. "యదహారేవ విరజేత్ తదహారేవ ప్రవ్రజేత్" అను శ్రుతి వాక్యానుసారము విరాగము అంకురించిన వెంటనే సన్యాసమును స్వీకరింపతగును. భగవద్గీతయందు "కామ్యానాం కర్మణాం న్యాసం సన్యాసం కవయో విదుః (18-2) అని చెప్పబడినది. కామ్య కర్మలయొక్క పరిత్యాగమే సన్యాసమని దీని భావము. వారి వారి పూర్వజన్మ సుకృతమును బట్టి వైరాగ్యము త్వరలోనే పరాకాష్ఠ చెందుట వలన బ్రహ్మచర్యమునుండే సన్యాసాశ్రమమును స్వీకరించిన ఆదిశంకరులవంటి మహాపురుషులును గృహస్థాశ్రమమునుండి సన్యాసాశ్రమమును స్వీకరించిన రామకృష్ణపరమహంసవంటి మహనీయులును ఎందరో గలరు.

'గృహస్థాశ్రమమున అహంకారమును జయించుట సాధ్యముకాదా? సన్యసించిన వెంటనే ఇది సాధ్యమగునా?' యని ఒక జిజ్ఞాసువు ప్రశ్నించగా వివేకానందుడొసగిన సమాధానము గమనార్హము. Sanyasins are atleast struggling to make themselves ready for renunciation whereas householders are in this matter like boatmen who work at the oars while the boat lies at anchor. దీని భావమును ఇట్లు చెప్పవచ్చును. జలమధ్యమున రెండు పడవలున్నవనుకొనుము. వానికి తెడ్లు అమర్చబడియున్నవి. తెడ్లను కదుపుటవలన లంగరు వేయబడని పడవ ముందుకు పోగలదు. లంగరు వేయబడిన పడవ ముందుకు పోజాలదు. అటులనే సంసారమను లంగరు వేయబడిన పడవలోని గృహస్థుప్రయత్నము ఫలితమును ఈయజాలదు. సంసారమును త్యజించిన సన్యాసి యొక్క అవిరళకృషి ఫలించి గమ్యమగు ముక్తిని కాలక్రమమున పొందగలడు. పక్వమైన ఫలము చెట్టునుండి తనంతట తాను రాలినట్లు వైరాగ్యము పరిపక్వమైన వెంటనే సన్యాసాశ్రమము దాని యంతట అదే వచ్చునని కూడ వివేకానందుడు నుడివెను.

భగవత్సాక్షాత్కారము పొందుటకు కర్మమార్గము (Work) భక్తిమార్గము (Worship) జ్ఞానమార్గము (Wisdom) అను మూడు మార్గములు చెప్పబడినవి. మనము చేయు పనిని నిష్కామ్యముగను నిస్వార్థముగను భగవంతునికి కానుకగను చేయుట కర్మమార్గమనబడును. The hands that help are holier than the lips that pray (ఇతరులకు సహాయము చేయు చేతులు భగవన్నామము చేయు పెదవులకంటె పవిత్రమైనవి) Man endears himself to his Maker not so much by his devotion to god in Heaven as by his devotion to God in man (ఎచ్చటనో స్వర్గములోనున్న దేవుని భజించుటకంటె భగవదంశయగు మానవుని సేవించుట వలననే భగవంతుని ప్రేమకు పాత్రుడగును.) భక్తియోగముకంటె కర్మయోగము సులభమని చెప్పుటయే ఈ వాక్యముల భావము. ఈ ఉద్దేశముతోనే కొందరు సన్యాసాశ్రమమును స్వీకరించి స్వార్థమును త్యజించి తమ జీవితమునంతను ఇతరులకు సేవ చేయుటలోనే వెచ్చించి ధన్యులగుచున్నారు. Abou Ben Adhem, Plate

of gold అను ఆంగ్లమున గల పద్యములు మానవసేవ యొక్క గొప్పతనమును తెలియ చేయుచున్నవి. రామకృష్ణ పరమహంస కాళీ మాతను అనన్యభక్తితో పూజించి ఆమె సాక్షాత్కారము కొరకు పరితపించి, తన ప్రయత్నములో ధన్యుడై ప్రతి స్త్రీ యందు (తన భార్యయగు శారదాదేవి యందు సైతము) కాళీమాతనే దర్శించి కామమును జయించి తన గమ్యమగు జన్మరాహిత్యమును బడయగల్గెను. 'తత్త్వమసి' 'అహం బ్రహ్మాస్మి' 'అయమాత్మా బ్రహ్మ' 'ప్రజ్ఞానం బ్రహ్మ' ఇత్యాది మహా వాక్యముల భావమును శ్రవణ మనన నిధి ధ్యాసనముల ద్వారా సాక్షాత్కరించుకొని ధన్యతగాంచుట జ్ఞానమార్గము. ఈ మార్గము పదునైన కత్తియంచు వంటిదని హెచ్చరింపబడినదిగాన ఇది జన సామాన్యులకు అందుబాటు కాదు.

ఈ తీరున మన శక్తి సామర్థ్యములనుబట్టి ఈ మూడు మార్గములలో ఏదియో ఒక మార్గమును అవలంబించి జీవితాశయమును సఫలీకృతము గావించుకొనవలెను. జ్ఞానమార్గమునకు ప్రాముఖ్యమిచ్చిన ఆది శంకరులు 'యతిపంచకము'లో వెలిబుచ్చిన అభిప్రాయము ఇట్లున్నది. కౌపీనమును ధరించి భిక్షాటనము వలన లభించిన ఆహారమును అరచేతులనెడు ఆకు (కరపత్రము)లో స్వీకరించి క్షుద్బాధయను రోగమునకు ఔషధ ప్రాయముగ దానిని మితముగ భుజించుచు, ఏ చెట్టు నీడనో కాలము గడుపుచు ధనము కాకి గుడ్డపేలికవలె నికృష్టముగ చూచుచు శరీరము అనిత్యమైనదని గ్రహించి వేదమునందు చెప్పబడిన పరమ సత్యములను సదా మననము చేయుచు ధ్యానించుచు ఆత్మ సాక్షాత్కారమును పొంది బ్రహ్మానందము ననుభవించు యతి ధన్యాత్ముడు.

యత్యాశ్రమమును స్వీకరించుటవలన 'కులం పవిత్రం జననీ కృతార్థా' అని ప్రశంసించినది. ఈ శరీరమునకు కారణభూతురాలగు తల్లిని, యావద్వంశమును ఉద్ధరించుటకంటె అభిలషణీయమైన దేమున్నది? అయితే నవీన కాలమున సన్యాసి సంఘములకు నిరుపయోగములనియు, సోమరి జీవితమును గడుపుచు గృహస్థులపై ఆధారపడిన పరాన్నజీవి (parasites) అనియు అపవాదు కలదు. ఈ అభిప్రాయము సత్యదూరము. ప్రతి ఆశ్రమ వాసులలో కొన్ని లోపములున్నమాట యథార్థమైనను, ఆదర్శ సన్యాసి స్వార్థరహితముగ సంఘశ్రేయస్సునకే- సంఘముయొక్క నైతిక ఆధ్యాత్మిక పురోభివృద్ధికే పాటుపడు వాడనియు, తన జీవితము నంతను తాను ఉద్ధరింపబడుటకే గాక తన బోధలవలన సంఘము నుద్ధరించుటకు కూడ వినియోగించువాడనియు గ్రహింపవలసి యున్నది. యావజ్జీవితమును సంఘ శ్రేయస్సునకు అంకితమైన అట్టి యతులకు అన్నవస్త్రము లిచ్చి పోషించుట గృహస్థుని విధి. అట్టి మహనీయుల ఉపదేశములను ప్రత్యక్షముగ వినుట వలనను వారి రచనలను పఠించుటవలనను వారి దర్శన స్పర్శనముల వలనను, వారితో సంభాషించుటవలనను మన జీవిత విధానమును చక్కదిద్దుకొని వారు చూపిన మార్గమును వెంబడించి ధన్యులమగుదుముగాక!

# స్వామి నిరంజనానంద

డి. వి. బ్రహ్మాజీ

శ్రీరామచంద్రుని లక్షణాలతో అవతరించిన పురుషునిగా పరమహంసచేత కొనియాడబడిన నిరంజనానందస్వామి అసలు పేరు నిత్య నిరంజనఘోష్. అందరూ ఆయనను ముద్దుగా నిరంజన్ అని పిలుస్తూ ఉండేవారు. వంగ రాష్ట్రంలోని 24 పరగణాల జిల్లాకు చెందిన ఒక చిన్నగ్రామంలో జన్మించిన నిత్యనిరంజనుడు తన మేనమామ అయిన కాళీకృష్ణ మిత్రా ఇంట్లో కలకత్తాలోనే నివసిస్తూ ఉండేవారు. బాల్యంలో నిరంజనునకు కలకత్తాలో ఉన్న ఒక తాంత్రిక బృందముతో స్నేహం ఏర్పడింది. ఈ బృందానికి నాయకుడు డాక్టరు ప్యారీచంద్ మిత్రా. చనిపోయినవారి ఆత్మలను ఆవాహనచేసి మాట్లాడించటం ఈ తాంత్రికబృందం చేసే పనులలో ముఖ్యమయినది. ప్రేతాత్మలను ఎవరిపై ఆవాహన చేస్తారో వాళ్ళను యానకులు అని అంటారు. డాక్టరు ప్యారీచంద్ తరచుగా నిత్యనిరంజనుని ముఖమున ప్రేతాత్మలను ఆవాహనచేసి మాట్లాడించెడివాడు. ఇదే సమయంలో మన నిరంజనునకు కొన్ని అద్భుతమయిన ఆధ్యాత్మిక శక్తులు కూడా అలవడ్డాయి. ఈ శక్తుల సహాయంతో ప్రజలను రోగ విముక్తులను చేయడంలాంటి పనులు నిరంజనునకు సాధ్యం అయేవి. నిద్రలేమి రోగముతో 18 సం॥ లుగా బాధపడుతున్న ఒక లక్షాధికారి రోగవిముక్తి కోసం నిరంజనుని ఆశ్రయించాడు. "ఆ ధనవంతునికి రోగ విముక్తి సంగతి ఎట్లాఉన్నా, అంతటి ధనం కల్గి ఉండిన్నీ కూడా విపరీతమైన బాధకు గురి అవుతున్న ఆతనిని చూడగానే నాకు ఈ ఐహిక ప్రపంచము యొక్క ప్రయోజన శూన్యత విస్పష్టముగా తెలిసివచ్చింది"— అని ఆ సంఘటనను గురించి తర్వాత రోజులలో స్వామి ముచ్చటిస్తూ అనేవారు.

శ్రీ రామకృష్ణపరమహంస యొక్క ఆధ్యాత్మిక ఔన్నత్యమును గురించి విని నిరంజనుడు ఒకరోజు మధ్యాహ్నము పరమహంసను దర్శించే నిమిత్తం దక్షిణేశ్వరానికి వెళ్ళారు. అప్పటికి అయన వయస్సు 18 సం॥లు ఉంటుంది. నిరంజనుడు వెళ్లేసరికి గురుదేవులు భక్తజన పరివేష్టితులయి ఉన్నారు. మిగిలిన వారంతా వెళ్ళిపోయినపిమ్మట పరమహంస నిరంజనుని వైపు తిరిగి ఆప్యాయముగా పల్కరించి ఆయన వివరాలన్నీ తెలుసుకొన్నారు. మాటల సందర్భంలో నిరంజనునకు తాంత్రిక బృందంతో గల పరిచయాన్ని గురించి రామకృష్ణులకు తెలిసింది. వెంటనే గురుదేవులు ఈ క్రింది విధంగా హితవుచెప్పారు:— "అబ్బాయీ! నీవు గనుక ఎల్లపుడూ పిశాచాల గురించీ, ప్రేతాత్మలగురించీ మాత్రమే ఆలోచిస్తూ కూర్చుంటే నువ్వు కూడా వాటిగా మారిపోతావు. అట్లా కాకుండా నీవు నిరంతరమూ భగవంతుని గురించే గనుక ధ్యానించిననాడు నీ జీవితం దివ్యత్వాన్ని అందుకోగలదు. ఈ రెండు మార్గాలలోను నీకు ఏది ఇష్టం?" వెంటనే నిరంజనుడు "నాకు దివ్యత్వమే కావాలి" అని వెల్లడించాడు. ఆ పయిన తాంత్రిక బృందముతో తన స్నేహాన్ని విడనాడమని గురుదేవులు చెప్పిన సలహాను మన నిరంజనుడు వెంటనే అమలు జరిపారు.

పరమహంసతో జరిగిన ఈ ప్రథమ పరిచయమే నిరంజనుని హృదయం మీద గాఢ ముద్ర వేసింది. దక్షిణేశ్వరం నుంచి ఇంటికి తిరిగి వెడుతూ కూడా దారి పొడుగునా గురు

దేవుని గురించిన ఆలోచనలే నిరంజనుని మనస్సంతా ఆక్రమించుకొన్నాయి. ఇంటికి చేరిన పిమ్మట కూడా పరమహంసను గురించిన తలపులు ఆయనను వీడలేదు. రెండు మూడు దినములలోపలనే మరల శ్రీ రామకృష్ణులను చేరితేనేగాని ఆయన మనసు కుదుటపడలేదు. ఈసారి తనను చేరవచ్చిన నిరంజనుని గుమ్మముద్గర చూచీచూడగానే పరమహంస లేచి పరుగు పరుగున ఎదురువచ్చి గ్రుచ్చి కౌగిలించుకొని నిరంజనునితో ఇట్లా అన్నారు:—"నాయనా రోజులకు రోజులు వేగముగా గతించిపోవుచున్నవి. నీవింక ఎప్పుడు భగవంతుని తెలుసుకొందువోయి? భగవంతుని సాక్షాత్కారము లభించనిచో నీ జన్మము వ్యర్థమేకదా! నీ మనస్సును భగవంతునిపై సంపూర్ణముగా లగ్నమొనర్చుట ఇంకెప్పుడు? ఈ విషయమై నాకెంతయో ఆందోళనగా ఉన్నది నాయనా." ఇది వినిన నిరంజనునికి నోటమాట రాలేదు. "నేను భగవంతుని తెలుసుకొనలేదని విచారించుచు నా పారమార్థిక క్షేమమునకు ఇంతగా ఆదుర్దా చెందుతున్న ఈయన చిత్రమయిన మనిషి అయివుండాలి." అని తలపోశాడు నిరంజనుడు. ఏది ఏమయినా ఇంతటి వాత్సల్యంతో గురుదేవులు పలికిన పలుకులు నిరంజనుని హృదయపు లోతులను స్పృశించి ఆతనిని ఆధ్యాత్మిక మార్గంలో శీఘ్రగతిని పురోగమింపజేశాయి. మూడు రోజులపాటు పరమహంస సాన్నిధ్యంలో అపూర్వానందనుభవాన్ని ఆస్వాదించి నాల్గవనాడు ఇంటికి వెళ్లారు.

నిరంజనుని శరీరనిర్మాణము మంచి దృఢమయినది. ఆజానుబాహువు, సుందరాకారుడు అయిన నిరంజనుడు ఖచ్చితముగాను, నిర్మొగమాటముతోను మాట్లాడేవారు. మనస్సులో ఏదీ దాచుకొనే మనస్తత్వముకాదు ఆయనది. ఆయనలోని ఈ లక్షణము పరమహంసను అమితముగా ఆకర్షించింది. ఇట్టి భోళా స్వభావం గలవారికే భగవత్సాక్షాత్కారం సులభసాధ్యమని శ్రీరామకృష్ణుల అభిప్రాయము. గురుదేవులు నిరంజనునిగురించి మాట్లాడుతూ తరచుగా: "నిరంజనుడు నిజంగా నిర్ అంజనుడే" [నిర్ + అంజనుడు=ఏ మలినములు (దోషాలు) లేనివాడని అర్థం] అంటూండేవారు.

నిత్యనిరంజనఘోష్ యొక్క మనస్సు నవ్య నవనీత సమానమే అయినప్పటికీ, ఆయన స్వభావము మాత్రము కొంత తీవ్రమయినది. నిరంజనుడొకసారి చిన్న పడవలో దక్షిణేశ్వరం వెడుతున్నాడు. అందులోని కొందరు ప్రయాణీకులు శ్రీరామకృష్ణుల గురించి నిందాపూర్వకంగా మాట్లాడసాగారు. అది విన్న నిరంజనుడు అట్లా మాట్లాడటం భావ్యంకాదని మొదట్లో సౌమ్యంగానే చెప్పిచూశారు. కాని, నిరంజనుని హితబోధను లెక్కచెయ్యక ఆ పడవలోని వ్యక్తులు తమ నిందాలాపాలను కొనసాగిస్తూనే ఉన్నారు. దానితో నిరంజనునకు విపరీతమయిన కోపావేశం కల్గింది. పడవను అటూ ఇటూ ఊపివేస్తూ "పడవను ముంచి పారేస్తాను జాగ్రత్త" అని బెదరించారు. అసలే గంభీరాకృతికల్గిన నిరంజనుడు కోపోద్దీపితమానసుడై భయావహుడుగా కన్పట్టేసరికి హడలిపోయిన పడవ ప్రయాణీకులు వెంటనే తమ ప్రవర్తనకు క్షమార్పణ వేడుకొన్నారు.

ఈ వృత్తాంతం అంతా విన్న గురుదేవులు అంతటికోపము తగదని నిరంజనుని బాగా మందలించారు: "కోపాన్ని మించిన శత్రువు లేదు. నీచులయినవాళ్లు మాట్లాడే మాటలు విని సజ్జనులు కోపము తెచ్చుకొనుట మంచిపని

కాదు.'' అని రామకృష్ణులు నిరంజనునకు బుద్ధిచెప్పారు. తీవ్రమయిన కోపమును అణచుకోవలసినదిగా నిరంజనునకు బోధించుటలో గురుదేవుల ఉద్దేశము దుడుకు స్వభావియగు నిరంజనునకు శాంతమును సేర్పుటయే. ఇదే సందర్భమున మితి మీరిన మెత్తని మనస్తత్వముగల యోగీంద్రునకు గురుదేవు డిచ్చిన సలహా ఇందుకు పూర్తిగా వ్యతిరేకముగ నున్నది. అందులకు కారణము అతి మంచితనముగల యోగీంద్రునకు కొంచెము కరకుతనము సేర్పదలచుటయే. ఇక్కడ మనము గ్రహింపవలసినది శిష్యశిక్షణావిధానములో గురుదేవుని ఔన్నత్యమును. శిష్యుల మనస్తత్వమును నిశితముగా పరిశీలించి ఆయన ఒక్కొక్కరికి ప్రత్యేకమయిన బోధలు చేసేవారే కాని, అన్ని వ్యాధులకు ఒకటే మందు ఇచ్చేవారుకాదు. కీలెరిగి వాత బెట్టుటలో చెయ్యి తిరిగిన భవరోగవైద్యుడు ఆయన.

ఒకసారి వృద్ధురాలయిన తన తల్లిని పోషించడానికి ఉద్యోగంలో చేరక తప్పనిపరిస్థితి ఏర్పడింది నిరంజనునకు. పరమాత్మకై ప్రాణలాడి మోక్షోద్యోగమున తరించవలసిన నిరంజనుడు లౌకికమయిన ఉద్యోగంలో చేరినాడని వినిన గురుదేవులు అమితముగా వ్యాకులపడి, కలతజెందిన మనసుతో: ''అతని మరణవార్త అయినా నాకు ఇంతటి బాధ కలిగించెడిది కాదు.'' అని వ్యథజెందారు. కాని, ఆ తరువాత నిరంజనుడు స్వయముగా వచ్చి గురుదేవులతో తన మాతృదేవి సంరక్షణార్థమే ఉద్యోగమును స్వీకరించవలసి వచ్చినది, అంతేకాని తన సుఖాల కోసము ఎంత మాత్రము కాదని విశదపరచగా అప్పటికి పరమహంస మానసము కుదుటపడినది. ఇతర మనుష్యులు ఎట్లాగయినా ప్రవర్తించవచ్చును గాక; కాని, ఒక ప్రత్యేకమయిన కార్యము నిమిత్తం జన్మించిన నిరంజనానందుని వంటివారు మాత్రము లౌకికమయిన ఉద్యోగములతో తమ జీవితమును వృథా చేయరాదని గురుదేవుల ఆశయము.

పరమహంస తీవ్రమయిన వ్యాధిబాధతో కాసిపూర్ చేరిన వెంటనే మన నిరంజనుడు తన ఉద్యోగమునకు తిలోదకముల నిచ్చి అహోరాత్రమూ గురుదేవుని సేవకై తనను అర్పణము గావించుకొన్నారు. శ్రీరామకృష్ణుల నిర్యాణానంతరము మన నిరంజనుని గట్టి పట్టుదలవల్లనే పరమహంసయొక్క అస్థికలు గంగానది ప్రక్కనే స్థాపితము కావటం జరిగింది. ఆ తర్వాత నిరంజనానందస్వామి కొంతకాలం బారానగరు మఠంలోను, ఆ తర్వాత ఏర్పడిన ఆలంబజారు మఠములోను కాలం గడిపారు. మఠమునందు ప్రతిష్ఠితమయిన శ్రీరామకృష్ణదేవుల అవశేషములను పూజచేయడం విషయంలో గల శ్రద్ధను నిరంజనానందకు సాటి ఒక్క రామకృష్ణానందస్వామి మాత్రమే.

వివేకానందస్వామి తన పశ్చిమఖండ దిగ్విజయానంతరం తిరిగి భారతదేశం వస్తుండగా నిరంజనానందస్వామి ఆయనకు ఎదురేగి కొలంబోనగరంలో వివేకానందస్వామిని కలుసుకున్నారు. ఆతర్వాత మన నిరంజనానందస్వామి వివేకానందతో కలసి ఉత్తర భారతదేశములోని కొన్నిప్రదేశాలు పర్యటించారు. పిమ్మట మన స్వామి కొన్నాళ్ళు కాశీలో కేవలము భిక్షాటనద్వారా మాత్రమే జీవిస్తూ అతి తీవ్రమయిన తపశ్చర్యను సాగించారు.

మన నిరంజనాస్వామికి మా... శారదాదేవి యెడలగల భక్తిప్రపత్తులు అత్యంత ఆశ్చర్యకరమయినవి. మాతృదేవి యొక్క దివ్యత్వం అంతగా ప్రకటితముకాని తొలిరోజు

లలో ఆమెయొక్క ఆధ్యాత్మిక శక్తిని గుర్తెరిగిన నిరంజనానందస్వామి ఆమెయొక్క గొప్పదనాన్ని గురించి నల్గురికి తెలియజేసి వారి జీవితాలను ధన్యముగావించారు. కొద్దిదినములలో తానిక మరణిస్తానన గా నిరంజనానందస్వామి మాతృదేవిని కలసిన ఘట్టము చిరస్మరణీయమయినది. శారదాదేవియే తనకా రోజున అన్ని పనులు చేసిపెట్టవలెననియు, చివరకు తన చేతులుమీదుగా ఆమెయే అన్నము తినిపించాలని ఆ రోజు స్వామి కోరుకున్నారు. చివరకు మాతృదేవిని వీడి వెళ్లు సమయంలో పసిపిల్లవాడు తన తల్లిని ఎడబాయు సమయమున విలపించునట్లుగా విలపించారు నిరంజనానందస్వామి.

సత్యవచనమునందు మన నిరంజనానంద స్వామికిగల నిష్ఠ అతితీవ్రమయినది. ఏది ఏమయినగాని, సత్యము విషయంలో మాత్రం రాజీ అనేది స్వామి సమ్మతించేవారు కాదు. ఒకసారి కలకత్తాకు చెందిన సంపన్నులొకరు కాశీలో శివుని దేవాలయం ఒకటి నిర్మించారు. ఈ విషయం విని వివేకానందస్వామి: "బీద సాదల బాధలు తీర్చి దీన జనోద్ధరణకోసమే గనుక ఆ పెద్దమనిషి ఏదయినా సాయపడితే అట్లాంటి దేవాలయాలు వెయ్యినిర్మించిన ఫలితం చేకూరుతుంది." అన్నారు. మరి స్వామి వివేకానందుని దృష్టిలో జీవారాధనమే శివారాధనము గదా! వివేకానందుడన్న మాటలు ఆ ధనికునికి చెవులబడ్డాయి. ఒకవిధమయిన ఆవేశముకల్గిన ఆ సంపన్నుడు వెన్వెంటనే మఠమునకు వచ్చి శ్రీ రామకృష్ణమఠము వారు వారణాశిలో నిర్మింప తలపెట్టిన సేవాగృహానికి భూరి విరాళమిస్తానని వాగ్దానం చేశాడు. కాని ఆ తర్వాత కొంతకాలానికి మొదట్లో కల్గిన భావావేశం ఆ ధనికునిలో కొంతచల్లబడింది. తాను మొదట చెప్పిన మొత్తాన్ని ఇవ్వజాలనని, అందులో కొంత భాగము మాత్రమే ఇస్తానని ఆయన మఠమువారికి తెలియజేశాడు. ఈ విధముగా ఆ ధనిక వ్యక్తి ఆడిన మాటను తప్పడంతో నిరంజనానందస్వామికి తీవ్రమయిన వైముఖ్యం కల్గింది. "అసలు నీ సొమ్ము పైసాకూడా మేము స్వీకరింపదలచలేదు." అని తిరగగొట్టారు. వాస్తవానికి ఆ సమయంలో మఠము తీవ్రమయిన ఆర్థిక ఇబ్బందులలో ఉన్నది. అయినా సరే సత్య వ్రతముమీద పట్టుదలగల నిరంజనానందస్వామి ఇసుమంతయినా చలించలేదు. ఇంతటి సత్యనిష్ఠ కలవాడగుటచేతనే కాబోలు గురుదేవులు నిరంజనుని గూర్చి చెబుతూ శ్రీ రామచంద్రమూర్తి లక్షణములతో అవతరించెనని ప్రవచించెడివారు.

నిరంజనానంద జీవితము వలన, పరిచయము వలన ప్రభావితులయిన అనేకులు యువకులు భగవత్సాక్షాత్కారం కోసం తమ సర్వస్వమును త్యజించి శ్రీ రామకృష్ణమఠములో చేరుట జరిగినది. జీవిత చరమదశలో మనస్వామి తీవ్రమయిన రక్త గ్రహిణి వ్యాధితో బాధపడ్డారు. హరిద్వారమున ఏకాంతముగా తపస్సు చేసుకోవడానికి వెళ్ళి, అక్కడ కలరావ్యాధి సోకి 1904 సం॥ న మే నెల తొమ్మిదవ తేదీనాడు కాయాన్ని విడచి మహాసమాధి చెందారు.

శ్రీ గురుదేవుని సేవలో పరిపూర్ణముగా ఆత్మార్పణ గావించుకొని ధన్యుడయిన నిరంజనానందస్వామి నిజముగా నిత్యసిద్ధుడు. ముందుగనే భగవంతుని సాక్షాత్కరింప జేసుకొని పిమ్మట సాధనము గావించువారిని నిత్యసిద్ధులని శ్రీ గురుదేవులు వచించెడివారు. అట్టి నిత్యసిద్ధులలో మన నిరంజనస్వామి యొకరు శ్రీ రామకృష్ణులచే అంతరంగికులు అని మన్నింపబడిన వారిలో మన నిరంజనానందస్వామి కూడ యొకరు.

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:
ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము:
పి. గణపతిశాస్త్రి

**15, జూన్ 1912**

అప్పటికప్పుడే సాయంకాలం నాలుగు దాటి పోయింది. చాలామంది మహిళలతో అమ్మ నవ్వుతూ మాట్లాడుతున్నది... ఆమె నన్ను చూడగానే "అమ్మా, వచ్చావా! రా! ఇక్క-డికివచ్చి కూర్చో అమ్మా!" అని గట్టిగా పిలిచింది.

కిందఉన్న ఆఫీసులోనించి "నివేదిత," "భారతే వివేకానంద" అన్న రెండు పుస్తకాలు తీసుకురావడానికి నేను గారీమాని కిందికి పంపించాను. "నివేదిత" అన్న పుస్తకంలోనించి అమ్మకొన్ని వాక్యాలు వినాలని నా అభిలాష. శారదామాత ఆ పుస్తకాలు నా చేతి కందగానే "ఆ పుస్తకమేమిటి!" అని ఒక పుస్తకం కేసి చూసి అడిగింది.

"నివేదిత" అన్నాను నేను. "చదువమ్మా, నాకు వినాలని ఉన్నది. నాకు కూడా ఒక కాపీ పంపించారు. కాని నేనింకా అది ఎవరిచేత చదివించి వినడం పడలేదు." అన్నది అమ్మ.

అంతమందిమధ్యలో గట్టిగా గొంతెత్తి చదవడానికి నేను బిడియపడి సంకోచించాను. అయినా దానిలో సరళశాబాల అంత స్వాదనం స్పందించేటట్టుగా ఏమివ్రాసిందో తెలుసుకోవాలన్నకుతూహలంవల్ల, ఆమె ఆజ్ఞవల్ల నేనది చదవడం ప్రారంభించాను. అమ్మతోబాటు మిగిలిన వారంతా శ్రద్ధగా వింటున్నారు. నేను నివేదిత భక్తి ప్రపత్తులను గురించి చదువుతూంటే వింటున్నవారి అందరి కళ్లు బాష్పాలతో నిండాయి. అమ్మ చెక్కిళ్లమీదనించి కన్నీరు ప్రవహించడం నేను స్పష్టంగా గమనించాను. ఆ పైన ఆమె మొదలు పెట్టింది.

"ఆహా! నివేదిత భక్తి ఎంత గొప్పది! నాకు తనెంతగా పరిచర్య చెయ్యలేదని ఆమె బాధపడుతూండేది! రాత్రివేళ ఎప్పుడయినా నన్ను చూడడానికి వస్తే లాంతరు వెలుతురు పడి నా కళ్లకేమయినా బాధ కలుగుతుందేమో అని. ఆమె చిన్న కాగితంతో లాంతరుమీద కప్పి వేస్తూండేది. నా కెదురుగా సాష్టాంగ నమస్కారంచేసి, ఎంతో భక్తి ప్రపత్తులతో ఒక జేబురుమాలుతో నా చరణధూళి సేకరించేది. నా పాదాలు స్పృశించడానికి కూడా ఆమె ఎంతో సంకోచిస్తున్నదని నా కనిపిస్తూండేది."

దుర్గాదిది: ఆమె అంతముందుగానే చనిపోవడం భారతదేశానికెంతో దురదృష్టకరం.

"ఆమె భారతదేశానికి చాలా సన్నిహితురాలన్నట్టుండేది. అదే మాట ఆమె అంటూండేది. సరస్వతీపూజనాడు ఆమె హోమ భస్మంతో నుదుటిమీద బొట్టు పెట్టుకుని పాదరక్షలు లేకుండా పారాడుతూండేది." అని ఇంకొకరన్నారు,

నేను చదవడం పూర్తి చేశాను. శారదామాత నివేదితకోసం ఇంకా దుఃఖిస్తూనే ఉంది. చిట్టచివరికి ఆమె "సజ్జనుల కోసమని లోలోపలి అంతర్యమెల్లప్పుడు దుఃఖపడుతూనే ఉంటుంది." అన్నది.

ఆ పైన శారదామాత చీర మార్చుకుని ఠాకూరుకు సాయంకాలం ఫలహారం నైవేద్యం పెట్టడానికి వెళ్లింది. అంతకుముందే ఆమె ఠాకూరుకోసం కొన్ని పూలమాలలల్లి అవి

ఆయన పటంముందుంచింది. అంతేకాక, బ్రహ్మచారి రాసబిహారీ కూడా తియ్యని తినుబండారాలు తెచ్చి, నైవేద్యంగా ఆయనముందుంచాడు. ఆ తినుబండారాలలోని తియ్యని పానకం కొంత బయటికి ప్రవహించి పువ్వులమీదికి వచ్చింది. అక్కడ చీమలు గుమిగూడాయి. అమ్మ అది గమనించి నవ్వి "రాసబిహారీ, ఎంతపని చేశావు? ఇప్పుడు ఆ చీమలు ఆయన్ని కుడుతాయ్!" అన్నది.

రాధూ తల్లి [అమ్మ మతితప్పిన వదిన] అమ్మ తన పెనిమిటిని అందరిఎదట [illegible]ల దండలతో అలంకరిస్తూంటే చూసి, చిరునవ్వు నవ్వింది. అక్కడ ఉన్నవారి కందరికీ ఆ తియ్యని తినుబండారాలు పంచిపెట్ట వలసిందని అమ్మ గౌరీమాతో అన్నది. అందరు ప్రసాదం అందుకున్నారు. అక్కడ కూర్చున్నవారిలో ఒకామె ఇలాగన్నది.

"అమ్మా, నాకు అయిదుగురు కుమార్తెలున్నారమ్మా! వాళ్ళకు పెళ్లిళ్లు చెయ్యలేనమ్మా! అందుకని విపరీతంగా చికాకు పడుతున్నానమ్మా!"

దానిమీద అమ్మ ఇలా గన్నది. "వాళ్లకు పెళ్లిళ్లు చెయ్యలేనని ఎందుకలాగ బాధ పడతావు? వాళ్లను నివేదిత పాఠశాలలో చేర్పించు! వాళ్లకు చదువు సంధ్య లబ్బుతాయి. అది ఎంతో మంచిది."

అంతలోనే ఇంకొకరందుకున్నారు.

"ఈ రోజుల్లో మంచి వరుణ్ణి చూసుకోవడం చాలా కష్టంగా ఉంది. చాలామంది యువకులు పెళ్లిళ్లు చేసుకోవడానికే ఇష్టపడటంలేదు."

దానిమీద అమ్మ అందుకున్నది.

"ఈ రోజుల్లో మగపిల్లలు ఎక్కువ తెలివి తేటలతో నడుచుకుంటున్నారు. జీవితం మిక్కిలి అశాశ్వతమని, చంచలమని వారు గ్రహించి, సాంసారికబంధనాలెంత తక్కువయితే అంత మంచిదని గ్రహించారు."

అప్పటికి బాగా ఆలస్యమయింది. అయినా నన్నెవ్వరు ఇంటికి తీసుకువెళ్లడానికి రాలేదు. ఆ సంగతి విచారించడానికి గోలాప్‌మా మేడకిందికి వెళ్లింది. "గౌరీమాతో కలిసి ఆమె అంతకుమునుపే వెళ్లిపోయిందని మేమిక్కడికి వచ్చినవారితో చెప్పామే!" అక్కడివారన్నారు.

నేనదివిని అమ్మతో "పోనీలెండమ్మా! ఇంకెవ్వరు నాకోసం రాకపోతే ఈ రాత్రి నేనిక్కడే ఉండిపోతాను." అన్నాను.

నన్ను తిరిగి తీసుకునివెళ్లడానికి చిన్నవాడు వినోద్ వచ్చేసరికి, దరిదరిగా రాత్రి 11 గంటలయింది. అతడు ముందుగా గౌరీమా పాఠశాలకు వెళ్లాడు. నేనక్కడ కనిపించక పోయేసరికి మళ్లీ ఇక్కడికి వచ్చాడు. కింద ఉన్న బ్రహ్మచారుల్లో చాలామంది అప్పుడే నిద్రపోతున్నారు. అమ్మకు నమస్కరించి నేను సెలవు తీసుకోగానే ఆమె అన్నది. "అయితే ఈ రాత్రికి నీవు ఇక్కడుండడం లేదన్నమాట! పోనీ, ఇంకొకనాటి రాత్రి ఎప్పుడయినా నీవిక్కడ తప్పకుండా ఉండాలి."

ఇంకొకసారి దర్శనానికి వెళ్లినప్పుడు అమ్మ మధ్యాహ్న భోజనం ముగించుకుని విశ్రాంతి తీసుకుంటున్నది. ఆమె కోరికప్రకారం నేను పక్కనే కూర్చుని నెమ్మదిగా విసరడం ప్రారంభించాను. అంతలోనే ఆమె అకస్మాత్తుగా తనలో తాను గొణుక్కోవడం మొదలు పెట్టింది. 'అమ్మా, మీరందరు ఇక్కడే

ఉన్నారు. అయితే ఠాకూరు ఉన్నారు?"

అది విని నేనిలాగన్నాను. "అమ్మా, ఈ జన్మలో నాకు ఠాకూరును సందర్శించే అదృష్టం కలగలేదు. ఇక మిగిలిన జన్మలలో ఏయినా ఆయన దర్శనభాగ్యం లభిస్తుందో, లభించదో ఆయనకే తెలియాలి. అయినా, మిమ్మల్ని చూసే అదృష్టం కలగడం నా కొక గొప్ప అదృష్టమని భావిస్తున్నాను."

"అవును!" అన్నది అమ్మ అంగీకారముద్రతో.

చాలా మందికి తమ జీవిత రహస్యాలన్నీ అమ్మదగ్గిర ముచ్చటించుకునే అలవాటున్నదని నాకప్పుడు తెలియదు. నేనా రోజుల్లో చాలా తెలివితక్కువగా వ్యవహరించేవాణ్ణి. అయితే నాకిప్పటి తెలివికి పాండిత్యంలో కూడా అంతగా ఆశ్చర్యమేమీ లేదు. నాకు అమ్మతో పరిచయం కొద్దిరోజుల క్రితమే ప్రారంభమయింది. అమ్మ గదిలో కనిపించకపోతే ఆమెకోసం నాలుగువైపుల వెతికేవాణ్ణి. ఎక్కడ కనబడితే అక్కడే అమ్మదగ్గిరికి వెళ్లి కూర్చునేవాణ్ణి. ఒకనాటి సాయంత్రం ఉత్తరం వైపు వరండాలో ఇద్దరు అమ్మాయిలు అమ్మతో రహస్యంగా ముచ్చటిస్తున్నారు. వారిద్దరు వివాహితలు. అందగత్తెలు.

అమ్మ కంటపడగానే నేను ఆమె దగ్గిరికి వెళ్లాను. ఆ సమయంలో అమ్మ వారితో ఇలా అంటున్నది.

"మీ మనస్సులలో ఉన్న కోరికలు ఠాకూరు సన్నిధిని వెల్లడించి, ఆయన్ని మనసారా ప్రార్థించండి. మీ అంతర్యాల వేదనలు ఆయనకవగాహన కాగానే మీరు కోరుకున్నది మీ ఒడిలోకి వస్తుంది."

దానినిబట్టి ఆ ఇద్దరు సంతానంకోసం శారదామాతనర్థిస్తున్నారని నేను వెంటనే అర్థం చేసుకున్నాను. నన్ను చూడగానే ఆ ఇద్దరు ఎంతో ఇబ్బంది పడిపోయారు. నాకు కూడా అదే విధమయిన భావం మరింత ఎక్కువగా కలిగింది. కొన్ని నెలల తరవాత ఆ ఇద్దరిని తిరిగి అమ్మ నివాసగృహంలో చూశాను. వారిద్దరు గర్భవతులయ్యారని కూడా గమనించాను.

గౌరీమా వచ్చింది. ఠాకూరునుగురించి ఏమయినా చెప్పవలసిందని బలవంతం చేసిన పిమ్మట ఆమె ఇలాగన్నది.

"మిగిలిన అందరికన్న చాలా కాలపూర్వమే నేను ఠాకూరును సందర్శించాను. మిగిలిన వారందరు ఆ తరవాత వచ్చారు. నరేన్, కాళీ చిన్నవారుగా ఉన్నప్పుడు వారిని నేను చూశాను.*

అప్పటికే చాలా ఆలస్యమయింది. అందుచేత ఇంకా ప్రసంగించడానికి అవకాశం లేదు. గౌరమా శారదాదేవికి నమస్కరించి వెళ్ళిపోయింది.

—సశేషము.

---

* వాస్తవానికి నరేంద్రనాథు [1863 లో జన్మించిన స్వామి వివేకానంద] 1857 లో జన్మించిన గౌరీమా కన్న పూర్వమే ఠాకూరును సందర్శించారు. అయితే కాళీ [స్వామి అభేదానంద] మరి కొంతకాలానికి వచ్చాడు. గౌరీమాకన్న వారిద్దరు అంత చిన్నవారు కారు.

# ప్రహ్లాద కథాతత్త్వ విచారము

ధూళిపాళ శ్రీరామమూర్తి

ప్ర        మహదహంకారములు శబ్ద స్పర్శ రూపరస గంధములను పంచతన్మాత్రలు మొత్త మెనిమిది ప్రకృతులు. వీనిలో మొదటి దానికి ప్రధానమనియు మూలప్రకృతి యనియు తక్కిన నేడింటికి ప్రకృతి వికృతులనియు కూడ వ్యవహారముగలదు. ప్రధానము దేనినుండియు పుట్టలేదు. కావున దానికి ప్రకృతియనియే పేరు తక్కిన నేడును నొకదానినుండి పుట్టినవి. నొకదానికి జనకములగుచున్నవి. ఇట్లు వికృతి లక్షణము ప్రకృతి లక్షణములు గూడా పట్టినవి. కావున ప్రకృతి వికృతులైనవి. వీని నుండి పుట్టినవి యేకాదశేంద్రియములు పంచ మహాభూతములు మొత్తము పదునారు. ఇవి పట్టి వికారములే. అనగా పుట్టినవే. ఈ యిరువదినాలుగు తత్త్వములలోను పురుషుడు చేరడు. పురమనగా నీ దేహము. అనగా నీ బ్రహ్మాండముగావచ్చును. ఈ శరీరము కావచ్చును. శరీరమునకు పిండాండమని వ్యవహారము. ఈ రెంటికి క్షేత్రమని వ్యవహారము. ఈ రెంటిని వివేకించిన యీ పైన చెప్పిన యిరువదినాలుగు తత్త్వములు లంభించును. పురమందున్నవాడు పురుషుడు. దృక్స్వరూపుడు అనగా చూచువాడు. పురమందున్నవాడు వేరు. పురము వేరు. పురమీయిరువదినాల్గు తత్త్వముల కూటమి. ఇవి చూడబడునవి' తెలియబడునవి. పురుషుడు చూచువాడు' తెలిసికొనువాడు. వీనిలో నెట్లు చేరును? కావున వాడొక్కడే వీనన్నింటికి సాక్షిరూపమునున్నాడు. అన్నింటిని తెలుసుకొనుచున్నాడు. కావున ఈ యన్నింటి కూటమి రూపమైన యీ శరీరము జంగమమని స్థావరమని రెండు విధములు. దీనియందే నీ పురుషుని తెలిసికొనవలయును. ఎట్లు తెలిసికొనవలయును? "నేతి నేతీత్యాత్మాన్వేషణ్" అనగా యిరువదినాలుగు తత్త్వముల నొక్కొక్కదానినే నిది యాత్మ పదార్థముగాదు. అనాత్మ పదార్థమని గ్రహించి త్రోసివేయుట వలన తెలిసికొనవలెను. ఈ యన్నింటిని త్రోసివేయగా మిగులు నట్టివాడు అనగా తానే ద్రష్ట స్వరూపుడైన పురుషుడని తెలిసికొనవలెను. మరియు నన్వయవ్యతిరేకములచేత సృష్టిస్థితి సంహారముల ననుసంధించుటచేత నెమ్మదిగా విచారించి వివేకముతో బుద్ధి కౌశల్యముతో నాత్మ పదార్థమును తెలిసికొనదగును. అన్వయవ్యతిరేకముల స్వరూపమిట్లుండును. ఈ సృష్టియందంతట నాత్మ వ్యాపించి యున్నది. ఈ సృష్టియందు పదార్థములు దేనికవి వేరే. వీని యన్నింట మణులయందు సూత్రము వలె నాత్మ వ్యాపించియున్నది. మణి యున్న చోట సూత్రమున్నది. ఇది యన్వయము. సూత్రమున్నచోట నెల్లనా మణిలేదు. ఎందుచేత? ఆ మణి సూత్రమునందొక యెడ మాత్రమే యున్నదిగదా. మరియొకనెడ మరియొక్క మణియున్నది. కావున సూత్రమున్న చోట నెల్ల మణిలేదు అనునది వ్యతిరేకము. ఇట్లే సృష్టిగతమైన పదార్థములందెల్ల నాత్మ వ్యాపించి యున్నది. దానికాధార భూతముగా, సాక్షిభూతముగా నున్నది. ఆయా పదార్థము లొకదానికంటె నొకటి భిన్నములు. కావున నాత్మ యున్నచోట నవి లేవు. ఇది వ్యతిరేకము. సర్వవ్యాపకముగా నున్నదాత్మ. అట్లు లేనిదనాత్మ. అట్లు గ్రహించి యనాత్మను త్రోసివేయుట. ఇది ఇంకొక పద్ధతి.

సృష్టి స్థితి సంధానము మూడవపద్ధతి. ఈ భూతములన్నియు నెవనిచే సృష్టించబడినవి. ఎవనిచే పెంచబడినవి. ఎవనియందు లీనమగు

చున్నవి. ఇంత విచిత్ర సృష్టికి సృష్టి స్థితి సంహారములు జేయు సామర్థ్యముగలవాడు నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వరూపుడైన పరమాత్మయని వేదాంత వాక్యములనుబట్టి విచారింపగా తేలును. ఇది మూడవపద్ధతి. నాల్గవపద్ధతి యొకటున్నది. జాగ్రత్ స్వప్నసుషుప్తులను మూడు యవస్థలు బుద్ధి వృత్తులు. అనగా బుద్ధి వ్యాపారములు. బుద్ధి మేల్కొని యింద్రియముల ద్వారమున వ్యవహరించుచున్నప్పుడు జాగరణము. ఇంద్రియ వ్యవహారము లేకుండ వాసనానుభవము లేక సంస్కారానుభవము బుద్ధి బొందుచోనది స్వప్నానుభవము. బుద్ధి గాఢ నిద్రను బొందినచో సుషుప్తి. అనగా నా యవస్థ బుద్ధి పనిచేయని యవస్థ. కాన నీ మూడును బుద్ధి యవస్థలే. ఈ మూడవస్థల నెవడనుభవించుచున్నాడో వాడే పురుషుడు. ఆత్మ స్వరూపుడు, సాక్షీభూతుడు.

జాగ్రత్స్వప్నసుషుప్తులు మూడును బుద్ధి ధర్మములు. ఎట్లన బుద్ధి సత్వరజస్తమోగుణాత్మకము. ఈ మూడు గుణములును మూడవస్థలను కలిగించును కావున నాత్మ ధర్మములు గావు. మరియు నివి కర్మజన్యములు. జాగ్రదవస్థ ఇంద్రియ వ్యాపారమును, స్వప్నావస్థ యంతర్వ్యాపారమును, సుషుప్తి తమోవ్యాపారమును సంభవించునవి కావుననివి క్రియాజన్యములనక తప్పదు. బుద్ధి ధర్మములైన నివి యాత్మయం దారోపితములగుచున్నవి. ఆ యాత్మ బుద్ధియందు వ్యాపించుచున్నది. గాబట్టి యీ ధర్మములు దానివేయున్నట్లు కన్పించుచున్నది.

కావున నీ సంసారమంతయు బుద్ధియొక్క గుణములచేత కర్మలచేత నేర్పడ్డది. దీనికి మూలమజ్ఞానము. కావుననే మిథ్యాభూతము స్వప్నమువంటిది. పురుషుడు బుద్ధి ద్వారమున దీనిని బొందుచున్నాడు. జాగ్రత్స్వప్నములు రెండింట చూచున్న పదార్థములన్నియు మనస్సు సృష్టించినవే. మిథ్యాభూతములే. కన్పించి నష్టమగునట్టివి. ఐనను వీనిని ధ్యానము చేయు వానికి శోక మోహ భయముల నొసంగును. వట్టి భ్రమ కావున మీరు జాగ్రత్ స్వప్న సుషుప్తిరూపమును త్రిగుణాత్మక కర్మరూపమును నగు నీ బుద్ధి ప్రవాహమునకు నడ్డుకట్ట వేయుడు.

అదియే యోగము. వీనికి మూలమైన బీజమును అనగా నజ్ఞానమును తెరించి వేయుము. ఇట్టి యోగమును బొందుటకు వేలకొలది యుపాయము లున్నవి. వాని యన్నింటిలో భక్తి దొడ్డది, సులభమైనది. భగవంతుడు చెప్పినది కూడా (యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్, యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం, అనియు, భక్త్యామామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్వతః అనియు గీతయందు భగవంతుడు జెప్పెను. నీవు ఏమి చేసినను, యేమి తిన్నను, ఏది హోమము చేసినను, ఏమి దానము చేసినను అదియంతయు నా కర్పించుము. భక్తివలనే నే నెవడనో యెట్టివాడనో తెలిసికొనగలుగుదురు) గురుశుశ్రూష, సాధుభక్తసంగము, ఈశ్వరారాధనము, ఈశ్వరుడికి సర్వలాభార్పణము, ఆయన కథలయందు శ్రద్ధ, ఆయన గుణములను, కర్మలను కీర్తించుట, ఆయన పాదపద్మములను ధ్యానించుట, ఆయన విగ్రహములను దర్శించుట, పూజించుట మొదలైనవి అభ్యసించవలెను. సర్వభూతములయందున్నవాడు పరమేశ్వరుడే కావున సర్వభూతములను వాని వాని కిష్టములైన కోరికలొసంగి చక్కగా పూజింపవలెను. కామ క్రోధ లోభ మోహమద

మాత్సర్యములను విడిచి వాసుదేవుడైన భగవంతునియందు నీ సాధనములతో భక్తి చేయవలెను. భూతము సోకినవానివలె జగత్పతీ, హరీ, నారాయణా యని యరచుచు సిగ్గువిడిచి నవ్వుచు, నేడ్చుచు, ధ్యానము చేయుచు, నిట్టూర్చుచు కన్పించిన వానికెల్ల నీశ్వర బుద్ధితో నమస్కరించుచు తన్మయుడైన పురుషుడు యీశ్వర భావనచే నావిష్టమైన మనశ్శరీరములతో నజ్ఞానవాసనల నన్నింటిని తెగులబెట్టి భక్తి ప్రవాహమునబడి పరమేశ్వరుని చెందును. కావున నశుద్ధమైన యీ శరీరమును బొందినవానికి నీశ్వరాశ్రయము వలననే సంసార చక్రమునుండి విడుదల లభించును. ఇదియే బ్రహ్మనిర్వాణము. ఇదియే మోక్షము. కావున నంతర్యామిగానున్న పరమేశ్వరుని మీ హృదయములందు భజింపుడు.

భక్తి యశక్యమని భావింపకుము. హృదయకోశమున, యాకాశరూపమున పరమేశ్వరుడున్నాడు. ఆయన సర్వాత్మకుడు. సర్వ ప్రాణికోటికి సఖుడనని భావింపుడు. మీ మనస్సు నక్కడ బెట్టుడు. చాలును. ఇందులో పెద్ద కష్టమేమున్నది? ఆయన మన హృదయములోనే గలడాయె. మన మనస్సు నక్కడ బెట్టిన చాలునాయె. మరి యట్లుగాక మనసు నింద్రియముల వెంట బోనిచ్చి సాధించిన విషయము నెల్ల సంపాదింపబూనుట యెంత కష్టమో విచారింపుడు. పైగా నా విషయముల వలన సుఖమేమైన గలదా యన్నచో నది శూన్యమే.

ధనము భార్యాపుత్రులు ఇళ్ళువాకిళ్ళు భూములు వాహనములు మొదలైన యర్థకామములన్నియు సంపాదించినను అల్పాయుష్కుడైన పురుషునకివియేమి సుఖమును సేకూర్చును? అవియైన పోవచ్చును. వాడైన పోవచ్చును.

కర్మవలన సంపాదించిన లోకము (విషయము) లెట్లు నశించు స్వభావము గలవో నట్లే పరలోకమునందు పుణ్యముచే సంపాదించిన లోకములుగూడ నశించునట్టివి. రెండును నిర్మలములు గావు. అనగా వస్తుస్వరూపములు గావు. కావున దోషములేని పరమేశ్వరుని నేకాంతభక్తితో సేవింపుడు. దానివలన నాత్మలాభము చేకూరును. మానవుడు తాను విద్వాంసుడననుకొని యేదో ప్రయోజనము నాశించి కర్మలు చేయును. కాని దాని కితడనుకొన్న ఫలితము రాదు. వ్యతిరేకఫలము మాత్రము బొంది తీరును.

పురుషుడే శరీర సుఖమునకై శరీరమును గోరి కామ్యకర్మలను చేయుచున్నాడో యట్టివాని శరీరము శాశ్వతముగాదు. క్షణభంగురము. పరకీయము మనదిగాదు. (కుక్కలకు నక్కలకు తిండి యగునట్టిది) ఈ శరీరమే యిట్టిది. మరి మిక్కిన దారాపుత్రాదులు గృహధనాదుల మాట జెప్పనేల. దేహముతోబాటు నివియు నశించును. ఇవి మేలు కలిగించునట్లు కన్పించును గాని నిజముగా కలిగించునది కీడే.

మరి యాత్మ యానందస్వరూపము. దానికి దీనితో పనియేమి? గర్భకోశమున పడుట నుండి మరణాంతము కర్మలు చేసి చేసి వృథాయాసము నొందుటేగాని వాని వలన లాభమేమున్నదో విచారింపుడు. దేహముచేత కర్మ కర్మచేత దేహము ఇదియే సంసారము. దుఃఖరూపము. ఈ రెండును యవివేకము వలన కలిగినవి.

—సశేషము.

# ఓంకార వివరణము

నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు

మన భారతీయ సంప్రదాయమున ఓంకారమునకు చాల ప్రాధాన్యమున్నది. ఒక అక్షర మాత్రమున కింత ప్రాధాన్యమేమి? అని ఆలోచించి స్వానుభవపూర్వకముగ యూహించి కొంత శాస్త్రాధారమును గ్రహించి వివరింప బూనుకొన్నాను.

ప్రయత్నపరుడగు మానవుని నోటినుండి తొలుత వెలువడినది ఓంకారమే. ఓంకారమనగా "ఓం" అను అక్షరము, దీనిని అన్నిటికి మూలమనిరి. ఇందు అ, ఉ, మ, అను మూడక్షరములున్నవి. ఈ అ, ఉ, మ ఎట్లు పలుకబడినవి? సహజస్థితిలో ఏమియూ నెరుగని మానవుడు నోరు తెరిచినాడు. తెరచిన ఆ నోటి నుండి "అ" అను అక్షరము ప్రయత్నరహితముగా వెలువడినది. పిదప నోరు మూయుటకు చేయు ప్రయత్నములో ఆ నాదము "ఉ" అయినది. నోరు పూర్తిగా మూసిన తరువాత ఆ నాదము "మ్" అయినది. "మ్" అను అక్షరమునే మకారమనిరి.

వివరణము=తెరచుట. సంవరణ ప్రయత్నము=మూయుటకు చేసిన ప్రయత్నము. సంవరణము=మూయుట. వీనిలో క్రమముగా అ, ఉ, మ్, అను అక్షరములున్నవి. ఈ మూడింటిని సంధిస్తే ఓం అయినది అనగా వర్ణమాల ఏమియు నేర్పడని ప్రాథమికావస్థలో మొట్టమొదట బుట్టిన అ, ఉ, మ, లను సంధింపగా నేర్పడిన 'ఓం' కారము మూలాక్షరమైనది.

ప్రయత్నపరుడగు మానవుని స్థితి శిశువులలో తెలియును. మాటలు రాని శిశువులు తల్లిని అమ్మ అనవలెనని అర్థము తెలిసి అనరు. నోరు తెరచినపుడు, 'అ' పలుకును, మూసినపుడు 'మ్' పలుకును, పెదవుల తెరచినపుడు 'అ' పలుకును. ఈ అక్షరములను సంధిస్తే అమ్మ అయినది. మధ్యలో ఓంకారము ఇమిడియుండును. అట్లే క్రమముగా ఉద్దేశ రహితముగా ఏదేదో అనుచునే యుండును. ఆ ప్రయత్నములో వెలువడినవే అక్క, అచ్చ, అట్ట, అత్త, అప్ప, అబ్బ, అయ్య, అన్న, అల్ల మొదలయినవి. తక్కిన ఎన్నో పదములకు ఇవి మాతృకలు. కనుకనే వీనిలో కొన్ని మాతాపిత్రాది వాచకములయినవి. "అంబ, అక్క, అల్ల ఏతే మాతృవాచకః" అని సంస్కృతమున నున్నది. తెనుగున "అమ్మ" మాతృవాచకమయినది. అప్ప, అబ్బ, అయ్య, అన్న, పితృవాచకములయినవి. తమిళమున అన్నై=తల్లి, అత్తన్=తండ్రి. క్రమముగా పైపదములకు అర్థాంతరములు ఏర్పడినవి. అగ్రజ తల్లి వంటిదే కనుక అప్ప, అక్క అనుపదములు తెనుగున జ్యేష్ఠసోదరిని తెలిపినవి. అన్న "పితృసమో జ్యేష్ఠ" అను న్యాయముచేత జ్యేష్ఠభ్రాతృకర్థమయినది. సాధారణముగా నిది కర్ణాటక భాషల సంప్రదాయము.

ఓంకారమున నున్న మూడక్షరములలో 'అ' మొదటిది. అకారమునకు నారాయణుడర్థము. మొదటి అక్షరము "అ"కారము, మొదటి దేవుడు నారాయణుడు. కనుకనే "అ" అక్షరము పేరయినది "అల్లా" ఇది మహమ్మదీయుల దేవుని తెల్పుపదము. ఇదియు పైవిధముగనే ఏర్పడి యుండవచ్చును. తేలినదేమంటే ప్రయత్నపరుడగు మానవుని నోటి వెంట వెలువడిన కొన్ని మూలపదములకు ప్రధానములగు అనేక అర్థము లేర్పడినవి. వీనిలో మొట్టమొదటిది ఓంకారము. కొంచె

మాలోచించినచో, గోవు, మేక నోటి వెంట కూడ ఇదే వెలువడినదేమో? అ-ఉ-మ్-బా-అమ్‌బా అని పలికినది గోవు. "బా"ని పరిహరిస్తే మిగిలినది ఓంకారమే. ఇట్లే మేక; మేకపలుకు మనకు మేమే అని వినబడును. దానికి ముందు అకార ఉకారములు మన చెవికి రాకపోవచ్చును. అది వినుటకు మనము సిద్ధముగా నుండము. పూర్తిగా అయిపోయిన పిదప 'మే' మాత్రము మన చెవిని వినబడును. అంతే. పిల్లి మ్యావ్ అనును. ఆలోచించిన నింకు అకార ఉకార మకారములు దొరకును. ఇందులోనూ అకార ఉకారములు బహు సూక్ష్మదశలోనుండి తరువాత మ్యావ్ వినబడను. కంఠము, పెదవులు కలిగిన ఏ జంతువునకయినా తార్కికముగా నాలోచిస్తే వెలువడునవి ఆ అక్షరములే. నాలుక పలుకలేని మూగవాని నోటినుండి అకార ఉకార మకారములు పల్కును. కొన్ని జంతువులలో మనకవి వినపడకుండుటకు ఆ అక్షరములు సూక్ష్మాతి సూక్ష్మదశలో నుండుట, జ్ఞానవంతమగు మానవజాతివలె నవి ఎక్కువ ప్రయత్నము చేయకుండుట కారణములు. సంగీతస్పర్శ, నూరామడల దూరములోనున్న మానవునకు సంగీతోత్పత్తికి కారణమయిన నాదులు హృదయమున లేచుటయూ? వాడు మంద్రస్వరమున అనునయించును మధ్యస్థానమున హర్షము వెలిబుచ్చును. తారస్వరమున కోపగించును. ఇవన్నియు స్వరస్థానములే కాని సంగీతము పాడలేదు. అట్లే జిహ్వాతాలు దంతోష్ఠములు కలిగిన ప్రతి జంతువు అకారాదులు పలికించుటకు వీలున్నది. చివరకు పక్షులలో కాకి కాకా అనిన అందు అకారమున్నది. ఒకప్పుడు అది అరచుచు నోరు మూసినప్పుడు "క్రామ్" అని వినిపించును.

ఈ చర్చవలన తేలినదేమంటే ఓంకారము దేవతిర్యక్ మానవాది భేదములులేక సర్వజంతుకోటియందు నిండి నిబిడీకృతమై యుండినదని తేలినది. రెండు చెవులలో వ్రేళ్ళుపెట్టి మూసికొనినపుడు వినపడునది రావణాసురుని కాష్ఠమనుటకంటె శరీరములోని అనాహతమగు ఓంకారమంటె ఎంతయో సమంజసము. మూసికొనుటచేత బహిర్నాదములు వినపడవు. ఇక వినపడునది అంతరనాదమే.

వర్ణమాలను లెక్కించునపుడు అకారాది క్షకారాంతము అని చెప్పుదురు. అనగా అక్షరములలో అకారము మొదటిది. క్షకారము చివరది అని అర్థము. కాని అకారాది మకారాంతము అనిన సత్యము. పెద్దలమాటను నేను నిరసించుటకాదు. నా చెప్పిన చొప్పును గమనింపగోరుదును. వర్ణమాలలో అకారము మొదటిది మకారము చివరిది. దీని తరువాత నిక అక్షరములు లేవు. "అ" తో ప్రారంభించి "అం" తో అచ్చులయినవి. తరువాత అయిదు వర్గములున్నవి. అవి క వర్గము, చ వర్గము, ట వర్గము, త వర్గము, ప వర్గము అని.

వర్గము లన్నిటిలో ప వర్గము చివరిది. ఆ వర్గములో చివరి అక్షరము మకారము, కనుక అకారము మొదటిది మకారము చివరది. క వర్గము మొదటిది, చ వర్గము రెండవది, ట వర్గము మూడవది, త వర్గము నాల్గవది, ప వర్గము అయిదవది అని వ్యవహారము. ఈ వ్యవహారము నిర్హేతుకముకాదు. ఉచ్చారణ స్థానముల క్రమమునుబట్టియే ఈ సంఖ్యా క్రమము వచ్చినది. "అ" కంఠమునందు, క వర్గము జిహ్వామూలము అంగిలి మొదలును చేర్చితే, చ వర్గము నాలుక మధ్యభాగము అంగిలికి కొంత ఇవతలిభాగమును చేర్చితే, ట

వర్గము అంగిలికి ఇంకా కొంత ఇవతలిభాగము నాలుక కింక కొంత ఇవతలిభాగమును చేర్చితే, త వర్గము నాలుకకొన దంతములకు దగ్గర పై భాగమును చేర్చితే, ప వర్గము రెండు పెదవులు చేర్చితే పలికినవి. పెదవులు దాటి ఇక ఏ స్థానమును లేదు కనుక ప వర్గములో చివరి మకారమే అన్నిటికంటె తుది అక్షరము. వీటి తరువాతి యరల వాదులు కలవుగదా వాని గతి ఏమి అందురా? వినండి లేక చదవండి. అవి కచటతపలవలె ప్రత్యేకాక్షరములు కావు.

ఇ అ కలిసి యకారము, ఋ, అ కలసి రకారము ౡ అ కలసి లకారము ఉ, అ కలసి వకారము అయినవి. అకారమును క్షుంభించి పలికితే "హ" అయినది. క్షకారము కషల సంయోగమే. శ ష స లు చవర్గాక్షరాల ప్రభావము కలవి. కనుక అకారము మొదటిది. మకారము చివరిది. వర్ణమాలలోని ప్రథమాంత్యాక్షరములతో "ఓం" కార మేర్పడినది. మకారమనగా "మ్" అని గ్రహింపవలెను. ఈ మకారము వర్గాంతాక్షర మగుటచే "ఓం" అని నోరు మూసికొనినను నాదము అవిరామముగా కొనసాగుచునే యుండును. ఇట్లే వర్గాంత్యాక్షరములగు ఙ్, ఞ్, ణ్, న్, లు అని నోరు మూసినను దాని నాదము నిర్విరామముగా కొనసాగును. దానికి కారణము అనునాసికత్వమే. అక్ అని ఆ నోటిని అట్లె యుంచిన నాదము అవిరామముగా రాక తెగిపోవును. మకారమున కదియొక ప్రాధాన్యము.

"ఎల్" అనినపుడు కూడ అవిరామ నాదము వచ్చును. లకారము దాదాపు నకారమువంటిదే. 'న' పలుకలేనివారు "ల" పలుకుట సహజము. పనసతొనకు బదులుగా "పలసతొల" అనువారు కలరు. గాయకులు కొందరుండి "ని ని ని ని" అని పాడుటకు "లి లి లి లి" అని పాడుదురు. ఇంకా "ఎంత నేర్చినా" అనుటకుబదులు "ఎల్త నేర్చినా" పాడువారు కలరు. అయితే మేమట్లు పాడ లేదని వారు బొంకెదరు. కాని మన చెవులే దానికి ప్రమాణము ఏతావతా లకార నకారములకు సాదృశ్యమున్నది. అందుచేత నాసికాస్థాన సంయోగము చేత నిర్విరామ నాదము అఙ్, ఞ్, అణ్, అన్, అమ్, అల్ లకు సిద్ధించినది. వీటి అన్నిటి నిర్విరామ నాదము "ఓం" వలె గోచరింపదు. "అమ్" అనినప్పుడే "ఓం" అని వినబడును. ఓంకారమును నిర్విరామముగా అంటే పలుమారులు ఓం ఓం ఓం అనుటకాదు. "ఓమ్" అని ఒకేసారి అని నోరు తెరువక నాదమును కొనసాగించినప్పుడు మకారము నశించి ఉకారమే మిగులును. అయినను పూర్వోచ్చరిత మకారము చెవియందుండి కొంత, పెదవుల మూతచే కొంత మకారమే అనుస్యూతమై "ఓం" వినపడును.

అట్టి ఓంకారమందున్న అ-ఉ-మ అను అక్షరములలో అభ్యావము చేత అకార ఉకారములకును, ఓష్ఠ్యత్వము చేత ఉకార మకారములకను అనివార్యమగు సంబంధమున్నది. ఉకారము మధ్యవర్తియై తనకు ముందున్న అకారమునకు సజాతియై, తనకు తరువాత నున్న మకారమునకు సజాతియై, అకార మకారములకు సంబంధమును ఘటింపచేయు చున్నది. ఈ విషయమును పాఠకులు మనసున నుంచ ప్రార్థన. దీని అర్థవివరణములో దీని ఉట్టంకము దును. ప్రతి అక్షరమునకు అంతర ప్రయత్నము (నోటిలోని ప్రయత్నము) బాహ్య ప్రయత్నము (నోటివెలుపలి ప్రయ

త్నము) [illegible] అకార ఉకార [illegible] మకారములు ప్రయత్నము [illegible]గా కానవచ్చును. నోరు తెరచుట అకా[illegible] త్నము. [illegible] ఉకార[illegible] త్నము. [illegible] ప్రయత్నము. ఇవి [illegible] ప్రయత్నములు [illegible] లిపే 'క' అని దాని ప్రయత్నము జిహ్వామూలము [illegible] కావ [illegible] ము[illegible] 'క' అయిన [illegible] ప్రయత్నము కనవచ్చును. అప్పుడు [illegible] కాని ఇంకొకటి కాదు. [illegible] అకార ఉకార మకారములకు ఎ[illegible] అని తెలిసినది. అకారమును గూర్చి వేదము "అకారో వై సర్వావాక్" అని చెప్పి[illegible]. అనగా ఏ వాక్కు యినను అకారమే అగు. అంటే ఆయా అక్షరములను ఉచ్చరించునపుడు మనకు తెలియకయే అకారముతో ప్రారంభ మగును. పర్యవసానము కూడ అకారమే కావలెను. వీణతంత్రిని మీటిన యెడల షడ్జము పలుకును. మెట్టుమీద వ్రేలు వేసినచో ఇంకొక స్వరము పలుకును. కాని అందు షడ్జము అంతర్లీనమై యుండును. వ్రేలి నొక్కడు షడ్జత్వమును మరుగుపరచి ఇంకొక స్వరమును వినిపించును. అట్లే ఏ అక్షరమున నైనను దాని ఉచ్చారణమునకు చేసిన ఇతర స్థాన ప్రయత్నములు అకారత్వమును మరుగు పరచి ఇంకొక అక్షరమును వినిపించును. అంతర్వ్యాప్తముగా అకారమే యుండును. క్షీర నీరములు కలిసినప్పుడు మనకు కానవచ్చునవి క్షీరములే కాని నీరములు కానుపించవు మరి నీరములు లేవా? కాగా ఇప్పటికి సారాంశ ముగా తెలిసినది ఏమనగా వక్త్రవివరణ, సంవరణప్రయత్న, సంవరణములచేత నేర్పడిన

అకార ఉకార మకారములను వ్యా[illegible] [illegible] శాస్త్రకా[illegible] [illegible] [illegible] అవి మన నోటను ది వెలువడిన [illegible] ఓం[illegible] [illegible] వంటి వచ్చినవి. [illegible] అవి [illegible] ఓ [illegible] [illegible] [illegible] ఊరా[illegible] [illegible] [illegible] [illegible] [illegible] నాదములన్నియును ఓంకారములై [illegible] జడను [illegible] ఓంకారములై నుండి [illegible] ఝ ఝ [illegible] ఓం[illegible] [illegible] తుదకు [illegible] లోహాపు [illegible] [illegible] అందు ఓంకార [illegible] [illegible] [illegible] "భమ్ భమ్" అని ఓంకారములై నుండును. వేయేల? లేచినా సైకిల్ బెల్ [illegible] ఓంకారాభ్యాసము చేయును. ఇట్లు స్థావర జంగమములయందు సర్వత్ర వ్యాప్తమైనది ఓంకారమే దీనికి మరియొక నామము ప్రణవము. ఆ శబ్దమునకు వ్యుత్పత్తి "ప్రణూయత ఇతి ప్రణవః" అని అనగా మిక్కిలి కొనియాడబడునది, అని. ఈ కొనియాడబడుటకు దానియందున్న అక్ష[illegible] ముల స్వభావ ప్రభావములే కారణము. ఇంత వరకు కొంత ఊహాపథమున పయనించి వ్రాసినది. ఇంక శాస్త్రపథంలో కొంత పయనిద్దాము.

"ఓంకార ప్రభవాః వేదాః - ఓంకార ప్రభవాస్స్వరాః - ఓంకార ప్రభవం సర్వం జగత్ స్థావర జంగమం" అని శాస్త్రము. అనగా వేదములు ఓంకారమునుండి పుట్టినవి. స్వరములు ఓంకారమునుండి పుట్టినవి. (ఇచ్చట స్వరములనగా సంగీత స్వరములు. అచ్చులుకూడ గ్రాహ్యములే) చరాచరాత్మక

మగు ప్రపంచమంతయు ఓంకారమునుండియే పుట్టినదట. ఓంకారమన్నింటికి మూలమయితే దానియందున్న మూడక్షరములలో అకారము మూలాక్షరము. ఈ అక్షరము అర్థములేని మూలాక్షరము కాదు. 'అ' కారము నారాయణుని మొదటిపేరట. వేదము "అ ఇతిభగవతో నారాయణస్య ప్రథమాభిధానం" అని చెప్పినది.

అన్ని అక్షరములకు మూలము అకారము. అందరి దేవతలకు మూలము నారాయణుడు. కనుక ఆ అక్షరము ఆ దేవుని నామధేయమయినది. తక్కిన పేరులన్నియు తరువాతివే. భగవద్గీతలోకూడ "అక్షరాణామకారోస్మి" అక్షరములలో నేను అకారమును అని పరమాత్మ వాక్యము. 'అ' కారమునకు నారాయణునకును వున్న సాదృశ్యమే ఆ దేవుని పేరది అగుటకు కారణము. ఒక సాదృశ్యము అకారము మొదటి అక్షరము. నారాయణుడు మొదటి దేవుడు. ఇంకొక సాదృశ్యమిటు చెప్పవచ్చును. అకారము ఏ రెండు స్థానముల సంయోగమువలనను పుట్టినదికాదు. అకారము పలికినప్పుడు రెండు స్థానములు కలియకుండనే నోరు తెరచినప్పుడు కేవల నాద ప్రయత్నముచేతనే అది పుట్టును. తక్కిన అక్షరములన్నియు రెండు స్థానముల సంయోగముచేతనే ఏర్పడుచున్నవి. అనగా అకారము స్వయంభువు. అట్లే నారాయణుడు స్వయంభువు. ఆ రెండింటికి వాచ్య వాచకత్వము కుదిరినది. ఉపనిషత్తు ఇట్లు చెప్పినది. "యో వేదాదౌ స్వరః ప్రోక్తః వేదాంతే చ ప్రతిష్ఠితః తస్యప్రకృతి లీనస్య యః పరస్సమహేశ్వరః" వేదపాఠోపక్రమానికి ముందు "హరిఃఓం" అని ప్రారంభిస్తారు. పాఠాంతమందు "ఓం శాంతిః" అని ముగిస్తారు. అట్టి ఓంకారముననున్న మూడక్షరములలో చివరి మకారము మధ్యనున్న 'ఉ' కారమందు లయమయితే ఉకారము ప్రకృతి అయిన అకారమున లయమగును. ఆ అకారమునకు భగవంతుడర్థము. ఈ లయము ఓంకారమును పలుమారులు విడువక ఉచ్చరించునప్పుడు కలుగును.

వ్యాహృతులని మూడున్నవి. వ్యాహృతులనగా మాటలని అర్థము. ఏమిటవి? "భూః" "భువః" "సువః" అనునవి. ఈ మూడును ఋగ్యజుస్సామములను మూడు వేదములను మథిస్తే అకార, ఉకార, మకారములు మిగిలినవట. వేదవాక్యము "తేభ్యో అభితప్తేభ్యస్త్రయోవర్ణా అజాయన్త అకార, ఉకార, మకార ఇతితానేకధా సమభరత్తదేతదోమితిః". త్రయీ సారములుగా వచ్చిన అకార, ఉకార, మకారములను బ్రహ్మ గుచ్చివత్తితే "ఓం" అయినదట. ఇది బ్రహ్మమట. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" ఇట్లు సర్వోత్కృష్టముగా చెప్పబడిన ఓంకారము సర్వవైదిక కర్మలయందును, ప్రాధాన్యం వహించినది. "ఓం భూర్భువస్సువః" అని గాయత్రీ మంత్రానికి వ్యాహృతిత్రయంతోసహా ఓంకారము, ముఖమయినది. ఒక గాయిత్రికే కాదు. అన్ని మంత్రములు ఓంకార పురస్సరములయినప్పుడే ఫలప్రదములు. హోమములలో చివరకు స్వరలోప పరిహారార్థముగా "ప్రణవేన ఏకాహుతిం జుహ్యాత్" అని ఓంకారోచ్చారణముతో ఆజ్యపాత్రమందున్న నేతినంతయును ఆహుతి చేయుదురు. తుదకు లౌకిక వ్యవహారములోకూడ కొంతమంది తాము వ్రాయు లేఖలలో ముందు "ఓం" వ్రాయుదురు.

ఇట్టి ఓంకారమున కెన్నో అర్థములు చెప్ప వచ్చును. సర్వము ఓంకారమునుండియే పుట్టినప్పుడు ఎన్ని అర్థములు దానియం దుండవు!

అకారమునకు విష్ణువు అర్థమని ముందు చెప్పబడినదికదా! ఉకారమునకు లక్ష్మి అర్థమట. దీనికి ప్రమాణము "ఉకారేణోచ్యతే లక్ష్మీః" అని. మరియు అకారము భగవద్వాచకమై పుంలింగ మయినది. భగవతీ వాచకమయినప్పుడు, ఇ, ఈ, కావచ్చును. వాటికి ఆ అర్థము లున్నవికూడ. అట్లే వాని ప్రక్కనయున్న ఉకారమునకు భగవద్దివ్య మహిషీత్వము సిద్ధించును. భగవన్మహిషీ వర్గములో లక్ష్మి ప్రధానురాలు. ఆమె అంశము దేవేరులందరియందు నుండును. ఈవిధముగా సాన్నిధ్యబలముచేత ఉకారమునకు లక్ష్మి అర్థము. ఇక మకారమునకు జీవుడర్థము. ఇదెట్లు! అక్షరవర్గములను లెక్కించుటలో కవర్గమునుండి లెక్కింతురు.

అ నుండి అః వరకున్నవి అచ్చులనబడును. అవి క్, చ్. అనువాటికి పూర్ణస్వరూపము నిచ్చునవి కనుక తొలుత చెప్పబడినవి. కాని వర్గవ్యవహారము కవర్గమునుండియే. ఈ వర్గము లయిదు, క, చ, ట, త, ప, వర్గములు. ఒక్కొక్క వర్గమునకు అయిదక్షరముల చొ॥న అయిదు వర్గములకు వెరశి ఇరువదిఅయిదు అక్షరములు. వీటిలో ఇరువదిఅయిదవ అక్షరము "మకారము" తత్త్వము లిరువది అయిదు. వానిలో జీవుడు – అనగా పురుషుడు లేక ఆత్మ ఇరువది అయిదవతత్త్వము దీనికి ప్రమాణము "పంచవింశోఽయం పురుషః." "పంచవింశ ఆత్మాభవతి" అని. ఈ సంఖ్యా సామ్యముచేత మకారమునకు జీవుడర్థము. అకారమునకు నారాయణుడర్థమయినట్లే ఇదియును. కాగా లక్ష్మీవిశిష్టుడగు నారాయణునకు జీవుడు దాసుడను అర్థము చెప్ప వచ్చును. వైష్ణవ సిద్ధాంతప్రకారము భగవంతునకు జీవునకును లక్ష్మి మధ్యనిలచి జీవుని రక్షింపుమని చెప్పును. చెప్పి జీవేశ్వరులకు సంధి ఘటింపచేయును. మనము ఈ వ్యాసములో పూర్వము అకార, మకారముల మధ్యనున్న ఉకారము తనకు ఇరువైపులనున్న అకార మకారముల సాదృశ్యము కలదై ఆ రెండక్షరముల సంబంధమును నియమించినదని చెప్పుకొన్నాము. అట్లే సర్వేశ్వరుడు అకార వాచ్యుడునయిన భగవంతునకును, పరతంత్రుడు మకారవాచ్యుడునగు జీవునకును మధ్యనున్న లక్ష్మీదేవి అటు భగవత్త్వమును ఇటు భగవత్పారతంత్ర్యముచేత జీవలక్షణమును కలిగి ఇరువురికి సంబంధమును ఘటింపజేయును.

వైదికమతములు మూడు. ద్వైతాద్వైత విశిష్టాద్వైతములు. ఓంకారమందు త్రిమతముల అర్థసారమును చెప్పవచ్చును. ఇప్పుడు ఒక విషయమును గుర్తింపవలెను. ఇంతకు ముందు అకారమునకు నారాయణుడని అర్థము చెప్పబడినది. అంతమాత్రమేకాక అకారమునకు బ్రహ్మరుద్రులుకూడ వాచ్యులే. దీనికి నిఘంటువు "అకారో బ్రహ్మ విష్ణ్వీశ కమఠేష్వంకణే రణే" అని భక్తులు ఎవరెవరి హృదయానుసారముగా ఏ దేవతను మూల దైవముగా పరబ్రహ్మముగా నుపాసించెదరో వారి వారికి ఆ దేవత అకారవాచ్యమే. అప్పుడు త్రిమూర్తులకు అకారము ప్రథమాభిధానమే. ఇపుడు 'అ' శివునిపేరు. అ. ఉ, మ, లలో, అ=శివుడు, ఉమ=పార్వతి. ఇట్లు ఓంకారమున శివపార్వతులున్నారు పార్వతి మొదటిపేరు ఉమయే. కారణాంతరములచేత

వచ్చినవి గౌరీ కాత్యాయన్యాది నామములు. శివుడు బ్రహ్మమయితే పార్వతి జీవుడు. ఈ రెండు వస్తువు లిందున్నవి. ద్వైత సంప్రదాయమున తత్త్వము రెండని చెప్పుదురు. ఇది ద్వైతము. ఇక అద్వైతము. పర బ్రహ్మము మాయా సంవృతమై జీవుడగు చున్నది. జీవబ్రహ్మములు వేరు వేరు కాదు. ఒకటే అని సిద్ధాంతము. (అ, ఉ, మ) నోరు తెరచుట, మూయబోవుట, మూయుటలలో వచ్చినవని చెప్పబడినదికదా!

'అ' అనబడు స్వయంవ్యక్తమయిన పర బ్రహ్మము 'ఉ' అనబడు మాయచేత సంవృతమై (కప్పబడి) 'మ' అనబడే జీవుడయినది. ఇది అద్వైతము. ఇక విశిష్టాద్వైత సిద్ధాంతమున తత్త్వములు మూడు. ఏవన! ఈశ్వరుడు, జడ మనబడు ప్రకృతి, జీవుడు. అ= ఈశ్వరుడు ఉ= జడప్రకృతి (ఇది లక్ష్మీవాచక మగుటచే విష్ణు పత్నీత్వముచేత భూమికి ఉపలక్షణము; భూమియే అచిత్తు అని చెప్పబడినది.) మ= జీవుడు (చిత్) ఈవిధముగా విశిష్టాద్వైతము. ఇంకా కొన్ని చిత్రములు చెప్పవచ్చును. అ= సృష్టి. ఉ = స్థితి, మ = లయము.

'అ' అనినపుడు నాదసృష్టి, 'ఉ' అనినపుడు నాదస్థితి. మ్ అనినపుడు నాదలయము. ఇట్టి విషయములెన్నో అంతర్భవించి యుండుటచేత ప్రణవమును సర్వోత్తముగా భావించిరి.

గానకళ (సంగీత మాసపత్రిక) సౌజన్యముతో.

# గంగా తీరములో

## బొంబాయిగంగారాం

లక్షలకు లక్షలు గడించే మార్వాడీ పుంగవునికి ఒకనికి హిమాలయాల్లో ఉండే పుణ్య క్షేత్రాలను చూచిరావాలనే కోరిక కలిగింది. వారినీ వీరినీ అడిగాడు: "అక్కడ ఏయే పుణ్యక్షేత్రాలున్నవి, మహాత్ములైన సాధువులు ఎవరెవరు ఏయే ఆశ్రమాల్లో ఉన్నారు–" అని.

కేదారనాథ్ బదరీనాథ్ అమరనాథ్ అని క్షేత్రాలపేర్లు అందరూ చెప్పారుగాని మహాత్ములైన సాధువులపేర్లు చెప్పలేకపోయారు. నలుగురూ ఏకాభిప్రాయంతో మహాత్ముడని చెప్పగలపేరు ఒకటి మాత్రమే మార్వాడీ విన్నాడు.

"ఏమి ఈ దౌర్భాగ్యము! దేశములో లెక్కలేనన్ని రాజకీయపక్షములున్నవేగాని గొప్ప నాయకులకు మాత్రము కఱవు ఏర్పడినది; లెక్కలేనన్ని పుణ్యక్షేత్రములున్నవే గాని మహాత్ములైన సాధువులకు మాత్రము కఱవు ఏర్పడినది. ఇట్లున్నంతకాలము ఈ దేశము ఎట్లు బాగుపడగలదు!" అని వాపోయి మార్వాడీ తీర్థయాత్రలకు బయలు దేరినాడు.

తీర్థయాత్ర ముగించుకొని ఆ మహాత్ముడున్న ఆశ్రమానికి వెళ్ళాడు. పట్టణాలలో ఉన్న ఆశ్రమములవంటిది కాదది. అసలు దాన్ని ఆశ్రమం అనడానికన్న ఒక చిన్న కుటీరం అనవచ్చు. మార్వాడీ లోనికి ప్రవేశించాడు. అక్కడ బల్లలు కుర్చీలు లేవు. స్వామి నేలమీదనే ఒక దర్భాసనం వేసుకొని దానిమీద కూర్చొని ముందఱనున్న ఒక చిన్న పీఠముమీద 'బ్రహ్మసూత్ర శాంకర భాష్యం' అనే పుస్తకాన్ని పెట్టుకొని చూస్తున్నారు. మార్వాడీ సాష్టాంగ ప్రణామంచేసి

ఆ తరువాత స్వామి చూపించిన ఒక దర్భాస నంమీద కూర్చున్నాడు.

"మీరు ఎవరు? ఏ ఊరు? ఏమి చేస్తు న్నారు? తీర్థయాత్రలు సుఖముగా ముగిసి నవా?" అని స్వామి అడిగిన కుశలప్రశ్నల కన్నిటికి అడిగిన దానికన్నను ఎక్కువగానే మార్వాడీ సమాధానాలు చెప్పి తరువాత ఇలా అన్నాడు: "ఈ రోజు నా కెంతో ఆనందముగా ఉన్నది స్వామీ! మీ దర్శనభాగ్యము కలిగింది. ధన్యుడను. మీ పాదసన్నిధికి ఒక లక్ష రూపాయులను సమర్పించుచున్నాను. నా యందు దయయుంచి ఈ చిన్న కానుకను మీరు స్వీకరించవలసినది" అని ప్రార్థించాడు.

స్వామి ముఖకవళికలో ఏ మార్పును కన పడలేదు. పూర్వమున్నట్లుగనే ఉన్నది. ప్రశాంతగంభీరమధురస్వరముతో 'నాకు వలదీ కానుక' అని ఒక్క మాట మాత్రమే అన్నారు. మార్వాడీ ఆశ్చర్యపోయాడు. ఆశ్చర్యమునుండి తేఱుకొని మళ్ళీ ప్రార్థించాడు: "మీకవసరము లేకపోయినా మీ ఆశ్రమ కార్యకలాపములకు వినియోగించండి" అని.

ప్రశాంతగంభీరమధురస్వరముతోనే మళ్ళీ స్వామి ఇలా జవాబిచ్చారు: "ఈ ఆశ్రమ కార్యకలాపములకు రూపాయలతో పనిలేదు. రూపాయలతో పనిఉన్న ఆశ్రమ ములు దేశములో చాల ఉన్నవి. వారికిచ్చి సహకరించు. అట్లు కాదేని, ఒకపూట భోజన మునకైనను చాలక ఆకలితో వకవకలాడు వేలాది బీదప్రజలు మీ ఇంటి చుట్టుపట్లనే ఉన్నారు. వారికేదైన మేలుచేసి పుణ్యము గట్టుకొనుము. నన్నెందుకు ఊరక నిర్బంధించెదవు."

కాని మార్వాడీ తన పట్టుదలను వదలి పెట్టలేదు. స్వామి ఎన్ని చెప్పిన అన్నిటికీ అన్ని చెప్పి ప్రార్థించుచుండెను—"స్వామీ! స్వీకరించండి, స్వామీ! స్వీకరించండి—" అని.

చివరకు స్వామి ఇట్లన్నారు - మృదువు గానే: "బాబూ! ఈ అల్పవిషయముమీద ఇంతసేపు ఎందుకు మనకు వాద ప్రతివాద ములు? ఇదేమి అధ్యాసభాష్యమా! నాకు నీ రూపాయలతో అవసరములేదని ఎన్నిసార్లు చెప్పినను వినవంటున్నావెందుకు? ఇదిగో చూడు! నాకు ఆకలి వేసినపుడు ఆ సత్రమునకు వెళ్ళి రెండు చపాతీలు తెచ్చుకొందును; దాహము వేసినపుడు పోయి ఆ గంగానది జలములను త్రాగివత్తును; ఈ కట్టుగుడ్డ చినిగి నపుడు చూచి ఎవరో ఒకరు క్రొత్తది ఇచ్చి పోదురు దానిని తీసి కట్టుకొందును. తెలిసి నదా? నన్నిక ఊరక బాధించకు. ఈ రూపాయలు తీసికొని వెళ్ళుము. తీసికొనిపోవుటకు బరువుగానున్నచో ఆ గంగానదిలో పడవేసి వెళ్ళుము."

మార్వాడీ ఇక చేయునదలేక ప్రణామ మాచరించి లేచెను. కుటీరమునుండి నిష్క్రమించుచు వెనుదిరిగి అతడు కొంత గర్వముగా "స్వామీ! ఒక లక్ష రూపాయులు ఇస్తానని వచ్చే మనిషిని మీ జీవితంలో మఱొకడ్ని ఇక మీరు చూడబోరు. గుర్తుచుకొనండి!" అని అన్నాడు. వెంటనే స్వామినుండి మెఱుపు మెఱిసినంత వేగముతో ఇలా బదులు వచ్చింది: "బాబూ! ఒక లక్ష రూపాయలు ఇస్తానని నీవు అంటుంటే వద్దని చెప్పే మనిషిని మఱొకడ్ని నీ జీవితంలో ఇక చూడబోవు. ఇది గుర్తుంచుకో."

# సూతసంహిత

ఏలూరిపాటి అనంతరామయ్య

## ఐదవ అధ్యాయం

### : శక్తి పూజావిధి :

నైమిశీయులు "భగవన్, సర్వశాస్త్రార్థ పరిజ్ఞానిసత్తమా, పరాశక్తి పూజావిధి సంగ్రహంగా చెప్పు" అని అని అడిగారు.

### : బాహ్యపూజ :

సూతుడు చెప్పాడు :

"ఆస్తికోత్తములారా, భుక్తి ముక్తిదమైన పరాశక్తి పూజావిధి చెపుతాను. అత్యంత శ్రద్ధతో వినండి 2. పరాశక్తిపూజ బాహ్యమూ అభ్యంతరమూ అని రెండు విధాలుగా చెప్పబడినది. బాహ్యపూజ రెండు విధాలు 3. వైదికీ, తాంత్రికీ అని. ద్విజేంద్రులారా, ఆ తాంత్రికపూజ తాంత్రికునికే, ఇతరులకు కాదు; వైదికపూజ వైదికునికే 4. విప్రులారా, ఇలా సర్వదేవపూజా ఏర్పాటైనది. తెలియక మరోలా చేస్తూ మానవుడు పతితుడవుతాడు 5. ఆసనం, ఆవాహనం, అర్ఘ్యం, పాద్యం, ఆచమనం, స్నానం, వస్త్రం, ఉత్తరీయం, సర్వాభరణాలు 6, సుగంధపుష్పం, ధూపం, దీపం, మహానైవేద్యం, మాల్యం, అనులేపనం, నమస్కారం, విసర్జనం 7. సర్వమూ మాతృకతో చేయాలి. మాతృక మంత్రనాయిక. ఉత్తములారా, మాతృకా వ్యతిరేకములైన మంత్రాలు లేవుగదా! 8. మాతృక స్థూల, సూక్ష్మ, సూక్ష్మతర అని మూడువిధాలు. గురూపదేశంవల్లనే తెలియదగినది. మరొకవిధంగా కోటి శాస్త్రాలవల్ల గూడా కాదు 9.

### : అభ్యంతరపూజ :

ఇక అభ్యంతరపూజకు అధికారం ఉన్న పక్షంలో బుధుడీ బాహ్యపూజను విడిచి అభ్యంతరపూజను అవలంబించాలి 10. అభ్యంతరపూజకూడా సాధార నిరాధార అని రెండు విధాలుగా చెప్పబడినది. నిరాధార మహత్తరమైనది 11. (మనసా పరికల్పితమూర్తి) ఆధారమందు చేసేది సాధార. సంవిత్తునందు చేసేది నిరాధార ఆధారమైన అక్షరనిర్మితవిగ్రహమందు పరమేశ్వరుని 12 గురూపదిష్ట మార్గంలో అతిప్రీతితో ఆరాధించాలి. సంవిత్తునందలిపూజ అంటే, దానియందు మనస్సు లయంకావటం 13. పరమార్థంలో సంవిత్తే పరాశక్తి. మరేమీ కాదు. కనుక మునిసత్తములారా, సంవిత్తునందు ఆమెను నిత్యమూ పూజించాలి 14. సంవిద్రూపాతిరేకంచేత సమస్తమైన ఆత్మలకూ ప్రతిభాసించేది సంసారమనబడినది 15. కనుక, సంసార నాశంకోసం సాక్షిణి, ఆత్మరూపిణి, ప్రపంచోల్లాసవర్జిత అయిన పరాశక్తిని ఆరాధించాలి 16 మహామతి అనాకులుడై సంవిద్రూపశివను సంవిద్వాచకశబ్దంతో ఆదరంతో ఆరాధించాలి 17. మళ్లీ సర్వమూ విడిచి, స్వపూర్ణపరసంవిత్తును తన ఆత్మతో అనుసంధించి తిరిగి అదీ విసర్జించాలి 18. స్వానుభూతితో స్వయంగా సాక్షాత్స్వాత్మభూతురాలైన మహేశ్వరిని ఆదరంతో పూజించాలి. ఆ పూజ పురుషార్థప్రదం 19. శక్తిపూజావిధి నేను చెప్పాను. దీనిని వేదం ముఖ్యంగా చూపినది. మీరూ సంతోషంతో ఆమెను చెప్పినరీతిని పూజించండి 20.

: ఇది శ్రీస్కాందపురాణం శ్రీసూతసంహితలోని శివమహాత్మ్యఖండంలో 'శక్తిపూజావిధి' అను ఐదవ అధ్యాయం :

# వినాయకవ్రత ప్రశస్తి

కాశావజ్ఝల రామకోటిశాస్త్రి

రాక్షసేశ్వరుడొకడు గజరూపముతో ఈశ్వరునిగూర్చి గొప్ప తపస్సును చేయుచుండెను. అతని తపమునకు శివుడు సంతోషించి దర్శనమొసగి వరమును కోరుమనగా గజాసురుడు శంకరుని స్తుతించి మీరు నిరంతరము నా హృదయమందే నివసించి కాపాడవలయునని ప్రార్థింపగా భక్తిచే భక్తవత్సలుడగు మహేశ్వరుడు అతని కోర్కెను తీర్చుటకు గజాసురుని హృదయమందు జేరి సుఖముగ నుండెను. పార్వతీదేవి తన భర్తయగు శివునిజాడ గుర్తింపలేక అనేక విధంబుల కైలాసమున వెదకుచు బహుకాలము బాధపడి గజాసురహృదయంబున గలడని తెలిసికొని పతి వియోగమునకు దుఃఖించుచు భర్తను రక్షించుటకు మార్గము తెలియక శ్రీ మహావిష్ణువును ప్రార్థించి తన భర్తయొక్క విషయమును తెలిపి, పతిభిక్ష పెట్టి కాపాడుమని విలపింపగా విష్ణుమూర్తి పార్వతీదేవిని బుజ్జగించి కైలాసమున నుండుమని చెప్పి, బ్రహ్మాది దేవతల నందఱిని వచ్చునట్లు జేసి గజాసురుని సంహరించుటకు గంగిరెద్దుల మేళమే తగినదని శివుని వాహనమగు నందిని గంగిరెద్దుగ చక్కచేసి తాను గంటలుగల సన్నాయిని దాల్చి గజాసురపట్టణములో ప్రవేశించి వీధులందు బ్రహ్మాండముగ నాట్యము చేయించుచుండగ గజాసురుండు విని తన భవనంబు దగ్గఱ నాడింపదలచి వారిని పిలిపింపగా బ్రహ్మాది దేవతలందఱు వాద్యవిశేషంబులు మిన్ను ముట్టునట్లు కీయగా శ్రీ విష్ణువు గంగిరెద్దును విచిత్రగతుల నాడించగ గజాసురుడు సంతోషాంతరంగుడై దేనినైన నొసగెద కోరుమనగా విష్ణువు సమీపించి, ఇది ఈశ్వరుని వాహనమగు నంది, శివుని తీసుకొని వెళ్లుటకు వచ్చెనని పల్కెను. గజాసురుడు ఆ పలుకుల నాలకించి ఆశ్చర్యము కలవాడై అతనిని రాక్షసాంతకుడగు శ్రీ విష్ణువని గ్రహించి, తనకు మరణము తప్పదని నిశ్చయించుకొని తన హృదయస్థుడగు ఈశ్వరునితో "మహానుభావా! నా శిరస్సు స్వర్గ, మర్త్య, పాతాళ లోకంబులందు పూజ్యముగ జేసి నా చర్మంబు ధరింపవే" అని ప్రార్థింపగా శివు డందులకు నంగీకరించె. అంతట శ్రీ మహావిష్ణువు నందిని పురికొల్పెను. నంది తన కొమ్ములతో గజాసురుని చీల్చి చంపెను. పిమ్మట ఈశ్వరుడు గజాసురుని హృదయమునుండి వెలుపలకు వచ్చి మహావిష్ణువును స్తుతించెను.

తదుపరి ఈశ్వరుండును నందివాహనము నధిరోహించి కైలాసమునకు వెళ్లెను. పార్వతీదేవి బ్రహ్మాదులవలన తన భర్తయగు పరమేశ్వరుడు వచ్చుచున్నాడని విని సంతోషముతో తలంటి పోసికొనుచు, నలుగుపిండితో ఒక బాలుని చక్కజేసి, ఆ బాలునకు ప్రాణము పోసి, ద్వారముదగ్గఱ కావలియుంచి, అభ్యంగన స్నానముజేసి, ఆభరణములను ధరించి, పత్యాగమనమునకు ఎదురు చూచుచుండెను. అంతట శివుండు కైలాసభవనంబునకు వచ్చి లోపలికి పోవుచుండగా ద్వారము దగ్గఱనున్న బాలుడు ఈశ్వరుని ప్రవేశించరాదని అడ్డగింపగా, శివుండు క్రోధావేశుండై త్రిశూలముచే ఆ బాలుని కంఠమును ఖండించి లోపలికి వెళ్లెను. పార్వతీదేవి భర్తనుగాంచి అర్ఘ్యపాద్యాదులచే గౌరవించెను. అంత పార్వతీపరమేశ్వరులు ప్రియభాషణములను వెల్లడించుచుండగా, వాకిలియొద్ద అడ్డగించిన బాలుని

విషయమురాగా శంకరుడు తాను చేసినపనికి విచారించి తాను తీసికొనివచ్చిన గజాసుర శిరస్సును బాలకునికి అంటించి, ప్రాణమును పోసి, "గజాననుండని" పేరు పెట్టెను. ఆ బాలుని పార్వతీ పరమేశ్వరులు పుత్రప్రేమతో పోషించుచుండిరి. గజాననుండు మాతాపితృలను మిక్కిలి భక్తితో సేవించుచుండెను. గజాననుడు "అనింద్యుడను" ఎలుకను వాహనముగ జేసికొని దానిని సులభముగ నెక్కి తిరుగుచుండెను.

పార్వతీ పరమేశ్వరులకు కొంతకాలమునకు కుమారస్వామి జన్మించెను. అతడు బలసంపన్నుడు అతనికి వాహనము నెమలి. కుమారస్వామి దేవతలకు సేనానాయకుడుగా ప్రసిద్ధిగాంచెను. కైలాసమునకు సమస్త దేవతలు, ఋషులు, మానవులు వెళ్లి పరమేశ్వరుని దర్శించి, సేవించి, సత్కార్యకలాపము లన్నిటికి విఘ్ననివారణమునకు ఒక్కని నాయకునిగ నియమింపుమని ప్రార్థింపగా తండ్రిని జూచి గజాననుడు నేను జ్యేష్ఠుడనని విఘ్నములకు అధిపతిగా జేయుమనెను. కుమారస్వామియు, 'గజాననుడు అసమర్థుడు, అనర్హుడు నాకే అట్టి ఆధిపత్యము నివ్వవలయున'నియు తండ్రియగు శివుని ప్రతిమాలెను. అంత మహేశ్వరుడు కుమారు లిద్దఱిని చూచి, స్వర్గ, మర్త్య, పాతాళలోకములందలి పుణ్యనదులలో, స్నానముజేసి ముందుగా నెవరు వచ్చెదరో, అట్టి వారికి ఆధిపత్యము నొసగెదననెను. అంత కుమారస్వామి సమ్మతించి, వాహనమగు నెమలినెక్కి వెంటనే బయలుదేరి వెళ్లెను. తరువాత గజాననుడు దుఃఖించుచు, తండ్రిదగ్గఱ చేరి, నమస్కరించి, "తండ్రీ! నేను దేనికిని అసమర్థుడనని గ్రహించియు, ఆచరించుటకు వీలులేని పనిని నియమింపవచ్చునా! నా యందు దయయుంచి, నీ పాదసేవచేయు నాకు నుపాయంబుజెప్పి, కాపాడుమ"ని వేడుకొనగా శివుండు కరుణ కలవాడై "గజాననా! ఒకసారి నారాయణమంత్రమును జపించిన మాత్రమున మూడుమూర్ల కల్పంబులు పుణ్యనదులలో స్నానము చేసినవాడగును" అని నారాయణ మంత్రంబుపదేశింపగా నత్యంతభక్తితో గజాననుడు ఆమంత్రమును పఠించుచు కైలాసంబున నుండెను. గణేశపురాణములో నారాయణ మంత్ర ప్రభావంబుచే సర్వకార్య ప్రారంభమున అగ్రపూజ లభించినదని గణేశుడు వెల్లడించియున్నాడు. ఆ నారాయణమంత్ర మహిమచే గంగానదిలో స్నానముచేయుటకు వెళ్లిన కుమారస్వామికి గజాననుండు కనపడి యెదురుగా నిలువబడియుండెను. అటులనే మూడుకోట్ల ఏబది లక్షల నదులలోగూడ స్నానము చేయునపుడు అన్నయగు గజాననుని చూచి ఆశ్చర్యపడుచు కైలాసమున కేగి తండ్రియగు శివుని సమీపమున నుండిన అన్నయగు గజాననకు నమస్కరించి, తన బలమును నిందించుకొని, తండ్రితో అన్నగారిశక్తిని తెలిసికొనక, ఆధిపత్యమును గోరితిని. క్షమింపుడనియు, అన్నగారికే ఆధిపత్యము నొసగవలయుననియు ప్రార్థించెను.

అంతట పరమేశ్వరుడు భాద్రపద శుద్ధ చతుర్థినాడు గజాననకు విఘ్నాధిపత్యము నొసగెను. అట్టిదినమున త్రిలోకములందలి వారు శక్త్యనుసారము అపూపములు, కుడుములు మొదలగునవి సమర్పించి, పూజింప వినాయకుడు ఆనందము కలవాడై కొన్ని కుడుములు తాను భక్షించి, వాహనమగు ఎలుకకు కొన్నియిచ్చి. కొన్నిటిని చేత ధరించి, మెల్లగ నడచుచు సూర్యుడస్తమించు నప్పటికి కైలాసంబునకువెళ్ళి, మాతాపితృలగు పార్వతీపరమేశ్వరులకు నమస్కారములు చేయదలచగ ఉదరము భూమిని తాకుటచే చేతులు భూమి

కందక పోయెను. చేతులను బలవంతముగ భూమినానింపగ పాదములు ఆకాశమువైపు మళ్ళినవి. దండప్రణామంబులు చేయుటకు బాధపడుచుండ, పరమేశ్వరుని శిరస్సునందుండిన చంద్రుడు గజానుని అవస్థనుచూచి, అట్టహాసముతో వికటముగ నవ్వెను. చంద్రదృష్టి దోషమువలన గజాననునిఉదరము పగిలి కుడుములు నలువైపుల దొర్లెను. గజాననుడు చనిపోయెను. అంతట పుత్రమరణమును పార్వతీదేవి గమనించి దుఃఖించుచు చంద్రుని జూచి, "దుష్టుడా! నీ దృష్టిదోషమున నా పుత్రుడు చనిపోయినాడు. నిన్ను చూచినవారు దుర్మార్గులై నిరాపనిందల ననుభవించెదరని" శాపమిచ్చెను. పార్వతీదేవి శాపమువలన ఋషిపత్నులకు చంద్రుని చూచుటచే నిరాపనింద సంభవించినది. అంతట ఋషులు, దేవతలు, ఋషిపత్నులు తమకు కలిగిన నిరాపనిందలను పరమేష్టికి దెల్పగా బ్రహ్మదేవుడు కైలాసంబునకువెళ్ళి పార్వతీపరమేశ్వరులను సేవించి, చనిపోయిన గజాననుని బ్రతికించి సంతోషింపజేసెను. పార్వతీదేవితో దేవతలు నీ శాపము వలన లోకములకంతయు ఆపదలు కలిగినవి. శాపమును తొలగింపుమని ప్రార్థింపగా పార్వతీదేవి సంతోషించి, కుమారుడగు గజానుని యెత్తుకొని "చంద్రుడు ఏనాడు వినాయకుని చూచి నవ్వెనో ఆ దినమున చంద్రుని చూడరాదని" శాపమును సవరించెను. అంతట బ్రహ్మాదులు సంతసించి, తమ నివాసంబునకు వెళ్ళి, భాద్రపదశుద్ధ చతుర్థియందుమాత్రము చంద్రదర్శనము చేయకుండ సుఖించిరి.

నారదుడు ద్వాపరయుగంబున కృష్ణుని దర్శించి, సేవించి, సంభాషించి, "సాయం సమయమైనది యీనాడు వినాయక చతుర్థి, పార్వతీదేవి శాపముచే చంద్రుని చూడరాదని" పూర్వ వృత్తాంతమును చెప్పి స్వర్గలోకమునకు వెళ్ళెను. కృష్ణుడు క్షీరప్రియుడగుటచే ఆ రాత్రి ఆవులుండు దొడ్డికివెళ్లి పైకి చూడక పాలుపితుకుచు పాలలో చంద్రుని ప్రతిబింబమును చూచి తన కెట్టి నీలాపనింద కలుగునో యని చింతించుచుండెను. కొంత కాలమునకు శ్రీకృష్ణుడు సత్రాజిత్తుయొక్క శమంతక మణిని అపహరించినాడని అపనిందను పొందెను. అపనిందను తొలగించుటకు అరణ్యమునకు వెళ్ళి వెదకి జాంబవంతునితో ఇరువది యెనిమిది దినములు యుద్ధముజేయగా జాంబవంతుడు శ్రీకృష్ణుడు భగవంతుడని గ్రహించి, శమంతకమణి నొసగగా గ్రహించి, సత్రాజిత్తుకు నొసగగా, సత్రాజిత్తు శ్రీకృష్ణుని మణిని గ్రహింపుమని వేడుకొనగా శ్రీకృష్ణుడు సూర్యవరప్రసాదితమగు శమంతక మణిని నీవే ధరింపవలయునని సత్రాజిత్తుకే యిచ్చి నిరాపనిందను తొలగించుకొనెను. అట్టి సమయమున దేవతలు శ్రీకృష్ణుని దర్శించి, "శ్రీకృష్ణభగవానుడా! నీవు సమర్థుడవు. కనుక నిరాపనిందను తొలగించుకొంటివి. మాగతియేమని" కొనియాడగా శ్రీకృష్ణుడు కరుణగలవాడై భాద్రపద శుద్ధ చతుర్థినాడు చంద్రదర్శనము ప్రమాదముగా సంభవించిన ఆనాడు గజాననుని పూజించి, శమంతకమణి కథను విని అక్షతలు శిరస్సున ధరించిన నిరాపనిందను యెట్టివారు పొందరని, ఆనతీయగా దేవాదులు తమ గృహంబులకువెళ్ళిరి. ప్రతిసంవత్సరము భాద్రపద శుద్ధ చతుర్థియందు మూడు లోకంబుల వారందఱు విఘ్నేశ్వరుని పూజించుచు సుఖముగ నుండిరి.

సంపాదకులు: స్వామి తపస్యానంద.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600 021) న ముద్రింపబడి.

స్వామి తపస్యానందవారిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600 004) నుండి ప్రచురింపబడినది.

Vol. XXXV—9 (September 1978) Sri Ramakrishna Prabha Regd. No. M—4635

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

| గ్రంథము | వెల |
|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము | 8.00 |
| శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర | 10.00 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 8.00 |
| శ్రీ రామకృష్ణోపనిషత్తు | 3.75 |
| శ్రీ రామకృష్ణపరమహంస నీతికథారత్నములు | 2.50 |
| గురూపదేశములు | 2.00 |
| నా గురుదేవుడు | 1.25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1.50 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహము | 0.75 |
| ఆరాత్రికము మరియు | |
| శ్రీ రామనామ సంకీర్తనము | 0.50 |
| శ్రీ రామకృష్ణుడు, వివేకానందస్వామి | 0.25 |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4.00 |
| శ్రీ శారదాదేవి | 2.50 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | 0.80 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4.00 |
| బాలల వివేకానందుడు | 2.00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి | |
| 9 సంపుటముల పూర్తిసెట్టు (సాదా) | 45.00 |
| ,, ,, (క్యాలికో) | 58.50 |
| విడి సంపుటములు ఒక్కొక్కటి (సాదా) | 4.00 |
| ,, ,, (క్యాలికో) | 5.50 |
| స్వామి శిష్య సంవాదములు | 16.50 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 5.00 |
| ,, (రెండవ భాగము) | 5.50 |
| భారత యువజనులారా! | 3.00 |
| ప్రబోధ రత్నాకరము | 3.75 |
| రాజయోగము | 6.25 |
| కర్మయోగము | 4.00 |
| భక్తియోగము | 4.00 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 2.25 |
| ,, (రెండవభాగము) | 3.00 |
| హిందూ మతము | 4.00 |
| వివేక సూర్యోదయము | 4.00 |
| అనుష్ఠాన వేదాంతము | 2.50 |
| ప్రాచ్యము - పాశ్చాత్యము | 1.25 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 3.00 |
| భారతదేశము | 2.00 |
| భారతీయ మహిళ | 2.00 |
| నా జీవితము, జీవిత కార్యము | 1.25 |
| శ్రీ రామకృష్ణ సేవాసంస్థ: తదాదర్శములు | 0.50 |
| చికాగో నగరోపన్యాసములు | 1.00 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0.80 |
| నవీన భారత దేశము | 0.40 |
| సర్వం విష్ణుమయం జగత్ | 0.30 |
| శ్రీ వివేకానంద సింహగర్జనలు | 0.20 |
| బ్రహ్మానంద బోధనలు | 4.75 |
| తాపత్రయ చికిత్స | 0.60 |
| ముక్తిమార్గము | 0.30 |
| పారమార్థిక సంభాషణలు | 6.50 |
| నారద భక్తి సూత్రములు | 4.00 |
| శ్రీ దొడ్డ భాగవతము-మూడవ సంపుటము | 7.00 |
| దేవీమాహాత్మ్యము | 4.00 |
| శ్రీ మద్భగవద్గీత | 9.00 |
| పారాయణగీత తాత్పర్యసహితము | 3.75 |
| ,, మూలము | 2.00 |
| కఠోపనిషత్తు | 2.00 |
| గిరీశచంద్ర | 1.00 |
| భక్తిమార్గము | 1.00 |
| శ్రీకృష్ణవాణి | 0.80 |
| బుద్ధఉవాచ | 0.80 |
| క్రైస్తు సూక్తిమాల | 0.80 |
| మహమ్మదు సూక్తి మంజరి | 0.80 |
| శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము | 1.25 |

ఇవియేకాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును,

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైలచిత్రములు మున్నగున వెన్నియో మా యొద్ద లభింప గలవు.

అడ్రెసు: మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600 004

సంవత్సర చందా రూ. 7 జీవిత చందా రూ. 100 విడి సంచిక 70 పై.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 35 1978 - అక్టోబరు సంచిక 10

# రామకృష్ణమిషన్ - వరదబాధితులకు సహాయకార్యక్రమము

ఆగస్టు చివరివారంలో రామకృష్ణమిషన్ వరదబాధితులకు సహాయకార్యక్రమములను ప్రారంభించినది. బీహారునందలి దర్భాంగజిల్లాలోని ఆఱు గ్రామములకు, భాగల్‌పూర్ జిల్లాలోని నవ్‌గాచియా సబ్‌డివిషన్‌కు, కటీహార్ టౌనుకును; పశ్చిమ బెంగాల్‌నందలి రాట్‌వా, లాల్‌బాగ్ అను ప్రదేశములకును ఇప్పుడు సహాయ కార్యక్రమములు నిర్వహింపబడుచున్నవి ఇతర బాధిత ప్రాంతములకుకూడ కార్యక్రమములను విస్తరింపజేయవలసియుండును. కొన్నిచోట్ల అన్నవస్త్రములు, ధాన్యములు పంచిపెట్టబడుచున్నవి. కొన్నిచోట్ల గృహనిర్మాణమునకు అవసరమగు పరికరములు పంచిపెట్టబడుచున్నవి.

ఈ సేవాకార్యక్రమములను నిర్వహించుటకు ధనరూపమైన వస్తురూపమైన విరాళములకై ఉదారహృదయులను అభ్యర్థించుచున్నాము. పూర్వమువలె ఇప్పుడున్ను ప్రజల సహకారము పుష్కలముగా లభించగలదని ఆశించుచున్నాము.

విరాళములు కృతజ్ఞతతో ఈ క్రింది విలాసములందు స్వీకరింపబడును. చెక్కులు, డ్రాఫ్టులు రామకృష్ణమిషన్ పేరున ఉండవలెను. రామకృష్ణమిషన్‌కు పంపెడి విరాళములపై ఆదాయపు పన్ను లేదు.

1. రామకృష్ణ మిషన్. బేలూరుమఠం, హౌరా—711202.
2. అద్వైత ఆశ్రమం, 5, దేహి ఎన్‌టల్లీ రోడ్, కలకత్తా—700014.
3. ఉద్బోధన్ ఆఫీస్, 1. ఉద్బోధన్ లేన్, కలకత్తా—700003.
4. రామకృష్ణ మిషన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ కల్చర్, గోల్‌పార్క్, కలకత్తా—700029.
5. రామకృష్ణ మిషన్ ఆశ్రమం, రామకృష్ణ అవెన్యూ, పాట్నా—800004.
6. రామకృష్ణ మిషన్ వివేకానంద సొసైటి, జమ్‌షెడ్‌పూర్—831001.
7. రామకృష్ణ మిషన్, రామకృష్ణ ఆశ్రమమార్గ్, న్యూఢిల్లీ—110055.
8. రామకృష్ణ మిషన్, రామకృష్ణ మిషన్ మార్గ్, ఖార్, బొంబే—400052.

బేలూరు మఠము
29-8-'78

స్వామి గంభీరానంద,
కార్యదర్శి.



ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 35 | 1978 – అక్టోబరు | సంచిక 10

## ప్రార్థన

విద్యాః సమస్తా స్తవ దేవి భేదాః
స్త్రియః సమస్తా సకలా జగత్సు
త్వయైకయా పూరితమమ్బయైతత్
కా తే స్తుతిః స్తవ్యపరాపరోక్తిః.

దేవీ! అన్నివిద్యలు నీయంశములే. లోకములోనున్న కళాశోభితులగు స్త్రీలందఱు కూడ నీయంశములే. తల్లీ! ఈ జగత్తునంతయు నీవే నిండియున్నావు. స్తుతికి సాధనభూతమగు పరావాక్కు అపరావాక్కు కూడ నీవే అయినందువలన నిన్ను స్తుతించుట ఎట్లో తెలియకున్నది.

# వివేకానందవాణి

**జగన్మాత**

శాక్తేయులు విరాట్ఛక్తిని మాతృభావమున పూజింతురు — వారెఱింగియున్న యీ మాతృనామము ఎంతటి మధురనామము! ఏలన మాతృత్వమే భారతనారీత్వ మహోన్నతాదర్శము. భగవంతుడు మాతృభావమున, ప్రేమస్వరూపుడుగా, ఆరాధింపబడునపుడు హిందువులు దీనిని 'దక్షిణమార్గము' అందురు. అయ్యది ఐహికసంపదనుగాక, పారమార్థికైశ్వర్యమును జేకూర్చును. భగవంతుడు వాని భీషణరూపమున, అనగా వామాచార మార్గమున, పూజింపబడునెడ, సాధారణముగా అయ్యది విస్తారమగు ఐహిక సంపదలను ఒనగూర్చును. కాని పారమార్థికసంపదను గల్గించుటదుర్లభము; తుదకది పతనమునకును వంశనాశనమునకును హేతుభూతమగుచుండును.

శక్తి ప్రప్రథమమున మాతృరూపముననే వెలువడుచున్నది. మాతృభావన పితృభావనకంటె ఉన్నతమని పరిగణింపబడుచున్నది. బిడ్డ తన తల్లినిగూర్చి యేకార్యమునైనను జేయగల సర్వశక్తిమంతురాలని భావించు చందమున మాత యనినంతనే దివ్యశక్తియనియు సర్వశక్తిస్వరూపిణియనియు మనకు స్ఫురించును. మనయందు నిద్రాణమైయున్న కుండలినీ శక్తియే జగన్మాత. ఆమె నారాధింపనిదే మనమెన్నటికిని ఆత్మజ్ఞానమును బొందజాలము. దయామయి, శక్తిస్వరూపిణి, సర్వమయి— యనునవి యామె విశేషణములు. విశ్వశక్తి పుంజీభావమే జగన్మాత; విశ్వమందు ఏ శక్తి వ్యక్తమగుచున్నను అయ్యది మాతయే. ఆమెయే ప్రాణము. ఆమెయే జ్ఞానము, ఆమెయే ప్రేమ. ఆమె విశ్వరూపిణియైయున్నను విశ్వముకంటె భిన్నముగానున్నది. (శ్రీ)రామకృష్ణుడు ఆమెను దర్శించిన చందమున, (గ్రహించిన చందమున) మనముగూడ ఆమెను దర్శింపవచ్చును, గ్రహింపవచ్చును. మాతృభావమున సుప్రతిష్ఠితులమైనచో, మనమే కార్యమునైనను జేయవచ్చును. ఆమె మన ప్రార్థనను వెంటనే సఫలమొనర్చును.

ఏ రూపముననైనను ఏ క్షణముననైనను ఆమె మనకు సాక్షాత్కరింపగలదు. జగన్మాత నానారూపములను బొందియుండగలదు, లేదా, రూపరహితయై నామమాత్రధారిణియై యుండగలదు.

సముదాయమే వ్యక్తియగుచున్నది. ఇట్లే ప్రతి జీవియు ఒక అణువని భావించుచో వాని యన్నిటియొక్కయు సముదాయమే భగవంతుడని తెలపవచ్చును. అఖండమగు బ్రహ్మము దీనికి అతీతమై భాసించుచున్నది. శాంతస్థితియందుండు సాగరమే బ్రహ్మము; అలలతో ప్రచలితమై యుండునపుడదియే జగన్మాత. ఆమెయే దేశకాలనిమిత్తములు. ఆమెయే బ్రహ్మము. సోపాధికము, నిరుపాధికమునని యామెకు రెండు ప్రకృతులు, లేక అవస్థలు గలవు. సోపాధికావస్థయందామె దేవుడుగను జీవుడుగను ప్రకృతిగను భాసించుచున్నది. నిరుపాధికావస్థయందామె తెలియబడనిది, తెలియరానిది.

జగన్మాతయందొక అల్పాంశమే కృష్ణుడయ్యెను, మఱియొకటి బుద్ధుడై యొప్పెను, వేఱొకటి క్రీస్తై భాసించెను. జగన్మాత్రాంశమును లోకమున మన తల్లియందు లేశమైనను గని యామెను ఆరాధించుచో మనకది మహత్త్వమును గలుగజేయును.

# శ్రీ రామకృష్ణ కథామృతము

## (రెండవ భాగము)

అనువాదము: ప్రవ్రాజిక శ్యామాప్రాణ

[పాతకాలపుమాటలు - క్రీ. శ. 1857 - కాళికాలయ ప్రతిష్ఠ ముగిసినపిదప జ్ఞానోన్మాదుని దర్శించుట.]

శ్రీ రామకృష్ణులు: రాధాదేవిది ప్రేమోన్మాదము. వేరొక ఉన్మాదమున్నది. దానిని భక్తి ఉన్మాదమందురు. ఆంజనేయుల భక్తియే ఇందులకు ఉదాహరణము. సీతాదేవి అగ్ని ప్రవేశము చేయుటచూచి హనుమంతుడు రాముని చంపబోవును. జ్ఞానోన్మాదుని ఒకనిని చూచితిని. కాళికాలయ ప్రతిష్ఠ ముగిసినపిదప ఒక జ్ఞాని ఇచ్చటికి వచ్చెను. అతడు రాజా రామ్‌మోహనరాయ్ బ్రహ్మసమాజ సభకు చెందినవాడట. అతడు ఒకచేతిలో తెగిన చెప్పు, ఇంకొక చేతిలో మామిడిమొక్క నాటిఉన్న తొట్టిని బట్టుకొనివచ్చెను. గంగాస్నానము చేసి కాళికాలయమున బోయి 'ఖట్వాంగధారిణీమ్...' మున్నగు స్తవములు చేసెను. అటుపై కుక్క పులివిస్తరాకులు నాకుచుండగ దాని చెవిపట్టి అవతలకునెట్టి ఒకవైపు తానుగూడ ఆ ఎంగిలి తినెను. కుక్కకూడ ఏమి చేయలేదు. ఆ కాలములో నా పరిస్థితికూడ అట్లే యుండినది. అందుచే హృదయుని కౌగలించుకొని "నాకుకూడ ఆ దశ పట్టునా" అని ఏడ్చితిని. నా కపుడు నిజముగ ఉన్మాదస్థితియనియే చెప్పవచ్చును. వెదురుగడ నొక దానిని భుజముపై పెట్టుకొని తిరుగుచుంటిని. శివనాథశాస్త్రి నన్ను చూచెనట. ఇతడు నిజముగ పిచ్చివాడనియే శివనాథశాస్త్రి వెక్కిరతో చెప్పెనట. అపుడు నాకు కుల మత విచక్షణయే లేదాయె. అంత్యజాతి స్త్రీ వండిపంపిన ఆకుకూర తినెడివాడను. కాళికాలయములో బిచ్చగాండ్రు తిని పారవేసిన పుల్లాకులలోని మెతుకులు రెండు కళ్ళ కద్దుకొని నోటిలో వేసికొంటిని. అదిచూచి హలధారి మండిపడి "బిచ్చగాండ్ర ఎంగిలి తిన్నావు, నీకు పుట్టబోవు బిడ్డలనెవరు వివాహము చేసికొందురు?" అనెను. హలధారి వరుసకు మా అన్నగారగును. అయిననేమి? ఈ మాటతో నాకు చాల కోపము వచ్చెను. నేనిట్లంటిని. "ఓరి మూర్ఖుడా! నేను పరమహంసను...నాకు బిడ్డలు కల్గుటయా...నీవు సర్వదా గీతవేదాంతములు వల్లించుచుందువు. 'బ్రహ్మసత్యం జగన్మిథ్య' అని బోధించుచునే యుందువు. అట్లయ్యు నీకు జ్ఞానము లేదాయె. నీ తెలివి తెల్లవార."

(మాస్టరుతో) చూడు. చదివినందువల్ల ప్రయోజన మేమియు లేదు. నోటితో స్వరము పల్కుట సులభమే కాని వాయించుట చాల కష్టము. మధురబాబుతో కొన్ని దినములు నానావిహారము చేసితిని. అపుడే నవద్వీపమును కూడ దర్శించితిని. పడవలో బెస్తలు వంట చేసుకొనుచుండిరి. నే నక్కడ నిలబడి చూచుచుంటిని. నీ వక్కడ ఏమి చేయుచున్నావని మధురబాబు అడుగగా వీరి వంటకము ఘుమఘుమ లాడుచున్నదంటిని. నేను వారినేమైనా అడిగి తినెదనేమో యను భయముతో మధురబాబు "బాబూ! నీ విచటకు రమ్ము. అచ్చట నిలబడవద్దు" అని చెప్పెను. ఇప్పుడా పరిస్థితి మారిపోయినది. ప్రస్తుతము బ్రాహ్మణునిచే మడిగా వండించి దేవునికి నైవేద్యము పెట్టిన అన్నమే భుజింపగలను.

భగవత్ ప్రేమ ప్రారంభదశలో కల్గిన స్థితి ని ఏమని వర్ణింపను? చిన్నప్పుడు కామార్పు కూరులో చిన్న శాంకారి మున్నగు స్నేహితు లతో ఒకమరు హరినామము చేయుడని ప్రతిమాలువాడను. ఒక్కొక్కప్పుడు వారి కాళ్ళు పట్టుకొనబోవువాడను. "నీ కిప్పుడు గొంతగ ప్రేమ కలైనుకదా! అందుచే అందరిని సమానముగా చూచుచున్నావోయీ?" అని చిన్న శాంకారి పల్కెడివాడు. తుఫాను కొట్టు చున్నప్పుడు మామిడి చింత మున్నగు చెట్లన్నియు ఒకటిగనే కనిపించును. సుడిగాలికి దుమ్ము రేగి వాన కురియుచున్నప్పుడు ఏది ఏ చెట్టో గుర్తింపజాలము.

ఒక భక్తుడు: ఇట్టిభక్తి, ప్రేమ జ్ఞానోన్మాదములలో ఏదైన ఒకటి గృహస్థ భక్తునికి కల్గినచో అతడు సంసారమెట్లు చేయ గలడు?

శ్రీరామకృష్ణులు: యోగులు రెండు రకములు: వ్యక్తయోగులు, గుప్తయోగులు, గృహస్థులు గుప్తయోగులు, ఇతరులు ఎరుగరు. గృహస్థులు మనసా త్యాగము చేసిన చాలును. బాహ్యముగ త్యజింపనక్కరలేదు.

రామ్: పిల్లలను మరపించేటట్లుగ మీరు మాకు చెప్పుచున్నారు. గృహస్థుడు జ్ఞాని అయిన కావచ్చునుగాని విజ్ఞాని కాజాలడు.

శ్రీరామకృష్ణులు: చివరకు విజ్ఞాని అయినను కావచ్చును. కాని బలాత్కారముగా సంసార మును త్యజింపనక్కరలేదు. నేను లోకులకు ధర్మకర్మలు రెండును చేయుడని చెప్పు చుందును; ఇటు సంసారము చేయుడు. అటు భగవంతుని దర్శింపుడు, అంతయు తెగించి పొందుడని చెప్పనుకదా! కేశవసేనుడు ఒక దినము లెక్చరిచ్చుచు ఇట్లనెను. "ఓ పరమే శ్వరా! మేము భక్తినదిలో మునిగి కొట్టుకొని పోయి సచ్చిదానంద సముద్రము చేరునట్లు అనుగ్రహింపుము" స్త్రీలు పరదా వెనుకనే కూర్చొనియుండిరి. తర్వాత నేను వానితో ఇట్లంటిని. "మీరందరూ ఒక్కసారిగ మునిగి పోయినచో ఈ స్త్రీలగతి ఏమగును? ఒక్కొక్క మునక వేసి లేచివస్తుండండి." కేశవునితోపాటు అందరూ ఫక్కున నవ్విరి.

హాజరా నాతో ఇట్లనెను "ధనసంపదలు పేరు ప్రతిష్ఠలుగల రజోగుణ వ్యక్తులనే నీవెక్కువ ప్రేమింతువు." ఇది నిజమా? మీరే చెప్పండి. హరీష్ లాటూను ప్రేమించుటలేదా? నరేన్‌ని ప్రేమించుటలేదా? అతడు పట్టెడన్న ములోనికి ఉప్పుకూడ దొరకనట్టి పేదరికములో నున్నాడే!

—సశేషము.



జీవిని జీవి భక్షింపఁ జేసితివింతె కొసిపెట్టినావె చేతనులకెల్లఁ?
జేసినంత భుజింపఁ జేసినా వింతెకా కెక్కువ లెవ్వరి కిచ్చినావు?
కర్మసూత్రంబునఁగట్టి త్రిప్పెదవుగా కిచ్చి నొక్కనిఁ బోవనిచ్చినావె?
వెసఁ బ్రకృతిస్త్రీకి వేఁబెట్టితివిగాక దక్షతఁ గైకమ్మై విడిచినావె?
తెలిసె నీ రిత్తకత్తియంబు దేవదేవ! వేఱుగతిలేక నిన్ను సేవింపవలసె
చిత్రచిత్రప్రభావ! దాక్షిణ్యభావ! హతవిమతజీవ! శ్రీకాకుళాంధ్రదేవ!

-ఆంధ్రనాయకశతకము.

# పరమపదము

చీమలకొండ ఉమారామలింగమూర్తి.

పురుషుడు ధర్మ, అర్థ, కామ, మోక్షములు అను నాల్గింటిని సాధించవలసియున్నది. ఈ నాల్గింటిని పురుషార్థములందురు. వీనిలో కడపటిది మోక్షము. అదియే పరమపదము. దీనినే ముక్తి (Liberation) అందురు. బంధము నుండి విడిపడుటను విముక్తియందుము. పంజరములో బంధింపబడిన చిలుక స్వేచ్ఛను కోరునట్లును కారాగారములో శిక్ష ననుభవించు ఖైదీ విడుదలకోరునట్లును ఈ శరీరములో బంధింపబడిన ఆత్మ ముక్తినికోరును. సంసారమనగా పుట్టుట చచ్చుట మరల మరల పుట్టుచుండుట చచ్చుచుండుట అను అంతులేని విషవలయము. దీనినుండి విముక్తి లభించుటయే ముక్తి. అందువలన ముక్తి యనగా జనన మరణ రహిత స్థితిని చేరుటయని చెప్పవచ్చును. ఆత్మయనగా నేమి? దీనికి బంధమెట్లు కలిగినది? బంధమునుండి విముక్తి ఎట్లుకలుగును? ఈ అంశములను పరిశీలింతము.

సృష్టి జాలములోని ప్రతిజీవి భగవదంశయే యని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. Each soul is potentially divine అను వాక్యము యొక్క భావము కూడ ఇదియే. ప్రతి జీవియందుండు భగవదంశయే ఆత్మ (soul) అనబడుచున్నది. అయినచో ప్రపంచములోని జీవులన్నియు ఒకే విధముగ నుండక కొన్ని సత్స్వభావమును కొన్ని దుష్టస్వభావమును— ఇత్యాది భేదములుండుటచే వానియందున్నది భగవదంశ ఎట్లగునని సంశయింతుము. ఈ ఉదాహరణమును పరిశీలింపుడు. విద్యుద్దీపములలో కాంతినిచ్చునది విద్యుచ్ఛక్తియే అయినను కొన్ని దీపములు ఎక్కువ కాంతివంతముగను, కొన్ని వివిధ రంగులకాంతినిచ్చునవిగను ఉండుట మనము చూచుచుందుము. అన్నిటిలో ప్రసరించు విద్యుత్తు ఒకటే అయినను, బల్బులోనుండు తీగనుబట్టియు, బల్బుయొక్క స్వభావమును బట్టియు కాంతి మారుచుండును. అటులనే అన్ని జీవులలోనిది భగవదంశయే అయినను, వారి వారి మనస్సు అనెడు అద్దము వేరు వేరు స్వభావములు కలిగియుండుటచే భగవదంశ కొన్ని జీవులలో ప్రస్ఫుటము అగుటయు, కొన్నిటిలో కొలదిగనే ప్రస్ఫుటమగుటయు, కొన్నిటిలో ప్రస్ఫుటము కాకపోవుటయు జరుగుచున్నది. అందువలనమనస్సుయొక్క మాలిన్యమే దీనికి కారణమని తెలియును.

ఈ మనోమాలిన్యము ఎట్లు వచ్చినది? మానవునిలో వేరు వేరు పాళ్లలో అసుర స్వభావము మానవస్వభావము దైవస్వభావము (Brutal, human and godly qualities) గలవు. వీనిని తమోగుణము, రజోగుణము, సత్వగుణము అందురు. మనము చేయుచేతలు (deeds) పల్కెడు మాటలు (words) ఆలోచనాతీరు (thoughts) వీనినిబట్టి మనము మంచివారమనిగాని చెడ్డవారమనిగాని పరిగణింపబడుదుము. అందుచే మనోవాక్కాయముల ద్వారా మనము చేయు పనులను బట్టి మనస్సు మాలిన్యమగుచున్నది. అయితే ఈ మాలిన్యము ఈ జన్మలోని కృత్యములవలననేగాక పూర్వజన్మల కృత్యములవలనకూడ ఏర్పడునని హిందూమత గ్రంథములు చెప్పుచున్నవి. వీనినే సంస్కారములనియు వాసనలనియు (tendencies) అందురు. ఈ సంస్కారములు మంచివిగాని చెడ్డవిగాని కావచ్చును. మంచి సంస్కారముల వలన సత్కృత్యములను చెడ్డ సంస్కారములవలన దుష్కృత్యములను చేయుచుండుటచే పుణ్యపాపములును వీని వలననే సుఖదుఃఖములును కల్గునని చెప్పుదురు.

ప్రాపంచిక జీవితము సుఖదుఃఖముల కల

యొక. దుఃఖముల ననుభవించుటకు ఎవ్వరును ఇష్టపడరు. దుఃఖములు లేనట్టియు సంపూర్ణ సుఖము నిచ్చునట్టియు జీవితమును అనుభవింప వలెననియే అభిలషింతుము. అట్టి సుఖజీవితమును పొందవలెనన్న దుష్కృత్యములను మాని సత్కృత్యములనే చేయవలయును. ఇది కొంతవరకు మంచి అభిప్రాయమే. కేవలన ఇతరులకు మనోవాక్కాయ కర్మలద్వారా కీడు తలపెట్టుట విరమించి సత్కృత్యములనే చేసి పుణ్యమును సంపాదింతుము. అట్టి పుణ్యఫలమున ననుభవించుటకు స్వర్గమునకు పోవుదుమని భావింతుము. అయితే పుణ్యఫలము అనుభవించుట పూర్తిఅగుట తోడనే 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి' అను వాక్యము చెప్పుచున్నట్లు మరల జన్మించవలసినదే. అందువలన స్వర్గముకూడ శాశ్వతానందమును ఈయజాలదు. జన్మరాహిత్యమగుటవలననే దుఃఖములు నశించుననియు అదియే ముక్తియనియు పైన చెప్పబడినది. అందువలన ముక్తి ఎట్లు లభించును?

ముక్తినిగూర్చి వివేకానందుడు వెలిబుచ్చిన అభిప్రాయమును పరిశీలింతము. మనలోనున్నది భగవదంశయే. దానిని ఆత్మయందుము. ఆత్మకు నాశములేదు. పుట్టుట, పెరుగుట, చచ్చుట మొదలగు మార్పులు దానికిలేవు. అది అనంతమైనది. సర్వత్రనిండియున్నది. అట్టి ఆత్మ అన్నిజీవులలోనున్నను ఆ జీవియొక్క మనోమాలిన్యమునుబట్టి ఆత్మ దర్శింపబడుట లేదు. నీకును ఒక సుందరమైన దృశ్యమునకును (Scenery) మధ్య ఒక తెర ఉన్నదనుకొనుము. ఆ తెర అడ్డువచ్చుటచే నీవు ఆ దృశ్యమును దర్శింపజాలవు. ఆ తెరకు ఒక చిన్న బెజ్జమున్నచో ఆ దృశ్యములో కొంత భాగమును మాత్రము చూడగలవు. ఆ బెజ్జము క్రమముగ పెద్దదైనచో ఆ దృశ్యమును మరింత చూడగలవు. తెర పూర్తిగా తొలగినచో ఆ దృశ్యమును పూర్తిగ చూడగలవు. ఆ దృశ్యమే ఆత్మ. తెర నీ మనస్సు. దృశ్యములో మార్పు ఏమియు లేనప్పటికి తెరయందలి మార్పును బట్టియే ఈ తేడా కలుగుచున్నది. అటులనే ఆత్మమార్పు లేనివస్తువు. దానిని దర్శించుటకు మనస్సు అను తెర తొలగవలయును. దీనినే మనోనాశము (Cessation of mind) అందురు. మనస్సును ప్రాపంచిక విషయములనుండి మరల్చి అంతర్ముఖముగ త్రిప్పుటయే మనోనాశస్థితి. అంతర్ముఖునకే ఆత్మసాక్షాత్కారమగును. అందువలన ఆత్మసాక్షాత్కారమగుటకు మనస్సు స్వాధీనపరచుకొనవలెను. The mind uncontrolled and unguided will drag us down, down for ever-rend us, kill us; and the mind Controlled and guided will save us, free us. స్వాధీనముకాని మనస్సు మన అధఃపతనమును, స్వాధీనమైన మనస్సు ముక్తిని కలుగచేయునని ఈ వాక్యము యొక్క భావము.

మనస్సును స్వాధీనపరచుకొను టెట్లు?

శాస్త్రజ్ఞులు అనేక పరిశోధనలుచేసి క్రొత్త క్రొత్త సంగతులను కనిపెట్టి బాహ్యప్రకృతిని వశీకరించుకొనినట్లే అంతఃప్రవృత్తియగు మనస్సును కూడ వశీకరించుకొనవలసియున్నది. అన్ని జీవులకు మనస్సు ఉన్నప్పటికి, మనస్సును వశీకృతము చేసికొనగలశక్తి మానవునికే కలదు. మిగతా జంతువులకు ఇట్టి శక్తి అంతగా లేదు. మనస్సు అపరిపక్వస్థితిలోనున్నచో వివేకరహితముగ ప్రవర్తింతుము. మన ప్రయత్నము వలన (శమదమాది షట్కసంపత్తిని అభ్యసించి) మనస్సును పరిపక్వస్థితికి తీసికొని వచ్చుట సాధ్యమే. వేరు వేరు మానవులకు మనోపరిపక్వత వేరువేరుగా నుండుటకు కారణమును ఇట్లు చెప్పెదరు. జన్మ పరంపరలో జరిగిన కృషివలన పరిపక్వత మారుచుండును.

మనస్సును సంపూర్ణముగ స్వాధీనముచేసికొనిన వారు ఉన్నతస్థాయిలోనివారు. వారికి ఈ జన్మనుందే ముక్తి లభించును.

అయితే జీవుడు ఇన్ని జన్మలను ఏల ఎత్తవలెను? దీని సమాధానమునకు ఈ దిగువ ఈయబడిన రెండు ఉదాహరణములను పరిశీలింపుము. (1) మన ప్రస్తుత జీవితమునే పరిశీలింతము. బాల్యమున వివేకరహితముగ ప్రవర్తింతుము. వయస్సు పెరిగిన కొలది విద్యను సముపార్జించి ప్రాపంచిక జ్ఞానమును సంపాదించుకొని వివేకవంతులమగుదుము. ఈ జన్మయందు బాల్యమునుండి వార్ధక్యము చేరువరకు వివేకము ఎట్లు క్రమముగ వృద్ధిచెందుచున్నదో అటులనే జన్మపరంపరల వలన జ్ఞానము వృద్ధియై పరిపక్వమగునని గ్రహింపవచ్చును. (2) వివేకానందుడు ఈ దిగువ ఉదాహరణము నిచ్చెను. నీవు ఒక పుస్తకమును చదువుచుంటి వనుకొనుము. ఒక పేజీ చదివి అందలి విషయములను గ్రహించి, దానిని తిరగవేసి మరియొక పేజీ చదువుచు అందలి విషయములను గ్రహించుచు, ఈ తీరున పుస్తకమునందలి సంగతులనన్నిటిని గ్రహించి పుస్తకము ముగింతువు. నీ పుస్తకములోని పేజీలు (తిరగవేయుటవలన) మారుచున్నవి గాని నీలో మార్పు ఏమియు లేదు. ఈ ఉపమానములో ప్రకృతి పుస్తకముతోను, పేజీలు జన్మలతోను, చదివెడు మనుజుడు ఆత్మతోను పోల్చబడినవి. అందువలన ప్రకృతిని పూర్తిగ అర్థము చేసికొనుటకు, అనుభవము పూర్తి అగుటకు అనేక జన్మలు ఎత్తి, ఆత్మ పుట్టుట పెరుగుట చచ్చుట ఇత్యాది మార్పులు పొందదనియు గ్రహించుటవలన (జ్ఞానము కల్గుట వలన) జన్మ పరంపర ముగియును.

దైనిక జీవనములో అనేకమంది మరణించుట చూచుచుండుటచే ఆత్మకు మరణము లేదని మనము విశ్వసింపజాలము. శరీరమన్నను ఆత్మయన్నను ఒకటేయని భావించుటయే దీనికి కారణము. భూగోళశాస్త్రము నభ్యసించునపుడు సూర్యుడు స్థిరముగ నుండుననియు, భూమియే సూర్యునిచుట్టు పడమరనుండి తూర్పునకు తిరుగుచున్నదనియు నీవు నేర్చుకొనినను, ఈ విషయమును తేలికగా నమ్మజాలవు. కొన్ని ఉదాహరణములను చెప్పిన తరువాత బాగుగ ఆలోచించిన పిమ్మటనే నమ్మగలుగుదువు. అటులనే ఆత్మయు శరీరమును ఒకటి కాదనియు; ఆత్మకు చావు పుట్టుకలు లేవనియు, అవి శరీరమునకే యనియు నమ్ముటకు ఎంతయో ప్రయత్నమును ఎన్నియో ఉదాహరణములును అవసరము. మనలోని రాక్షస గుణములను మానవగుణములుగను, మానవగుణములను దైవీగుణములుగను మార్చుకొనుటకు మన ప్రయత్నము అవసరము. ఈ ప్రయత్నము అనేక జన్మలలోగాని పూర్తికాదు. అందుచే ప్రతి జన్మలోను సన్మార్గమున ప్రవర్తించుట వలననే ఎట్టకేలకు ఇది సాధ్యమగును. పూర్తిగ దైవీగుణములను సంపాదించగల్గినవాడు అజ్ఞానము నశించి ఆత్మను దర్శింతుము. ఆత్మ పరమాత్మ అంశయే యని అవగతమగును.

అట్టి జ్ఞానము కలుగువారికి పరమాత్మ సర్వాంతర్యామియనియు, అన్ని శరీరములలోనున్న ఆత్మ భగవదంశయే యని గ్రహింపబడి సమదర్శనము అలవడును. విశాలహృదయము ఏర్పడుటవలన 'నేను, నాది' అను సంకుచితత్వము నశించును. సుఖదుఃఖములు, కలిమిలేములు మానావమానములు—ఇత్యాది ద్వంద్వములను అధిగమింతుము. అదియే జ్ఞానము. అది కల్గినవెంటనే కర్మవాసనలు నశించి జన్మరాహిత్యమగును. అదియే ముక్తి. అదియే పరమపదము. అదియే మన గమ్యము.

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము: ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము: పి. గణపతిశాస్త్రి

జూన్ 1912

నేనీవేళ పొద్దున్న ఏడు గంటలకు గౌరీమా పాఠశాలకు వెళ్లాను. మధ్యాహ్నం నాలుగు గంటలవేళ ఆమెతో కలిసి అమ్మ దర్శనానికి వెళ్లాను. ఆ సమయంలో శారదామాత సాయంకాల నైవేద్యం సమర్పిస్తున్నది. అది ముగియగానే మొట్టమొదట గౌరీమా, ఆ తరవాత నేను నమస్కరించాము. ఆపైన గౌరీమా అమ్మను వేరుగా ఇంకొక చోటికి పిలిచి రవంతసేపు ఏదో రహస్యంగా సంప్రతించినపిమ్మట నాకోసం కబురు పంపించింది. నేను అమ్మకోసం ఒక సిల్కుచీర తీసుకువచ్చాను. అది ఆమె పాదాలదగ్గర ఉంచి నమస్కరించి "అమ్మా, ఈ చీర మీరిప్పుడు ధరించాలి." అన్నాను.

దానిమీద అమ్మ నవ్వి "అలాగే, తప్పకుండా కట్టుకుంటాను" అన్నది. గౌరీమా నన్నెంతో ఆప్యాయంగా పొగడడం ప్రారంభించింది. అమ్మ ఆమె ననుసరించింది.

శిష్యుడొకడు బాగా వికసించిన గులాబీలు, బిళ్లగన్నేరుపూలు, ఒత్తుగా అల్లిన చేమంతుల మాల, పళ్లు, తియ్యని తినుబండారాలు తీసుకు వచ్చాడు. అతడు ఆ పుష్పాలన్నీ అమ్మ పాదాలమీద ఉంచి అర్చించడం ప్రారంభించాడు. చాలా మనోహరమయిన [illegible]మది! అమ్మ చిరునవ్వుతో నిశ్చలంగా కూరుచున్నది. ఆమె మెడలో గులాబీమాల, పూజ్యపాదాలమీద బిళ్లగన్నేరుపూలు ఎంతో మనోజ్ఞంగా ఉన్నాయి. ఆ పూజ ముగిసిన పిమ్మట ఆ శిష్యుడు తాను తీసుకువచ్చిన తినుబండారాలలో కొన్ని తిరిగి ప్రసాదంగా తీసుకు వెళ్లవలెనన్న సంకల్పంతో ఆ భక్ష్యాలన్నీ కొద్దికొద్దిగా రుచి చూడవలసిందని శారదామాత నర్థించాడు. అది విని గౌరీమా నవ్వి "అమ్మా, ఈ భక్తుడు నిన్ను ఒక పట్టాన విడిచిపెట్టడు. నీవింక ఏదో కొంత ఆరగించక తప్పదు." అన్నది.

అమ్మ నవ్వుతూ "నేనన్నీ తినలేను! నిజంగా నేనన్నీ తినలేను" అంటూ, ఆ తిను బండారాలు, పళ్లు కొంచెం కొంచెంగా రుచి చూసి, మళ్లీ అవి ఆ భక్తుని చేతి కందించింది. అవి ఒక్కొక్కటే తన నుదుటితో స్పృశిస్తూ స్వీకరించి, తిరిగి శారదాదేవికి నమస్కరించి ఆ శిష్యుడు సెలవు తీసుకున్నాడు. ఆపైన అమ్మ తన మెడలోనించి గులాబీలమాలతీసి గౌరీమా మెడలో వేసింది.

భూదేవ్ ఒక చిన్న రథం తయారు చేశాడు. దానిమీదకూర్చుని ఠాకూరు ఊరేగవలసిఉన్నది. దానికోసం కావలసినవన్నీ సిద్ధం చేస్తున్నారు. ఆపైన మేమిద్దరము గౌరీమాను గురించిన ప్రసంగం ప్రారంభించాము ఆ సందర్భంలో అమ్మ ఇలా అన్నది. "గౌరీమా ఆశ్రమంలోని బాలికలందరిని గురించి చాలా శ్రద్ధ తీసుకుంటుంది. వారికెవ్వరికయినా జబ్బు చేస్తే స్వయంగా తానే పరిచర్య చేస్తుంది. జీవితంలో ఎన్నడు ఆమెకిటువంటి పరిచర్య చెయ్యవలసిన అవసరం కలగలేదు. ఇది ఆమె కట్టచివరి జన్మ. ఇందుచేత ఠాకూరు గౌరీమా చేత ఇటువంటి పనులన్నీ చేయిస్తున్నారు."

ఆపైన పక్కగదిలో ఠాకూరు రథంమీద సమాసీను లయినారు. అమ్మ మంచంమీద కూర్చున్నది. ఆమె నిశ్చలంగా ఠాకూరువైపే

తిలకిస్తున్నది. ఆ దృష్టిలో ఆనంద పరమావధి అభివ్యక్త మవుతున్నది! ఆ తరవాత భూదేవ్ మొదలయిన శిష్యులు కొందరు ఠాకూరు సమాసీనులయిన ఆ రథంకిందికి తీసుకువెళ్ళి, వీధిలో బాటమ్మటే నడిపిస్తూ ఊరేగించారు. ఆ తరవాత దానిని గంగాతీరం దాకా కూడా తీసుకువెళ్ళారు. సూర్యాస్తమయానికి తిరిగి వెనక్కి తీసుకవచ్చారు. ఆ తరవాత మహిళలు కొందరు పై అంతస్తులో ఆ రథాన్ని నడిపిస్తూ ఊరేగించారు. తరవాత అమ్మ, రాధు, నలినిఅక్కయ్య, నేను ఆ రథం లాగాము. అమ్మ అక్కడికి వచ్చిన వారందరితోను ఆ రథాన్ని గురించి ఎంతో ఉత్సాహంతో, ఆనందంతో ప్రసంగించింది. చిట్ట చివరికి స్త్రీలందరు తమ తమ ప్రసాదాలు తీసుకుని నిష్క్రమించారు. ఆ వీధిలో బాట మీద ఆ రథం నడిపిస్తున్న తరుణంలో అమ్మ "పూరిలోని జగన్నాథుని సందర్శనానికి అందరు వెళ్ళలేరు. అయినా ఠాకూరు నీవేళ రథం మీద చూచినవారందరికి అంతటి మేలు తప్పక జరుగుతుంది" అన్నది.

18, సెప్టెంబరు, 1912.

మాతృదేవిని చాలాసారులు సందర్శించాలని అనుకున్నా, గౌరీమా పాఠశాలలో ఊపిరి సలపని పనివల్ల నా కోరిక నెరవేర్చుకోలేక పోతున్నాను. అయినా రాధాష్టమినాడు రవంత తీరిక చిక్కింది. అమ్మ దర్శనానికి వెళ్లాను. ఆమె గంగలో స్నానానికని ఒంటికి నూనె రాసుకుంటున్నది....నన్ను చూసీ చూడగానే ఆమె "రా, అమ్మా, రా! నీవు పొద్దుటివేళ వచ్చినందుకు చాలా సంతోషంగా ఉంది. ఈ వేళ రాధాష్టమి. చాలా మంచిరోజు. నేను స్నానం చేసివచ్చినదాకా ఇక్కడ ఉండమ్మా!" అన్నది.

నేను కూడా అమ్మ వెంట వస్తానన్నాను. మాతృదేవి దానికి అంగీకరించింది. అయితే వానచినుకులు పడుతూండడంవల్ల గోలాప్‌మా, నేను అమ్మ వెంట వెళ్ళడానికి అంగీకరించలేదు. దానిమీద అమ్మ ఆమెతో ఏకీభవించి, "అయితే, సరేలె; అమ్మా! నేను త్వరలోనే తిరిగి వచ్చేస్తానులే!" అన్నది.

అందుచేత నేను అక్కడే ఉండిపోయాను. ఒక ముగ్ధనవవధువులాగ అమ్మ ఇతరుల అభిప్రాయాలకు వ్యతిరేకంగా తన అభిప్రాయా లెన్నడు వెల్లడించదన్న సంగతి నేను తరుచుగా గమనించాను.

అయితే అమ్మ రోడ్డుమీదికి వెళ్ళగానే వాన ఆగిపోయింది. ఆపైన గంగాస్నానం ముగియగానే అమ్మ నా దగ్గిరికి తిరిగివచ్చి "మేము బయలుదేరగానే వాన ఆగిపోయింది. 'అయ్యో! పాపం నీవు వద్దామని అనుకున్నావే!' అనుకుని నేనెంతో కించపడ్డాను. నీవు వచ్చిఉంటే బాగుండేది. ఆ పుణ్యవాహినిని చూసిఉండేదానవు." అన్నది. నిజానికి అమ్మతో కలిసివెళ్ళడానికే నేను ఆమె వెంట వెళ్లాలని ఉబలాటపడ్డాను. అంతేగాని నేనా పవిత్రవాహినిని చూడడానికి వెళ్లాలని అనుకోలేదు.

అమ్మ మాటలు విని గోలాప్‌మా, "వెంట వెళ్ళకపోయినంతమాత్రాన మునిగిపోయేదేమిటి? అమ్మ పాదా లొక్కమారు స్పృశిస్తే చాలును!" అన్నది.

గోలాప్‌మా అన్న మాటలు నేను తిరిగి అమ్మదగ్గిర అన్నాను. ఆమె దానిమీద "ఎంత మాట! నాకు, గంగమ్మ తల్లికి సాపత్యమా?" అన్నది.

ఈ విధంగా అమ్మ ఎల్లప్పుడు తానొక సామాన్య మహిళ అన్నట్టు ప్రసంగిస్తూండేది.

అయితే పై వారెవ్వరు లేనప్పుడు ఆమె దివ్య వైభవంతో విలసిల్లుతూ, భక్తులయెడల పరమ కారుణ్యాభావం ప్రదర్శించడం నేను అప్పుడప్పుడు గమనించాను.

ఆపైన అమ్మ తన గదిలోకి వెళ్లి, మంచం మీద కూర్చుని, "గంగలో స్నానం చెయ్యడం నిజంగా చాలా అదృష్టము." అన్నది. ఆమె పాదాల అర్చన కొనసాగించాలని నేను అనుకుంటున్నట్టు అమ్మ గ్రహించినదని నా కవగత మయినది...

శారదామాత చరణపూజ ముగిసిన పిమ్మట నేనామె పాదధూళి స్వీకరించి నిలుచున్నాను. చిట్టచివరికి అమ్మ ఫలహారం స్వీకరించడం ప్రారంభించింది. ఎంతో ఆత్మీయతతో నన్ను దగ్గిర కూర్చోబెట్టుకున్నది. తాను స్పృశించిన పదార్థాలన్ని సగం సగం నాచేత ఆరగింపజేయించింది. నేనెంతో ఆనందంతో అవి అన్ని స్వీకరించాను. నేను నా సాలపత్రంమీది తినుబండారాలు ఆరగిస్తూ మహాభక్తుడు నాగమహాశయుణ్ణి గురించి ఆలోచిస్తూ మాతృదేవితో అన్నాను. "అమ్మా, సాలపత్రంమీద ఫలహారాలు స్వీకరిస్తున్నప్పుడల్లా నాకు నాగమహాశయుడు గుర్తు వస్తూంటారు." ఆ మాటమీద ఆమె ఇలాగన్నది: "అతనిది చాలా లోతయిన భక్తి. ఈ సాల పత్రం ఎంతగా పసివాడి ఎండిపోయిందో చూడు! ఎవ్వరయినా ఇటువంటి ఆకు నోట పెట్టుకొని తినగలరంటావా? ఒకమారు ఠాకూరుకు నివేదించిన అన్నానికి ఆధారమయింది కనక నాగమహాశయుడది ఎంతో భక్తితో నోటపెట్టుకుని తినివేశాడు! అతని నేత్రాలలో ఎల్లప్పుడు భగవానునిమీద ప్రేమ తొణికిసలాడుతూండేది. ఆ నేత్రాలెప్పుడు ఎర్రనయి భక్తిభావంతో బాష్పాలివర్షిస్తూండేవి!

విపరీతమయిన నియమనిష్ఠలవల్ల అతని శరీరం చిక్కి శల్యావశిష్టమయింది. నాగమహాశయుడు ఎప్పుడయినా నన్ను చూడడానికి వచ్చినప్పుడు, ఎంతో చలించి పోయేవాడు. అందువల్ల అతనికి ఈ మేడమెట్లు ఎక్కి పైకి రావడమే గగనమై పోయేది! గజగజ వణికిపోతుండడంవల్ల అడుగు పడడమే గగనమయి పోయేది! అంతటి ప్రగాఢభక్తి నే నింతకుమునుపు ఎక్కడ చూడలేదు!"

ఆపైన నేనన్నాను "నాగమహాశయుణ్ణి గురించి చదివి నేను కొన్ని విషయాలు తెలుసుకున్నాను. అతడు తన వైద్యవృత్తి విడిచిపెట్టి పొద్దస్తమానము శ్రీ రామకృష్ణుని గురించి తీవ్రంగా ధ్యానిస్తూ ఉండేవాడట! అతని తండ్రి అది గమనించి ఒకనాడు "ఈపైన ఇంకేంచేస్తావు? కట్టుకోడానికి బట్టయినా లేక, కప్పల్ని తింటూ కాలక్షేపం చేస్తావా?" అని అన్నాడట! ఆ సమయంలో వారి ఇంటిపెరడులో ఒక చచ్చిపోయిన కప్ప ఉన్నది. నాగమహాశయుడు వెంటనే తన ఒంటిమీద బట్టలు దూరదూరంగా విసిరివేసి ఆ కప్పను దొరకబుచ్చుకుని, దాన్ని పచ్చి పచ్చిగానే తినివేసి తన తండ్రితో 'ఇదిగో, చూశారా? మీ ఆజ్ఞలు రెండు నేను పరిపాలించాను! దయచేసి ఇక నా అన్నవస్త్రాలను గురించి మీ రేమి మథనపడకండి! మీ ఆత్మ అభ్యున్నతిని గురించి శాస్త్ర ఆలోచించుకోండి!" అని అన్నాడట!

దానిమీద అమ్మ "ఆహా! ఠాకూరుమీద అతనికెంత నమ్మిక! పరిశుభ్రమయిన వస్తువయినా అపరిశుభ్రమయిన వస్తువయినా రెండు నాగమహామునికొకటే!" అని అన్నది.

-సశేషం.

# సూతసంహిత

## ఏలూరిపాటి అనంతరామయ్య

### ఆరవ అధ్యాయం

### శివభక్త పూజావిధి

నైమిశీయులు "భగవన్, శివభక్తునిపూజ ఏ ప్రకారం చెప్పబడినది? ఆ పూజకు ఫలం ఎట్టిదని చెప్పబడినది? అది ఆదరంతో చెప్పు" అని అడిగారు 1.

సూతుడు చెప్పాడు:

విప్రులారా, శివభక్తునిపూజావిధానం సాదరంగా చెపుతున్నాను. శ్రద్ధాయుక్తులై వినండి. ఎల్లప్పుడూ పనిగట్టుకొని చెయ్యండి 2. ఏ ప్రకారంవల్ల శివభక్తునికి మనస్తృప్తి కలుగుతుందో ఆ ప్రకారం చేయాలి. అదే నేను చెప్పిన పూజ 3. విప్రులారా, పరిశుద్ధ జలం తెచ్చి శివభక్తునిపాదాలు ఆదరంతో కడగాలి. అదీ ఉత్తమమైన పూజ 4. సువ్రతులారా, శివభక్తునికి నూనె రాసి తలంటిపోయటమూ, ఒళ్లు పట్టటమూ పూజ అని మనీషులు వక్కాణిస్తారు 5. అన్నపానప్రదానమూ, ఉత్తమపూజ అని చెప్పబడినది. ద్విజులారా, ధనదానమూ, వస్త్రదానమూ పూజ అవుతుంది 6. ద్విజులారా, పుష్పమాలాచందనాదిదానమూ, వనితాదానమూ, భూదానగోదానతిలదానములూ 7 జలపాత్ర ప్రదానమూ, గృహదానమూ, తాలవృంత ప్రదానమూ, పాత్రదానమూ 8, ఛత్రపాదుకాదానమూ, శయ్యాదానమూ శివభక్తపూజ అని పండితులు చెపుతారు 9.

శివభక్తపూజచే తరించిన వైశ్యులకథ:

ద్విజులారా, పూర్వం మహీతలంలో ఒకానొక వైశ్యుడు ఉండేవాడు. అతడు సంపన్నుడు. వేదవిదుత్తములారా, అతనికి నలుగురు కుమారులు కలిగారు 10.

వారిలో పెద్దకుమారుడు సత్యవాది, మహాధనవంతుడు, సర్వభూతదయాశాలి, బ్రహ్మచర్యపరాయణుడు 11, శివభక్తుడు సదా ప్రసన్నుడు, నియతాహారి. విప్రులారా, అతడు చావు పుట్టుకలకు జడిసి విముక్తికోసం వేగిరపడుతూ 12, శ్రీమద్వారాణసీ నగరం వెళ్లాడు. దానిని బ్రహ్మవిష్ణ్వాదులు సేవిస్తారు. తన ధనం శ్రద్ధతో శివభక్తులకు దానంచేసి 13, శివభక్తపూజవల్ల కర్మబంధంనుంచి విముక్తుడైనాడు.

సువ్రతులారా, వైశ్యపుత్రుడు రెండవవాడు అతిధనికుడు 14. వేదవిత్తములారా, తన భార్యతోసహా సర్వకామఫలప్రదమైన సోమనాథమహాస్థానానికి వెళ్లాడు 15. సర్వస్వమూ శ్రద్ధతో శివభక్తులకు దానంచేశాడు. శివభక్తులను అలాగే పూజించటంవల్ల ముక్తి పొందాడు 16.

ద్విజులారా, వైశ్యుని తృతీయపుత్రుడు బంధువులందరినీ విడిచిపెట్టి చాలాకాలం అన్యాయమార్గంలోనే ఉంటూ బాగా డబ్బు గడించాడు 17. ద్విజోత్తములారా, అతడు పూర్వపుణ్యాబలంవల్ల పవిత్రమైన శ్రీమద్వ్యాఘ్రపురానికి వచ్చి 18 అన్నం, పానం, వస్త్రం, చందనం, పుష్పం, తాంబూలం శ్రద్ధతో శివభక్తులకిచ్చాడు 19. ద్విజోత్తములారా, ఇలా మూడు సంవత్సరాలు పూజించి శివభక్తులపూజవల్ల కర్మబంధవిముక్తుడయ్యాడు 20.

మునీశ్వరులారా, వైశ్యుని నాలుగవ కుమారుడూ ఆలోచనలేకుండా బ్రాహ్మణులను సంహరించి, వారి సర్వస్వమూ తీసుకొని 21 నటవిటగాయకులకూ మూర్ఖులకూ ఇచ్చి నిరంతరమూ వేశ్యాలంపటుడై ఉండేవాడు 22. అతనిని సర్వరోగాలూ పీడించసాగాయి. బ్రహ్మరాక్షసుడు పట్టుకొన్నాడు. ఇలా చాలా కాలం గడపగా అతని తండ్రి బాగా ఉన్నవాడు 32, కడుపుతీపితో కుమిలిపోయి మునీశ్వరులారా, వెంటనే సర్వశాస్త్రార్థరహస్యవేత్త అయిన ఒక ద్విజోత్తముని దగ్గరకు వచ్చాడు. దండప్రణామం చేసి ఆ విప్రునికి బహుధనం సమర్పించి కొడుకు కథ అంతా విన్నవించాడు 25.

ద్విజుడు అతని వృత్తాంతం విని ద్విజులారా పండితోత్తములైన బ్రాహ్మణులతో చాలాసేపు ఆలోచించి 26, "శ్రీమద్వృద్ధాచలమన్న స్థానం ఉన్నది. సర్వులు దానిని సేవిస్తారు. శంకరుడు సర్వోపద్రవ వినాశంకొరకు దానిని నిర్మించాడు 27. బ్రహ్మ విష్ణ్వాదులు నిత్యమూ సర్వదాయకమని ఆదరంతో సేవిస్తారు. సంవత్సరంపాటు దర్శిస్తే చాలు నరులకు భుక్తిముక్తులనుగ్రహిస్తుంది 28. అల్పదానంతో అందరకూ అధికదానఫలం ఇస్తుంది. బ్రహ్మహత్యా, సురాపానమూ, సువర్ణస్తేయమూ, మొదలైన పాపాలను నశింపజేస్తుంది 29. పూర్వం అగస్త్యుడు లోకరక్షకు దానిని పూజించాడు. మణిముక్తానదీ తీరంలో ఉన్నది. చుట్టూ సర్వతీర్థాలూ ఉన్నవి 30. నీవు నాకు ఇష్టుడవు. కనుక నీ పుత్రునితో సహా వచ్చి ఈ నదిలో అతనితోపాటు అనుదినమూ స్నానం ఆచరించు 31. శ్రీమద్వృద్ధాచలేశ్వరునికీ హరునికీ అష్టోత్తర శతపర్యాయములు భక్తితో ప్రదక్షిణం చేసి దండప్రణామం చెయ్యి 32. సద్వైశ్యా, ఇంకా ఈ వృద్ధాచలంలో బ్రాహ్మణునీ తదితరునీ శివభక్తునీ సంతోషపెట్టి ఆరాధించు. పనిగట్టుకొని శివభక్తుని పూజ ఆచరించి పుత్రుని ఉద్ధరించుకో అని చెప్పాడు.

బ్రాహ్మణుడు ఇలా చెప్పగా, ఆ వైశ్యుడూ సమాధానపడి పుత్రునితో ధనంతో భార్యతో బంధువులతో వారి బాంధవులతో సహా 34 పుణ్యప్రదమైన శ్రీమద్వృద్ధాచలానికి వచ్చాడు మునీశ్వరులారా. మహాపాపవినాశనమైన మణిముక్తానదీజలంలో నిత్యమూ స్నానంచేసి శ్రీమద్వృద్ధాచలేశ్వర మహాదేవునికి భక్తితో నూటయెనిమిది ప్రదక్షిణాలు చేసేవాడు 36 ఒక మనోహరమైన మఠం కట్టించి అది ఒక శివయోగికి దానంచేసి నిత్యమూ అతిప్రీతితో శివభక్తులను బాగా పూజించాడు 37. ధనమూ, ధాన్యమూ, తిలలూ, బియ్యమూ, ఉదకమూ, పట్టువస్త్రాలూ, పుష్పాలూ, ఆభరణాలూ సమర్పిస్తూ, మనోనుకూలమైన పూజచేస్తూ 38- ఇలా సంవత్సరం గడిపేసరికి శివభక్తులను పూజించుటవల్ల బ్రహ్మరాక్షసుడూ వదిలిపోయాడు 39. అతడూ ఆర్జించిన ధనం శివభక్తులకు దానంచేసి వారి యీ ఉత్తమపూజవల్ల ఈ దేశంలో విముక్తుడైనాడు 40. తపోధనులారా, వేదవిత్తములారా, అతని మహాధీమంతుడైన తండ్రీ ఈ దేశంమాహాత్మ్యం తెలుసుకొని సర్వస్వమూ అహ్లాదంతో 41 శివభక్తులకు దానంచేసి కర్మబంధవిముక్తుడైనాడు. అతని బంధుజనులూ శివభక్తునిపూజించటంవల్ల 42 వృద్ధాచలంలో అనాయాసంగా సంసార విముక్తులైనారు సువ్రతులారా. ద్విజులారా, వృద్ధాచలంలో ఇచ్చినది పిడికెడే అయినా 43 అది అనంతం కాగలదు. ఈ విషయమై ఆలోచించవలసినపని లేదు. మునిపుంగ

వులారా, ఇక్కడ పిడికెడైనా దానం చేయకుండా 44 భుజించినవానికి ఎన్నడూ సంసారం నుంచి ముక్తి ఉండదు.

: శ్వేతమునికథ :

అగస్త్యుడు భగవానుడు శ్వేతుడు ధర్మిష్ఠుడైనముని 45, సువ్రతులారా, మునిసత్తములారా, వైశ్యుడూ, వైశ్యపుత్రుడూ, బాంధవులూ ముక్తిపొందినట్టు విన్నాడు. అగస్త్యుడూ ప్రేరేపించాడు. ఈ శ్రీమద్వృద్ధాచలమన్నచోటు చేరాడు. ఏకాగ్ర మనస్సుతో మణిముక్తానదీజలంలో స్నానం చేశాడు 47. ఆదివారం, అష్టమీతిథిని, పూర్ణిమనాడు, అమావాస్యనాడు, అర్ద్రానక్షత్రదినాన, మఖానక్షత్రదినాన, శ్రీమద్వృద్ధాచలేశ్వర మహాదేవుని 48 ఆధర్మాత్ముడు మణిముక్తానదీ జలంతో పూజించాడు. ఆ శ్వేతుడు పూజించిన జలం నది అయినది 49, పేరు శ్వేతనది. అది సర్వపాపవినాశిని. ఇంకా శ్రీమాన్ శ్వేతముని బహుశ్రద్ధతో 50 ధర్మజ్ఞుడు (కనుక) శివభక్తులను అనేకవిధాల పూజించాడు. దేవదేవుడు శ్రీమద్వృద్ధాచలేశ్వరమహాదేవుడు 51 ఆ భక్తపూజ వల్ల అతనికి ప్రత్యక్షమైనాడు. మునికూడా శ్రీమద్వృద్ధాచలేశ్వర దేవదేవేశుని 52 పుష్పంతో, పత్రంతో, ఉదకంతో పూజించాడు. ఇంతలో విప్రులారా, పరమాత్మశివుని 53 ప్రసాదంవల్లనూ శివభక్తులకు చేసిన ఉత్తమ పూజవల్లనూ మహామతి శ్వేతముని పరమముక్తిని పొందాడు 54

బ్రాహ్మణులారా, వేదవిత్తములారా, ఎందుకిన్నిమాటలీ విషయంలో? శివభక్తుల పూజవల్ల భోగమోక్షములు (లభిస్తాయి.) మరొకవిధంగా (లభించవు) 55.

ఈ ప్రకారం (చెప్పగా) విని మహాత్ములు నైమిశారణ్యవాసులు ఆదరంతో శివభక్తులను అనేకవిధాల పూజించారు 56. శివభక్తుల పూజవల్ల అంబికాపతి పరమేశ్వరుడు ప్రసన్నుడై ఆ మునులముందు నృత్యంచేశాడు 57. మునులు దేవదేవుని శంకరుని శివుని ఆనంద మహానృత్తం చూచి సంతోషవివశులైనారు 56

: ఇది శ్రీస్కాందపురాణం శ్రీసూతసంహితలోని శివమాహాత్మ్యఖండంలో 'శివభక్తపూజావిధి' అను ఆరవ అధ్యాయం :

జెహోవా అంటే 'నేను ఉన్నాను' అని అర్థం. భగవంతునిగురించి ఇంత సూటిగా చెప్పేమాట ఇంకొకటి లేదు. 'బ్రహ్మైవాహం', 'అహం బ్రహ్మాస్మి', 'సోహం' కంటె సూటిగా బైబిలులోని 'జెహోవా' అన్నవాక్యం భగవత్స్వరూపాన్ని నిర్వచిస్తున్నది. ఉన్నది ఏదో అదే తాను. అదే భగవంతుడు. తనను తెలుసుకుంటే భగవంతుని తెలుసుకున్నట్లే. భగవంతుడు తనకంటే వేరుకాదు.

—రమణమహర్షి.

# స్వామి అభేదానంద

డి. వి. బ్రహ్మాజి

శ్రీరామకృష్ణపరమహంసగురుదేవుల దివ్య సందేశమకరందమును విశ్వవ్యాప్తం చేయడంలో వివేకానందస్వామి తరువాత చెప్పవలసినవారు మన అభేదానందస్వామియే. సన్యాసస్వీకారమునకు ముందు ఈయన పేరు కాళీ ప్రసాదచంద్ర. కలకత్తాలోనున్న శ్రీ రసిక్‌లాల్ చంద్ర, శ్రీమతి నయనతారా దేవి అను పుణ్యదంపతులకు 1866 వ సం॥ న అక్టోబరు నెల రెండవ తేదీనాడు మనస్వామి జన్మించారు. వీరి తండ్రిఅయిన రసిక్‌లాల్ కలకత్తాలోని "ఓరియంటల్ సెమినరి" అనే పాఠశాలలో గొప్ప పేరు మోసిన ఆంగ్లభాషా ఉపాధ్యాయుడు. ఆయన గొప్ప భక్తావతంసుడు కూడాను. ఇక, వీరి మాతృమూర్తి అయిన నయనతారాదేవి గొప్ప కాళికాభక్తురాలు. కొడుకు కోసమై కాళీమాతను అతి తీవ్రముగ ఒనరించిన ప్రార్థనలకు ఫలితముగా జన్మించినవాడు కావడంవలననే మన స్వామికి కాళీ ప్రసాదుడని పేరుపెట్టుకొన్నారు. ఈ విధముగా భక్తితత్పరులయిన జననీజనకులకు జన్మించిన కుమారుడు ఆతర్వాత భారతదేశపుఆధ్యాత్మిక ఆకాశమున ధృవతారమై వెలుగొందడములో ఆశ్చర్యమేమున్నది!

తల్లిదండ్రులు కాళీప్రసాదును బాల్యముననే అయిదవయేట బడిలోచేర్చారు. చదువు సంధ్యలలోనేగాక; ఆటపాటలలోను, చిత్రలేఖనమునందును మన కాళీప్రసాదు సాటివారికన్న మిన్నగా ఉండేవారు. ఇతని అధ్యాపకులొకరు చిత్రలేఖనమునందీతనికిగల నైపుణ్యమును గాంచి కళారంగమునందీ బాలుడు రాణకెక్కగలడని వక్కాణింపగా మన కాళీప్రసాదు తన కట్టికోరిక లేదని జవాబిచ్చెను. చిత్రకారుడు కేవలము వస్తువులయొక్క బాహ్యరూపములను మాత్రమే చిత్రించును. కాని తత్త్వవేత్తయో భౌతికవలయమును దాటి మూలకారణమును దర్శింపబోవును. కనుకనే తనకు చిత్రకారుడుగ పేరుగాంచుటకన్న వేదాంతిగా రూపొందుటయే ఇష్టమని కాళీప్రసాదుని అభిప్రాయము

విద్యావిషయంలో మన కాళీప్రసాదు బుద్ధి పాదరసమువలె చురుకైనది. ఆయనకు చిన్ననాటినుండియు సంస్కృతాధ్యయనమున విశేషశ్రద్ధాసక్తులు కలిగాయి. ఆయన తన 18 వ ఏట ప్రవేశపట్ట పరీక్షలో [ఆరోజులలో Entrance అనేవారు.] అత్యున్నతమగు శ్రేణిలో ఉత్తీర్ణులయారు. విల్సన్ మహాశయుడు వ్రాసిన భారతదేశచరిత్ర అనే పుస్తకంలో అద్వైతస్థాపనాచార్యుడయిన శ్రీశంకరుల గురించి చదివి తాను కూడా ఒక గొప్ప వేదాంతిగా మారాలని ఆయన నిశ్చయించుకొన్నారు. ఆధ్యాత్మికపరమయిన భారతీయ విజ్ఞా ఒకవంక సముపార్జిస్తూ, వేరొక వంక పాశ్చాత్యపండితప్రకాండులు వ్రాసిన అనేకరకాల గ్రంథాలను తృణ్ణంగా చదువుతూ కాళీప్రసాదు తన మేధాశక్తిని అత్యంత సునిశితంగావించుకొన్నారు. ఆ లేబ్రాయముననే ఆయన జాన్‌స్టూవర్టుమిల్ వ్రాసిన "తర్కము" (Logic), హామిల్టను వ్రాసిన వేదాంతశాస్త్రము, హెర్షెల్ వ్రాసిన ఖగోళశాస్త్రము...మొదలయిన గ్రంథాలు, కాళిదాసు, భవభూతి, బాణుడు మొదలయిన భారతీయ కవివరేణ్యులు రచించిన మహాకావ్యాలు;...ఇట్లా అనేక రంగములకు సంబంధించిన అనేక రచనలను తృణ్ణముగా అనుశీలించారు. ఇదంతా ఆయనయొక్క అనన్య

సామాన్యమయిన ప్రతిభకు, అద్భుతమేధా శక్తికి చక్కని దృష్టాంతము

ఈ సమయమునందే కాళీప్రసాదునకు అన్ని మతముల యెడలను సానుభూతి పూర్వకమయిన విశాల దృక్పథం అలవడింది. వేర్వేరు మతబోధకుల ఉపన్యాసాలను జాగ్రత్తగా విని, వాటి సారాంశమును చక్కగా గ్రహించడం నేర్చుకున్నారు. 1883 సం॥ న ప్రఖ్యాత భారతీయ తత్త్వవేత్తయగు శశిధరతర్కచూడామణి ఇచ్చిన ఒక బహిరంగ ఉపన్యాసానికి మన కాళీప్రసాదు హాజరయ్యారు. ఆ ఉపన్యాసములో మానవుని ఆత్మకుగల అనంతమయిన శక్తిసామర్థ్యములగురించి పతంజలి యోగసూత్రములలో వివరించిన విషయం మన స్వామిని బాగా ఆకట్టుకొంది. నాటినుండి ఆయనకు యోగశాస్త్రం అంటే ఎనలేని మక్కువ కల్గింది. యోగశాస్త్రానికి సంబంధించిన అనేక గ్రంథాలను అతినిశితముగా పరిశీలించారు. ఆయన సహాధ్యాయుడయిన యజ్ఞేశ్వరుడు ఈ విషయంలో మనస్వామికి ఒక చక్కని సలహాఇచ్చారు. "సమర్థుడైన గురువు యొక్క మార్గదర్శకత్వంలో మాత్రమే నిజమైన యోగం గురించి తెలుస్తుంది. కాని, కేవలం పుస్త ప్రయోజనము లేదని' ఆ మిత్రుడు కాళీప్రసాదుకు నచ్చచెప్పాడు. ఇందుకు తగిన గురువు శ్రీరామకృష్ణపరమహంసయే అని చెప్పి యజ్ఞేశ్వరుడు కాళీప్రసాదును పరమహంసకడకు పోవలసినదిగా హితవుచెప్పాడు.

1884 సం॥ మధ్యభాగములో మన కాళీప్రసాదు శ్రీగురుదేవులను దర్శించుటకు దక్షిణేశ్వరం ప్రయాణం అయ్యారు. ఆయన దక్షిణేశ్వరం చేరేసరికి మధ్యాహ్నం అయింది. దారిలో త్రోవ తప్పడంవల్ల తిరిగి తిరిగి అలసి సొలసి ఆయన దక్షిణేశ్వరం చేరారు. కాని, తీరా ఇంత శ్రమపడి వెళ్ళగానే ఆయనకు నిరాశయే ఎదురయినది. ఆరోజునవే శ్రీ గురుదేవులు కలకత్తాకు వెళ్ళినారని, బాగా చీకటి పడినాకగాని తిరిగిరారని తెలిసింది. ఏమి చేయుటకు పాలుపోక విచారించుచుండగా, ఆయన వయస్సే కలిగిన శశిభూషణ చక్రవర్తి యను బాలుడు వచ్చి [ఈయనే తర్వాత రామకృష్ణానందస్వామియైనారు.] యోగక్షేమములు విచారించి భోజనసదుపాయము, విశ్రాంతికి ఏర్పాట్లు గావించాడు. రాత్రి 9 గం॥ ప్రాంతమున రమహంస తిరిగిరావడముతో మన —ప్రసాదు ఆనందమునకు అవధులు లేవు. భయవిస్మయములతో గురుదేవుల గదిలోనికి అడుగిడిన కాళీప్రసాదునకు ప్రథమ సందర్శనమునవే శ్రీరామకృష్ణుల ఔన్నత్యము విశదమయినది. ఆ రాత్రి అచటనే వసారాలో నిద్రించి, మరునాడు ప్రొద్దుటనే పరమహంసను దర్శించటానికి వెళ్ళాడు కాళీప్రసాదు.

కాళీప్రసాదు ఆత్మశక్తియొక్క లోతులను ప్రథమవీక్షణమునవే శ్రీ గురుదేవులు తరచి చూడగల్గినారు. ఈ బాలునియందు అధ్యాత్మిక వికాసం త్వరితగతిని ఫలించు అవకాశములు ఆయనకు అప్పుడే గోచరించాయి. తన అంతరంగిక శిష్యకోటికి చెందినవానిగా ఆనాడే పరమహంస కాళీప్రసాదును గుర్తించారు. ఆ బాలుని ఆప్యాయముగా చేరదీసి ఉత్తరపు వసారాలోకి గొనిపోయి, అక్కడనున్న బల్ల మీద కూర్చోబెట్టి బాలుని నాలుకపై తన వ్రేలితో నొక మంత్రమును వ్రాసి అతని హృదయముమీద కుడిచేతితో మెల్లగా స్పృశించారు. వెంటనే మన కాళీప్రసాదుకు తనలో ఒక అలౌకికమయిన శక్తి ప్రవేశిస్తు

న్నట్లు తోచి, గాఢసమాధిధ్యానములో నిమగ్నం అయిపోయారు. ఆ తర్వాత గురు దేవుల ఆజ్ఞ మేరకు కాళీఆలయంలోనికి పోయి ఆయన చెప్పినరీతిగా ధ్యానమొనర్చిన పిమ్మట శెలవు దీసుకొని ఇంటికి మరలి వెళ్ళాడు. తన సహజ వాత్సల్యముతో "మరల తప్పక రావలసినదిగ" శ్రీగురుదేవులు కాళీ ప్రసాదును హెచ్చరించారు. కాళీప్రసాదు కనుబొమలు శ్రీకృష్ణుని కనుబొమలను గుర్తుకు తెచ్చునవనియు, ఈ బాలునియందు కృష్ణ పరమాత్మ అంశకొంత కలదనియు పరమహంస నుడివెడివారు. ఒకనాడు కాళీప్రసాదునకు గల యోగశాస్త్రాభిలాషను గుర్తించి శ్రీ గురు దేవులు ఆయనతో: "నీవు క్రితం జన్మలో ఒక మహాయోగివి. ఇదే నీకు చిట్టచివరి జన్మము. నేను నీకు యోగశాస్త్ర రహస్యాలను చక్కగ బోధిస్తాను." అని వెల్లడించారు. నాటినుండి పరమహంస పర్యవేక్షణలో కాళీ అనేక మయిన ఆధ్యాత్మిక సాధనలు కొనసాగించి దివ్యమయిన ఆధ్యాత్మికానుభవాలు అనేకం అనుభవానికి తెచ్చుకొన్నారు. వస్తువులు చిందరవందరగా ఎక్కడ పడితే అక్కడ పార వేయక; ప్రతివస్తువును దాని నియమిత స్థానంలో ఉంచే క్రమపద్ధతికి మన కాళీ బాబును చెప్పి ఇతరులను చెప్పాలి. కాళీ బాబులోని ఈ విశేషగుణం శ్రీరామకృష్ణులు ఎంతో మెచ్చుకొనేవారు.

తర్వాత తర్వాత అవకాశం దొరకడం ఆలస్యముగా కాళీబాబు శ్రీగురుదేవులను దర్శించేవారు. ఊపిరాడని గందరగోళముతో నిండివుండే గృహవాతావరణం నుంచి దక్షిణే శ్వరంలోని ప్రశాంతవాతావరణం చేరగానే ఆయన మనస్సుకు అనిర్వచనీయమయిన సుఖ శాంతులు లభించేవి, వేదవేదాంతగమ్య మయిన పరతత్త్వము ఆకృతి దాల్చిన మానవ మూర్తిగాను; విశ్వమతము బోధించే ఏకైక సత్యస్వరూపంగాను శ్రీ గురుదేవులను మన కాళీ దర్శించినాడు. భగవదవతారములగు దివ్యపురుషులు ఒకరివెంట నొకరుగా శ్రీరామ కృష్ణుల శరీరమున ప్రవేశించి, బయల్వెడలు చున్నట్లు ఒక దివ్యానుభవము కాళీబాబున కొకనాడు కల్గినది. పూర్వావతారములన్నియు శ్రీపరమహంసయందు రాశీభూతమయినవను నిశ్చయము ఆనాటితో మన కాళీప్రసాదు మనస్సున నాటినది.

తన శిష్యులలో ప్రతియొక్కరి మనస్తత్త్వ మును గుర్తించి వారి వారి మనోవిధానములకు సరిపడునట్లు బోధించి తీర్చిదిద్దిన గురువరేణ్యుడు శ్రీరామకృష్ణపరమహంస. కీలెరిగి వాతబెట్టు విద్యయందు సిద్ధహస్తుడయిన భవరోగ వైద్యుడు శ్రీ గురుదేవులు. యోగానంద, నిరంజనానందుల విషయమున కోపము గురించి గురుదేవులొసంగిన పరస్పరభిన్నమయిన మందలింపులు వారి వారి మనఃప్రవృత్తులకు ఎట్లు తగియున్నవో గమనించి యుంటిమిగదా. ఇదే విధముగా బొద్దింకలను నిర్దాక్షిణ్యముగా చంపమని యోగానందునకు బోధించిన గురు దేవులే ఈ క్రిందివిషయమున అభేదానందున కిచ్చిన సలహా మనము గమనించినచో పరమ హంసయొక్క మనస్తత్త్వానుశీలనము మనకు అర్థమగును—: కాళీప్రసాదు చేపలను చున్నాడని తెలిసి పరమహంస "అట్టి క్రూర కార్యము వేలచేసితివి?" అని మందలింపగా, కాళీ ఆయనతో "ఆత్మ నిత్యము. అందుచే చేపలను నేను నిజముగా చంపినట్లుకాదు." అని మెట్టవేదాంతము పల్కెను. దానికి శ్రీ గురుదేవులు "నాయనా! ఎంత పొరబాటు పడుచున్నావు! దైవ సాక్షాత్కారం పొందిన

వాడు ఇతర ప్రాణులపట్ల ఎన్నడూ క్రూరముగా ప్రవర్తింపడు. జీవహింసయనునది వాని స్వభావమునకే సరిపడదు. బాగా ఆలోచించుకో' అని హితవుచెప్పారు. ఇందలి నిజతత్త్వము త్వరలోనే కాళీప్రసాదునకు అవగతమయినది.

త్వరలోనే కాళీకి నరేంద్రనాధునితో గాఢమయిన స్నేహము బలపడింది. నిగూఢమయిన వేదాంత విషయాలను గురించి వారిరువురిమధ్య తరచుగ వాద వివాదములు జరుగుతూ ఉండేవి. 1885–86 ప్రాంతంలో శ్రీరామకృష్ణులు అస్వస్థులయినపుడు మన కాళీప్రసాదు తన సర్వస్వాన్ని శ్రీగురుదేవుల సేవలో అంకితం చేశారు. పరమహంస మహాసమాధి చెందిన పిమ్మట కాళీప్రసాదచంద్ర సన్యాసియై అభేదానంద నామధేయాన్ని స్వీకరించారు. బారానగరు మఠంలో ఉన్న సమయంలో అభేదానందస్వామి తరచు ఏకాంతముగా తన గదిలో కూర్చొని గంటలతరబడి ధ్యానసమాధి నిమగ్నుడై గడపటమో, లేదా, వేదాంతపరమయిన గ్రంథములను అధ్యయసించుటయో చేస్తూ ఉండేవారు. ఆ రోజులలోనే స్వామి ప్రాచ్య పాశ్చాత్య తత్త్వసారాన్ని కాచివడబోశారని చెప్పవచ్చు. అందుచేతనే మనస్వామిని సోదర శిష్యులు ''కాళీతపస్వి'' అనీ, ''కాళీవేదాంతి'' అని పిలిచేవారు. ఇదే సమయంలో అభేదానందస్వామి శ్రీరామకృష్ణులపయిన, మాతృశ్రీశారదాదేవి మీదా హృదుమధురమయిన గేయములు అనేకము రచించారు. ఈ కీర్తనలు వినిన శారదాదేవి ఆనందముతో ''నీ ముఖరంగమున అనుదినము సరస్వతీదేవి తాండవించుచుండుగాక' అని అభేదానంద స్వామిని ఆశీర్వదించారు. మాతృదేవి అమోఘ ఆశీర్వాదమెట్లు ఫలించినదో అభేదానందస్వామి తరువాత చరిత్ర ఋజువుచేస్తుంది

బారానగరు మఠంలో కొన్నినాళ్లు గడపిన పిమ్మట పరివ్రాజకజీవితం గడపవలెననే ఆకాంక్షతో అభేదానందస్వామి దేశమునంతా చుట్టివచ్చారు. చేత పైసా అయినా లేకుండా, కేవలం కాలినడకనే తిరుగుతూ, యాదృచ్ఛికముగా ఏది దొరికితే దానితో తృప్తిచెంది నియమనిష్ఠలతోనూ కఠోరసన్యాసవ్రత దీక్షతోనూ పరివ్రాజక జీవనాన్ని వెళ్ళబుచ్చారు మన అభేదానందస్వామి. ఈ యాత్రా సందర్భంలోనే స్వామి గొప్పగొప్ప పండితులను, సాధులను కలుసుకున్నారు హృషీకేశంలో మన అభేదానందస్వామి షడ్దర్శన పారంగతుడయిన ధనరాజ్‌గిరి అనే యతీంద్రుని వద్ద తత్త్వశాస్త్రములో అపూర్వములయిన అనేక విషయాలను ప్రత్యేకంగా అధ్యయనం చేశారు. భావికాలమునందు శ్రీరామకృష్ణపరమహంస మహత్తర సందేశ మాధుర్యాన్ని విశాలప్రపంచమున వ్యాప్తి చేయడంలో ఈ పరివ్రాజకపర్యటన అభేదానంద స్వామికి ఎంతగానో తోడ్పడింది

అమెరికాలో ఉన్న వివేకానందస్వామి భారతదేశంలోని సోదరశిష్యులకు వ్రాసే జాబులలో : ''కేవలమూ స్వీయమోక్షమునకే ప్రాకులాడుట శ్రీ రామకృష్ణుని శిష్యులమయిన మనకుతగనిపని. ఆర్తజనసేవకు అంకితమగుచు, పరమహంస దివ్యసందేశ మకరందాన్ని విశ్వమానవాళికంతకు అందించగల సన్యాసులతో కూడిన ఒకమతాన్ని స్థాపించడము నా ఆశయము.'' అనే అభిప్రాయాన్ని వెల్లడించేవారు. వివేకానందస్వామిలో దృఢమయిన భక్తి విశ్వాసముగల మన అభేదానందస్వామి వెన్వెంటనే వివేకానందుని పిలుపునందుకొని అదియొక ఆజ్ఞగా తలదాల్చినారు. ఆ తర్వాత

లండను నగరములో వేదాంతప్రచారము గావిస్తున్న వివేకానందస్వామి పిలుపు ననుసరించి, 1896 లో మన అభేదానందస్వామి శ్రీ రామకృష్ణమఠం ప్రతినిధిగా లండను చేరుకున్నారు. ఒకరోజున మనస్వామికి చెప్పకుండానే "మరునాడు స్వామి అభేదానంద ప్రసంగించనున్నారు." అని పేపర్లలోను కరపత్రాలలోను అచ్చు వేయించారు. అంతవరకూ ఎక్కడా బహిరంగోపన్యాసం చేసి యెరుగని మనస్వామి ఈ విషయం తెలియగానే వివేకానందస్వామితో తన అనుభవములేనికొఱతను చెప్పి ఎంతో వాదించారు. కాని వివేకానందమాత్రం మనస్వామి అభ్యంతరాలను లెక్కచెయ్యలేదు. "నాకు ఎవరయితే ఇంతటి ధైర్యసాహసాల్ని ఇస్తున్నారో ఆ గురుదేవులపై నమ్మకం ఉంచు. ఉపన్యాసం చక్కగా సాగుతుంది. ఏమీ భయములేదు." అని ధైర్యం చెప్పారు. అదే విధముగా మరునాటి ఉపన్యాసం బ్రహ్మాండముగా రక్తికట్టింది. జనసమూహంముందు నిలచి అభేదానంద స్వామి ఒసంగిన మహోపన్యాసం శ్రోతలను ఉర్రూతలూగించింది. ఉపన్యాసము కాగానే వివేకానందస్వామి లేచివచ్చి: "నేను లేకపోయినా ఫరవాలేదు. నేను ప్రచారం చేయదలచిన శ్రీ గురుదేవుల దివ్యసందేశం వ్యాప్తిచేయుటకు నీవున్నావు. చాలు" అని అన్నారంటే ఆ రోజున అభేదానంద ఉపన్యాసం ఎంత అద్భుతంగా ఉన్నదో ఊహించవచ్చు!!

అభేదానందస్వామియొక్క శక్తి సామర్థ్యాలమీద అపారమయిన విశ్వాసం కుదిరిన వివేకానందస్వామి లండనులోని వేదాంత ప్రచారభారాన్ని అభేదానంద భుజస్కంధాలపై మోపి నిశ్చింతగా భారతదేశం తిరిగి వచ్చారు. లండను నగరంలోను, చుట్టుప్రక్కల మనస్వామి ఒక సంవత్సరముపాటు పనిచేశారు. ఆ కాలములో ఆయన మాక్సుముల్లరులాంటి మహాపండితులు అనేకులతో పరిచయం సంపాదించుకున్నారు. గహనమయిన తత్త్వశాస్త్ర విషయాలను తేటతెల్లముగా వివరించడంలో ఆయనకు గల నైపుణ్యము, అపూర్వం అయిన ఆయన వాగ్ధాటి, ఆధ్యాత్మికవిధానమున ఆయనకు గల స్వానుభవము—ఇవన్నీ కలసి అభేదానంద స్వామితో పరిచయమేర్పడిన పాశ్చాత్యులపై ఎంతో ప్రభావం చూపించాయి. ఒక్క సంవత్సరం కాలములోనే ఆయన పాశ్చాత్య ప్రజలలో భారతీయ సంస్కృతీవైభవాన్ని గురించి, సనాతన హైందవ భావౌన్నత్యాన్ని గురించి గౌరవపూర్వకమయిన అభిప్రాయాన్ని కలిగించగలిగారు.

అటుపిమ్మట 1897 సం॥ లో వివేకానందుని కోరికమేరకు అభేదానందస్వామి అమెరికా దేశం వెళ్లారు. అక్కడ న్యూయార్కు నగరమునున్న వేదాంతసంఘకార్యక్రమాలను నిర్వహించే భారాన్ని మనస్వామి వహించారు. శ్రీ రామకృష్ణులయెడల అపారమయిన విశ్వాసము కలిగి పట్టుదలతో కృషిని ప్రారంభించిన మనస్వామి కష్టపరంపరలెన్ని ఎదురయినా లెక్కించక ముందుకు సాగిపోయారు. స్వామి సాధించిన పురోభివృద్ధిని చూచి ఓర్వలేని క్రైస్తవమిషనరీలు మాత్సర్యగ్రస్తులై స్వామిపై అభాండములు సృష్టించి ప్రచారం చెయ్యసాగారు. కాని, భయమనునది యెరుగని మన అభేదానందస్వామి తన పట్టుదలను వదలక తాను నమ్మిన కృషిని నిర్విరామముగా కొనసాగించారు. ప్రత్యర్థుల ప్రచారదానంతటదే చప్పబడిపోయింది. అతిత్వర

లోనే అయన గొప్పవక్తగా పేరుగాంచారు. అగాధమయిన పాండితీగరిమ, సునిశితమేధా శక్తి, అసమానమయిన వాగ్ధాటి, అన్నిటినీ మించిన అత్యంత ప్రేమాస్పదమయిన వ్యక్తిత్వమూ - ఇవన్నీ కలసి అద్భుతానందస్వామికి అచిరకాలముననే ఎనలేని కీర్తి ప్రతిష్ఠలు ఆర్జించాయి. న్యూయార్కు నగరమునందు "మాట్ మెమోరియల్ హాలు" అనుచోట పురజనుల కోరికపై మనస్వామి తొంబది పర్యాయములు ఉపన్యాసం ఇచ్చినారు అంటే ఆయన గొప్పతనం తెలుస్తున్నది.

పవిత్రమయిన ఆలోచనలతో దేశ, మత, జాతి వివక్షత లేకుండా అందరి యెడలను ప్రేమను ఆదరమును పెంపొందించుకొనవలసినదిగా స్వామి తన ఉపన్యాసములలో ప్రబోధించేవారు. "దైవాన్ని నమ్మినా, నమ్మక పోయినాగాని, ఆత్మసంయమనము, ఏకాగ్రత, సత్యసంధత, అందరియెడల నిర్వ్యాజమయిన ప్రేమ అను నాలుగు లక్షణములు కల్గియున్నట్లయితే ఆధ్యాత్మికవికాసము కల్గి పరిపూర్ణ మానవులుగా మనం రూపొందే అవకాశ ముంది. అట్లా కాకుండా కేవలము భగవంతునిపై భక్తియొక్కటియే కల్గియుండి ఈ నాలుగు లక్షణములు లేకుండా ప్రవర్తిస్తే మనకు ఏమీ ప్రయోజనములేదు." అని స్వామి చాటిచెప్పేవారు. భారతీయ వేదాంతము అంటే ఒక గ్రుడ్డి నమ్మకంకాదనీ, ఈ దృశ్యమానవిశ్వమునకంతటికి ఆధారభూతమయిన పరమసత్యాన్ని తెలుసుకొనుటకు సాగించే కఠోర పరిశ్రమయొక్క ఫలితమేనని ఆయన పాశ్చాత్యులకు తెలియజెప్పారు. ఆ పరమ తత్త్వాన్ని మానవబుద్ధి తనకు తోచినరీతిగా: భగవానుడని, సృష్టికర్త అని, యెహోవా అని, అల్లా అని, బ్రహ్మాయని వేరు వేరు పేర్లుపెట్టి పిలుస్తున్నది. ఆ పరమసత్యమును తెలుసుకొనడానికి మనము ప్రకృతియొక్క ఆవరణను అధిగమించి ప్రయాణించాలి. అందువల్ల కేవలమూ ప్రకృతిని గూర్చి అధ్యయనంచేస్తే సరిపోదు. దానికి అతీతమయిన ఆత్మస్వరూపాన్నికూడా తెలుసుకొనుటకు ప్రయత్నం చెయ్యాలి—అని స్వామి బోధించేవారు. ఈ రకముగా ఆధునిక విజ్ఞానదృష్టిని కాదనకుండా, దానికి అనుగుణమయిన రీతిలో తత్త్వశాస్త్రాన్ని బోధించడంలో అగ్రగణ్యుడు అభేదానందస్వామి. అందువల్ల ఆధునిక విజ్ఞానశాస్త్రం అంటే మోజుపడేవాళ్ళకు కూడా స్వామి మాటలు బాగా రుచించేవి.

అభేదానందస్వామి అమెరికా సంయుక్త రాష్ట్రములలోను, అలాస్కా, మెక్సికోల లోను విస్తృతముగా పర్యటించి వేదాంతాన్ని ప్రచారం చేశారు. అమెరికాలోని దాదాపు అన్ని ముఖ్య పట్టణములలోను ఆయన ఉపన్యసించారు. ఐరోపాఖండమును కూడ కొంత తన వేదాంత ప్రచారముతో ఉర్రూతలూగించారు. అడుగిడిన ప్రతిచోటా అత్యంత సమర్థుడయిన తత్త్వశాస్త్రబోధకునిగను; సంఘటనా కార్యనిర్మాణ దక్షుడుగను, అభేదానందస్వామి సాటిలేనికీర్తి గడించారు. పాశ్చాత్యుల కార్యక్రమవిధానానికి స్వామి చక్కగా అలవాటు పడ్డారు. స్థితప్రజ్ఞుడయిన అభేదానందస్వామి ఎంతటి విషమపరిస్థితుల లోను కూడా తొట్రుపాటునెరుగరు. "ఆకారసదృశః ప్రజ్ఞా, ప్రజ్ఞయా సదృశాగమః, ఆగమైః సదృశారంభః, ఆరంభః సదృశోదయః" అనే కాళిదాసు శ్లోకం ఆయనకు చక్కగా అన్వయిస్తుంది. సుమారు ఇరువదియైదు సంవత్సరముల కాలము ఆయన

అమెరికాలో నివసించి, అక్కడ వివేకానందుడు నాటిన భారతీయ వేదాంత ప్రచార బీజములను పెంపొందించి, శాఖోపశాఖలుగా విస్తరింపజేసి, పుష్టింపజేసి సనాతన హైందవ తత్త్వసౌరభాన్ని అమెరికాదేశపు నలు మూలలా గుబాళింపజేశారు.

అభేదానందస్వామి ప్రఖ్యాతిగాంచిన మహా వక్త; అంతకుమించిన మహా రచయిత కూడాను. ఆయన ఉపన్యాసమువలన కొన్ని వందలమంది ప్రభావితులయితే; ఆయన రచనలు చదివి స్ఫూర్తిచెందినవారు వేనకు వేలసంఖ్య ఉంటారు. తత్త్వశాస్త్రంలోని సారం అంతా ఆయన రచనలలో అత్యంత సుబోధకమయిన శైలిలో పొందుపరచబడియుంది. భారతీయతత్త్వశాస్త్రాన్ని, హైందవ ఆధ్యాత్మిక సంపదను విశ్వవ్యాప్తం కావించడంలో అభేదానందస్వామి రచనలు విరివిగా తోడ్పడ్డాయి.

అమెరికాలో వేదాంత ప్రచారాన్ని సుస్థిరమయిన పునాదులపై నెలకొల్పిన పిమ్మట అభేదానందస్వామి 1921 సం॥ లో అమెరికాను వీడి భారతదేశానికి తిరుగు ప్రయాణం ఆరంభించారు. మార్గమధ్యంలో జపాన్, చైనా, ఫిలిప్పీన్స్, సింగపూర్, కౌలాలంపూర్, రంగూన్‌లను దర్శించి ఆయా ప్రాంతాల్లో శ్రీ గురుదేవుల దివ్యసందేశమును వినిపించివచ్చారు. అప్పటికి స్వామి వయస్సు 57 సం॥ పైగా ఉంటుంది. ఆ వయస్సునందు కూడా సాహసకార్యములయందు స్వామికి గల ఆసక్తి సడలలేదు. స్వదేశం వచ్చిన తర్వాత అభేదానందస్వామి కాబూల్, టిబెట్టు యాత్రలకు వెళ్లివచ్చారు పెషావరు పట్టణాన్నికూడా చూచివచ్చారు ఉత్తర భారతమునందలి ముఖ్యప్రదేశముల నన్నింటిని దర్శించినపిమ్మట, చివరకు 1923 లో బేలూరు మఠంలో నివాసం ఏర్పరచుకొన్నారు.

తన నిర్ణీత ప్రణాళిక ననుసరించి వేదాంత ప్రచార మొనర్చుటకై స్వామి కలకత్తాలో శ్రీ రామకృష్ణ వేదాంతసంఘాన్ని స్థాపించారు వంగభాషలో 'వాణి' అనుపేరుతో ఒక పత్రికను నెలకొల్పారు విపరీతమయిన ఈ కార్యభారమునంతటిని తట్టుకొనజాలక వజ్ర సన్నిభమయిన స్వామి శరీరము కాస్త శిథిలం కాజొచ్చింది. అయినా, మానసికముగా ఆయనలో ఉత్సాహం ఏ మాత్రము తగ్గలేదు. 1937 సం॥ లో శ్రీ రామకృష్ణుల శతజయంత్యుత్సవసందర్భముగా కలకత్తా నగరమున టౌనుహాలులో ఏర్పాటయిన మతమహాసభకు అభేదానందస్వామియే అధ్యక్షులు. ఆ నాడు మనస్వామి తన న్యాసములో: "అన్ని మతములూ ఒకే గమ్యాన్ని చేరు వేరువేరు బాటలే. ఆ గమ్యమునుచేరి పరతత్త్వాన్ని దర్శించటమే ఏ మతానికయినా పరమావధి. ఒక్కడే అయిన దైవం అనేక రూపములలో ప్రస్ఫుటం అవుతుంటాడు. ఆ పరమాత్మ సాకారుడు, నిరాకారుడు; సగుణుడు, నిర్గుణుడు, రెండిటికిని అతీతుడును" అంటూ తన గురువరేణ్యుని సందేశ సారాంశాన్ని వివరించారు. చివరలో "ఈ మహాసభలు మతకలహాలను రూపుమాపి వివిధ మతములమధ్య పరస్పర సౌహార్దతను నెలకొల్పుగావుత. అని ఆకాంక్షిస్తూ ముగించారు. మరి రెండు సంవత్సరముల తర్వాత, 1939 సం॥ సెప్టెంబరునెల ఎనిమిదవ తేదీని అభేదానందస్వామి మహాసమాధి చెందారు.

# ప్రహ్లాద కథాతత్త్వ విచారము

## ధూళిపాళ శ్రీరామమూర్తి

కాబట్టి యీ ధర్మకామము లెవని యధీనమందున్నవో యట్టి పరిపూర్ణుడైన యాత్మ స్వరూపుడైన శ్రీహరిని నిష్కామముగా భజింపుడు. ఈశ్వర చరణములను భజించువాడు మనుష్యుడు గాని దేవతగాని గంధర్వుడుగాని, రాక్షసుడుగాని యెవడైనను క్షేమమును బొందును. బ్రాహ్మణత్వము, దేవత్వము, ఋషిత్వము, సచ్ఛీలము బహు శాస్త్రజ్ఞానము, దాన, తపో, యజ్ఞ, శౌచవ్రతాదులేవియు నీశ్వరుని సంతోషింపజేయలేవు. శ్రీహరి నిర్మలమైనభక్తిచేతనే సంతోషించును. తక్కిన వన్నియు నాడంబరములు. కావున మీరు ఈశ్వరునియందు భక్తిచేయుడు. ఈశ్వరుడు సర్వభూతాత్మకుడు గావున సర్వభూతములయందు తనయందెట్లో నట్లే ప్రేమ జూపుట యుత్తమమార్గము. దైత్య యక్ష రాక్షసులు స్త్రీ శూద్ర గోపాలురు ఖగమృగములు మరియు బహు పాపజీవులు భక్తిమార్గము నాశ్రయించి తరించిరి. భగవద్భావమును బొందిరి. ఈ లోకమునందు జన్మ మెత్తినందులకు పురుషుడు సాధించవలసిన యుత్తమ ప్రయోజనమిదియే: శ్రీహరియం దేకాంత భక్తి, సర్వత్ర పరమేశ్వర దర్శనము.

దైత్యబాలురు ప్రహ్లాదుడు చెప్పిన బోధను విని దాని నభ్యసించుచుండిరి. గురువులు చెప్పిన పాఠములను పెడచెవిని బెట్టుచుండిరి. చండామార్కులిది గమనించి భయపడి రాజున కెరిగించిరి. హిరణ్యకశిపునకు చాలా కోపము వచ్చెను. అతడు తోకత్రొక్కిన త్రాచువలె లేచి ప్రహ్లాదుని పిలిపించి, 'ఓరీ! నిన్ను యిప్పుడే చంపెదను. నాకు కోపమువచ్చిన మూడులోకములు లోకప్రభువులు వణకిపోవుదురు. నీకేమియు భయములేనట్లు నా శాసనమును ధిక్కరించుచున్నావు. ఏ బలము చూచుకొనిరా?' యని ప్రశ్నించెను. ప్రహ్లాదుడు 'రాజా! నా యొక్కడికేగాదు బలవంతులందరికి బలమతడే. స్థావరాది బ్రహ్మపర్యంతము నాయనవశమునందే యున్నది. ఈ సర్వమున కీశ్వరుడతడే. కాలస్వరూపుడతడే. బహు పరాక్రముడతడే. ఇంద్రియములకు మనస్సునకు బుద్ధికినున్న బలమంతయు నతడే. ఆయనయే తనశక్తులతో నీవిశ్వమును సృజించుచున్నాడు. పోషించుచున్నాడు. నీ యసురభావమును వీడుము. నీకు శత్రువులెవ్వరును లేరు. వశముదప్పిన మనస్సులకు వేఱు శత్రులెవ్వరు? మనస్సును వశముజేసికొమ్ము. దానిని సమభావమందు కుదురుపరచుము. అదియే పరమేశ్వరునకుత్తమమైన పూజ. మొదట కామ క్రోధాదులను నార్వురు దొంగలను జయింపకయే కొందరు తాము దశదిశలను జయించితిమనుకొందురు. మనస్సును జయించి సర్వప్రాణులందు సమభావముగల వివేకికి పరులెవ్వరు? శత్రువులెవ్వరు? శత్రువులనువారి నజ్ఞానముచేత కల్పించుకొనుచుంటిమంతే' అనెను.

హిరణ్యకశిపుడు 'ఓరీ! నీవు చావునకు తెగించితివి. అతిమాత్రముగా ప్రలపించుచున్నావు. కాలము మూడిన వానికి ప్రలాపము బుట్టును.

నాతోడం బ్రతిభాషలాడెదు; జగన్నాథుండు నాకంటె నీ
భూతశ్రేణికి రాజులేడొకడు సంపూర్ణప్రభావుండు మ
ద్భ్రాతంజంపినదొల్లి నే వెదకితిం బల్మారు నారాయణుం
డేతద్విశ్వములోన లేడు మరివాడెందుండురా దుర్మతీ।

ఎక్కడగలడే క్రియనే
చక్కటివర్తించునెట్టిజాడనువచ్చుం
జక్కడతు నిన్ను విష్ణుని,
వెక్కలు ప్రేలెదవు వాని భృత్యునిభంగిన్ ॥

ఈ పద్యములందు హిరణ్యకశిపుని దైత్య లక్షణమంతయు వ్యక్తమగుచున్నది. ఈ సర్వ ప్రపంచమునకు దానే నాథుడననుట నతని దురహంకారమును జెప్పును. తాను సంపూర్ణ ప్రభావుడననుట యతని మూర్ఖత్వమును జెప్పును. తక్కిన పద్యమంతయు నతని యవివేకమును జెప్పును.

'నారాయణుండేతద్విశ్వములోన లేడు.' ఈ ప్రపంచములో నారాయణుడన్నవాడు లేడు. అది నీకెట్లు తెలిసినదన్నచో 'తొల్లినే వెదకితిన్' అని జవాబు. ఎందుకు వెదకితివయ్యా? యనగా 'మద్భ్రాతన్ జంపినన్' నా తమ్ముని వాడుజంపెను యని సమాధానము. మరియా లేని నారాయణుడు తన తమ్మునెట్లు చంపెనో! తమ్ముని చంపెనుకావున నతడుండి తీరవలె. మరి లేడని నిర్ణయించుటేల? చావు మూడిన వానికి అసందర్భప్రలాపములు వచ్చునని యతడేగదా యన్నాడు. మరి ఇంతకంటె నసంబద్ధప్రలాపమేముండును? సరె లేడంటివి గదా. ఆ లేని విష్ణునిగురించి యెక్కడగలడు? ఎట్లు ప్రవర్తించును? ఏత్రోవనువచ్చును? యని యడిగెదవెందుకు? అతడు లేడని నీ నిర్ణయమాయె. లేనివానినెట్లు జంపుదువు? హిరణ్యకశిపుని విష్ణుద్వేషము పరమేశ్వరుని యస్తిత్వ నిరాకరణమై పరిణమించినది. ప్రహ్లాదుని సమాధానము పోతన్నగారు చక్కగా పొందుపరచిరి.

కలడంబోధిఁగలండు గాలిఁగలడా కాశంబునంగుభినిం
గలఁడగ్నిన్ దిశలంబగల్ల నిశలన్ ఖద్యోత చంద్రాత్మలం
గలఁడోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులందంతటం
గలఁడీశుండుగలండు తండ్రి! వెదుకంగానేల?

సాయారొడన్

ఇందుగల డందులేడని
సందేహమువలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిజూచిన
నందందేగలడు దానవాగ్రణివింటే॥

రెండుపద్యములలో హిరణ … ని ధిక్కారమునకు రెండుపద్యములలో ప్రహ్లాదుని సమాధానము. హిరణ్యకశిపుని ప్రశ్నల నన్నింటిని ప్రహ్లాదుడు చక్కగా నుత్తరించినాడు. పూర్వము వెదకితినంటివిగదా. ఏమి వెదకితివి? ఎక్కడ వెదకితివి? పరమేశ్వరుడష్ట తనువు. (పంచభూతములు, సూర్యచంద్రులు, జీవుడు - ఇవి పరమేశ్వరుని అష్టతనువులు)

ఇందు మొదటియేడు దృశ్యజాతములు. ఎనిమిదవవాడైన జీవుడధిష్ఠాత. ఈ యెనిమిదింట నంతర్యామిగా నున్నవాడు పరమేశ్వరుడు. ఆత్మస్వరూపుడు. సర్వత్రదొరకు వస్తువునకై నచ్చట నిచ్చట వెదకుట యెందులకన్నాడు. సర్వత్రనున్నవాడు గావున యాయనయే సంపూర్ణప్రభావుడని జెప్పినట్లైనది. ఆయనయే సర్వప్రభువని జగన్నాథుడని చెప్పినట్లైనది. ఈ యర్థమంతయు నిట్లు చెప్పకుండగనే వ్యక్తమగుచున్నను దానిని మరల 'కలడీశుండు' అని 'ఈశ' శబ్దముచేత కంఠోక్తిగా చెప్పినాడు. ఎందెందు వెదకి చూచిన నందందే గలడనుటలో నీవు పైపైన వెదకితివి. అంతర్గతముగానున్న వస్తువును చూడలేకపోయితివి. ఆ వస్తువు వివేకించి చూచినగాని తెలియునదిగాదు. ఏ పదార్థమును వివేకించి చూచినను చూడవచ్చును. అని చెప్పినాడు. 'వెదకుట' అనుశబ్దమునకు హిరణ్యకశిపుని యర్థము నామరూపాత్మకమైన పదార్థములకై నామరూపాత్మక పదార్థములమధ్య వెదకుట యని. ప్రహ్లాదునియర్థము నామరూపాత్మకపదార్థములందు పైని నామరూపములను. నేతి నేతి మార్గమున త్రోసివేసి యథార్థవస్తురూపమున నున్న పరమేశ్వరుని నాత్మస్వరూపునిగా వివేకించి తెలిసికొనుటయని యర్థము. ఇట్లు హిరణ్యకశిపుని ప్రశ్న ప్రహ్లాదుని సమాధానము రెండు రెండు పద్యములలో నడచినది. —సశేషము.

# విరక్తి (కథానిక)

## సూరంపూడి విశ్వేశ్వరరావు

ఎనిమిది వందల సంవత్సరములకు పూర్వం ఒక శిల్పిమనస్సులో విరక్తి ఉప్పొంగింది. ఏకాంతికప్రేమకు వశీభూతుడై అన్నిటిని త్యజించి భిక్షురూపంలో ఒక పర్వతగుహలో వసించడమారంభించాడు.

ప్రాతఃసాయంసమయములందు అనతిదూరంలో ప్రవహించే సెలయేటినుండి నీరు తెచ్చి తన ఇష్టదేవుని పూజించేవాడు. ఇట్లు నిష్ఠగా కొన్నిదినములు గడిచిన తరువాత ఒకనాడు ఆ శిల్పి అసంపూర్తిగా చెక్కబడియున్న ఒక గుహాలయాన్ని చూడడం జరిగింది. దాన్ని పూర్తిచేయాలనే అభిలాష అతని మనస్సులో కలిగింది. ఆనాటినుండి అతని కార్యక్రమములో పెద్దమార్పు వచ్చింది.

ఇప్పుడు అతను సాయంప్రాతఃసమయములను ఇష్టదేవుని పూజలో గడపటంలేదు. మందిరంలోనికి మందమైన వెలుతురు రాగానే అతను అక్కడకు చేర్తాడు. తన ఇష్టదేవునియొక్క మూర్తిని చెక్కడంలో లీనమయ్యేవాడు. అప్పుడప్పుడు అతనిచేతులు ఆగిపోయేవి. అతను ఆశంకితుడయేవాడు.

ఇప్పుడతను తన సౌకర్యములకు ఎక్కువ ధ్యానము చూపించడం మొదలుపెట్టాడు. ఆ ఆలయ సామీప్యంలో పర్వతములలో కురిసిన వర్షపునీటితో నిండిన చిన్నకొలనున్నది. దానిని శుభ్రపరిచి నిర్మలమైన జలములుకల కొలనుగా రూపమిచ్చాడు. అతను పండ్లుకూడ దగ్గరనే పెట్టుకునేవాడు. రాళ్ళను యిక చెక్కలేననే పరిస్థితి వచ్చేసరికి అతను పని ఆపుచేసి పండ్లను తిని ఆలోచించేవాడు. అతడు రాత్రల్లా మూర్తి యొక్క రూపకల్పన చేసి పగటి వెల్తురులో పనిచేసేవాడు.

అతను పనిచేయడం మొదలుపెట్టిన తర్వాత అతని జీవనస్వరూపం మారిపోయింది. అతని చుట్టుప్రక్కల గుహాలలోనుండేవారు, అతని వంకకు చూసి అనేవారు—'ఆసక్తిని విడిచిపెట్టు' అని. అతను వారి మాటలను అర్థం చేసుకోలేకపోయేవాడు. తన యీ పిచ్చితనం వల్ల తను భిక్షుధర్మమునుండి వేరుచేయబడినట్లు అతనికి తెలుసును. ఇప్పుడతను భైక్షుక వేషం గురించి కూడా శ్రద్ధవహించుటలేదు. ఇప్పటి అతని చింతనవిషయమల్లా ఒక్కటే తన యిష్టదేవుని ఆ మూర్తినిర్మాణమే.

ఆ మూర్తిని శిరసునుండి పాదములవరకు ఆఖరిసారిగా మలచి ఒకరూపం కల్పించిన రోజున హర్షాతిరేకంతో అతను నర్తించాడు. ఇది తాను సృజించినమూర్తియే. దీని ఎదుట కూర్చుని తను జపతపాదులు చేయాలి.

ఇది ఒక మమకారమని అతనికి తోచలేదు. దీని తర్వాత మందిరనిర్మాణమునకు పూనుకొన్నాడు. ప్రతిసంవత్సరం ఆ మందిరంలోని ఒక భాగాన్ని పూర్తిచేసి తన యిష్టదేవుని యిలా ప్రార్థించేవాడు.

"ఇతఃపూర్వపు శిల్పకారుని ఉలివలె నా ఉలి కూడా మధ్యలో ఆగిపోకుండా చూడు భగవాన్' అనేవాడు. రాతిపై పడిన ప్రతి సుత్తిదెబ్బను తన వ్యక్తిత్వము యొక్క ముద్రగా భావించెడివాడు. ఈవిధంగా ఆలయంలో తన వ్యక్తిగతముద్రను నింపివేశాడు.

పదకొండుసంవత్సరాలు విశ్రాంతి నెరుగకుండా శ్రమపడిన తర్వాత ఉలి అతని చేతినుండి జారిపోయింది. ఇప్పుడిక అతను పని చేయలేదు.

ఆలయం పూర్తిఅయింది. ప్రతిమ ఎప్పుడో పూర్తిఅయింది. కాని మూర్తి ఎదుట కూర్చుండి ధ్యానం యింతవరకు తను చేయలేదు,

జీవితంలో చాల గొప్ప ప్రమాదం జరిగినట్టు అతను భావించాడు.

అతడు ఆలయంలోనికి పోయాడు. అక్కడ మందమైన ప్రకాశంలో తన యిష్టదేవుని మూర్తి శాంతమైనదవ్వులతో ఆ చల్లని వాతావరణాన్ని ప్రకాశవంతం చేస్తోంది. ఇప్పుడు ఆరాధ్యదైవానికి ఎదురుగా కూర్చుని అన్నాడు– "భగవాన్! నన్ను క్షమించు"

కొద్దిసేపు అయినతర్వాత అతడు లేచి బయటకు వచ్చాడు. కొద్దిదూరంలో అతని సహచరులయిన భిక్షువులు పండ్లను అరణ్యం నుంచి తీసుకుని వస్తూండడం అతను చూచాడు.

భిక్షువులపంక్తి తన దిక్కుగా వస్తూండడం అతను చూశాడు.

"నన్ను రక్షించండి" అని అతను కేక వేశాడు. అతని చేతులు ఒణికిపోతున్నాయి.

ఒక భిక్షువు అతని స్థితిచూసి— "ఇతనికి జ్వరం వచ్చింది. ఇతన్ని సంరక్షించాలి" అన్నాడు.

ఇద్దరు భిక్షువులను అక్కడ విడచి భిక్షు సమూహం తమస్థానాలకు వెళ్ళిపోయారు. వాళ్లు తమలో "ఇతనికి అంతిమఘడియలు ఆసన్నమయ్యాయి" అనుకోవడం అతను విన్నాడు.

ఆ ఇద్దరు భిక్షువులు అతనివైపు చూస్తే చాలాసేపు ఉండిపోయారు. చివరకు అతన్ని లోపలకు తీసుకుపోయారు. అతని ఆరాధ్యుని ఎదుట సభాగృహంలో ఒక చాపమీద పరుండబెట్టారు.

అతను మొదట యిష్టదేవునివైపు తరవాత భిక్షువులవైపు చూస్తున్నాడు. కొంతసేపు గడిచిన తర్వాత కంపిస్తూన్న స్వరంతో అన్నాడు—'నా ఉలి తీసుకురండి. శేషించిన పని పూర్తిచేయాలి.'

భిక్షువు అన్నాడు—'ఇప్పుడేనా, ఉండండి జ్వరం తగ్గిపోతుంది. ఇక మిగిలిన పని ఏమీ లేదు. ఎంత గొప్ప సుందరమైన ఆలయం! ఇక మీరు పరుండండి.'

అతను కొద్దిసేపు పడుకున్నాడు. లేవాలనుకుంటున్నాడు కాని బాగా అలసిపోయాడు. "తనయిష్టదేవుని పాదముల క్రింద తనపేరు అంకితం చేయాలి" అనుకుంటుడగా అతనికి నిద్ర పట్టింది.

రాత్రి అతనికి నిద్రనుంచి మెలకువ వచ్చేసరికి ఆ భిక్షువులిద్దరు ధ్యానం చేస్తున్నారు. ఇష్టదేవుని ఎదుట నూనెదీపం మిణుకు మిణుకుమంటూ ప్రకాశిస్తోంది. లేవ ప్రయత్నించికూడ లేవలేకపోయాడు. మళ్ళా నిద్రపోవాలని ప్రయత్నిస్తున్నాడు.

ఆ రాత్రి అతను తన జీవితంయొక్క పూర్ణ చిత్రాన్ని చూశాడు. అతను పేరుకుమాత్రమే విరక్తుడు కాని అతని మనస్సులో ఈనాటికి ఆసక్తి అలాగే ఉండిపోయింది. అదే, ఆలయం పట్ల అతనికి మమకారాన్ని కలిగిస్తోంది. ఈ రాళ్ళలో తన సర్వస్వాన్ని గుమ్మరించాడు. అతని దృష్టిలో యీ రాళ్లే అతని గతజీవితానికి సాక్షీభూతాలు. ఈ రాళ్ళలోని ప్రతి అణువులోను అతని పదకొండుసంవత్సరాల కృషి, శక్తి దాగియుంది.

అతను మెల్లగా అన్నాడు—'చూడు!'

ఒక భిక్షువు లేచి దగ్గరకువచ్చాడు.

'నా కాణం తీసుకురా'

"ఇంతరాత్రప్పుడా! ఇప్పుడూరుకోండి"

విషాదంతో నిండిన అతని ముఖంలో నవ్వు కొద్దిగా మెరిసింది. 'అలాకాదు యిప్పుడే తీసుకురండి' అన్నాడు. అతను లేవాలని ప్రయత్నించి లేవలేకపోయాడు.

వారు అతన్ని లేవనెత్తి విగ్రహం వద్దకు తీసుకుపోయారు. అతను మమత్వభావనతో ప్రతిమను చూస్తున్నాడు.

"దీన్ని రచించడానికి నాకు ఎంత కష్టం అయింది. ఇది సుందరాతి సుందరంగా సృజించబడడానికి బదులు పాడయిపోవునేమో అని ఎన్ని నెలలు భయపడ్డానో!"

"మీరు చెప్పేదంతా సత్యమే కాని విశ్రాంతి తీసుకోండి. ఏ కొంచెం అయినా పని మిగిలిపోతే మీరు కొద్దిగా శక్తిని కోలుకున్న తర్వాత పూర్తిచేయుదురు కాని."

"ఆఁ–ఆఁ అలాగే!" అతను భిక్షువుల ఎదుట తన అహం ప్రదర్శించదలచుకోలేదు. అందు తనే తన పేరును చెక్కాలనే అభిలాషను వారి ఎదుట బయటపెట్టలేదు.

ఒక రోజున అతను లేచి కూర్చున్నాడు. అతను ఉలి చేతుల్లోకి తీసుకొని దాన్ని ఒక్కసారి చేతితో సవరించాడు. ఆ రోజు భిక్షువులు బయటకు ఎక్కడకో పోయారు. సుత్తికూడా చేతిలోకి తీసుకొని పని ప్రారంభించడానికి ఆలోచిస్తున్నాడు. తన పేరును చెక్కడానికి మంచి చోటు ఎంచుకున్నాడు.

"సరిగ్గా తన ఆరాధ్యుని పాదల క్రింద తన పేరు ఎంత చక్కగా ఉంటుందో!"

అతను సర్దుకుని కూర్చున్నాడు. చేతిలోకి సుత్తితీసుకుని దెబ్బ కొట్టడానికి ప్రయత్నించాడు. కాని అలా చేయలేకపోయాడు. అతనిలో దాన్ని ఆడించగలశక్తిలేదు.

అతను అలాగే కూర్చున్నాడు. అతని మనస్సులో తుఫాను తీవ్రరూపం ధరించింది. అతనికి తను ఆ తుఫానులో మునిగిపోతున్నట్టు అనిపించింది. అతనికి ప్రతికారం చేయగలశక్తి లేదు. అతడు తిరిగి చైతన్యం కోల్పోయినవాని వలె పరున్నాడు.

ఆ తుఫాను అతనితో 'నువిప్పుడు విరక్తుడవు కాలేద'ని చెప్పింది. అతడు జీవితం అంటె విసుగెత్తి వచ్చాడు. కాని దాని నుండి విముక్తుడు కాలేదు. ఈ ఆలయం అతని ఆసక్తికి ప్రతిరూపం. అతను యిప్పుడు చేయబోతూన్న పని అహంకారానికి దర్పణంలాంటిది. అతడు నిజమునకు భిక్షువుగా ఎప్పుడూ లేదు.

అతను ఎంతోసేపు ఆలోచించలేకపోయాడు. భిక్షుసముదాయం తిరిగి అతన్ని కలుసుకోవాలని వచ్చింది. వారందరూ అతని అతనికోసం చింతిస్తున్నారు.

వస్తూనే—"మీరు పనిచేస్తున్నారా" అని అడిగారు.

"లేదు–లేదు–లేదు" అస్పష్టంగాఅన్నాడు.

"బాగా అలసిపోయారు. ఇంకా కొద్దికాలం ఆగండి. ఆరోగ్యం పూర్తిగా బాగుపడిన తర్వాత పనిచేద్దురుగాని"

అతను శిరస్సు పంకించాడు.

వారు వెళ్ళిపోయారు.

అతను ఉలిని ఒక ప్రక్కకు నెట్టివేశాడు. తిరిగి తన ఇష్టదేవుని పాదాలమీద తల ఉంచి ఏడుస్తున్నాడు,

ఆ కళాకృతిలోని భవ్యత్వానికి అతని సహచరుల మెప్పు ఉంది. కాని అతనిలో అసంతోషం. శాంతిని అన్వేషిస్తూ బయలుదేరిన అతని మనస్సు యీనాడు అశాంతితో నిండియుంది. అతను అన్నాడు—'సరే యిక ఏమీ అక్కర్లేదు. పేరు వ్రాసే అవసరంలేదు. ప్రభూ! నన్ను క్షమించు''

ఆ రాత్రి ఇద్దరు భిక్షువులు అతన్ని పరిశీలనగా చూశారు. అతని శ్వాస ఆగిపోయింది. అతని పెదవులు క్షమాప్రార్థన చేస్తున్నట్టు విడివడి ఉన్నాయి.

(కల్యాణ్‌లో ప్రచురింపబడిన శ్రీ వి. సి. జోషిగారి హిందీరచన ఆధారంతో.)

# ఏకాంతవాసము

జె

మానవుని ఆత్మజ్ఞానసంపాదనమునకు మిక్కిలి యవకాశమును గల్పించున దేకాంతవాసము. పౌరాణికములగు పూర్వమానవచరిత్రల విలోకించిన నేకాంతవాస ప్రాశస్త్యము మనకు బోధపడఁగలదు. మానవజాతియందత్యున్నత విజ్ఞాన శిఖరముల నధిరోహించి మానవులకు మార్గదర్శకులై విలసిల్లిన మహాపురుషులందఱు నేకాంతవాసమున సిద్ధించిన అంతశ్శక్తి మహిమలచేఁ బ్రభావితులైనవారే!

“క్రైస్తవ మతావలంబియగు సెయింట్ పాల్ మొదట స్వమతపక్షపాతియు నంధవిశ్వాసియునై అన్యమతస్థులయెడ బహుక్రూరముగ వర్తించెడివాఁడు. మాత్సర్యావంతుఁడగు నాతనికి రవంతయుఁ జిత్తశాంతి యుండెడిది కాదు. అతఁడందులకై మొదటఁ గొంచెమేకాంతముగ నుండుటకలవడి తన్మహిమ నెఱింగి పిమ్మట మూఁడేండ్లు వనమున నివసించి నిరంతరైకాంతధ్యానమున నాత్మజ్ఞానసంపన్నుఁడై ధర్మప్రచారకుఁడై విశ్వమానవ సౌభ్రాత్రృత్వమును ప్రదర్శించి క్రైస్తవలోకమున నప్రతిహత దైవీభావ దేదీప్యమానుఁడగు దేవదూతయను యశస్సు గడించెను. మానవ జీవితోద్ధరణమున కేకాంతవాసమెంతటి శక్తి సంపన్నమగు సాధనమో దీనినిఁబట్టి విదితమగుచున్నది. పలుమాటలేల? ఏకాంతవాసమెఱుంగని చిత్తమేకముగాదు. చిత్తమేకముఖముగాకున్న సత్యావలోకనమసంభవము. భగవద్వాణియు నేకాంతవాసమునఁగాని కర్ణగోచరముగాదు. ఏ మతమునందైన నేజాతియందైనఁ బ్రాచీనార్వాచీన మహాపురుషుల జీవితఘట్టముల నవలోకింతుమేని మనకీ పరమసత్యమే ప్రస్ఫుటముగఁ బ్రత్యక్షమగును. సూఫీభక్తాగ్రణి జునైద్ చరిత్రమును వినుఁడు. జునైద్ ఒకనాఁడు వేటకై అరణ్యమునకేగెను. ఏకాంతముగ విశ్రమించియున్నప్పుడతనికొక పిలుపు వినవచ్చినది ఇందులకు నీ జన్మ కాదు, ఇట్లు చేయుమని నీ కాజ్ఞనీయలేదు” ఈ పిలుపు రెండుసారులు వినవచ్చినది. నిర్జన ప్రదేశమున మానవవాణియెట్లు? ఆశ్చర్యచకితుఁడగుచుండ మూఁడవసారి మఱల వినవచ్చినది. అంతనతఁడు దైవమెంతకుఁదన్ను పాపములనుండి విముక్తునిఁ జేయునో అంతదనుక దైవాజ్ఞనుల్లంఘింపనని నిశ్చయించుకొని కోలాహలమయమగు ప్రపంచమునకుఁ గల్పితానందమయభూమికలకు దూరముగనుండే ఏకాంతముగ భగవదన్వేషణమున దివ్యజ్ఞానమును బడసి మహాసిద్ధుఁడయ్యెను.

అధునాతనకాలమున నిట్లేకాంతముగ భగవదాదేశమును బొందినవారిలో నరవిందులొకరు. వారు రాజకీయదోషిగ నెన్నఁబడి ఆలీపూరు జైలునందు బంధితుఁడుగ నున్నప్పుడొకనాటి యేకాంతమున శ్రీకృష్ణపరమాత్మ దర్శనాదేశములు లభించినవి. కొలఁదినాళ్ళలో నతని క్లిష్టసమస్యలెల్ల వైదొలఁగినవి. కారాగారవిమోచనము గల్గినది. వెంటనే భగవన్నిర్దిష్టమగు ధర్మనిర్వహణమునకుఁ బుదుచ్చేరి చేరి యటనొక ఆశ్రమము నిర్మించుకొని ఏకాంతమున నంతర్ముఖుఁడై యోగసాధనమునఁ గోశములయందలి యసత్ప్రవృత్తుల నిరాసమొనర్చెను. పూర్ణయోగదర్శనమున మానవమాత్రులనెల్ల నమృతపుత్రులఁగావింపఁ బ్రోత్సహించి జీవితాంతమేకాంతవాసమొనర్చి తరించెను.

శుద్ధోధనరాజపుత్రుఁడు సిద్ధార్థుఁడు మానవ దుఃఖనివారణోపాయమెఱుంగఁదలంచి అరణ్యముల వత్సరమట్క మేకాంతవాసమునఁ దప మొనర్చి యింద్రియముల నిగ్రహించి కాముని జయించి అమృతమును సత్యమును నగుఁదత్త్వమునుగూర్చి ధ్యానించి బుద్ధుఁడై జరామరణ రహితమగు నిర్వాణపథము నెఱింగి ప్రజలకుబోధించి భగవదవతారమూర్తిగ గణనకెక్కెను.

ఒక వ్రడంగి కుమారుఁడైన జీసను పదు నెన్మిదేండ్లు పర్వతాగ్రమున నేకాంతవాస మొనర్చి దేవరాజ్యరహస్యములనెఱింగి తన్మహాపథప్రాప్తిమార్గములను జనులకు బోధించి దైవప్రతినిధియై భూలోకమున మానవ కల్యాణమును సుస్థిరమొనర్చెను.

ఇంతటి యున్నతస్థితినందినను వారనుకూలావసరములున్నప్పుడెల్ల విడువకేకాంతవాస మొనర్చుచుండెడివారు. ఎంతటి సిద్ధపురుషులైనను నేకాంతవాసముచే లభించిన యాధ్యాంతరికశక్తిని పునఃపునః పటిష్ఠమొనర్చుకొనకున్న సది పరిపూర్ణాధ్యాత్మికజీవన మనిపించుకొనదని వారి భావము.

ఇఁక సామాన్య మానవుని నిత్య జీవితమున నెదుర్కొను విపత్కర సమస్యలకు సహితము పరిష్కారరూపమగు భగవద్వాణి ఏకాంత ధ్యానచే హృదయాంతరమునుండి వినవచ్చుట మనకనుభవమున నున్న విషయమేసుఁడీ! రాబర్టు బ్రూస్ శత్రువులవలన నాఱు మాఱు లపజయము నొంది యొక పర్వత గుహాయందు డాగి శత్రువులజయించు వెరవుగానక సర్వేశ్వరుని నమ్మి ప్రభూ! నీవే శరణ్యమని ఏకాంత (అనన్య) చిత్తమున నాంతరికమగు నాత్మ సాన్నిధ్యము నాశ్రయించెను. తత్క్షణమ గుహపై కప్పునుండి యొక సాలెపురుగు రాజు ప్రత్యక్షమునఁ గ్రిందికి పతనమైనది. అది మఱలఁబతనమైనది. ఇట్లాఱుమాఱులు పతనమై తుదకేడవసారి క్రమక్రమముగఁ బైకెగఁబ్రాకి కప్పునందుకొని విజయమును సాధించినది. ఆ దృశ్యమును వీక్షించుచున్న రాజున కంతరాత్మ నుండి "ప్రయత్నింపుము. ప్రయత్నింపుము! మఱల బ్రయత్నింపుము" (Try and try again) అను భావము స్ఫురించెను. ఆహా! భగవంతుడీ యుపదేశము నా కొసంగినాఁడు. ప్రయత్నింపుము! ప్రయత్నింపుము! మఱలఁ బ్రయత్నింపుము! పునః ప్రయత్నింపుము!! ఇది భగవదాదేశ మని భావించి అభయుఁడై కరవాలమును ధరించి చెదరిన తన సేనలను సమకూర్చుకొని మఱల యుద్ధమొనర్చి శత్రువుల నిర్జించి విజయుఁడై సింహాసనము నధిష్టించెను. దీనిని బట్టి ఏకాంతవాసధ్యాన మెంత ప్రాశస్త్యములో బోధపడఁగలవు.

# సందేశం

## సదాశివం

చిత్తశాంతిలేని యువకుడొకడు ఒక మహాత్ముని సందర్శించి "స్వామీ! నాకు ధనసంపదయున్నది, విద్యాసంపదయున్నది, యౌవనసంపద యున్నది. కాని ఏదో ఒక నాకు తెలియని కొఱత నా హృదయాన్ని క్రుంగదీస్తున్నది. నేనొక అప్రయోజకుడనేమో అను సందేహము కూడ అప్పుడప్పుడూ కలుగుచున్నది. దీనికేమి కారణమో మీరు చెప్పి తగిన విధముగా నన్ను బోధించండి" అన్నాడు.

ఇది విని ఆ మహాత్ముడు కొన్ని క్షణములు మౌనము వహించి తరువాత ఇట్లన్నాడు. "మేఘసందేశం"లో కేవ వృత్తాన్ని కవికులగురువు కాళిదాసు నీ కొఱకే రచించినట్లు నాకు తోచుచున్నది. మేఘసందేశం, 120 మందాక్రాంత వృత్తములుగల చిన్నగ్రంథము. ఇంత అల్పపరిమితి గలిగియున్ననూ దీన్ని పండితులు మహాకావ్యముగా గౌరవిస్తారు. ఇతివృత్తం ఉన్నది, రమణీయమైన వర్ణనలున్నవి, (విప్రలంభశృంగార) రసం ఉన్నది. కనుక ఇది మహాకావ్యమే. ఒక యక్షుని విరహవేదనను పరమరమణీయంగా వర్ణించే అపూర్వకావ్యమిది. కుబేరుని కొలువులోనున్న ఒక మితిమీఱినభార్యాసక్తిగల యక్షుడు తన కర్తవ్యములను సరిగా నిర్వర్తించలేకపోవును. ఇది గమనించిన కుబేరుడు ఆ యక్షుని శిక్షింపదలచి ఒక సంవత్సర కాలము తనదేశమునుండి బహిష్కరించును. ఆ యక్షుడు దక్షిణదేశములోని రామగిరి ఆశ్రమ ప్రాంతములలో సంచారము చేయుచు దినములను లెక్కబెట్టుకొనుచుండును. ఆషాఢమాసము వచ్చినది. యక్షుడు ఇంకను నాలుగుమాసములు ప్రవాసదుఃఖమును అనుభవించవలసియున్నది. తనవలె తన భార్య కూడ దుస్సహమైన వియోగదుఃఖమును అనుభవించుచున్నదను ఊహ అతనికి మఱింత వేదనను కలిగించును. అప్పుడతడు ఆగిరితటమును ఆక్రమించిన ఒక మేఘమును చూచి తన సందేశమును అలకాపురిలోనున్న తన ప్రియురాలికి అందజేయవలసినదిగా ప్రార్థించును. ఆ రామగిరినుండి అలకాపురికి పోవుమార్గమును, ఆ మార్గములో చూడవలసిన రమణీయ దృశ్యములను, పుణ్యక్షేత్రములను, పర్వతములను, నదీనదములను, నగరములను వరుసగా వర్ణించి చెప్పును. హిమాలయములను వర్ణించునపుడు ఆ యక్షుడు చెప్పిన ఒక వృత్తమే ఇప్పుడు నీవు శ్రద్ధగా వినవలసినది.

తం చేద్వాయౌ సరతి సరళస్కంధసంఘట్టజన్మా
బాధేతోల్కాక్షపితచమరీబాలభారో దవాగ్నిః
అర్హస్యేనం శమయితుమలం వారిధారాసహస్రై
రాపన్నార్తిప్రశమనఫలాః సంపదో హ్యుత్తమానామ్

“ఓ మేఘమా! హిమాలయములలో దేవదారు వృక్షములు దట్టముగా నుండును. గాలి రివ్వున వీచునపుడు ఆ దేవదారువృక్షముల కొమ్మలకు రాపిడి కలిగి నిప్పుపుట్టి వ్యాపించును. ఆ అడవిఅగ్ని నే దావాగ్నియందురు. ఆ దావాగ్నిని చూచి భీతిచే పాఱిపోవు చమరీమృగములు కూడ ఆ నిప్పునుండి తప్పించుకొనలేవు. దానిరవ్వలు చెదరి ఆ చమరీమృగములపై బడి వాటి కేశసమూహమును దగ్ధముచేసివేయును. ఇటువంటి దావాగ్ని ఆ హిమాలయ పర్వతమును పీడించుటను నీవు చూచితివేని నీ సంపదను (జలమును) ధారాళముగా వ్యయపఱచియైనను ఆ పీడను తొలగించవలెను. (బాగుగ వర్షించి ఆదావాగ్నిని ఆర్పివేయవలెను.) ఇట్లు ఆచరించుటయే నీకు తగినవిధము. ఎందుకనగా, ఉత్తములకు గల సంపదలయొక్క ముఖ్య ప్రయోజనము–దీనుల, దరిద్రుల, దుఃఖితులయొక్క దైన్యమును దారిద్ర్యమును దుఃఖమును తొలగించుటయే.”

ఆ మహాత్ముడు ఇంతవఱకు చెప్పి కొన్ని క్షణములు ఆగి మళ్ళీ ఇట్లన్నాడు. “అబ్బాయీ! నా అల్పపాండిత్యము ప్రదర్శించడానికిగా నేను నీకిది చెప్పలేదు. నీ బాగును మనస్ఫూర్తిగా కాంక్షించియే నీకిది చెప్పితిని. నీవు ఈ వఱకు చదివిన రకరకముల మత గ్రంథములు, నానాతత్త్వగ్రంథములు, ఉపదేశామృతములు-అన్నీ మఱచినను పరవాలేదు. ఈ ఒక్క సూక్తిని ‘ఆపన్నార్తిప్రశమనఫలాః సంపదో హ్యుత్తమానామ్’ అను ఈ ఒక్క కాళిదాస సూక్తిని నిత్యమూ స్మరించి ఆచరణలో బెట్టుము. చిత్తశాంతి ఎందుకు నీకు లభించక పోవునో చూచెదముగాక! ఇప్పుడు నీకుగల సంపదలు – విద్యాధనయౌవనసంపదలు-వీ పరోపకార ప్రయోజనమునకుగాక వృథాభారముగా పరిణమించినవి. కనుకనే నీవు చిత్తశాంతిలేక కుమిలిపోవుచున్నావు. బహుశః ఈ వఱకే నీవు మంత్ర తంత్రములద్వారా చిత్తశాంతినిపొందుటకు ప్రయత్నించియుందువు. దానివలన చిత్తశాంతి కలుగునో కలుగదో నాకు తెలియదు. కాని ఇది మాత్రము చిత్తశాంతికి రాజమార్గమని ఢంకా బజాయించి చెప్పగలను.”

ఓంకారం అతిసహజమైనది. ఇది సర్వాంతర్యామియైన పరమపావనుడైన భగవంతుని యథార్థమైన నామం. ఇది ఒకభాషకు సంబంధించిన శబ్దం కాదు. హిందువులు దీనిని స్వీకరించారని సంస్కృతశబ్దం కాదు. ఇది ప్రకృతిసిద్ధమైన నామం. ప్రకృతిసిద్ధమైన శబ్దం. ప్రకృతిసిద్ధమైన మంత్రం.

—శ్రీ రామతీర్థ.

# ధనవంతుడు - శ్రీమంతుడు

ఎమ్. కృష్ణస్వామి

కడుపులు కట్టుకొని లక్షలు కూడబెట్టిన వారినో, లేదా, కడుపులు కొట్టడంవల్ల కోట్లు ఆర్జించిన వారినో చూపిస్తూ 'వారికేమి వారు శ్రీమంతులు' అంటూ వుంటాం. 'పదితరాలు కూర్చుని తిన్నా తరుగని ఐశ్వర్యం వారిది'అని చెబుతూవుంటాం. కడుపుకట్టుకొని సంపాదించు కొంటున్నవాడు, తినే యోగ్యత తనకు లేదని తన నుదుటిమీద తానే వ్రాసుకొంటున్నాడు. కడుపులుకొట్టి సంపాదించేవాడు బయటికి ఆడంబరంగా కనపడుతున్నా లోపల అశాంతితో నిద్రమాత్రలు మ్రింగుతున్నాడు.

ధనమనేది ఒక ప్రవాహం లాంటిది. నీరు ప్రవహిస్తూవుంటే ఆరోగ్యకరంగా వుండి త్రాగటానికి ఉపయోగపడుతుంది. ఏ గుంటల్లోనో చిక్కుకొని నిలిచేపోతే మురిగిపోయి దోమలను ఉత్పత్తిచేసే కేంద్రంగా మారుతుంది. అలాగే ధనంకూడా సత్కార్యాచరణకు వినియోగ పడుతున్నంతకాలం సంతృప్తినిస్తుంది. సత్కార్యాచరణను వదలి యినప్పెట్టెలలో చేరడం మొదలుపెడితే తరువాతతరాలవారు దోమలై దుర్వినియోగపరచే ప్రమాదం వుంది. మన బిడ్డల్ని మనం సమర్థుల్ని చేయాలిగాని సంపన్నులుగా చేయరాదు. అవసరాలకిమించిన ధనం కూడబెట్టి ఇవ్వడంవల్ల తరువాతి తరాల వారికి కష్టపడాల్సిన అవసరం వుండదు గనుక భోగాలపేరిట వ్యసనాలకి లోనయి, నాశన మయ్యే అవకాశం వుంది.

కొంతమంది డబ్బు పాపిష్టిది అంటారు. ఈ యభిప్రాయం కూడా తప్పే. డబ్బు కేవలం ఒక ఉపకరణం మాత్రమే. దాన్నెలా ఉపయోగించుకొంటే అలా ఉపయోగపడుతుంది. డబ్బుకు పాపపుణ్యాలకు ఏమీ సంబంధం లేదు. అగ్నితో దేవునికి దీపారాధన చేయవచ్చు, వంటకు పొయ్యి అంటించుకోవచ్చు. మతిచెడితే కొంపలూ తగులబెట్టుకోవచ్చు. ఈ పనులకు బాధ్యులు ఆయా వ్యక్తులు కాని అగ్ని ఏ మాత్రమూ కాదు. అగ్నిలాంటిదే డబ్బు కూడా!

మన శరీరంలో రక్తప్రసారం వంటిదే సమాజంలోని ధనప్రసారం. రక్తప్రసరణ శరీరంలోని అన్ని భాగాలకు తగినరీతిలో వున్నంత వరకే మనం ఆరోగ్యంగా వున్నట్టులెక్క. అలా కాకుండా ఏదైనా ఒకచోట నిలిచిపోతే అది యేరక్తపుగడ్డగానో తయారై శరీరారోగ్యానికి దెబ్బకాగలదు. అలాగే సమాజంలో ధనప్రసరణ ఆరోగ్యకరంగా సాగుతూవుండాలి. కాని ఏ కొద్దిమంది చేతుల్లోనో చిక్కుకొని పోరాదు. అలా చిక్కుకొనిపోవడంవల్ల సమాజంకన్నా చిక్కించుకొన్న వారికే అన్నివిధాలా నష్టం.

నిజానికి శ్రీమంతుడు వేరు, ధనవంతుడు వేరు డబ్బుగలవాడిమాట వాడిదగ్గరున్న డబ్బు కోసం వింటారుగాని అదికాస్తాపోతే ఎవ్వరూ వినరు. డబ్బుండి కూడా కనీసం ఇంట్లో వారి మన్ననలైనా పొందలేక పోయేవారిని చూస్తూనే వున్నాం. మన్ననకాదు గదా యీసడింపబడుతున్నవారు కూడా మనకళ్ళబడుతూనేవున్నారు. వీళ్ళంతా శ్రీమంతులంటే నవ్వొవస్తుంది.

ధనం వేరు, సంపద వేరు. కూడబెట్టేది డబ్బు, తాననుభవిస్తూ, యితరులని అనుభవింపజేసేది సంపద. మనం కొంతమంది చిత్రమైన వ్యక్తుల్ని చూస్తూ వుంటాం. వాళ్ళని చూడగానే మనకు నమస్కరించబుద్ధి పుడుతుంది. సేవించాలని కోరిక జనిస్తుంది. వారికి, వారి చుట్టూ వున్నవారికీ ఏ సమయానికేమి కావాలో

అప్రయత్నంగా అందుతూ వుంటాయి. మనం అనుకొంటున్న డబ్బుతో సంబంధం లేకుండా, వారికొరకు సమస్త సౌకర్యాలూ నడచి వస్తూవుంటాయి. చూచేవారికిదంతా లీలగా మహిమగా గోచరిస్తూ వుంటుంది. వారికి ఏ అంతస్తూ, ఏ అధికారమూ మనం అనుకొంటున్న భాషలో లేకపోయినా ఈ అంతస్తులు గలవారూ, అధికారాల్లో వున్నవారూ పంచదార దగ్గరకు చీమలు చేరినట్లు వారి దగ్గరకు చేరుతుంటారు. శ్రీమంతులంటే యిలాంటివారు. వీళ్ళనే మనం పెట్టిపుట్టినవాళ్లు అంటాం. నిజమే, తమ జీవితాన్ని పదిమంది కొరకూ పంచిపెట్టడమే వీరికి జీవిత లక్ష్యంగా వుంటుంది. తన సంగతి మరచినవాడూ, అందరూ తనవారేనని తెలిసినవాడూ, వారిని తగినరీతిలో సేవించడమే తన స్వభావంగా కలవాడూ పైన చెప్పబడిన శ్రీమంతత్వాన్ని అనుభవింపగలుగుతాడు. అవతార పురుషుల్లో శ్రీకృష్ణుడు దీనికి ఉదాహరణ. పరమగురువు వివేకానందుల జీవితం మరో ఉదాహరణ. వివేకానందుని విదేశప్రయాణం, చికాగో నగరంలో వివేకానందుని ప్రభావమూ శ్రీమంతత్వానికి నిదర్శనాలు. వివేకానంద స్వామి జీవితచరిత్ర చదివితే శ్రీమంతుడంటే ఎలా వుంటాడో తెలుస్తుంది. ఎడారిలోవున్నా, అరణ్యంలోవున్నా తనను గూర్చి తాను ఆలోచించుకోవాల్సిన అవసరం లేనివాడు శ్రీమంతుడు.

ఐశ్వర్యవంతుడన్న పదానికి కూడా మనం అనుకొంటున్నది సరైన అర్థంకాదు. ఈశ్వరుని యొక్క భావం ఐశ్వర్యం అవుతోంది. ఇటువంటి ఐశ్వర్యం కలవాడు ఐశ్వర్యవంతుడు. ఈశ్వరుడన్నపదానికి 'ప్రభువు' అని అర్థం చెప్పుకొంటూవుంటాం. ఎవరిమాట పదిమందీ వింటారో వాడు ప్రభువు అవుతున్నాడు. పదిమందీ వాడిమాట కావాలని వింటున్నారంటే పదిమందిలోనూ వాడే వుంటున్నాడన్నమాట! అలాగే, రోజు రోజుకూ సర్వాంతర్యామిని అనుభవించే సాధనలో తన పరిధిని పెంచుకొంటూ తానే ఈ జీవరాసులుగా వ్యక్తమవుతున్నట్లు గ్రహించి, అందరి కష్టసుఖాలూ తనవిగా దర్శించి, అంతర్యామియై అందరినుండీ వ్యక్తమవగల వ్యక్తియే ఐశ్వర్యవంతుడనబడతాడు. మన శరీరంలోని అణువణువులోనూ మనం వున్నట్లు మనకు అనుభవమే గదా! అలాగే సృష్టిలోని అణువణువునా తానున్నట్లు సృష్టియే తన శరీరం అయినట్లూ ఎవడు దర్శించి వర్తించగలడో వాడు ఐశ్వర్యవంతుడు. అట్టి ఐశ్వర్యవంతుడు తాను అందరిలోనూ, అందరిగానూ, అందరికొరకూ జీవిస్తాడు గనుక అందరూ అతని మాట వినడం, అతని బాటలో నడవడం జరుగుతుంది. దూరాన్నుండి చూచేవాళ్ళకుమాత్రం ఏమిటి వీళ్లంతా వాడివెంట పడుతున్నారు? వాడికేముంది? వాడిలో ఏముంది? అనిపించవచ్చు. వాడికేముందో, వాడిలో ఏముందో ఆ వెంట పడేవాళ్ళకే తెలుసు-కృష్ణుని సంగతి గోపికలకు మాత్రమే తెలిసినట్లుగ!

శ్రీమంతుడు, ఐశ్వర్యవంతుడు అన్న స్థితులు ఎంతటి విశిష్టమైనవో చూశాం గదా! ధనాన్ని కూడబెట్టుకొని, భార్యాబిడ్డలనుకూడా నమ్మకుండా, ఒంటరితనమనే నరకాన్ని అనుభవించే స్థితినుండి జీవితాన్ని పదిమందికీ సమర్పణ చేసికొని, అందరివాడై, అందరిలోనివాడై జీవించే ఐశ్వర్యలక్షణంలోనికి అడుగు పెట్టగలుగుదుముగాక!

# బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

<u>బంధుత్వాలు కలలవంటివి</u>

శ్రీ శారదాదేవికి రామకృష్ణుని సమీపంలో ఆనందంతో గడిపినరోజులు తగ్గినవి. కష్టపురోజులు ఆరంభమైనాయి. శ్రీ రామకృష్ణదేవునకు గొంతులో పుండుయేర్పడి బాధపెట్ట సాగింది. అది క్యాన్సరువ్యాధిఅని వైద్యులునిర్ణయించారు. ఆ జబ్బునయంకాదు. అందుచేత పెద్దవైద్యునిదగ్గర వైద్యంకొరకు కలకత్తా తీసుకుపోవాలనుకున్నారు. మొదట శ్యామపుకుం అను పేటకుతెచ్చారు. అక్కడ నరేంద్రుడు మొదలగు కాలేజీపిల్లలు, మహేంద్రనాథగుప్త వంటి గృహస్థభక్తులు ఆయనకు సేవచేయటం మొదలుపెట్టారు. కాని ఆహారం తయారు చెయ్యటంలో యిబ్బందికల్గింది. తనకెంతసిగ్గుగాయున్నా యీ పరిస్థితులవల్ల శారదాదేవి అక్కడికివచ్చింది. కాని ఆమె రెండవ అంతస్తులో చిన్నపంచలో ఉండాల్సి వచ్చింది. మొగవారి కంటపడకుండా వుండటానికి, తెల్లవారుఝామున మూడుగంటలకులేచేది. అప్పటి నుండి రాత్రి పదకొండుగంటలదాకా ఆ పంచలోనే ఉండేది.

ఇంతకష్టపడ్డా రామకృష్ణదేవునకు ఏమీతగ్గలేదు. జబ్బు యింకాఎక్కువైంది. అందు చేత రెండునెలలు దాటకుండానే కాశీపూరు అనే యింకోచోటికిమార్చారు. అక్కడ శ్రీ శారదా దేవికి, భక్తులకు, శ్రీ రామకృష్ణదేవునకు వసతి బాగానేవుంది. కాని జబ్బునానాటికి పెరిగి పోయింది. మందులు పనిచెయ్యలేదు. భక్తులకు చాలాబాధకల్గింది. వాళ్ళందరికి తల్లిగా వారి వెనుకనున్న శ్రీ శారదాదేవి దిగులు భరించలేకపోయింది.

తారకేశ్వరం పేరు మీరువినియున్నారు. అక్కడ ప్రసిద్ధమైన శివాలయంవుంది. కష్టాలు పోగొట్టుకోడానికి ఆదేవునికి పూజలు చేస్తారు. ఒకరాత్రి శ్రీ శారదాదేవి అక్కడికివెళ్ళింది. శ్రీ రామకృష్ణదేవుని జబ్బుతగ్గాలని ఆ గుడిముందు ఆమె ప్రాణాచారంపడింది. ఒకరోజు అయింది. రెండవరోజుఅయింది. ఆ రాత్రిఆమెకు ఫెళ ఫెళమని శబ్దం వినపడింది. ఒకదాని పై ఒకటిగాపెట్టిన కుండలదొంతరను ఎవరో కర్రతో పగులగొట్టినట్లు ఆ శబ్దం వుంది. క్షణంలో కుండలు పగలటంతో శ్రీ శారదాదేవికి యిట్లుతోచింది. "మనిషికి, మనిషికిగల బంధుత్వాలు, సంబంధాలు, కలలవంటివేకదా! క్షణంలో విడిపోతయి." ఆమెకు శాంతి కలిగింది. వెంటనే దక్షిణేశ్వరం తిరిగివచ్చింది. అక్కడ యేమిజరిగిందో శ్రీ రామకృష్ణ దేవునకుచెప్పింది. ఆయనకు యిదంతా తెలుసు. అందుచే ఆయన యిది తనకు తెలిసినట్లుగా సూచనచేశారు.

శారదాదేవి ప్రార్థించె తారకేశు
పెద్ద కుండల దొంతర ఫెళ ఫెళమని
పగిలిపోయిన ధ్వని విని భయములుడిగి;
బంధములు కలల బోలిన వనుచుదలచె.

సంపాదకులు: స్వామి తన్మయానంద.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600 021) న ముద్రింపబడి.

స్వామి తన్మయానందవారిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600 004) నుండి ప్రచురింపబడు.

# శ్రీ రామకృష్ణ కథామృతము

నేడే కొనండి! (ప్రథమ భాగము) పదేపదే చదవండి!

శ్రీ "మ.—" చే వంగభాషలో విరచితమైన మూలగ్రంథమునుండి అనూదితము. నవభారత నిర్మాతయగు శ్రీ వివేకానందస్వామికి శ్రీరామకృష్ణ పరమహంస గురుదేవుడు. ఆ పరమహంసదేవుని దివ్య వచనామృతమును శ్రీ "మ.—" ఆనంద తన్మయతతో తాను వినినది వినినట్లుగ ఐదు భాగములుగ గ్రంథస్థ మొనర్చెను. అందు ప్రథమ భాగమిది.

ఆ అవతారమూర్తియొక్క వచనములు ఈ పుటలయందు మనస్సును పూర్తిగ ఆకట్టుకొనునట్లుగ అనువదింపబడినవి. వీనిలో పరిష్కరింపబడని తత్త్వవిషయిక సమస్యలేదు. తొలగింపబడని ఆధ్యాత్మిక సంశయము లేదు. వివరింపబడని ఆత్మవికాసక విషయములేదు. ఆసక్తికరము. ఆధ్యాత్మికులకు ఒక వరప్రసాదము.

వెల : సాదా : రూ. 8–00

పుటలు : 240+VIII ప్రథమ ముద్రణము కాలికో : రూ. 12–00

# శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర

రచయిత : శ్రీ చిరంతనానందస్వామి

వంగభాషలోని మూలప్రమాణ గ్రంథముల ననుసరించి రచింపబడినది. ఇందు శ్రీ రామకృష్ణుని జీవితాంశములు మృదుమధురమగు తేటతెనుగున సమగ్రముగ వివరింపబడినవి. ఢిల్లీ సాహిత్య అకాడెమీ వారిచే ఉత్తమోత్తమ గ్రంథముగ నిర్ణయింపబడినవి.

శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర అద్యంతము ఆత్మవైభవమే. దివ్యవైభవమే. ఇదియొక దెస కావ్యము. ఇంకొకదెస చరిత్రము వెరసి తత్త్వ సంహిత. లేక దివ్య కావ్యము. ఈ శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర శారదాకంఠమున ఓంకారఘంట। రోమాంచముల పంట.

—శ్రీ వేలూరి శివరామశాస్త్రి.

....విమర్శక చక్రవర్తి....కీ. శే. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి శ్లాఘామోదములనందిన మీ పూర్వ గ్రంథముల నిడి రచనావైదగ్ధ్యమున....మించియున్నది. విషయౌదాత్త్యము రచనౌదాత్త్యముగా పరిణమింపుట స్వాభావికమే కదా సిద్ధహస్తుల చేతులతో।

—శ్రీ కందుకూరి మల్లికార్జునం.

It is bound to communicate to the reader the beauty and power of Sri Ramakrishna's life. **—Sri S. Radhakrishnan.**

**Classic...authentic...It will be a very valuable addition to the Telugu literature. —The Hindu.**

పుటలు : 478+XXX వెల : రూ. 10–00

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూర్, మద్రాసు-600 004.

# శ్రీ రామకృష్ణప్రభ

సంపుటము 35 | 1978 - నవంబరు | సంచిక 11

## విషయసూచిక



## శ్రీ రామకృష్ణప్రభ వివరములు

శ్రీ రామకృష్ణప్రభ (ఆధ్యాత్మికమాసపత్రిక) ప్రతి ఇంగ్లీషు నెల మొదట వెలువడుచుండును. శ్రీ రామకృష్ణ మఠము, మద్రాసు-4 నుండి ఈ పత్రిక 1944 సం॥నుండి అవిచ్ఛిన్నముగా వెలువడుచున్నది. ఈ పత్రికకు చందాదారులు కాగోరువారు ఏ నెలనుండియైనను చేరవచ్చును. జూలైకి ముందు చందా కట్టినవారు జనవరినుండి, జూలైకి తరువాత చందా కట్టినవారు జూలైనుండి చందాదారులుగా పరిగణింపబడుదురు. ఒక సంవత్సరచందా ఏడు రూపాయలు. జీవితచందా నూటయిరూపాయలు. చందా పైకమును ముందుగానే మనియార్డరు ద్వారా గాని పోస్టలుఆర్డరు ద్వారాగాని చెల్లింపవలసియుండును. చందా ముగిసినపుడు ఆ సంగతి చందాదారులకు ఉత్తరముల ద్వారా తెలియజేయబడును. చందాదారులుగా చేరినవారు తమ చందానంబరును గుర్తుంచుకొని ఉత్తరప్రత్యుత్తరములందు దానిని ఉదాహరించుచుండవలెను.

మేనేజరు, శ్రీ రామకృష్ణప్రభ, శ్రీ రామకృష్ణమఠము, మద్రాసు-4

# శ్రీమద్భగవద్గీత

అనువాదకులు:

శ్రీ నిర్వికల్పానందస్వాములవారు

ఇది మూలశ్లోకములు, ప్రతిపదార్థము, ధారాళమగు అనువాదము, శ్రీధరీయ టీకా సారము, విశేషాంశములు, సానువాదగీతాపాఠక్రమము, ధ్యానమాహాత్మ్యములు, సమభావాత్మకములగు ఉపనిషద్వాక్యసూచిక, వేదాంతసూత్రసూచిక, గీతాశ్లోకసూచిక, శబ్దానుక్రమణిక—ఇన్నిటితో విరాజిల్లుచున్నది.

భక్తులకు సాధకులకు మాత్రమే కాక కళాశాల విద్యార్థులకు సైతము ఉపయుక్తమయిన దివ్యగ్రంథము.

పుటలు: 58+400 (నవమ ముద్రణము) వెల: రూ. 10-00

## భక్తియోగము

అనువాదకులు:

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీవివేకానందస్వాములవారిందు విపులముగా ప్రదర్శించియున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

(ఏడవ కూర్పు)

(121+4 పుటలు) వెల: రూ. 4-00

## కర్మయోగము

అనువాదకులు:

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ స్వాములవారు కర్మయోగతత్త్వమును అరటిపండొలిచినట్లు విశదీకరించియున్నారు. కర్మమెటుల మోక్షసాధనమో స్పష్టీకరించియున్నారు.

(అష్టమ ముద్రణము)

(146+8 పుటలు) వెల: రూ. 4-00

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004



ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 35 | 1978 - నవంబరు | సంచిక 11

## ప్రార్థన

ఋతగ్ంసత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగళమ్
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమః.

ఋతం సత్యం = అత్యంత సత్యమైన, పరంబ్రహ్మ = పరబ్రహ్మము, (భక్తానుగ్రహార్థము) కృష్ణపింగళం = కృష్ణపింగళాకారము, పురుషం = పురుషరూపము (కలది అగుచున్నది). ఊర్ధ్వరేతం = ఊర్ధ్వరేతస్కుడును, విరూపాక్షం = మూడునేత్రములు కలవాడును (అగు పరమేశ్వరుని భావించి), విశ్వరూపాయ = సర్వజగదాత్మకుడగు ఆ పురుషునికొఱకు, నమోనమః = నమస్కారములు.

పారమార్థికసత్యస్వరూపమైన పరబ్రహ్మము భక్తానుగ్రహార్థము ఉమామహేశ్వరాత్మకమగు రూపముకలదియగుచున్నది. ఆ రూపము కృష్ణపింగళవర్ణము కలిగియుండును. మహేశ్వరసంబంధమగు దక్షిణభాగమునందు కృష్ణవర్ణమున్నూ, ఉమా సంబంధమగు వామభాగమునందు పింగళవర్ణమున్నూ కలిగియుండును. ఊర్ధ్వరేతస్కుడును, త్రినేత్రుడును, జగదాత్మకుడును అగు ఆ మహాదేవునకు నమస్కారములు.

# వివేకానందవాణి

హిందూధర్మమును గూర్చి యొక వ్యాసము వ్రాసితిని. ఆ బెంగాలీభాష మిక్కిలి కఠిన పాకమునబడినదని మీలో కూడా కొందఱు సణుగులాడుచున్నారు. ఇతర వస్తువులన్నిటి వలెనే, భాషయును, భావములునుకూడా కాల క్రమమున నిర్జీవములై, వైవిధ్యలోపముచే విసుగు పుట్టింపనారంభించునని నా యభిప్రాయము. అట్టి దశ ఈ దేశమున కిప్పుడు దాపురించినట్లున్నది. కాని శ్రీరామకృష్ణదేవుని ఆగమనముతో భాషారూపమును, భావసరణి యను నూత్నమార్గములు పట్టనారంభించినవి. సర్వమును ఇప్పుడు నూతనాకారములలోనికి మార్పవలసి యున్నది. ఇప్పటి బోధనమంతయు నూత్న ప్రతిభాముద్రను దాల్చి యుండవలెను. ఇందులకు ఉదాహరణము:

సన్న్యాసులెట్లు క్రమక్రమముగా పూర్వ మార్గములను వదలి, నూత్నమార్గములను అవలంభించుచున్నారో చూడుము. ఆ మార్పును సంఘము తీవ్రముగా ఆక్షేపించు చున్నది— కాని ఆ ఆక్షేపకార్యమేమైన ఫలప్రదమగు చున్నదా? అందుచే మేము భీతిలుటయులేదు. నేటి సన్న్యాసులు మతప్రచారార్థము దూర దేశముల కేగవలయును. వారు పూర్వకాలపు సాధువులవలె భస్మోద్ధూళితములును, అర్ధాచ్ఛాదితములును అగు దేహములతో బయలువెడల జూచినచో, వారిని ఓడలమీదికే ఎక్కించుకోరు; ఎట్లో ఆ వేషముతో దేశాంతరములు చేరినను, అచట చెఱసాలలో నుండవలసి యుండును. దేశ, కాల, నాగరికతలలోని మార్పుల కనుగుణముగా సర్వమును కొంచె కొంచెము మార్పులొందవలెను.

ఇక మీదట బెంగాలీలో వ్యాసములు వ్రాయవలెనని నా సంకల్పము. భాషాపాండితీ ధురీణులు ఆ రచనావైఖరి నాక్షేపింపవచ్చును. కాని అదంతయు లక్ష్యింపక నేను బెంగాలీభాష నొక క్రొత్తమార్గమును పట్టించెదను. నేటి బెంగాలీ రచయితలు తమ వ్రాతలను క్రియా పదములతో నింపుదురు. వాక్యబలము ఇందుచే క్షీణించును. క్రియాపదభావములను విశేషణ పదములతో ప్రకటింపగలమేని, వాక్యబల మధికమగును. భాషలో క్రియాపదములవలని ఫలమేమో ఎఱుగుదువా? అవి భావప్రవాహ మును ఆపును; కావున క్రియాపద ప్రయోగ బాహుళ్యము, శ్వాసవేగమువలె, దుర్బలతా చిహ్నము. భాషయందు ప్రాణబలము తఱిగి పోయినందులకు ఇదిగుర్తు. బెంగాలీభాషలో చక్కగా ఉపన్యసించుట అసాధ్యముగా నుండుటకు ఇదియే కారణము.

వశ్యవాక్కు అగువాడు (భాష తన స్వాధీన ములో కలవాడు) తన తలపులను మాటి మాటికి విచ్ఛిన్నతనొందనీయడు. పప్పు, అన్నము తిని మీ శరీరతత్త్వము దుర్బలమై పోయినది. ఆహారమునందును, జీవిత విధానము లందును, భావసరణియందును, భాషయందును బలము కలుగవలెను. ప్రాణశక్తి అన్నిటను, సర్వనాళములలోని రక్తమునందును, వ్యాపించినచో, మానవునికి ఒక నవీన జీవనశక్తి స్పందించుచున్నట్లు గోచరించును. అప్పుడుగాని ఈ దేశజనులిప్పటి జీవనవిధానమునగల కష్టములను దాటి సజీవులై నిలువజాలరు. లేనిచో ఈ దేశమును ఈ జాతియు మృత్యువు వాత అచిరకాలముననే కూలి అదృశ్యమై పోవుట సిద్ధము.

# శ్రీ రామకృష్ణ కథామృతము
## (రెండవ భాగము)

అనువాదము: ప్రశ్యామాప్రాణ

నాటకము చూచుటకు శ్రీరామకృష్ణులు బండిలో కలకత్తాకు పయనమైరి. రాత్రి 8-30 గంటలకు బీడన్ స్ట్రీటులోగల స్టార్ థియేటరు ఎదుట శ్రీరామకృష్ణులబండివచ్చి నిల్చెను. మాస్టరు, బాబూరాం, మహేంద్రముఖర్జి మొదలగు భక్తులు వారితోనుండిరి. ఇంతలో నాటకశాల మేనేజరు శ్రీ గిరీష్ ఘోష్ కొందరు సహచరులతోబాటు బండిదగ్గరకువచ్చి శ్రీరామకృష్ణులను ఆహ్వానించి గౌరవించిరి. వారిని మేడమీదికి తీసికొనిపోయి నైరుతీ మూలగల బాక్సులో కూర్చుండబెట్టిరి. చైతన్య లీల నాటకము చూచుటకు రామకృష్ణులు వచ్చిరని గిరీష్ బాబు చాల ఆనందించెను.

రామకృష్ణులు నాటకశాల కలయజూచి చిన్న బాలునివలె ఆనందించుచు మాస్టరుతో నవ్వుచూ ఇట్లనిరి: "ఆహా! ఎంత చక్కగా ఉన్నది. ఇక్కడికి రావడము ఎంతో మంచి దయింది. ఇంతమంది జనం ఒకచోట గుమికూడి యుండుట చూచి నాకు సంతోషము కలుగుచున్నది. ఇటువంటి చోట్లలో భగవంతుడు పలురూపములతో వెలయుచుండుటను యథార్థముగ దర్శింతును.

ఇంతలో తెరఎత్తిరి. వెంటనే ప్రేక్షకుల చూపులు రంగస్థలముపై కేంద్రీకృతములైనవి.

మొదటిసీను:— అడవిలో వివేకము, వైరాగ్యము, భక్తి-వీరల సంభాషణ.

భక్తిఇట్లుపలికెను: గౌరాంగుడు నవద్వీపములో జన్మించెను. అందుచే విద్యాధరులు, మునులు, ఋషులు మారువేషములతో గౌరాంగుని దర్శించుటకు వచ్చుచున్నారు.

> దేఖో దేఖోనా విమానే విద్యాధరగణ ఆశితేచే హరిదరశనే
>
> దేఖో ప్రేమానందే హోయియా విభోర్ ముని ఋషి ఆశిఛే సకల

తరువాత విద్యాధరులు మునులు, ఋషులు కలిసి స్తుతిచేయుదురు.

> పురుషులు: కేశవ కురు కరుణా దీనే కొంజకొననవిహారీ
> స్త్రీలు: మాధవ మనమోహన మోహనమురళీధారీ
> అందరూకలసి: హరిబోల్ హరిబోల్ హరిబోల్
> పురుషులు: వ్రజకిశోరా కాళీయహరా కాతర భయ భంజనా
> స్త్రీలు: నయనబాంకా శిఖిపాఖా రాధికాహృదయ రంజనా
> పురుషులు: గోవర్ధనధారణా వనకుసుమభూషణా దామోదరా
> స్త్రీలు: శ్యామ రాసరసవిహారీ
> అందరూకలసి: హరిబోల్ హరిబోల్ హరిబోల్

ఇంకొకసీను: జగన్నాథమిశ్రుని ఇంటికి అతిథి వచ్చును. బాలకుడగు నిమాయి తన స్నేహితులతో ఆనందముగా తిరుగుచు పాట పాడుచుండును.

> కహాఁమేరా బృందావనే – కహాఁయశోదామాయీ–
> కహాఁమేరా నందపితా – కహాఁబలరాం భాయి।
> కహాఁమేరీ ధవళీ శ్యామలా – కహాఁమేరీ మోహన మురళీ।
> శ్రీదామ సుదామ–రాఖాలగుణ కహాఁమైపాయి।
> కహాఁమేరీ యమునాతట–కహాఁమేరీ బంశీవట।
> కహాఁగోపనారీమేరీ–కహాఁ హమారా రాయీ॥

అతిథి నిమీలితుడై దేవునికి నైవేద్యము పెట్టుచుండును. పరుగెత్తుకొనుచు పోయి నిమాయి ఆ నైవేద్యము తినును. ఆ బాలుడు సాక్షాత్ భగవంతుడని అతిథి తెలుసుకొని దశావతారస్తోత్రము పఠించి నిమాయిని

సంతోషపరచును. తరువాత ఆ అతిథి శెలవు గైకొని మరలునపుడు ఇట్లు స్తుతించును.

జయనిత్యానంద గౌరచంద్ర జయభవతారణ।
అనాథత్రాణ జీవప్రాణభీతభయవారణ॥
యుగే యుగే రంగ నవలీల నవరంగ।
తాపహారీ ప్రేమవారివితర రాసరసవిహారీ।
దీనఆశ-కలుషనాశ దుష్టత్రాసకారణ॥

మరొక రంగము :—

నవద్వీపములో గంగాతీరమున గంగా స్నానములు చేసిన తరువాత బ్రాహ్మణులు, స్త్రీలు, పురుషులు అందరు నదిఒడ్డున కూర్చొని పూజలు చేయుచుందురు. నిమాయి నైవేద్యము తీసుకొని తినుచుండును. అంత ఒక ణుడు కోపముతో మండిపడి "ఓరీ! తిండిపోతు రామన్నా! విష్ణు పూజానైవేద్యము తీసుకొని తినుచున్నావా? నీ వంశము నాశనముగాను!" అని తిట్టును. నిమాయి నైవేద్యము మరికొంత తీసుకొని పలాయనమగును. ఆయూరి యాడు వారికి నిమాయి గారాబుబిడ్డడు. ఆ పిల్లవానిని బ్రాహ్మణుడు ఆ విధముగ తిట్టి తరిమివేసి నందులకు వారికి కష్టముగా నుండును. వారు నిమాయితో 'నాయనా నిమాయి! ఇక్కడకు రా' అని పిలుతురు. నిమాయిరాడు. ఆ స్త్రీల లో ఒకావిడకు నిమాయిని రప్పించగల రహస్యము తెలియును. ఆమె వెంటనే 'హరిబోల్ హరిబోల్' అని పాడనారంభించును. అది విని నిమాయికూడ 'హరిబోల్ హరిబోల్' అని పాడుచు వారి దగ్గరకు వచ్చును.

మరొక రంగము :—

నిమాయి ఉపనయనము-వడుగు వేషములో బాల బ్రహ్మచారియగు నిమాయి నిల్చి యుండును. శచీదేవియు ఇరుగు పొరుగువారు కూడ అచ్చటనే యుందురు. 'భవతి భిక్షాం దేహి' అని నిమాయి భిక్ష అడిగి ఈ పాట పాడును.

ఓగో భిక్షాదే।
ఆమి నూతన జోగీఫిరి కెందేకెందే
ఓగో! వ్రజవాసీ తోదేర్ భాలోబాషి।
ఓగో! తాయితో ఆశి జేఖోమా ఉపవాశి
జేఖోమా ద్వారే జోగీబోలే 'రాధే రాధే'
చేలాగెలే జేతే హోబే ఫిరే।
ఏకాకీ థాకిమా యమునాతీరే
ఆంఖినీరే మిషే నీరే
చోలే ధీరేధీరే ధారా మృదునదే

[భిక్ష పెట్టవమ్మా! క్రొత్త బ్రహ్మచారిని తల్లీ! ఓ వ్రజవాసినులారా? మిమ్ములను నేను ప్రేమించుచున్నాను. నేను ఉపవాసినై యున్నాను. 'రాధే రాధే' యని నీవాకిట ఒక యోగి వచ్చియున్నాడమ్మ! ప్రొద్దుపోవు చున్నది. తిరిగి పోవలెను. ఒంటరిగ యమునా తీరమున నివసింతును. అక్కడ భగవన్నామ స్మరణవలన కలిగిన కన్నీరు ధారగా కార్చు చుందును.]

తరువాత అచ్చట ఉన్నవారందరు వెడలి పోవుదురు. నిమాయి ఒంటరిగా నిల్చియుండును. దేవతలు, బ్రాహ్మణస్త్రీపురుషుల వేషము లతో వచ్చి స్తుతి చేయుదురు.

పురుషులు : చంద్రకిరణ అంగే నమోవామనరూపధారీ
స్త్రీలు : గోపీగణ మనమోహన మంజుకుంజచారీ
నిమాయి : జయరాధే-శ్రీరాధే
పురుషులు : వ్రజబాలకసంగ-మదనమానభంగ
స్త్రీలు : ఉన్మాదినీవ్రజకామినీ-ఉన్మాదతరంగ
పురుషులు : దైత్యఛలన నారాయణ-సురగణ భయహారీ
స్త్రీలు : వ్రజవిహారీ గోపనారీ-మన-భిఖారీ
నిమాయి : జయరాధే-శ్రీరాధే

—సశేషము.

# స్మితపూర్వాభిభాషి

## సదాశివం

'నీవు మాట్లాడనిరోజు ఒకటైనా ఉన్నదా నీ జీవితంలో?' అని ఎవరైనా అడిగితే ఏమి సమాధానం చెప్పగలం మనం?

'అయ్యో! ఇట్లడిగావేమిటి? మాట్లాడకుండ రోజు ఎట్లా గడుస్తుంది? నీ జీవితంలో మాట్లాడని గంటలెన్ని జాగ్రదవస్థలో? అని అడిగారంటే బాగుంటుంది. యోచించి చెప్పగలం' అన్న సమాధానమే మనం ఇవ్వగలం.

ఎంత వయస్సువచ్చినా నాలుకకు రుచి గ్రహించే శక్తి క్షీణించదట! అట్లాగే ఈ నాలుకకు మాట్లాడేశక్తి లోపించదేమో! వృద్ధాప్యంవల్ల కంఠస్వరం హీనమైతే కావచ్చుగాని వాగ్వ్యాపారానికి మాత్రం లోటేమీ ఉండదు. నాలుకకు ఈ శక్తిఉంటే ఉండనీండి కాని యథేచ్ఛగా మాట్లాడటంవల్ల చాల నష్టం ఉంది.

ధ్యానం జపం చదువు అనే వ్యాసంగం పెట్టుకున్నవాళ్ళకు ఒక విషయం అనుభవానికి వచ్చిఉండవచ్చు. ఎక్కువగా మాట్లాడినరోజు జపధ్యానస్వాధ్యాయాల్లో ఏకాగ్రత కుదరదు అన్నదే ఆ అనుభవైక విషయం. కోపతాపాలకు రాగాద్వేషాలకు లోనయి చేసిన ప్రలాపాలవల్ల ఏకాగ్రత మఱీ దెబ్బతింటుంది అనేది మఱింత స్పష్టం.

ఈ మాటలవల్లకలిగే నష్టాన్ని నివారించే ప్రయత్నంచేసేవాళ్ళలో కొందరు చాల చిత్రమైనవాళ్ళున్నారు. వాళ్ళు మాట్లాడటమే మాని వేస్తారు. కాని వ్యవహారం జరగాలనే! భావ ప్రకటనకు వాళ్ళు చేసే చేతిసంజ్ఞలతో ముఖ వికారాలతో ఎదుటివాళ్ళు సతమతమవాల్సిందే. ఈ చిట్కాలు పనిచేయలేకపోతే పలకమీద బలపంతోనో, కాగితంమీద పెన్సిలుతోనో వ్రాసి చూపిస్తారు. ఇట్లాంటివ్రతం చేపట్టి ఇతరులను ఇబ్బందిపాలుచేసే వీళ్ళను యముడు ఇట్లా దండించినా ఆశ్చర్యపడాల్సిన అవసరం లేదు:-"ఓ మూర్ఖులారా! మీ కెటువంటి శిక్ష విధించాలో మా రాజ్యాంగచట్టంలో వెదకి వెదకిచూచినా ఎక్కడా కనపడలేదు. ఈ చిన్న విషయానికి మా రాజ్యాంగచట్టం సవరించమని కోరుతూ బ్రహ్మదేవునిదగ్గఱ కెట్లా వెళ్ళను? నేనే నా బుద్ధికందినంతవఱకు ఊహించి మీకీ శిక్ష విధిస్తున్నాను. పదివేలసంవత్సరాలు మీరు ఎడతెగకుండ వాగుతుండవలసింది. ఇదే మీకు శిక్ష."

'అయితే ఇట్లాంటి మౌనవ్రతం తప్పా?' అని మీరడగవచ్చు. తప్పు, తప్పుకాదు అని సమాధానం. సర్వసంగపరిత్యాగియై జన సంచారంలేని ఏ అడవులకో కొండలకో పోయి ఉండగలిగేవాళ్ళకీవ్రతం తప్పుకాదు. ప్రజా సంఘాన్ని వదలిపెట్టే స్థితి అందుకోలేనివారికీ వ్రతం తప్పు అని సమాధానం.

సరే మాట్లాడాల్సిన అవసరమూ ఉంది. మాట్లాటలవల్ల నష్టమూ ఉంది. ఈ సమస్యా పరిష్కారానికి ఏమి ఉపాయం?

'వేదమాత ఏమిచెప్పింది? గీతాచార్యుడు ఏమి చెప్పాడు? రాముడు యుధిష్ఠిరుడు ఎట్లా ప్రవర్తించారు?' అని పరిశీలించడమేగదా మన బోటి ఆస్తికులకున్న ఉపాయం.

గీతాచార్యుడు చెప్పనే చెప్పాడు పదిహేడో అధ్యాయం పదిహేనో శ్లోకంలో "అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్" అని. ఇతరులతో మాట్లాడేటప్పుడు మన మాటల్లో ఈ నాలుగు లక్షణాలు కలిసి ఉండాలట: 1. మన మాటలు ఇతరులకు దుఃఖం

కలిగించరాదు, 2. సత్యమైనదిగా ఉండవలెను, 3. ప్రియమైనదిగా ఉండవలెను, 4. హితం కలిగించేదిగా ఉండవలెను. ఈ నాలుగు లక్షణాలతో కూడిన మాటలు మనలో ఎందరం మాట్లాడగలం? అటువంటి ఒక్కమాట మనం ఊహించేలోపలే ఉదయించినసూర్యుడస్తమించునేమో! ఏమిగతి? కృష్ణుడి ఆదేశం పాటించాలంటే ఆ విచిత్రవ్యక్తుల్లాగా మౌనంగా ఉండిపోవల్సిందేనా? అంత పట్టింపు మనకొద్దు. ఎందుకంటే శంకరాచార్యులు మన పనిని కొంత తేలిక చేశారు. ఆ శ్లోకపాదంలో ఉన్న 'చ' అనే అక్షరాన్ని ఊతగాతీసికొని ఆయన ఇట్లా వ్యాఖ్యానించారు: "ఇతరులకు సత్యవాక్యం చెప్పేటప్పుడు తక్కిన మూడుగుణాల్లో కనీసం రెండైనా ఆ సత్యవాక్యంలో కలిసిఉండాలి; అట్లాగే ప్రియవాక్యం చెప్పేటప్పుడు తక్కిన మూడుగుణాల్లో కనీసం రెండైనా ఆ ప్రియవాక్యంలో కలిసిఉండాలి; అట్లాగే అనుద్వేగకరంవాక్యం చెప్పేటప్పుడు తక్కిన మూడుగుణాల్లో కనీసం రెండైనా ఆ అనుద్వేగకరవాక్యంలో కలిసిఉండాలి; అట్లాగే హితవాక్యం చెప్పేటప్పుడు తక్కిన మూడుగుణాల్లో కనీసం రెండైనా ఆ హితవాక్యంలో కలిసిఉండాలి." ఇంత వివరించి చెప్పికూడ తృప్తిపడక, ఆయన మాటలు ఏవిధంగా ఉండాలి అని చూపడానికి చివర ఒక ఉదాహరణవాక్యం కూడ ఇచ్చారు. "శాంతోభవ వత్స, స్వాధ్యాయం యోగం చానుతిష్ఠ, తథా తే శ్రేయో భవిష్యతి ఇతి." (నాయనా శాంతుడవగుము, చదువుసంధ్యలలో శ్రద్ధవహించుము దానివల్ల నీకు మంచి కలుగుతుంది.)—మన మాటలన్నీ ఈ ధోరణిలో ఉండవలెనని అభిప్రాయం.

భగవానులైన కృష్ణశంకరులు ఆదేశాన్ని విన్నాం. ఇక ఈ ప్రసంగం ముగించేముందు శ్రీరామచంద్రుని మాటలతీరును కూడ గమనిస్తాం. అయోధ్యాకాండ మొదటి రెండుసర్గల్లో వాల్మీకి రామునిగుణగణాలను మధురాతిమధురంగా వర్ణిస్తారు. మళ్ళీమళ్ళీ చదవాలనిపించేటంత గొప్పగా ఉన్నవి ఆ రెండుసర్గలు. రాముని మాటలతీరును వర్ణిస్తూ వాల్మీకి ఆ రెండుసర్గల్లో కొన్ని విశేషణాలు చెప్పారు. వాటినే ఇక్కడ మనం జ్ఞాపకం చేసుకోబోతున్నాం.

(1) స్మితపూర్వాభిలాషి యట రాముడు. ఎవరినైనా చూచినపుడు తానే మొదట పలకరించునట. ఆ పలకరింపుకూడ చిఱునవ్వు మోముతోనేనట.

(2) మృదుపూర్వం తు భాషతే, ఉచ్యమానోఽపి నోత్తరం ప్రతిపద్యతే: ఎవరైనా తనతో పరుషంగా మాట్లాడినా తాను తిరిగి పరుషంగా మాట్లాడక మృదువుగానే మాట్లాడునట.

(3) మధురాభాషీ పూర్వాభాషీ ప్రియంవదః మధురంగా ప్రియంగా మాట్లాడునట.

(4) సాంత్వయితా కోపావేశంలో ఉన్నవాళ్ళకు, దుఃఖావేశంలో ఉన్నవాళ్ళకు స్వస్థత కలిగించే తిన్నని ఊఱడింపుమాటలు చెప్పగలవాడట రాముడు.

(5) ఉత్తరోత్తరయుక్తా చ వక్తా వాచస్పతిర్యథా ఉత్తరప్రత్యుత్తరముల నిచ్చుటలో సరస్వతీనాథునికిగల వాక్కౌశలము రామునికి కలదట.

(6) సత్యవాదీ చ రాఘవః రాముడు సత్యమునే మాట్లాడునట.

(7) న అవిరుద్ధకథారుచిః ధర్మవిరుద్ధములైన మాటలు రాముడు చెప్పడట.

(8) న చ విగృహ్యకథారుచిః వాక్కలహములో దిగుటకు ఇష్టపడనివాడట రాముడు.

ఈ విశేషణాలేకాక ఇంకా మఱికొన్ని విశేషణాలు రామాయణంలో అక్కడక్కడ ఉన్నవి. అవికత్థనుడన్న విశేషణంకూడ చెప్ప

బడినట్లు జ్ఞాపకం. అవికత్థనుడంటే తన గొప్పలు తానే చెప్పుకోనివాడని అర్థం. 'నేను అది చేశాను ఇది చేశాను అది చేయగలను ఇది చేయగలను నేను అటువంటివాణ్ణి ఇటువంటి వాణ్ణి' అని చెప్పుకునే అలవాటున్నవాళ్ళనే వికత్థనులంటారు. ప్రతి ఉపాసనామంత్రంలో 'నమః' శబ్దం ఉన్నట్లుగా ఈ వికత్థనుల ప్రతి వాక్యంలో 'నేను' శబ్దం ఉంటుందన్నమాట. రాముడటువంటివాడు కాడని అవికత్థన విశేషణం చెప్తుంది.

'నాయకుణ్ణి వర్ణించాలని కవులు ఏవో అతిశయోక్తులు చెప్తుంటారు. వాటిని ఆసరాగా తీసుకొని ఇంతదూరం ఎందుకయ్యా చర్చించావు? ఈ అతిశయోక్తులకు పూర్తివిరుద్ధంగా మీ రాముడు మాట్లాడినచోట్లు నూటికిపైగా కావలసినా నేను రామాయణకావ్యంలో చూపించగలను. ఏమంటావు?' అని ఎవరైనా ఇక్కడ మనలను ఆక్షేపించవచ్చు. మనం ఎలా జవాబివ్వాలంటే: "అయ్యా మహానుభావా! నీవు ఊహించే విరుద్ధప్రవర్తనాదోషం రామునిలో ఎక్కడా లేదు. అది నీలోనే-నీ చదువులో నీవు అర్థంచేసుకొనేతీరులో నీ సంస్కారంలో నీ ఆలోచనాధోరణిలో ఉంది" అని.

మన ఈ సమాధానాన్ని సమర్థించుకొనేందుకు అయోధ్యాకాండ పందొమ్మిదవ సర్గం నుండి ఒక శ్లోకాన్ని తీసుకొందాం. రాముడు కైకేయితో ఇలా అంటాడు:

> నాహమర్థపరో దేవి లోకమావస్తుముత్సహే।
> విద్ధి మామృషిభిస్తుల్యం విమలం ధర్మమాస్థితమ్॥

"అమ్మా! నేను ధనానికి దాసుడనుగాను. ఇక్కడుండి రాజ్యమేలాలనే కోరిక నాకు లేదు. విమలమైన ధర్మమే నాకు ప్రధానం. ఋషులతో సమానుడని నన్ను తెలుసుకో."

కంఠోక్తిగా తన గొప్పను తానే చెప్పుకొని రాముడిక్కడ వికత్థనదోషానికి పాల్పడినట్లు పైకి కనిపిస్తుంది. కాని సందర్భాన్ని పరిశీలించి చూస్తే రాముని మాతృవత్సలహృదయమే ఇక్కడ ప్రకటమైనట్లు మనకు కనపడుతుంది. సందర్భం ఇది:

కైకేయి రామునితో "మీ తండ్రి నిన్ను అడవులకు పొమ్మంటున్నారు. నీకు జరగవలసిన అభిషేకం భరతునికి జరుగుతుంది" అంటుంది. "సంతోషంగా నేను అడవులకు వెళ్తాను. దూతలనుపంపి త్వరగా భరతుణ్ణి రప్పించి పట్టాభిషేకం చేయండి" అంటాడు రాముడు. "భరతుణ్ణి రప్పించేపని మేము చూచుకొంటాంగాని నీవు త్వరగా ఇక్కడనుండి వెళ్ళిపోవాలి. నీవు వెళ్ళనంతవఱకు మీ తండ్రి స్నానం చేయరు భోజనం చేయరు" అంటుంది కైకేయి.

'అడవికి పోవాలని పైకిచెప్పినా రామునికి లోలోపల రాజ్యకాంక్ష ఉన్నట్లుంది. అందుకే కాబోలు భరతుణ్ణి త్వరగా రప్పించండి అని అంటున్నాడు. భరతుడు దీనికి ఒప్పుకోడుగనుక రాజ్యం తనకే దక్కుతుంది అనే అభిప్రాయంతో ఉన్నట్టుంది రాముడు. దీనికొంతమాత్రం అవకాశం ఇవ్వరాదు'-అన్న నిగూఢభావం కైకేయి ఆమాటలవెనుక దాగిఉంది. రాముడీ విషయం గ్రహించాడు. "తనను అపార్థం చేసుకొనిగదా తల్లి ఇట్లా హృదయాంతరంలో అలజడిపాలవుతూంది. ఆవిడ సందేహాన్ని తొలగించి 'శాంతహృదయిని'గా చేయాల" నే సంకల్పంతోనే రాముడు సూటిగా శక్తివంతంగా క్లుప్తంగా తన స్వభావాన్ని ఇట్లా ప్రకటించవలసివచ్చింది.

> నాహమర్థపరో దేవి। లోకమావస్తుముత్సహే.
> విద్ధి మామృషిభిస్తుల్యం విమలం ధర్మమాస్థితమ్.

# భగవాన్ రమణమహర్షితో నా అనుభవములు

శ్లిష్టా సుబ్బారావు

1936లో మొదటిసారి శ్రీ రమణమహర్షిని గురించి నాకు మొదటి గురువైన శ్రీ నేపతి రామారావుగారి ద్వారా వింటిని. వీరు రమణ మహర్షి చేసిన అద్భుతకృత్యమును గురించి జరిగిన కథ చెప్పిరి. ఒకప్పుడు రమణాశ్రమములోనున్న పోస్టుమాస్టరుగారి గదిలోకి ఒక త్రాచుపాము వచ్చెనట. చుట్టుప్రక్కలనున్న పదిమంది చేరి దానిని చంపజూచిరి. ఇంతటిలో మహర్షి ఆ దారినిపోవుచు గదిలోనికి వెళ్ళి "మిమ్ములజూచి అందరును భయపడుచున్నారు. ఇక్కడనుండి మీరు బయటకు పోవుటమేలు" అన్నారట. వెంటనే పాము బయటకు పోయెనట. ఈ సంఘటన చెప్పి రామారావు పంతులు గారు మహర్షి ద్వార నా కండ్లజబ్బు నయము కావచ్చునని అనిరి.

వెంటనే నేను నా పరిస్థితులన్నిటిని తెలియ జేయుచు రమణమహర్షికొక జాబు వ్రాసితిని. అందు నా ఆర్థిక శారీరకస్థితిగతులను వివరించి నేత్రరోగము కుదిరి యేదైన జీవనోపాధి దొరికినగాని, గత్యంతరము లేదని సూచింతిని. అంత మహర్షి ఆశీర్వాదములతో త్వరలోనే జవాబువచ్చెను. మరింత ఆందోళన హెచ్చెను. స్వయముగా మహర్షిని దర్శించి ఉన్న పరిస్థితులు వారితో ముఖాముఖిని మనవిచేసినచో శీఘ్రముగ లాభించునేమోయని తోచినది. 1-6-1936 న నా భార్య నేను అమలాపురము నుండి బయలుదేరి మూడవనాటి ఉదయము రమణమహర్షి ఆశ్రమము చేరితిమి. అక్కడ వంటయింటిలో సేవజేయు శాంతమ్మ అను ఆమె కలసెను. ఆమెకు తెలుగువచ్చును. మహర్షితో ప్రాపంచిక విషయములను గురించి ముచ్చటింపవచ్చునా అని ఆమె నడుగ "మాటలాడవచ్చునుగాని, గుడిలోనున్న అరుణాచలేశ్వరునికి చెప్పుకొనుట యెంతో ఈ రమణమహర్షితో చెప్పుకొనుట కూడ అంతే" అని ఆమె బదులు చెప్పెను. ఉదయము 8 గంటలకు మహర్షి హాలులో కూర్చున్నప్పుడు మేముపోయి సాష్టాంగ నమస్కారములు చేసితిమి. అంత ఆయన. "ఈ మధ్య అమలాపురమునుండి యిటువంటి విషయములనే ఒకరు వ్రాసిరి" అనిరి. "నేనే ఆ జాబు వ్రాసినదని" నేను నుడివితిని. అప్పుడు మహర్షి "అంతర్దృష్టి కలిగినప్పుడు బాహ్యదృష్టి దానంతట అదే నయమగును" అనిరి. అంత నేను అంతర్దృష్టి అనగానేమి అని ప్రశ్నించితిని. బాహ్యదృష్టి లేకుండుటయే అంతర్దృష్టి అని మహర్షి ప్రత్యుత్తరమిచ్చిరి. అంధత్వమని దీని అర్థముకాదు. కాని యోగవాసిష్ఠమందు చెప్పిన దృశ్యమార్జనమని తరువాత తెలిసికొంటిని. మనస్సు ప్రాపంచిక వ్యామోహమును వీడి జగత్తు కనుపించుచున్నను స్వప్నదృశ్యమువలె లేనట్లుండుటయే అని మహర్షి వివరించిరి. దానితో నాకు బాహ్యదృష్టిపైనుండు వ్యామోహము చాలవరకు తగ్గి అంతర్దృష్టిని సాధించవలెనని యెంచితిని. అప్పటినుండియు నా ప్రయత్నములన్నియు ఆ లక్ష్యముపైననే కేంద్రీకరింపబడినవి.

అక్కడి భక్తులు నన్ను మహర్షి సాన్నిధ్యమందుండుమనియు దాని వలన ఎంతో లాభించుననియు చెప్పిరి. సాయంకాలం వరండాలో మహర్షి కూర్చున్నప్పుడు "నన్నుండి పొమ్మన్నచో ఇక్కడే ఉండెద"నంటిని. కాని మహర్షి ఎప్పుడును అంటక ముట్టక సమాధానమిచ్చుట వాడుకగాన "ఏది ఎట్లు కావలెనో అట్లగును"

అని బదులు చెప్పిరి. నా ఆర్థికపరిస్థితులంతగా అనుకూలించనందున మూడు రోజులు మాత్రమే తిరువణ్ణామలై లోనుండి పాండిచేరిలోని, అరవిందాశ్రమమును తిరుపతి వేంకటేశ్వరస్వామిని దర్శించి అమలాపురము తిరిగి చేరితిమి. ఇంటికి వెళ్లినప్పుడు కొన్ని ఫోటోలు, పుస్తకములు రమణాశ్రమమునందు కొంటిని.

ఇంటివద్ద రమణచరిత్రమును చదివి ప్రతి నిత్యము సక్రమముగ ధ్యానము చేయుచుంటిని. కొన్నాళ్ళిట్లు జరుగుగా తీవ్రత హెచ్చి మహర్షి సన్నిధినే ధ్యానము చేయుచున్నచో శీఘ్రముగా ఫలవంతమై ఆత్మసాక్షాత్కారము అగునని తోచెను. అంత 1-3-1937 న నా భార్యయు, నేనును తిరువణ్ణామలైకు వచ్చి చేరితిమి. ఆడువాండ్రు ఆశ్రమములో రాత్రి ఉండకూడదను నియమముండుటచే మేము ఊరిలో కాపురముండి ప్రతిరోజు ఆశ్రమమునకు పోవుచుంటిమి. ఆ రోజులలో శేషుఅయ్యరు అను వకీలు ఒకరు అచ్చట ఉండెను. ఆయన నేను చదువుకొనేటప్పుడు కాకినాడలో వకీలు వృత్తిలోనుండి తరువాత తిరువణ్ణామలైలో స్థిరపడి సర్వాధికారికి అన్ని వ్యవహారములందును చేదోడు వాదోడుగ నుండి సహాయమొనర్చు చుండెను. కాకినాడలో నుండుటవలన ఆయనకును ఇంటిలోని ఆడువారికిని కూడ తెలుగువచ్చును. మేముండుటకు వారింటిలో ఒక గదిని మాకు అద్దెకు యిచ్చెను. మొదటలో మేము ఉదయము ఆశ్రమమునకు వచ్చి పదిగంటలకు తిరిగి యింటికివెళ్ళి భోజనము వగైరాలైన మీదట రెండుగంటలకు మరల ఆశ్రమమునకు వచ్చి సాయింకాలము ఐదుగంటలు అయిన తరువాత యిల్లుచేరుచుంటిమి. దీనివలన ప్రతి నిత్యము నాలుగుసార్లు రాకపోకలు జరుగుటయు అందు రెండుసార్లు ఎండలో రాకపోకలు చూచి అచటివారి సలహామీద మేము పద్ధతి మార్చుకొంటిమి. ఉదయము 8 గంటలకు మధ్యాహ్నమునకేదో కొంచెము ఫలహారము కూడ ఆశ్రమమునకు తీసికొనిపోయి సాయంకాలము తిరిగి యిల్లు చేరుచుంటిమి. ఇట్లు చేయుటవలన నేనాశ్రమములో నుండి తీవ్రముగ చాలకాలము సాధన చేయుటకు వీలుగానుండెను.

తానొకటితలచిన దైవమొకటి తలచును. నే నెక్కువకాలము రమణాశ్రమమందుండుటకు వీలుపడలేదు. ఆత్మసాక్షాత్కారమగు పర్యంతము అటనుండి కదలకూడదను నా సంకల్పము విఫలమాయెను. ఏప్రిలు 27 న మధ్యాహ్నవేళ నా భార్యయు నేనును అరుణాచలేశ్వరుని గుడి గోపురములన్నియు ఎక్కిదిగివచ్చుసరికి, అమలాపురమునుండి ఒక తంతివార్త వచ్చినది. మా తండ్రిగారికి చాల జబ్బుగానుండుటచే వెంటనే ఇంటికిరమ్మని మా అన్నగారు తంతినిచ్చిరి. అంత మే మాశ్రమమునకుపోయి మహర్షి సెలవు తీసికొంటిమి. జరిగినసంగతి మహర్షితో చెప్పుసమయమున నాకు కంఠము రుద్ధమై కంటివెంట అశ్రుధారలు కారజొచ్చెను. కలత చెందిన మనస్సుతో మహర్షితో "ఆత్మ సాక్షాత్కారమగువరకు నే నిక్కడనుండి వెళ్ళదలచుకొనలేదు. కాని దైవేచ్ఛ వేరుగానున్నదని" వాపోయితిని. అప్పుడు మహర్షి నెమ్మదిగా యిట్లనిరి 'ఆత్మానుభూతి లేకుండ మన మొక్కక్షణమైన నుందుమా; ఉండగలమా? అది మన ఆత్మయే గనుక దాని అనుభూతి లేకుండ ఉంటిమనుకొనుట వెఱ్ఱితనము. అదే అజ్ఞానము లేక విపరీతజ్ఞానము. సాధన అంతయు ఆ అజ్ఞానము తొలగుటకే. అప్పుడు మనము మనముగా మిగులుదుము." ఇష్టములేకున్నను వారిదగ్గర సెలవుగైకొని ఆ రాత్రి బయలుదేరి

అమలాపురము చేరుకుంటిమి. మూడురోజులు మాత్రమే జ్వరపడి 26 ఏప్రిలు మధ్యాహ్నం మా నాయనగారు కాలధర్మమునొందిరి. మా అన్న మరునాడు తంతివార్త నాకిచ్చుటచే మేము నాలుగవరోజు సాయింకాలమచ్చటికి చేరగలిగితిమి. ఆ సంఘటనవలన నా జీవితములో పెద్ద మార్పుకలిగినది. మాకు పిత్రీయమగు ఆస్తిలేదు. మా నాయనగారి ప్రావిడెంటు ఫండులో రు. 240 లు మాత్రము నా వాటాగా వచ్చినది. మా అన్న బుచ్చిరెడ్డిపాలెములో సర్కారు వ్యవసాయశాఖలో పనిచేయుచుండుటచే కుటుంబమంతయు అక్కడనే ఉండుట అవసరమాయెను. నేనుకూడ వారిపై ఆధారపడిఉండుట నాకెంతమాత్రము ఇష్టములేకుండెను. అందువలన ఆధ్యాత్మికసాధన సాగించుటకై తిరిగి నా భార్యతో తిరువణ్ణామలై చేరితిని. ఊరిలో రు. 2 లు అద్దెయిచ్చి ఒక గది తీసికొని వీలైనంత క్లుప్తముగా కుటుంబనిర్వాహణ చేయుచు మేమిరువురము కాలక్షేపము చేయ మొదలిడితిమి. నెలకు రు. 15 లు మాత్రము వ్యయముచేయుచు కాలమంతయు సాధనలో ఆశ్రమమందే గడపసాగితిమి.

దసరా సమయమున చిన్నస్వామి ఆహ్వానముపై ఆశ్రమమునందే భోజనమునకుండిపోతిమి. దీనివల్ల యింటివద్ద వంటలేకుండెను. ఎక్కువ కాలమాశ్రమములోనే సాధనయందు గడుపుటకు వీలుపడెను. దీనిఫలితముగా కాబోలు ఒకనాటి సాయింకాలము నాకొక అనుభవము కలిగెను. ధ్యానములో కూర్చున్నప్పుడు శ్వాస దీర్ఘమై సమమై పాము బుసకొట్టుటవలె హాలంతయు ధ్వనింపసాగెను. శరీరమందలి ప్రతి అణువును సంచరించుట ప్రారంభించెను. ఒక విధమగు ఆనందానుభూతి కలిగెను. బాహ్యస్మృతి మాత్రము పూర్తిగ తప్పలేదు. హాలులోని వారు ఈ స్థితినిచూచి కంగారుపడిరి. శేషు అయ్యరుగారు నాదగ్గరకువచ్చి గట్టిగా తట్టసాగిరి. వంటింటినుంచి నా భార్యద్వార నీళ్ళు తెప్పించి నా ముఖమునచల్లి పూర్తిగా బాహ్యస్మృతి కలుగునట్లు చేసిరి. అదివరకు నా చేతులు తొడలపైనుండి గాలిలో వ్రేలాడ మొదలిడెను. కాని తరువాత యథాప్రకారము స్వస్థానమును చేరినవి. కొంతసేపటికి నేను హాలునుండి బయటకువచ్చి ఇంటికిపోతిని. హాలులోనివారు ఆ అనుభవమేమని మహర్షిని ప్రశ్నించగా సాధన తీవ్రమగుటచే దానినంతర్గతము చేసికొనలేకపోతిననియు అందువలన అది బహిర్గతమై అట్లు పరిణమించెననియు మహర్షి చెప్పిరట. మరునాడుదయమున నేనాశ్రమమునకు వచ్చినపిమ్మట ఈ విషయము అక్కడివారు నాకు వివరించిరి.

మేమంతక్లుప్తముగా కాలక్షేపము చేసినను ఆర్థికపరిస్థితి నానాటికి క్షీణించసాగెను. కంటిదృష్టికూడ బాగుపడుటకు బదులు క్రమముగా తగ్గసాగెను. ఎటుచూచినను అంధకారమే. పరిస్థితులు బాగుపడు మార్గమేమియు కానరాలేదు. రెండుమూడు సంవత్సరములలో దృష్టి పూర్తిగాపోయి అంధత్వమే సిద్ధింపవచ్చును. నేనొక్కడనేగాక నాపై ఆధారపడియుండు భార్యకూడ కలదు. ఇద్దఱిభారమును వహించువారెవరు? ఇట్లు పెక్కాలోచనలు మనస్సులో తిరుగ నారంభించెను. ఆత్మహత్యచేసికొనినచో జీవితసమస్యలన్నియు తీరిపోయి దుఃఖమనునది లేకుండచేసికొనవచ్చును అని తట్టినది. కొండ క్రిందను కొండమీదను కావలసినన్ని తీర్థములున్నవి. రాత్రిసమయమందెవరును చూడకుండ ఏదో ఒక తీర్థములో యిద్దరుకలసి మునిగినచో సమస్యలన్నియు తీరిపోవును—అని యిట్లు ఆత్మహత్యాసంబంధములగు ఆలోచనలెన్నో రేకెత్త

సాగెను. అవన్నియు మహర్షితో చెప్పుకుందామంటే ధైర్యము చాలలేదు. ఆయనకు ఏకాంతమనునది లేదు. హాలులో ఎప్పుడునూ ఎవరో సాధకులు కూర్చొనియే ఉందురు. ఇట్టి పరిస్థితులలో నేనొక ఉపాయము నాలోచించితిని. నా శారీరిక మానసికపరిస్థితులును, నేనెదుర్కొనవలసిన బాహ్యాపరిస్థితులును ఒక పావుటావు కాగితముపై వ్రాసి ఒకనాటి మధ్యాహ్నము మహర్షి చేతికి చదువుటకిచ్చి నేను ప్రక్కన నిలబడితిని. అంతయు చదివి మహర్షి కాగితమును నా చేతికి తిరిగి యిచ్చివేసిరి. కాని ఏమియు అనలేదు. నేనుపోయి నా స్థానమున కూర్చొంటిని. అప్పటినుండియు నాయందొక మానసిక పరివర్తనకలిగెను. పూర్వజన్మములో చేసిన పాపములే ఈ జన్మమందు వ్యాధిరూపమున దేహమును బాధించునని పెద్దలందురు. కాన ఈ దృష్టిలోపము జన్మాంతరమందు చేయబడిన పాపముయొక్క ఫలితమే. దీనిని అనుభవించుటవలననే క్షయమగునుగాని వేరుమార్గమేమియు లేదు. అట్టియెడ ఆత్మహత్యవలన జరుగునది అసలునకు వడ్డీచేర్చుటయే అగును. అసలునకు వడ్డీచేర్చకయే దీనిని ఈ జన్మయందే అనుభవించుట మానవత్వమే కాదు, వీరత్వము కూడ. పరిస్థితులకు లొంగిపోవుట పిరికితనము. కావున జీవిత రణరంగమందు పోరాటముసలిపి మనము చేసిన పాపముల ఫలితమును మనము అనుభవించుట ఉచితము. ఎట్లో దానినుండి తప్పించుకొనజూచుట పారుబోతుతనము, అసమంజసము. ఈమాదిరి మానసికప్రవృత్తివృద్ధియైనకొలది ఆత్మహత్యావిషయికతలంపులడుగంటసాగెను. బాహ్యాపరిస్థితి మారకపోయినను మానసికప్రవృత్తి మారి బాహ్యాపరిస్థితులలో సంతృప్తి లేదా సమాధానపడుట అలవడెను. ఇదే కాబోలు మహాత్ముల సత్సంగఫలితమని నాకనిపించెను. వారి ప్రభావము బాహ్యాపరిస్థితులమీదకాక తమ్మాశ్రయించిన వారి మనస్సులను మార్చుటలోనుండును. మహర్షి కూడ దీనినప్పుడప్పుడు సమర్థించి పలికెడువారు. తమ వ్యాపారమంతయు మానసికముగానే ఉండుననియు హృదయస్థానమునుండే తాము తమ భక్తులపై ప్రభావమును ప్రసరింపజేతుమని వారనెడివారు.

(పైసెలలో: 'రమణాశ్రమములో నేను చూచినవి విన్నవి.')

ఓంకారగానం చెయ్యి! ఓంకార సంస్మరణం చెయ్యి! ఓంకారసంస్మరణంచేస్తూ నీ హృదయసర్వస్వాన్నీ అందులో నిమగ్నం చెయ్యి! నీ సర్వశక్తులనూ అందులో వినియోగించు! నీ మనస్సంతా దానిలో ఏకాగ్రం చెయ్యి! ఓంకారమంత్రార్థమిది: ''నేనా పరబ్రహ్మమును, నేనూ ఆ పరమాత్మా ఒకటే'' ఓం ''ఆ పరబ్రహ్మమే నేను!'' అని సంభావిస్తూ – ఓం ఓం ఓం అని సంస్మరించు! ధ్యానసమయంలో సందుదొరికితే – నీ బలహీనతలన్నీ, నీ వ్యామోహాలన్నీ నీ మనస్సును కలవరపరుస్తాయి. నీ పాదాలక్రింద వానిని త్రొక్కిపట్టు. అణగత్రొక్కు. వాటికి అతీతుడవుకా! విజయంపొందు!

—రామతీర్థ.

# స్వామి అద్వైతానంద

డి. వి. బ్రహ్మాజి

సన్యాసాశ్రమ స్వీకారానికి ముందు అద్వైతానందస్వామి మొదటిపేరు గోపాలచంద్ర ఘోషు. ఈయనను గోపాలసూరి అని కూడా పిలుస్తూ ఉండేవారు. శ్రీరామకృష్ణగురుదేవులు సానబెట్టి తీర్చిదిద్దిన పదునారుగురు శిష్యరత్నములలోను అందరిలోకి వయస్సులో పెద్దవారు మన గోపాలచంద్రఘోషు. వయస్సులోగోపాలసూరి శ్రీరామకృష్ణపరమహంస కంటెకూడా కొద్ది సంవత్సరములు పెద్దవారే. ఈ పెద్దరికం కారణంగా గురుదేవులీయనను "వృద్ధగోపాలు" డని పిలచేవారు. మిగిలినవారంతా ఈయనను "గోపాల్ పెద్దన్న" అని ఆప్యాయంగా పిలుచుకునేవారు. గోపాలచంద్రఘోషు తండ్రిగారి పేరు గోవర్ధనఘోషు. నేటి పశ్చిమబెంగాలు రాష్ట్రంలోని 24 పరగణాల జిల్లాలో జగద్ధాల్ అనే ఒక చిన్న గ్రామంలో మన అద్వైతానందస్వామి జన్మించారు.

వయసువచ్చిన తర్వాత మన గోపాలసూరి నివాసం కలకత్తాకు దగ్గరలోనున్న సింథీ గ్రామానికి మారింది. సింథీగ్రామానికి చెందిన వేణీపాల్ అనే ఆయనకు కలకత్తాలోని చైనా బజారులో ఒక దుకాణం ఉండేది. ఈ దుకాణంలో మన గోపాలసూరి పనికి కుదిరారు. ఈయన యజమాని అయిన వేణీపాల్ బ్రహ్మ బ్రహ్మసమాజమతస్థుడు. ఆయన ఇంట్లో తరచుగా సమాజ కార్యక్రమాలు అనేకం కొనసాగేవి. ఈ కార్యక్రమాలకు అప్పుడప్పుడు పరమహంస కూడా హాజరవుతూ ఉండేవారు. బహుశా ఇట్లాంటి సందర్భములోనే మొట్ట మొదటిసారిగా మన గోపాలచంద్రుడు గురుదేవుని దర్శించి యుండవచ్చును.

సన్యాసాశ్రమ స్వీకారానికి ముందు గోపాలసూరి పూర్తిగా ఐహికవిషయలోలుడే అని చెప్పాలి. గృహస్థజీవితంలో ఆయన తన భార్యను అత్యంత గాఢముగా ప్రేమించారు. అట్లాంటి ప్రేమాస్పదమయిన భార్య చనిపోవడంతో అది మన గోపాలసూరికి పెద్ద ఆఘాతంలా తగిలింది. ఏమి చేయుటకు పాలుపోక దిక్కు తెలియని దురవస్థలో పరితపిస్తూ బాధపడసాగారు. ఆ సమయంలో శ్రీరామకృష్ణుల భక్తుడయిన స్నేహితుడొకడు "దక్షిణేశ్వరము పోయి పరమహంసను గనక దర్శించినచో మనశ్శాంతి చేకూరగల"దని గోపాలచంద్రునకు సూచించాడు. ఆ స్నేహితుని సలహామేరకు గోపాలుడు శ్రీరామకృష్ణులను దర్శించారు. కాని, ఈ ప్రథమపరిచయంలో ఆయనకు పరమహంసయందు ఏ ప్రత్యేకతా కన్పించ లేదు. అయితే, ఆయనకు మొదట్లో సలహానొసంగిన స్నేహితుడు మాత్రం అంత మాత్రం చేత నిస్పృహ చెందవలదని గోపాలచంద్రుని హెచ్చరించాడు. మహాత్ములు తమ నిజస్వరూపాన్ని ప్రథమ దర్శనంలోనే వ్యక్తంచెయ్యరు. అందువల్ల గురుదేవులను మరియొకసారి దర్శించవలసినదిగ ఆ స్నేహితుడు గోపాలునకు హితవు చెప్పాడు. ఆ ప్రాణసఖుని హితోపదేశము ననుసరించి మన గోపాలసూరి మరికొంత కాలానికి మరల గురుదేవులను దర్శించారు. ఈసారి ఆయనకు పరమహంసయొక్క ఔన్నత్యము, ప్రేమానురాగాలు చక్కగా అనుభూతం అయ్యాయి. ఆనాటినుండి ఆయన తరచుగా దక్షిణేశ్వరం వెళ్లి శ్రీరామకృష్ణులను సందర్శించి వస్తుండేవారు. త్వరలోనే ఆయనకు దుఃఖోపశమనంకల్గి పరిపూర్ణమయిన మన శ్శాంతి చేకూరింది. జగత్తుయొక్క అనిత్యత్వం గురించి అందరకూ సులభముగా అర్థం అయ్యే రీతిలో చిన్న చిన్న మాటలలో శ్రీరామకృష్ణ

లిచ్చే వివరణలు మన గోపాలచంద్రుని మనస్సులో సూటిగా నాటుకున్నాయి. భగవదన్వేషణకు కృతనిశ్చయుడయిన గోపాలసూరి త్వరలోనే ఐహికబంధములనన్నిటిని పూర్తిగ తెగతెంచుకొన్నారు.

మానవరూపమున ఈ కలియుగమున అవతరించిన భగవానుడే శ్రీరామకృష్ణ పరమహంస అని గోపాలునకు గాఢమయిన విశ్వాసము నెలకొన్నది. తన సర్వస్వాన్ని అంకితముచేసి గురుదేవులకు గోపాలుడు ఒనర్చిన పరిచర్యలు అనన్య సామాన్యమయినవి. మన అద్వైతానందస్వామి ఎల్లప్పుడు కూడా శుచిగాను, శుభ్రముగాను ఉండేవారు. ఆయన ప్రతిపనిని ఒక నిర్ణీతపద్ధతిలో, సక్రమముగా నెరవేర్చేవారు. స్వామిలోని ఈ లక్షణాలు శ్రీ గురుదేవులను అమితముగా ఆకర్షించేవి. శ్రీ శారదాదేవి సహజముగా బిడియస్వభావము గలవారు. అందువలన మాతృదేవి మామూలుగా అందరితోను చనవుగా మాట్లాడేవారు కాదు. వయసులో బాగా పెద్దవారయిన మన అద్వైతానంద స్వామితోను, శిష్యులందరిలోను చిన్నవాడయిన అద్భుతానందస్వామితోను,...ఇట్లా ఏ కొద్దిమందితోనో మాత్రమే ఆమె చనవుగా మనసువిప్పి మాట్లాడుతూ ఉండేవారు. అందువలన మన స్వామి శ్రీ శారదా మాతయొక్క అవసరములనన్నింటిని కనిపెట్టి చక్కగా సపర్యలుగావిస్తూ ఉండేవారు.

్రష్ణులు జీవించియుండగా ఒక రోజున మన "వృద్ధగోపాలుడు" పరమహంస వద్దకు వెళ్ళి: "కొన్ని కాషాయవస్త్రములను, రుద్రాక్షజపమాలలను సన్యాసులయినవారికి పంచిపెట్టవలెనని యున్నది" అని తన అభిలాషను వ్యక్తపరచెను. అందుకు సమాధానముగా శ్రీ గురుదేవులు: "ఇక్కడనే ఉన్న మన బాలశిష్యులకన్న మంచిసాధువులు నీకు ఎక్కడ దొరుకుతారు. నీవు ఇయ్యదలచిన వస్తువుల్ని వీరికి పంచిపెట్టు" అని చెప్పారు. వెంటనే గోపాలచంద్రుడు కాషాయవస్త్రముల మూటనొకదానిని తెచ్చి పరమహంసముందుంచారు. వాటిని శ్రీరామకృష్ణులు తన ప్రియ శిష్యులయిన నరేంద్రనాథునకు, రాఖాలునకు, బాబూరామునకు, నిరంజనునకు, యోగీంద్రునకు, తారకునకు, లాటూకు, శరత్ చంద్రునకు, శశిభూషణునకు, గోపాలచంద్రఘోషునకు తన చేతులమీదుగా పంచిపెట్టారు. ఈ ప్రకారముగా—ఆతర్వాత స్థాపింపబడు శ్రీరామకృష్ణ మఠమునకు ఆనాడు మన అద్వైతానందస్వామి ప్రోద్బలముతో శ్రీ గురుదేవుల చేతులమీదుగనే స్వయముగా అంకురార్పణము జరిగినదని చెప్పవచ్చు!!!

శ్రీ గురుదేవులు చికిత్సకై కోసిపూర్ నందు నివసించిన సమయమున నొక చిత్రమయిన సంఘటన జరిగినది. నరేంద్రుడు ఒక సాయం సమయమున ధ్యానముచేయుటకు కూర్చొని యుండగా అప్రయత్నముగ నతనికి నిర్వికల్ప సమాధిస్థితి చేకూరినది. అట్టి స్థితిలో నరేంద్రుని జూచిన మన అద్వైతానందస్వామి అది నిర్వికల్పసమాధిస్థితియని తెలియనందున నరేంద్రుడు విగతజీవుడయ్యెనని భావించి భయభ్రాంతుడయి పరమహంసవద్దకు పరుగులెత్తి తాను చూచినది తెలియజెప్పెను. అసలు విషయం అర్థమయిన గురుదేవులు అది మరణముకాదనీ, చాల కాలముగా నరేంద్రుడభిలషించుచున్న నిర్వికల్పసమాధ్యవస్థమాత్రమే అనియు అద్వైతానందస్వామికి తెలియజెప్పి శాంతపరచారు. చాలసేపటికి నరేంద్రునకు బాహ్యస్మృతి కలిగినది.

శ్రీరామకృష్ణులు మహాసమాధి చెందిన పిమ్మట మన అద్వైతానందస్వామి మహా పురుషమహరాజుగా పేరుగాంచిన శివానంద స్వామితో కలసి బారానగరులో ఒక మఠాన్ని సంస్థాపించారు. బారానగరులో కొన్ని సంవత్సరములు నివసించినపిదప అద్వైతానంద స్వామి వారణాసి పుణ్యక్షేత్రమునకేగి అక్కడ సుమారు అయిదు సంవత్సరములపాటు అత్యంత తీవ్రమయిన తపశ్చర్యలో నిమగ్నమయ్యారు. ఆధ్యాత్మికసాధనల విషయంలో మన స్వామి కనబరచిన క్రమశిక్షణ మనకందరకూ ఆదర్శ ప్రాయమయినది. కాశీలోఉన్న అయిదుసంవత్సరాలలోను ఆయన తెల్లవారుజామునసే లేచి గంగానదికిపోయి స్నానంచేసి వచ్చేవారు. తీవ్రమయిన చలిరోజులలో కూడా స్వామి ఈ కార్యక్రమాన్ని విడువలేదు. ఒకప్రక్క విపరీతమయిన చలిలో చన్నీటిస్నానంవలన శరీరం గడగడ వణకిపోతున్నప్పటికి, ఆయన తన మనస్సునంతటిని సంస్కృత మంత్రపఠనంలో నిమగ్నంచేసి ఆశ్రమానికి తిరిగివచ్చేవారు. ఆయన దినచర్య అతి ఖచ్చితముగా, ఒక్కనాడుకూడా క్రమంతప్పకుండా అమలు జరుగవలసినదే. నిర్ణీతకార్యక్రమం తు. చ. తప్పకుండా ఒకరోజుకాదు, ఒకనెలకాదు...కొన్ని సంవత్సరముల పర్యంతము అమలుపరచడం సామాన్యమయిన విషయంకాదు! వారణాసిలో నివసించినంతకాలమూ మన స్వామి మధుకరం ఎత్తుకొని ఆ భిక్షాన్నముతోనే కడుపునింపుకొనేవారు. కాశీలో స్వామినివాసం ఒక చిన్న గదిలో గడచింది. ఆ గది చిన్నదే అయినా అది ఎంత శుచిగా, శుభ్రముగా, పొందికగా ఉండేదని! ప్రతివస్తువు దాని నియమితస్థానంలో అమరి ఉండవలసినదే. క్రమపద్ధతికి ఆ చిన్న గదినే ఒక ఉదాహరణగా చెప్పవచ్చు ప్రాపంచిక విషయాలపట్ల అత్యంత ఉదాసీనుడయిన మన అద్వైతానందస్వామి సాధనా విషయంలో అత్యంత నిర్దిష్టమయిన పద్ధతిని అనుసరించేవారు. తన నిర్ణీతమయిన క్రమజీవన సరళికి ఇసుమంతయు భంగములేకుండా జీవితమంతాగడపిన స్థితప్రజ్ఞుడు మన అద్వైతానంద స్వామి.

వివేకానందస్వామి అమెరికానుండి తిరిగి మాతృదేశము వచ్చినతర్వాత అద్వైతానంద స్వామి ఆలంబజారులో ఏర్పడిన మఠమునకు వచ్చి చేరారు. ఆ తర్వాత బేలూరులో నిర్మించిన రామకృష్ణమఠములో స్వామి తన శేష జీవితాన్ని కొనసాగించారు. మఠ నిర్వహణ విషయంలో మన స్వామి అనేక విషయాలను పర్యవేక్షించేవారు. ముఖ్యముగా తోటపని విషయంలో ఆయన ఎక్కువ శ్రద్ధవహించేవారు. స్వామి పర్యవేక్షణలో కొనసాగే ఏ కార్యమయినాసరే; ఆ పని మొత్తం అంతా కూడా ఒక క్రమపద్ధతిలో నిర్దుష్టముగా జరిగితీరవలసినదే. తాము నిర్వర్తిస్తున్న పనిలో అతి చిన్న చిన్న సూక్ష్మవిషయాలపట్ల కూడా అద్వైతానందస్వామి అత్యంత జాగరూకతను కనబరచేవారు. అయితే, కొత్తగా సన్యాసాశ్రమం స్వీకరించి అప్పుడే మఠంలో ప్రవేశించిన నవయువకులు చాలమంది స్వామి పరీక్షకు తాళలేకపోయెడివారు. మన స్వామి చేతిలో వారికి మందలింపులు, చీవాట్లు తప్పేవికావు. కాని, స్వామిచేతినుండి తమపైబడిన ఈ అక్షతలను అందరూకూడా తమపై స్వామికిగల అభిమానానికి గుర్తుగా భావించేవారేగాని, బాధపడేవారుకారు. అయితే, ఆ తర్వాత తర్వాత కాలంగడచినకొద్దీ అద్వైతానందస్వామి దృక్పథంలోకూడా బాగా మార్పువచ్చింది. "భగవంతుడు అందరి రూపాలలోను ఆవిర్భవించి

ఉన్నాడు. అందర్లోనూ ఉన్నది ఒకే పరమాత్మ అని తెలుసుకున్నప్పుడు ఎవరినని తిట్టగలము? మరి ఎవరినని విమర్శిస్తాం'' అని అద్వైతానంద స్వామి అంటూఉండేవారు. ఈ మన స్తత్వం అలవడిననాటినుండి ఆయన ఇతరులలోని తప్పులను, అవి ఎంతటి పెద్దవయి నాసరే, సులువుగా మన్నించేవారు.

వార్ధక్యం పైబడినాకకూడ మన స్వామి తన పనులనన్నింటిని తానే స్వయముగా చేసుకొనేవారు. వ్యక్తిగతమయిన తన పనులలో మరియొకరి సాయాన్ని ఆయన ఏనాడూ అపేక్షించి ఎరుగరు. వయస్సులో ఆయన ఇతర సన్యాసులకన్న పెద్దవారు కావడంవలన మిగిలిన వారంతా అద్వైతానందయెడల భక్తిగౌరవములతో మెలగేవారు.

శ్రీ పరమహంస గురుదేవులు స్వయముగా ఆచరించి చూపించిన ఆదర్శప్రాయమైన జీవన విధానంలోనే తన జీవితాన్ని తీర్చిదిద్దుకోవాలి అని అద్వైతానందస్వామి మనఃస్ఫూర్తిగ ప్రయత్నించారు. స్వామివారి జీవనపద్ధతి మనకందరికి కూడా ఆదర్శప్రాయమయినది. సాధన విషయంలో జీవితం చరమదశలో కూడా ఆయన చూపించిన ఏకాగ్రత, నిశ్చలత అద్భుతావహమాయినవి. సత్యభాషణ విషయంలో స్వామి దీక్ష చాల గొప్పది. ''కేవలం హాస్యంకోసమే అయినాసరే సత్యాన్ని ఏ కొంచెమూ మార్పుచేయరాదు''—అని పరమహంస చెప్పినమాటలను అద్వైతానందస్వామి ఒక వ్రతముగా తాను అవలంభించడమే కాక; ఇతరులచేత కూడా పాటింపజేశారు.

పరివ్రాజకునిగా మన అద్వైతానందస్వామి పవిత్ర భారతదేశం నలుమూలలా పర్యటించారు. కేదారనాథ్, బదరీనాథ్, హరిద్వారం ద్వారక, రామేశ్వరము మున్నగు అనేకమయిన పుణ్యక్షేత్రాలను ఆయన దర్శించియున్నారు. చివరి రోజులలో కూడా మన అద్వైతానందస్వామి సంపూర్ణమయిన ఆరోగ్యంతో జీవించారు. చిట్టచివరకు తన ఎనుబదియొకటవ సంవత్సరం వయస్సులో 1909 సంవత్సరము డిశంబరునెల ఇరవైఎనిమిదవ తారీఖున అద్వైతానందస్వామి పరమాత్మలో లీనమైపోయారు.

---

సంసారవిషవృక్షస్య ద్వేఫలే హ్యమృతోపమే
కావ్యామృతరసాస్వాదః సాంగత్యం సాధుభిస్సహ.

సంసారమనే విషవృక్షానికి రెండు ఫలములు అమృతోపమానముగా నున్నవి.

(1) కావ్యామృతరసాస్వాదము, (2) సజ్జనసాంగత్యము.

# ప్రహ్లాద కథాతత్త్వ విచారము

ధూళిపాళ శ్రీరామమూర్తి

హిరణ్యకశిపుడు మరల ఖండించుట ప్రహ్లాదుడు ప్రతిపాదించుట మరల హిరణ్యకశిపుడు ఖండించుట యొకదానివెంట నొకటి సాగినవి. హిరణ్యకశిపుడెంతయెంత కోపావేశముతో ఖండించెనో, ప్రహ్లాదుడంతయంత శాంతముగా ప్రతిపాదించెను. ప్రహ్లాదుని మాటలయందు నెమ్మదితనము హిరణ్యకశిపుని మాటలయందు తొందరపాటు. ఈ యిద్దరి స్వభావములు ప్రకటించుచు నీ స్వభావములకు సురాసుర ప్రకృతులకు సంఘర్షణ నుద్దీప్తమై యందుండి నృసింహస్వామి యావిర్భావము జరిగినది. ఈ యర్థము నంతయు నీ క్రింది పద్యములో పోతన్నగారు పొందుపరచిరి.

హరి సర్వాకృతులం గలండను బ్రహ్లాదుండు భావింపస
త్వరుడై యెందును లేడు లేడని సుతుం దైత్యుండు గర్జింప శ్రీ
నరసింహాకృతినుండె నచ్యుతుడు నానా జంగమస్థావరో
త్కర గర్భంబులనన్ని దేశముల యుద్దండ ప్రభావంబునన్.

మొదటి చరణములో ప్రహ్లాదుని ప్రతిపాదనము రెండవచరణములో హిరణ్యకశిపుని ధిక్కారము ప్రతిపాదితములైనవి. కాని కథాగతియందు హిరణ్యకశిపుడు ముందు ధిక్కరించుట ప్రహ్లాదుడు సమాధానము చెప్పుట జరిగినది. దీనిని వ్యత్యస్తము చేసి పద్యమునందు చెప్పుటచేత నదియే భావము పునః పునః ఖండితమైనదని యర్థము లభించును. ఇట్లొకే భావము యొక్క పునఃపునర్ఖండన మండనముల వలన సంఘర్షణ ముద్దీప్తమైనది. ఇట్లెంత కాలము సాగును? ఒకరిమాట నొకరొప్పుకొనరు. ప్రత్యక్ష నిదర్శనము కావలయును. ఆ పరమేశ్వరుని ప్రహ్లాదుడు చూపించవలయును. చూపించిన మాత్రము హిరణ్యకశిపుడొప్పుకొనునని నియమమేమున్నది? పైగా ప్రహ్లాదుడు చెప్పిన పరమేశ్వరుడు ద్రష్టగాని యాకృతిమంతుడుగాడు. అతడెట్లు చూపించును? ఆకృతులు జడములు. చైతన్యరూపుడు భగవంతుడు. జడములు దృశ్యములు. చైతన్యము ద్రష్ట. దృశ్యమునబట్టి ద్రష్ట నూహింపవలెను. ద్రష్టను దృశ్యకోటిలోనికి దెచ్చుటకు వీలులేదు గదా. కావున ప్రహ్లాదుడు తన నిశ్చయమును బునరుద్ఘాటించుట తప్ప చేయునదేమియు లేదు. హిరణ్యకశిపునకీ బాధలేదు. అతని వాదమునకు నిదర్శనావశ్యకత లేదు. ఒకవస్తువు లేదన్నపుడు, ఆ లేకపోవుటను నిరూపించనక్కర లేదు. ఉన్నచో కన్పింపవలెను. గాని లేనిది కన్పించవలసిన యవసరము లేదుగదా. లేకపోవుటకు కన్పించకపోవుటయే నిదర్శనము. కుందేటికొమ్ము లేదు. ఎందుచేత? ఏ కుందేటికి కొమ్ము కన్పించలేదు. కాబట్టి ఉన్నదన్నవాడు ఆ యున్నదానిని పట్టుకొనివచ్చి చూపించవలెను. ఇది నాస్తికవాదములోని బలము. దీనిని గురించి ఇంతయేల వ్రాసితిననగా నీశ్వరాస్తిత్వమనుభవవిషయము. ఆ అనుభవములేనివానికి వాదసజ్జనుడైనచో దృష్టాంతమును చెప్పి తార్కికముగా నూహింప (అనుమానింప) జేయగలము వాడాయనుమానమును గ్రహించి దాని ననుభవమునకు దెచ్చుకొనుటకు ప్రయత్నింపవలయును. వాడనుమానమును గ్రహింపలేని వాడైనచో లేక గ్రహించియు జల్పవితండవాదియైనచో మనము చేయగలిగినది లేదు. ఈశ్వర స్వరూపమతీంద్రియము. మనోవాచామగోచరము. నిరూపించుటకు వీలులేదు. ఆస్తికునపై నాస్తికుడు కొట్టు చివరిదెబ్బ ఇది. ఉన్నచో నిరూపించుమని యడుగుట. దీనిపైన వాదము లేదు. చూపించుటకు పరమేశ్వరుడు మః

యధీనములో నున్నాడా? ఉండి చూపించినను కాదన్నచో నేమిచేయగలము? కాబట్టి పరమేశ్వరుని చూపించుట మనపనిగాదు ఆ పరమేశ్వరుడు కన్పింపవలయుట, కన్పించవలసి వచ్చినపుడెవరెవరికే యే రూపములలో కన్పించిన నిరూపణమగునో నాయా రూపములలో గన్పించుట ఇది యంతయు మన చేతిలోనిది గాదు. ఆ పరమేశ్వరుని చేతిలోనిది. ఎవరికినెప్పుడెచ్చటనే రూపమున ఈశ్వరాస్తిత్వము నిరూపితమగునో మనకు తెలియదు. హిరణ్యాకశిపుడు తన తూణీరమునందలి చివరి యస్త్రమును ప్రయోగింపనున్నాడు. వానికి తన యస్తిత్వమెట్లు నిరూపింపవలెనో ఈశ్వరుడు నిర్ణయించుకొని సిద్ధముగా నున్నాడు. అట్టి ఆకారమును ధరించి పరమేశ్వరును సర్వపదార్థములయందు సన్నద్ధపడియున్నాడు. హిరణ్యాకశిపుడా యస్త్రమునుపయోగించెను. ఓయీ! ఉన్నాడని చెప్పిన లాభమేమి? ఎక్కడనున్నాడు? ఏ రూపములో నున్నాడు? చూపింపవలెను అన్నాడు. ప్రహ్లాదుడు సర్వత్ర నున్నాడన్నాడంతే. మరి చూపుము. సర్వత్ర నున్నవానినెచ్చట చూపవలెనన్నాడు. ఈ స్తంభమునందు జూపుమన్నాడు. సర్వత్రనున్నవాడు స్తంభమున నుండడా? నాకు సర్వత్ర దర్శనమిచ్చుచున్నాడు. స్తంభమునందును దర్శనమిచ్చుచున్నాడు. నీవు చూడుమన్నాడు. హిరణ్యాకశిపుడు కోపమున లేచి ఖడ్గముతో స్తంభమును కొట్టినాడు. స్తంభమును కొట్టుట యెందులకు? అచట పరమేశ్వరుడు కన్పించినచో కొట్టవచ్చును. కన్పించనప్పుడు కొట్టుట యెందులకు? ప్రహ్లాదుడు స్తంభమునందున్నాడన్నాడు. అందుచేత స్తంభము పరమేశ్వరుడుగాదు. స్తంభమునందును పరమేశ్వరుడు లేడని దానిని కొట్టినాడు. కాబట్టి యా దెబ్బ స్తంభమును గొట్టినదిగాదు. ప్రహ్లాదుని పరమేశ్వరుని భావమును కొట్టిన దెబ్బ. అందుచేత పరమేశ్వరుడు స్తంభమునుండి యావిర్భవింప వలసి వచ్చెను.

హిరణ్యాకశిపుడు స్తంభమును కొట్టెను. ఆ స్తంభమునుండి ఫెళఫెళార్భటులతో న భయంకరమైన ధ్వని యుత్పత్తిల్లెను. బ్రహ్మాండ ప్రళయమైనంత ధ్వని. అపూర్వము అద్భుతమునైనధ్వని. హిరణ్యాకశిపుని సేనానాయకులందరా ధ్వనికి యదరిపోయిరి.

హిరణ్యాకశిపుడా ధ్వనివిన్నాడు. విస్తుపోయి యంతట గలయజూచినాడు. స్తంభము మధ్యనుండి పైకి వచ్చుచున్న నృసింహామూర్తిని చూచి ఇది నరుడుగాదు మృగముగాదు. చిత్రమైన యీ నృసింహరూపమేమి? అని విచారించుచుండగా నా భయంకరమైన నృసింహరూపము ఎదుట పెరుగుచున్నది. కరిగిన బంగారమువలె కన్నులెఱ్ఱగా మండుచున్నవి. మెడమీది జూలు మెఱపులు గ్రక్కుచున్నవి. ఆవలించిననోరు, ఎత్తైన కోరలు. కరవాలమువలెనారుచున్న జిహ్వా. మంగలికత్తివలె పదునైన జిహ్వాగ్రము. ముడివడ్డ కనుబొమ్మలతో పొంగిన ముఖము. పైకి నిక్కబొడుచుకున్న చెవులు. కొండ గుహవలె తెరచిననోరు. ఆకసమునంటు శరీరము. బలిసిన పొట్టిమెడ. విశాలమైన వక్షస్థలము. సన్ననినడుము. వెన్నెలవలె తెల్లనైన రోమములు. అడ్డముగా నిలువుగా నంతట వ్యాపించిన వేలకొలది చేతులు. వానికి వాడిగోళ్ళు. చక్రములు వజ్రములు పరశువులు మొదలైన సర్వాయుధములు ధరించిన యీ నృసింహామూర్తిని జూచి రాక్షసులు దిక్కులు తోచక పారిపోయిరి.

పోతన్నగారు యీ నృసింహామూర్తి యావిర్భావము నొక పెద్ద వచనములో వ్రాసెను. ఆ వచనము చదువుకొన్నచో నేదియో మన

కనుభవములోలేని యర్థముగాని మన కన్నులు పట్టని యొకమహాభయంకర ప్రళయము జరుగుచున్నట్లుండును. ఇంత పెద్దవచనమైన తర్వాత నొక పద్యమును వ్రాసెను. ఈ పద్యమునందు హిరణ్యకశిపుని మనఃస్థితిని వర్ణించెను. నృసింహమూర్తి యావిర్భావమున కంత పెద్దవచనము, హిరణ్యకశిపుని మనఃస్థితి కింతచిన్న పద్యము యీ రెండు నొకదాని ప్రక్క నొకటి హిమాలయోన్నత శృంగము ప్రక్కనే డిన నొకతుమ్మ తుప్పయున్నచో నెట్లుంటునో యట్లున్నది. దివ్యమైన పరమేశ్వరభావమునకు అల్పాల్పమై భౌమమైన మానవుని దురహంకారమునకు మధ్యనున్న వ్యత్యాసమిట్టి రచన వలన పోతనగారు చక్కగా చిత్రింపగలిగినారు.

నరమూర్తిగాదు కేవల
హరిమూర్తిగాదు మానవాకారము కే
సరి యాకారము నున్నది
హరి మాయా రచితమగు యథార్థము సూడన్.

అంత నృసింహమూర్తి యీ మహా విజృంభణము జూచి కొయ్యబారిపోయిన హిరణ్యకశిపుడు క్రమముగా ధైర్యము దెచ్చుకొని నృసింహమూర్తిపై దూకుట, గరుత్మంతుడు పన్నగమును పట్టుకొన్నట్లు నృసింహమూర్తి వానిని పట్టుకొనుట వాడు దుసికిలించుకొని బయటపడుట, నృసింహమూర్తి తన పరాక్రమమునకు జంకి విడిచినాడని భావించి హిరణ్యకశిపుడు మరల కత్తి డాలు తీసికొని వేగవతె నృసింహమూర్తి పైకిపోవుట, నృసింహమూర్తి వానిని పట్టుకొని ద్వారదేశమున తన యూరువులపై నిడికొని గోళ్ళతో గరుత్మంతుడు పామును చీల్చినట్లు వాని పొట్టచీల్చి వాని నెత్తురుచిమ్మ ముఖము జూలు నెఱ్ఱవడ వాని ప్రేవులు మెడలో వేసికొనుట, తనపై యెత్తి వచ్చిన వాని యనుచరులను నఖములతో శస్త్రాస్త్రములతో చండాడుట నిమిషములో జరిగిపోయినవి. ఇంత చేసియు నృసింహమూర్తి కోపాటోపము తగ్గలేదు. ఆయన ద్వారము నుండి వచ్చి సింహాసనముపై కూర్చుండెను. దేవతలు పుష్పవర్షము కురిపించిరి, దుందుభులు మ్రోయించిరి. గంధర్వులు అప్సరసలు నాట్యమాడిరి. బ్రహ్మ ఇంద్ర రుద్రాదులు ఋషులు సిద్ధ విద్యాధరయక్ష కింపురుషకిన్నర గంధర్వాప్సరచారణులు మనువులు పితృభూత భేతాళాదులు విష్ణుపార్శ్వగులైన సునందకుముదాదులు నంజలి బంధములతో దగ్గరించలేక దూరమున నుండియే నృసింహమూర్తిని స్తుతించిరి.

ఎంతమంది స్తుతించినను ఆయన యాటోపము తగ్గలేదు. లక్ష్మీదేవిని యతని కోపమును చల్లార్పుమని యడిగిరి. ఆమె కూడా పూర్వమంత కోపము చూచి యుండలేదు. కాన సమీపించుటకు జంకెను. బ్రహ్మ ప్రహ్లాదుని నాయనా! నీవు పోయి స్వామిని శాంతింపజేయుమని యడిగెను. ప్రహ్లాదుడట్లే యని భూమిపైన సాగిలబడి నమస్కరించెను. తన పాదమూలమునందు సాగిలబడ్డ యాపిల్లవానిని చూచి నృసింహదేవుడు దయార్ద్రదృష్టితో వానిని లేవదీసి యభయదాయకమైన తన హస్తపద్మమునతని తలపైనుంచెను. ఆ చేయి తగిలినంతనే ప్రతిబంధకపాపసామగ్రి నశించి ప్రహ్లాదునకు బ్రహ్మైక్య జ్ఞానమనుభవగోచరమయ్యెను. పరమేశ్వర పాదపద్మములను భావించి యతని హృదయము పరిపుల్లమై శరీరమంతయు రోమాంచముబొంద కన్నుల వెంట యానందాశ్రువులు కాలువలు గట్ట గద్గదకంఠముతో పరమేశ్వరుని యిట్లని స్తుతించెను.

–సశేషము.

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము: ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము: పి. గణపతిశాస్త్రి

ఆ పైన నేనన్నాను: "అర్ధోదయపుణ్య యోగం సమయంలో నాగమహాశయుడు ఒకప్పుడు ఇంటికి వెళ్లాడు. అప్పుడు అతని తండ్రి "ఇటువంటి పవిత్ర సమయంలో గంగలో స్నానం చెయ్యకుండా, సరిగ్గా ఆ గంగమ్మతల్లి ఒడ్డుమీదినించే తిరిగి వచ్చేస్తున్నావా?" అని చివాట్లు వేశాడు. కాని ఆ అర్ధోదయ శుభ ముహూర్తంలో ఒక అద్భుతం జరిగింది. నాగ మహాశయుని ఇంటిపెరడులో లోపలినించి, గంగాప్రవాహం పై పైకి పొంగి పొర్లిందని ఆ చుట్టుపక్కలఉన్న జనం అంతా గమనించారు. అంతేకాదు. ఆ ప్రాంతం అంతా జలమయమయింది. నాగమహాశయుడు ఆ తరుణంలో ఆ గంగనీరు దోసిళ్లతో తన శిరస్సుమీద పోసుకుంటూ, "రా అమ్మా! గంగమ్మతల్లీ! రా!" అంటూ పిలిచాడు. ఇరుగు పొరుగులది గమనించి ఆ ఉప్పొంగిన నీటిలో స్నానాలు చేశారు." ఆ పైన మాతృదేవత ఇలా అన్నది.

"అవును! అతని మహనీయ విశ్వాసంవల్ల ఎంతటి అసాధ్యమయినదయినా ఇట్టే చేతి కందుతుంది. నేను ఒకప్పుడు అతనికి కట్టుకోవడానికి పంచె ఇచ్చాను. కాని అతడు అది తలపాగాలాగ ధరించేవాడు. అతని భార్య కూడా చాలా మంచివ్యక్తి. భక్తురాలు. కొంత కాలంక్రితం మామిళ్లు ఫలించే కాలంలో ఆమె ఇక్కడికి వచ్చింది. ఆ ఇల్లాలు ఇంకా జీవించేఉంది."

ఆ తరవాత అమ్మ ఇతరులతో కలిసి డాబామీదికి వెళ్లింది. ఆపైన ఠాకూరు నైవేద్యం వ్యవహారం పర్యవేక్షించడానికి తిరిగి కిందికి దిగివచ్చింది. మేమంతా ప్రార్థన మందిరంలోనికి వెళ్లాము. ఆ పైన మేమంతా ఠాకూరుకు నివేదించిన ఆహారం స్వీకరించాము.

అమ్మ అనుచరవర్గంలోని మహిళలిద్దరు ఇంతకుముందే అక్కడికి వచ్చారు. ఒకామె పెద్దది. వివాహిత. ఆమె ఠాకూరు నెరుగును. రెండవఆమె ఆ పెద్దావిడ కోడలు. ఆ పెద్దామె ఫలహారంచేస్తూ అన్నది.

"అయ్యో! ఠాకూరు చెయ్యమని చెప్పినవన్ని మేము చెయ్యలేకపోయాము. అలాగ చేసిఉంటే మేమిన్ని బాధలనుభవించేవాళ్లం కాదు. మే మిక్కడ సాంసారిక జీవితాలలో పడి కొట్టుమిట్టాడుతున్నాము. పొద్దస్తమానము అప్రధాన స్వల్ప విషయాలను గురించి తలలు బద్దలు కొట్టుకుంటున్నాము."

దానిమీద మాతృదేవత అన్నది.

"అయినా, ఎప్పుడు ఏదో ఒకపని చేస్తూం డవలసినదే. ఎప్పుడు ఏదో ఒకపని చేస్తూండడంవల్లనే ఎవ్వరయినా కర్మ బంధనాలన్ని ఛేదించగలుగుతారు. అప్పుడే కాంక్షావిముక్తి కలుగుతుంది. ఒక్క క్షణంకూడా పనిలేకుండా ఉండడం మంచిదికాదు."

భోజనం ముగించినపిమ్మట అమ్మ విశ్రమించింది. వేరొక వృద్ధ వితంతువు ఠాకూరు నెరుగును. ఆమెతోబాటు నేనక్కడే ఉండి పోయాను. ఆ ముసలావిడ ఇంటిదగ్గిర తన ఇబ్బందులన్ని ఏకరువుపెడుతూ "నేను చేసిన తప్పొప్పులకన్నింటికిదే క్షమాపణ వేడుకో గలను తల్లీ! కాని పైవారిపక్షాన మాత్రం వేడుకోలేను." అని చెప్పింది. నేనా వృద్ధురాలిని "ఠాకూరును సందర్శించావా అమ్మా?"

అని అడిగాను. "అవునమ్మా, చూశాను, ఆయన అప్పుడప్పుడు మా ఇంటికి వస్తూండే వారు. కొత్తగా వివాహమయిన పెళ్ళికుమార్తె లాగ అమ్మ ఆ రోజులలో ఏకాంతంగా నివసిస్తూండేది." అని ఆమె అన్నది.

" ఆయన్ని గురించి నాలుగు మాటలు చెప్పవమ్మా!" అని అడిగాను నేను. "నేను కాదు. అమ్మ చెబుతుంది. అని సమాధానం చెప్పిందా వృద్ధురాలు. మాతృదేవి ఆ సమయంలో కళ్లు మూసుకుని పడుకునిఉన్నది. అందుచేత నే నేమీ మాట్లాడలేదు. మరికొన్ని నిమిషాలలో అమ్మ తనంతట తానే ప్రారంభించింది.

"మనసారా, ఎవ్వరయినా ఠాకూరును ప్రార్థిస్తే ఆయన దర్శనం లభిస్తుంది. నిన్ననే ఆయన శిష్యుడొకడు మరణించాడు. అతగాడు చాలా మంచి పిల్లవాడు. ఠాకూరు ఆ అబ్బాయి ఇంటికి వెడుతూండేవారు. ఆయన రమ పదించినపిమ్మట ఇతడొకనాడు ట్రాము ద్వారా ఇంటికి చేరుకున్నాడు. అంతకుమునుపు ఎవరో అతనికి జాగ్రత్తగా దాచమని రెండు వందల రూపాయ లిచ్చారు. ఇతడు ట్రాము దిగి జేబులు తడిమి చూసుకున్నాడు. ఆ రెండు వందల రూపాయలు ఎవరో కాజేశారని గ్రహించుకుని చాలా భయపడ్డాడు. దాని మీద ఎంతో దుఃఖిస్తూ గంగఒడ్డునే తిరుగుతూ "అయ్యో! ప్రభూ! నీవు నా కెంతపని చేశావయ్యా!" అంటూ ఆక్రోశించాడు. తన జేబులోనించి అపహరించిన ఆ సొమ్ము అంతా తిరిగి ఇవ్వడానికి అతనిదగ్గిర ఒక్క చిల్లిగవ్వ కూడా లేదు. అలాగ ఆ గంగఒడ్డమ్మటే పోతూంటే అకస్మాత్తుగా అతని సమక్షంలో ఠాకూర్లు సాక్షాత్కరించి "ఎందు కలాగ దుఃఖిస్తావు? ఆ సొమ్మంతా అదిగో ఏటిపక్కన ఇటుకకింద ఉన్నది." అని నిర్దేశించారట!

ఆ పిల్లవాడు తొందరగా అక్కడికివెళ్లి ఆ ఇటుక తొలగించి చూశాడు. అతనికక్కడ ఒక నోట్లకట్ట కనిపించింది. అతడు అక్కడి నించి తిన్నగా తిరిగివెళ్లి ఆ కథ అంతా శారదానందస్వామికి వినిపించాడట!

ఆయన అది విని "నాయనా! ఈ నాడు కూడా నీ కాయన సందర్శనానికి అనుమతి లభించింది. కాని మా కింక ఆయన సాక్షాత్కరించడం లేదు!" అని వాపోయాడట!

వా రంతా ఆయన నెలాగ చూస్తారు? అత్యంత స్పష్టములయిన ఠాకూరు స్మృతులతో వారిప్పుడానందిస్తున్నారు. ఠాకూరు నెప్పుడు సందర్శించనివారి కిప్పుడు ఠాకూరు సందర్శనావశ్యకత ఎంతయినా ఉన్నది.

"ఠాకూరు దక్షిణేశ్వరంలో ఉన్నప్పుడు రాఖాల్ [స్వామీ బ్రహ్మానంద] మొదలయినవారంతా చాలా చిన్నవారు. రాఖాలుకు ఒకనాడు చాలా ఆకలివేసింది. ఆ మాట ఠాకూరుతో చెప్పాడు. దానిమీద ఆయన గంగాతీరానికివెళ్లి "ఓ గౌర్దాసీ, నా రాఖాలుకు చాలా ఆకలిగాఉంది. త్వరగా ఇక్కడికి రా!" అంటూ గట్టిగా కేకలు పెట్టడం ప్రారంభించారు. ఆ రోజుల్లో దక్షిణేశ్వరంలో తియ్యని తినుబండారాలుండేవికావు. మరి కొంతసేపటిలోనే గంగమీద ఒక నావ కనబడి, నెమ్మదిగా తీరానికి చేరుకున్నది. బలరామ్‌బాబు, గౌర్దాసి మొదయినవారు రసగుల్లాలతో నిండించిన పెద్ద పాత్రతో అక్కడ దిగారు.

ఠాకూరు ఎంతో సంతోషంతో "రా, రాఖాలూ, రా, వాళ్లు రసగుల్లాలు తీసుకు

వచ్చారు. రా! తిను! ఆకలిగా ఉన్నదని అన్నావుగా!'' అని పిలిచారు. దానిమీద రాఖాలు బిడియపడి, ''నాకు ఆకలిగా ఉన్నదని అందరికీ చాటించడం ఎందుకు?'' అన్నాడు. దానిమీద ఠాకూరు ఇలా గన్నారు.

'ఏం, అంతమాత్రాన మించి పోయిం దేమిటి? నీకు ఆకలిగాఉంది. కనక నీకా హారం కావాలి. ఆ మాట అంటే తప్పేమిటి?'

సరీగా అదే సమయంలో భూదేవ్ జ్వరంతో స్కూలునించి ఇంటికి వచ్చాడు. అతనికి పడక ఏర్పాటు చెయ్యవలిసిందని మాతృదేవి నాతో అన్నది. అలాగే చేశాను నేను. రామబాబు తల్లి తీవ్రమైన గ్రహణి వ్యాధితో బాధ పడుతున్నది. ఆమెను చూడ డానికి మాతృదేవి బలరామబాబు ఇంటికి వెళ్లవలిసిఉన్నది. మాతృదేవి ముందుగానే లేచి తన పనులన్ని ముగించుకుంటూ ''నే నక్కడికి వెళ్లాలి. 'మాకు' రాగానే స్కూలు బస్సు నాకోసం నిరీక్షించేటట్టు చెయ్యండి.'' అని చెప్పింది.

గోలాప్‌మాతో కలిసి అక్కడికి వెళ్లింది మాతృదేవి. ఆ పైన గంటలోగానే తిరిగి వచ్చివేసింది. ఈ లోగా నన్నింటికి తీసుకు వెళ్లడానికి ఒకరు వచ్చారు గాని, అమ్మ తిరిగి వచ్చేదాకా నే నక్కడినించి కదలలేదు. ఆమె వస్తూనే నాకేసి చూసి ''ఇదిగో, నీ విక్కడనే ఉన్నావన్నమాట! నీ కోసమే, నా తల్లీ, నేను పెంద్రాళ్లే తిరిగి వచ్చివేసింది! ఫలహారమేమైనా చేశావా?'' అని ఎంతో ఆప్యాయంగా ప్రశ్నించింది.

నేను : లేదమ్మా!

అమ్మ : అదేమిటి నళినీ! ఆమెకు ఫలహారం ఎందు కివ్వలేదు? ఇవ్వవలిసిందని నీతో నేను చెప్పి వెళ్లానుగా!''

నళిని ఎంతో బిడియపడుతూ ''అయ్యో మరిచిపోయానమ్మా! మరిచిపోయాను! వెంట నేవెళ్లి ఫలహారం పట్టుకువస్తాను.'' అన్నది. అమ్మ ఆ సమాధానం విని ''పోనీలే! ఆ సంగతి నీ విప్పుడు తలపెట్టనక్కర లేదు. నేను చూసుకుంటానులే!'' అని చెప్పింది. అదే క్షణంలో నాకేసి చూసి ''ఫలహారం కావా లని అడగలేకపోయావా అమ్మా! ఇది మీ ఇల్లులాంటిదే!'' అంటూ నైవేద్యం పెట్టిన తిను బండారాలు కొన్ని నా చేతికందించింది. నేనవి ఎంతో అప్యాయంగా భుజించాను.

అక్షయ తృతీయనాడు ఆ వెనకటి పెద్దా విడ, ఆమె కోడలు లోపలికివచ్చారు. వారిద్దరు చక్కగా స్నానాలుచేసి ముందుకువచ్చి, కొన్ని కొత్త బండాలు, కొన్ని ఫలాలు, అమ్మ చేతిలో ఉంచారు. ''దానిమీద ఆమె ఇవి నాకెందుకు? భూదేవ్ కివ్వండి!'' అని చెప్పింది. మరి కొంత సేపు సంభాషణ కొనసాగినపిమ్మట మాతృదేవి మాకేసి తిరిగి, అన్నది. ''ఈ పుణ్య దివసం నాడు నేను మిమ్మల్ని ఆశీర్వదిస్తున్నాను. మీ కిక జన్మమృత్యువులనుండి విముక్తి లభిం చుగాక! జన్మమృత్యువులు చాలా దుఃఖకర మయినవి. వానివల్ల మీ కిక వేదన లేకుండు గాక!''

అక్టోబరు 1912:

దుర్గాపూజ సమయంలో నే నొకమారు మాతృదేవిని చూడడానికి వెళ్లాను. ఆమె చాలా పనితొందరలో ఉన్నట్టు కనబడింది. నన్ను చూసిన తరవాత అమ్మ కూర్చోవలిసిం దని చెప్పి, రాంచీనించి వచ్చిన ఒక శిష్యుని కోసం కబురు పంపించింది. అతడు పూలతోను,

పళ్లతోను, నూతన వస్త్రాలతోను పైకివచ్చాడు. వానితోబాటు కృత్రిమంగా రూపొందించిన గులాబీల దండకూడా ఒకటి తీసుకువచ్చాడు. అది అచ్చమయిన గులాబీలలాగే కనిపించింది. అవి బట్టతో తయారయిన గులాబీలు. ఆ దండ మెడలో వేసుకోవలసిందని మాతృదేవిని ప్రార్థించాడా శిష్యుడు. అమ్మ ఆ దండ మెడలో వేసుకున్నది. అదే సమయంలో గోలాప్‌మా అక్కడికి వచ్చి, ఇనప తీగెలతో గుచ్చిన ఆ దండవల్ల అమ్మ మెడమీద వేదన కలగగలదని చెప్పి ఆ శిష్యుణ్ణి నిందించడం ప్రారంభించింది. దానిమీద దయాసాగరమూర్తి అమ్మ "అబ్బే నాకు ఈ దండవల్ల ఇబ్బంది ఏమీ కలగలేదు. నేనిది చీరమీద ధరించాను." అని చెప్పి ఓదార్చింది. ఆ శిష్యుడు నమస్కరించి కిందికి వెళ్లిపోయాడు.

—సశేషం.

# స్వామి!

ఆకలి గొన్నవానిలా
ఆవురావురు మని భుజించినట్లు

దప్పిన గొన్నవానిలా
గుటగుట మంచినీళ్లు తాగినట్లు

స్వామి!
నిన్ను నేను ఆశించలేదు.

రాత్రి అనక పగలనక
లోభి ధనమును కొలిచినట్లు

వయో సౌందర్యములు పాటించక
ఇల్లాలు భర్తను వలచినట్లు

స్వామి!
నిన్ను నేను ప్రేమించలేదు.

అభిమానం సైతం చంపుకుని
శార్యార్థి అధికారిని పొగడినట్లు

చింపి పాతలకోసం
బుడ బుక్కలవాడు భూమించినట్లు

స్వామి!
నిన్ను నేను కీర్తించలేదు.

అందుకని నిన్ను
అర్థించడం లేదు ముక్తికోసం.

అయినా ఒకటిమాత్రం కోరుతున్నాను
బిచ్చగానిలా.

ప్రసాదించు నాకు
విపత్తు ఆవరించునప్పుడు
అంకుశిత ధైర్యం;

మనస్సు బలహీనమైనప్పుడు
అచంచల స్థైర్యం.

—చల్లా రాధాకృష్ణశర్మ

# శ్రీ రామకృష్ణుల నృత్య సంకీర్తన

[శారదానందస్వామి రచించిన 'శ్రీ రామకృష్ణ లీలామృతము' అను గ్రంథములోని ఒక భాగమునకు ఇది అనువాదము. దీనిని అనువదించినవారు: 'కె. లక్ష్మీప్రసాద్']

నామ సంకీర్తనమే అవశ్యకర్తవ్యమనియు అందుచే మనశ్శరీరములు రెండును శుద్ధము లగుననియు శ్రీరామకృష్ణులు వచించువారు కలిలో ఇంత సులభసాధ్యము వేరొకటి లేదనియు చెప్పినారు. శ్రీరామకృష్ణుల సాక్షాత్ శిష్యులగు శ్రీమత్ శారదానందస్వాములవారు తమ బాల్యముననొక మిత్రునితో గలసి శ్రీరామకృష్ణుల దివ్యనృత్యసంకీర్తనను కనుగొని యనుభవించిన తీరును తమ లీలాప్రసంగ గ్రంథమున ఇట్లభివర్ణించిరి.

అది 1883 వ సంవత్సరము నవంబరు నెల. మణిమోహనమల్లికునియింట జరుగు బ్రహ్మసమాజవార్షికోత్సవ సందర్భమున ఆ నెల 25 వ తేదీన శ్రీరామకృష్ణులాహ్వానింపబడియుండిరి. మేముకూడ ఆదేరోజు రెండుజాములవేళ శ్రీరామకృష్ణుల దర్శనార్థులమై దక్షిణేశ్వరము వెళ్ళితిమి. చూడగా వారక్కడికి ప్రయాణమునకై సిద్ధమగుచుండిరి. వారి శ్రీచరణములకు శిరసాప్రణమిల్లుచుండగనే సంతోషముగ "ఆహా! మీరు వచ్చితిరా! మంచిది, పరవా లేదు కూర్చోండి. బండితెచ్చుటకు వెళ్ళినారు. అక్కడ బ్రహ్మసమాజ ఉత్సవము. ఈవేళ కలకత్తా వెళ్ళవలెను" అనిరి. మేము క్రింద ఒక ప్రక్కగా కూర్చుంటిమి. కొంతసేపటికి మేము "స్వామీ! తాము వెళ్లుచున్నారు, ఆచోటికి మమ్ములను రానిత్తురా?" అని అడిగితిమి. అంత వారు, అవును, ఎందుకు రానివ్వరు? మీరు వసే సంతోషముగ రావచ్చును సింధూరియాపట్టిలోని మణిమోహనమల్లికుని ఇల్లు" అని సెలవిచ్చిరి. దగ్గరనున్న బాబురామ్‌చే ఆ ఇంటి నంబరు మాకు చెప్పించిరి.

కొంతసేపటికి బండివచ్చినది. శ్రీరామకృష్ణులు బాబురామ్‌తో సంచి మున్నగునవి తీసికొమ్మనిచెప్పి జగదంబ దర్శనముచేసివచ్చి బండిలో కూర్చుండిరి. ఒక మూలగా బాబురామ్‌కూడ కూర్చుండిరి. బండి కలకత్తావైపు సాగిపోయెను. తరువాత మేము నావలోనెక్కి కలకత్తా వెళ్ళితిమి. అక్కడ వెదకుచు వెదకుచు నాలుగుగంటలగుసరికి మణిమోహనుని ఇంటికి చేరితిమి. శ్రీరామకృష్ణులు మేడపైన ఉన్నట్లు తెలిసినది. పైకిపోయి చూడగా మండపమంతయు పత్రపుష్పములతో మిక్కిలి సుందరముగా అలంకరింపబడియున్నది. కొందరు పరస్పరము సంభాషించుకొనుచుండిరి, దాని వలన తెలిసినదేమనగా మధ్యాహ్న ఉపాసన, భజన ఇపుడే సమాప్తమైనవనియు, కొంచెము తరువాత సాయంకాలపు ఉపాసన, కీర్తన మొదలైనవి జరుగుననియు గ్రహించితిమి. భక్తురాండ్ర కోరికపై శ్రీరామకృష్ణులు లోపలికి వెళ్ళియుండిరి.

సాయంకాలపు ఉపాసనకు వ్యవధికలదని గ్రహించి మేము బయట విహరించుటకై పోయితిమి. సంధ్యాసమయమగుసరికి మేమక్కడికి తిరిగివచ్చితిమి. ఆ ఇంటి ముందటివీధిలోనుండియే లోపలి భజన, మృదంగాది వాద్యములు వినబడుచుండెను. సంకీర్తన ఇపుడే ప్రారంభమైయుండునని తలచి త్వరత్వరగా ఆ మండపము వైపు వెళ్ళితిమి. అక్కడ ఏ దృశ్యము కనిపించినదో దానిని సరిగావర్ణించుట సాధ్యము కానిపని. మండపము లోపల, బయటకూడ పెద్ద జనసమూహము. ప్రతి తలుపు, కిటికీ ఎదురుగా గుంపులుగా జనులుండుటచే అందు లోపలికి వెళ్లుటగాని, వెలుపలికి వచ్చుటగాని

కష్టముగానుండెను. ప్రతివారు తల పైకెత్తి భక్తిపూర్ణమైన అంతఃకరణముతో తిన్నగా లోపలివైపు చూచుచుండిరి. ప్రతి వ్యక్తియు ముందుకు జరుగుటకై ప్రయత్నించుచుండెను. ఇంత వికటసమూహములో చొచ్చుకొని నలుగుడుపడి మేమెట్లో లోపలికి చేరితిమి. అచట బయటికంటె సమ్మర్దము కొంచెము తక్కువగా నుండుటచే వేదిక లోపలిదృశ్యము కొంచెము మెరుగుగ కనుపించుచుండెను.

ఆహాహా! ఎటువంటి దృశ్యమది! ఆ మండపములో ఆనందము తాండవించుచున్నట్లుండినది. అందరు తన్మయులైయుండిరి. సంకీర్తన చేయువారిలో ఒకరు నవ్వుచుండిరి, మరియొకరు విలపించుచుండిరి, ఒక్కొక్కరు ఉద్వేగముగ నృత్యము చేయుచుండిరి. ఒక్కొక్కరు భూమిపై పడి పొరలుచుండిరి. కొందరు అత్యంత వ్యాకులురై ఉన్మత్తులవలె ప్రవర్తించుచుండిరి. ఈ ఉన్మత్తులందరి మధ్యభాగములో భావావేశమున శ్రీరామకృష్ణులు స్వయముగా నృత్యము చేయుచుండిరి. నృత్యముచేయుచు వారు ముందరికిపోవుచుందురు. మరల అక్కడినుండి వెనుకకు జరుగుచు, ఇదివరకటి స్థానమునకు వచ్చుచుందురు. ఇంత సమ్మర్దముగా జనులుండినను, వారు ముందుకుగాని వెనుకకుగాని కదలుచుండినపుడు దగ్గర కూర్చుండియున్న జనులు మంత్రముగ్ధులవలె వారికి దారినిచ్చుచుండిరి. వారి శ్రీముఖముపై హాస్యరేఖ భాసించుచుండ, వదనమండలముపై అపూర్వతేజము మెరయుచుండెను. వారి శరీరమునుండి మధురత్వ, కోమలత్వభావములు బయటికి ప్రవహించుచుండినట్లే యుండెను. మరియు తోడ్తోడనే నృత్యముచేయు సమయమున వారి శరీరమున సింహబలము ప్రకటమై చూపట్టుచుండెను. వారి ఆ నృత్యమునకు ఉపమానములేదు.

అందులో ఆడంబరమేమియులేదు. కృత్రిమ ప్రయత్నపూర్వకమైన అంగవిన్యాసముగాని దుముకుటలుగాని లేవు. అన్ని కార్యములు పూర్తిగా సహజముగా అంతఃకరణస్ఫూర్తి చేతనే అగుచుండినట్లు కన్పించుచుండెను. సుందరమై వినిర్మలమైన నీళ్ళలో చేపను వదలినచో, అది ఆనందముతో నందు క్రీడించుచు, ఒకప్పుడు శాంతముగా ఈదుచు, ఒకప్పుడు అతి ఉద్వేగముగ మునకలువేయుచు నీటిలో నాలుగువైపుల చక్రించుచు ఎట్లు విహరించునో, ఈ శ్రీరామకృష్ణుల నృత్యముకూడ అదేస్థితిలో ఉండెను. ఆనందసాగరములో మునకలువేయుటచే వారి అంతఃకరణములో ఏ అపారసుఖము, ఆనందము కలుగుచుండెనో దానినే వారు నృత్యముద్వారా ప్రకటించి చూపుచుండిరా యన్నట్లుండెను. ఈ అపూర్వ నృత్యమున మధ్యమధ్యలో వారు సంజ్ఞాశూన్యులగుచుండిరి. వారు ధరించిన ధోవతి జారిపడుచుండెను. అపుడు ఎవరో ఒకరు దానిని వారి నడుమునందెట్లో చుట్టివేయుచుండిరి. మరియొకరెవరైన భావావేశమున స్మృతిరహితులైనచో వారి వక్షస్థలమును స్పృశించి శ్రీరామకృష్ణులు వారిని సచేతనులగా చేయుచుండిరి. వారి శరీరమునుండి ఒక దివ్యమైన ఉజ్జ్వల ఆనందముయొక్క ప్రవాహము నాలుగువైపులకు ప్రవహించుచున్నట్లు అగుపడుచుండెను. ఆ ప్రవాహము లోనికి వచ్చిపడిన యథార్థభక్తులకు ఈశ్వర దర్శనము లభించుచున్నట్లుండినది. మందవైరాగ్యవంతులకు తీవ్రవైరాగ్యము కలుగగా, అందరి మనస్సులనుండి మాంద్యము తొలగిపోయి ఆధ్యాత్మికమార్గమున అగ్రేసరులగుశక్తి ఎల్లరకును కలిగినట్లుండినది. అంతేకాదు. ఘోర విషయాసక్తుని మనసునందుకూడ క్షణకాలము సంసారాసక్తి దూరమగుచుండినది.

వారి భావావేశముయొక్క ప్రవాహమున అందరు మునిగిపోయిరి. ఆ ప్రవాహముయొక్క పవిత్రతవల్ల వారివారి మనస్సులు గంగా స్నానము చేసినట్లు నిష్పాపములై ఉన్నత ఆధ్యాత్మికస్థితులను అధిరోహించుచుండినవి. సాధారణ బ్రహ్మసమాజమున కాచార్యుడగు శ్రీ విజయకృష్ణగోస్వామివారి మాట చెప్ప నవసరమే లేదు. బ్రాహ్మసభలోని అన్యసభ్యులు కొందరుకూడ ఆవేశ భావావిష్టులై సంజ్ఞా శూన్యులైరి. ఆచార్యచిరంజీవి శర్మ కూడ అట్లేయైరి. తన్మయులై భక్తివిషయిక గానమును, తమ సుమధురస్వరమున తంబుర సహాయముతో పాడుచు, పాడుచు వారుకూడ భావావేశులైపోయిరి. ఈ ప్రకారముగా రెండు, రెండున్నర గంటలవరకు ఈ అపూర్వ సంకీర్తన, నృత్యము జరిగినతర్వాత 'ఏమన్ మధురనామ్ జగతే అనిలకే' (ఈ మధుర హరినామమును జగత్తులోనికి తెచ్చినవారెవరో) అను పాట పాడబడెను. తరువాత సర్వ ధర్మసంప్రదాయములకు, భక్తులకు, భక్తాచార్యులకు ప్రణామములు జరిగినపిదప ఆనాటి ఆనందఉత్సవము పూర్తియైనది.

సంకీర్తన పూర్తియైన తరువాత అందరు కూర్చుండగా 'హరి-రస-మదిరా పియే మమ మానసమాతరే' (హరికీర్తనా రసమును మద్యమును త్రాగి నా మనసు మత్తెక్కియున్నది) అను పాట పాడుమని శ్రీరామకృష్ణులు ఆచార్య నగేంద్రనాథచట్టోపాధ్యాయ అను వారిని ప్రార్థించగా వారుకూడ తన్మయులై ఆ పాటను రెండుమూడుసారు తిరిగితిరిగి పాడి అందరను ఆనందితులను చేసిరి.

అటుతరువాత "రూపరసాది విషయముల నుండి మనస్సును బయటికిలాగి ఈశ్వరుని సేవయందు లగ్నముచేసియుండుటచే జీవునికి పరమశాంతి ప్రాప్తించును" అను ఆశయమును శ్రీరామకృష్ణులు శ్రోతలకు ఉపదేశించిరి. మండపమున ఒకప్రక్క తెరచాటున స్త్రీలు కూడ కూర్చుండిరి. వారుకూడ ఆధ్యాత్మిక విషయములపై అనేక ప్రశ్నలు శ్రీరామకృష్ణుల నడుగగా, వారు వాటికి ఉచిత సమాధానము లొసగిరి. ఆనాడు చెప్పబడిన విషయములు శ్రోతృజనుల మనసులందు దృఢముగా నాటుకొనవలెనను ఉద్దేశముతో సమాధానములైనంతనే వారు శ్రీ జగదంబయొక్క నామగానము ప్రారంభించి, రామప్రసాదు, కమలాకాంతుడు మొదలైన సాధకులయొక్క అనేక భక్తిరస గేయములను స్వయముగా పాడిరి.

ఒకప్రక్క శ్రీరామకృష్ణులీభజనకీర్తనలు పాడుచుండగనే, ఇంకొకప్రక్క శ్రీ విజయకృష్ణుడు కొందరు భక్తులకు శ్రీ తులసీరామాయణము వినిపించి అర్థము తెలియజెప్పుచుండిరి. కొంతసేపటితర్వాత సాయంకాలపు ఉపాసన ప్రారంభించుటకుముందు శ్రీరామకృష్ణులకు ప్రణామ మాచరించుటకై వారు మండపము లోనికివచ్చిరి. వారిని చూచుటతోడనే శ్రీరామకృష్ణులాయనను నవ్వులు పట్టించసాగిరి. "ఈ మధ్య విజయునికి సంకీర్తనతప్ప ఇంకేమియు రుచించుటలేదు. ఇది మంచిది సరే, కాని అతని నృత్యము ప్రారంభముకాగనే నాగుండె దడదడ కొట్టుకొనుచుండును! అవును! ఏమి చెప్పగలము? ఒకవేళ మండపము ముక్కలై క్రిందపడినచో! (అందరు నవ్వుదురు) లేదు, లేదు. నేను నిజముచెప్పుచున్నాను. మా ఊరిలో ఒకసారి నిజముగా ఇట్టి సంఘటన జరిగినది. ఒక సాధువు తన శిష్యునియింటి రెండవ అంతస్థుపై సంకీర్తన చేయుచుండిరి. ఆ భవనపు స్తంభములంత గట్టిగా నుండినవి కావు. సంకీర్తన మంచి రంగముననుండెను,

నృత్యముకూడ ప్రారంభమయ్యెను. సాధు స్వాములుకూడ నీవలెనే (విజయునివలె) పుష్టిగా నుండిరి. నృత్యము తీవ్రముగ జరుగుచుండ ఒక్కసారిగా దూలములు విరిగిపడి, స్వాముల వారు అకస్మాత్తుగా క్రింది అంతస్థుకువచ్చి చేరిరి. అందుకే, నీ నృత్యసమయమున కూడ ఇట్లు జరుగదుకదా అని భయము వేయుచుండును.'' (అందరు నవ్వుదురు) విజయకృష్ణుని కాషాయ వస్త్రమునుచూచి వారిట్లనిరి. ''ఈ రోజులలో కాషాయముపైకూడ విజయునికి చాల మోజైనది. ఇతరులైతే తాము ధరించిన వస్త్రమునకే కాషాయపురంగు వేయుదురు. కాని విజయునిపద్ధతి చూడుడు. అతని వస్త్రము, ఉత్తరీయము, అంగరఖా, చెప్పులు – అన్ని కాషాయరంగే. కాని ఇది చెడ్డదని నేను చెప్పను. ఒకప్పుడు మనస్సునకాస్థితికలిగి అట్లుచేయ నిచ్ఛకలుగును. కాషాయముకంటె ఇతరమేమియు సహించదు. ఇది మంచి మాటయే, కాషాయము త్యాగమునకు చిహ్నముకదా! అందుచే సాధకునికి ఆ రంగు ఈశ్వరునికొరకు సర్వస్వము త్యాగముచేయు వ్రతమును స్మరణకు తెచ్చుచుండును.'' అంత విజయకృష్ణుడు శ్రీరామకృష్ణులకు ప్రణామము చేసెను. ''ఓం శాంతిః శాంతిః శాంతిః నీకు శాంతి ప్రాప్తించుగాక'' అనుచు ప్రసన్నముగా శ్రీరామకృష్ణులాతని నాశీర్వదించిరి.

విజయకృష్ణుడు శ్రీరామకృష్ణుల ఆశీర్వాదముగైకొని ఉపాసన ప్రారంభించుటకు క్రిందికి పోయిరి. శ్రీరామకృష్ణులు ఫలాహారమునకై లోపలికి గొనిపోబడిరి. రాత్రి తొమ్మిదిగంట లయినది. మేము మండపమునుండి క్రిందికిదిగి విజయకృష్ణుని ఉపాసన వినుటకని కొంచెము సేపాగితిమి. 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' అను వాక్యముతో ఉపాసన ప్రారంభమయ్యెను. కొంతసేపటికి శ్రీరామకృష్ణులు కూడ అక్కడికివచ్చి ఉపాసనలినుచు అందరితో బాటు పది, పదిహేను నిమిషములు కూర్చుండిరి. తరువాత వారు భూమిపై సాష్టాంగప్రణామముచేసి, రాత్రి చాలఅయినదని తెలిసి తిరిగి వెళ్ళుటకు బండి తీసుకొనిరమ్మని చెప్పిరి. బండి రాగనే ఉపాసనాగృహమునుండి మెల్లమెల్లగా బయటికివచ్చి, చలివేయుచున్నందున శాలువ ధరించి బండిలోకూర్చుండిరి. అందరు వారికి ప్రణామములుచేసిరి. బండి దక్షిణేశ్వరమువైపు పయనించినది. విజయకృష్ణుని ఉపాసనచూచుటకై కొంతసేపాగి మేముకూడ ఇంటికి మరలితిమి.

ఆధ్యాత్మికమాసపత్రికలకు సంపాదకులుగా ఉన్న ఇద్దరు అకస్మాత్తుగా ఒకచోట కలుసుకోవడం తటస్థించింది. వారిలో ఒకాయన రెండోఆయనతో ''శర్మగారూ! కులాసాగా ఉన్నారా! మీ పత్రిక ఎలా నడుస్తోంది! చందాదారులసంఖ్య ఏ మాత్రం!'' అని ప్రశ్నలవర్షం కురిపించాడు. ''కులాసాగానే ఉన్నానులెండి. వర్మగారూ! పత్రిక మామూలుగానే నడుస్తుంది. చందాదారుల సంఖ్యకేం వరవాలేదులెండి 20,000 లో ఒక సున్న కొట్టివేస్తే ఎంతో అంత ఉంది. కాని మా పత్రిక చదివే పాఠకులు ఇద్దరే ఏమో అని నా అనుమానం. నేనున్నూ మా ప్రూఫ్‌రీడరున్నూ. ఇక మీ పత్రిక సంగతి ఏమిటో చెప్పండి'' అన్నాడు నవ్వుతూ శర్మ. ''మా పత్రిక చందాదారుల సంఖ్య విషయంలో మీ పత్రికతో ఇంచు మించు సమానంగానే నడుస్తుంది. కాని పాఠక సంఖ్యవిషయంలో మీపాఠకసంఖ్యలో 50 శాతమే మా పత్రికకని చెప్పడానికి విచారిస్తున్నాను. ప్రూఫులు గూడ నేనే దిద్దడంవల్ల మా పత్రిక పాఠకసంఖ్య ఒకటే ఏమో అని నా అనుమానం'' అన్నాడు నవ్వుతూ వర్మ.

# సౌభరి

## స్వామి నిర్వికల్పానంద

పూర్వం సౌభరి అనే మహర్షి ఒకాయన ఉండేవాడు. ఆయన చాలాకాలం – సుమారు పన్నెండేళ్లు – నీటిలో నిలబడి తపస్సు చేశాడు. ఆ తపస్సు చేస్తున్న సమయంలో నీటిలో మత్స్య మిథునం క్రీడిస్తూ ఉండటమూ, వాటి సంతానం మిలమిలలాడుతూ వాటి వీపుమీది కెక్కి సంతోషంగా విహరిస్తూ ఉండటమూ ఆయనకంట బడ్డాయి.

ఆ దృశ్యం చూచిన వెంటనే ఆయన మనస్సు పరిపరి విధాలా పోయింది. అయ్యో! ఇల్లాంటి సంసార సౌఖ్యం అనుభవించే భాగ్యం మనకు లేకపోయిందే అని అనుతాపపడటం మొదలుపెట్టాడు. వెంటనే బయలుదేరి అప్పుడు దేశాన్ని పరిపాలిస్తున్న మాంధాత చక్రవర్తివద్దకు వెళ్లి కన్యాదానం చెయ్యమని ప్రార్థించాడు. మాంధాతకు నలభైతొమ్మిది గురు పుత్రికలు. వారిలో ఒకరిని కాకపోతే ఒకరినైనా ఇవ్వడా అని ఋషి ఆశ. కాని అట్లా పన్నెండేళ్లు నీళ్లలో నాని వత్తు అయిన కురూపికి ఎవ్వరూ కన్యాదానం చెయ్యరనే ఊహా తట్టలేదు.

రాజుగారు లోపాయికారిగా, 'అందు కేమీ అభ్యంతరం లేదు. కాని, మా వంశంలో ఒక ఆచారం ఉంది. ఆడబిడ్డల్ని మేము ఫలానా వాళ్లని పెళ్లిచేసుకోమని నిర్బంధించం. వాళ్లు ఎవ్వరినైతే స్వయంగా వరిస్తారో వాళ్లతోనే వివాహం. కనక, మీరు నిరభ్యంతరంగా అంతఃపురంలోకి వెళ్లి, మిమ్మల్ని వరించినవాళ్లని గ్రహించండి' అన్నాడు. ఈ అనాకారిని ఎవ్వరు వరిస్తారు అని దిలాసాలోపల. కాని, ఇవ్వనంటే తపోసంపన్నుడైన ఋషి ఏమని శపిస్తాడో అని భయం. కనుక, ఈ ఎత్తు ఎత్తాడు.

ఋషి అంతఃపురంలోకి ప్రవేశింపబోతూ దేవమానవ కింపురుషాదులకు అలభ్యమైన దివ్యసుందరరూపాన్ని పరిగ్రహించాడు. నీ తండ్రి ఇట్లా ఋషికి చెప్పాడని చెలికత్తెలు చెప్పారు. కన్యలందరూ మేమంటే మేమని ఋషిని వివాహం ఆడటానికి ఒప్పుకున్నారు.

ఋషి అందర్నీ వెంటపెట్టుకొని తన నివాసమైన అరణ్యానికి తర్లి వెళ్లాడు. ఆ దృశ్యాన్ని చూచి మాంధాత దిగ్భ్రాంతుడయ్యాడు. ఆయన అనుకున్న మంత్రం పారలేదు. ఎంతో కష్టపడి పెంచిన బిడ్డలందరూ నిలవనీడలేని ఋషి పాలిట బడ్డారు.

సరే, చేసేదేమీ లేదు. కొంతకాలం అయినతర్వాత బిడ్డలెట్లా ఉన్నారో చూసి వద్దామనే కుతూహలంతో ఋషి ఉన్న అరణ్యప్రాంతానికి బయలుదేరాడు. అక్కడ అడవీ గుట్టా ఏమీ కనిపించలేదు. కాని, నలభైతొమ్మిది దివ్యగృహాలతో కూడిన ఊరొకటి కనిపించింది. తన రాజ్యంలో తనకు తెలియకుండా ఈ క్రొత్త ఊరు ఎటా వచ్చిందా అని మాంధాత విస్మయం పొందాడు. ఈ ఊరు ఎవరిది అని నల్గుర్నీ ప్రశ్నించి సౌభరిమహర్షి గృహాలు అని తెలిసికొన్నాడు. కేళీగృహ తటాకాది యుక్తమైన ఆ భవన పరంపరయొక్క నిర్మాణకౌశల్యానికి మెచ్చుకున్నాడు.

మొట్టమొదట ఆయన ప్రవేశించిన ఇల్లు పెద్దబిడ్డది. 'ఏల్లా ఉన్నావు, ఏమి విశేషాలు, నేను జ్ఞాపకానికి వస్తానా? అమ్మా!' అని

ప్రశ్నించాడు. "చాలా సుఖంగా ఉన్నాను. అష్టైశ్వర్యాల ఏమీ లోపం లేదు. అయి నప్పటికీ కన్నతండ్రిని ఎవ్వరు విస్మరిస్తారు - అయితే ఒకమాట, ఋషి ఎప్పుడూ నా ఇంట్లోనే ఉంటాడు. చెల్లెళ్ళదగ్గరకు పోడు." అని సమాధానం చెప్పింది.

చక్రవర్తి ప్రతికన్యదగ్గరా ఇవే మాటల్ని విన్నాడు. విని ఆశ్చర్యపోయి ఋషిని సంద ర్శించి, ఆయన యోగప్రభావానికి మెచ్చు కుంటూ తన పురానికి మరలాడు.

ఇక్కడ సౌభరి సంసార సౌఖ్యాన్ని సంపూర్ణంగా అనుభవించి పుత్రపౌత్రులతో ఆనందిస్తున్నాడు. ఒకరోజున మనమళ్ళను ఒక యింటివాళ్లనుగా చెయ్యాలని అనుకుం టూండే సందర్భంలో, మళ్లా వైరాగ్యం కలిగింది. అయ్యో, ఈ ఆశలకు అంతులేదే అని నిర్వేదాన్ని పొంది, వానప్రస్థాశ్రమాన్ని స్వీకరించి, ఆ తర్వాత తురీయాశ్రమాన్ని గ్రహించి తపోనిరతుడై ముక్తిని పొందాడు.

* * *

ఈ కథ విష్ణుపురాణంలోనూ భాగవతం లోనూ లభిస్తోంది. పురాణకారుడు మనో రథాలికి అంతులేదనిన్నీ, కనుక త్యాగమే మహాఫలప్రదమనిన్నీ, స్త్రీ సంగం చేసేవాళ్ల సంగాన్నికూడా త్యజింపవల్సింది అనిన్నీ ఈ కథద్వారా మనల్ని ఉద్బోధించటానికి ప్రయ త్నించాడు.

ఈ విషయాలే కాకుండా ఈ కథవల్ల నేర్చుకోవలసిన విషయం మరొకటి ఉంది. అది ఏమిటంటే మనం చేసేది కేవలం సత్కా ర్యమే అయినా దాని ప్రతిక్రియ - ఫలితం - ఎట్లా ఉంది. మన మనస్సు ఏ మాదిరిగా ప్రవర్తిస్తుందీ అనేది ముఖ్యవిషయం.

ఒకడు దినమంతా రామకోటి వ్రాస్తూ గడి పెయ్యవచ్చు. కాని దానికి అనుగుణంగా దిన చర్య కనక ఉండకపోకే ఆ ప్రయత్నం అంతా వ్యర్థంగానే పరిణమిస్తుంది.

ఒక భార్యతో తీరిపోయేదానికి సలభది తొమ్మిదిభార్యలను వివాహమాడాల్సివస్తుంది. ఈ విషయాన్ని గుర్తుపెట్టుకొని ఆధ్యాత్మిక సాధకులందరూ ప్రవర్తింపవల్సిఉంటుంది. మనం ఏమిచేసాము అనేదానికన్న, ఆ చేసిన పనియొక్క ప్రతిక్రియ మన అంతరంగంలో ఎల్లాంటి స్పందనాన్ని కలిగించింది అనే విషయం చాలా జాగ్రత్తగా గమనింపవలసిన విషయం. ఈ విషయాన్నే ఈ కథ అత్యంత కౌశలంతో వర్ణిస్తోంది.

చావంగాలము చేరువౌ టెఱిఁగియుం జాలింపఁగా లేక త
న్నే వైద్యుడు చికిత్సఁ బ్రోవగలఁడో యే మందు రక్షించునో
యే వేల్పుల్ కృపఁ జూతురో యనుచు నిన్నింతైనఁ జింతింపఁడా
జీవ శ్రాద్ధముఁ జేసికొన్న యతియున్ శ్రీకాళహస్తీశ్వరా!

—ధూర్జటి.

# సూతసంహిత

ఏలూరిపాటి అనంతరామయ్య

## ఏడవ అధ్యాయం

## ముక్తి సాధన కథనం:

నైమిశీయులు "సర్వతత్త్వవిశారదా, భగవానుడా, వినగోరుచున్నాము: కొందరు ముక్తికి కేవలవిజ్ఞానం (సాధనమని) వక్కాణిస్తారు 1. మరికొందరు జ్ఞానంతో అనుష్ఠించిన కర్మమంటారు బ్రహ్మవేత్తృశ్రేష్ఠుడా! ఇక కొందరు దానమనీ, వేరుకొందరు పండితులు వ్రతమనీ ఉద్ఘాటిస్తారు 2. కొందరు యజ్ఞమనీ, మరికొందరు తపోధనులు తపస్సనీ, ఇకకొందరు బ్రహ్మచర్యాశ్రమమనీ, వేరుకొందరు భువిలో గృహస్థాశ్రమమనీ ప్రశంసిస్తారు 3. కొందరు వానప్రస్థాశ్రమమనీ, మరికొందరు ధరణీతలంపై సన్యాసమనీ, ఇకకొందరు తీర్థసేవ అనీ, వేరుకొందరు ధారుణిలో స్వాధ్యాయమనీ పేర్కొంటారు 4. కొందరు మహేశునివిశిష్టస్థానంలో సదా ఉండటమంటారు. ఇలా ముక్తికి వేరే సాధనాలనుకూడా ఈ లోకంలో ప్రశంసిస్తారు5. వీటిలో సర్వప్రాణులకూ ఆచరణశక్యమై ముక్తినిచ్చేది ఏది? అది, మహాభాగా, సూతా, (లోక)హితనిరతా, మాకు చెప్పు" అని అడిగారు 6.

సూతుడు చెప్పాడు:

పూర్వం శ్రీవైకుంఠంలో ఉన్న నారాయణుని వ్యాసుడు 7 భక్తితో దండప్రణామం చేసి ఇది అడిగాడు పండితులారా!

ఆ శ్రీమన్నారాయణుడూ మనస్సులో మిక్కిలి సంతోషించి, మహాలక్ష్మితో, బ్రహ్మతో, దేవతలతో, వేదవ్యాసునితో సహా కైలాసానికి వెళ్లాడు పరమర్షులారా! 9

అక్కడ దేవితోసహా కూర్చుని ఉన్నాడు ఉమాపతి, నీలకంఠుడు. ఆయన తన తేజస్సుతో సమస్తమునూ ప్రకాశింపజేస్తున్నాడు. చతుర్వర్గఫలప్రదాత 10. ఈశ్వరులకందరకూ ఈశ్వరుడు. పరమేశ్వరుడు. పతులకు పరమపతి. దైవతములకు దైవతం 11. తలచుకొన్నంతనే అందరికీ అభీష్టఫలాలిస్తాడు. సత్యస్వరూపుడు, విజ్ఞానమయుడు, ఆనందరూపి, సంపూర్ణుడు, సర్వసాక్షి 12. ఆయనకు పరమభక్తితో నమస్కరించి ఈ లోకహితకరమైనది అడిగాడు.

బుధులారా, సర్వజ్ఞుడు, సర్వభూతహితనిరతుడు, సర్వామరేశానుడు మహాదేవుడూ మధురవాక్కుతో అన్నాడు:

"మహావిష్ణూ, అచ్యుతా, నీవు చాలా బాగా ప్రశ్నించావు 13, 14.

పూర్వం దేవి, జగన్మాత పరమేశ్వరి సర్వభూతహితనిరతితో భక్తితో నమస్కరించి నన్నిది అడిగినది 15. సర్వలోక హితకరమైనది. అది నీకు దయతో చెపుతాను: మహావిష్ణూ, జ్ఞానమే మోక్షసాధన మనబడుతున్నది 16. జ్ఞానం ఉపనిషత్తులనుంచి కలిగినదని నా నిశ్చితాభిప్రాయం. శ్రౌతస్మార్తాలననువర్తిస్తూ అనేక జన్మలనుంచి శుద్ధులయిన వారికి 17 నా అనుగ్రహంవల్లనే ఆ శుభజ్ఞానం కలుగుతుంది హరీ! పుండరీకాక్షా, నివృత్తధర్మనిష్ఠుడు (సన్యసించి శ్రవణమననాదులు చేసేవాడు) అయిన బ్రాహ్మణుడు 18 జ్ఞానాభ్యాసంలో ముఖ్యాధికారి అని నేను చెప్పాను హరీ! విష్ణూ, ఇతర బ్రాహ్మణులూ, రాజులూ 19, వైశ్యులూ తరతమభేదంతో జ్ఞానాభ్యాసానికి అధికారులు. ద్విజస్త్రీలకుకూడా శ్రౌత

జ్ఞానాభ్యాసంలో అధికారం ఉన్నది 20. సేవా పరాయణుడైన శూద్రునికి పురాణంద్వారానే తెలియటం ఉన్నది. కొందరు విద్వాంసులు స్త్రీలు శూద్రసమానలంటారు 21. తదితరుల కందరకూ జ్ఞానాభ్యాసం విహితమైనది. వేరే భాషద్వారా కులాంతరంలో వారికది ఉపకరిస్తుంది 22 జ్ఞానసాధనం లేకుండానే పరిజ్ఞానమున్నవారిని పూర్వజన్మలలో ఆ సాధనమున్నదని పండితులు భావించాలి 23.

"ముఖ్యాధికారులైన నరులకు ప్రతిబంధరహితమైన జ్ఞానం కలుగుతుంది. ఇతరులకు ప్రతిబద్ధమైన జ్ఞానం కలుగుతుంది 24 ప్రతిబద్ధ పరిజ్ఞానం ఈ జన్మలో ముక్తిని ఇవ్వదు. విశుద్ధబ్రహ్మజ్ఞానం విశుద్ధునికే సిద్ధిస్తుంది 25. కనుక ప్రయత్నం లేకుండా సర్వమనుష్యులకూ ముక్తి రాదు. యజ్ఞదానాదికర్మలు శాశ్వ ముక్తిని సిద్ధింపజేయలేవు 26.

"కనుక, మహావిష్ణూ, అప్రయత్నంగా అందరికీ ముక్తినిచ్చే హేతువు జగద్ధితంకోసం చెపుతాను. విను: 27.

"మాధవా, లోకంలో నా విశిష్టస్థానాలున్నాయి. వాటిలో ఏదో ఒకదానిలో నివసించటం భోగమోక్షప్రదం 28.

"శ్రీమద్వారాణసీపురి పవిత్రమైనది. నాకు నిత్యమూ ప్రియమైనది. ఆ నగరంలో ప్రాణం విడిచేప్రాణికి జాలికి లొంగి 29. శ్రేయస్సు కోసం తారకమైన బ్రహ్మవిజ్ఞానమిస్తాను హరీ. ఆ నగరంలోనే ప్రాణత్యాగం ముక్తిప్రదం మహావిష్ణూ 30.

"దక్షిణ కైలాసమన్న స్థానాన్ని నేను చాలా గౌరవిస్తాను. అక్కడ సర్వలోకాలలో ఉన్న సర్వతీర్థాలూ ఉన్నాయి 31. సువర్ణముఖీజలం పవిత్రమైనది, పాపనాశనమైనది. అందులో ప్రతినెలా వ్యతీపాతవేళా, మాఘమాసంలో మఘానక్షత్రమపుడూ 32. ఆదివారమూ, అమావాస్యనాడూ, స్నానంచేసి, సురేశ్వరుడను, మహేశ్వరుడను, శ్రీ కాళహస్తిశైలేశ్వరుడను అయిన నన్ను పూజించాలి 33. ఎవరైనా సరే, అక్కడ సంవత్సరంపాటు, ప్రతిదినమూ భక్తితో కరుణానిధిని దక్షిణకైలాసవాసిని దర్శించి 34 భుజిస్తే, మహావిష్ణూ, అతినికి ముక్తిప్రదమైనజ్ఞానం మరణకాలంలో జనిస్తుంది. దానితో ఆ నరుడు ముక్తుడు కాగలడు 35

"శ్రీమద్వ్యాఘ్రపురంలో ఎవరైనా సరే, పన్నెండు నెలలు నిత్యమూ సంతోషంతో నేలపై (వ్రాలి) దండప్రణామం ఆచరిస్తే 36. అతనికి పరముముక్తి సిద్ధిస్తుంది. సంశయానికి కారణం లేదు.

"ఎవరైనాసరే, శ్రీమద్వృద్ధాచలంలో భక్తితో రెండు సంవత్సరాలు నివసించి, మహాదేవుడూ పరమేశ్వరుడూ అయిన శ్రీమద్వృద్ధాచలేశ్వరునికి ముమ్మారు ప్రదక్షిణం చేసి నమస్కరించితే 37, 38, వానికి ముక్తి అప్రయత్నంగానే సిద్ధిస్తుంది. సంశయం లేదు.

"అచ్యుతా, (ఈ ప్రకారం) విశిష్ట స్థానంలో నివసించినంతమాత్రాన మానవుడు అప్రయత్నంగా స్వీయసంసార మహాభయం నుంచి విముక్తుడు అవుతాడు. కనుక, అప్రయత్నంగానే ముక్తినన్వేషించే మానవుడు 39, 40, వీటిలో ఒక స్థానాన్ని భక్తితో సేవించాలి."

అని (చెప్పగా) విని, హరి, వేదవేత్తలలో ఉత్తములారా, బ్రహ్మాది దేవతలతో 41, వేద వ్యాసునితో, లక్ష్మితోపాటు పరమభక్తితో భక్తప్రియరతుడైన భవునికి నమస్కరించాడు 42.

సర్వజగత్పతి విష్ణువు (ఆ తరవాత) బ్రహ్మనూ, వేదవ్యాసునీ, దేవతలనూ వీడు కొలిపి, శ్రీ మద్దక్షిణకైలాసం లక్ష్మితోసహా చేరుకొన్నాడు. ఆ దక్షిణకైలాసం సర్వదేశోత్తమోత్తమం. దాని వెడల్పు ఐదు యోజనాలు, పొడవు పది యోజనాలు. బ్రహ్మ, సరస్వతీ, ఇంద్రుడూ, నీలా, కాళమ్మా, హస్తీ, ఇతర దేవగంధర్వరాక్షసులూ, మునులూ, ఇతరులూ పూజించిన స్థానమది. భోగమోక్షఫలప్రదం 43-45½.

వేదవేత్తలలో ముఖ్యుడు బ్రహ్మ ప్రసన్నుడై సరస్వతితోసహా సంతోషంతో పాపనాశనమైన శ్రీ మద్వృద్ధాచలం వెంటనే చేరాడు 46½

విశ్వజ్ఞానసాగరుడు శ్రీ మద్వేదవ్యాసముని ఆదరంతో శ్రీ మద్వారాణసీపురం చేరాడు 47½.

అలాగే, విప్రులారా, మునీశ్వరులారా, సర్వదేవతలూ ప్రసన్నులై భోగమోక్షప్రదమైన శ్రీ మద్వ్యాఘ్రపురం భక్తితో చేరారు. ఇతరమునులూ పూర్వతపోబలంవల్ల వ్యాఘ్రపురం చేరారు. అక్కడ దేవేశుడు, అంబికాపతి నృత్యంచేస్తూ ఉంటాడు. 48-49½.

నేనూ, వ్యాసులవారిమాట విని, బహు శ్రద్ధతో పండితులారా, శ్రీ మద్దక్షిణకైలాసంలోనూ, వ్యాఘ్రపురంలోనూ, శ్రీ మద్వృద్ధాచలంలోనూ, వారాణసిలోనూ ఒక్కొక్క సంవత్సరం నివసించి బహుశుభంకరమైన జ్ఞానం పొందాను 50-51½.

పండితోత్తములారా, మీరుకూడా ముక్తిసిద్ధికోసం వీటిలో ఒక విశిష్టస్థానంలో శ్రద్ధతో నివసించండి.

చాలామంది వీటిలో నివసించటంవల్ల భవబంధనంనుంచి విముక్తులైనారు 52-53.

: ఇది శ్రీ స్కాందపురాణం శ్రీ సూతసంహితలో శివమాహాత్మ్యఖండంలో 'ముక్తిసాధనకథనం' అను ఏడవ అధ్యాయం :

# బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## "అమ్మా ! నన్నువదలి ఎక్కడకు పోయినావే"

శ్రీ రామకృష్ణదేవుని జబ్బు మరీ పెరిగిపోయింది. నరేంద్రుడు, లాటు, శరత్, శశి, కాళి మొదలగు యువకులు వంతులువేసుకొని ఆయనకు సేవ చేస్తున్నారు. శ్రీ శారదాదేవికి జబ్బు తగుతుందనే నమ్మకం పోయింది. అయినా ఆమె యేదోరకంగా తగ్గాలనే ఆశ పెట్టుకున్నది. కాని ఫలితం లేకపోయింది.

1886 వ సంవత్సరము ఆగస్టు 15 వ తేదీ వచ్చింది. ఆరోజు ఆదుర్దాగానే గడచింది. రాత్రి 1.02 ని॥ అయింది. 16 వ తేది ఆరంభమైంది. శ్రీ రామకృష్ణదేవుని ఒళ్ళు అకస్మాత్తుగా గగుర్పొడిచింది. ముఖము కాంతితో నిండిపోయింది. శరీరం బిగిసిపోయింది. శ్రీ రామకృష్ణదేవునకు సమాధి వచ్చినప్పుడు అలాగే యుంటుంది. అందువల్ల అక్కడి వాళ్ళంతా అది సమాధి అనుకున్నారు. కాని అది మహాసమాధి. ఇన్నిరోజులు వాళ్ళగుండెల్లో ఆనందాన్ని నింపుతున్న రామకృష్ణుడనేసూర్యుడు అస్తమించాడు. దిగులు అనే చీకటి వాళ్ళను ఆవరించింది. ఎంతసేపటికో కాని రామకృష్ణదేవుడు చనిపోయినాడని వాళ్లు నమ్మలేదు. తర్వాత అందరు ఘొల్లుమన్నారు.

ఆ సమయానికి శ్రీ శారదాదేవి అక్కడలేదు. ఆమెకు ఆవిషయం తెలియజేయటం ఎట్లా ? ఆమెకు బిడియము ఎక్కువ గాబట్టి పెద్దవాళ్ళతోను, పెద్ద పిల్లలతోను ఆమె మాట్లాడదు. అందుచేత వారిలో చిన్నవాడైన కాళిని (అభేదానందస్వామి) తెల్లవారినతర్వాత శ్రీ శారదాదేవికి యీ సంగతి చెప్పటానికి పంపారు. అతనితో ఆమె అరమరికలేకుండా మాట్లాడుతుంది. కాళి, గుండె పగిలేటటువంటి ఈ వార్త చెప్పగానే ఆమె యిలా కేకవేసింది. "అమ్మా ! నన్నువదలి ఎక్కడికి పోయినావే ?"

శారదా రామకృష్ణులు ఒకరి నొకరు తల్లిగా చూస్తుంటారు. అందుకే శారదాదేవి అలా అని యుంటుంది. భార్యాభర్తలు ఒకరి నొకరు 'అమ్మా' అని అనుకోటం ఎక్కడైనా వున్నదా ? లేదు. ఇది ఎక్కడాలేని ఒక అపూర్వ ఆశ్చర్యకరమైన సంబంధము.

"ఎక్కడికి పోతివే యమ్మ యిప్పు"డనుచు
శారదామాత ఏడ్చె కన్నీరుగార
మహిని సతికిని పతికిని మధ్యనిట్టి
మాతృసంబంధమున్నదే మచ్చుకైన !

సంపాదకులు : స్వామి తన్మయానంద.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600 021) న ముద్రింపబడి.

స్వామి తన్మయానందవారిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600 004) నుండి ప్రచురింపబడినది.

Vol. XXXV—11 (November 1978) Sri Ramakrishna Prabha Regd. No. M—4635

# రామకృష్ణ మఠ ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము | 8.00 | వివేక సూర్యోదయము | 4.00 |
| శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర | 10.00 | అనుష్ఠాన వేదాంతము | 2.50 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 8.00 | ప్రాచ్యము - పాశ్చాత్యము | 1.25 |
| శ్రీ రామకృష్ణోపనిషత్తు | 3.75 | కులము, సంస్కృతి, సామ్యవాదము | 3.00 |
| శ్రీ రామకృష్ణపరమహంస నీతికథారత్నములు | 2.50 | భారతదేశము | 2.00 |
| గురూపదేశములు | 2.00 | భారతీయ మహిళ | 2.00 |
| నా గురుదేవుడు | | [illegible] | 1.25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1.50 | శ్రీ రామకృష్ణ సేవాసంస్థ ఆదర్శములు | 0.50 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహము | 0.75 | చికాగో నగరోపన్యాసములు | 1.00 |
| ఆరాత్రికము మరియు | | శ్రీ వివేకానంద శంఖారావము | 0.80 |
| శ్రీ రామనామ సంకీర్తనము | 0.50 | నవీన భారత దేశము | 0.40 |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4.00 | సర్వం విష్ణుమయం జగత్ | 0.35 |
| శ్రీ శారదాదేవి | 2.50 | శ్రీ వివేకానంద సింహగర్జనలు | 0.20 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | 0.80 | బ్రహ్మానంద [illegible] | 4.75 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4.00 | తాపత్రయ చికిత్స | 0.80 |
| బాలల వివేకానందుడు | 2.00 | ముక్తిమార్గము | 0.80 |
| శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి | | పారమార్థిక సంభాషణలు | 6.50 |
| 9 సంపుటముల పూర్తిసెట్టు (సాదా) | 55.00 | నారద భక్తి సూత్రములు | 4.00 |
| .. .. (క్యాలికో) | 61.00 | శ్రీ మద్భాగవతము - మూడవ సంపుటము | 7.50 |
| విడి సంపుటములు ఒక్కొక్కటి (సాదా) | 5.00 | దేవీమాహాత్మ్యము | 4.00 |
| .. .. (క్యాలికో) | 6.50 | శ్రీ మద్భగవద్గీత | 9.00 |
| స్వామి శిష్య సంవాదములు | 10.50 | శ్రీ మద్భగవద్గీత చిన్నసైజు | 3.00 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 4.00 | పారాయణగీత తాత్పర్యసహితము | 3.75 |
| .. (రెండవ భాగము) | 5.50 | | 2.00 |
| భారత యువజనులారా! | 3.00 | కఠోపనిషత్తు | 2.00 |
| ప్రబోధ రత్నాకరము | 3.75 | గిరీశచంద్ర | 1.00 |
| రాజయోగము | 6.25 | భక్తిమార్గము | 1.00 |
| కర్మయోగము | 4.00 | శ్రీకృష్ణవాణి | 0.80 |
| భక్తియోగము | 4.00 | బుద్ధవాణి | 0.80 |
| శ్రీ వివేకానంద లేఖావళి (మొదటిభాగము) | 2.25 | క్రైస్తు సూక్తిమాల | 0.80 |
| .. (రెండవభాగము) | 3.00 | మహమ్మదు సూక్తి మంజరి | 0.80 |
| హిందూ మతము | 4.00 | శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము | 1.25 |

ఇవియేకాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును,
వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)
అను మాసపత్రికలును, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైలచిత్రములు మున్నగున వెన్నియో మా యొద్ద లభింప గలవు.

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600 004

సంవత్సర చందా రూ. 7   జీవిత చందా రూ. 100   విడి సంచిక 70 పై.

# శ్రీమద్భగవద్గీత

**అనువాదకులు:**

శ్రీ నిర్వికల్పానందస్వాములవారు

ఇది మూలశ్లోకములు, ప్రతిపదార్థము, ధారాళమగు అనువాదము, శ్రీధరీయ టీకా సారము, విశేషాంశములు, సానువాదగీతాపాఠక్రమము, ధ్యానమాహాత్మ్యములు, సమ భావాత్మకములగు ఉపనిషద్వాక్యసూచిక, వేదాంతసూత్రసూచిక, గీతాశ్లోకసూచిక, శబ్దానుక్రమణిక—ఇన్నిటితో విరాజిల్లుచున్నది.

భక్తులకు సాధకులకు మాత్రమే కాక కళాశాల విద్యార్థులకు సైతము ఉపయుక్త మయిన దివ్యగ్రంథము.

పుటలు: 58+400 (నవమ ముద్రణము) వెల: రూ. 10-00

# భక్తియోగము

**అనువాదకులు:**

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించుకొనిన, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీవివేకానందస్వాములవారిందు విపులముగా ప్రదర్శించియున్నారు. మూల గ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

(ఏడవ కూర్పు)

(121+4 పుటలు) వెల: రూ. 4-00

# కర్మయోగము

**అనువాదకులు:**

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ స్వాములవారు కర్మయోగ తత్త్వమును అరటిపండు వొలిచినట్లు విశదీకరించియున్నారు. కర్మమెటుల మోక్షసాధనమో స్పష్టీకరించియున్నారు.

(అష్టమ ముద్రణము)

(146+8 పుటలు) వెల: రూ. 4-00



మోక్షార్థం జగద్ధితాయ చ.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 35 1978 - డిసెంబరు సంచిక 12


## ప్రార్థన

తేజోఽసి తేజో మయి ధేహి। వీర్యమసి వీర్యం మయి ధేహి।

బలమసి బలం మయి ధేహి। ఓజోఽసి ఓజో మయి ధేహి।

మన్యురసి మన్యుం మయి ధేహి। సహోఽసి సహో మయి ధేహి॥

ప్రజ్వలనస్వరూపుడవైన ఓ దేవా! నాయందు తేజస్సునుంచుము. సామర్థ్య స్వరూపుడైన ఓ దేవా! నాయందు సామర్థ్యమునుంచుము. బలస్వరూపుడైన ఓ దేవా! నాయందు బలమునుంచుము. ఓజస్వరూపుడైన ఓదేవా! నాయందు కాంతి నుంచుము మన్యుస్వరూపుడైన ఓ దేవా! నాయందు మానసప్రజ్వలనమునుంచుము. సహనస్వరూపుడైన ఓ దేవా! నాయందు సహనమునుంచుము.

# వివేకానందవాణి

ఒక కథ చెప్పెదను, వినుము. దారిని బచారుచేయుచు, నొక సోమరి యింటిగుమ్మము కడ గూర్చుండియున్న యొక వృద్ధుని జూచి యాగి, "ఆ తావిచటి కెంతదూరము?" అని యడిగెను. వృద్ధుడు మాటాడక యూరకుండెను బాటసారి మఱల మఱల నడిగెను. ఐనను సమాధానము రాలేదు. విసుగుకొనుచు, సణుగుకొనుచు బాటసారి గిఱ్ఱున తిరిగి పోవుచుండ, ముదుసలి లేచి "యా తావిక్కడికొక మైలు దూరముండు"ననెను. బాటసారి "ఆ మాట ముందే చెప్ప లేకపోయినావటయ్యా!" యనెను. ముదుసలి యిట్లు జవాబిచ్చెను: "లేదు, అప్పుడు నీవు తచ్చాడుచు, ముందునకు బోవుట కలత్యముగా నున్నట్లు కనబడితివి; ఇప్పుడో, చఱ్ఱున బయలుదేఱి పోవుటకు సిద్ధపడితివి, అందుచే సమాధానము నొందుటకు నీవు హక్కుగలిగినది."

నాయనా! ఈకథ నీవు మఱచిపోవుగద! కృషి చేయుము, మిగిలినదంతయు స్వయముగనే సిద్ధించును.

"అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్

ఎవరితర చింతలులేక నన్నే యుపాసించుచుందురో వారి యోగక్షేమములను నేను వహింతును" అనెడి గీతా వాక్యము యథార్థముకాని కలకాదు, కల్లకాదు.

...ప్రస్తుతము మనయుద్యమము మత ప్రచార మానవసేవారూపమున సాగ వలయును. మీరు ప్రతివారము సమావేశమగుటకు తగిన తావునెన్నుకొనుడు, అచట ప్రార్థనాదులను జరిపి, భాష్యసహితముగా ఉపనిషత్తులను పఠించుచు, మెల్లగా విద్యనార్జించుచు, పని సాగింపుడు. ఉద్యమమునకు మీరు పూనుకొనినయెడల సర్వము మీకు సంప్రాప్తమగును.

...ఉద్యమమున నిమగ్నుడవు కావలయును. ఇది కేవల ప్రారంభము. ప్రతిజాతియు, ప్రతిసంఘమును దన్నుదానే యుద్ధరించుకోవలయును; సనాతన ధర్మపునరుద్ధరణార్థమెక్కడ నుండియో ధనము వచ్చునని నిరీక్షించుచు మీరు గూర్చుండరాదు, అది కేవలము పిచ్చి భ్రమ. ఒక కేంద్రస్థానముండుట చాల మంచిది; చెన్నపట్టణమునంటి పెద్దపట్టణములో నట్టి తావును సంపాదింప బ్రయత్నింపుడు, అచటినుండి నల్దిక్కులను మీ ప్రభావము వ్యాప్తిచెందవలయును. నెమ్మదిగా నారంభింపుడు. మతస్థులుగాకున్నను మత ప్రచారకులగు నితరులు కొలదిమందితో నుద్యమమూరంభింపుడు, జీవితమంతయు నుద్యమమునకుగాను ధారపోయువారు క్రమముగా లభింతురు. ఎన్నడును ఆధిపత్యము నెఱప బ్రయత్నింపకుము. ఉత్తమసేవకుడగువాడే యుత్తమ పరిపాలకుడు. ప్రాణభయము కలిగినను సత్య వ్రతమును ధర్మదీక్షను వీడకుము. కృషియే మనకు వలయునది. పేరు ప్రతిష్ఠలతోగాని సిరిసంపదలతోగాని మనకు పనిలేదు...ధీరులై వర్తింపుడు. స్వార్థరహితులై వర్తింపుడు, తప్పక విజయము నందుదురు.

కార్యనిర్వహణార్థము నావత్సలవసరమగుచో, అగ్నికీలలలో దుముకుటకు సంసిద్ధులు కావలయును. కృషి చేయుడు, తీవ్రకృషి చేయుడు, ఫలాఫలములను గూర్చియు లాభనష్టములను గూర్చియు తరువాత ఆలోచించుకో వచ్చును. సహనము, కార్యదీక్ష, నైర్మల్యము ఇవియే మీకు వలయునవి.

.హిందూమతమును గూర్చి యిపుడు నేనే గ్రంథమును వ్రాయుటలేదు; నా భావములను దిజ్మాత్రముగా వ్రాయుచున్నాను. వానిని ప్రకటించుటెంతవఱకు సాధ్యమో నాకే తెలియదు. పుస్తకములలో నేమున్నది? లోక మిూ వఱకే యర్థరహిత విషయములతో గ్రిక్కిఱిసియున్నది. వేదాంతభావములననుసరించి మిూరొక పత్రిక నెలకొల్పగల్గిన, మన యుద్యమాభివృద్ధికి దోడ్పడును. సమన్వయ భావములను జేపట్టుడు, పరులనుగూర్చి లేనిపోని విమర్శలు చేయకుడు. లోకమునకు మిూ సందేశమును దెలుపుడు, మిూరు బోధింపవలయు విషయములను బోధించి యూరకుండుడు. మిగిలినదంతయు భగవంతునకెఱుక.

...నిజముగా మిూరు నాకాప్తులగుచో, నిర్భయులై, అప్రతిహతులై యుండవలయును, సింహసాహసాన్వితులై యుండవలయును. భారతపుత్రులారా! మనము భారత దేశమునే కాక ప్రపంచమునంతను మేల్కొల్పవలసియున్నది. అధైర్యమనునది పనికిరాదు. 'లేదు', 'కాదు' అను నాస్తికవాక్కులను నేను వినను. బోధపడినదా?...ప్రాణాంతమునకైనను సత్యనిష్ఠను కార్యదీక్షను వీడకుడు! ఇందలి కీలకము గురుభక్తి—ప్రాణత్యాగ పర్యంతమగు గురుభక్తి. మిూకట్టి గురుభక్తికలదా? కలదనియే నా మనఃపూర్వకమగు విశ్వాసము. మిూయందు నాకిట్టి విశ్వాసము కలదని మిూకును దెలియును—కావున కార్యరంగమున బ్రవేశింపుడు. మిూరు విజయమునంది తీరుదురు. మిూరేమి తలపెట్టినను, ఉద్యమించినను, అడుగడుగునను నా యాశీస్సులును బ్రార్థనలును మిమ్ము వెంబడించును. ఓర్పుకలిగిపనిచేయుడు. ఎల్లరయెడలను సహనము కలిగి వర్తింపుడు. మిూరందఱును నాకు బ్రేమపాత్రులే. మిమ్ములను నేను గనుగొనుచునే యున్నాను, ముందంజవేయుడు! వెనుకకు జూడకుడు.

మిూ హృదయములను ఆశయములను విశ్వవిశాల మొనరింపుడు. సంస్కృతమును—ముఖ్యముగా వేదాంత భాష్యత్రయము—నభ్యసింపుడు. నాకెన్నియో భావి కార్యాలోచనలు కలవు. కావున నీవు కార్యభారమును వహింప సంసిద్ధుడవై యుండవలయును. సభ్యులను సమ్మోహితుల నొనర్చు మహావక్తవగుటకు బ్రయత్నింపవలయును. శ్రద్ధ యున్నచో సమస్తము చేకూరును. ఈ సంగతి నచటి నావత్సలందఱకును దెలియజేయుము. క్రమముగా వారుచేయు కార్యములు లోకమునకాశ్చర్య జనకములు కాగలవు. ధైర్యోత్సాహములతో బనిచేయుము...నిష్కపటివై యుండుము. నీ యుద్యమమును ఆశయములను వీడకుము. మిూరింతవఱ కొనర్చిన కార్యములు నాకాశాజనకములై యున్నవి. కావున ముందంజవేయుచు ఘనతర కార్యముల నొనర్పుడు.

జనులతో గలహింపకుడు, ఎవ్వరిని విరోధులను జేసికొనకుడు. జనుల వివిధ భావముల యెడ సహనముగలిగి వర్తింపుడు. సహనము, నైర్మల్యము, కార్యదీక్ష—ఇవియే యెన్నటికైనను జయించునవి.

# శ్రీ రామకృష్ణ కథామృతము

## (రెండవ భాగము)

అనువాదము: ప్రవ్రాజిక శ్యామాప్రాణ

ఇంకొక రంగము:

అద్వైతాచార్యుని ఇంటిఎదుట శ్రీవాసుడు మున్నగు భక్తులు మాట్లాడుచుండిరి. ముకుందుడు శ్రావ్యముగ ఒకపాట పాడెను. దాని భావమిది: [ఓ మనసా! ఇక నిద్రచాలించు. ఈ మాయానిదురలో ఎన్నిరోజులు తెలివి తప్పి పడియుండెదవు? నీ వెవరు? ఎందులకు వచ్చితివో మరచితివా? నీ స్వప్నమునుండి లేచి కన్నులు తెఱచి చూడు. ఓ మనసా! నిత్యానందుని కనుగొనుము. చీకటిని విడనాడి ఉదయించు భాస్కరుని గాంచుము.]

ఇంకొక రంగము:

నిమాయి తనగృహములో నుండెను. శ్రీవాసుడు వానిని చూచుటకై వచ్చును. శ్రీవాసుడు మొదట శచీదేవిని గాంచును. శచీదేవి విలపించుచు ఇట్లు పల్కును: "నా కుమారుడు గృహకృత్యములలో పాల్గొనుట లేదు. విశ్వంభరుడు ఇల్లు వీడిపోయినది మొదలు నా గుండెలు కొట్టుకొనుచునేయున్నవి. నిమాయి కూడ సన్న్యాసియగునేమో యని భయమువేయుచున్నది." ఇంతలో నిమాయి అటు వచ్చుచుండును. శచీదేవి శ్రీవాసునితో "చూడు నాయనా! నా పిచ్చివానివలె మారెను. కన్నీళ్లు ధారలుగ కార్చుచుండును. ఇది ఎట్లు ఉపశమింపగలదు?" నిమాయి శ్రీవాసుని చూచి వాని పాదములపైబడి విలపించుచు "ఓ ప్రభూ! నాకింకను కృష్ణభక్తి కలుగలేదే. నా జన్మము వ్యర్థమైపోవుచున్నదే కృష్ణుడెక్కడ? నేను వానినెక్కడ గాంచగలను? ఆ వనమాలిని దర్శించునట్లు ఆశీర్వదింపుము" అని ప్రాధేయపడును.

ఇంకొక రంగము:

నిమాయి తన పాఠశాలలోని విద్యార్థులకు చదువుచెప్పలేక పోవుచుండును. శ్రీ గంగాదాసుగారివద్ద నిమాయి చదివియుండెను. అందుచే గంగాదాసుగారు నిమాయి మనస్సును సంసారమువైపు మరలించు ప్రయత్నముతో వచ్చిరి. శ్రీవాసునితో "అయ్యా! శ్రీవాసు స్వామీ! మనమందరము సంసారములోనే యుండి భక్తితో శ్రీ భగవత్ పూజాదికములను చేయుచున్నాముగదా, మీరీ విషయమును నిమాయికి చెప్పి వాని మనస్సును మరలింపకపోయితిరా? సంసారములో నుండియు భాగవత ధర్మము ననుసరింపవచ్చునుగదా" అని చెప్పి నిమాయివైపు తిరిగి "నాయనా నిమాయి! నీవు సకలశాస్త్ర పారంగతుడవు. నీకు శాస్త్రపాండిత్యము కలదు. గృహస్థాశ్రమ ధర్మము మించిన ధర్మము కలదా? నీవు గృహస్థుడవు. గృహస్థునివలె ఆచరింపక ఇతరుల ధర్మము ననుకరించుచున్నావేల?"

నిమాయి: నేను కావలెనని సంసారధర్మమును నిరసించుటలేదు. కాని నేనేమి చేయను? కర్తవ్యములు నెరవేర్పవలెనని తలంతును. కాని నా మనస్సు స్వాధీనములో లేదు. నన్ను బలాత్కారముగ ఏదో ఒక శక్తి లాగుచున్నది భక్తిసాగరమున మునుగుటకే ప్రోత్సహించుచున్నది."

ఇంకొక రంగము:

నిత్యానందుడు నవద్వీపము చేరును. అతడు నిమాయిని వెదకుచుండును. నిమాయికూడ వానినే వెదకుచుండును. దారిలో ఇద్దరును కలుసుకొనిరి. నిమాయి ఇట్లు పల్కును

'నా జీవితము సార్థకమైనది. నా స్వప్నము ఫలించినది. స్వప్నములో ఒకపరి దర్శనమిచ్చి మరల దాగుకొంటివేల ?''

ఇంకొక రంగము.

నిత్యానందుడు రాజవీథిలో నిలబడియుండును. తలనుండి రక్తము కారుచుండగ చేతితో అదిమిపట్టుకొనును. మధాయి కుండపెంకు విసరి కొట్టును. నితాయి కోపపడలేదు. అతడు ప్రేమానందమున నోలలాడుచుండును. జగాయి మధాయి కడుదుర్మార్గులైన బందిపోటు దొంగలు. వీరలనుద్ధరించుటకే నితాయి ఇన్నాళ్లు వేచియుండెను. తనను గాయపఱచిన మధాయిజగాయిలను సంబోధించుచు నితాయి ఈ పాట పాడ నారంభించెను.

[భావము: ఓ జగాయీ! మధాయీ! మీరు రండి. మనమెల్లరము కలిసి తనివితీర శ్రీ హరి నామ సుధారసమును గ్రోలెదము. మీరు నవ్వుచు నృత్యముచేయుచు రండి. నన్ను కొట్టినందులకు సిగ్గుపడకండి. ఒక్కసారి 'హరి బోల్' అనండి. హరినామస్మరణ చేయుచు నాట్యము చేయుదము. ప్రేమసాగరుడగు శ్రీహరి మనల బ్రోచును. హరినామ ధ్వని ముల్లోకములలో ప్రతిధ్వనించునటు చేయుదము. మీరింకను ఆ హరినామామృతమును రుచిచూడలేదు. హరినామస్మరణ చేయుడు. వానికై విలపించుడు. హృదయాంతరాళములో కృష్ణచంద్రుని ఉదయము కాగలదు.]

ఆఖరి రంగము:

నిమాయి తల్లికి తన సన్న్యాసాశ్రమస్వీకరణ గురించి చెప్పుచుండును. వెంటనే శచీదేవి మూర్ఛిల్లును. ప్రేక్షకులు హాహాకారములు చేయుదురు.

నాటకము ముగిసెను. శ్రీరామకృష్ణులు బండిలో తిరిగి ప్రయాణమైరి. దారిపొడుగున భావావేశులైన శ్రీరామకృష్ణులు ఇట్లు పల్కుచుండిరి: ''హా కృష్ణ! హే కృష్ణ! జ్ఞానకృష్ణ! మనెకృష్ణ! ఆత్మకృష్ణ! దేహాకృష్ణ!...... ప్రాణహే గోవింద మమజీవనే.''

—సశేషము.

# తస్మాత్ జాగ్రత జాగ్రత

చీమలకొండ ఉమారామలింగమూర్తి

ఏదేని ఒక మంచిపనిని ఇట్లు చేయవలెనని ఇతరులకు చెప్పుట తేలికయే. కాని ఆ పనిని తాను ఆచరించి చూపుట బహు కష్టము. There is a long road between saying and doing అను ఆంగ్లనానుడి భావమిదియే. మనస్సునకు వాక్కునకు చేతకు పొంతనము సాధించినవారే మహనీయులు. గాంధిమహాత్ముడు చెప్పినట్లు " The main purpose of life is to live rightly, think rightly and act rightly. నిర్దుష్టజీవనము, సద్బుద్ధి, ఋజువర్తనము - ఇవియే జీవితాశయములై యుండవలెను. ముఖ్యముగ ఆధ్యాత్మికరంగమున అట్టి ఆశయములను సాధించిన గురువర్యుని మాటయందు శ్రద్ధ (Faith) కలిగియుండవలెనని మన శాస్త్రములు చెప్పుచున్నవి. ఆంగ్లకవి Long Fellow చెప్పినట్లు " Lives of greatmen make our lives sublime. మహనీయుల జీవితములు మన జీవితమును అత్యున్నతస్థితికి తీనికొనరాగలవు.''

పురాణపురుషులగు శ్రీరాముడు సత్యహరిశ్చంద్రాదుల జీవితములేగాక ఈ యుగమునకు చెందిన ఆదిశంకరులు, రామకృష్ణపరమహంస, వివేకానందుడు, గాంధిమహాత్ముడు - ఇత్యాది మహాపురుషుల జీవితములును వారొసంగిన ఉపదేశములును అనుసరణీయములు.

రాత్రులందు మైమరచి నిద్రించు పౌరులను మేల్కొల్పి తస్కరుల బారినుండి కాపాడుటకు నవీనకాలమున యూనాదులు, గూర్ఖాలు, పోలీసుసిబ్బంది గస్తీ తిరుగునట్లే పూర్వకాలమున దేశపాలకులు కూడా కొంతమంది కాపలావారిచే హెచ్చరికలు చేయించుచుండెడివారు. ప్రారబ్ధము అనుభవించు నిమిత్తము వెట్టి కులమున జన్మించి గస్తీ తిరిగెడు మహాశయుడు ఒకడు రాత్రులందు నాలుగు జాములలోను ఏ నాడో యిచ్చిన హెచ్చరిక అజ్ఞానాంధకారమున మునిగియున్న మనము అంతశ్శత్రువుల బారినుండి విముక్తి యగుటకు ఉపయోగించును. ఆ హెచ్చరికను గమనింతుము.

మాతా నాస్తి పితా నాస్తి నాస్తి బంధు స్సహోదరః
అర్థం నాస్తి గృహం నాస్తి తస్మా జ్జాగ్రత జాగ్రత.

తల్లి, తండ్రి, సోదరీసోదరులు, ఇతర బంధువులును, గృహము ధనము మొదలగు వస్తువులును మన లౌకిక జీవనమునకు దోహదమిచ్చునవియే అయినను, జీవితగమ్యమగు ఆత్మసాక్షాత్కారమునకు ప్రతిబంధకములే. ఇవన్నియు మనలను సంసారసాగరమున ముంచునవే. వీనివలన అహంకారము (నేను - నాది అను భావము) వృద్ధియగును. బంధువనగా బంధమునుండి తప్పించువాడని అర్థము. మనమందరము సంసారమనెడు బంధములో తగుల్కొనియున్నాము. ఈ బంధమునుండి తప్పించువాడే బంధువు. ఈ కారణముచే లౌకికబంధువులు ఆధ్యాత్మికదృష్ట్యా - పరమార్థ సంపాదనమునకు - శత్రువులవంటివారే. అందువలన అట్టివారు నిరుపయోగముగాన వారు లేనట్లే భావించమని హెచ్చరిక చేయబడినది. సంసార బంధమునుండి తప్పించువారే బాంధవులు. అట్టి బంధువులెవరో గీతయందు ఇట్లు చెప్పబడినది. "ఆత్మైవహ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః" (తనకు తానే బంధువు, తనకు తానే శత్రువు). ఈ వ్యాకము ఒకింత విపరీతముగ కనుపించినను దీని యర్థమును మరుసటి శ్లోకమువలన స్పష్టముగ తెలిసికొనగలము. ఎవడు తన మనస్సును జయించుకొనునో అతడు దేహేంద్రియములను వశీకరించుకొనగలడు. అట్టి మనస్సు తనకు బంధువు ఎవడు తన మనస్సును జయించలేడో అతడు దేహేంద్రియములకు బానిసయై అధఃపతనము చెందును. కావున అట్టి మనస్సు శత్రువు. అందువలన బాహ్యబంధువులగు మాతాపితాదులు మనకు ఒకింత ఉపకారము చేసినను అనురాగమువలన ఆధ్యాత్మిక మార్గమున అడ్డగనే ఉందురు. కాని మన మనస్సును వశీకృతముచేసికొనినచో అది మోక్షము అను శాశ్వత ప్రయోజనమును లభింపచేసి, సంసార బంధమునుండి విముక్తియగుటకు తోడ్పడును. కావున మనము ప్రయత్నపూర్వకముగ (వివేక వైరాగ్యములచే) మనస్సును జయించి, దానిని మిత్రునిగా (బంధువుగా) మార్చుకొని తరించవలసియున్నది. కావున మాతాపితాదులందు ధన గృహాదులందు మోహము తగ్గించుట వలననే అహంకార మమకారములు తగ్గి సంసారమునుండి విముక్తుల మగుదుము. రామకృష్ణపరమహంస నుడివిన ప్రశ్నోత్తరములను గమనింపుడు. "When shall I be free? when 'I' And 'mine' shall cease to be. నేను ఎప్పుడు

విముక్తుడనగుదును? 'నేను' 'నాది' యను భావము నశించినపిదప-'' పూర్వజన్మసంస్కారఫలితముగ ఆదిశంకరులను బాల్యముననే విరాగముకల్గి తనకు ఏకైకబంధమగు తల్లిని అనుమతింపచేసి సన్యసించి ధన్యుడాయెను. అందువలన ప్రాపంచిక బంధువులందు వ్యామోహము పూర్తిగ తగ్గించి అజ్ఞానాంధకారము నుండి మేల్కొనుమని మొదటి హెచ్చరిక చేయబడినది.

జన్మ దుఃఖం జరాదుఃఖం జాయా దుఃఖం పునః పునః
సంసార సాగరం దుఃఖం తస్మాజ్జాగ్రత జాగ్రత

సంసారమనగా జనన మరణ వలయములో నిరంతరము పరిభ్రమించుట. పుట్టుట, చచ్చుట, మరల పుట్టుట మరల చచ్చుట ఈ తీరున జన్మ సహస్రముల నెత్తుచుండుట. మాతృగర్భమున నవమాసములు గడపి ప్రసూతి సమయమున అనేక ఒడుదుడుకులను దాటి భూపతితమైనది లగాయితు జీవితమంతయు దుఃఖభూయిష్టమే. గయ్యాళిభార్య లభించినను, సంతానము లేక పోయినను, అధిక సంతానము కల్గినను, సంతానము నష్టమైనను, లేమరికమువలన కుటుంబ పోషణ చేయలేకపోయినను, ఇతర కుటుంబ బాధ్యతలు నిర్వర్తించలేకపోయినను కల్గు దుఃఖమంతయు జాయా దుఃఖమే. అందువలననే "Marry in haste and repent at Leisure, త్వరపడి వివాహమాడినచో, జీవితమంతయు విచారపడవలసి వచ్చును.'' అని చెప్పుదురు. భగవత్సాక్షాత్కార ప్రయత్నమున నిమగ్నుడైన రామకృష్ణుని పిచ్చివానిగ భావించి పిచ్చి కుదురుటకై పెండ్లి అవసరమని వివాహ బంధమున తగిల్చిన లౌకిక బంధువులను త్యజించి, భార్యయగు శారదామణియందు సైతము కాళీమాతను దర్శించి, ఆ మహానీయుడు పరమహంస ఆయెను. శరీరమున ప్రాణముండు నంతవరకు మనయోగక్షేమముల నరయు భార్యాపుత్రాదులు, అసువులు బాసిన పిదప మృతకళేబరమును చూచి భీతినొందుదురని భజగోవింద శ్లోకములలో ఆదిశంకరులు హెచ్చరించిరి. వార్థక్యమున అశక్తులమై ఇతరుల దయాదాక్షిణ్యములపై ఆధారపడి జీవించుచు నానా క్లేశములను అనుభవించుటయే జరాదుఃఖము. అందువలన జీవితమంతయు దుఃఖమయమే. ఒకచో సుఖమేదైన కల్గినను అది రెండు దుఃఖముల మధ్య విరామము మాత్రమే. అందువలన దుఃఖభూయిష్టమగు జన్మమందు రోతగల్గి యుండుమనియు లేనిచో ఆత్మసాక్షాత్కారము కాదనియు రెండవ హెచ్చరిక చేయబడినది.

ఆశయా బద్ధ్యతే లోకే కర్మణా బహుచింతయా
ఆయుక్షీణం న జానాతి తస్మాజ్జాగ్రత జాగ్రత.

నిత్యము మనోవాక్కాయములచే ఏదియో పనిచేయుచునే ఉందుము. ఇట్టిపని సత్కర్మ కావచ్చును; దుష్కర్మ కావచ్చును. వీనివలన సుఖదుఃఖములు ప్రాప్తించును. సుఖము లభించినపుడు అంతకంటె ఎక్కువ సుఖము పొందవలెననియు కోరుట సహజము. ఈ కోరికనే ఆశ (తృష్ణ) అనవచ్చును. ఈ తీరున కర్మచేతను ఆశచేతను కల్గిన అనేక విచారములతో జీవితమంతయు నిండియుండును. యాచకుని లగాయితు మహారాజువరకు తృప్తి యనునది కానరాదు. రాత్రింబగళ్ళు ఉదయాస్తమయములు శిశిరవసంతములు మరల మరల వచ్చిపోవుట ద్వారా కాలము క్రీడించుచున్నదనియు, ఆయువు మాత్రము తరుగుచున్నదనియు, ఆశమాత్రము తగ్గుటలేవనియు అందులకు గోవిందుని భజించుటయే శరణ్యమనియు ఆదిశంకరులు హెచ్చరించిరి. ఈ తీరున ఆశాలోలురమై ఆయువు క్షీణింపబడుట కూడ

కానలేకపోవు చున్నాము. అట్టి అజ్ఞాన తిమిరమునుండి మేల్కొనవలయునని ఈ మూడవ హెచ్చరిక తెలుపుచున్నది.

కామక్రోధంచ లోభంచ దేహేతిష్ఠంతి తస్కరాః
జ్ఞానరత్నాపహారాయ తస్మాజ్జాగ్రత జాగ్రత.

మన ఆత్మ ఈ శరీరమను దుర్గమున బంధింపబడియున్నది. ఈ దురమునసే కామక్రోధ లోభ మోహ మదమాత్సర్యములను ఆరుగురు శత్రువులుకూడ గలరు. మనకుగల జ్ఞానమను రత్నమును అపహరించుటకే వీరు సర్వదా ప్రయత్నించుచుందురు, కావున జ్ఞానసముపార్జనమునకు ఇవి అన్నియు ప్రతిబంధకములే గాన ఈ ఆరులక్షణములు తస్కరులతో పోల్చబడినవి. కామక్రోధాదులు పరస్పరాధారములు. అన్నిటికి మూలము కామము (కోరిక) విషయములను గూర్చి తలపోయుటవలన వానియందు ఆసక్తియును, ఆసక్తివలన కామమును కామము ఫలించనిచో క్రోధమును క్రోధము వలన వివేకశూన్యతయును దానివలన బుద్ధినాశనమును ఇది సర్వనాశనమునకును దారితీయుననియు గీతాచార్యులు హెచ్చరించియున్నారు. అందువలన అన్నిటికి మూలకారణమగు సంకల్పమును అరికట్టుటకు మనోజయమే మార్గము. మనోజయము ద్వారా కామక్రోధములను తస్కరులబారినుండి రక్షింపబడుటకు అజ్ఞానాంధకారమునుండి మేల్కొనుమని నాల్గవ హెచ్చరిక సూచించుచున్నది.

అందువలన మనోనిగ్రహమే ఏకైకశరణ్యము. ఇందులకు బాహ్యేంద్రియ నిగ్రహము అంతరింద్రియనిగ్రహము అవసరము. కావున శాస్త్రములందు పెద్దల వాక్కునందు విశ్వాసముంచి, పెద్దలుచూపిన మార్గమును అవలంబించి, మనోనిగ్రహమును సంపాదించి అరిషడ్వర్గమును జయించి ఆత్మసాక్షాత్కారము నొందుటయే మన గమ్యమని గ్రహించవలయును.

ఆదిశంకరులు, రామకృష్ణ పరమహంస చూపిన ఆదర్శములను కొంతవరకైనను పాటించుట మన కర్తవ్యముగ ఎంచి కాంతాకనకములందు వ్యామోహమును క్రమముగ తగ్గించుకొనినచో కాలప్రవాహమున మన సంస్కారము దృఢమై కొన్ని జన్మలకైనను ఫలించకపోదు. వివేకానందుడు నుడివినట్లు "Death being so certain, it is the highest thing to give up life for a great purpose. It is better to die seeking God than as a dog seeking carrion. పుట్టినవాడు గిట్టుట తథ్యము గాన ఉదరపోషణార్థము కుళ్ళిన మాంసము కొరకు ప్రాకులాడు కుక్కవలె మరణించుట కంటె భగవత్సాక్షాత్కార ప్రయత్నములో జీవితము ముగించుటయే మంచిది. ఏనాడో ఈయబడిన పై ఆధ్యాత్మిక మేల్కొల్పులను సదా స్మరించుచు మాయామేయ జగంబున నివసించు మనము అజ్ఞానమనెడు స్వప్నావస్థనుండి జ్ఞానమనెడు జాగ్రదవస్థను చేరుకొనుటకు ప్రయత్నింతుము గాక!

# కవిరాజహంసమా!!

డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం

కవిరాజహంసమా!
శివభావరూపమా!!
దివ్యలోకము నీది
కావ్యలోకము మాకు॥

నిశితమౌ నీ మేధ
విశదమౌ నీ యెడద
శివపార్వతులవోలె
చివరి శిఖరంబెక్కె॥ ...కవి

కాళిదాసుడ వీవు
కళ నీకు దాసియౌ
ఇలలోన నిటువంటి
కలయికే కనరాదు॥ ...కవి

ఇతిహాసములతోడ
హితముగూర్చిన ఋషులై
కావ్యామృతము పంచ
కాళిదాసైనారు॥ ...కవి

లలితకళ లన్నియును
తలయొగ్గె నీకెత;
వివిధమౌ శాస్త్రాలు
సవిధేయతన్ మెలగ ..కవి

నీ హస్తతలమందె
సాహిత్యమొక కళగ
శక్తిసంపుల్లమై
రక్తిగాంచినదెంతో॥ ..కవి

నీ కళాగోపనము
మాకు విదితముసేయ
మల్లినాధుడవుగా
మఱల జన్మించితివి॥

దృశ్యకావ్యమ్ములో
శ్రవ్యకావ్యప్రతిభ;
శ్రవ్యకావ్యమ్ములో
దృశ్యకావ్యపు శోభ
ప్రకటించు పటిమమ్ము
సకలమ్ము నీదెగా॥

రంగు, రుచి, వాసనలు
రంగరించిన శబ్ద
జాలమ్మె నీకైత
జాలువారెనుగాదె॥

ప్రతి శ్లోకమే కాదు
ప్రతి పదమ్మునుగూడ
అపవర్గసౌఖ్యమ్ము
నుపమింప రుచిరమ్ము॥

ప్రకృతి సందర్శనా
త్మకమైన రచనచే
సుకవి మార్గమ్ము నా
విష్కృత మొనర్చితివి॥

మలిన కామాంధ ని
ర్మూలనార్థమ్ముగా
శాపోప హతిగూర్చి
తాప మొందించితివి॥

వియోగమ్మె దాంపత్య
రాగనికషమ్ముగా
మేఘసందేశ కా
వ్యమ్ము నందించితివి॥

ఆ సేతు శీతాద్రి
దేశమ్ము సర్వమౌ

కాశమార్గమున నీ
చే సమీక్షితము ॥

ధర్మమె పునాదిగా
అర్థకామమ్ములును
సార్థకంబౌనన్న
అర్థమందించితివి ॥

ధర్మార్థ కామమో
క్షములు పురుషార్థముల్
ధ్వనియించు రఘువంశ
మనెడి కావ్యమ్ములో ॥

ధర్మమునకు దిలీపుండు
అర్థమునకు రఘువర్యుడు
కామమునకు రాజజుండు
మోక్షమునకు శ్రీరాముడు ॥

ప్రేమసంసిద్ధికై
కామార్చనము కాక
కామదహనమ్మె సం
క్షేమమని యెంచితివి ॥

మనుజ సౌందర్యకా
మనము ప్రేరేపింప
దివినుండి యూర్వశినె
భువికి దింపితివహో ॥

పూజ్యపూజన లేక
పూజ్యతయె కల్గదను
కావ్యసందేశమ్ము
దివ్యముగ నొసగితివి ॥

బాహ్యసౌందర్య సం
భావనమె తగదంచు
నిష్ఠాత్మ సౌందర్య
పుష్టి చేకూర్చితివి

ఒకరికొక్కరు తప
స్సంకర్షణము చెంద
లోకార్థ మిర్వురను
ఏకంబొనర్చితివి ॥

ధర్మనిర్వాహణమ్ము
నిర్మలాంతఃకరణ
కర్మానుకౌశలము
మర్మముల్ నీ కవిత ॥

రాజధాని వసించి
రాజమన్ననలంది
కృతక నాగరకతా
మతివి కానేకావు ॥ ...కవి

ఆశ్రమారణ్యముల
ఆశ్రితమనస్వివై
విశ్రుత శ్రుతివిగా
విశ్రమించితి కవిత ..కవి

స్వర్గచ్యుతిని గూర్చి
స్వర్గ సంప్రాప్తిచే
భూమిమీదనె స్వర్గ
ధామమ్ము నిల్పితివి ॥ ...కవి

మానవుండెంత మా
నవ సమస్యలుదీర్ప?
ఋషులకే తగునన్న
విషయ మెఱిగించితివి ॥ .కవి

ఆర్ష కవిపుంగవుల
పార్శ్వవర్తివి నీవు;
లౌకికాలౌకిక
ప్రకటనోజ్జ్వలమతివి । ...కవి

## కవిరాజహంసమా!

సత్యమ్ము వాల్మీకి
శివము వ్యాసమహర్షి
సుందరము కాళిదా
సానంద రూపమ్ము॥ ...కవి

ఎందు జన్మించితివో?
ఎందు మరణించితివో?
మాకెందు కీ గోల?
కావ్యరసమును గ్రోల! ...కవి

రససిద్ధుడవు నీవు;
రసముగ్ధులము మేము;
నీ యశఃకాయమ్మె
జయపతాకము మాకు॥ ...కవి

భీకర గభీరమా
లోకాంబునిధి త్రచ్చి
హాలాహలము మ్రింగి
అమృతమందించితివి॥ ...కవి

నీ శైలి – యితిహాస
శైలీమనోజ్ఞమై
శిథిలతారహిత ప్ర
బంధ బంధురమాయె॥ ...కవి

శ్రుతులలో నిహితమౌ
హితము జాతికి గూర్చు
అతుల సారస్వతా
వాప్తి వాంఛించితివి॥ ...కవి

సకల భారతభావ
నికషోపలము నీవు
ప్రవిలసజ్జాతీయ
కవిసార్వభౌముడవు। ...కవి

ప్రాజ్యకవితా మహా
రాజ్యమేలగ జాలు
సమ్రాట్టు వొక్కడవె
నమ్రమౌ నతులివే॥ ...కవి

రవిచంద్ర తారకా
భవన కీర్తిధ్వజా
కవికుల గురూత్తమా
ప్రవిమలాంజలు లివే॥ ...కవి

అరసికులకు కవిత్వమ్ము
నివేదించు దౌర్భాగ్యము
నొసట వ్రాయవలదన్నను
కొసరి వ్రాసెనా? యజుండు?

అనామికమ్ము సార్థకమ్ము
గా నొనర్చినట్టి కవీ!!
ప్రణామములను స్వీకరించి
మనుపుమయ్య రసజ్ఞులుగ॥

# మాతృదేవిచరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:
ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము:
పి. గణపతిశాస్త్రి

ఆ తరువాత నేను అమ్మతోబాటు ఫలహారం చేశాను. నేను కొన్ని పళ్లు, తియ్యని తినుబండారాలు అమ్మకోసం తీసుకువచ్చాను. నేనవి అమ్మదగ్గిరికి తీసుకురాగానే అవి మున్ముందుగా ఠాకూరుకు నివేదించవలిసిందని ఆమె ఆదేశించింది.

నివేదించిన పదార్థాలలో కొన్ని అమ్మ తన విస్తరినుండి తీసి, కొంచెం కొంచెంగా నా చేతికి అందించింది. ఆ సమయంలో తలవని తలంపుగా నా చెయ్యి ఆమె చేతికి తగిలింది. ఆపైన "అమ్మా, మీ చెయ్యి కడుక్కోండి." అని అన్నాను నేను. ఆమె కొంచెం నీరు తన చేతిలో పోసుకుని "ఇది చాలును" అన్నది.

ఇదే సమయంలో నళినిఅక్కయ్య వచ్చి మా పక్కనే కూర్చున్నది. ఆమె ఏదో విషయంమీద మండిపడుతున్నది. దానిమీద అమ్మ చివాట్లు పెట్టి ఆమె నిలాగ మందలించింది. "స్త్రీల కెంతయినా ఓరిమి ఉండాలి. వారికంతటి ఆగ్రహం సముచితంకాదు. బాల్యంలో తల్లిదండ్రుల ఒడిలో నీడ తప్ప వారికి వేరే మరొక ఆశ్రయమేమిలేదు. ఆపైన యౌవనంలో భర్తసంరక్షణంలో ఉండాలి. వారు సహజంగా అబలులు. అందుచేత విమర్శనల కెల్లప్పుడు సిద్ధపడిఉండాలి. మగవారు వారిని గురించి చిత్తం వచ్చినట్టు మాట్లాడుతూంటే అడ్డగించేవారెవ్వరు లేరు. కనకనే స్త్రీ లంతా మారు మాటాడకుండాలో లోపలే కుమిలిపోవలిసిన అవసరం కలుగుతూంటుంది."

ఆపైన చంద్రబాబుచెల్లెలు మేమున్న చోటికివచ్చి, మాటల సందర్భంలో ఇలాగన్నది. "మాతృదేవి భర్త ఇంకా జీవించి ఉన్నారా? మీరంతా ఆమె సంతానం అని, మీరు కోడళ్లు అని, ఇంకా మిగిలినవారు బంధువులని అనుకుంటాను."

అది విని నేను పట్టలేని ఆశ్చర్యంతో ప్రశ్నించాను. "ఏమిటి? నీ వెప్పుడు ఠాకూరును గురించి వినలేదా? ఆయన ఉపదేశాల సారం అంటే సాంసారిక జీవిత పరిత్యాగమే. [అంటే పూర్తిగా కామినీ కాంచనాల పరిత్యాగమే.] ఆమె నా మాటలమీద చిన్నబుచ్చుకుని "మీరందరు ఆమె సంతానం అనుకున్నాను." అన్నది.

ఆ తరవాత నేను అమ్మతో చంద్రబాబు చెల్లెలు అన్నమాటలన్ని చెప్పాను. అపైన అమ్మ "అవును, అదిగో, ఆ గదిలో ఆమె భర్త ఉన్నారు. మేమంతా ఆమె సంతానమే. అని ఎందుకు చెప్పలేదు?" అని ప్రశ్నించింది.

నేను: అయితే, అమ్మా, ప్రపంచం అంతా అటువంటి సంతానంతో నిండిఉన్నదిగదా!

అమ్మ నవ్వింది. తరవాత ఆమె అన్నది:

"వేరు వేరు విధాలవారిక్కడికి వేర్వేరు అభిప్రాయాలతో వస్తారు. ఎవరో ఒక వ్యక్తి ఠాకూరుకు ఒక గుమ్మడికాయ నివేదించి ప్రార్థిస్తాడు. "ఠాకూరుజీ! నీకు నేను ఫలానా ఫలానా వస్తువులు సమర్పించాను. నీవిక నాకు ఈ కోరికలన్ని అనుగ్రహించాలి.

అమ్మ ఇంకొకపక్కకు ఒత్తిగిలింది. నాకు కూడా నిద్రవస్తూంది. అంతలోనే నేను అకస్మాత్తుగా నిద్రనుండి మేలుకున్నాను. అమ్మ నాపక్కనే కూర్చుని విసనకర్రతో విసురు

తూంది. ఆతరవాత మరికొంతసేపటికి ఆమె పక్కమీదినించి లేచింది. ఆపక్కనే గాలిలో చాలామంది మహిళలు ఆమె సందర్శనంకోసం నిరీక్షిస్తున్నారు. వారిలో ఇద్దరు సన్యాసినుల దుస్తులు ధరించారు. వారివెంట ఒక పిల్లవాడున్నాడు. ఆ సన్యాసినుల్లో ఒకామె అమ్మ దగ్గిరికివచ్చి "మిమ్మల్ని ఒకవిషయం అడగాలని ఉన్నదమ్మా!" అనది.

అమ్మ : దానికేం? అడగవమ్మా!

"విగ్రహాల ఆరాధనలో ఏమయినా యథార్థమున్నదా? మా గురువు ప్రతిమలలో ఏమీ లేదని అంటున్నారు. సూర్యుణ్ణిగాని, అగ్నిని గాని అర్చించవలసినదంటున్నారు."

ఆ సన్యాసిని తన ప్రశ్న ముగించింది. ఆ పైన అమ్మ ఇలాగన్నది.

"మీగురువే ఇలాగన్నారు కనుక ఇక ఈ సంగతి నీవు నన్నడగరాదు. ఆయన మాటల మీద గట్టినమ్మిక ఏర్పరుచుకోవాలి."

అయినా ఆ సన్యాసిని "అమ్మా, మీరు నా ప్రశ్న దాటవెయ్యడానికి వీలులేదు. దీని మీద మీ అభిప్రాయం చెప్పితీరాలి" అని పట్టుపట్టింది. మొట్టమొదట అమ్మ తన అభిప్రాయం వెల్లడించడానికి ఇష్టపడలేదు. కాని బలవంతపెట్టినతరవాత చిట్టచివరికి ఇలాగన్నది.

"మీ గురువు సర్వజ్ఞులయితే-చూశావా? నీవిప్పుడు నాచేత బలవంతంగా ఎలాగ మాట్లాడిస్తున్నావో-ఆయన అలాగ మాట్లాడి ఉండేవారుకారు. బహు పురాతనకాలంనుంచి మానవులు ప్రతిమలనారాధించారు. ముక్తిసాధించుకున్నారు. దానిలో అర్థంపర్థం ఏమీ లేదని నీవంటావా? మన ఠాకూరుకు ఆటువంటి సంకుచితమయిన పిడివాద ధోరణి ఏమాత్రము లేదు. ఆ భగవానుడు సర్వత్ర వ్యాపించి ఉన్నాడు. అయితే నీవీ విషయం మాత్రం గట్టిగా విశ్వసించాలి. మహనీయులు ఇతరులకు మార్గం నిర్దేశించడానికే అవతరించారు. అయితే ప్రతివారు తమతమ ప్రత్యేక విభిన్న పద్ధతిలో ప్రసంగిస్తారు. ప్రపంచంలో అనేక మార్గాలున్నాయి. అందుచేత వారిలో ప్రతి ఒక్కరు చెప్పినది యథార్థమే. ఉదాహరణకు వేరువేరువిధాల పక్షులవిషయం ఆలోచిద్దాము. అవి కొన్ని తెల్లగాను, మరికొన్ని నల్లగాను, ఇంకా కొన్ని ఎర్రగాను ఉంటాయి. అవి అన్నీ ఒకే చెట్టుమీదకూర్చుని వేరువేరు రీతులలో పాడతాయి. వాటి కంఠస్వరాలు మనకనేకవిధాలుగా వినిపిస్తాయి. అయితే, ఆ ధ్వనులనన్నిటిని మనం కలకలం అని పిలుస్తాము. ఆ పక్షుల కంఠస్వరాలలో ఒకేవిధమయినదే కలకలం అని మిగిలినవికావని మనమెన్నడు అనము."

కొంతసేపటిదాకా ఆ సన్యాసినితో వాదించిన తరవాత అందరు మౌనం వహించారు. ఆ తరవాత వారిలో కొందరు ఆమెను, "మీ ఇల్లెక్కడ?" అని ప్రశ్నించారు. "హుగ్లీ జిల్లాలో కమార్‌పురంలో" అని ఆమె సమాధానం చెప్పింది. "నీ ప్రస్తుతం చిరునామా ఇయ్యమ్మా! అప్పుడప్పుడు మేమక్కడికి వస్తాము" అని అడిగారు వారిలో కొందరు. వారికోసం ఆ చిరునామా వ్రాసిపెట్టవలిసిందని అమ్మ అక్కడఉన్న ఒకరికి ఆజ్ఞాపించింది. అమ్మ ఆనతిప్రకారం ఆ సన్యాసినులిద్దరు తీసుకువచ్చిన మధురభక్ష్యాలలోనించి కొంత భాగం కరిగి వారితోవచ్చిన పిల్లవాడికిచ్చాను. వారు వెళ్ళిపోయినపిమ్మట అమ్మ "ఆడవారెందుకని వాదోపవాదాలారంభిస్తారు? వాదాల

వల్ల మహనీయులయిన విజ్ఞులుకూడా ఆ భగవానుని కనుగొనలేకపోయారు. వాదోపవాదాల కెన్నడయినా లక్ష్యంకాగలడా భగవానుడు? ఆయన దానికి అతీతుడుకదా?

మరి కొంతసేపటికి నన్నింటికి తీసుకునివెళ్ళడానికి మా బండివచ్చింది. అది విని మాతృదేవి "అదిగో, గొడవ! పాతిల్‌దోంగానించి బండివచ్చిందని కేకలుపెడుతున్నారు. అప్పుడే అంతటి తొందర ఏమివచ్చింది? అని ఆత్రంగా అన్నది.

అలాగంటూనే ఆమె నెమ్మదిగా లేచి సాయంకాలం పూజకోసం వెళ్లింది. ఆ తరవాత అమ్మ కొన్ని మధురభక్ష్యాలు తీసుకువచ్చింది. వానితోబాటు ఒక పాత్రలో పవిత్రతీర్థము రెండు తమలపాకులతో కూడా తీసుకువచ్చి, ఒకపక్కకి పిలిచి నా చేతికందించింది. మాతృదేవి ఆర్ద్రమయిన ఆప్యాయత గమనించగానే నా కళ్లలో నీళ్లునిండాయి. అమ్మ వారణాసికి బయలుదేరుతున్నది. అందుచేత తిరిగి ఎప్పుడు చూడగలనో అనుకుని ఎంతో ఆత్రపడ్డాను. పూజ పూర్తికాగానే ఉట్టిపడుతున్న ఆత్మీయతతో "మళ్ళీ రా అమ్మా!" అని ఆదేశించింది.

31, జనవరి 1913

జనవరి 17 వ తేదీన అమ్మ వారణాసినుంచి తిరిగివచ్చింది. పొద్దున్న నేను వెళ్లేసరికి ఆమె పూజ చాలావరకు ముగించింది. పూజ ముగించి లేచి "అయితే నీవు వచ్చావన్నమాట! నిన్ను చూడనేమో అని చాలా ఆత్రపడ్డాను తల్లీ! కొద్దిరోజుల్లోనే నేను పల్లెటూళ్లో ఉన్న మా ఇంటికి తిరిగి వెళ్ళిపోతున్నాను" అన్నది. నేను స్వయంగా తయారుచేసిన మధురభక్ష్యాలు కొన్ని నాతో తీసుకువచ్చాను. అమ్మ అది గమనించి "ఈవేళ ఠాకూరు నైవేద్యానికి కావలిసినన్ని మధురభక్ష్యాలు లేకపోయెనే" అని నేనెంతో ఆత్రపడుతున్నాను. అయితే ఆయన మధురభక్ష్యాలు ఆయనే సంపాదించుకున్నారన్నమాట! అందులోను అవి ఇంటిదగ్గిర స్వయంగా తయారుచేసినవి కూడాను" అని సంబరపడింది.

క్రమంగా పొద్దెక్కింది. రాధూ ప్రాతఃకాలభోజనం ముగించుకుని ఇంటికెదురుగా మిషనరీస్కూలుకి వెళ్లడానికి ప్రయాణమయింది. అదేసమయంలో గోలాప్‌మా మాతృదేవితో "రాధూ పెద్దదవుతున్నది. ఆమెనింక స్కూలుకి పంపించడంలో అర్థమేమి లేదు" అన్నది. ఆపైన రాధూని ఇంటదగ్గిరే ఉండిపొమ్మని చెప్పింది. అది విని రాధూ రాగాలు మొదలుపెట్టింది. అంతలోనే అమ్మ అడ్డుకున్నది. "పెద్దదవుతున్నదంటే నీ అభిప్రాయమేమిటి? రాధూని బడికివెళ్లనీ! చదవడము, వ్రాయడము, ఏదయినా చేతిపనిచెయ్యడము — ఇవి రాధూకి ముమ్ముందు ఎంతయినా ఉపయోగిస్తాయి ఎక్కడో పల్లెలో ఉన్న కుటుంబంలోని అబ్బాయికిచ్చి ఆ పిల్లకి పెళ్ళి చేశాము. ఇవన్నీ నేర్చుకుంటే ఆమెకేగాక, ఇతరులకు కూడా ఎంతయినా ఉపయోగిస్తాయి.'

ఆపైన అమ్మ నాకేసి తిరిగి "అవునా కాదా తల్లీ" అని అడిగింది.

చిట్టచివరి రాధూ స్కూలుకి వెళ్ళిపోయింది.

మాతృదేవిని సందర్శించడానికి వచ్చిన మహిళలు ఠాకూరు గదికి ఉత్తరంగాఉన్న వరాండాలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. అందుచేత పెద్ద గొడవ ప్రారంభమయింది. దానిమీద, అమ్మ నాకేసి తిరిగి "శాస్త్రవారిని నెమ్మదిగా మాట్లాడుకోవలిసిందని చెప్పమ్మా! వారి మాటలవల్ల శరత్‌కు

(శారదానందస్వామి)కి మెళకువ రావచ్చును. గదిలో అమ్మ, నేను ఇద్దరమే ఉన్న సంగతి గమనించి నేను ప్రార్థననుగురించి, ధ్యానాన్ని గురించి, సాక్షాత్కారాన్ని గురించి ప్రశ్నించాను. దానిమీద మాతృదేవి ఇలాగ ఉపదేశించింది :

"ఠాకూరు, నేను వేరుకాదని భావించుకుని ఆపైన సాక్షాత్కరించిన దృశ్యంమీద ఎప్పుడయినాసరే, ధ్యానం కొనసాగిస్తూ ప్రార్థించుకో! ధ్యానంలో లీనత కొద్దీ అర్చన అంత మనసౌతుంది. ధ్యానం హృదయంతో ప్రారంభించి, శిరస్సుతో ముగించుకో! నమ్మిక చాలా గొప్పది. దానిముందు మంత్రాలు, పూజా పునస్కారాలు వట్టివే అనుకో అమ్మా! ఠాకూరులో నీ గురువు, నీ దైవతముకూడా సాక్షాత్కరిస్తారు. ఆయనే సమస్తమూను."

ఆపైన మేమిద్దరము గౌరీమాను గురించి, దుర్గాదేవిని గురించి ప్రసంగించడం ప్రారంభించాము. అమ్మవారిద్దరిని ఎంతగానో మెచ్చుకుని అన్నది.

"చూడమ్మా! మిగిలిన జీవితరంగాలలో తమ ప్రయత్నాలన్ని వ్యర్థములయిన పిమ్మటే చాలామంది భగవానుని అన్వేషణ ప్రారంభిస్తారు. కాని బాల్యంనించి పువ్వులా పునీతమయిన తన హృదయం ఠాకూరు పాదాల మీద అర్పించగలిగిన వ్యక్తి నిజంగా మహనీయ భాగ్యశాలి. ఆ అమ్మాయి చేతితో తాకని పూవువంటిది. గౌర్దాసి ఆమెకెటువంటి శిక్షణ ఇచ్చిందో చూడు! ఆమె సోదరులు ఆ బాలిక కెలాగయినా వివాహం చెయ్యాలని ప్రయత్నించారు. అయితే గౌర్దాసి ఆ అమ్మాయిని తనదగ్గిర అట్టేపెట్టుకుని అనేక ప్రదేశాలతో ఆ బాలికతోబాటు దాగుకున్నది. చిట్టచివరికి ఆ అమ్మాయిని తనతోబాటు పూరీ తీసుకుని వెళ్ళి, జగన్నాథస్వామికిచ్చి వివాహం జరిపినట్టు దండలు మార్పించి సన్న్యాసినిని చేసింది. ఆ అమ్మాయి చాలా మంచిది. సుగుణవతి. చాలా చదువుకున్నది. ఆ అమ్మాయి సంస్కృతంలో కూడా ఒక పరీక్షకు కూర్చోబోతున్నదట! ఆపైన గౌరీమా చిన్ననాటి జీవితాన్నిగురించి కూడా అమ్మ నా కెన్నెన్నో విషయాలు చెప్పింది.

ఆమె ఆ రోజుల్లో అనేకవిధాలయిన కష్టనష్టాలపాలయినదట! ఆతరవాత మే మిద్దరము వారణాసినిగురించి మాట్లాడుకున్నాము ఆ సందర్భంలో అమ్మ నాతో "అక్కడ నేనెంతో ఆనందంతో కాలం గడిపివేశాను. దానితోబాటు నా పెద్ద పరివారం అంతా అక్కడ నాతోనే ఉన్నారు" అన్నది.

ఆపైన నలుగురయిదుగురు స్త్రీలు లోపలికి వచ్చారు. తమకేదయినా ఉపదేశం కావలసిందని వారడిగారు. దానిమీద అమ్మ మందహాసంచేసి అన్నది

"నాదగ్గిర మీకేమి ఉపదేశాలు స్వీకరిస్తారు! ఠాకూరు ఉపదేశాలన్ని అచ్చయ్యాయి. ఆయన ఉపదేశాలలో ఒక్కటయినా అనుసరించగలిగితే, నీవు అన్ని అవలంబించినట్టే!" ఆపైన ఆమె చాలా చిన్న విషయాలనుగురించి వారితో ప్రసంగించింది. వారందరు వెళ్లారు. తరవాత నాతో ఇలాగన్నది.

"ఏదేనా సదుపదేశం ఇస్తే స్వీకరించేవారెవ్వరున్నారు? ఆ స్వీకరించేవారు అర్హులయి ఉండాలి. లేకపోతే ప్రయోజనమేమీ లేదమ్మా!

-సశేషం.

# ప్రహ్లాద కథాతత్త్వ విచారము

ధూళిపాళ శ్రీరామమూర్తి

"ఓ ప్రభూ! బ్రహ్మాదులైన ఈ మహానుభావులందరు నీ భక్తులు. రాక్షసులైన మావలె వెరులుగారు. వీరందరు నీ యుగ్రరూపమును జూచి భయపడుచున్నారు. నీవా సత్యమూర్తివి. నీ రమణీయావతారములు సర్వభూతములకు హితమును యాత్మానందము పెంపొందింపవలయును.

కాబట్టి నీ కోపము నుపసంహరింపుము. కోపస్థానమైన నసురుడు హతుడై నాడు వృశ్చిక సర్పములను చంపుటవలన సాధు జనులుగూడా సంతసింతురుగదా. లోకములన్నియు నసురవధ వలన నానందము బొందినది. నీ క్రోధము నుపసంహరింపవలెనని కోరుచున్నారు. నీ రూపము తలచుకొన్న నే భయము పారిపోవును. కావున కోపము నుపసంహరింపుము. భయంకరమైన నీ ముఖము, నాలుక, సూర్యునివలె మండుచున్న నేత్రములు, తీక్ష్ణమైన బొమముడి, కోరలు, ప్రేవుల మాలలు, రక్తరంజితమైన జూలు, మేకులవలె నున్న చెవులు, శత్రువులను చీల్చు గోళ్లు, దిగ్గజములను భయపెట్టు నీ గర్జనలు చూచి నాకు భయము వేయుటలేదు. ఈ సంసారచక్రమును చూచి బెదరుచుంటిని. ఇది ఈ సంసార దుఃఖము దుస్సహము, భయంకరము. దీనియందనేక క్రూరమృగములున్నవి. కర్మపాశములతో బంధములతో నేనిందు బడిపోతిని.

ఓ దయామయా! సంసార తారకములగు నీ చరణకమలముల చెంతకు నన్నెపుడు పిలిచెదవు! ఈ సంసారమునందుబడి ప్రియాప్రియములు యోగ వియోగములవలన బుట్టిన శోకాగ్నిచే బహుయోనులయందు పుట్టుచు తపించుచు దుఃఖప్రతీకారమని భావించుచు, దేహాభిమానముతో భ్రమించుచున్నాను. నాకు నీ దాస్యయోగమిచ్చి తరింపజేయుము.

నీ యనుగ్రహమువలన సత్సంగము కలిగి వీతరాగుడనై నీగుణాను వర్ణనమువలన దుఃఖమును తరింతును. సత్పురుషులు నీ పాదపద్మములను హంసలై యాశ్రయించి యుందురు. వారితోడి సంగమువలన బ్రహ్మాదులు గానము చేసిన నీ లీలాకథలు, నీ గుణములు అనువర్ణించుట దానిచే తేలికగా దుఃఖమును తరించుట సంభవించును. [దుఃఖతప్తునికి దుఃఖశాంత్యుపాయములు లోకములో దొరకుచున్నవిగదా. వాని నాశ్రయింపవలెను గాని నా సేవతో నేమి పనియందువేమో] లోకమునందలి దుఃఖ ప్రతీకారోపాయములు శాశ్వత నివారకములుగావు. పిల్లవానికి తల్లితండ్రులు, రోగి కౌషధము, సముద్రములో మునిగిపోవు వానికి నౌక, శరణములుగావు. గోతిలోపడ్డ పిల్లవానిని తలిదండ్రులు రక్షింపగల్గుచున్నారా? మృత్యుగ్రస్తు నౌషదము రక్షించుచున్నదా? సముద్రములో జనులు పడవతో బాటు మునిగిపోవుటలేదా? కావున సర్వదా నీవే శరణ్యము.

నీ సంకల్పమున కాలముచే గుణక్షోభము పొంది, మాయ నీయంశమగు జీవునికి మనస్సును సృష్టించినది. ఇది కర్మమయము. దుర్జయము. జీవుడే లింగదేహరూపమై మనస్సను సంసారచక్రమునందు తగుల్కొన్నాడు. నీ భజనచేయక దీని నుండి విడివడుటెట్లు? జ్ఞానశక్తిచే బుద్ధిగుణములైన సత్వరజస్తమస్సులను నీవు జయించితివి. కాన మాయ నీ వశమునందున్నది. మాయాప్రేరకమైన కాలము నీ స్వరూపమే. కావున కార్య కారణశక్తులు నీవశమందున్నవి. నీవీశ్వరుడవు. అజేయుడవు. నీ యందు ప్రపన్నుడనైతిని. ఈ షోడశార చక్రము [ఇంద్రియాది షోడశ వికారములుగల మనస్సను సంసారము]

నందు చెఱకుగడవలె నలిగిపోవుచున్న నన్ను నీ పాదమూలమునకుద్ధరింపుము.

ఓ ప్రభూ! లోకమున జనులు కోరుకొను దీర్ఘాయురైశ్వర్యాదికమంతయు నశ్వరమైనది. దిక్పాలురైనవారియాయురైశ్వర్య సంపదాదికమంతయు మా నాయన బొమముడి పాటుచే నష్టమగుట నా కన్నులార చూచితిని. అట్టి మా తండ్రి నీచే హతుడైనాడు.

కావున బ్రహ్మ భోగపర్యంతమైన యాయురైశ్వర్యాదులను, అణిమాది సిద్ధులను గూడా నేను కోరను. ఇవి యన్నియు కాలాత్మకుడవైన నీచే విధ్వంసములగు నట్టివే. కావున నాకు నీ సేవనిమ్ము. ఈ కోరికలన్నియు వినుటకు బాగుండును. ఎండమావులవలె మెఱపులు గ్రక్కుచుండునట్టివి. మరి యీ శరీరము సర్వ రోగములకు నిలయము. దుర్లభములైన తేనె చినుకులవంటి యీ సుఖలేశములతో విద్వాంసుడు గూడా తనకామాగ్నిని శమింపజేయ జూచును. గాని విరక్తిని బొందడు.

ఏమి యాశ్చర్యము! మరినేను రజస్తమ ప్రధానమైన యసురకులములో పుట్టితిని. బ్రహ్మ రుద్రాదులకైనను శ్రీదేవికైనను దుర్లభమైన నీ కరపద్మప్రసాదము నాకు దొరికినది. నీ దయాస్వరూపమేమి చెప్పను!

నీయందెట్లో సర్వజగమునందట్లే సుహృద్భావము గలదు. నీకు స్వపరభేదము లేదు. ఐనను నీవు కల్పవృక్షమువలె సేవానురూపమైన ఫలము నొసంగుదువు. నీ ప్రసాదభేదమునకు కారణము సేవకుల యిచ్ఛాభేదము కారణము గాని నీ పక్షపాతముగాదు

జన్మజరాది సర్పసంకులమైన సంసార కూపమునబడి కామములను కామించుచు భ్రమించు జనములోడి సాంగత్యమున పడిపోవు నన్ను నీ భక్తుడైన నారదుని మూలమున యనుగ్రహించితివి. ఇట్టి నేను నీ సేవనెట్లు వీడగలను?

అకార్యము చేయనెంచిన నా తండ్రి "నీ శిరస్సు నరకెదను. నా కంటె నీశ్వరుడెవడైన యున్నచో నతడడ్డుపడుగాక" యని కత్తిదూసి పలుకుటవలన వాని వాక్యములను సత్యము చేయుటకు నాతని వధించి నా ప్రాణ రక్షణము జేసితివి..

నీవొకడవే యీ జగత్తున కాద్యంతముల యందుంటివి. కావున మధ్యనున్న ఈ జగము గూడా నీ స్వరూపమే. త్రిగుణ పరిణామాత్మకమైన యీ జగము నీ మాయచేత సృష్టించి దానియందు ప్రవేశించి భిన్నునివలె కన్పించుచున్నావు.

ఈ కార్య కారణాత్మకమైన జగత్తు నీకంటె వేరుగా లేదు. నీవు మాత్రము దీనికాద్యంతముల యందుండుట వలన దీనికంటె వేరుగానుంటివి. కావున వీడు నావాడు, వీడు పరుడనుబుద్ధి యర్థరహితమైనది, మాయ. ఈ జగత్తునకు జన్మస్థితి భంగములు నీయందే జరుగుచున్నవి. కావున నీవు పరమకారణుడవు. బీజతరువులు రెండును పృథ్వీరూపమేగదా.

ఈ జగత్తును నీయందే లయింపజేసి ప్రళయోదకమధ్యమున శయనింతువు కాని జీవుని నిద్రవలె నీ నిద్ర తమోవృత్తి రూపము గాదు. మరి నిద్రయనుట కేవలము బహిర్వ్యాపారము లేకపోవుటవలన. యోగముచేత కన్నులు మూతవడి యుండునంతే. దృక్కు లోపించదు. ఆత్మస్వరూప ప్రకాశముచే నిద్రను దిగద్రావి జాగురూకుడవై యుందువు. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను దాటి స్వరూపస్థితి నందియుందువు. సుషుప్త్యవస్థయందున్న వాని వలె తమోయోగముగాని జాగ్రత్స్వప్నము

లందలి త్రిగుణ యోగముగాని విషయయోగము గాని లేనిస్థితియందుందువు.

ఇట్లు ప్రళయోదకమధ్యమున ననంత శయనము నుండి సమాధి విరమించి లేచిన నీ నాభినుండి నీయందే గూఢమైయున్న ఈ లోక పద్మము నీ కాలశక్తిచే ప్రేరేపింపబడిన ప్రకృతి ధర్మములైన సత్వాదిగుణముల వలన బీజమునుండి మహావటమువలె పుట్టినది. కావున నీ విశ్వమంతయు నీ స్వరూపమే.

నీ నాభి పద్మమునుండి పుట్టిన బ్రహ్మ యా పద్మమును తప్ప మరి వేరేమియు చూడజాలక పోయెను. ఆ పద్మమునకును తనకును ఉపాదాన కారణ భూతుడవై లోనవ్యాపించియున్న నిన్ను నూరు సంవత్సరములు నీటిలోమునిగి కూడా బయట కనుగొనుటకు ప్రయత్నించి విఫలుడయ్యెను. అంకురము బుట్టిన తర్వాత దాని యందు వ్యాపించియున్న బీజము బయటనెట్లు కన్పించును?

బ్రహ్మయిట్లు నిన్ను కనుగొనలేక విస్మితుడై మరల నా పద్మమునే తిరిగి యాశ్రయించి బహుకాలము తీవ్రతపస్సు చేసి పరిశుద్ధభావుడై పృథివియందు గంధమువలె సూక్ష్మస్వరూపుడవై భూతేంద్రియములందు సద్రూపమున వ్యాపించియున్న నిన్ను తన యందే కనుగొనెను.

అపుడాయనకు యీ లోకపద్మమంతయు నీ స్వరూపమై భాసించినది. సహస్రవదనములు సహస్రపాదములు, సహస్రకరములు, సహస్ర శిరములు, సహస్రనాసములు, ఊరువులు, కర్ణములు, నేత్రములు కలిగి మాయామయమై ప్రపంచరూపమైన సన్నివేశముతో నొప్పారు నీ విశ్వరూపమును చూచి పరమానందమొందెను.

నీవపుడు హయగ్రీవ మూర్తివై రజస్తమోరూపులును, మహాబలవంతులునగు మధుకైటభులను చంపి, వేదములను బ్రహ్మకిచ్చితివి. సత్వము నీకు మిక్కిలి ప్రియమైన శరీరమని చెప్పుదురు. ఇట్లు నరతిర్యగృషిదేవ మత్స్యావతారములెత్తి లోకములను పాలింతువు. లోకకంటకులను చంపుదువు. యుగానుకూలమైన ధర్మమును రక్షింతువు. కలియందు మాత్రము మరుగుబడి యుందువు. ఆ కారణమున తక్కిన మూడుయుగములందే నీవావిర్భవించుటవలన నీకు త్రియుగుడను పేరు వచ్చినది. అపుడు సత్వోపాధికుడవగుట (సత్వశరీరుడగుట) వలన శిష్టరక్షణము, దుష్టశిక్షణము జేయుదువు. నీకు స్వతస్సిద్ధముగా వైషమ్యము లేదు.

ఈ మనస్సు పాపములు దోషములతో నిండి బహిర్ముఖమై దుర్భరమై కామాతురమై హర్షశోక భయములతోను ధనదారాపుత్రేషణలతోను దుఃఖమును బొందుచున్నప్పటికిని నీ కథలయందు ప్రీతి వహింపదు. ఇట్టి మనస్సుతో నీ తత్వమెట్లు విచారింపగలము?

త్వక్ చక్షు జిహ్వాఘ్రాణ శ్రోత్రములను జ్ఞానేంద్రియములు, వాక్ పాదపాణిపాయూపస్థలను కర్మేంద్రియములు, తలకొకదిక్కునకు లాగుచు శత్రువులై బాధించుచున్నవి. ఇట్టి కష్టదశ నాకొక్కడికేగాదు. స్వకర్మవలననే సంసారమను వైతరణిలోబడి జన్మజరామరణ వ్యాధులచే నతిభీతుడై స్వపర దేహములయందు శత్రుమిత్రత్వముల నందుచు, మూఢులైయున్న యీ జనమును దయతో కాపాడుము.

భగవంతుడా! నీవఖిలగురుడవు. ఈ విశ్వము యొక్క యుత్పత్తిపాలన ప్రళయములు చేయుటకు సమర్థుడవు. ఈ మూఢజనము నుద్ధరిం

చుట నీకెంతపని ! వారి నుద్ధరింపుము. మాదృశులమాట యందువా నీ భక్తజనుల సేవనము వలనే మేము తరింపగలము.

నీ వీరగాథలను గానము చేయుచు ఆ యమృత తరంగములందు తేలియాడు నాకు నీ సంసారసాగరమువలని భయము లేదు. నీ కథామృతమునుండి విముఖులై విషయలోలులై మిథ్యాసుఖముకొఱకు కుటుంబభారమును మోయుచు కృంగిపోవు యీ మూఢజనమును గూర్చియే నా చింత. దేవతలు మునులును కోరికలు విడనాడి పరమార్థనిష్ఠులై నిర్జనారణ్యమునందు సంచరించుచుందురు. వారెవ్వరును యీ మూఢజనుల నుద్ధరించుటకు పూనుకొనరు. నీకంటె మరియొక దేవ్వడును వీరి నుద్ధరించువాడు లేడు. ఈ దీనులను వదలిపెట్టి నే నొక్కడనే యెట్లు ముక్తిజెందుదును?

మైథునాదికమైన గృహస్థుల సుఖము తుచ్ఛమైనది. దురదబెట్టిన చేతులతో గోకికొనుట వంటిది. దురద యొక దుఃఖము. గోకికొనుట మరొక దుఃఖము. ఒక దుఃఖము నశించిన మరొక దుఃఖము. ఇట్లు బహుదుఃఖపాత్రులై కూడా యీ దీనులు తృప్తిబొందరు. దాని నుండి విముఖులుగారు. ధీరుడైనవాడే కండూతి దుఃఖమును సహించును.

మౌనము, వ్రతము, జ్ఞానము, తపస్సు, అధ్యయనము, స్వధర్మము, వ్యాఖ్యానము, ఏకాంతవాసము, జపము, సమాధి – ఈ పదియును మోక్షహేతువులైనను యింద్రియ జయము లేనివారికివి జీవనోపాయములుగనే పరిణమించుచున్నవి. మరి దాంభికులైనవారికీ మాత్రము ఫలముగూడ సందేహమే.

నీ రూపములైన బీజాంకురములవంటి యీ కార్య కారణప్రపంచమును వేదము ప్రకాశింప జేసినది. కాని యరూపకుడవైన నీ స్వరూపమును చెప్పలేకపోయినది. కావున భక్తియోగముచే వ్రతచిత్తులైన మహాత్ములు కార్య కారణముల రెంటను వ్యాపించియున్న నిన్ను దారువులను మథించి యగ్నిని పొందినట్లు తెలిసికొనుచున్నారు.

ఇంద్రియాద్యభిమాన దేవతలు మహదాది పదార్థములు గుణములు వాని ననుసరించిన గుణములు వాని దేవతలు, మనుష్యులు యీ యన్నియు జన్మమరణములు గలవారు. నీవో జన్మమరణములు లేనివాడవు. అనంతుడవు. వీరు నిన్నెట్లు తెలియగలరు? ఇట్లు విచారించి విద్వాంసులు వేదాధ్యయనాది వ్యాపారము నుండి విరమించి చిత్తసమాధిపొంది నిన్నుపాసింతురు. శృతికూడా నిట్లే చెప్పుచున్నది.
"కిమర్థావయమధ్యేష్యామహే కిమర్థావయం యక్ష్యామహే"

మేమేల యధ్యయనము చేయవలయును మేమేల యజ్ఞము చేయవలయునని.

ప్రభూ! నీవు పూజనీయులలో శ్రేష్ఠుడవు. పరమహంసలు మాత్రమే నిన్ను పొందుదురు. నమస్కారము, స్తుతి, కర్మార్పణము పరిచర్య, పాదస్మరణము, కథాశ్రవణము ననునవి నీ సేవకు షడంగములు. వీనిని వదలిన భక్తి మనుజునకెట్లు లభించును? భక్తిలేక నతడెట్లు తరించును? (పై నెలలో ముగింపు)

# స్వామి ప్రేమానంద

డి. వి. బ్రహ్మాజి

శ్రీరామకృష్ణపరమహంస తన శిష్యులలో ఆర్గురిని గురించి నిత్యసిద్ధులని, ఈశ్వరకోటిలోని వారని తరచుగ ప్రశంసించేవారు. ముందుగనే పిందెలు కాసి, పిమ్మట పూలు పూచెడి సొర, గుమ్మడి తీగలవలెనే [ఈ ఆర్గురు శిష్యులును] ముందుగనే భగవత్సాక్షాత్కారమునంది ఆ తరువాత జనసామాన్యమునకు ఆదర్శముగ నుండుటకై సాధనలనవలంభించు మార్గదర్శక పురుషులే నిత్యసిద్ధులు. అట్టి నిత్యసిద్ధులలో మన ప్రేమానందస్వామి యొకరు. సన్యాసాశ్రమ స్వీకారమునకు ముందు ఈయన పేరు బాబూరామ్. వంగరాష్ట్రమునందలి హుగ్లీ జిల్లాలో అంతపూర్ అను సంపన్న గ్రామమునందు నివసించు లక్ష్మీనారాయణతారా ప్రసన్నఘోష్, శ్రీమతి మాతంగినిదాసి అను పుణ్యదంపతులకు 1861 సం॥ డిశంబరు నెల పదియవ తేదీన మన బాబూరామ్ జన్మించారు. ఆ ఊరిలో వీరిది బాగా కలిగిన కుటుంబమే. ఘోషు దంపతులిరువురూ కూడా దైవ చింతన, ఆధ్యాత్మికభావన కలిగిన పుణ్యమూర్తులే. బాబూరామ్‌కు ఇరువురు సోదరులు, ఒక సోదరి ఉన్నారు. వీరి సోదరి కృష్ణభవానిని కలకత్తాలోనున్న బలరాంబోసు అను నాయనకిచ్చి వివాహంచేశారు. ఈ బలరాంబోసు శ్రీరామకృష్ణుని ముఖ్య భక్తులలో ఒకరు. ఈ వివాహము కారణముగా బాబూరామ్‌గారి కుటుంబము శ్రీగురుదేవులకు దగ్గరగా రావడం జరిగింది.

తల్లిదండ్రులు దైవభక్తి పరాయణులు కావడంవల్ల మన బాబూరామ్‌కి సహజముగా బాల్యంనుంచే దైవచింతన ఏర్పడింది. అయితే స్వతస్సిద్ధముగా ఆయనలో ఆధ్యాత్మిక బీజాలు జననమాదిగా ఏర్పాటు అయి ఉన్నాయి. అందువల్లనే అతిపిన్నవాడయిన బాబూరామ్ "నాకు వివాహం వద్దు వివాహంవద్దు. వివాహం చేస్తే నేను మరణించుట ఖాయం." అనేవారు. ఎనిమిదేండ్ల బాలుడుగా నుండగా బాబూరామ్‌కు "చుట్టూ దట్టమయిన చెట్లతో ఆవరింపబడియున్న ఒక ఏకాంత ప్రదేశంలో అఖండ వైరాగ్యభావంతో పటకుటీరమునందు ఇంకొక సాధుపుంగవునితో కలిసి తపోధ్యాన నిమగ్నుడయి ఉండుటయే" తన జీవిత లక్ష్యముగా గోచరించెడిది. తర్వాత ఆయన దక్షిణేశ్వరములోని నటి ప్రాంతము దర్శించినపుడు తను కనిన కలలు రూపుదాల్చినట్లు ఆయనకు అనుభవం అయింది.

బాబూరామ్ తన స్కూలు చదువు పూర్తి అయిన తర్వాత పై చదువులకోసం కలకత్తా నగరం చేరుకొన్నారు. వీరు కలకత్తాలో చదువుతున్న విద్యాలయానికి శ్రీరామకృష్ణ కథామృతమును రచించిన మహేంద్రనాథగుప్త ప్రధానాధ్యాపకుడుగ ఉండేవారు. బ్రహ్మానంద స్వామిగా ఆ తర్వాత పేరుపొందిన రాఖాల్ చంద్రఘోష్ మన బాబూరామ్‌కు సహాధ్యాయి. [illegible] మంచి స్నేహం బలపడింది. అప్పటికే రాఖాల్ తరచూ దక్షిణేశ్వరం వెళ్ళి గురుదేవుని దర్శించి వస్తూఉండేవారు. ఒక శనివారమునాడు బాబూరామ్ తన స్నేహితుడయిన రాఖాలుతో కలసి పరమహంసను చూడటానికి బయలుదేరారు. స్నేహితులిరువురూ కనుచీకటి వేళకు దక్షిణేశ్వరం చేరుకొన్నారు. అచటి ప్రశాంత గంభీర వాతావరణం బాబూరామ్‌కు అత్యంత రమణీయంగ కన్పించింది. బాబూరామ్ సంగతి అంతా విన్న

శ్రీగురుదేవులు ఆయనతో "నీవు బలరాం బోసు బంధువునివా! అయితే మాకు కావలసిన చుట్టానివే" అని ఆప్యాయంగా చుట్టరికమును కలిపివేశారు!! మాటల మధ్యలో శ్రీరామ కృష్ణులు బాబూరామ్ చేతిని తన చేతితో గ్రహించి అక్కడున్న దీపం వెలుతుర్లో అతని ముఖాన్ని, కాలు చేతులను, అరచేతిని అతి సూక్ష్మముగా పరిశీలించి "మంచిది. మంచిది." అంటూ బాబూరామ్‌లోని లక్షణములన్నీ సరిగానే యున్నవని తృప్తి చెందారు. ఆ రాత్రికి బాబూరామ్ అక్కడే నిద్రించారు. మరునాటి ఉదయం ఆయన శ్రీరామకృష్ణుని దర్శించి, శ్రీ గురుదేవుల ఆజ్ఞ ప్రకారం ప్రదక్షిణం చేసి, కాళీ దేవాలయాన్ని దర్శించి వచ్చారు. తన సహజ ప్రేమానురాగాలతో "మరల మరల రమ్మని" శ్రీ గురుదేవులు బాబూరామ్‌తో చెప్పారు.

ఆ తర్వాత ఆదివారం మరల దక్షిణేశ్వరం వెళ్లి, పరమహంస కోరిక మేరకు నరేంద్రనాథుని కలుసుకొన్నారు. ప్రథమ వీక్షణము నందే వివేకానందస్వామి వ్యక్తిత్వము మన బాబూరామ్‌ను ఎంతగానో ఆకట్టుకుంది.

శ్రీరామకృష్ణులను దర్శించే సమయానికి మన బాబూరామ్‌కు సుమారు ఇరువది సంవత్సరముల వయసుంటుంది. కాని, చూడటానికాయన చాలా పసివాడుగా అగుపించేవారు. "పుంసాం మోహనరూపాయ" అన్నట్లుగా ఆయన అత్యంతసుందరాకారుడు. జీవితం చివరి వరకూ కూడా ఆయన్లోని పసివాని అమాయకత్వమన స్తత్వం అట్లాగే నిలచిఉంది. ఈయనను గురించి చెబుతూ శ్రీరామకృష్ణులు: "బాబూరామ్ నరనరాలలోనూ పవిత్రత పాదుకొని ఉంది. అతని మనసునందుగాని, శరీరమునగాని అపవిత్రమయిన ఆలోచనలకు అసలు తావు లేనేలేదు." అని అనేవారు. బాబూరామ్ ఎంతో పవిత్రమయినవ్యక్తి. శ్రీ గురుదేవులు యోగసమాధిలో నుండగా సామాన్యముగా ఇతర జనసంస్పర్శను సహించలేక పోయెడివారు. అట్టి స్థితియందు పవిత్రమయిన కొద్దిమంది స్పర్శను మాత్రమే ఆయన ఓర్వగలిగెడివారు. అట్టి పవిత్ర వర్తనులలో మన బాబూరామ్ ఒకరు. అందువలననే రాఖాలుగాని, లాటూగాని తన దగ్గర లేని సమయాలలో తన పరిచర్యకు శ్రీగురుదేవులు బాబూరామ్‌నే ఎన్నుకునేవారు. బాబూరామ్‌ను గూర్చి చెబుతూ పరమహంస: 'ఇది సరిక్రొత్త చెంబు. కనుక ఏ సందేహం లేకుండా ఇందులో పాలుపోయవచ్చు. చెడిపోతాయనే భయంలేదు." అనేవారు.

శ్రీరామకృష్ణులతో పరిచయం పెరిగిన కొద్దీ బాబూరామ్‌కి చదువుమీద ఆసక్తి సన్నగిల్లజొచ్చింది. ఫలితముగా ఆయన ప్రవేశ పరీక్ష తప్పారు. ఈ సంగతి తెలిసిన గురుదేవులు: "మంచిది. బంధముపడలేదన్నమాట" అని అన్నారు. అయితే, బాబూరామ్ మనస్సు తెలుసుకోవాలనుకొన్న పరమహంస ప్రక్కనే ఉన్న మహేంద్రనాథ గుప్తాతో: "ఈ బాలుడు (ఇహపరాలు రెండూ కావాలని భావిస్తున్నట్లున్నది లౌకికమయిన కొద్దిపాటి విజ్ఞానమూ ఎందుకూ పనికిరాదు. వశిష్ఠ మహర్షి విషయమే చూద్దాం. అంతటి మహాజ్ఞానీ కూడా కొడుకు చనిపోగానే ఎంతోకృంగిపోయాడు. ఈ విషయం విని ఆశ్చర్యపోయిన లక్ష్మణస్వామి శ్రీరామచంద్రుని అడుగగా ఆయన— 'అందులో ఆశ్చర్యం ఏముంది? ఎక్కడ ఎవరికయితే ఎక్కువగా జ్ఞానం ఉంటుందో అక్కడే అంతగానూ అజ్ఞానం కూడా ఆ జ్ఞానమును వెన్నంటి ఉంటూనే ఉంటుంది. ఈ ద్వంద్వ ప్రకృతికి నీవు అతీతుడవు

కావాలి నాయనా' — అని బోధించారు'' అని గురుదేవులు సెలవిచ్చారు. అది విన్న బాబూరామ్ వెంటనే ''నాకు కూడా అట్టి అతీత మనస్తత్వం కావాలి.'' అని తన కోరికను వెలిబుచ్చారు. దానికి జవాబుగా శ్రీరామకృష్ణులు ''నీవా రెండిటిని అంటుకొనియున్నంత కాలం నీకు వాటికి అతీత మానసికస్థితి చేకూరజాలదు. వాటిని వదలి ముందు బయటకురా.'' అని ఉద్బోధించారు. అదివిన్న బాబూరామ్ తన గురువర్యునితో ''మీరే నాకు శరణ్యము. నన్ను బయటకులాగి ఒడ్డుకు చేర్చవలసినది మీరే!'' అని జవాబిచ్చారు. ఈ సమాధానంలో మనకు శ్రీరామకృష్ణులయెడల శరణాగతిని వేడి ఆత్మార్పణ గావించుకొన్న వ్యక్తిగా మనకు బాబూరామ్ వెల్లడి అవుతున్నారు.

శ్రీరామకృష్ణులకు మన బాబూరామ్ అంటే అమితమయిన అనురాగము, అభిమానం. ఒకసారి బాబూరామ్ తల్లి పరమహంస వద్దకురాగా ఆమెతో ఆయన బాబూరామ్‌ను తనవద్దనే ఉండిపోనిమ్మని కోరారు. అందుకామె ఎంతో ఆనందంగా అంగీకరించారు. అయితే తనకు అపారమయిన భగవద్భక్తి కలుగునట్లును, పుత్రశోకం తనకు కలగకుండా ఉండేటట్లును తనను అనుగ్రహించవలసినదిగా ఆమె శ్రీ గురుదేవులను అర్థించింది. పరమహంస కృపా కటాక్షమువలన ఆమె రెండు కోరికలూ చక్కగా నెరవేరాయి. ఆ రోజునుంచీ బాబూరామ్ రామకృష్ణుల చెంతనే నివసించారు. శ్రీ గురుదేవులు బాబూరామ్‌ను 'దారాదీ' [ఆత్మ సహచరుడని అర్థం] అని ఎంతో ఆప్యాయముగా పిలుచుకొనేవారు.

పేరు ప్రఖ్యాతులంటే బాబూరామ్‌కి ఎంతమాత్రము గిట్టవు. ఇందుకు ప్రోద్బలముగా ఒక చిన్న సంఘటన జరిగింది కూడా. ఒకనాడు బాబూరామ్ పరమహంస గదిలోనే ప్రక్కగా పడుకొని ఉన్నారు. ఒక రాత్రివేళ ఆయనకు మనిషి పాదాల సవ్వడి వినబడి మెలకువ వచ్చింది. కళ్ళు తెరచి చూడగా శ్రీ గురుదేవులు పారవశ్య స్థితిలోనుండి అటూ ఇటూ పరుగులెడుతూ ''వద్దు. వద్దు. దూరం దూరం'' అని అరుస్తూ, ''తల్లీ నాకు పేరు ప్రఖ్యాతులు వద్దు–వద్దు తల్లీ–వద్దు'' అని వేడుకోడం గోచరించింది. అదంతా చూస్తున్న మన బాబూరామ్‌కు అసలు విషయం అర్థం అయింది:— జగన్మాత శ్రీరామకృష్ణులకు, పేరు ప్రఖ్యాతులను బహుమతిగా ఇవ్వజూపినట్లును, పరమహంస వాని ముఖము కూడ చూడనొల్లక తిరస్కరించుచున్నట్లును ఆయనకు అర్థం అయింది. ఈ సంఘటన మన బాబూరామ్‌ను గొప్పగా కదల్చివేసింది. నాటినుండి పేరు ప్రఖ్యాతులంటే స్వామికిగల విముఖత్వం మరింత వృద్ధిజెందింది.

శ్రీరామకృష్ణుని సన్నిధానంలో భక్తి గీతములు చెవికి సోకినదే తడవుగా కొందరు పరవశత్వంతో బాహ్యస్మృతిని కోల్పోయేవారు. ఈ విధమయిన అనుభూతి తనకు కూడా ఒనగూడునట్లు చేయమని బాబూరామ్ పలుమార్లు గురుదేవుని అర్థించారు. శిష్యుని బలవంతము మీద శ్రీరామకృష్ణులు ఈ విషయమై జగన్మాతను కోరగా; ఆమె బాబూరామ్‌కు తగినట్టిది జ్ఞానమార్గమేకాని పారవశ్య భావము కాదని వెల్లడిచేసింది. అందుకు శ్రీ గురుదేవులెంతయో సంతోషించారు.

శ్రీరామకృష్ణుల నిర్యాణానంతరం వివేకానందస్వామి బాబూరామ్‌కు సన్న్యాస దీక్షనిచ్చి ''ప్రేమానంద'' అని పేరుపెట్టారు. మన బాబూరామ్ అత్యంత సుందరాకారుడు. ఆయనలో స్త్రీ సహజమయిన మార్దవం నిండిఉంది. పరమహంస అప్పుడప్పుడు ''ప్రేమస్వరూపిణి అయిన రాధాదేవి యొక్క అంశ బాబూరామ్‌లో

ఉన్నది'' అని చెప్పేవారు. ఈ కారణము లన్నిటివల్ల బాబూరామ్‌కి ప్రేమానంద అనే (సన్యాస) నామధేయం చక్కగా అమరినట్లు సరిపోయింది.

శ్రీరామకృష్ణగురుదేవుని నిత్యపూజ చెయ్యడంలో రామకృష్ణానందకు సాటిరాగల మేటి మన ప్రేమానందస్వామియే. రామకృష్ణానందస్వామి మద్రాసు నగరము చేరిన తర్వాత పరమహంస నిత్యపూజను ప్రేమానంద అమితభక్తి ప్రపత్తులతో కొనసాగించారు. వివేకానందస్వామి పరమపదించిన పిమ్మట మఠమునకు అధ్యక్షుడయిన బ్రహ్మానంద స్వామి కార్య నిర్వహణ నిమిత్తం దేశం నలుమూలల పర్యటించవలసి వచ్చేది. అందువలన రామకృష్ణమఠ నిర్వహణ బాధ్యతలను తరచు ప్రేమానందస్వామియే నిర్వహించవలసి వచ్చేది.

మఠానికి వచ్చే భక్తులను ప్రేమానంద స్వామి ఎంతో ఆప్యాయముగా పల్కరించి ఆదరముగా గౌరవించెడివారు. మఠానికి వచ్చే ఆగంతకులు వేళాపాళా లేకుండా వస్తుండేవారు. మిట్టమధ్యాహ్నం వేళలో మఠములోని వారంతా అలసి సొలసి విశ్రాంతి తీసుకునే సమయంలో కూడా నూతనాగంతకులు రావడం జరుగుతుండేది. అట్టి సందర్భములలో మన ప్రేమానందస్వామి వారినాదరించి తానే స్వయముగా వంటింటికిపోయి అతిథులకు వంట మొదలుపెట్టేవారు. అది తెలిసి, మిగిలిన వారంతా పరుగు పరుగున లేచివచ్చి పనులన్నీ పూర్తిగావించేవారు. అప్పుడు స్వామి ఇట్లా పలికెడివారు: ''సంసారులైన వారికి అనేకమయిన పనులు చక్కబెట్టుకొనవలసి ఉంటుంది. సక్రమమయిన వేళకు రావలెనంటే వారికి సాధ్యపడదు. శ్రీరామకృష్ణుల దయవలన మన ఇక్కడ అన్నీ ఏ లోటూ లేకుండా చక్కగా అమరిఉన్నాయి. వచ్చిన అతిథులకు కాస్త వండి పెట్టడానికి మనం కష్టం అనుకొనరాదు. వీరిని ఆదరించటం ద్వారా మనం శ్రీ గురుదేవుల అనుగ్రహమునకు పాత్రులము కాగలము.''

ప్రేమానందస్వామి దృష్టిలో మఠమును సందర్శింపవచ్చెడి వారిలో కూడా ఒక ప్రత్యేకమయిన యోగ్యతఉంది. ''జల్సాగా, వినోదంగా కాలం గడపడానికి జనానీకానికి చాలా అవకాశములున్నాయి. కాని, కొందరు ఇక్కడికి వస్తున్నారు అంటే, అట్లా వచ్చే వారిలో విశిష్టమయిన యోగ్యత ఉన్నట్లే. లేకపోతే వారిక్కడకెందుకు వస్తారు!'' అనే వారు ప్రేమానందస్వామి.

ప్రేమానందస్వామి ఆదర్శప్రాయుడైన గొప్ప గురువర్యుడు. నాయకుడన్నవాడు ముందు తాను త్యాగానికి సిద్ధపడి ఉండాలని, తాను ఆచరించి మార్గదర్శకుడై శిష్యులకు బోధించాలని స్వామికి బాగా తెలుసు. ''సర్దారు'' (నాయకుడు) ఎప్పుడూ ముందుగా ''శిరదార్'' [తన తలను త్యాగం చెయ్యగలవాడు]గా తయారయి ఉండాలని ఆయన తరచూ చెబుతూండేవారు. ఒకసారి మహమ్మదీయుడొకడు హిందూ స్నేహితులతో కలసి మఠానికి రావటం జరిగింది. ఆతనికి మఠంలోని కార్యకర్తలు ఆకులలో అన్నపెట్టారు. అన్నం తిని ఆ మహమ్మదీయుడు వెళ్ళిపోయిన పిమ్మట ఆ మతాంతరుడు భుజించి విడచిన ఎంగిలాకులను బాగుచేసి ఆ ప్రదేశాన్ని శుభ్రంచేయడానికి కార్యకర్తలు ఎవ్వరూ ముందుకురాలేదు. అది చూచి మన ప్రేమానందస్వామి తానే స్వయంగా ఆ పనినంతా తన చేతులతో పూర్తిచేశారు!! ఇట్లాంటిదే మరియొక సంఘుటన మనస్వామి 1917 సం॥ లో మైమన్సింగు

[ప్రస్తుతం ఇది బంగ్లాదేశ్‌లో ఉంది] పర్యటిస్తున్నపుడు జరిగింది. స్వామి ఒకనాడు "అందరిలోను ఒకే ఒక భగవంతుడున్నాడు." అని బోధిస్తుండగా విని ఒక మహమ్మదీయుడు లేచి "అయితే నేను తాకిన ఆహారాన్ని మీరు స్వీకరించగలరా స్వామీ?" అని సవాలుచేశాడు. "ఓ. నిరభ్యంతరంగా స్వీకరిసాను." అని జవాబిచ్చి ప్రేమానంద స్వామి ఆ మహమ్మదీయుడు తాకిన ఆహారాన్ని నిస్సంకోచంగా స్వీకరించారు. ఈ విధముగా తాను చెప్పినది చేసి చూపించడంలో ప్రేమానందస్వామి మార్గదర్శకంగా ఉండేవారు.

తనను వివేకానందస్వామి ఆజ్ఞాపించిన కట్టడి ననుసరించి మన స్వామి ఎవరినీ కూడా వ్యక్తిగతంగా తన శిష్యులుగా స్వీకరించ లేదు. మంత్రదీక్ష నీయవలసినదిగా ఎవరయినా బలవంతంచేసే ఆయన వారి నందరిని శారదా మాత వద్దకుగాని, బ్రహ్మానందస్వామి వద్దకు గాని పంపించెడివారు.

తాను స్థాపించిన సంస్థ ఒక నూతన చైతన్యానికి కేంద్రమయి, విజ్ఞాన సముపార్జనకు పీఠమయి, పవిత్రమయిన భావములతో ప్రజానీకాన్ని ప్రభావితం గావించవలెనని వివేకానందస్వామి వాంఛించారు. ఈ కోరిక సఫలీకృతం కావడానికి ప్రేమానందస్వామి తన సర్వస్వమూ ధారవోసి కృషిచేశారు. మఠములో సంస్కృతవిద్యావ్యాప్తికి, వేదాంత బోధనకి ఆయన చక్కటి దోహదం కల్పించారు.

ప్రేమానందస్వామి దృష్టిలో ప్రతి వనితా జగన్మాత యొక్క ఆవిర్భావమే. ప్రతి స్త్రీని ఆయన పూజాదృష్టితోటి మాత్రమే పరికించేవారు. ఆడవాళ్ళమధ్య ఆయన ఒక పసిపిల్లవానివలె నిష్కల్మషంగా ప్రవర్తించేవారు. స్వతహాగా స్త్రీ సహజమయిన లాలిత్యము, సౌకుమార్యము ఆయనలో చోటుచేసుకొని ఉండినవి. అందువల్ల స్త్రీలు — అందునా పరదాలలో ఉండే (ముస్లిం) ఘోషాస్త్రీలు కూడా ఏ సంకోచం లేకుండా స్వామి బోధనలు వినడానికి వచ్చేవారు.

వ్యక్తిగతసౌఖ్యానికి మనస్వామి మాత్రమూ ప్రాముఖ్యం ఇచ్చేవారు కారు అన్నం తినడానికి కూర్చున్నపుడు తన విస్తరిలో నుండే రుచ్యమయిన భక్ష్యాలను తన చుట్టూ కూర్చున్న చిన్నవాళ్ళకు పంచి ఇచ్చేవారు. ఆయన చనిపోయిన పిమ్మట స్మృతి చిహ్నంగా దాచిపెట్టడానికి ఆయన వస్తువుల కోసం వెదుకగా వెదుకగా లభించినవి — ఒక కాన్వాసు గుడ్డసంచి, కొన్ని పుస్తకాలూ మాత్రమే!! అంతటి నిరాడంబర నిర్లిప్త జీవిత మాయనది.

శ్రీరామకృష్ణ మఠమునందు సుమారుగా ఆరు సంవత్సరముల కాలం పనిచేసిన తర్వాత ప్రేమానందస్వామి; శివానందస్వామి తురీయానందస్వాములతో కలసి 1910 సం॥ లో అమరనాథ్ క్షేత్రమునకు యాత్రవెళ్లారు దారిలో ఢక్కానగరంలో ఒక చోట చెరువులలో బుడగ తామర అమితంగా విస్తరించి నీళ్ళు త్రాగుటకు పనికిరాకుండా చెడిపోవడం గమనించారు మన ప్రేమానందస్వామి. వెంటనే అక్కడున్న యువకులను ఉద్బోధించి ఆ పరిసరాలలోనున్న సరస్సులన్నింటి చీడ మొక్కలను తొలగింపజేసి నీటిని పానయోగ్యం గావించారు. ఈ విధముగా యువతరాన్ని సంఘటితపరచి నిర్మాణాత్మక కార్యోన్ముఖులుగా తీర్చి దిద్దడంలో స్వామి అందెవేసిన చేయి అని నిరూపించుకున్నారు.

అమరనాథ్ యాత్ర చాలా కష్టాలతో కూడినది. ఈ సుదీర్ఘ ప్రయాణం కారణంగా ప్రేమానందస్వామి ఆరోగ్యం బాగా దెబ్బ తింది. శాండ్ ఫ్లై అనే కీటకంవల్ల కాలా అజార్ అనే వ్యాధి వ్యాపిస్తుంది. ఈ రోగం వచ్చిన వారి చర్మం రంగు నల్లబడిపోయి, లివరు బాగా చెడిపోతుంది. ప్రేమానందస్వామి ఈ కాలా అజార్ వ్యాధికి గురిఅయ్యారు. ఈ రోగంతో దాదాపు సంవత్సరము ఆరు మాసాలు బాధపడ్డారు. వ్యాధినుండి కోలు కొని కొంచెం పుంజుకొంటున్నారు అనుకొనే సమయంలో ఇన్‌ఫ్లూయంజా [ఫ్లూజ్వరం] పాతబడి 1918 సం॥ జూలై నెల 30 న ప్రేమా నందస్వామి పరబ్రహ్మంలో ఐక్యమయ్యారు.

# పుస్తక పరిచయము

**వేమన సూక్తులు:**

రచయిత: చల్లా రాధాకృష్ణశర్మ. పేజీలు: 248. వెల: రూ. 4.10. ప్రతులకు: లక్ష్మీనారాయణ గ్రంథ మాల, 9-నాగార్జున నగర్, కోడంబాకం, మద్రాసు-24.

పందొమ్మిది సాహిత్యవ్యాసముల సంపు టియే ఈగ్రంథము భారతి, సంస్కృతి మొ॥ సాహిత్య పత్రికలకు అప్పుడప్పుడు వ్రాసిన వ్యాసములను, రేడియోలో చేసిన కొన్ని ప్రసం గములను ఒకటిగాకూర్చి ఈ పుస్తకముగా రచ యిత వెలువరించియున్నారు. రచయిత అయిన శ్రీ చల్లా రాధాకృష్ణశర్మగారు ఆంధ్ర సాహి త్యలోకమునకు సుపరిచితులు. ప్రస్తుతము వీరు సాహిత్య అకాడమి దక్షిణ భారతవిభాగమునకు కార్యనిర్వాహకులుగా పని చేయుచున్నారు. తమిళసాహిత్యమును తెలుగువారికి, తెలుగు సాహిత్యమును తమిళులకు పరిచయము చేయు టకుకూడ ఈయన కృషి చేయుచున్నారు. ఈ గ్రంథములోకూడ, తెలుగు తమిళుల పరస్పర ప్రభావమునుగూర్చి కొన్నివ్యాసములు రచ యిత చేర్చియున్నారు. (తెలుగు సాహిత్యంలో తిరువత్తూరి ప్రశంస, తమిళముపై తెలుగు వెలుగు, కురవంజి, తెలుగులో కవిత చెప్పిన తమిళుడు, త్యాగయ్య కృతులు మొ॥)

అర్థ అవగాహనకు ఎక్కడా క్లేశముగలగని సరళసుందరమైన శైలిలో ఈ గ్రంథములోని వ్యాసములు రచింపబడినవి. అన్ని పాఠశాలల్లో, కళాశాలల్లో, గ్రంథాలయాల్లో, సాహితీ ప్రియుల ఇళ్లల్లో ఉండవగిన పుస్తకమిది.

-సదాశివం.



# చార్వాక దర్శనము

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

ఆత్మ పదార్థం దీనివల్ల తెలియపడుతుంది అనే అర్థంలో దర్శన శబ్దాన్ని శాస్త్రకారులు ఉపయోగించారు. కానైతే, చార్వాక మత దృష్ట్యా చూస్తే ఆత్మ అంటూ వేరే ఒకటి లేదు. దేహమే ఆత్మ. ఆస్తికులైనవాళ్లు ఈ దర్శనాన్ని గూర్చి ఆలోచిస్తే గుండె గుభిల్లుమంటుంది. ఒకవిధంగా నాస్తికులైన వాళ్ళకి కూడా యీ మతసిద్ధాంతం ప్రాణాంతకంగా కనుపిస్తూ ఉంటుంది. దీనికి కారణం మన ప్రత్యణువులోను చిరకాలంగా నిబద్ధమైఉన్న మతధర్మప్రభావమే.

ఇలాంటి భయంకర నాస్తిక మతాన్ని మనం తెలిసికోవడం ఎందుకు? అని సంశయం కలగవచ్చుగాని, అపశబ్దజ్ఞానం సుశబ్దజ్ఞానానికి ఎలా అవసరమో, ధర్మజ్ఞత్వానికి అధర్మపరిజ్ఞానం ఏ విధంగా ఆవశ్యకమో, జ్ఞానసముపార్జనకి, అజ్ఞానజ్ఞానం ఏ రీతిగా ముఖ్యమో, ఇదీ అదే విధంగా.

ఈ దర్శనాన్ని ఆదిలో సృష్టించినవాడు బృహస్పతి. అతఁడు చార్వాకుడికి ఉపదేశించాడు. అతగాడు శిష్యప్రశిష్యులద్వారా లోకంలో వెలయింపజేశాడు. అందుకే దీనికి "బార్హస్పత్యం" అనికూడా ఒక పేరు. అర్థకామాలే పురుషార్థాలని అనుకొని పారలౌకిక చింత అంటూ లేక ఉండేవారు కనక చార్వాకులను లోకాయతులనీ, చార్వాకానికి లోకాయతమనీ పేళ్లు పెట్టారు. 'చారు వాకః' అని విడదీసి సుందరంగా సంభాషించేవారు కనక యీ పేరు పెట్టేరని అంటారు.

దేవుడు లేడు, పరలోకం లేదు. పుణ్యాపాపాలు లేవు, అని చెప్పడమే సుందరతా లక్షణం.

ఈ చార్వాకం అడాపుడీ లేకుండా తనకు తానే దేశమంతా స్వయంగా ప్రచారం చేసుకుంటూ ఉంది. ఎన్ని దర్శనాలుపుట్టినా, యీ మతానికి మాత్రం కలిలో చావులేదు. సృష్ట్యాదిని పుట్టిన దర్శనం సృష్ట్యంతం వరకూ ఉండి తీరుతుంది అని ఒక సిద్ధాంతం.

బృహస్పతి చార్వాకుడితో అంటూన్నట్టు వ్రాసిన యీ పద్యం వినండి.

> అవతార మెత్తనీ, ఆదిశంకరుఁడు నీ
> కొఱకు వెంట్రుకయును నూడఁబోదు
> విలసిల్లనీ, ప్రబుద్ధుల మతవాదముల్
> లేదు నీకొక లోపలేశ మేని
> పుట్టనీ, అద్వైతములు, ద్వైతములు, విశి
> ష్టాద్వైతములు నీకు నగునె యెగ్గు
> కలుగనీ, లక్షలకొలఁది దర్శనములు
> సరిగావు నీమత స్థిరత జెఱుప
> అంగుళంబైన నీదు సిద్ధాంతములకు
> జంకు గలుగదు, నీకు గళంకు లేదు
> అన్ని యుగముల నన్ని దేశాంతరముల
> గొంచెమో గొప్పయో నీకుఁగూడుఁ జావు.

ఇంక, చార్వాకమత సిద్ధాంతాల్ని గూర్చి కొంచెం ముచ్చటించుకుందాం.

ఈ మతంలో పృథివి, జలం, తేజస్సు వాయువు అనే నాలుగు భూతాలే తత్త్వాలు. ఆకాశాన్ని వీరంగీకరించరు. ఈ నాలుగు భూతాలవల్లే శరీరం సృజ్యమానమవుతుంది చైతన్యయుక్తంగా, ద్రాక్షాసవాదులవల్ల మత్తు కలిగేటట్టు. చైతన్యముతో కూడుకున్న దేహమే ఆత్మ అంటేను వీరి మతంలో. ప్రత్యక్ష ప్రమాణానికి అందనిదవడంచేత, దేహంకంటె వేరే ఏదో ఆత్మపదార్థం ఒప్పడం

వీరికిష్టంలేదు. కంటికి కనబడనివస్తువు వీళ్ళకి లేదన్నమాటే. ఇదో తమాషా. గోడ అవతల గాని; మేడమీదగాని ఎవళ్లైనా ఉన్నా, ప్రత్యక్షం అవడం లేదు గనక వాళ్ళక్కడ లేరనే వీరంటారు.

మనోవిషయం, మనోహరమైన వెలదులని కౌగలించుకోవడంవల్ల కలిగిన సుఖమే పురుషార్థం. అంతకంటె మరో పరమపురుషార్థం వీరికనంగీకారం. ఏమంటే, దాన్లో దుఃఖం తప్పనిసరిగావుండి తీరుతుంది. దుఃఖమనేది దానంత అది ప్రాప్తిస్తూవున్నా, మత్స్య భక్షకుడు ముళ్ళచేపను తెచ్చి, ఆ ముళ్లు తొలగించివేసి మిగిలిన పదార్థాన్ని భక్షించే విధంగానే, దుఃఖాన్ని పరిహరించుకుంటూ సుఖమే అనుభవించాలంటారు అది వినా, వేరే పురుషార్థం లేదంటారు. బిచ్చగాళ్లు బాధిస్తారని చెప్పి వంట వండుకోవడం మానుతామా? దూడలు తినివేస్తాయని వరి వేసుకోడం విరమిస్తామా? ఎప్పుడో పాపంచుట్టుకుంటుందని, ఎదురుగా ఉన్న సుఖాన్ని అనుభవించకుండా విడిచిపెట్టకూడదు అంటారు వీరు. ఏదో పారలౌకిక సుఖాన్ని ఆశించి కళ్లు చిల్లులు చేసుకుని అగ్నిహోత్రాదులు ఆచరించడంవల్ల ప్రయోజనం శూన్యం అంటారు.

**అగ్నిహోత్రం త్రయోవేదా త్రిదండం భస్మగుంఠనమ్,**
**బుద్ధి పౌరుష హీనానాం జీవికేతి బృహస్పతిః.**

అని శ్లోకం.

స్వర్గంలేదు. అపవర్గంలేదు. ఆత్మలేదు. పరలోకసుఖం లేదు. వర్ణాశ్రమాది ధర్మ క్రియాచరణం ఫలదాయకం కాదు. అని యీ మతంవారి మతం. నరకమంటే ఎక్కడో లేదు. ముల్లు గ్రుచ్చుకుంటే కలిగిన బాధలాంటి బాధే నరకం.

పరమేశ్వరుడంటే లోకప్రసిద్ధుడైన రాజే. మోక్షమంటే దేహోచ్ఛేదమే. వీరు దేహాత్మవాదులు కనక, నేను లావుగా ఉన్నాను, నేను సన్నగా ఉన్నాను, నల్లగా ఉన్నాను అనుకునే వ్యవహారం సామానాధికరణ్యోపపత్తి. ఇది నా శరీరం అనే వాడుక 'రాహువు శిరస్సు' అనే దానిలాగ ఔపచారికం.

బ్రతికినంతకాలం హాయిగా బ్రతకాలి. అప్పుచేసినా, నేతి మజ్జిగలతో గొప్పగా భోజనం చేయాలి. తగులబడిన తరవాత దేహం మళ్ళీ తిరిగి వస్తుంది అనడం వెఱ్ఱి. మృతకళేబరానికి బ్రాహ్మణులుచేసే సంస్కారాలన్నీ వట్టి డాబుకోసం. వేదాలు అపౌరుషేయాలనుకోవడం అసత్యం. భండ ధూర్త నిశాచరులే ఆమ్నాయకర్తలు. జర్భరి, తుర్ఫరి అనే పండితుల పలుకులే వేదాలు.

అని యీ విధంగా చార్వాకులు తమ సిద్ధాంతాల్ని నిర్వచించారు. ఈ దర్శనం దూరదృష్ట్యా చూస్తే ఎలాంటివాడికేనా భీతిదాయకంగా ఉండకతప్పదు. దూరదృష్ట్యా అనడం ఎందుకు? ఆపాతతః చూసినా భీతిగానే ఉంటుంది. కాని, ఆదిలో బయలుదేరిన మతానికి ఏవో కొన్ని సిద్ధాంతాలూ, కొన్ని తత్త్వాలూ, కొన్ని ప్రమాణాలూ అంటూ ఉండడంకూడా ప్రశంసింపదగ్గదే.

కొన్ని సిద్ధాంతాలంటూ వుంటేనేకాని, దాన్ని దర్శనమే అనరు. చార్వాకం ఏదో ఒకకట్టు ఏర్పరచడం చేతనే దాన్ని దార్శనిక గౌరవంతో మహామహులంతా చూచారు.

ఈ విషయం ఇలా ఉంచితే, అసలు దర్శనాలు ఆస్తిక నాస్తిక భేదంచేత రెండు విధాలుగా విభజించారు. "అస్తి నాస్తి దిష్టం మతిః" అని పాణినీయ సూత్రం. పరలోకం

లేదనేవారు నాస్తికులు. ఉంది అనేవారు ఆస్తికులు. పరలోకం అంటే భగవంతుడన్న మాట. ఒక మతంలోనే ఆస్తికులూ నాస్తికులూకూడా ఉంటారు. సేశ్వరసాంఖ్యం, నిరీశ్వరసాంఖ్యం అందుకే పుట్టాయి. బౌద్ధులలోకూడా రెండు మతాలవారూ ఉంటారు.

అనంతకోటి విశ్వంలో అందరికీ ఒకే అభిప్రాయం ఉండదు. కాని సాధారణంగా అందరూ ఆనందసంపాదనం కోసమే తంటాలు పడుతూ వుంటారు. ఆనందమే మోక్షమని సర్వమత సాధారణమైన అభిప్రాయం. దానికోసము ఒకడు కర్మలు చేయాలని అంటాడు, ఒకడు జ్ఞానం అవశ్యకం అంటాడు. మొత్తం అందరికీ ప్రాప్యం ఒకటే. అందుకే దర్శనాలు షడ్దర్శనాలే కాకుండా ఇరవై ముప్పై ప్రధాన దర్శనాలు ఉత్పన్నం అవటానికి కారణం అయింది. పాషండికులలో మూడు వందల మతాలున్నాయి. బౌద్ధంలో ప్రధానాంగంగా నాలుగు మతాలు వెలువడ్డంకాకుండా, పద్దెనిమిది నికాయభేదాలున్నాయి. జైమినీయ దర్శనానికి జైమినిశిష్యులు వివిధపంథాలు తీశారు. తత్త్వభేదం చేతనూ, దేవతాభేదం చేతనూ ప్రమాణభేదం చేతనూ, దేశంలో ఎన్నో దర్శనాలు బయలుదేరాయి. ఇదే మానవమతుల్లో ఉండే వైవిధ్యం.

మన మిప్పుడనుకున్న చార్వాకం నాస్తిక దర్శనమైనా, నాస్తికంలోనూ పరమనాస్తికమైనా, ఇది తరువాత పుట్టిన దర్శనాలన్నిటికీ మార్గదర్శకమై కొంత ఉపకరించింది. లోకాయతమనే తనకున్న పేరు సార్థకం చేసుకుంటూ, ఎన్ని మతాలు లోకంలో వున్నా, చార్వాకం మాత్రం ప్రతీవాదిలోనూ, కొద్దోగొప్పో ప్రసరిస్తూనే వుంటుంది. చార్వాకానికీ కలికాలానికీ సన్నిహితసంబంధం కూడాను. శ్రీనాథ మహాకవి కలినిగూర్చి వ్రాస్తూ నైషధంలో అంటాడు—

"బౌద్ధులం బాటించుం బరమబంధుల వోలె
చార్వాకులకుం గరాంజలి ఘటించు
జైనులం బొడంగన్న సంతోషమునం దేలు
జేయని మ్రొక్కు లోకాయతులకు–"

(1945 సెప్టెంబరు శ్రీరామకృష్ణప్రభ సంచికనుండి)

సూర్య చంద్ర తారాగ్రహరాసులు వినాశనం పొందినా, నీవు వినాశనం పొందవు. నీవు సమస్తస్థలకాలాత్మవు! నీవు అవినాశివి! నీవు స్థిరుడవు!–దీన్ని తెలుసుకో. ఇట్టి మహాభావంతో గాలిపీల్చు. శ్వాసకోశాలద్వారా, మనస్సు ద్వారా, ఇట్లు పూరకం చెయ్యి! మనస్సుద్వారా సమస్త ప్రపంచాత్మను లోనికి పూరించు. సర్వ విశ్వమును లోనికి ఉచ్ఛ్వసించు! ఈ ప్రకారం నీవు ప్రకృతితో ఐక్యం పొందు! నీ జీవితం సమస్త విశ్వైక్యశ్రుతితో ప్రదీపిస్తుంది.

-రామతీర్థ.

# సూతసంహిత

## ఏలూరిపాటి అనంతరామయ్య

### : కాలపరిణామమూ — ఆ కొలతకురాని స్వరూపమూ :

నైమిశీయులు "అనఘా, విద్వాంసుడా, కాలవేత్తలు కాలసంఖ్యను ఎలా చెప్పారు? కాలపుకొలతకు రానివాడెవడు? దయచేసి చెప్పు" అని అడిగారు 1.

సూతుడు చెప్పాడు :

కాలసంఖ్యను నేను కోటి జన్మలలో కూడా చెప్పజాలను. మునీంద్రులకూ దేవతలకూ మహాత్ముడైన శివునికీ కూడా శక్యం కాదు 2. అయినా, (మీామీాది) ఆదరంవల్ల మీాకు సంగ్రహంగా చెపుతాను.

: కాల పరిమాణం

పండితోత్తములారా, (ఒక రెప్పపాటు కాలానికి నిమేషమని పేరు.) పదిహేను నిమేషాలు ఒక కాష్ఠ 3. ముప్పై కాష్ఠలో ఒక కళ. ముప్పై కళలు ఒక ముహూర్తం. ద్విజులారా, ముప్పై ముహూర్తాలు ఒక మానవ దివారాత్రం 4 విప్రేంద్రులారా, పదిహేను అహోరాత్రాలు ఒక పక్షం. రెండు పక్షములు ఒక మాసం. ద్విజోత్తములారా, ఆరుమాసములు 5 ఒక అయనం. రెండు అయనములు ఒక వర్షం. ఆ రెండు అయనములకూ క్రమంగా దక్షిణాయనమనీ ఉత్తరాయణమనీ పేరు.

: దేవమానం :

స్వర్గలోకవాసులకు (దేవతలకు) దక్షిణాయనం రాత్రి. ఉత్తరాయణం పగలు 6. ద్విజులారా, పండితులు మనుష్యులకు చెప్పినట్లే దేవతలకూ పక్షాలనీ, నెలలనీ అయనములనీ, సంవత్సరాలనీ విభాగం చెప్పారు 7.

2-4. మానవదివారాత్రం అన్నవరకు చెప్పినది సావనమానం. సౌరచాంద్రనక్షత్రమానాలలో మనుష్యులకు వ్యవహారం లేదు. మనుష్యులకు సావనమానం, పితృదేవతలకు చాంద్రమానం, దేవతలకు సౌరమానం. సూర్యుడు కనిపించేది పగలనీ కనపడనిది రాత్రి అనీ ఏర్పడ్డాయి. సూర్యోదయం మొదలు అరవైగడియలలో ఒక పగలూ ఒక రాత్రీ ఉంటాయి. చంద్రునివృద్ధి క్షయాలనుబట్టి లెక్కగట్టేది చాంద్రమాసం. కృష్ణాష్టమినాడు పితృదేవతలకు సూర్యోదయం. అమావాస్యనాడు మధ్యాహ్నం. శుక్లాష్టమినాడు అస్తమయం. పూర్ణిమినాడు అర్ధరాత్రం. ఇది చాంద్రదహోరాత్రం.—తా. దీ.

---

5. 'పదిహేను అహోరాత్రాలు' అంటే తిథులన్నమాట. అప్పుడు శుద్ధపాడ్యమినుంచి పూర్ణిమవరకూ శుక్లపక్షం. మిగిలినది కృష్ణపక్షం. 'రెండు పక్షములు' అన్నది చాంద్రమానాన్నిబట్టి చెప్పినది. సావనమాసం ఎప్పుడారంభమైనా ముప్పైసూర్యోదయాలు ఉండటం ముఖ్యం. సౌరమాసం సూర్యుడు ఒక రాశిలో ఉండేకాలం కనుక అందులో రెండు పక్షాలనరు. 'ఆరుమాసాలు ఒక అయనం'నుంచి సౌరమానాన్ననుసరించి చెప్పినది. తా. దీ.

7. మనుష్యులకు పదిహేను తిథులు ఒక పక్షం. రెండు పక్షాలు ఒక చాంద్రమాసం. రెండు అయనాలు ఒక సంవత్సరం. సౌరమాసం సూర్యుడు ఒక రాశిలో ఉన్నకాలం. ఆరు రాసులలో ఉన్నకాలం అయనం. రెండు అయనాలు సంవత్సరం అని మనుష్యమానాన్ననుసరించి కాలవిభాగం చేసినట్లే, దేవతలకూ దేవమానాన్ననుసరించి చేయింబవట్లూ పక్షాలూ నెలలూ అయనాలూ సంవత్సరాలూ అని భావం.—తా. దీ.

పన్నెండువేల దివ్యవర్షాలు చతుర్యుగం అంటారు. అందులో కృతయుగం నాలుగు వేల సంవత్సరాలు విప్రులారా 8. అనఘులారా, కృతయుగసంధ్యా, సంధ్యాంశమూ ఎనిమిది వందల సంవత్సరాలు. మూడు వేల దివ్య సంవత్సరాలు త్రేతాయుగం 9. కృతయుగంలో సగం ద్వాపరయుగం, దానిలో సగం కలియుగం. మునిపుంగవులారా, త్రేతా ద్వాపర కలి యుగాల సంధ్యా సంధ్యాంశాలకాలం (కృత యుగ సంధ్యా సంధ్యాంశాలకాలంలో ఒక్కొక్క యుగానికీ) క్రమంగా నాలుగవ వంతు తగ్గుతూ ఉంటుంది. ఈ ప్రకారం విప్రులారా, పన్నెండువేల సంవత్సరాలు చతుర్యుగమనబడినది 10, 11.

డెబ్బైఒక్క చతుర్యుగాలు ఒక మన్వంతరం. బ్రహ్మయొక్క ఒక్క పగటిలో మనువులు పధ్నాలుగురు 12. (అనగా పధ్నాలుగు మన్వంతరాలు బ్రహ్మకు ఒక పగలు) పండితులు బ్రహ్మయొక్క ఒక్క పగటిని కల్పం అంటారు. పండితోత్తములారా, బ్రహ్మకు రాత్రికూడా అంతటిదే 13. మూడువందల అరవై కల్పాలు బ్రహ్మకు ఒక సంవత్సరం. బ్రహ్మయొక్క నూరు సంవత్సరాలను ఇక్కడ ద్విపరార్థం అంటారు 14

: కాలం కొలతకురానిది శివ స్వరూపం :

మునిశ్రేష్ఠులారా, బ్రహ్మయొక్క అంతంలో జగత్తు మాయలో లీనమవుతుంది. అలాగే విష్ణురుద్రులూ ప్రకృతిలో లీనమవుతారు 15. సువ్రతులారా, బ్రహ్మ విష్ణు రుద్రుల వివిధ (అవతార) మూర్తులు తమ కారణాలలో (మాయయొక్క సత్త్వరజస్తమోగుణాలలో) లీనమవుతాయి 16. మాయకూడా ప్రళయ కాలంలో సత్యబోధ సుఖానందుడై బ్రహ్మ రుద్రుడు మొదలైన పేర్లుగలిగి పరుడైన పరమేశ్వరునిలో 17. అభేదస్థితిని పొందుతుంది. అందుకు హేతువు తెలియటం చాలా కష్టం.

---

9-11. కృతయుగం తొలిసంధ్య 200 సంవత్సరాలు + సంధ్యాంశం 200 + యుగశరీరం 4000 + మలి సంధ్యాంశం 200 + సంధ్య 200 = 4,800 సంవత్సరాలు. త్రేతాయుగం తొలిసంధ్య 150 సంవత్సరాలు + సంధ్యాంశం 150 + యుగశరీరం 3,000 + మలి సంధ్యాంశం 150 + సంధ్య 150 = 3,600 సంవత్సరాలు. ద్వాపరయుగం తొలిసంధ్య 100 సంవత్సరాలు + సంధ్యాంశం 100 + యుగశరీరం 2,000 + మలి సంధ్యాంశం 100 + సంధ్య 100 = 2,400. కలియుగం తొలిసంధ్య 50 సంవత్సరాలు + సంధ్యాంశం 50 + యుగశరీరం 1,000 + మలి సంధ్యాంశం 50 + సంధ్య 50 = 1,200 = నాలుగు యుగాల మొత్తం 12,000 దివ్యసంవత్సరాలు.—తా. దీ.

12-13. కల్పాదిని ఒక సంధి, ప్రతిమన్వంతరం చివరా ఒకొక్క సంధి చొప్పున 15 సంధులు ఒకొక్కటి కృతయుగప్రమాణం కలవి ఉంటాయి. కృతయుగప్రమాణం దివ్యసంవత్సరాలు 4,800 × 15 = 72,000. ఒకొక్క చతుర్యుగానికీ 12,000 దివ్యసంవత్సరాలు గనుక ఇవి 6 చతుర్యుగాలతో సమానం. 14 మన్వంతరాలంటే 71 × 14 = 994 + 6 = 1,000 చతుర్యుగాలు బ్రహ్మదేవునికి ఒక పగలు. అది ఒక కల్పం. ఆతరవాత భూర్భువస్వర్లోకాలకు లయం. బ్రహ్మగారి రాత్రిపరిమితీ ఇంతే, అంటే, 1,000 చతుర్యుగాలే. ఆ రాత్రితరవాత లోకత్రయానికి పునస్సృష్టి. తా. దీ.

14. కల్పాలు 360 + 360 కల్పాలపరిమితిగల రాత్రులూ కలిపి ఒక సంవత్సరం అన్నమాట. తా. దీ.

మరొకటిలా కనిపిస్తున్నది కనుక ఇది మాయ అనబడుతున్నది 18. ఆత్మతత్త్వాన్ని తిరస్కరించినందువల్ల తమస్సు అంటారు పండితులు. విద్యను పోగొడుతున్నది కనుక అవిద్య అనీ, అవిద్యకు కారణం కనుక మోహమనీ అంటారు 19. సత్తునకు విలక్షణమైనందున అసత్తనీ, కార్యనిష్పత్తికి హేతువైనందున కారణమనీ పండితులు చెపుతారు 20. కార్యంలా వ్యక్తంకాదు కనుక అవ్యక్తం అనబడుతున్నది. ఇది మాహేశ్వరశక్తి. పరమాత్మకున్న స్వాతంత్ర్యం దీనికి లేదు 21.

దేవదేవుడు పరమాత్మ అయిన శివునికి ఈ మాయతోగల సంబంధం పరమమైనకాలం. సర్వప్రాణులూ ఆ కాలానికి వశమైనవి 22. అదీ సాక్షాన్మహాదేవునిలో సదా మాయచేత కల్పితమైనది. సర్వులూ కాలంలో లీనమవుతారు. కాలం ఎన్నడూ లయం కాదు 23. పండితులారా, కాలమూ, మాయా, మాయా కార్యమూ శివునిచే ఆవరింపబడినవి. కాలతత్త్వంలాగనే శివుడూ కాలంకొలతకు అందడు 24 అయినా, కాలం అసత్యం కనుక మాయతోపాటు లీనమవుతుంది. ద్విజులారా, శివుడు సత్యస్వభావుడు కనుక విలయం పొందడు 25. పుట్టిన, గిట్టిన, పుట్టనున్నవాటికి కాలం కొలతకందని శివుడు కారణం 26. ఈ దేవునిప్రసాదంవల్ల బ్రహ్మవిష్ణ్వాదిస్థానాలు లభిస్తాయి. సర్వజగత్తూ ఆయనకు వశమైనదని ఈ శాశ్వతశ్రుతి చెప్పుచున్నది 27. పండితోత్తములారా, అసంఖ్యబ్రహ్మలూ అసంఖ్యులు విష్ణురుద్రులూ, అసంఖ్యులు వాసవాదులూ విలయంపొందారు 28.

సాక్షాత్తూ శివుడొక్కడే సృష్టిస్థితి ప్రళయాలు సిద్ధించటానికి బ్రహ్మవిష్ణుశివులనే కల్పనలతో విజృంభించాడు 29. పండితోత్తములారా, బ్రహ్మ తనను రజోగుణం ఆవరింపగా ఆ గుణాన్ని అధిష్ఠించి సర్వజగత్తుకూ సృష్టికర్త అవుతున్నాడు 30. బుధులారా, విష్ణువు తనను తమోగుణం ఆవరించగా సత్త్వగుణాన్ని అధిష్ఠించి సర్వజగత్తుకూ పాలకుడూ ప్రభువూ అవుతున్నాడు 31. అలాగే, సత్యవాదులారా, విప్రులారా, రుద్రుడు తనను సత్త్వగుణం ఆవరించగా తమోగుణాన్ని అధిష్ఠించి సర్వజగత్తుకూ సంహర్త అవుతున్నాడు 32. గుణభేదంవల్ల బ్రహ్మవిష్ణు శివుల మూర్తులు అంతులేనన్ని కలుగుతాయి సువ్రతులారా 33. ద్విజులారా, వేదవిత్తములారా, కొన్ని మూర్తులు సత్త్వగుణోద్రేకంవల్ల విశిష్టమైనవి. కొన్ని తమోగుణోద్రేకంవల్ల సంహారకములవుతాయి 34. ద్విజులారా, ఇవి జగద్ధితం కోసం పరస్పరం ఆధారములవుతాయి. సర్వమూర్తులలోనూ ఈ శివుడు సాక్షాత్తూ సత్యాదిలక్షణుడు 35. అప్రచ్యుతమైన ఆత్మభావంతో సదా ఉంటాడు సువ్రతులారా. ఆయనను 'నేను' అనుకొనే మిషతో సర్వప్రాణులూ

18. కార్యప్రపంచానికి విలయమైనపుడు కారణమైనమాయకూడా పోక, దానికి అభేదస్థితి దేనికి? అంటే, మళ్ళీ సృష్టిచేయటానికి అన్నారు. అసలు మళ్ళీ సృష్టి ఎందుకు చెయ్యాలి? అంటే, అందుకు హేతువు తెలియటం చాలా కష్టం. "కొందరు భోగంకోసమనీ, మరికొందరు క్రీడకోసమనీ అంటున్నారు. ఇది దేవునిమహిమ. అన్నీ తీరిన వానికి కోరిక ఏమిటి?—భోగార్థం సృష్టిరిత్యన్యే, క్రీడార్థమితి చాపరే! దేవస్యైష స్వభావోఽయమాప్తకామస్య కా స్పృహా" అని గౌడపాదాచార్యులవారూ, "లోకంలాగే కేవలలీలకు. లోకవత్తు లీలాకైవల్యం" అని వ్యాసులవారూ అన్నారు. విష్ణుపురాణం కూడా ఆడుకొనే పిల్లవాని చేష్టలవంటివే ఆ స్వామిచేష్టలు—క్రీడతో బాలకస్యేవ చేష్టాస్తస్య నిశామయ" అన్నది. తా. టీ.

తెలుసుకొంటున్నవి 36. అయినా, మాయవల్ల శివుడని గ్రహింపలేవు. బుధులారా, దేవదేవుని ప్రసాదంవల్లా, వేదనిష్పన్నమైన ఆత్మ విద్య వల్లా బహుజన్మలచివర శివుని తెలుసుకొంటారు 37 ప్రసాదహీనులు, పాపిష్ఠులు, మాయామోహితులు అయినజనులు పుట్టు చావు మొదలైనవాటిపీడపడుతూ దేవేశుని తెలుసుకోనే తెలుసుకోరు 38. జనులు ఏ యే మూర్తిని ఆశ్రయించి బ్రహ్మభావనతో ఆరాధించినా వారందరూ క్రమంగా శంకరుని తెలుసుకొంటారు 39. రుద్రునిమూర్తిని ఆరాధించి ప్రసాదంవల్ల క్రమంలేకుండానే అప్రయత్నంగానే సర్వత్ర ఉన్న శివుని తెలుసుకొంటారు 40. సర్వరుద్రమూర్తులలోనూ శివుడు బాగా ప్రకాశిస్తూ ఉంటాడు. ఇతరమూర్తులలో తారతమ్యంతో సాక్షాత్తూ శివుడు ప్రకాశిస్తూ ఉంటాడు 41. ద్విజులారా, నిర్మలమైన అద్దంలో ముఖం బాగా ప్రకాశించినట్టు, శుద్ధ మూర్తులలో మహాదేవుడు మిక్కిలీ ప్రకాశిస్తూ ఉంటాడు 42

వేదవిత్తములైన బ్రాహ్మణులారా, రుద్రమూర్తి నాశ్రయించిన కొన్ని వేదవాక్యాలు పరమకారణమైన శివునియందు 43 పర్యవసిస్తున్నవి. అలాగే విప్రేంద్రులారా, విష్ణుమూర్తిని ఆశ్రయించిన వాక్యాలు కొన్ని, బ్రహ్మమూర్తిని ఆశ్రయించినవి కొన్ని 44, అగ్నిమూర్తిని ఆశ్రయించిన వేదవాక్యాలు కొన్ని, సూర్యమూర్తినీ, ఇతరమూర్తులనూ ఆశ్రయించినవి కొన్ని (శివునియందు పర్యవసిస్తున్నవి) 45

: ఎన్ని పురాణాలు ఏ దేవుని చెప్పతాయి? :

విప్రులారా, పదిపురాణాలు శంభునిగూర్చి చెపుతున్నవి. నాలుగు విష్ణుభగవానునిగూర్చీ, రెండు బ్రహ్మనుగూర్చీ చెపుతున్నవి 46. విప్రేంద్రులారా, ఒకటి అగ్నినీ, ఒకటి సూర్యునీ కీర్తిస్తున్నవి. మునీశ్వరులారా, ఈ విధంగా మూర్తిపేరు ద్వారా 47 ప్రతిపాదింపబడే మహాదేవుడే అన్ని మూర్తులలోనూ ఉన్నాడు.

ఆయనే మోక్షప్రదాత, సత్యాదిలక్షణుడు, సాక్షాత్తూ శివుడు 48. సర్వదా బ్రహ్మవిష్ణుమహాదేవులకు ఉపాస్యుడు ద్విజులారా, శివుని కంటె వేరైనది అర్థం. విప్రేంద్రులారా, అతడే అవినాశ్యుడుగదా 49.

ఈయన ఆత్మవేత్తలకు ఆత్మ. అజ్ఞానులకూ ఈయనే (ఆత్మ). బుధులారా, మాయామయమైన ఈ జగత్తంతా ఈయననుంచే జన్మించినది, ఈయనయందే ఉన్నది. ఈయనలోనే లీనమయినది 50. మునిశ్రేష్ఠులారా, ప్రతికల్పంలోనూ బ్రహ్మనారాయణాదులు 51 ఈయననుంచే జన్మిస్తారు; మునుపటి ప్రకారమే లీనమవుతారు. అందరిలో సాక్షిగా ఉండేవాడు ఈ హరుడు మహాదేవుడు ఒకడే 52.

అంబికాసహితుడు, శ్రీమన్నీలకంఠుడు, త్రిలోచనుడు, చంద్రార్ధశేఖరుడు శ్రీమద్వ్యాఘ్రపురంలోనూ 53. వారాణసిలోనూ, సోమనాథంలోనూ, వృద్ధాచలంలోనూ, వేదారణ్యంలోనూ, వల్మీకంలోనూ, శ్రీమత్కేదారంలోనూ 54. సర్వస్థానాలలో ఉత్తమోత్తమమైన శ్రీమద్దక్షిణకైలాసంలోనూ, అఖిల

భక్తులతో, అమరేశ్వరులతో నిత్యమూ సన్నిహితుడై ఉంటాడు. విప్రులారా, నిత్యశ్శోకులేవారందరికీ (ఆయన) సర్వదా ఉపాస్యుడు 55. సంసారమగ్నులకు ఉపాస్యుడు మోక్షప్రదాత అయిన ప్రభువు వేరే ఎవడు 56 సాక్షాన్మహాదేవుడు తక్క! అని శాశ్వతశ్రుతి (చెపుతున్నది).

కనుక సర్వప్రయత్నమూ చేసి మునిసత్తములు మీరు 57 కాలపాశవినాశంకోసం శంకరుని శశిశేఖరుని ఉపాసించాలి. ఆయనను గూర్చి వినాలి. ధ్యానించాలి ద్విజోత్తములారా 58.

అనిన సూతునిమాట విని నైమిశారణ్యవాసులైన పండితులు శివుడు కాలం కొలతకు అందనివాడు అని తెలుసుకొన్నారు 59.

ఇది శ్రీ స్కాందపురాణం శ్రీ సూతసంహితలో
శివమాహాత్మ్యఖండంలో 'కాలపరిమాణమూ
ఆ కొలతకు రానిస్వరూపమూ' అను
ఎనిమిదవ అధ్యాయం.

# ప్రార్థన

ఎన్ని కొండ లెన్ని మెట్లు
ఎటుల ఎక్కగలను నేను
మనసు నిలపలేని నేను.

మోహాచలం ఎక్కలేక
మొదటి మెట్టులోనె జారితి

ఈర్ష్యాద్రిని ఎక్కబోయి
అడివారములోనె కూలితి

గర్వాచలం చూడగానె
కళ్ళు తిరిగి ఒళ్ళు తూలె

కడమ కొండలు దాటలేక
గుండె లేమో జారిపోయె

కరుణ జూచి బ్రోవరావా
గట్టి మనసు నొసగలేవా
ఏడుకొండల వేంకటేశా!

—చల్లా రాధాకృష్ణశర్మ

# బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## శ్రీరామకృష్ణ దేవుని నిర్యాణము

భర్త చనిపోతే భార్య విధవరాలుగా మారుతుంది. శ్రీ శారదాదేవి కూడా అలా చెయ్యాలనుకుంది. చేతిమురుగులు తీయబోతుంటే రామకృష్ణదేవుడు కనుపించి 'నీవు యేంచేస్తున్నావు? నేనెక్కడికిపోయినానని. ఇక్కడేయున్నానుగదా! ఈ గదిలోనుండి ఆ గదిలోకి పోయినాను. అంతే!'' అన్నారు. శ్రీ శారదాదేవికి కొంత దిగులు తగ్గింది. అలా చేయటం మానింది. చీరెకున్న పెద్దఅంచు చింపి చిన్నఅంచు వుంచుకున్నది. అప్పటినుండి అలాంటి చీరెలే కట్టింది.

మనుష్యుడు చావటం అంటే ఏమిటి? శరీరాన్ని వదలిపెట్టుతాడు. మనము ఒక చొక్కాతీసి యింకోచొక్కా వేసుకోవటంలేదా! ఒక గదిలోనుండి యింకోగదిలోకి పోవటం అంటే అంతే. ఆ విషయమే రామకృష్ణదేవుడు శ్రీ శారదాదేవికి చెప్పారు.

ఇలాగే శారదాదేవి రెండు మూడుసార్లు మురుగులు తీయబోయింది. అన్నిసారులు రామకృష్ణదేవుడు కనుపించి అలాగే చెప్పారు. అప్పటినుండి అలా చెయ్యటం మానింది.

శ్రీరామకృష్ణదేవుడు చనిపోగానే కాశీపూరులోని యిల్లు ఖాళీ చేయాలనుకున్నారు. అలాచేస్తే శారదాదేవికి మరీ దిగులు కలిగిస్తుంది. అందుచేత అయిదురోజులదాకా వుంచారు. తర్వాత శ్రీ శారదాదేవి బలరాంబోసు అను గొప్పభక్తుని యింటికి వెళ్ళింది.

శారదాదేవి విధవగ మారబోవ
రామకృష్ణుడు పల్కెవో నామెతోడ
''ఎక్కడికిపోయినానని యెంచినావు?
ఇక్కడేయుండినాడ నీ కెదురుగాను
ఒక్క గదినుండి పోతి వేరొక్కగదికి''

# దక్షిణేశ్వరాలయ ప్రతిష్ఠ

(నాటిక)

శ్రీమతి భువనగిరి లక్ష్మీకాంతమ్మ

## ఇందలి పాత్రలు

1. రాణీ రాసమణి - ఆలయనిర్మాత
2. మధురబాబు - రాణీ అల్లుడు
3. మహేశచంద్రుడు - గుమాస్తా
4. హేస్టి - ఒక వకీలు (ఆలయానికి స్థలం ఇచ్చినవారు)
5. ఈశ్వరదత్తు - ప్రభుత్వోద్యోగి
6. రాద్ధాంతి } బ్రాహ్మణులు
7. సిద్ధాంతి } బ్రాహ్మణులు
8. శాస్త్రి } బ్రాహ్మణులు
9. రామకుమారుడు - రామకృష్ణుని అన్న
10. గదాధరుడు - రామకృష్ణుడు
11. హృదయుడు
12. గృహిణి
13. మదవిక - రాణీ దాసి

### ప్రథమాంకము

[స్థలము కలకత్తాలోని రాణీ రాస్మణి భవనము. ఒక మేజా చుట్టును కుర్చీలు అమర్చబడియున్నవి.

కుర్చీలపై యథాస్థానముల నాసీనులై ప్రదేశము-రాణీ రాష్మణి-మధురబాబు-మహేశచంద్రుడు.

రాణీ - మహేశా! బెస్తవారిని గురించి మనము ప్రభుత్వానికి, వ్రాసిపంపిన అర్జీకి సమాధానం వారు ఏమి వ్రాసిరి? అనుకూలంగా వ్రాసిరా?

మహే:- ప్రభుత్వం "పల్లెవాండ్రు నిరపాయంగా చేపలు పట్టుకొనుటకు తగిన సదుపాయం చేసుకొనవచ్చును" అని వ్రాసిన దానిని బట్టి నేను నదికడ్డముగా రెండు గొలుసులు వేయించితిని.

మధురబాబు:- అమ్మా! తమ కాశీయాత్రకు నూరుపడవలు, సకల సౌకర్యాలతో బందోబస్తుగా, సిద్ధంగా ఉన్నవి. తమరు పరివారంతో బయలుదేవచ్చును.

రాణీ:- మధురబాబూ! కాశీయాత్ర విరమించుకొన్నాను.

మధు:- ఎందువల్ల?

రాణీ:- నిన్నరాత్రి కాళీమాత నాకు కలలో కనబడి గంగాతీరాన్ని తనకొక దేవాలయం నిర్మించి తన్నందు ప్రతిష్ఠింపుమనియు తానచ్చట ప్రత్యక్ష దేవతవలె ఉంటాననియు చెప్పింది. కాశీయాత్ర ఆ దేవికి యిష్టంలేదు.

(ప్రవేశము హేస్టి)

హేస్టి:- రాస్మణీరాణికి జయము.

రాణీ:- హేస్టీ! నీకు స్వాగతము. వచ్చి కూర్చుండుము.

హేస్టి:- (కూర్చుండి) అమ్మా! మీ సాహసౌదార్య కృత్యాలకు మిమ్ముల నభినందించుటకు వచ్చాను. మొన్న అర్ధరాత్రి తమ భవనం దోచుకుందుకు సిపాయిలు రావడం తమరు పైకి ప్రాకుచున్న వారితలలు నాలుగు కత్తితో ఎగురగొట్టుట, మిగిలినవారు పారిపోవుట విని మిమ్ముల నభినందింపక ఉండలేక వచ్చాను. ఈ కాలంలో పురుషులలో కూడా ఇట్టి ధైర్యం లేదు.

రాణీ:- ఇదంతా ఆ కాళీమాత అనుగ్రహం. లేనిచో సిపాయిల నెదుర్కొను ధైర్య సాహసాలు నాకెక్కడివి?

మధు:- హేస్టీ! మనరాణీ కాళీమాతకు దేవాలయం నిర్మించాలని సంకల్పించుకొన్నది. తగిన స్థలం ఒకచోటికావాలి. బేలూరు ఉత్తర

ప్రాంతాలలో జమీందారుల స్థలాలు కొన్ని ఉన్నాయి. అవి వారు అమ్ముతారో లేదో!

హేస్టీ:- ఆ స్థలాలు వారు అమ్మనున్నారని విన్నాను. (రాణీతో) అమ్మా! ఒక్క విషయం. దక్షిణేశ్వరములో నా తాలూకు ఇరువది ఎకరాల విస్తీర్ణంగల స్థలము ఒక్కటి ఉన్నది. దానిని నిరుపయోగంగా విడుచుటచే మహమ్మదీయులు శ్మశానాలుగా ఉపయోగించుచున్నారు. అది మీకు పనికివచ్చినచో ఉపయోగించుకొనుడు.

రాణీ:- మధురబాబూ! అట్టి స్థలమే కాళికాలయానికి ప్రశస్తము అంటారు. దానిని వెంటనే వెలయిచ్చి తీసుకొనుడు.

హేస్టి:- అమ్మా! దానిని నేను అయిదు వేల రూపాయలకు కొన్నాను. అంతే ఇచ్చి తీసుకొనుడు. దేవాలయ ప్రతిష్ఠకు ఉపయోగించుటకన్న అదృష్టమేమి?

రాణీ:- హేస్టీ! నీవు పిలిచినట్లు వచ్చావు. అనుకోకుండా తగినస్థలం లభ్యమైనది. ఇది ఆ కాళీమాత సంకల్పం, శుభోదయం.

మధు:- మిత్రమా! మనమొకసారి వెళ్ళి ఆ స్థలము చూచి వత్తమా?

హేస్టీ:- సరే! (రాణీతో) అమ్మా! సెలవు. (ఇద్దరును వెళ్లుదురు)

(ప్రవేశము ప్రభుత్వోద్యోగి ఈశ్వరదత్తు)

ఈశ్వరదత్తు:- రాణీ రాస్మణికి నమస్కారము.

రాణీ:-రండు. కూర్చుండుడు(కుర్చీచూపును. కూర్చున్నతర్వాత) తమరాకకు కారణం?

ఈశ్వరదత్తు:- అమ్మా! హుగ్లీనదిలో అడ్డముగా గొలుసులు వేయబడ్డాయి. ఇది తమకు తెలిసిన విషయమేనా?

రాణీ:- (చిరునవ్వుతో) తెలిసిన విషయమేల? ఆ పని నేనే చేయించితిని.

ఈశ్వర:- ఎందువల్ల అట్లు చేయించితిరని అడుగవచ్చునా?

రాణీ:- బెస్తవాండ్రు నిరపాయంగా చేపలు పట్టుకొనే నిమిత్తము.

ఈశ్వ:- ఆ గొలుసులు ఆంగ్లేయుల పడవలు స్వేచ్ఛగాపోవుటకు ఆటంకమని తమకు తెలియునా?

రాణీ:-అగుగాక.

ఈశ్వర:- ఆపనికి అధికారులాక్షేపణ తెలుపుచు తమకీ ఆజ్ఞాపత్రము పంపిరి. (కాగితమిచ్చును)

రాణీ:-(కాగితం చూచుకొని)ఓయీ! ప్రభుత్వానికి మాకు జరిగిన ఒడంబడికలనుబట్టియే గొలుసులు వేయబడ్డవి. (మహేశునితో) మహేశా! ఆ ఒడంబడిక కాగితములు తెచ్చి వీనికి చూపుము.

మహే:- (కాగితము తెచ్చి చదువును) అయ్యా! ఈ ప్రాంతములో పల్లెవాండ్రు కడు బీదలు. వారికి జీవనాధారం చేపలు పట్టుకొనుటయే. వారు సురక్షితముగా చేపలు పట్టుకొనుటకు తగినవిధముగా చేసికొనుటకు అనుమతి ఇయ్యగోరుచున్నాము- ఇట్లు రాణీ రాస్మణి ఇది తమదరఖాస్తు. రెండవది; రాస్మణీ రాణీకి తెలియజేయునది ఏమన, మీ పల్లెవారు నిరపాయముగా చేపలు పట్టుకొనుటకు తగిన సదుపాయము చేసుకొనవచ్చును-ఇది ప్రభుత్వపు ఒడంబడిక పత్రం.

ఈశ్వరదత్తు:- అమ్మా! ప్రభుత్వాన్ని నేర్పుగా ధిక్కరింపగల మీ బుద్ధిచాకచక్యము, ప్రతిభ ఎవ్వరికి గలదు? సెలవు, నమస్కారము.

(అతడు వెళ్లును-తెరపడును)

## ద్వితీయాంకము

(స్థలము, కలకత్తాలోని ఒక పూజాగృహము. ప్రవేశము గదాధరుడు, దేవతా విగ్రహముల కెదురుగా కూర్చుండి)

గదాధరుడు:- (కొంచెమాగి) అయ్యో! లోకము! జనులు! జనుల జీవితానికి పరమార్థం పొట్టపోసికొనుట సుఖాలనుభవించుటేనా? అయితే మానవులకు పశువులకు భేదమేమి? జనులు ధనసంపాదనకొఱకు చదువుకొనుచున్నారు. భోగాలనుభవించేందుకు ధనం సంపాదిస్తున్నారు. ఎక్కడచూచినా ధనం సంపాదించేందుకు ప్రాకులాడువారే. ఇంద్రియ తృప్తికొఱకు పరుగులిడువారే. అయ్యో! ఈ అమూల్య జీవితానికింతకన్న ప్రయోజనం లేదా? ఇదేనా జీవితం? కాదు కాదు. మానవుడు జీవించుట భగవంతుని దర్శించుట కొఱకు! కోటి జన్మాలైనా ఇదే పరమావధి. (కన్నులు మూసుకొనును)

(ప్రవేశము నైవేద్యపు పళ్లెరముతో గృహిణి)

గృహిణి:- నాయనా గదాధరా! (అటు చూచి) ఇతడు మన దృష్టిలో లేడు. ఆహా! ఈ కుఱ్ఱవాని జీవితం చాల విచిత్రం. అతిపవిత్రం. ఈతని దేవతాపూజలోని విశిష్టత వేరు. వీని పూజలో శ్రద్ధాభక్తులున్నాయి. ఇట్టిది ఏ ఇతర పూజారులయందు చూడలేదు. ఇట్టివారే మహాపురుషులనగా. మహాపురుషులు లోకంలోకి నిశ్శబ్దంగా వస్తారు. అట్టివారిని ఏ కొద్దిమంది పుణ్యాత్ములో తెలుసుకోగలరు. ఈతడట్టి మహాపురుషుడేయైయుండాలి. (గట్టిగా) గదాధరా! నైవేద్యము.

గదా:- అమ్మా! పళ్లెరము అచ్చట నుంచుము.

(ఆమె అట్లే ఉంచి వెళ్లును) (ప్రవేశము రామకుమారుడు)

రామకుమారుడు:- (తనలో) రెండు జాములైనది. ఇంకా తమ్ముని భోజనమైనట్లు లేదు. (గట్టిగా) నాయనా గదాధరా! భోజనమైనదా?

గదా:- అన్నా! వచ్చితివా? కూర్చో భోజనం చేసి వస్తాను.

రామ:- నాయనా! రోజంతా దేవపూజలోనే గడుపుతున్నావే. ఇంక చదువుకొనుట ఎప్పుడు? నిన్ను చదువుకొఱకే గదా ఇక్కడకు తెచ్చాను. అమ్మను విడిచి వచ్చితివి, బెంగ పెట్టుకుంటావని కొన్నాళ్లూరకున్నాను. ఇంక ఊరుకోను. నీవు త్వరగా పూజ తెమల్చుకొని, చదువుకోవాలి.

గదా:- చదువా? చదువెందుకూ?

రామ:- (గట్టిగా) చదువే మరి బ్రతుకు తెఱవు. చదువేకదా

గదా:- చదువే బ్రతుకిస్తుందా?

రామ:-అవును. చదువువల్ల ధనము వస్తుంది. ధనమే బ్రతుకిస్తుంది.

గదా:- అన్నా! బ్రతుకునకు ధనమే కావాలా? జంతువులు బ్రతకడంలేదా?

రామ:- (అనునయంగా) నాయనా! జంతువులు మానవులు ఒకటేనా? మానవుడు ధనంవల్ల గౌరవంగా జీవిస్తాడు. గౌరవ జీవితానికి ధనమూ, ధనం కొఱకు విద్య అవసరం. ధనంవల్ల సర్వసౌఖ్యాలు పొందగలము. ఆ ధనాభావం చేతనే ఒకప్పుడు సంపన్న స్థితిలోనున్న మన చాటర్జీకుటుంబం ఇప్పుడెంత హీనదశకు వచ్చిందో గమనించావా? (వీపుతట్టి) నాయనా! నీవు బాగా చదుకోవాలి. డబ్బు సంపాదించాలి, కుటుంబాన్ని సౌఖ్యపెట్టాలి.

గదా:- అన్నయ్యా! ఒట్టి పొట్టకూటి చదువు. ఈ చదువు చదివి నేనేమి చేయాలి? ఇంతకన్న హృదయవికాసాన్ని శాంతిని కలి

గించి శాశ్వత సౌఖ్యాన్నిచ్చే జ్ఞాన సంపాద నకే నేనిష్టపడతాను.

రామ:- (చకితుడై) పొట్టకూటి చదువు! ఇది పొట్టకూటి చదువా? గదాధరా! నా మాట విను. విద్యవల్లనే జ్ఞానం కలుగుతుంది. విద్య వల్లనే గౌరవప్రపత్తులు కలుగుతాయి. విద్య వల్లనే సుఖజీవనం ఏర్పడుతుంది. నాయనా! ప్రపంచంలో సుఖపడేవాళ్ళంతా విద్యావంతులే సుమా.

గదా:- ఈ విద్యనభ్యసించిన విజ్ఞానం కలుగుతుందా? పవిత్రత కలుగుతుందా? నా తండ్రివలె నేను భగవంతుని దర్శింపగలుగు తానా? భక్తుడనగుదునా?

రామ:- ప్రస్తుతం భగవంతుని దర్శింపక పోయినా...

గదా:- (మాటలోనే అందుకొని) భగ వంతుని దర్శనములేని ఈ విద్యతో నేనేమి చేయుదును?

రామ:- (కోపంతో) అయితే, చదువుకో వన్నమాట.

గదా:- (నెమ్మదిగా) అన్నా! పొట్టకూటి కొఱకీచదువు చదివి, నాకు ప్రియమైన ఆదర్శా లను విడచుటకంటె యావజ్జీవమూ అజ్ఞానంలో పడియుండుట మంచిది. ఇంకెప్పుడూ నన్ను చదువుకోమని చెప్పవద్దు.

(లోపలినుండి గదాధరా! అన్న పిలుపు. అతడు వెళ్లును)

రామకుమారుడు:- (కొంచెం ఆగి) ఇది పొట్టకూటి చదువా? శాశ్వత సౌఖ్యమిచ్చేది కాదా? ఈమాటలు తమ్మునివేనా? వేదవా క్యాలా? (తెలివి తెచ్చుకొని) అయ్యో! వీని మాటలలో విద్యావిముఖత కాన్పిస్తోంది. రామేశ్వరునకు విద్యయున్నను ధనసంపాదనా చాకచక్యం కనబడదు. నా ఉపాధ్యాయవృత్తి లో రోజంతా కష్టపడ్డా కుటుంబపోషణ జర గడంలేదు. ఇది సందిగ్ధసమయం. (ధైర్యం తెచ్చుకొని) అన్నిటికీ రఘువీరుడే ఉన్నాడు.

(ప్రవేశము మహేశచంద్రుడు)

మహే:- పండిట్జీ నమస్తే! ఈ అద్భుతంవిన్నా రా? రాణీ రాస్మణిని ఎరుగుదురుకదా!

రామ:- ఎరుగకేమి? ఆమె ఉదారచరిత. పరోపకారపారీణ. మహాప్రతిభాశాలిని. విశే షించి భక్తురాలు.

మహే:- ఆమె కాశీయాత్రకు సిద్ధపడగా ఆమె కలలో కాళీమాత కనుపించి తనకొక ఆలయం నిర్మింపమని కోరిందట. కాశీ ప్రయా ణం మానుకొన్నది.

రామ:- ఆమె తప్పక దేవాలయం నిర్మిస్తుంది!

మహే:- దక్షిణేశ్వరములో దేవాలయ నిర్మాణం జరుగుతోంది కూడా!

గదా:- (ప్రవేశించి) అన్నా! వెళ్లుదమా?

రామ:-సరే.

(తెలపడును)

## తృతీయాంకము

### స్థలము గంగాతీరము

(ప్రవేశము రాద్ధాంతి సిద్ధాంతియను ఇద్దరు బ్రాహ్మణులు)

రాద్ధా:- సిద్ధాంతిగారూ! ఎక్కడికంత తొందరగా పోతున్నారు?

సిద్ధా:- దక్షిణేశ్వరానికి కాళీదేవాలయం చూచేందుకు.

రాద్ధా:- కాళీదేవలయమా? ఎవ్వరు కట్టించారు?

సిద్ధా:- మీకు తెలియదా? రాస్మణీ రాణీ కట్టించింది.

రాద్ధా:- తెలియదు. దాన్నిగురించి కొంచెం చెప్పి వెళ్ళండి.

సిద్ధా:- మనం దక్షిణేశ్వరం పోతూండగా ఆ దేవాలయం కనిపిసుంది.

రాద్ధా:- అది గంగానదీతీరంలోనే ఉన్న దన్నమాట.

సిద్ధా:- పడవపైనుండి మెట్లమీదనే అడుగు పెట్టాలి. ఆ మెట్లమీద కొంచెం నడిస్తే ఉత్తర దక్షిణాలలో ద్వాదశ శివాలయా లున్నాయి. వాని మధ్య ఒక సింహద్వారం కలదు. తూర్పున పెద్దబయలు ఆ బయలులో పెద్ద దేవాలయాలు రెండుకలవు.

రాద్ధా:- ఆ రెండూ కాళీకాలయాలేనా?

సిద్ధా:- కావు. ఉత్తరపువైపున నున్నది రాధాకాంతుని యాలయము. రెండవది శ్రీ దేవాలయము.

రాద్ధా:- ఇంతేనా? ఇంకా ఏమైనా కట్టించిందా?

సిద్ధా:- ఇవికాక తొమ్మిది గోపురాలు కట్టించింది. తూర్పునకు ఉత్తరానికి మధ్యకొన్ని గదులు కట్టించింది-కోవెల పరిచారకులకొఱకు.

రాద్ధా:- ఇంత పెద్ద దేవళానికి ఎంత డబ్బైం దంటారు?

సిద్ధా:- దాదాపు ఎనిమిదిలక్షలెందిట. ప్రతిష్ఠాపనతో ఇంకొక లక్షఅగును.

రాద్ధా:- ఇంకా ప్రతిష్ఠ జరగలేదా?

సిద్ధా:- దాన్ని గురించే రాద్ధాంత సిద్ధాంటు జరుగుచున్నాయి. ఇంకా తేలలేదు.

రాద్ధా:- ప్రతిష్ఠాపనకు రాద్ధాంతాలేమిటి సిద్ధాంతిగారూ?

సిద్ధా:- రాణీ శూద్రకుల స్త్రీకదా! అగ్ర జాతివారే కదా పూజలుచేసేది! శూద్రస్త్రీ కట్టించిన దేవాలయంలో అగ్రజాతివారెట్లు పూజకు సమ్మతిస్తారు? అందుచే ప్రతిష్ఠాపన నిలిచిపోయింది.

రాద్ధా:- నిలిచిపోయిందని మీరెట్లు చెప్ప గలరు?

సిద్ధా:- ప్రతిష్ఠాపనకు ముహూర్తం ఇంక నాల్గురోజులేకదా ఉన్నది. నిలిచిపోయినట్లే. రాణీ దీన్ని గూర్చి ఎంతోమంది పండితులకు వ్రాసింది. ఇంతవరకూ ఎవ్వరూ అనుకూలంగా వ్రాయలేదు. ఇంకా ఎదురుచూస్తోంది.

(ప్రవేశము కుండలాల శాస్త్రిగారు)

సిద్ధా:- దయచేయండి శాస్త్రిగారూ! దయ చేయండి.

శాస్త్రి:- ఏమయ్యోయి! కొంపమునిగింది.

రాద్ధా:- ఏమి జరిగిందీ?

శాస్త్రి:- జాంపకూరు పాఠశాలాపండితుడు రామకుమారునికి కూడా రాణీ వ్రాసిందిట ఈ విషయాన్ని గూర్చి.

సిద్ధా:- ఈలా ఎంతమందికి వ్రాయలేదూ! అందులో అతనొకడు

శాస్త్రి:- అలాగనుకొన్నారా? అతడు సామాన్యుడుకాడు. మతవిషయాలలోను ధర్మ సందేహాలు తీర్చడంలోను ఉద్దండపండితుడు. ఆయన శాస్త్రాలు పరికించి ఎలాగో సమర్థించి దేవిప్రతిష్ఠ జరిగేటట్లు వ్రాస్తాడు కూడా!

సిద్ధా:- మతగ్రంథాలంగీకరించినా సాంప్రదాయానికి విరుద్ధమయ్యా! శూద్రస్త్రీ కట్టించిన దేవళంలో అసలైన బ్రాహ్మణుడెవడు పూజారిగా వస్తాడు?

రాద్ధా:- అసలైన బ్రాహ్మణుడే పూజిస్తాడు దేవతలకు కూడ శూద్రత్వం బ్రాహ్మణత్వం ఉన్నదా? సర్వాంతర్యామియగు జగన్మాతకు జాతి మత భేదాలు కల్పించిన పాండిత్యం ఎంత గొప్పది! ఏమి విశాలభావం! ఈ విశాలభావాలే మనలను బానిసలగా చేశాయి. 'బ్రాహ్మణు

డను బ్రాహ్మణుడనని' విఱ్ఱవీగుచు ఆ పద మునకర్థము తెలుసుకోలేక జాతిమత భేదాలు చూపుచు దేశద్రోహులగుచున్నారు. పావన చరితయు, నిర్మల హృదయయునగు నొక భక్తురాలు కట్టించిన దేవళంలో సృష్టి స్థితి లయకారిణియగు దేవినారాధించుట పరువు తక్కువట! పరదేశ వేషభాషలననుసరించుట పరువుతక్కువకాదు కాబోలు!

శాస్త్రి:- ఎవ్వరేమన్నా సరే. బ్రాహ్మణుడైనవాడు ఈ దేవళంలో పూజచేస్తూ ప్రసాదం స్వీకరించుట అశాస్త్రీయం ముమ్మాటికి అశాస్త్రీయం.

రాధా:- దేవీప్రతిష్ఠ అనుకొన్న ముహూర్తానికే జరిగితీరుతుంది. ఇది సత్యము.

సిద్ధా:- మనకీ చర్చ ఎందులకు? ఏమి జరుగుతుందో చూదాం పదండి. (ముగ్గురును వెళ్లుదురు.)

(రాణీ, మదనిక ప్రవేశము)

రాణీ:- మదనికా! ఈ పండితుల వాక్యాలు విన్నావుకదా?

మదనిక:- అమ్మా! వారిమాటలకేమిలెండి.

రాణీ:- వారిమాటలేకదా మనకిప్పుడు ప్రమాణములు. ముహూర్తం సమీపిస్తోంది. నా ఇష్టదేవతకు వరి అన్నం సమర్పించి పూజించాలని ఎంతకాలం నుండియో కోరుచున్నాను. ఆ దేవి అనుగ్రహం ఎట్లున్నదో?

మద:- అమ్మా! అధైర్యపడకండి. కాంపకూరు పండితుడు ఏమేమో వ్రాసాడని అల్లుడుగారు చెప్పారుకదా. అది చూచుకొని తర్వాత ఆలోచించుకోవచ్చును. వెళ్లుదమురండి.

(తెరపడును)

## చతుర్థాంకము

(స్థలము:- రామకుమారుని గృహము మేజాపై పుస్తకాలు)
ప్రవేశము గదాధరుడు (ఏవో కొన్ని పుస్తకాలు తిరుగవేసి)

గదాధరుడు:- అన్నగారి గ్రంథాలయంలోని పుస్తకాలన్నీ చూచాను. ఎక్కడా ఒక్క పుస్తకంలో కూడా దేవుని తెలుసుకొనే విధమే కనబడదు. మతగ్రంథాలు పూర్వుల నుండి సంక్రమించిన ఆస్తిమాత్రమే. అయ్యో! బహుపండితుల శాస్త్ర సంభాషణలు విన్నాను! ఆమాటలు సంకుచితభావవిలసితాలు, స్వార్థపరత్వాలు తప్ప వానిలో దేవుని చూపు వాక్యము ఒక్కటీలేదు. అనేక మత సాంప్రదాయాలు తెలుసుకొన్నాను. మత సామరస్యమే కనబడదు. దేవుని చూపు వారెవ్వరు? దైవము మతము-ఇదే నా జీవితం. అది లేనిచో జీవితం నిరర్థకం. (దివ్యావేశముతో) నా జీవితం భగవంతుని దర్శించుటకొఱకు, మానవకోటి కేదియో దివ్యసందేశం అందించుట కొఱకు- అయ్యో! భగవంతుడు! (ఆగిపోవును)

(ప్రవేశము రామకుమారుడు, హృదయుడు)

రామ:- నాయనా గదాధరా! (వానికేసి చూచి తర్వాత హృదయునితో) హృదయా! రా కూర్చో. నీ రాక సిహోరునుండియేనా?

హృద:- (కూర్చుండి) అవును బాబూ! మా గ్రామంలోగాని, ప్రక్కనవున్న బర్ద్వానులో కాని, నాకేమీ ఉద్యోగం దొరక లేదు. అమ్మ 'మీరిచ్చట నున్నారు. మిమ్ము కలుసుకొమ్మని' చెప్పింది. అందుకు వచ్చాను.

రామ:- సరే, కొంతకాలం మా గదాధరునితో కలిసి ఇక్కడే ఉండు.

హృద:- బాబూ! అతడేమైనా చదువుచున్నాడా?

రామ:- చదువూ లేదు, చట్టుబండలూ లేదు. రోజులో చాలాసేపు దేవతార్చన, మిగిలిన కాలం రాజా దిగంబరమిశ్రతో గడపుతాడు.

హృద:- అట్టి జమీందారు ప్రాపకం మంచిదే కదా! చదువెందుకులే!

రామ:- ప్రాపకం మంచిదే. ఏమిలాభం? పనికిమాలిన కబుర్లే.

గదా:- (లేచివచ్చి అన్నతో) అన్నా! వచ్చితివా? (హృదయుని చూచి) హృదయా! ఎన్నాళ్లైందిరా నిన్నుచూచి (కౌగిలించు కొనును) అమ్మ క్షేమమేనా?

హృద:- క్షేమమే. అన్నివేళలా నిన్నే మెచ్చుకుంటుంది. నీవంటివాడు లోకంలో లేడంటుంది.

గదా:- ఆమెకు నేనంటే ఎంతో వాత్సల్యం.

హృద:- బాబూ! నీవు ఏమి చదువు చున్నావు?

గదా:- చదువా? చదువెందుకూ? ధనసంపాదనకా?

హృద:-ఎందుకాలాగంటావు? చదువువల్లనే ధనం కలుగుతుంది.

గదా:- ధనం కాదు నాకు కావలసింది. భగవద్దర్శనము. అది లేనిజీవితం నిస్సారం, నిరర్థకం. అన్నీ వ్యర్థములే.

రామ:- (తెల్లబోయి తనలో) ఇతడు విషయ మాలిన్యంలేని స్వచ్ఛమైన దృష్టితో అన్నీ నిస్సారములని గ్రహించాడు. నేనో! వీనిని ప్రపంచ స్వార్థానికి మరల్చాలని చూస్తున్నాను. దీనికి కారణం దారిద్ర్యం. ఏమిచేయవగును?

(ప్రవేశము మహేశచంద్రుడు)

రామ:-(ఎదురుగావెళ్లి) మహేశబాబూ దయచేయండి.

మహే:-అన్నా! మీరు క్షేమమేనా? ఏదియో యోచించు చున్నట్లున్నారు?

రామ:-క్రొత్తవిషయమేమీ లేదు —విశేషములేమి?

మహే:-విశేషములా? రాణీరాస్మణీ దక్షిణేశ్వరములో కాళికాలయం నిర్మించిందని మీకు తెలిసినదే కదా! దేవీ ప్రతిష్ఠకు, ముహూర్తం ఇంక మూడు రోజులే యున్నది. దేవిని పూజించుటకు బ్రాహ్మణులాక్షేపించిరి.

రామ:-మతగ్రంథాలనుబట్టి ఆక్షేపణలేని విధము పరిశీలించి వ్రాయమని ఆమె నాకు వ్రాసినది. అట్టి విధముగా వ్రాసి పంపించితిని.

మహే:-అన్నా! మీరు వ్రాసి పంపిన విధముగా కాళికాలయపు సొత్తు అంతయు తమ పురోహిత బ్రాహ్మణునికి చాలినంత ఆదాయంతో వ్రాసియిచ్చి తాను నిర్వాహకురాలిగా ఉన్నది. అయినా సద్బ్రాహ్మణుడెవ్వడూ సాంప్రదాయవిరుద్ధమని రాకున్నాడు

రామ:-రాణీ ఆ పురోహితునే పూజకొఱకు నియమింపరాదా?

మహే:-ఆ పురోహితునికి మతగ్రంథాలలో పాండిత్యంలేదు. అట్టివాడు దేవిని పూజించుటకు పనికిరాడుకదా?

రామ:-అది నిజమే. దేవీపూజకు తుడు, భక్తుడు, పవిత్రుడు కావాలి.

మహే:-అన్నా! అందుకే నే నిప్పుడిక్కడికి వచ్చాను.

మహే:-సద్బ్రాహ్మణుడు దొరికేవరకు మిమ్ము ప్రార్థించి.

రామ:-(మాటలోనే అందుకొని) మహేశా! మన చాటర్జీ సాంప్రదాయం ఎరిగిన మీరే ఇట్లు చెప్పవచ్చునా?

మహే:-అన్నయ్యా! దేవీప్రతిష్ఠకు వ్యవధి లేదు. దానికి విచ్ఛిత్తి కలుగకూడదు. విచ్ఛిత్తి కాకుండా చేయుట మీ విధ్యుక్తము, త్యాగ పురుషలక్షణము. రాణీ మీకీఉత్తరమిమ్మన్నారు (ఉత్తరమిచ్చును.)

రామ:-(విప్పి చదువును) పండితోత్తమా! నిరాశాంధకారంలో ఆవరింపబడియున్న నాకు ఆశాజ్యోతి కల్పించి అనుగ్రహించిన వాడవు నీవు. నీ యభిప్రాయ మంగీకరించి నీవు వ్రాసి నట్లే చేసితిని. మరియొక పురోహితుడు దొరుకువరకు దేవ్యారాధనము సహృదయముతో నెరవేర్చి నన్ను ధన్యురాలినిచేయ ప్రార్థన-ఇట్లు రాణీరాస్మణి.

(రామకుమారుడు ఉత్తరం చదువుకొని యూరకుండును.)

మహే:-అన్నా! రాణీ తన ఇష్టదేవత నారాధింప ఎంతకాలమునుండియో కోరుచున్నది. ఆమె కోర్కె నెరవేర్చుట తమ ధర్మము.

రామ:-మహేశబాబూ! రాణీ వాక్యం నన్ను మంత్రముగ్ధుని చేసినది.

మహే:-ధన్యులము-ఆ మహాదేవి సంకల్పం. (తెలుపదును.)

పంచమాంకము

(స్థలము: దేవాలయావరణము)

(ప్రవేశము గదాధరుడు, హృదయుడు)

హృదయుడు:- బాబూ! ఈ కాళీమాతను పరికించితివా? దాని నిర్మాణాన్ని గురించి ఎవ్వరికీ అర్థంకాదు. అందమైన సహస్రపత్రరజత కమలము. అందులో చాపకట్టుగా పడియున్న శివవిగ్రహం ఆ విగ్రహం యొక్క వక్షస్థలం మీద కాళీ విగ్రహం. ఆ విగ్రహానికి భవతరణి విశ్వరక్షణి అను రెండు పేర్లు కలవట.

గదా:- అర్థయుక్తగానే ఉన్నాయి అన్నీ కూడా.

హృద:- తర్వాత విను. ఆ దేవి వివిధాభరణాలు ధరించి దక్షిణముఖంగా ఉన్నట్లు నిర్మింపబడ్డది. ఆ విగ్రహ శిల్పి నైపుణ్యాం అసమానం. ఆ దేవి మెడలో అమూల్యాలంకరణాలు, వానితోపాటు బంగారుతో చేయబడిన పుర్రెల దండ, మొలకు బంగారు వికారమైన మనుష్య హస్తాలనండ కట్టబడింది. ఆదేవి క్రిందివైపున నున్న ఎడమచేతిలో మనుష్యుని తలకాయ, ఎత్తబడియున్న ఎడమచేతిలో ఖడ్గము, దింపియున్న కుడిచేయి భక్తులకు వరాలిస్తున్నట్లున్నది. ఎత్తబడ్డ కుడిచేయ్యి అభయమిస్తున్నట్లున్నది. అన్నీ కూడా బంగారంతో చేయబడ్డవే. దీనికర్థము నాకు తెలియలేదు.

గదా:- హృదయా! ఈ నిర్మాణంచేత దేవి ఒకవైపు రౌద్రరూపిణి లోకసంహారిణిమైనట్లు తోస్తోంది. దేవీ సృష్టి స్థితిలయకారిణి గదా.

హృద:- బాబూ! దేవి సంప్రోక్షణ సమయంలో వైభవం నీవూ చూచావు.

గదా:- ఆహా! అదే నా మనస్సులో హత్తిపోయింది. వేలకొలది భిక్షుగాంధ్ర భోజనాలు, దూరదేశాలనుండి వచ్చిన పండితుల సంభావనలు, భజన సంఘాలు, పురాణగోష్ఠులు నాటక ప్రదర్శనాలు, దీపాలంకరణాలు, ఉత్సవాలు మిక్కిలి ఆనందం కలిగించాయి.

హృద:-దక్షిణేశ్వరాలయం ఆనందనిలయం, కన్నులపండుగ.

గదా:- రాణీరాస్మణి ధన్యురాలు. కాళీమాతను ప్రతిష్ఠించి చిరస్మరణీయురాలైనది, సరే కాని, అన్నగారు ఎక్కడా కనబడటం లేదే!

హృద:- అన్నగారు ఉత్సవాలలో నిమగ్నులైయున్నారు-వస్తారు లే.

(ప్రవేశం రామకుమారుడు)

గదా:- అన్నా! జాంపకూరు ఎప్పుడు వెడదాము? ప్రతిరోజూ అటూ ఇటూ తిరుగుటకు కష్టంగా ఉన్నది. ఇక్కడే ఉంటే పేలాలు తిని ఉండాలి.

రామ:- (తమ్ముని తల నిమురుచు) నాయనా! పేలాలెందుకు తినడం! దేవీ ప్రసాదం తినవచ్చుగదా మరీ-(ఆగి) రాణీయు మధురబాబూ నన్ను కొంతకాలం దేవిని ఆరాధింపమని కోరారు. వారి కోరిక తిరస్కరింపలేక సరే అన్నాను. నీవు కూడా ఇక్కడేఉండు. భోజనానికి కష్టంఉండదు.

గదా:- అన్నయ్యా! నా భోజనంమాట కేమిగాని నీవు దేవి నర్చించుటా? అది మన వంశానికి గౌరవమెంతమాత్రం కాదు. ఈ అర్చకత్వం ఎంత నీచమూ! మనతండ్రి చాటర్జీ కులసాంప్రదాయం ఎంతనియమంగా నిలిపాడో జ్ఞాపకం ఉన్నదా?

రామ:- నాయనా! మతగ్రంథాలు అర్చకత్వంలో దోషంచెప్పలేదు. మన కుటుంబ పోషణ విధాయకంగదా. దానికి ధనంకావాలి. ధనసంపాదనకొఱకు దోషరహితమై న్యాయమైన వృత్తి ఏదైతేనేమి?

గదా:- అన్నా! మన్నించు. ఇది శూద్ర కొలువు. శూద్రుల వద్ద దానం పరిగ్రహించి ఎన్నడూ ఇంతవరకు మనవంశం కళంకితం కాలేదు.

రామ:- గదాయ్! ఇది శూద్రుల సేవకాదు. రాణీ తన దేవాలయాన్ని తన పురోహిత బ్రాహ్మణునికి దానపత్రమూలంగా ఇచ్చింది. అదీకాక, ఇది దేవతారాధన. ఇది న్యాయంగా చేసిన పరమార్థముకూడా అని శాస్త్రసమ్మతం. భయమెందుకు?

హృద:- అన్నగారు అశాస్త్రీయంగా ఎన్నడూ నడుచుకోరు.

గదా:- శాస్త్రప్రమాణం చూపుచున్న నీతో వాదోపవాదాలు కాదు, మంచి చెడ్డల నిర్ణయానికి చీటీలు వేతామా?

రామ:- సరే. అట్లే.

(మంచి-చెడ్డ అని చీటీలు వ్రాసి ఎగురవేయుదురు.)

గదా:- (అందొక చీటీతీసి చూచి) అన్నా! మంచిదనే వచ్చింది. ఇది దైవసంకల్పం...

రామ:- నాయనా! నీవు ఇప్పటనే ఉందువన్నమాట.

గదా:- ఉందునుగాని దేవీప్రసాదం మాత్రం (అని ఆగిపోవును)

రామ:- భుజించవద్దులే. బియ్యం, పప్పు, కూరగాయలు తీసుకొని వెళ్లి గంగాతీరాన వంటచేసుకొని భుజించుము. గంగాతీరం బ్రహ్మపదార్థంవలె పవిత్రమైనది.

హృద:- గంగాతుషార వాయువు ప్రసరించు స్థలంకూడా పవిత్రమే. వంటకు కావలసినవన్నీ నేను సిద్ధపరుస్తాను.

రామ:- తమ్ముడూ! ఏమంటావు నాయనా, ఇక్కడే ఉంటావుకదా?

గదా:- అన్నయా! నీ ఇష్టమే నా ఇష్టము.

రామ:- సంతోషము.

(తెఱపడును)

### షష్ఠాంకము

(స్థలము - దేవాలయప్రాంగణము)

(ప్రవేశము రాణీరాస్మణి, మధురబాబు)

మధురబాబు:-అమ్మా! ఈ దేవాలయంలో కాళీమాత చైతన్యమూర్తియై ప్రకాశిస్తోంది. దీనికి కారణం-మీ పవిత్రసంకల్పము.

రాణీ:-అది ఆ మహాదేవికి నా యందున్న అనుగ్రహం-అది సరే కానీ మధుర బాబూ! ఈ దేవాలయంలో అతి విచిత్రవర్తన గల సుందరయువకుడొకడు తిరుగుచున్నాడు. ఆతడెవ్వడై యుండును?

మధు:-ఆతడా? మన పురోహితుడు రామకుమారుని తమ్ముడు. ఆతని సాధువర్తన, మృధుమధుర స్వభావమూ, భావపూరితమైన భక్తి, భక్తియుక్తమైన గానమూ, ఎవ్వరియందూ గానము. ఆతనిలో అమానుషశక్తులు దాగియున్నట్లు నాకు తోస్తోంది.

రాణీ.-అట్టివాడు కాళీమాత నారాధిస్తే నిజంగా దేవి సచేతనయే అగును.

మధు:-ఆ పనికొఱకే నేనూ ప్రయత్నిస్తున్నాను.

రాణీ:-ప్రయత్నమేముంది. రామకుమారుని అడుగరాదా?

మధు:-ఇదివరకే అడిగాను. ఆతడు "తన తమ్ముని చిత్తవృత్తి విచిత్రమనియు, అతనికి ధనార్జనలో కాని, శరీరసౌఖ్యంలో కాని, ఆసక్తి లేదనియు, అతడెట్టి సేవకావృత్తికీ బద్ధుడు కాడ"నియు చెప్పాడు.

రాణీ:-మీరు ఆ కఱ్ఱవానితోనే మాట్లాడవచ్చుకదా.

మధు:-నేననేకసార్లు వానితో మాట్లాడవలెనని ప్రయత్నించాను. నా ప్రయత్నం, అతడు గ్రహించాడేమో! అట్టి అవకాశమే అతడియ్యలేదు.

రాణీ:-అవకాశం చూచి మళ్లీ ప్రయత్నించండి. ఆ దేవి యనుగ్రహముంటే తప్పక మీ ప్రయత్నం నెరవేరగలదు.

(ప్రవేశము హృదయుడు)

హృద:-అమ్మా! నమస్కారము.

మధు:-హృదయ బాబూ! మీ చిన్నమామ ఎక్కడ?

హృద:-ఇదిగో ఈ ప్రక్కనే శివపూజ చేస్తున్నాడు.

మధు:-(లోపలికిచూచి) జీవకళ ఉట్టిపడుచున్న ఈ విగ్రహాన్ని ఎవ్వరు తయారు చేసారు!

హృద:-ఎవ్వరేమిటి? ఆతడే ఆ విగ్రహాన్ని తయారుచేసాడు.

మధు:-పూజ కాగానే ఆతడా విగ్రహాన్ని ఏమి చేస్తాడు?

హృద:-గంగలో పడవేస్తాడు.

మధు:-అయ్యో! అంత అందమైన విగ్రహాన్ని చేయుటకెంత నేర్పు కావాలి.

హృద:-విగ్రహాలు చేయడమేకాదు-పూలమాలలు కట్టుట, విగ్రహాలకు అలంకారం చేయుటయందుకూడా ఈతనికి విశేష సామర్థ్యంకలదు.

మధు:-తనకభ్యంతరంలేనిచో పూజ కాగానే ఆ విగ్రహాన్ని నాకిమ్మను.

హృద:-అట్లే (లోపలికిచూచి)అదిగో,అతడు పూజనుండి లేచాడు.

మధు:-నేను పిలుచుచున్నానని చెప్పి ఆతని పిలుచుకొనిరా!

హృద:-అట్లే (లోనికి వెళ్లును.)

(ఇంకొకప్రక్క హృదయుడు గదాధరునితో.)

హృద:-బాబూ! మధురబాబు నిన్ను పిలుస్తున్నాడు.

గదా:-(తెల్లబోయి) ఇన్నాళ్లనుండీ ఆయన కంటబడకుండా తప్పించుకొన్నాను. ఈ అవకాశం నీవే కల్పించావు.

హృద:-నేనేమి చేశాను? (సాలోచనగా) ఆయనను సమీపించుటకు భయమా?

గదా :-భయముకాదు. తికి ప్రేరేపించును.

హృద:-అయితేనేమీ అందువల్ల ధనం కలుగునుకదా.

గదా:-(గట్టిగా) ధనమా? ధనమెవ్వరికి కావాలి?

హృద:-(మెల్లిగా) ధనంవల్లనేకదా సర్వ సౌఖ్యాలు కలుగుతాయి.

గదా:-హృదయా! నీకు తెలియదు. కామ కాంచనాలు మానవుని భగవంతునికి దూరం చేస్తాయి. సేవకావృత్తిలో మనస్సెంత లగ్నం అగునో భగవద్ధ్యానంలో అంత పట్టువదలును.

హృద:-మధురబాబు నిన్ను దేవినలంకరించుటకుమాత్రం కోరుతాడు అనుకుంటాను.

గదా:-ఆ పని మరీ కష్టము.

హృద:-ఎందువల్ల?

గదా:-దేవి ఆభరణాలు స్వాధీనంలో ఉంచుకొనుట పెద్ద బాధ్యత.

హృద:-పోనీ, ఆ బాధ్యత నేను తీసుకొన్నచో ఆ పనికంగీకరిస్తావా?

గదా:-(మాట్లాడడు.)

హృద:- అతడు పిలిచి చాలాసేపైనది. వెళదాముదా.

(ఇద్దరూ కలిసి వెళ్ళెదురు)

(మరియొకప్రక్క- రాణీ, మధురబాబు)

మధురబాబు:- (గదాధరుని కెదురుగావచ్చి చేయిపట్టుకొని)

గదాధరా! కాదు కాదు శ్రీరామకృష్ణా!

రాణీ:- ఇతనికి రామకృష్ణుడను నామాంతరమున్నదా?

మధురబాబు:- అమ్మా! నేనితని చూడగానే నాకు శ్రీరామునిలోనున్న శాంతము, కృష్ణునిలోనున్న తేజస్సు గోచరిస్తాయి.

రాణీ:- ఓహో! ఈతనికి మీరిచ్చిన బిరుదనామమా? సార్థకమే.

మధు:- అవునమ్మా! ఇప్పటినుండియు ఈతడు రామకృష్ణుడని పిలువబడుగాక. (రామకృష్ణునితో) రామకృష్ణా! ఈ కాళీమాత నలంకరించుటకు మాత్రము మిమ్మును కోరుచున్నాను. నా యందు గౌరవముంచి ఈపనికి మీరంగీకరింతురుగాక.

రామకృష్ణ:- అయ్యా! ఆభరణాలు నా స్వాధీనములో ఉండనిపక్షమున అట్లే.

మధు:- ఉన్ననేమి?

రా కృ:- ధనసంబంధమైన బాధ్యత నావల్లకాదు.

మధు:- ఆ బాధ్యత ఎవ్వరు వహిస్తారు?

రా కృ:- ఆ బాధ్యత మా హృదయబాబు జాగ్రత్తగా వహిస్తాడు.

మధు:- అయితే పరమ సంతోషము.

(హృదయునితో) హృదయబాబూ! దేవి అలంకారాలు భద్రపరచే ఉద్యోగం మీరు స్వీకరింతురుగాక!

హృద:- అనుగ్రహింపబడితిని.

(ప్రవేశము రామకుమారుడు)

మధు:- రామకుమార్! మీ తమ్ముడు దేవినలంకరించుటకు దయతో అంగీకరించెను. అవసరం వచ్చినప్పుడు దేవిని పూజించును కూడా.

రాణీ:- శ్రీరామకృష్ణునిచే యారాధన ఈ కాళీమాత సజీవమై పిలిచిన 'ఓ!' యని పలుకుచు ప్రత్యక్ష దేవత యగుగాక. ఈ దక్షిణేశ్వరాలయము, అ చంద్రార్కము పుణ్యభూమియై వెలయునుగాక. (అందరు కలిసి) శ్రీ కాళీమాతకు జై! శ్రీరామకృష్ణునికి జై! అందురు.

(తెర ఎత్తబడును)

ఎదురుగా కాళీమాత విగ్రహము. పువ్వులు, పండ్లు మొదలైన పూజా ద్రవ్యాలతో దేవికి ఇరుప్రక్కల రాణీ మొదలగు అందరును నిలిచి పాడుదురు.

పల్లవి. జయమాత జయమాతే జయ జయ మాతా
జయ హిమగిరిజాతే జయ విశ్వనేతే ॥జయ॥

చరణం. శివ వక్షస్థలసింహాసనస్థే నవ సహస్రదళనళినీనివాసే॥
కృత్త నరహస్తసంకీలితజఘనే చిత్తజహరరాణి చిత్కళసదనే॥
వామకరాభ్యాం భయఘోరచిహ్నే శ్యామలగాత్రే శక్తిప్రదాయినే॥
దక్షిణకరాభ్యాం దాక్షిణ్యచిహ్నే దక్షిణేశ్వరాలయ ప్రత్యక్షస్వరూపే॥
లోక సంహారిణీ లోకసంరక్షిణీ లోకాతీత శివానందరూపిణే॥
జయమాత జయమాత హే జయ జయ మాతా నమోస్తుతే॥



# భగవాన్ రమణమహర్షితో నా అనుభవాలు II

శిష్టా సుబ్బారావు

## రమణాశ్రమములో నేను చూచినవి విన్నవి :

మహర్షి మితభాషి. తనంత తామేదియు మాటలాడువారు కారు. ఇతరుల ప్రశ్నలకు మాత్రము సంగ్రహముగ సమాధానముల నిచ్చుచుండువారు. వారి మాటలకంటె వారి మౌనమే జిజ్ఞాసువులకు ఎక్కువ ఉపయోగమని వారనుచుండిరి. మౌనముగానుండుటవలన ఆధ్యాత్మిక వాతావరణము బాగుగనుండి స్పందనములు వారి నుండి సాధకులకు ప్రసరించు చుండుననియు మాటలాడుచుండుటవలన అవి విచ్ఛిన్నమగుననియు వారనుచుండిరి. వారు తరచు అమూల్యమగు కాలమును ఆధ్యాత్మికగ్రంథములనుండి సారాంశమనదగు ముఖ్యభాగములను గ్రహించి వ్రాయుటలో వినియోగించుచుండిరి. నేనాశ్రమమందున్నప్పుడు వారు శివానందలహరి నుండి పది శ్లోకములను, యోగవాసిష్టము నుండి హృదయ విద్యను గురించిన శ్లోకములను తీసి పొందు పరచిరి. ఈ హృదయ విద్యను వేరే సీసమాలికగా తెలుగున రచించిరి. నేనాశ్రమ మందున్న కాలములో హృదయవిద్యపై సైపుకాగితములనందరకు పంచిరి. అందు, ఆధ్యాత్మిక హృదయ స్థానమును గూర్చి. చర్చింపబడి యుండెను. ఈ విషయమై మహర్షి తన అనుభవమును బట్టి హృదయస్థానము కుడివైపున గలదని నుడువుటయేగాక లౌకికముగ కూడ ప్రతి వ్యక్తియు తానేదైనను నిరూపింపదలచి నప్పుడు గుండెను కుడివైపున ''నేను-నేను''ని తన కుడిచేత తాకుచుండుటను ప్రమాణముగా చెప్పుచుండెడివారు.

ఆవశ్య ్రశృణువా తాత నానా శాస్త్రాణ్యనేకశః
తథాపి న తవ స్వాస్థ్యం సర్వవిస్మరణాదృతే॥

అని అష్టావక్రమహర్షి చెప్పినట్లు భగవాన్ కూడ ఎంత తక్కువ చదివిన అంత మంచి దనెడివారు. చదువులు చదువుట ఎందుకనిన అంతయు మరచిపోవుటకే అని వారు తరచు అనెడివారు. చదువు ఎక్కువ అగుటవలన శాస్త్ర వాసనలు పెరిగి వాటిని మరచుట కష్టమగును కాన లౌకికవిద్యలెంత తక్కువ చదివిన అంతమంచిదని వారి మతము.

మహర్షి సమ్ముఖమున ఎవరేది చదివినను వినుచుండెడివారు. భక్తులు హాలులో పద్యములుగాని పాటలుగాని పాడుచుండిరి. కాని వారేదైనను తప్పు ఉచ్చారణ చేసినచో మహర్షి వెంటనే దానిని సరిదిద్దెడివారు. నేనెందరో మహాత్ముల సహవాసము చేసితిని కాని వారందరు కూడ భక్తులేది ఎట్లు చదివినను విని ఊరకుండెడివారు. మహర్షి మాత్ర మట్లు ఉచ్చారణయందు స్వరముల యందు తప్పులు లేకుండునట్లు ఎప్పుడును చూచుచుండెడివారు. అది వారి ప్రత్యేకత అనవచ్చును. నేనక్కడున్న రోజులలో ఒక తెలుగుతల్లి మహర్షిపై ఒక సీసపద్యమును రచించి చదివెను. కాని అందు ఛందస్సుకు సంబంధించిన పొరపాటొకటుండెను. వెంటనే దానిని సవరించుకొనమని ఆమె తప్పు నామెకు తెలియజేసిరి.

మహర్షికి తెలుగుభాషయందభిమాన మెక్కువ. తన ఉపదేశసారము తెలుగు పద్యముల క్రిందను ''ఉళ్ళదినర్పతి'' అను తమిళ వచనగ్రంథమును తెలుగు వచనముగను శ్రీ శంకరుల వివేకచూడామణిని తెలుగు వచనములోనూ వీరే రచించిరి. వీరికి సంస్కృతము, తమిళము, తెలుగు, మళయాళము

భాషలయందు పాండిత్యము గలదు. వాటి యందు నిరాఘాటముగా కవిత్వము గూడ చెప్పుచుండెడివారు. కొందరు తమిళభక్తులలో తెలుగు చాల మంచిభాష యనియు దానిని నేర్చుకొనుట మంచిదనియు చెప్పుచుండిరి. వీరు హాస్యప్రధానులుకూడ. ఒకనాడు కొందరు తెలుగు భక్తులు ప్రసంగవశమున పోతన్న భాగవతములోని ఒక పద్యమును చదివి దాని అర్థమును వివరింపుడని మహర్షినడిగిరి. మహర్షి నవ్వుచు "నేనరవవాడిని, తెలుగేమి చెప్పగలను" అని హాస్యముగా పలికి తరువాత పద్యార్థమును వివరించిరి.

రాధాకృష్ణన్ గారి పినతండ్రియగు సర్వేపల్లి నరసింహయ్యగారు రాయవేలూరు నివాసి. కాలాంతరమందీయన ఆశ్రమస్వీకార మొనర్చి శ్రీప్రణవానంద అనుపేర బరగెను. ఆయన మహర్షి గ్రంథములను తెనిగించెను. "మహర్షి ఉపదేశానుసారము"నకు తెలుగు వచనము రచించెను. నేను రమణాశ్రమములో నున్నప్పుడు అది అచ్చొత్తింపబడెను. ప్రూఫులను దిద్దుటకు మహర్షికడకంపిరి. మూలమును తెనిగించుటతోపాటు అక్కడక్కడ శ్రీప్రణవానంద "ఇది మహర్షియొక్క గూఢాభిప్రాయము" అని అంతరార్థములను ప్రకటము చేయు తన వ్యాఖ్యానమును కూడ వ్రాయుచుండెను. అట్టి సందర్భములు వచ్చినప్పుడెల్ల మహర్షి వాటిని పైకి చదువుచు హాలులో నున్నవారితో "మహర్షి గూఢాభిప్రాయములను నరసింహయ్యగారు ప్రకటనమొనర్చుచున్నారు, వినండి" అని నవ్వుచు పలుకుచుండిరి.

1937లో "పాల్ బ్రంటన్" రచించిన 'ఇన్ క్వెస్ట్ ఆఫ్ అవర్ సెల్ఫ్' అను గ్రంథముయొక్క ప్రతి (కాపీ) ఒకటి మహర్షికి పంపబడెను. దాని ఉపోద్ఘాతమునందు మహర్షి తన దేశమందు కూడ ప్రసిద్ధికెక్కుటకు పాల్ బ్రంటనే కారణమని ఆయన వ్రాసుకొనెను. ఈ అహంకారలక్షణమును మహర్షి హాలులోని వారందరికి చదివి వినిపించిరి. తమలో తాము నవ్వుకొనిరి.

ఒకనాటి మధ్యాహ్నము శేషుఅయ్యరు తొందరగా హాలులోనికి వచ్చి మహర్షితో ఒక మాసపత్రికయందు మహర్షి సిద్ధాంతములను ఖండించుచు ఒకవ్యాసము వెలువడినట్లును, వెంటనే దానిని తిరిగి ఖండించుచు ఒక వ్యాసమును మహర్షి పేర వ్రాయవలయుననియు నుడివెను. మహర్షి దాని కొప్పుకొనక "వారేమి వ్రాసిన మనకేమిపోయినది?" అని ప్రశ్నించిరి. అంత అయ్యరు "మనం మాటలాడకూరుకున్నచో వారి ఖండనవాదమును మనము ఒప్పుకొనినట్లుగునుకదా!" అనెను. "ఏమి నష్టము?" అని మహర్షి బదులు పలికిరి. అంత అయ్యరు సణుగుడు గొణుగుడు కొంత సాగించి పత్రికయందు వ్రాసినదాని ఖండన అవసరమని మహర్షికి నచ్చచెప్ప చూచెను. అప్పుడు భగవాను "మనమిప్పుడు వారు చెప్పినది ఖండించినచో, వారు మరల మనము వ్రాసిన దానిని ఖండింతురు. ఇట్లైన తెంపిలేకుండ వాద వివాదములు చెలరేగును. మీరేమి చేసికొనినను మీ జవాబుదారిపైన మీపేరనే చేసికొనుడు. భగవాన్ పేరేమియు వ్రాయనక్కరలే"దనిరి. అంతటితో గత్యంతరము లేక అయ్యరు ఊరుకొనవలసివచ్చెను.

'ఛాడ్విక్కు' అను ఆంగ్ల దేశీయుడు ఆశ్రమములో నుండెడివాడు. ఆయన జన్మదినమందు ఆంగ్లమున నొకపద్యము వ్రాసి మహర్షికి చూపెను. దానినంతయు చదివిన పిదప

మహర్షి "ఎంత చెప్పినను చేసినను ఈ రము ఒక శవము కావలెగదా! దీనిపై యింత వ్యామోహమేల? పద్యములలో దీనిని స్తుతించుట ఎందులకు?" అనిరి. ఛాడ్విక్కు తెలివి గలవాడు. అతడు మహర్షితో "భగవాన్, ఈ శరీరముండుట బట్టియే కదా మీతో పరిచయము సహవాసము కలుగుట. అందుచే ఈ ఈ శరీరము కూడ ఎంతో అదృష్టము కలదే" నని బదులు పలికెను. మహర్షి అతని తెలివికి మెచ్చుకొని "సరిసరే" అని ప్రశంసించిరి.

మధ్యాహ్న భోజనానంతరము 12-30 గంటల నుండి 2-30 గంటల వరకు మహర్షి విశ్రాంతి సమయము వారితోనుండువారు కూడ ఆ సమయమున విశ్రాంతి తీసికొందురు. కనుక హాలు సాధారణముగ నిర్మానుష్యముగనే ఉండును. ఇద్దరు ముగ్గురు సాధకులు హాలులోనున్నను వారు మౌనముగా జపమో, ధ్యానమో చేసికొనుచు కూర్చుండురు. కాని దసరాలో చాలమంది ఆగంతకులు ఉదయము నుండి సాయంత్రము వరకు వచ్చుచుండెడివారు. ఒకరోజున ఇట్లు వచ్చిన ఒక యువకుడు మధ్యాహ్నపువేళ హాలులో కూర్చుండి, "ఓంశక్తి ఓంశక్తి ఓంశక్తి శక్తిఓం" అని గట్టిగా పాడసాగెను. భగవానుని దగ్గరనున్న సుబ్రహ్మణ్యస్వామి అతనిని సమీపించి అది భగవానుని విశ్రాంతి సమయమనియు అందుచే అప్పుడు పాడవద్దనియు చెప్పెను. వెంటనే ఆ చిన్నవాడు ఊరకుండెను. హాలు నిశ్శబ్దమాయెను. అది గమనించి మహర్షి "పాడుట మానివేసితివేమని" అడిగిరి. సుబ్రహ్మణ్యస్వామివైపు చూపించుచు ఆ చిన్నవాడు "ఆయన పాడవద్దన్నాడని" చెప్పెను. అంత మహర్షి బిగ్గరగా "అదేమి, అజ్ఞా? నీవు స్వేచ్ఛగా పాడుము" అనిరి. మహర్షి కృపావిశేషము తనపై పూర్తిగా కలదని ఆ యువకుడుప్పొంగి ఆనందబాష్పములు చెక్కిళ్ళ తడుపుచుండ గట్టిగా పాట పాడెను.

సాయంకాలమున నేను నా భార్య అరుణాచలము కొండపై కూర్చుండి గీతాపారాయణము చేయుట వాడుక. ఆమె అప్పుడే గీతను నేర్చుకొనుచుండెను. మహర్షి ఆ వైపు సాయంకాలము షికారు వెళ్ళునపుడెల్ల ఆయన సమీపించగానే మేము లేచి నిలబడుచుండెడివారము. అప్పుడు ఆయన "కూర్చోండి, కూర్చోండి. మీ పని మీరు కానివ్వండి." అని వాత్సల్యముతో నుడివెడివారు. మహర్షికి ఆయనయందు గౌరవభావము మనస్సునందుంచుట చాలును. బాహ్యముగా దానిని ప్రకటింప పనిలేదు. మేమాశ్రమమందున్న రోజులలో ప్రొఫెసరు వేంకటరామయ్యకూతురు కామాక్షి యనునామె ఆశ్రమ సేవాకార్యములందు పాల్గొనెడిది. అప్పుడామెకు పదునాలుగేండ్ల వయస్సు. అయినను ఆ రోజులలో యింకను వివాహము కాలేదని మహర్షి నడుగగా వారు "తిరుపుఘళ్(ళ్)" నుంచి ఒక పాటను మంత్రముగా నుపదేశించిరి. తరువాత కొద్ది రోజులకు ఆమెకు వివాహము జరిగెను. అప్పటినుండియు "కళ్యాణముపాట" అని ఆ పాట ప్రసిద్ధికెక్కెను. అవివాహితయగు నా మరదలు (భార్య చెల్లెలు) ఒకతె యుండుటచే ఆమెకు శీఘ్రముగా పెండ్లి యగుటకై ఈ పాటను వ్రాసియిమ్మని నా భార్య మహర్షిని కోరగా వెంటనే మహర్షి ఆ పాట నొక కాగితముపై వ్రాసి ఇచ్చిరి. వారు స్వహస్తముతో లిఖించిన ఆ పాట అచ్చును మించిన చక్కని తెలుగు లిపిలోనుండెను. కొద్ది దినములకే నా మరదలుకు పెండ్లి ఆయెను. మేము మాత్రమా పాటను ఒక జ్ఞాపక

చిహ్నముగా నుంచికొంటిమి. కాని 1944 ఫిబ్రవరిలో మేము సాలోరిని వదలివచ్చు నప్పుడు మా సామానులన్నిటితోపాటు ఆ కాగితముకూడ పోయినది. అందుచే నేనమలాపురమునుండి మహర్షికి ఆ పాటను మరల వ్రాసి పంపుడని విజ్ఞప్తి చేసితిని. మహర్షి ఉత్తరములకు ప్రత్యుత్తర మిాయుటలో కాలయాపన చేయువారుకారు. తిరుగు టపాలో కళ్యాణముపాటను తెలుగునందును, తమిళమునందును కూడ వ్రాసి నాకు పంపిరి. దానినొక స్మారకచిహ్నముగా అద్దము కట్టించి నేనీనాటికి కూడ భద్రముగా నుంచితిని.

ప్రణవానంద అనబడు సర్వేపల్లి నరసింహయ్యగారు వేలూరునందు సిద్ధిపొందిరి. ఈ వార్తను మిక్కిలి ఆవేదనతో చిన్నస్వామి హాలులోనికి వచ్చి మహర్షికి వినిపించెను. ఆయనకూడ అది వినగానే చాల బాధపడునని చిన్నస్వామి ఉద్దేశ్యము. కాని మహర్షి ద్వంద్వాతీతుడుగదా! సుఖదుఃఖ సంఘటనలు ఆయన మనస్సుపై ఎట్టి పరిణామమును కలుగజేయనేరవు. అంతేకాక ఆయనకీ సంఘటన ఇదివరకే తెలియునేమో! "అట్లాగా, సరే"నని ఆయన ఊరకుండిరి. పినతండ్రి అంత్యక్రియలను పురస్కరించుకొని డాక్టరు రాధాకృష్ణన్‌గారు వేలూరు వచ్చెను. ఆయన రమణాశ్రమమునకు వచ్చునేమోనని అక్కడివారు కొందరు అనుకొనిరి. కాని అట్లు జరుగలేదు. "రాధాకృష్ణన్ ఆత్మసాక్షాత్కారమొందెనా" యని కొందరు మహర్షిని ప్రశ్నించిరి. అందుకాయన బదులు పలుకక మౌనముగా ఊరకుండిరి. ఎవరికి తోచినట్లు వారు ఆ మౌనమును అర్థము చేసికొనిరి.

ప్రతి మంగళవారము, శుక్రవారము, కృత్తికానక్షత్రదినమున సుబ్రహ్మణేశ్వర ప్రీతియని అక్కడివారు గిరిప్రదక్షిణ మొనర్చుచుండిరి. అందుకై మునిసిపాలిటివారు కొండచుట్టును ఒకరోడ్డువేసి అక్కడక్కడ విశ్రాంతికై మంటపముల నిర్మించిరి. మొదటి దినములలో మహర్షి కూడ భక్తబృందమును వెంటనిడుకొని గిరిప్రదక్షిణ మొనర్చుచుండిరి అట్టి ప్రదక్షిణమునకు రెండుమూడు దినములు కూడ పట్టుచుండెనట. సైకిళ్ళమిాద, తుదకు మోటారుకార్లలో గూడ ప్రదక్షిణమొనర్చువారిని నేను చూచితిని. ఒకనాడు గిరిప్రదక్షిణమును గూర్చిన తత్వమును వివరింపుడని మహర్షినడుగగా వారిట్లనిరి. "గిరి లేక కొండ అచలము, స్థిరమైనది. దాని చుట్టును ప్రదక్షిణము చేయు యాత్రికులు చలనముగలవారు. ఈ అచలమైన కొండ ఈశ్వరస్థానీయము. దీని చుట్టును ప్రదక్షిణము చేయువారు లోకులు. ఎంతవరకు ప్రజలు స్థిరమగు ఈశ్వరునిపై మనస్సుంచి తమ లోకవ్యవహారములను నిర్వహింతురో అంతవరకు ఈశ్వరుడే వారి యోగక్షేమములను చూచుకొనును. గిరి చుట్టును ప్రదక్షిణము చేయలేనిచో గుడిలో దేవుని చుట్టు ప్రదక్షిణ మొనర్పవచ్చును. ఇదియు సాధ్యము కాని యెడల ఆత్మప్రదక్షిణ నమస్కారము. ప్రతి శరీరమందును అంతర్యామియై దేవుడున్నాడు. కావున ఈ శరీరము లోకవ్యవహారములు చేయుచుండియు లోన స్థిరముగా నెలకొన్న దేవునిపై భారమునుంచవలెను. ఇదియే ప్రదక్షిణతత్వము."

ఒకప్పుడు తంజావూరుజిల్లా మన్నారు గుడి నుండి ఒక భక్తుడు రమణాశ్రమమునకు వచ్చెను. అతని అన్న మన్నారుగుడిలో వకీలుగా పనిచేయుచుండెను. కాని రాబడి అంతగా లేనందున స్థలమును మార్చిన లాభముండునేమో యని మహర్షి నడుగమనెను. అతడు లాక్యముగ మహర్షితో ఆ సంగతిని

చెప్పుచు స్థలాంతరమున తన వృత్తిని సాగించినచో లాభదాయకముగ నుండునేమోనని అన్నగారి ఉద్దేశ్యమని చెప్పెను. అంత మహర్షి దాని విషయమై                    నెవరినైన సంప్రదించిన బాగుండుననెను. జోస్యము చెప్పుట మొదలగునవి మహర్షి చేయుపనులు కావనియు ఆధ్యాత్మికవిషయములనే మహర్షితో ముచ్చటించుట మంచిదనియు దీనివలన గ్రాహ్యాము.

మన దేశమందు గురుశిష్యసాంప్రదాయము గలచోట్ల యందెల్ల అనాది కాలము నుండియు ఒక విశ్వాసము కలదు. గురువు తన పాత్ర నుండి తాను తినుచున్న ఉచ్ఛిష్ట భోజనములో ప్రసాదముగ కొంత యిచ్చిన ఎడల కొలది కాలముననే శిష్యుడు కూడ గురువంతటివాడై వారిరువురకు నడుమ అంతరమేమియు నుండదని నమ్మిక. ఇది భక్తసాంప్రదాయము. దీనినే తుకారాంస్వామి ఒక అభంగమందు ఇట్లు నిర్వచించి యున్నాడు.

తుకాహ్మణే దిథలే ఉచ్ఛిష్టాచి భోజవ
నాహివీ వాడీలేహ్మ ఆపుల్య భిన్న

దీనిని మనస్సునందుంచుకొనే కాబోలు కొందరు భక్తులొకనాటి మధ్యాహ్నము మహర్షి భోజనము చేయుచుండ ఆయన విస్తరి నుండి కొంత ప్రసాదముగ నిమ్మని అభ్యర్థించిరి. అప్పుడు మహర్షి వారితో "నేను తినుచున్నాను అను కర్తృత్వాభిమానము లేకుండ భోజనము చేయుడు. అప్పు డంతయు మహాప్రసాదమే. నేనిచ్చునది మీరు పుచ్చుకొనునది ఉండదు" అనిరి. ఇది బహుశః జ్ఞాన సాంప్రదాయమేమో! ఇట్లాచరించుటకే కాబోలు మన దైనందినజీవితములో ప్రతి నిత్యము భోజనము చేయుటకుముందు గీతలోని పదిహేనవ అధ్యాయమంతయు గాని తుదకు

"అహం వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహ
మాశ్రితః।
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం
చతుర్విధమ్॥"

అను శ్లోకమును గాని పారాయణ చేయుట వాడుక.

మహర్షి "మనము ప్రతిరోజున భుజించు కూరలు, పచ్చళ్ళు, పులుసు మున్నగు పదార్థములను విమర్శన చేయగా దానివలన తేలునదేమన కూరగాయాలతోపాటు ఉప్పు, పులుసు కారము ఉపయోగింతుమనియు వాటిని వేరు వేరుగా కూర పచ్చడి పులుసు అను పేర్లతో భిన్నపదార్థములు చేయుటవల్ల వీటిలో ఏది మంచిదో యేది మంచిదికాదో యేరుకొనవలెననెడి చిత్తవిక్షేపము కలుగుననియు, మన ముపయోగింపదలచిన కాయకూరలు, చింతపండు, ఉప్పు, కారము అన్నీ కలిపి ఒకే పదార్థముగ చేసినచో యేరుకొను పనిలేనందున మనస్సు యేకాగ్రమగుటకు అవకాశము"ని నుడువు చుండెడివారు.

ఒకనాటి మధ్యాహ్నము అందరు భోజనములకు కూర్చొనిరి. బ్రాహ్మణులు మాత్రము లోపలను, మిగిలిన వర్ణములవారందరును మహర్షితో బయటను కూర్చొనిరి. అప్పుడు మహర్షి చుట్టములలో నొకరు బయట కూర్చొనుట చూచి మిగిలినవారు ఆయనను లోనికి వచ్చి కూర్చొనమని చెప్పిరి. ఆయన అందులకియ్యకొనక, "ఈ భేదములన్నియు పోవలెను. అంతవరకు మనముగాని మన దేశము గాని బాగుపడద"నెను. అప్పుడు మహర్షి "మిగిలినవన్నియు పోయినట్లున్నవి. ఇది ఒక్కటే మిగిలినది కాబోలు" అని నుడివిరి. అప్పుడు నాకు రామకృష్ణపరమహంస ఈ విషయములో చెప్పిన సంగతి జ్ఞాపకము వచ్చినది.

"కొబ్బరిమట్టలు ఎండినచో దానంతటవే రాలిపోవును. కాని బలవంతముగా నూడదీయుటవలన చెట్టునకు హాని కలుగును. ఇట్లే దేహాభిమానము పోయి భగవంతునిపై మనస్సు నిలబడినప్పుడు వర్ణాశ్రమ ధర్మములు మున్నగునవన్నియు వాటంతటవే జారిపోవును. బలవంతముగా వాటిని విడుచుటకు ప్రయత్నించినచో అది సాధ్యముగాదు; దానివల్ల తనకును సంఘమునకును కూడ యిబ్బంది కలుగును."

రమణమహర్షి యొక్క అనుగ్రహము మనుజులపైననే గాక పశుపక్షిమృగాదుల యందును, స్థావరములగు వనస్పతులయందును కూడ ప్రసరించెడిదని నిదర్శనము లుండుటే గాక మాకు ప్రత్యక్షానుభవము కూడ కొంత కలిగినది. ఆశ్రమమందు మహర్షికి సన్నిహితముగనుండి వారి దయకు పాత్రులై వారి ఆశీస్సులను పొందిన ఒక కాకియొక్కయు కోతియొక్కయు సమాధులు ఆశ్రమ ఆవరణలో అదివరకే ఉండెడివి. మేము అక్కడున్నప్పుడు ఒక ఉడుతవచ్చి ముద్దుగా మహర్షిపై నెగబ్రాకుటయు వారి చేతినుండి గింజలు మొదలగు ఆహారపదార్థములు తినుటయు మేము ప్రత్యక్షముగ చూచితిమి. ఆశ్రమమందు లక్ష్మి యను ఆవు ఒకటుండెడిది. ప్రతి ఉదయమునను అది మేతకు పోవునప్పుడు హాలులోనికివచ్చి మహర్షిముందు కొద్ది క్షణములు నిలబడుటయు వారిచ్చు యిడ్లీ మొదలగు తినుబండారములను, వారి హస్తముల నుండియే ఆరగించి వారి సెలవుగైకొని వెళ్ళినట్లు అటనుండి పోవుట మేము చూచితిమి. దాని సంస్కారమెట్టిదో కాని కొన్ని యేండ్లు అది వరుసగ మహర్షి జన్మదినము నాడే ఈనెడిదట.

1944 లో నేను రమణాశ్రమమునకు వెళ్ళినప్పుడు మహర్షి చేయి కట్టుకట్టబడి యుండెను. అదేమని నేనడుగ అక్కడివారీ ఉదంతమును చెప్పిరి పిల్లి ఒకటి ఉడుత నొక దానిని చంపబోవ దానిని తోలబోయి పడుటచే మహర్షి చేతికి గాయము కలిగించుకొనిరనియు, దానికి కట్టుకట్టవసరమైనదనియు వింటిని.

ఒకనాటి వేసవికాలమున మహర్షి భోజనానంతరము వాడుకప్రకారము కొండ ప్రక్కకు పోవుచుండ ఒక దృశ్యమును చూచిరట. ఆశ్రమము ప్రక్కనున్న మామిడిచెట్టునొక దాని కాయలను కొందరు బాలురు రాలగొట్టుట మొదలిడిరట. కాయలతోపాటు ఆకులను, కొమ్మలను, రెమ్మలను, రాల్చుట చూచి మహర్షి వారిని మందలించిరట— "మీకు కావలసినది కాయలు. అవి కోసుకొనుట తప్పులేదు. కాని అనవసరముగ కొమ్మలను, రెమ్మలను విరచి ఆకులను రాల్చి చెట్టుకెందుకు హింస కలుగజేయుదురు?"

ఒకనాటి ఉదయమున నేను హాలులో భగవాన్ సమక్షమున కూర్చొని గీతలో రెండవ అధ్యాయాంతమున వివరింపబడిన స్థితప్రజ్ఞలక్షణముల గూర్చి మననము చేయుచుంటిని. అప్పుడు—

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే

అను శ్లోకమందలి "దృష్ట్వా" శబ్దము నాకు సరిగా నర్థము కానందున మహర్షి నడిగితిని. ఈ పదమునకు "చూచి" అని శబ్దార్థము. చూచువాడొకడు, చూడబడునదొకటి అని గోచరించును. అంత నేను భగవానుని వివరింపమని కోరగా ఆయన "దృష్ట్వా అనగా అనుభూత్వా" అని నాద్వైతశంకను తొలగిం

చిరి. ఒక వస్తువునుగాని వ్యక్తిని గాని చూచునట్లుపరమును చూచుట కాదనియు, అదిగా నుండుటే నిజమగు అనుభవమనియు యిది బుద్ధి కుశలతవల గ్రాహ్యముకాదనియు బుద్ధి నతిక్రమించుటవలన హృదయమున అనుభవింపనగునని యు వారు చెప్పిరి.

మరొకసారి నే నాయనతో నిట్లంటిని. "భగవాన్! మీరు చెప్పినట్లు 'అహం' వృత్తి యొక్క మూలమును బుద్ధికుశలత వలన ఆత్మ యని గ్రహించినను మనస్సందు ప్రవేశింప కున్నది. కారణమేమి?" ప్రశ్నకు ప్రతి ప్రశ్న ద్వారా సమాధానమిచ్చుట మహర్షి పద్ధతి. "ఏమి అడ్డు వచ్చుచున్నదో చెప్పుడని" ఆయన అడిగిరి. నేనొకింత ఆలోచించి "జన్మాంతర సంస్కారములు మనస్సు తాను పుట్టిన చోటు చేరకుండ అడ్డుతగులుచున్న వేమో!" నని అంటిని. "అది నిజమే. ఆ సంస్కారములను పోగొట్టుకొనుటకే మనము చేయుసాధన" అని ఆయన బదులు చెప్పిరి. అప్పుడు నే నిట్లంటిని. "మన ప్రయత్నమెంత తీవ్రమైనను జన్మ జన్మాంతరములుగా మనస్సులో నాటిన సంస్కారములను నిర్మూలింపగాదు. భగవంతుని కృపఒక్కటే దీనికి సమర్థమైనదని నా అభిప్రాయము. దేవుని కృపలేనిదే మనమెంత సాధన చేసినను లాభములేదు." అప్పుడాయన "మీరు చెప్పినదంతయు నిజమే. ఇందు మూడు విషయములున్నవి. (1) స్వప్రయత్నము, (2) కాలపరిపక్వము (3) ఈశ్వరకటాక్షము. మనము సాధన చేయుచుండ సమయము వచ్చినప్పుడు ఈశ్వరకటాక్షము దానంతటదే లభించును. దానికై దేవునకు జ్ఞాపకము చేయనవసరములేదు. ఆయన మనము చేయునదంతయు చూచుచునే ఉన్నాడు. తగిన సమయము వచ్చినప్పుడు ఆయన అనుగ్రహము దొరకును. సాధకులు సామాన్యముగా దేవుని కృపకై చూచుచు తమ సాధనయందశ్రద్ధవహించుదురు. ఇందువలన వారు గమ్యస్థానము చేరలేరని" చెప్పిరి.

నే నక్కడున్నప్పుడు అస్సామునుండి 17 సంవత్సరములు వయస్సుగల యువతి జాబు వ్రాసెను. తాను చైతన్యప్రభువు కాలములోని దాననియు, ఆ నాయునకు కొన్నాళ్ళు వంట చేసి పెట్టిడిదాననియు వ్రాసెను. తరువాత అప్పుడు జీవులై భౌతికశరీరములతో నుండు మహాత్ముల గురించి చెప్పుచు మహర్షి అగ్రస్థానములోనివారనియు, అరవిందయోగి ద్వితీయస్థానము మాత్రమే అలంకరించుననియుకూడ వ్రాసెను. దీనిని చదివి మహర్షి "మనస్సున్నంతవరకే ఈ తరహాలు. ఆత్మలో భేదములేమియు లేవు" అనిరి. అనగా ఆత్మను చూడగలిగిన మహాత్ముల అనుభవము ఒక్కటే అగుటచే వారియందు హెచ్చుతగ్గులు లేవు. సాధకులగువారికే యింకను మనస్సు మృతి చెందకుండుటచే తరహాలు, తేడాలు, స్థాయిలు కనుపించును.

మనస్సును ఏకాగ్రతచేయు విషయములో మహర్షి ఇట్లు పలికిరి. "మనస్సనునది ఒక వ్యక్తిగాదు. చూడ వీలుకాదు. కావుననే సులభముగా వశపరచుకొనుటకు శక్యము గాదు. ఏనుగుతొండము చివరనుండు వ్రేలివలె అది ఎప్పుడను కదలుచునే ఉండును. ఏనుగు తొండపు వ్రేలునకు సూదివంటి ఎంత చిన్న వస్తువునిచ్చినను దానిని పట్టుకొని అది స్థిరముగా కదలక ఉండును. అట్లే మనస్సునకు కూడ భగవన్నామమువంటి ఎంత చిన్న పదార్థమునిచ్చినను అది దానిని గట్టిగా కరుచుకొని కాలక్రమమున స్థిరమగును." అందుచేతనే మనస్సు ఇష్టదైవముయొక్క-

మంత్రమునుగాని, నామమునుగాని సదా జపించుచు స్థిరమొనర్చు సాంప్రదాయ మేర్పడినది.

మహర్షి మోక్షమనునది ద్రవ్యమిచ్చి కొను వస్తువు కాదనియు మనస్సు మృతి నొందినగాని అది దొరకదనియు చెప్పుచుండెడివారు. ఒక గురువు వద్ద కొందరు శిష్యులు వేదాంత పాఠముల నభ్యసించుచుండిరి. గురువు ఒకప్పుడు వ్రాసుకొనుటకేవో శిష్యులకు చెప్పెను. వారిలో శ్రీమంతుడగు ఒకడు యింకొకనిని తనకు కూడ ఆ పాఠమును వ్రాసి యిట్టినచో అతనికి కొంత పైకమిత్తునని చెప్పెను. గురువుగారది వినియును విననట్లే అప్పటికూరకుండెను. కాలాంతరమున ఒక సందర్భములో శ్రీమంతుడగు శిష్యుని గూర్చి గురువుగారిట్లనిరి. "వానికేమిలే! వాడు ధనవంతుడు. ధనమిచ్చి మోక్షమును కూడ కొనగలడు." మోక్షమనునది ఒకరిచ్చునది కాదు. డబ్బిచ్చి కొనుటకు బజారు వస్తువుకాదు. ఎవరి మోక్షమును వారే సాధించుకొనవలెను. ఎవరి మనస్సు వారిదే కనుక దానిని చంపినగాని మోక్షము లభింపదు గనుక సాధన వలన మనోనాశము సాధించినగాని ముక్తి లభింపదు.

ఒకప్పుడు కొణకా కనకమ్మ అను వ్యక్తి స్వస్థలమగు నెల్లూరుపోవుచు మహర్షి యొద్ద సెలవు గైకొనుటకు వచ్చి "స్వామీ, నేను నెల్లూరు పోవుచున్నాను. సెలవిండ" నెను. అది విని మహర్షి "నీవు నేను ఎక్కడికిని పోవుటలేదమ్మా. తిరువణ్ణామలై పోయి నెల్లూరు వచ్చును" అనెను. దీనిని బట్టి గ్రహించునదేమన, "నీవు నేను బ్రహ్మస్వరూపులముకాన సర్వవ్యాపియగు ఆత్మస్వరూపులము. ప్రదేశములు వేరువేరు కావచ్చును గాని ఆత్మ అంతటా నిండియుండుటచే ఎక్కడకు పోవునది కాదు. పోలేదు. 'ఆత్మా న గంతా నాగంతా' అని అష్టావక్ర గీత.

మహర్షి ఒకప్పుడిట్లు తనను గురించి చెప్పెనట. "ఆయన విరూపాక్ష గుహలో నివసించునప్పుడు పులులు మొదలగు వన్యమృగము లెన్నో అక్కడకు వచ్చుచుండుట చూచి అక్కడివారు భయపడుచుండ, తనను చూచుటకు మహాత్ములెందరో మారు రూపములలో వత్తురనియు వారిని చూచి భయపడనక్కఱలేదనియు చెప్పిరి." ఇందువల్ల రెండు విషయములు తేటతెల్లమగును. ఒకటి–మహర్షి యందరికంటె పైస్థాయిలోని మహాత్ముడు. కావుననే వారు వీరి దర్శనమునకై వచ్చెడివారు. రెండు–మహాత్ములకు వారి యోగమహిమవలన యే శరీరమునైనను ధరించుటకు శక్తిగలదు.

ఒకప్పుడు దక్షిణాది నుండి ఒకరు రమణాశ్రమమునకు వచ్చి జీవితమందలి తమ దుఃఖములన్నిటిని మహర్షితో చెప్పుకొని సన్న్యాసము తీసికొంటేగాని సంసార సంబంధమైన దుఃఖముల నివారణకావని వాపోయెను. మహర్షి నవ్వుచు, "ఇదివరకు గృహస్థునను కొని మీరు బాధపడుచుండిరి. ఇకమీద సన్న్యాసిననుకొని బాధపడగలరు. ఆశ్రమమును మార్చినంత మాత్రమున జీవిత సుఖదుఃఖముల ననుభవించుట తప్పదు. వాటియందు చిక్కుకొనక వ్యామోహము ఆసక్తిలేక నిత్యకృత్యములను నిర్వహించుటయే దీనికి మంద"ని వచించిరి.

ఒక దాక్షిణాత్యుడు మహర్షితో "హిమాచలమునకు పోయినగాని మనశ్శాంతి లభించునట్లు లేద"ని నుడివెను. అంత మహర్షి "ఇప్పుడు యింటి నుండి అరుణాచలమునకు మూడువందలమైళ్లు పైచిలుకు వచ్చితిరిగదా.

ఎంత మనశ్శాంతి లభించెను! దీనినిబట్టి హిమాలయమునకు వెళ్ళినచో ఎంత మనశ్శాంతి లభించునో అంచనా వేసికొనుడు'' అని బదులు చెప్పిరి. అనగా మనశ్శాంతి అనునది స్థలముల పైనను, దూరముపైనను లేదని మహర్షి అభిప్రాయము.

ఒక భక్తుడు మహర్షిని ''వైకుంఠము, కైలాసము, స్వర్గము మొదలగు లోకములు నిజముగా నున్నవా? కల్పితములా?'' అని అడిగెను. దానికి మహర్షి ''భూలోక మెంత నిజమో వైకుంఠము కైలాసము కూడ అంత నిజమే. ఇది అబద్ధమైనప్పుడు, అవి కూడ అబద్ధములే''నని సమాధానమిచ్చిరి. భూలోకము మున్నగు లోకములన్నియు బ్రహ్మాండములోనివే. సృష్టియంతయు మనోకల్పితమే అన్నప్పుడు మన భూమి మొదలుకొని బ్రహ్మలోకము వైకుంఠము కైలాసము అన్నియు స్వప్నతుల్యములే. సుషుప్తియందువలె సమాధిలోను ఇవేవియు నుండవు. ఒకప్పుడుండి మరొకప్పుడు లేనిదికాని, ఒకప్పుడొకలాగ మరొకప్పుడు మరొకలాగ ఉండునదిగాని మిథ్యయగును గాని సద్వస్తువు కాదనియు'' మహర్షి యనిరి.

ఒక భక్తుడు మహర్షిని, ''మీవంటి సామాన్యజనులకు ప్రబోధము చేయుచు, జ్ఞానోపదేశమిచ్చుట వలన సంఘము బాగుపడునుగదా'' అని అడుగగా భగవానిట్లనిరి. ''మేమేమియు చేయుచుండుటలేదని నీవెట్లనగలవు? ఒకచోట శక్తిఉన్నదనగానే పదిమందికి తెలిసినను తెలియకపోయినను దాని వలన పని జరుగుచునే ఉండును. అది దాని స్వభావము. సూర్యుడు ఆకాశములో వెలుగుచుండును. ఆయన వెలుగును ఉపయోగించుకొను వారునుకలరు, నిద్రపోవువారును కలరు. ఐనను సూర్యుడు ప్రకాశించుచుండుట ఆయన స్వభావము.'' కాని సంఘసేవ చేయుటకు తగినంత శక్తి అవసరమని వారనుచుండెడివారు. ''మానవశక్తి అల్పమైనది. పరమేశ్వరశక్తి అనంతమైనది. కాబట్టి భగవంతునితో సన్నిహితసంబంధము పెట్టుకొని మీరుకూడ తగినంత సంపాదించి సంఘసేవ చేయుడ''ని వారి బోధ.

ఒకసారి బాబూ రాజేంద్రప్రసాద్ రమణమహర్షి దర్శనమునకు వచ్చి సెలవుతీసుకొని వెళ్ళునప్పుడు ''గాంధీమహాత్ముని కేదైన సందేశమిత్తురా'' అని అడిగెను. దానికి భగవానిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి. ''ఒకే శక్తి యిక్కడను అక్కడను కూడ పనిచేయుచున్నది. మాటలతో చెప్పవలసిన పనియేమియు లేదు.''

నేను అన్నారెడ్డిపాలెమున యోగి రామయ్యాగారి ఆశ్రమమందున్నప్పుడు వారి వల్ల ఈ క్రింది సంఘటన వింటిని. ఒకప్పుడు మహర్షి రక్తగ్రహణివలన శారీరకముగ బాధపడుచుండిరి. ఈ సంగతి దగ్గరుండే మాధవస్వామి వలన ఆశ్రమాధికారులకు తెలిసెను. కాని మందులు పుచ్చుకొనుడని చెప్పుట కెవ్వరును సాహసింపలేదు. డాక్టర్లందరు చిన్నస్వామికెన్నో చికిత్సలు చెప్పిరి. కాని చిన్నస్వామికూడ మహర్షితో సూటిగ చెప్పుటకు సంకోచించెను. ''అసావాదిత్యో బ్రహ్మ'' అనునట్లామెన ''చుట్టు తిరిగి'' మహర్షికి రక్తగ్రహణి కట్టుటకు డాక్టర్లు చెప్పిన మందుల గుణములను ప్రభావమును వర్ణించి చెప్పెను. అందులకేమియూ సమాధానము చెప్పక భగవాన్ మిన్నకుండిరి. ఆశ్రమములో తానొక ప్రధానపురుషునిగ ఎంచుకొను శేషుఅయ్యరు మహర్షితో డాక్టర్లు చెప్పిన మందుల గురించి ఫలకపలుకులు పలికెను.

కాని లాభములేక పోయెను. అప్పుడు మహర్షి "అందరును మహర్షిని బాగుచేద్దామని చూచే వారేగాని ఎవరిని వారు బాగుచేసికొందామని ఒకరూ ప్రయత్నించరే," అన్నారు. అది విని శేషు అయ్యర్ సిగ్గుపడి ఊరుకొన్నాడు. అంత వారందరు ఆలోచించి గిరిపై స్కందాశ్రమములో నున్న యోగి రామయ్యను పిలిపించిరి. ఆయనకు మహర్షి శరీరవ్యాధిని వివరించి డాక్టర్లు చెప్పిన మందుల గురించి చెప్పి, ఆయన సాయంకాలము కొండపై మహర్షితో షికారు పోయినప్పుడు తాను మహర్షితో గ్రహణి, దాని మందులను గురించి యాదృచ్ఛికముగ చెప్పినట్లు చెప్పుమనిరి. అంత యోగి రామయ్య వారి సలహా ప్రకారమే చేయ మరునాడుదయం హాలులో కూర్చున్నప్పుడు భగవాన్, నిన్న సాయంత్రము యోగి రామయ్యగారు నా గ్రహణికేదో మందు చెప్పిరి. మందుపేరు విన్నంతమాత్రమున మందుతీసికొనకయే నాకు గ్రహణి నివారించినదని" చెప్పిరి. అందరును సంతోషించిరి. కొందరేకాంతమున యోగి రామయ్యను కలిసి "మీవద్దయేమైనా సిద్ధులున్నవా? మీరు మందుపేరు చెప్పినంతమాత్రమున అది పుచ్చుకొనకయే మహర్షికి రోగనివారణ మాయెనట" అని ప్రశ్నించిరి.

అంతయు సంగ్రహముగ చెప్పవలెనన్నచో మహర్షి సర్వజ్ఞుడు. సర్వాంతర్యామి. దీనిని తెలుపుటకు నేను విన్న ఒకటి రెండు సంఘటనలను ఇక్కడ పొందుపరచుచున్నాను. ఒకప్పుడొక యువకుడు హాలులో కూర్చుని తీవ్ర ధ్యాననిమగ్నుడయ్యెను. కొన్ని దినములట్లు జరిగిన పిమ్మట అతడు హాలులో లేనప్పుడు అక్కడివారతని తీవ్రనిష్ఠను గురించి మహర్షితో ముచ్చటించిరి. అప్పుడు మహర్షి ధ్యాననిష్ఠ తదేకమైనదే కాని ఈతీవ్రతంతయు ఒక ఉద్యోగము నిమిత్తము. నావద్ద ఏమి ఉద్యోగములున్నవి? నేనతనికేమివ్వగలను?" అనిరి.

1948 జనవరి 26న సాయంకాలము భగవాన్ హాలులో నున్నవారిని అక్కడి రేడియో పెట్టుమని తొందర చేసిరట. అది ఒక వింత, విడ్డూరము. సాధారణముగ మహర్షి అట్లెన్నడును చేయువారు కారు. రేడియో పెట్టగనే గాంధిగారు హత్యచేయబడిరను దుర్వార్త వినబడెను. జాతిపిత హత్యవలన ప్రపంచమంతయు దుఃఖములో మునిగిపోయెను. ఈ సంగతి ముందుగనే తెలిసి మహర్షి రేడియో పెట్టుమని తొందర చేసిరేమో! వారి సర్వజ్ఞత్వమునకివి కొన్ని నిదర్శనములు.

ఒక స్వాములవారు దక్షిణాది నుండి రమణాశ్రమమునకు వచ్చిరి. వారొక ధర్మశాలను నిర్మించుచు చందాలు వసూలు చేయుటకై దేశసంచారమునకు బయలుదేరిరి. చందాల జాబితాలో మహర్షి పేరు అగ్రస్థానము వహించుటవలన శుభసూచకముగా నుండుననియూ, అందువల్ల త్వరలోనే పని నెరవేరుననియూ వారి ఉద్దేశ్యము. అందుచే ఆయన మొరాకో చర్మముతో బైండు చేయబడి బంగారు అంచులు గలిగిన ఒక పుస్తకమును మహర్షికిచ్చెను. మహర్షి దానిని తిరగ బోర్ల వేసి అన్నివైపులా దానిని చూచి తిరిగి వారికిచ్చివేసిరి. అప్పుడు సన్యాసి "మీపేరు వ్రాసి యెంతో కొంత మొత్తమును వేయుదురని పుస్తకమును మీచేతికిచ్చితి"ననిరి. అందుకు భగవాన్ "నాకేమియూ పేరులేదే! ఏమని యిచ్చుట వ్రాయను?" అనిరి. అందులకు సన్యాసి నవ్వి, మహర్షితో "మీపేరు రమణ మహర్షి కదా! అదే వ్రాయండి" అనెను.

దానికి సమాధానముగా మహర్షి "రమణ మహర్షియని మీరు పిలుచుచున్నారు. నేనెప్పుడును అది నాపేరని చెప్పలేదే!" అనిరి. భగవద్వస్తువునకు పేరూ ఊరూ లేవు. అన్ని పేర్లు దానివే. అంతటా అదే. దీనిని సూచించుటకే కాబోలు మనయందొక పూర్వాచారమున్నది. భార్య భర్తనుగాని, భర్త భార్యనుగాని పేరుపెట్టి పిలిచెడివారు కారు. "తత్" అను పరబ్రహ్మ శబ్దమునకు సరియగు తెలుగు పదము "అది". అందుచేతనే "ఇది" అను సర్వనామము వలన తెలియజేయబడు ప్ర వారిని వదలి భార్య భర్తను గురించి చెప్పునప్పుడెల్ల "ఆయన లేక వారు" అనెడిది, భర్తకూడ భార్యను అది" అనెడివాడు. "ఇది" వల్ల గ్రాహ్యమగు ప్రతి స్త్రీయూ పేరుగలదే. వారినందరిని అవతల పెట్టిన పిదప పరబ్రహ్మస్వరూపమగు తన భార్యయే మిగులును. ఈనాడు ప్రాశ్చాత్యనాగరికతా ప్రభావము వల్ల పేర్లు పెట్టుకొని భార్యాభర్తలు పిలుచుకొనుట కలవాటుపడిన మనము దీనిని గర్వించవచ్చును. ముఖ్యముగా మహిళలు "మేము నిర్జీవవస్తువులమా? మాకు పేరు ఊరు లేదా? "అది అనుటలో మీ ఉద్దేశ్యమేమి? అని అనవచ్చును. కాని,

ఆత్మనామ గురోర్నామ నామంతి దురితస్యచ
శ్రేయఃకామో నగృహ్ణీయాత్ జ్యేష్ఠాపత్య కళత్రయోః

అని పెద్దలందరు. శ్రేయఃకాములు భార్యను పేరుపెట్టి పిలువకూడదని పెద్దల మతము. ఇంతేకాక ఇందొక చమత్కారము కూడ కలదు. అప్పయ్యదీక్షితులవారు దక్షిణాత్యుడు. మొదట నుత్తరార్కాడు జిల్లాలో ఉండిరట. ఇది తమిళ తెలుగులకు సరిహద్దగుటచే ఆయన బహుశః తెలుగుదేశమందు కూడ పర్యటించియుండవచ్చును. ఆయన ఈ శ్లోకమును చెప్పినట్లు ప్రతీతి.

ఆంధ్రత్వమాంధ్రభాషాచ ఆంధ్రదేశే వ్యవస్థితిః
స్వాధ్యాయాం యాదుషీశాఖాం నాల్పస్య తపసః ఫలమ్

తెలుగుభాషయందు ఓరి, ఓసి, ఓయీ అనునవి సంబోధనాప్రథమావిభ ప్రత్యయములు. పూర్వము భర్త భార్యను "ఓసీ" అని సంబోధించెడివాడు. "ఓసీ"ని నాలుగు సార్లు చర్చించినచో శివశబ్దమందుండి వెలువడును. అప్పయ్యదీక్షితులువారు "ఈ తెలుగువారెంతటివారో! భార్యనుకూడ శివస్వరూపిణిగా నెంచి సంబోధించుచున్నారని" ఆశ్చర్యచకితులైరట. ఆధ్యాత్మికదృష్టి అంతరించి ప్రపంచదృష్టి అగ్రస్థానము వహించిన ఈ నాడు ఇదంతయు హాస్యాస్పదముగ తోచవచ్చును. కాని పెద్దల సాంప్రదాయమట్లున్నది.

నేను రమణాశ్రమము వదలిన కొంత కాలమునకు స్వప్నములో మహర్షిని చూచితిని. వారప్పుడు సింహాసనములాటి ఉన్నతాసనముపై కూర్చుండిరి. శరీరము బంగారుఛాయతో మెరయుచుండెను. నేను ప్రక్కన చేతులు కట్టుకొని నిలబడి నేత్రదృష్టిని ప్రసాదింపుమని వారిని ప్రార్థించితిని. "అది నా వల్ల అగుపని కాదు. వేరొకరివద్దకు మీరు వెళ్ళవలసియున్న"దని వారు సెలవిచ్చిరి. అంతటితో స్వప్నమదృశ్యమాయెను.

ఇటీవల (1977 లో) ఒక స్వప్నమందు మహర్షిని కాంచితిని. ఇదివరకువలనే వారు ఉన్నతాసనముపై కూర్చుండిరి. వారిప్రక్కన మరొక సన్యాసికూడ ఉండెను. నేను వారిద్దరి సముఖమున కూర్చుంటిని. అప్పుడా రెండో సన్యాసి నా ఆధ్యాత్మిక ప్రగతినిగూర్చి

ప్రశ్నించి, "పది నిముషములు మహర్షివంటి మహాత్ములతో నుండిన చాలును. మీకు మోక్షము లభించును." అనెను. అంత మహర్షి వారి అభిప్రాయమేమోగాని "ఊహు-ఊహు" అనిరి. అయినను సన్యాసి విరమింపక "మీకు పది నిముషములు చాలునండీ మహర్షితో సహవాసము చేసిన మోక్షము లభించున" నెను. అంతటితో ఆ దృశ్యము మాయెను.

1938 ఫిబ్రవరిలో మేము అరుణాచలము వదలి వెళ్ళవలసిన పరిస్థితులేర్పడెను. నావద్ద రూ. 49/- మాత్రమే మిగిలియుండెను. అందుచే తిరువణ్ణామలైలో నుండుట అసంభవమనిపించి మా అన్నగారు అప్పుడుండిన బుచ్చిరెడ్డిపాలెమునకు పోదలచితిమి. మహర్షి భక్తులలో పేరెన్నికగన్న రామయోగి బుచ్చిరెడ్డిపాలెమునకు నాలుగుమైళ్ళలో నుండు అన్నారెడ్డిపాలెపు వాసియగుటచేతను అతని కచ్చట ఒక ఆశ్రమముండుటచేతను నేనచ్చట ఆశ్రమమందుండుటకు వీలగునేమోనని కనుగొనదలచితిని. అప్పుడాయన రమణాశ్రమములోనే ఉండెను. ఇట్లుండ మేము ఊరికి పోవలసిన దినము వచ్చినది. ప్రాతఃకాలమున యథాప్రకారము ఆశ్రమమునకు వచ్చి కూర్చుంటిని. అంతలో ఒక ఆలోచన తట్టినది- మరల మహర్షిని ఈ జీవితములో చూడగలనో లేదో! అదియే తుది చూపేమో! అందుచే మహర్షికి ప్రదక్షిణ నమస్కారములు చేసి సెలవుతీసుకొన నెంచితిని. మహర్షిని ముట్టకూడదనియు దూరమునుండే ప్రణామము చేయవలయుననియు హాలులో నియమములు. కాని దానికి విరుద్ధముగ మహర్షి బయటకు పోవునప్పుడు ఆయనకు సాష్టాంగపడు భక్తులనెందరినో నేను చూచితిని. వారి ఉదాహరణమును నే ననుసరించదలిచి నియమములన్నియు హాలులో నున్నంతవరకే అని మనస్సు సమాధానము చేసికొంటిని. మధ్యాహ్నము భోజనగంట పదకొండుగంటలకు మ్రోగును. నేనంతకు ముందే లేచి మహర్షి వద్ద తిరువణ్ణామలై విడిచిపోవుటకు సెలవు గైకొంటిని' "మధ్యాహ్నము వచ్చెదరా" యని మహర్షి అడిగిరి. "రాత్రి బండికి పోవుచుండుటచే మధ్యాహ్న మాశ్రమమునకు వచ్చుటకు వీలుపడదని" నేనంటిని. అంత నేను హాలునుండి బయటకు వచ్చి వరండాపై నిలబడితిని. మహర్షి భోజనమునకు పోవునప్పుడు హాలునుండి వరండాద్వారా ఉగ్రాణి (స్టోర్ రూం)లో ప్రవేశించిన పిదప వారు మనకు దొరుకుట కష్టము. పదకొండుగంటలవేళ భోజనపుగంట మ్రోగెను. మహర్షి; మాధవస్వామి హాలులో నుండి లేచి వరండాలోని వచ్చిరి. అప్పుడు నేను తటతట కొట్టుకొను హృదయముతో మహర్షినుద్దేశించి "ఒక్కసారి ఆగండి" అని అంటిని. వెంటనే మహర్షి ఆగి "ఏమి సమాచారమని" అడిగిరి. "మరల మిమ్ము చూచు భాగ్యము ఈ జీవితమందు కలుగునో! లేదో! కావున ఒక్కసారి ప్రదక్షిణ నమస్కారము చేయనిండు" అని చెప్పుచు నేనాయనకు ప్రదక్షిణమాచరించి పాదములపై శిరస్సునుంచితిని. చాలును లే" అని ఆయన వాత్సల్యపూరిత కంఠముతో ముందుకు సాగిరి. నేను, నా భార్యయు యోగి రామయ్యగారి వద్దకు పోతిమి. మహర్షిని చూచుటకదే కడసారియని నే నప్పుడనుకొంటిని కాని దైవనిర్ణయము వేరుగా నుండెను.

మహర్షి వద్ద సెలవు గైకొని మేము యోగి రామయ్యగారిని ఆయన కుటీరమందు దర్శించితిమి. వీలైనప్పుడెల్ల అన్నారెడ్డిపాలెమందు

ఆయన ఆశ్రమములో నుండుటకు అనుమతి నడిగితిని, ఆయన దానికియ్యకొని పలయు సంగతులన్నియు ముచ్చటించెను. ఆశ్రమము నకు ఆయన జాబు వ్రాయుదుననికూడ చెప్పెను. ఆయనవద్ద సెలవు గైకొని వచ్చుచుండగా మహర్షి భోజనానంతరము మామూలు ప్రకారము కొండప్రక్కకు పోవుచుండిరి. దారిలో మేము తారసిల్లితిమి. అంత మహర్షి "మీ రింకను యిక్కడే ఉన్నారా?" అని మమ్ము లుకరించిరి. యోగి రామయ్యగారితో మాట్లాడుచుండుటవలన ఆలస్యమైనదనియు యిక ఇంటికి పోవుచుంటిమనియు చెప్పితిమి. అది విని రెండడుగులు ముందుకుసాగి నిలబడి మహర్షి మమ్ము వెనుకకు పిలిచిరి. వెంటనే మహర్షి వద్దకు మేము పోయి చేరితిమి. "ఈ నాడు పనసతొనలు వేసి పాయసము చేసినారు. ఆ ప్రసాదము తీసుకొని మరీ వెళ్ళండని" మహర్షి మాకు చెప్పిరి. మేమై వెళ్ళి అడిగినచో అక్కడి వారేమందురో యని తోచి కాబోలు మహర్షి అక్కడే నిలబడి వారికూడా ఉన్న మాధవస్వామిని పంపిరి. ఇద్దరకు చెరియొక కప్పు పాయసము యిప్పించవలసినదిగా మాధవ స్వామితో నిర్దేశించిరి. మహర్షి యొక్క కృప మాపై పూర్తిగా నున్నదని మాకు పట్టరాని ఆనందము కలిగెను. లోలోపలనే వారికి నమస్కృతులు సలుపుచు భోజనశాలకు పోయి రెండు కప్పుల పాయసము పుచ్చుకొని యిల్లు చేరితిమి. నాటి రాత్రి రైలుబండిలో నెల్లూరు పోయి, అక్కడనుండి బుచ్చిరెడ్డి పాలెము చేరితిమి.

నేను రమణాశ్రమములో నున్నప్పుడు బి. వి.నరసింహస్వామిగారితో పరిచయ మేర్పడెను. వీరు ఉపాసనీ బాబా జీవిత చరిత్రమును భక్తుల అనుభవములను ఆంగ్లమున ప్రచురించి యుండిరి. వారు నాకాపుస్తకములనిచ్చి చదువమనిరి. సాకోరిబాబా చాల మహిమలను ప్రదర్శించి యుండెను. వైద్యులకసాధ్యమగు రోగములెన్నో కుదిర్చిరి. వారివద్దనే నాకేదైనా లాభము కలుగవచ్చునని నరసింహస్వామిగారి ఉద్దేశ్యము. కావున నేను కొన్ని మాసములన్నా రెడ్డిపాలెములో నుండి 6-1-1939 తేదీన మా అన్నగారితో కలసి సాకోరి పోతిని. నే నక్కడ అయిదు సంవత్సరములుంటిని. అక్కడకు వెళ్ళిన ఒకటి రెండు సంవత్సరములకు రమణ జయింతికి ముందుగా నాకొక ఆవేశము కలిగి మహర్షిపై నొక శ్లోకము వ్రాసి సర్వాధికారికి పంపితిని. అది భగవాన్ జయంతినాడు చదవడమైనదనియు భక్తులందరు దానిని విని చాల హర్షించిరనియు సాకోరికి నాకు జాబు వచ్చెను. ఆ శ్లోకమిందు పొందుపరచుచున్నాను.

అరుణగిరి ముపేతం సచ్చిదానందమూర్తిమ్
రమణ ఇతి పృథివ్యాం విశ్రుతం జ్ఞానసూర్యమ్
గహనహృదయవిద్యాం లీలయం బోధయంతమ్
సతతమహమమేయం సద్గురుం సంస్మరామి.

# శరణాగతవత్సలుడు

కల్యాణ్‌లో ప్రచురింపబడిన కీ. శే. శ్రీ బ్రహ్మాశజీ భటనాగర్ గారి హిందీకథానికకిది
అనువాదం. అనువదించినవారు: శ్రీ సూరంపూడి విశ్వేశ్వరరావు.

గాయత్రి నాయనమ్మకు కంఠహారంలా సర్వవేళలా ఆమెతోనే ఉంటుంది. రాత్రి శాంత ఆమెను తన గదికి తీసుకుపోతుంది. కాని ప్రాతఃకాలం హారతి స్వరం వినగానే ఆమె పరుగున వస్తుంది. ఆమె పాడే హారతి స్వరం ఆమె కంఠాగ్రమున ఉంటుంది. ఆమె కూడా నాయనమ్మలాగే జపమాలికను త్రిప్పుతూ ఉంటుంది.

ఒక రోజున గాయత్రి భోగమును గ్రహించవలసినదిగా గోపాలుణ్ణి అర్థిస్తోంది. "నీ పేరు లడ్డూ గోపాలుడు కదూ! నీకు లడ్డూలు యిష్టమని తాజా లడ్డూలు తెచ్చాను. తినవయ్యా, నా మంచి గోపాలుడివికదూ?" ఆమె కన్నులు మూసుకుని కూర్చుని ఉంది. ఇంకా లడ్డూలు అలాగే ఉన్నాయా ఏమైనా తగ్గాయా అన్నట్టు అర్ధనిమీలిత నేత్రయై చూస్తోంది.

"ఓరి! నీకు సిగ్గేస్తోందా? సరేలే నేను తెర లాగుతాను." ఈసారి ఆమె కొంచెం ఆలస్యంగా తెర తొలగించింది. "తినవా గోపాలా! నాయనమ్మ చేతులతో పెట్టే ఎలా తింటున్నావు? నువ్వు తినకపోతే నాయనమ్మ నన్ను వేళాకోళం పట్టిస్తుంది. మరి తినవా?" మళ్ళీ తెర దించింది. చివరకు ఆమె వేదనతో పీడితహృదయ అయింది. "నువ్వు తినకపోతే నాకు కోపం వస్తుంది గోపాలా! నీతో మాట్లాడను. నేను ఏడుస్తాను. తినవా" నిజంగానే ఆమె ఎక్కి ఎక్కి ఏడుస్తోంది. అమ్మ, నాయనమ్మ యిద్దరూ వచ్చారు. వారిని చూసి యింకా ఏడుపు ఎక్కువచేసి అంది—"నాయనమ్మా గోపాలుడు తింటంలేదు"

"పిచ్చిదిలా ఉంది. బొమ్మ ఎక్కడైనా తింటుందా?" శాంత అంది.

"నువ్వు గాయత్రి భావనకు ఆఘాతం కలిగించకు కోడలా!" నాయనమ్మ చాల శాంత గంభీర స్వరంలో అంది. శాంత గొణుగుతుంటూ వెళ్ళిపోయింది.

"ఏడవకు గాయత్రీ! ఈసారి కన్నులు మూసుకుని ప్రార్థనచేయి. నువ్వు పెట్టిన లడ్డూలు గోపాలుడు తప్పక తింటాడు." అని నాయనమ్మ యింటిపనులు చూసుకోడానికి వెళ్ళింది. కాని మనస్సులో తన ప్రభువును యిలా అర్థిస్తోంది.—'నా ప్రభూ! తినవయ్యా. లేకపోతే ఆ పసిదాని విశ్వాసం ఊగులాడిపోతుంది. ఆమె ఆస్తిక భావన పరువు నిలబెట్టాలి.

కొద్ది క్షణాలలో గాయత్రి నవ్వుతూ గంతులువేస్తూ కేకలుపెటూ నాయనమ్మ వద్దకు వచ్చింది.

"చూడు నాయనమ్మా! మరేం గోపాలుడు నేను పెట్టిన లడ్డూలు తిన్నాడు. ఇది ఆయన నోట్లోంచి లాగుకుని తెచ్చాను." ప్రభుదేవుని భక్తవత్సలతకు నాయనమ్మకు గగుర్పాటు కలిగింది. ఆమె నేత్రాలు అశ్రువులను వర్షిస్తున్నాయి.

ఇంతలో విసుగుకుంటూ శాంత అంది—"ఎక్కడ తిన్నాడు నీ గోపాలుడు పెట్టినవి పెట్టినట్లే ఉంటే." ఇక ఆ వృద్ధురాలు సంబా

లించుకోలేక పోయింది.—"ఆ పిల్ల దాని విశ్వాసాన్ని మంటగలపకు. నీ తర్కవాదమనే గీటురాయిమీద ఆమె విశ్వాసాన్ని పరీక్షించకు"

* * *

గోపాలుడు గాయత్రి పెట్టే లడ్డూలు నిత్యమూ ఆరగిస్తున్నాడు. శాంతకు మాత్రం గాయత్రి చేసే పూజలూ పునస్కారాలు నచ్చటం లేదు. గాయత్రి ఇంగ్లీషుబడిలో చదువుకుంటూంది. కుశాగ్రబుద్ధి. ప్రతిభ ఆమెలో ఉన్నాయి. ఒక్కసారి చదివితే పాఠం కంఠస్థం అవుతుంది. గాయత్రి అప్పుడప్పుడు నాయనమ్మతో ఆలయానికి కూడా పోతూ ఉంటుంది.

గాయత్రి మనోయోగంతో నాయనమ్మ చెప్పే భాగవతకథను వింటుంది. ప్రారంభంలో పూతన, బకాసురుడు ఆదిగాగల రాక్షసులు చేసే అత్యాచారాలతో ఆమె క్షోభించి పోయేది. కాని అతిసులువుగా గోపాలుడు వారిని హతమార్చడంతో ఆమె ప్రసన్నచిత్త అయ్యేది.

కాళీయమర్దనప్రసంగం వచ్చింది. కృష్ణుడు సఖులతో బంతి ఆడుతూ – ఆడుతూ కాళిందీ మడుగులోకి దూకుతాడు. ఇది విన్న గాయత్రి చాల భయపడింది. హృదయంలో ఎన్నో ప్రశ్నలుదయిస్తున్నాయి.

కథముందుకుసాగింది. కృష్ణయ్య కాళీయుని పడగలపై తాండవంచేస్తున్నాడు. గాయత్రి ప్రసన్నచిత్తఅయింది. ఆమె గర్వంతో సింహాసనం మీద కూర్చున్న గోపాలుణ్ని చూసింది. ఇలా అంటూాందా అన్నట్లున్నాయి ఆ చూపులు 'నా గోపాలా నిన్నెవరూ ఏమీ చేయలేరు.'

మళ్ళీ కరుణాప్రసంగం వచ్చింది. శ్రీ కృష్ణుడు అక్రూరునితో మధురకు వెడుతున్నాడు. గోపికలు ఏడ్చి ఏడ్చి హృదయాలు బ్రద్దలయి పోతున్నవా అన్నట్టున్నారు. ఒక గోపిక మౌనముద్రయై కన్నీరు గ్రుమ్మరిస్తోంది. ఒకామె దుఃఖాన్ని ఆపుకోలేక వెక్కి వెక్కి ఏడుస్తోంది. ఒక గోపాంగన బాహ్యస్మృతి కోల్పోయింది. రథాన్ని నలువైపులాముట్టడించి వ్యాకులపాటుతో విహ్వలలయి అశ్రుపూరితనయనాలతో గోపికలు శ్రీ కృష్ణుణ్ని యిలా యాచిస్తున్నారు.—"మా జీవితసర్వస్వమూ నీవేనయ్యా! మమ్ములను వీడిపోబోకయ్యా! నీవులేని యమునాతట మూ సఘనకుంజము, గోగోష్ఠము మమ్ములను గ్రసిస్తాయి"

మరొకవంక దుఃఖార్తయైన యశోద అక్రందిస్తో అంటోంది—

"నా కన్నయ్యా! గోపాలా! ఇంత నిర్దయుడవై నన్ను విడిచి ఎక్కడికిపోతావయ్యా! ఒక్కమారు నావంక చూడు. వెళ్ళకు కన్నయ్యా! నీ వియోగభారాన్ని నా ఎడద తట్టుకోగలదా నీలమణీ!"

నాయనమ్మ స్వరం విహ్వలమయింది— గాయత్రి ఏడ్చివేసింది. ఆ రోజల్లా ఉదాసీనంగానేఉంది. ఆమె కన్నులలో గోపాలుని వీడ్కోలుదృశ్యం తిరిగిపోతోంది. కంససంహారం విన్న తర్వాత గాయత్రి దర్పంతో నిండిన కన్నులతో చూసింది.

* * *

రాత్రిఅయింది. ఆకాశంలో తారకలు మెరుస్తున్నాయి. నాయనమ్మ సమీపంలో పడుకున్న గాయత్రి మీరాకథను చెప్పమని మారాముచేస్తోంది. ఇక ఏలాగూ ఆమె వదలదని మీరాచిన్ననాటి సంఘటన నాయనమ్మ చెప్పడం ప్రారంభించింది.

ఒకరోజున మహాత్ముడొకడు విచ్చేశాడు. వారి వద్దనున్న సుందరమైన విగ్రహాన్ని చూచి మీరా పట్టుబట్టడమారంభించింది.

"బాబా! యీ మూర్తిని నాకీయండి కావాలంటే నా వస్త్రాలు భూషణములు గ్రహించండి" అని వేడుకొంది.

బాబా దృఢంగా యిలా అన్నారు—
"లేదమ్మా! నేను యీ మూర్తిని యేవెల నువ్వు యిచ్చినా అమ్మలేనుతల్లీ! ఈ మూర్తి రూపంలో నా ప్రాణం, జీవితసర్వస్వము నిండి ఉన్నాయి. ఇది నా వంటి నిర్ధనునికిదాత, ఆశ్రయహీనునికి ఆశ్రయము, ఆధారము లేని నాకు ఆధారమూను. దీన్ని అడగకుతల్లీ" అంటూండగా మహాత్ముని కంఠం అవరుద్ధ మయింది.

ప్రాతఃకాలము మహాత్ముడు మీరాను కేక వేసి అన్నాడు—
"ఈ గోపాలుణ్ని తీసుకుని కాపాడుకోతల్లీ! ఈ మోహదూరుడు నేనంటే విసిగిపోయాడు. ఇక నా దగ్గర ఉండదలచుకోలేదు. రాత్రి ఇతడు స్వప్నంలో ఆదేశించాడు. నన్ను మీరాకు యిచ్చివేయమన్న యీ కఠోరచిత్తుని ఆజ్ఞను పాలిస్తున్నాను." అని ఆ ప్రతిమను యిచ్చి మహాత్ముడు విలపిస్తు వెడలిపోయాడు

మీరా హర్షాతిరేకం పట్టలేకపోయింది. ఆమె మూర్తిని తీసుకుని నర్తిస్తో గానం చేస్తోంది—

'మైం తో గిరిధర్ కేసంగ్ నా చూంగీ'

రోజులు గడచిపోతున్నాయి.

రాజ ప్రాసాదానికి ఎదురుగా ఒక పెండ్లి ఊరేగింపు సాగిపోతోంది. మీరా తన తల్లిని అడిగింది—"అమ్మా! నా పెళ్ళికొడుకుఎవ్వరు?" అని. తల్లి ఊరుకుంది. మీరా మాటిమాటికి అడగటంతో ఆమె విసిగిపోయి మూర్తివైపునకు సంకేతంతో "ఈయనే నీ పెళ్ళికొడుకు" అంది.

మీరా హృత్తంత్రులు ఝంకృతమొనర్చినవి. ఆమె మనసా-వాచా-కర్మణా గిరిధరునే తనపతిగా గ్రహించింది. ఆమె అన్నది.

"మేరే తో గిరిధర్‌గోపాల దూసరో న కోయీ
జాకే సిర్ మోర ముకుట మేరే పతి సోయీ"

ఇంతలో శాంత అక్కడికివచ్చి 'చాలా రాత్రిఅయింది గాయత్రీ! పోయిపడుకో" అంది. గాయత్రి వెళ్ళిపడుకుంది. చాలసేపు నిద్ర రాలేదు.

రాత్రికి ఆమెకు కల యిలావచ్చింది—

గోపాలుడు ఎదురుగా నిలచియున్నాడు. తను ఇలా అంటోంది—"గోపాల్! నాకు అన్నలూ తమ్ముళ్ళూ ఎవ్వరూ లేరు. నువ్వు నాకు అన్నవు అవుతావా? చెప్పు గోపాల్ నువ్వు అవుతావా లేదా? మాట్లాడవేమయ్యా! నేను నీ చెల్లిలిగా ఉండటానికి తగనా?" ఆమె చాల వేదనతో విలవిలలాడింది. గోపాలుడు అంగీకారసూచకంగా తల ఆడించినట్టు అనిపించింది. సంతోషభరితచిత్తంతో ఉద్విగ్నయై గట్టిగా "నాయనమ్మా" అని అరిచింది.

తల్లివచ్చి గట్టిగా తట్టిలేపుతూ "ఏమిటి గాయత్రీ కేకలువేస్తున్నావు ఏదైనా కల వచ్చిందా?"

"గోపాలు నాకు అన్నగా ఉండటానికి ఒప్పుకున్నాడమ్మా"

"గోపాలు-గోపాలు-గోపాలు-గోపాలుడు తక్క నీకింకేమీ తట్టదు. పోయిపడుకో" గాయత్రి ఖిన్నమైనమనస్సుతో మళ్ళీ ఆలోచనలలో మునిగిపోయింది.

ప్రాతఃకాలము కాగానే గాయత్రి నాయనమ్మకు తనకు వచ్చిన కలను వివరించింది. నాయనమ్మ శరీరం పులకరించింది.

"గోపాలుడు చాల దయాళువు గాయత్రీ!

నువ్వు ఆయనతో ఏ సంబంధం పెట్టుకుంటే ఆయన అదే అవుతాడు.''

''అయితే నేను రక్షాబంధనదినాన అన్నయ్యచేతికి 'రాఖీ' కట్టానుకదూ నాయనమ్మా?''

''ఆహా తప్పకుండా కట్టావుతల్లీ! ఆయన నీకు జన్మజన్మాంతర సోదరుడయ్యాడు' అన్నది నాయనమ్మ. ఈ మాటలు విన్న గాయత్రి మనస్సు ఆనందరసార్ణవముతో పరిపూర్ణమయింది.

*

రక్షాబంధన పర్వదినం వచ్చింది. గాయత్రి చాల సుందరమైన రాఖీ తయారుచేసింది.

''ఏంచేస్తున్నావుగాయత్రీ!'' శాంత అడిగింది.

''గోపాలంఅన్నయ్యకు రాఖీకట్టానమ్మా''

''ఎవరా గోపాలంఅన్నయ్య?''

''నాయనమ్మ పూజా గృహంలో కూర్చున్నాయన''

''అరే ఎవ్వరైనా బొమ్మకు రాఖీ కట్టారా!''

''లేదమ్మా, గోపాల్ నాకు స్వంత అన్న అయ్యాడు. ఆయన నాచేత రాఖీ కట్టించుకుంటానని మాటలు కూడాయిచ్చాడు''

తల్లి విసుగుకుంటూ బిగ్గరగా అంది.—''నీ బుద్ధి భ్రష్టమయింది.''

''నిజం అమ్మా! నేను రాఖీ కట్టేవరకు అన్నమూ నీరు ముట్టను.''

''పిచ్చివేషాలు వేయకు గాయత్రీ! నీ ముఖాన ఆ యోగమే ఉంటే మనీష్ ఎందుకు మరణిసాడు.'

శాంత కన్నుల ఎదుట తన పది సంవత్సరముల మనీష్ యొక్క రూపం గోచరించింది. ఎంత అందం ఎంత తెలివి-చాకచక్యాలు అతనికి. తను ఆశలన్నీ అతనిమీదే పెట్టుకుంది. అతని మృత్యువుతో సర్వమూ నాశనమయింది. కన్నులు ఒత్తుకుంటూ ఆమె గదిలోనికి వెళ్ళిపోయింది.

మధ్యాహ్నభోజనసమయంలో గాయత్రి దురాగ్రహానికి అమ్మా నాన్నల అనునయాలు బెదిరింపులు ఏమీ నిచేయలేదు. క్రోధావేశంతో నిండిన స్వరంతో శ్యామ్ తల్లితో అన్నాడు—''దీనికి ఏమి పిచ్చిపట్టింది? అస్తమానూ గోపాలుకు రాఖీ కట్టానని కూర్చుంది. నీ మాట బ్రహ్మవాక్కు కదా దీనికి. నువ్వే సమదాయించవమ్మా? 'గోపాల్ గోపాల్' అంటూ కలవరిస్తోంది. దురాగ్రహం వల్ల ప్రభువు ప్రసన్నుడు కాడు''.

''నువ్వేమీ కంగారుపడకు. ప్రభువు తప్పక కరుణిస్తాడు.ఆమె మనోరథంసఫలమవుతుంది.'' అని శాంతగంభీరస్వరంతో నాయనమ్మ అంది. శ్యామ్ వెళ్ళిపోయాడు. తర్వాత ఆమె తన మనస్సులో భగవంతుని ప్రార్థించింది.

-''ప్రభూ! ఇది పిల్లల ఆగ్రహము. దీన్ని నీవు తప్పక నెరవేర్చాలి ప్రభూ! యీ పసిదాన్ని పరిహాసాలపాలు చేయకు అనాథ శరణ్యా.''

రాత్రి కూడా గాయత్రిని భోజనం చేయవలసిందని పట్టుబట్టారు. ఎన్నెన్నో ఆశలు చూపారు. కాని ఆమె నిశ్చయాన్ని మార్చుకోలేదు. వృద్ధురాలు నచ్చచెప్పగా యింట్లో వారందరూ భోజనం చేసి పక్కలు చేరారు. విలపిస్తూ గాయత్రి నాయనమ్మను అడిగింది.

—''నాయనమ్మా! గోపాల్ అన్నయ్య రాడా? ఈనా రాఖీ యిలాగే ఉండిపోతుందా? నా ప్రాణాలు పోయినా సరే గోపాల్ అన్నయ్యకు రాఖీ కట్టందే అన్నాన్నిముట్టను.''

"అమ్మమ్మా, దుఃఖపడకమ్మా! ప్రభువు ఎడద కరుణతో నిండియుంటుంది. తనవాళ్ళు పిలుస్తూంటే పరుగున వస్తాడు. విశ్వాసం వీడకు తల్లీ. తప్పక రాఖీ కట్టించుకోడానికి వస్తాడు."

నాయనమ్మ మాటలు ఆమెకు కొంత ఊరడింపు కలిగించాయి. తన గదిలోకి రాఖీపళ్ళెం తీసుకుని వెళ్ళి తన పక్కమీద పరుండి వెక్కి వెక్కి ఏడుస్తోంది.

—"నువ్వు నిజంగా రావా గోపాల్! అయితే నాకు వస్తానని మాట ఎందుకిచ్చావు? ద్రౌపది ఆర్తికి కరిగిపోయావే. నరసీ పెట్టిన అన్నం ఆరగించావే. నా అభిలాషమాత్రం యిలా అసంపూర్ణంగా ఉండిపోతూందా? ఎంత వరకు ప్రతీక్షించాలో చెప్పవయా! నీకు సోదరినయి రాఖీ ఎవరికి కట్టగలనో నువ్వే చెప్పు అన్నయ్యా! ఒక్కసారి వచ్చి దర్శనం యీయవా గోపాల్!"

ఏడ్చి ఏడ్చి గాయత్రి ఎప్పుడో నిద్ర పోయింది. హఠాత్తుగా మధురస్వరాన్ని విని ఆమె కన్నులు తెరిచింది.

వచ్చాను."

గది అంతా ఉజ్జ్వలప్రకాశంతో నిండి పోయింది. ఎదురుగా అన్నయ్యగోపాలు ఆమెను మేల్కొలుపుతున్నాడు. ప్రభువు పీతాంబరంతో ఆమె కన్నులు తుడుస్తూ అన్నాడు—

"ఏడుస్తున్నావా గాయత్రీ! నన్ను క్షమించు చెల్లెలా చూడు నేను కూడా భోజనం చేయలేదు. నాకు చాలా ఆకలి వేస్తోంది. నదు రాఖీ కట్టుదువుగాని."

ఆమె ఆనందంతో లేచి కూర్చుంది. గోపాలుని చేతికి రాఖీని కట్టూ అంది— "నువ్వు చాల మంచివాడివి అన్నయ్యా, నీ చెల్లెలి మర్యాద కాపాడావు."

"ఇంక ఆట్టే కబుర్లు చెప్పక మిఠాయి తెచ్చి తినిపించు."

నవ్వుతూ గాయత్రి [illegible] ప్రభువు నోటికి అందించింది.

"పిచ్చిదానా, నువ్వు కేక వేయగానే ఉన్నపళంగా పరుగెత్తుకువస్తాకదా భోజనం మానడం ఎందుకు చెప్పు"

"ఇక నువ్వు వస్తూంటావుకదూ అన్నయ్యా"

"ఆఁ తప్పకుండా. నువ్వు పిలవగానే పరుగెత్తుకువస్తాను. సరే యిక నేనుపోయిరానా"

"గోపాల్ అన్నయ్యా గోపాల్ అన్నయ్యా" గాయత్రి చాల బిగ్గరగా అరచింది. ఆ స్వరం విన్న శాంతకు కోపం ముంచుకువచ్చింది.

"ఏమిటే ఆ కేకలు"

ఆమె కన్నులు తెరచి అంది "గోపాల్ అన్నయ్య వెళ్ళిపోయాడమ్మా"

"గోపాల్ అన్నయ్య ఏమిటే నీకేం పిచ్చి పట్టలేదు గదా"

"నిజఁవమ్మా! ఇంతవరకూ అన్నయ్య ఇక్కడే ఉన్నారమ్మా. నేనే ఆయన చేతికి రాఖీకట్టాను. చూడమ్మా పళ్లెంలో రాఖీ లేదు"

శాంతకు పళ్లెంలో రాఖీ కనబడింది.

"ఎల్లా పెట్టినది అల్లాగే ఉంటే ఏమిటో నీవాగుడూ నువ్వూను. పో-పోయిపడుకో" అని ఆమె వెళ్లిపోయింది. మర్నాడు ఉదయమే నాయనమ్మకు రాత్రి జరిగిన సంఘటన అంతా వివరించి చెప్పింది. విన్నతర్వాత నాయనమ్మకు అనిర్వచనీయ అనుభూతి కలిగింది. హర్ష భారంతో స్వరం పూడుకుపోయింది. ఆమె అంది "ప్రభు దేవుడు కరుణార్ద్రచిత్తుడు తల్లీ! తన జనం కోరికను తప్పక నెరవేరుస్తాడు." గాయత్రి కన్నులలో రాత్రి దృశ్యం మెదులుతోంది. చాల ప్రసన్నంగాఉంది. ఆమె చిరకాల అతృప్త లాలస నెరవేరింది, కాలచక్రం తిరిగిపోతోంది.

ఒకరోజున వృద్ధురాలు శ్యామ్‌తో అన్నది- "అబ్బాయీ! నేను నదీతీరాన ఉన్న వృక్షాన్ని. ఎప్పుడు కూలిపోతానో తెలియదు. నాకున్న కోరికల్లా గాయత్రిని ఓయింటి దాన్ని కావడం చూచి కన్నుమూయాలని ఉందిరా"

అనతికాలంలో ఒక సంపన్న కుటుంబంలోని అందమైన యువకునితో మంచి అట్టహాసంగా గాయత్రి పెళ్లి జరిగిపోయింది.

అప్పగింతల సమయంలో నాయనమ్మ గాయత్రిని గుండెలకు గాఢంగా అదుముకుంటూ బరువైన స్వరంతో అంది—

"మధురమైన వ్యవహారము, సేవాభావము వశీకరణకు మూలమంత్రాలు. కన్నతల్లీ! సేవలో సోమరితనం చూపకు. సంఘర్షణ వచ్చే క్షణాలు ప్రాప్తిస్తే మధురమందహాసంతో త్రోసి వేయడానికి ప్రయత్నించు. భర్త అభిలాషలో నీ ఆకాంక్షలు సమ్మిళితంచేయి. వారి సుఖవిశ్రాంతులమీద విశేషంగా ధ్యానం ఉంచు. ఇదేనమ్మా నారీ జీవితం సార్థకంచేసే మూలమంత్రాలు" అన్నది. గాయత్రి ఇంటిలో అందరికీ దిగులు కలిగించి తన అన్నగోపాలుని తీసుకుని పల్లకిలో కూర్చుంది.

* * *

మోహనునికి తన భార్య గాయత్రి అన్ని విషయాలు నచ్చాయి. కాని ఆమె పూజలు భజనలు అంటే అతనికి నచ్చవు. అతనిదృష్టిలో మనం ఈశ్వరునికిచ్చే విలువలన్నీవట్టి కల్పనలు.

తన మృదువైనస్వభావంతో అనతి కాలంలో గాయత్రి అత్తవారింట అందరితో కలిసిమెలిసిపోయింది. ఇంత అందం, చదువు ఇన్ని మంచిలక్షణాలున్న కోడల్ని చూసుకుని అందరూ పొంగిపోయారు. ప్రాతఃకాలమే లేచి స్నానాదులు నిర్వర్తించుకుని గోపాలుని మానసిక అర్చనచేసి తన గృహకృత్యాలలో గాయత్రి లీనమయ్యేది. తనభర్త అవసరాలను గుర్తించి ఎప్పుడూ వర్తించేది.

ఇలా పదిసంవత్సరాలు గడిచాయి. మోహనుడు గాయత్రి చేసే సపర్యలకు చాలసంతుష్టుడయ్యాడు.

ఈశ్వర సంబంధమైన నమ్మకంలో ఆరాధనలో గాయత్రిలో మార్పు రాకపోయినా మోహనుడు ఆమె శీలసౌందర్యములకు ముగ్ధుడయి పూజలకు అంతరాయం కలిగించేవాడు కాదు. ఇప్పుడు అతను యిద్దరు పిల్లల తండ్రి అయ్యాడు. పగలల్లా ఆఫీసులో పని చేయడం యింటికి వచ్చి పిల్లలతో ఆడి-ఆడి నిద్రపోవడం అతని దినచర్య అయింది. గోవింద్-గీతల ఆటపాటలతో యిల్లంతా మారుమ్రోగిపోతోంది. గాయత్రి పిల్లల ఎదుట సుందరమైన మధురమైన భక్తి గీతాలు ఆలాపిస్తోంటే పిల్లలు తమ ముద్దు మాటలతో అనుకరించేవారు. ప్రాతః సాయం సమయాలలో గోవింద్ గీత పూజలు అర్చనలు చేస్తుండడం చూసి మోహనుడు చాల విసుక్కునేవాడు. ఇలా అనేవాడు—

"నీవు వీళ్ళను బైరాగుల్లోనో సన్న్యాసుల్లోనో కలిపి వేయదలచుకున్నావా? ఒట్టి మహాత్ములైతే ఒరిగేదేమీలేదు. జీవిత మార్గంలో పైకి రావాలంటే కాలాన్ననుసరించి పోవాలి. ఆధునికమైన చదువు సంస్కారం అబ్బాలి"

* *

గాయత్రి పిల్లలతో గోపాలుని వెన్నల దొంగతనం అభినయం చేస్తోంది. పిల్లలిద్దరూ కిలా కిలా నవ్వుతున్నారు.

"ఈ వెన్నదొంగ మీ మామయ్య" గాయత్రి దృఢమైన గంభీర స్వరంలో అన్నది.

"నేను ఈయన్ని ఎప్పుడూ చూడలేదమ్మా" ఆశ్చర్యంతో గోవిన్దు అన్నాడు.

"ఈయన మన యింటికి ఎప్పుడూ రాలేదే" గీత అడిగింది.

"వస్తాడమ్మా! ఎవ్వరైనా ప్రేమతో పిలిస్తే ఏడ్చి ఏడ్చి కేక వేస్తే వస్తాడు. ఆయన దయామయుడు. గజేంద్రుని కథ మీకు గుర్తుంది కదూ. మొసలి కాళ్లుపట్టుకుని నీటిలోనికి లాక్కుపోతూ ఉంటే ప్రాణములు తావులు తప్పి మూర్ఛవస్తున్న సమయంలో ఆర్తనాదం చేస్తూంటే పరుగున వచ్చి రక్షించాడు."

"నేను కేక వేస్తే వస్తారా ఆయన?"

"తప్పకుండా వస్తాడు బాబూ! పసిపిల్లలంటే అతనికి పరమప్రీతి. వారి ఒక్క పిలుపుతో పరుగున వారిని చేరతాడు."

"అయితే నేను తప్పక కేక వేస్తాను" చాల కౌతుకంతో గీత అంది.

ఆఫీసు నుంచి వచ్చాక వాళ్ళనాన్నకు పిల్లలు వాళ్ళ మామయ్య విషయం చెప్పారు. ఆయన విస్మయపడుతూ అడిగాడు— "ఈ గోపాల్ మామయ్య ఎవరు గాయత్రీ! నేను ఎప్పుడూ యీయన గురించి వినలేదు. ఈయన్ని చూసే అదృష్టం కూడా కలగలేదు."

'అయితే నాతో రండి. ఆయనకు మిమ్మల్ని పరిచయం చేస్తాను." అని మోహనుణ్ణి పూజా గృహంలోకితీసుకుపోయి శ్రీకృష్ణుని మనోజ్ఞమూర్తిని చూపిస్తో అంది—

"ఈయనే మా అన్నయ్య గోపాల్! చెప్పండి ఏలా ఉన్నాడు?"

చాల ఉపేక్షాస్వరంతో అన్నాడు— "నీకు పుణ్యం ఉంటుంది గాయత్రీ! యీ పిల్లలకు అన్యాయం చేయకు. కల్పిత కథలు చెప్పి, ఈశ్వరుడంటే భయం చూపెట్టి ఈ అమాయకులలో హీనమైన భావాలు ప్రవేశపెట్టకు. వీళ్ళను ఎందుకు పనికిరాని పిరికివాళ్ళను చేయకు."

"మీతో తర్కించటం లేదు కాని నా నమ్మకం ఏమంటే ఏ పిల్లవానికి శైశవంలో నైతికతతో బాటు మతసంస్కారం కూడా కలుగుతుందో అతడు ఎంతటి ఘోరభౌతికవాదవాతావరణంలో ఉన్నా విశ్వాసనీయుడు కర్మణ్యుడు పరిశ్రమశీలుడుగా మనుగడ సాగిస్తాడు. ఇది మీరు అనుచితంగా భావిస్తే నేటి తరం లక్ష్యహీనంగా పయనం సాగించే బాటమీదనే వీళ్ళనూ పోనీయండి." అని గాయత్రి గంభీరంగా అంది.

"నీకు కష్టం కలిగించానేమో గాయత్రీ! నా ఉద్దేశం నేటిబాలుడు యుగనాడిని పరిశీలించి జీవనయాత్ర ప్రారంభంచేయాలి."

"వీళ్లు అన్నివిధాల ఉన్నతిపొందాలనే ఆకాంక్షతో నేను వ్యవహరిస్తున్నానని నమ్మండి"

*

మోహనుడు తన కార్యాలయం పనిమీద బయటకు ఒక నెలరోజులు పోయి రావలసి వచ్చింది. వచ్చేసరికి అతని ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. పగలు చాలసార్లు రక్తవాంతులయ్యాయి. మాటిమాటికి పొట్టలోనొప్పి వస్తోంది. తప్పనిసరిఅయి ఆఫీసుకు శెలవు పెట్టాడు. వైద్యులు అతని కడుపులోవ్రణం ఉన్నట్టుచెప్పారు. ఇంటిదగ్గరే వైద్యం జరుగుతోంది. అతని ఆరోగ్యపరిస్థితి నానాటికి దిగజారిపోతోంది. అతను మంచానికి అతుక్కుపోయినట్టున్నాడు. బ్రతుకుతాడనే ఆశలేదు. వైద్యులు నిరాశాజనకమైన జవాబుచెప్పారు.

గాయత్రి తన సర్వస్వమూ మరచి భర్త సేవలో నిమగ్నురాలు అయింది. పిల్లలతో అనేది—"మామయ్య - గోపాల్‌ని అర్థించండి. ఆయన్ను శరణు వేడండి. ఆయన ఈ గడ్డు పరిస్థితినుంచి కాపాడగలడు." అంటూనే ఆమె స్వరం అవరుద్ధమయేది. ఆమెను ఏకాంతంలో

కూర్చుని అన్నయ్యా గోపాలుని ఏడుస్తూ పిలవాలనీ తన కన్నీటి గాథను వివరించాలని అనుకునేది. కన్నీరు బయటకు వెడలేమార్గం వెదుకుకుంటూంది. కాని మోహానుని కళ్ళ ముందు తను ఎప్పుడూ ప్రసన్నతతో ఉండటానికి అతని మనస్సులోని దుఃఖభారాన్ని తొలగించడానికి ప్రయత్నిస్తోంది. అతని క్షీణిస్తున్న పరిస్థితికి లోలోనే కుమిలిపోతోంది.

గోవిందు గీత భగవంతుని ప్రార్థిస్తో అనేవారు— "గోపాల్ మామా! ఎప్పుడొస్తావు? మా నాన్నగారి పరిస్థితి చాల భయంకలిగిస్తుంది. నువ్వు రావేం మావయ్యా! మా పిలుపు నీ చెవిని చేరటంలేదా? అమ్మేమో నువ్వు చాల దయశలవాడవని పిలిస్తేనే పరుగున వస్తావని అంటుంది. మేమంటే కోపంవచ్చిందా మామయ్యా! నాన్నకు జబ్బులేకుండగా చేయి మామయ్యా!"

అమ్మను చూస్తూనే గీత ఏడుస్తూ అంది– "గోపాలు మామయ్యరాలేదమ్మా. మేంపిలిస్తే రావటంలేదమ్మా నువ్వేపిలు."

"ఏడవకుచిట్టితల్లీ!" అని గీతను గుండెలకు గాఢంగా అదుముకుంది. "వస్తాడమ్మా మామయ్య తప్పక వస్తాడు.", ఆమె కంఠస్వరం బొంగురుపోయింది. కన్నులు అశ్రుధారలు వర్షిస్తున్నాయి.

"గోపాలుడు దుఃఖహారికదా! మనలను ఆపదనుండి గట్టెక్కిస్తాడు." కన్నీరు తుడుచుకుంటూ గాయత్రి వెళ్ళిపోయింది.

* * *

ఆ రోజు మోహానుని పరిస్థితి చాల విషమించింది. అతని నాలుక పొడియారుకుపోతూంది. మాట్లాడటానికి కూడా ఓపిక లేక గాయత్రిని నీళ్లు తాగించమని సంకేతంతో చెప్పాడు. గాయత్రి పమిటిచెంగుతో కన్నీరు ఒత్తుకుంటూ తులసీమిశ్రిత శీతల గంగాజలాన్ని అతని నోటికందించింది. కొద్దిసేపటికి మోహానుడు కన్నులు మూసుకున్నాడు. గాయత్రి అతని నుదుటిమీద చేతితోరాస్తూ అంది— "ఆందోళనపడకండి. ప్రభువును విశ్వాసంతో స్మరించండి. మీ కేకించత్తు ప్రమాదమూ రాదు." మోహానుడు కన్నులు తెరవలేదు. దగ్గరకూర్చున్న చికిత్సకుడు సంకేతంతో గాయత్రికి దేనినో వ్యక్తంచేశాడు. ఆయన వెళ్లిపోతోంటే సాగనంపడానికి గాయత్రి బయటకు వచ్చింది. చాలవ్యథనిండిన కంఠస్వరంతో అడిగింది– "ఆయన పరిస్థితి ఏమిటో స్పష్టంగా చెప్పండి"అని. వైద్యుడన్నాడు— "నాకు తెలుసున్నంతలో యీయన జీవయాత్ర కొద్ది గంటలలో పరిసమాప్తి చెందుతుంది. ఆపైన దైవేచ్ఛ"

గాయత్రి మనస్సు వేదనా భారంతో కృంగిపోయింది. ఆమె కన్నీరు కారుస్తూ తన పూజా మందిరం ఉన్న గదివైపునకు పరుగున పోయింది. ద్వారము మూసి, రోదిస్తూనే ఆమె తన ప్రియమైన అన్నయ్యను అర్చించింది. ఈ రోజున తను అన్నతో ఏమీ చెప్పలేని పరిస్థితిలో ఉంది. చేతిలో హారతి పళ్ళెం తీసుకుని నిలబడి ఉంది. కన్నుల నుండి నీటి బిందువులు టపటపరాలుతున్నాయి. ఆమె మనస్సు కరుణాక్రందన చేస్తుంది.

"గోపాల్ అన్నయ్యా! చిల్లుపడిన జీవిత నౌక ప్రవాహమధ్యంలో చిక్కుకుంది. ఇది రక్షింపబడుతుందనే ఆశ ఎవళ్ళనుంచీ నాకు లేదు. నిన్నే నమ్ముకుని ఆశలు నింపుకున్న కన్నులతో విశ్వాసం నింపుకున్న మనస్సుతో చూస్తున్నాను. కృపయనెడి చుక్కానిపట్టి నా యీ నౌకను ఒడ్డుచేర్చు నావికా! నిరాశయనెడి తుపాను నన్ను తనలో కలుపుకోవా

లని వస్తుంది అన్నా! దారి తెన్ను తోచక కర్తవ్యం తెలియని మూఢనై యున్నాను. నువ్వు తక్క నా బాధ వినేదెవరు అన్నయ్యా!''

తలుపులు బాదుతున్న చప్పుడయింది.— ''అమ్మా - అమ్మా తలుపులు తెరు. చూడమ్మా, నాన్నగారేమీ మాట్లాడటం లేదు. నువ్వు లోపల కూర్చున్నావేమమ్మా బయటకురా మాకు భయంవేస్తుంది.'' పిల్లల ఆవేదన ఆమెను కదలించలేదు. ఆమె నిశ్చలంగా కూర్చుని ఉంది—''నేను ఎక్కడికి పోను గోపాల్ అన్నా! నా నాశనం అవుతున్న పరిస్థితిని చక్కబరచి నా సౌభాగ్య అరుణమను నువ్వు చెదరిపోకుండా చేసేవరకు నేనెక్కడికీ పోను అన్నయ్యా! నువ్వు దయాళుడవు శరణాగతవత్సలుడవు దీనుల దుఃఖితుల బాధలు విని ద్రవించి పోతావుకదా గోపాలా! నా విషయంలో మౌనముద్ర ఎందుకు ధరించినట్టు అంతర్యామీ! చెప్పు అన్నయ్యా! నువ్వు ఉండగానే నీకు రాఖీని కట్టిన నీ సోదరి... కాదు కాదు. ఈ కల్పన కూడ చాల అసహ్యంగా ఉంది. నువ్వు వస్తావు. తప్పక వస్తావు. నీవాగ్దానం, మర్యాద నిలుపుకోవడానికైనా నువ్వు తప్పక వస్తావుకదా గోపాల్ అన్నా!'' ఆమె అధీరయయి పీఠం మీద తన మస్తకాన్ని ఉంచి వెక్కి వెక్కి ఏడుస్తుంది. తన శోక జనిత జలంతో గోపాల్ అన్నయ్యను తడపడానికి అశ్రుస్రవంతి అటంకము లేకుండా పరుగులు తీస్తుంది. ఆమె యీదశలో చేతనా శూన్యమై ఎంతసేపు మనసులోని ఆవేదన, ఆందోళన విన్నవించుకుందో తెలియదు.

ద్వారమును చేతితో బాదతూన్న బాలకుని స్వరం విని ఆమె త్రుళ్ళిపడింది.

''అమ్మా తలుపులు తెరు, నాన్నగారు కన్నులు తెరిచారు. ఆయనకు తెలివివచ్చి నిన్న కేకేస్తున్నారమ్మా తలుపు తెరు'' ఆమె గోపాలుని చూసింది. గోపాలుని అభయముద్ర, ముఖమండలంపై నాట్యమాడే మృదుమధుర మందహాసాన్ని దర్శించి హర్షరేఖాలతో మునిగిపోయింది. ఆమెకు అన్న గోపాలు యిలా అంటూ వరదహస్తాన్ని చూపిస్తూన్నట్టు గోచరించింది— ''నీ సౌభాగ్యము అఖండమై శాశ్వతమై అమరత్వమును పొందింది'' ఆమె లేచి ప్రతిమను హృదయానికి దగ్గరగా చేర్చుకుని—''నా అన్నా గోపాలా'' అంటూ పులకితగాత్రి అయింది. తరువాత కొంతసేపటికి తెప్పరిల్లి ద్వారము తెరిచి పరుగున పతిదేవుని చేరింది.

మందస్వరంలో మోహనుడన్నాడు ''నీ గోపాల్ అన్న నన్ను రక్షించాడు గాయత్రీ! నేను బ్రతుకుతాననే ఆశ శాశ్వతంగా దూరం చేసుకొని చైతన్యాన్ని కోల్పోయిన పరిస్థితిలో పడిఉండగా హఠాత్తుగా మృదుమధురమైన సుఖస్పర్శ నా అచేతనమైన మనస్సులో పులకరింతలు పెట్టింది. నేను ''పీతవసనధారియైన ఒక ముగ్ధమోహనశ్యామలబాలకుణ్ని చూశాను. ఆ కన్నులలో ఎంత సమ్మోహనశక్తి ఉంది! అరుణ అధరాలపై నర్తించే మందహాసంలో ఎంతటి ఆకర్షణ! నేను రెప్పపాటులేకుండా అతన్నే చూస్తున్నాను. నా క్షోభ, సంతాపమూ, దుఃఖమూ అన్నీ పటాపంచలయ్యాయి. కాని అంతలోనే అంతర్ధానమయ్యాడు. గాయత్రీ! ఆయన లేందే నేను విశ్రాంతి పొందలేను'.'' అంటూండగానే భావావేశంతో మోహనుని కంఠధ్వని అవరుద్ధమైంది.

గాయత్రి కన్నులనుండి సంతత అశ్రుధారలు ప్రవహిస్తున్నాయి. ఎక్కడో దూరాన ఎవరో తంబుర మీటుతూ గానంచేస్తున్నారు.

'సేవకి దాసి సకయకోఁ కానూ
బిద్రభవార్ రమాపతి కానూ'




# ముప్పదియైదవ సంపుటము

1978 జనవరి నుండి 1978 డిసెంబరు వరకు

సంపాదకులు :

స్వామి తన్మయానంద

ప్రకాశకులు :

స్వామి తన్మయానంద



శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600 004.

# అకారాది విషయానుక్రమణిక

మాతృశ్రీ శ్రీ శారదాదేవి జన్మదినోత్సవము

డిసెంబరు 22 వ తేదిన జరుగును

సంపాదకులు: స్వామి తిన్మయానంద.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600 021) న ముద్రింపబడి.

స్వామి తిన్మయానందవారిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600 004) నుండి ప్రచురింపబడినది.

Vol. XXXV—12 (December 1978) Sri Ramakrishna Prabha Regd. No. M—4635

# రామకృష్ణ మఠ ప్రచురణములు

| పుస్తకము | వెల |
|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము | 8.00 |
| శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర | 10.00 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 8.00 |
| శ్రీ రామకృష్ణోపనిషత్తు | 3.75 |
| శ్రీ రామకృష్ణపరమహంస నీతికథారత్నములు | 2.50 |
| గురూపదేశములు | 2.00 |
| నా గురుదేవుడు | 1.25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1.50 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహము | 0.75 |
| ఆరాత్రికము మరియు | |
| శ్రీ రామనామ సంకీర్తనము | 0.50 |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4.00 |
| శ్రీ శారదాదేవి | 2.50 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | 0.80 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4.00 |
| బాలల వివేకానందుడు | 2.00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి | |
| 9 సంపుటముల పూర్తిసెట్టు (సాదా) | 55.00 |
| .. .. (క్యాలికో) | 61.00 |
| విడి సంపుటములు ఒక్కొక్కటి (సాదా) | 5.00 |
| .. .. (క్యాలికో) | 6.50 |
| స్వామి శిష్య సంవాదములు | 10.50 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 4.00 |
| .. (రెండవ భాగము) | 5.50 |
| భారత యువజనులారా! | 3.00 |
| ప్రబోధ రత్నాకరము | 3.75 |
| రాజయోగము | 6.25 |
| కర్మయోగము | 4.00 |
| భక్తియోగము | 4.00 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 2.25 |
| .. (రెండవభాగము) | 3.00 |
| హిందూ మతము | 4.00 |
| వివేక సూర్యోదయము | 4.00 |
| అనుష్ఠాన వేదాంతము | 2.50 |
| ప్రాచ్యము - పాశ్చాత్యము | 1.25 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 3.00 |
| భారతదేశము | 2.00 |
| భారతీయ మహిళ | 2.00 |
| నా జీవితము, జీవిత కార్యము | 1.25 |
| శ్రీ రామకృష్ణ సేవాసంస్థ : తదాదర్శములు | 0.50 |
| షికాగో నగరోపన్యాసములు | 1.00 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0.30 |
| నవీన భారత దేశము | 0.40 |
| సర్వం విష్ణుమయం జగత్ | 0.35 |
| శ్రీ వివేకానంద సింహగర్జనలు | 0.20 |
| బ్రహ్మానంద బోధనలు | 4.75 |
| తాపత్రయ చికిత్స | 0.60 |
| ముక్తిమార్గము | 0.30 |
| పారమార్థిక సంభాషణలు | 6.50 |
| నారద భక్తి సూత్రములు | 4.00 |
| శ్రీ దొడ్డ భాగవతము-మూడవ సంపుటము | 7.50 |
| దేవీమాహాత్మ్యము | 4.00 |
| శ్రీ మద్భగవద్గీత | 9.00 |
| శ్రీ మద్భగవద్గీత చిన్నసైజు | 3.00 |
| పారాయణగీత తాత్పర్యసహితము | 3.75 |
| .. మూలము | 2.00 |
| కఠోపనిషత్తు | 2.00 |
| గిరీశచంద్ర | 1.00 |
| భక్తిమార్గము | 1.00 |
| శ్రీకృష్ణవాణి | 0.80 |
| బుద్ధవాణి | 0.80 |
| క్రైస్తు సూక్తిమాల | 0.80 |
| మహమ్మదు సూక్తి మంజరి | 0.80 |
| శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము | 1.25 |

ఇవియేకాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును.

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైలచిత్రములు మున్నగున వెన్నియో మా యొద్ద లభింప గలవు.

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600 004

సంవత్సర చందా రూ. 7 జీవిత చందా రూ. 100 విడి సంచిక 70 పై.